అంతర భారతీయ పుస్తకమాల

# సముద్రం - నీటిచుక్క

రచన:

అమృతలాల్ నాగర్

అనువాదం:

పోకూరి శ్రీరాములు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ : 1980 (శక 1901)
ద్వితీయ ముద్రణ : 1990 (శక 1912)



రూ.45.00

*Original Title in Hindi* : Boond Aur Samudra
*by Amritlal Nagar*

*Telugu Translation* : Samudramu-Neetichukka

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లి-110 016 చే ప్రచురింపబడినది.

# పీఠిక

ఇటీవలి నూరూ- నూట పాతిక సంవత్సరాల మధ్య హిందీ నవల చాలా దూరం ప్రయాణం చేసింది. ఈ ప్రయాణం అన్ని రకాలుగా ఎంతో ఆకర్షణీయంగానూ, ఎన్నో ఎగుడు దిగుడులతోనూ కూడుకుని వుంది. ప్రారంభ దశలోని నవలల్లో సాంఘిక దురాచారాల్ని నిర్మూలించే ప్రయత్నం, శౌర్య పరాక్రమాలూ జాతీయ ప్రతిష్ఠలాంటి భావాలను చిత్రీకరించడం జరిగింది. శ్రీనివాస్‌దాస్ "పరీక్షాగురు"; కిశోరీలాల్ గోస్వామిరాసిన 'త్రివేణి' 'స్వర్గీయ్ కుసుమ్', రాధాకృష్ణదాస్ "నిస్సహాయ్ హిందూ" మొదలైన నవలల్లో మనకు ఇటువంటి ప్రవృత్తి దృక్పథమే కనపడతాయి పీటికి సమానాంతరంగా దేవకీ నందన్‌ఖత్రీ మరో జాతి నవలాసాహిత్యాన్ని సృష్టించాడు. ఆయన రచనలు అన్నీ కాల్పనికంగా అతి మానవీయ సంఘటనలతో నిండివుండేవి. ఈ రెండూ కాక హిందీ నవలా సాహిత్యం మరో మూడోపుంత కూడా తొక్కింది. మరాఠీ, బెంగాలీ భాషల నుంచి హిందీలోకి వచ్చిన అనువాద నవలా సాహిత్యం ఈ తరగతికి చెందినట్టిది. ఈ సాహిత్యంనిండా మధ్య యుగంనాటి ప్రేమ ప్రతాప వర్ణనలు చోటు చేసుకున్నాయి. రాజ్‌సింహ్, స్వర్ణలత, స్వర్ణబాయి, యుగలాంగురీయ్, కపాలకుండల మొదలైన రచనల్ని ఈ అనువాద సాహిత్యానికి ప్రతినిధులుగా పేర్కొనవచ్చు.

హిందీ నవలను అద్భుతాలతో నిండిన మర్మహర్మ్యాల చెర నుంచి విడిపించి; ప్రేమ, పరాక్రమాలు పాతుకు పోయిన రాచరికపు వాతావరణం లోంచి బయటికి లాగి భారతీయ రైతుల పొలాల్లోకి, కళ్లాల్లోకి మరల్చి ప్రతిష్ఠించాడు ప్రేమ్‌చంద్. హిందీ నవలకు ఒక సాంఘిక భూమిక అంటూ ప్రేమ్‌చంద్

కల్పించారు. అప్పటి భారతీయ జీవితంలో తిరుగుతుండే సుడుల్ని ప్రతిబింబించే ఒక దస్తావేజుగా నవలని తయారు చేసారు. కేవలం ప్రేమ్‌చంద్ కారణంగానే హిందీ నవలా సాహిత్యానికి ఒక చర్చావేదిక లభించిందనే విషయం నిర్వివాదాంశం.

పాశ్చాత్య సంస్కృతి, నాగరికతలతో మన సంబంధం మరింత దగ్గర పడటంతో మన జీవన పద్ధతిలోని ప్రతి అంచుపై వాటి తాకిడి ఎక్కువ కాసాగింది. పశ్చిమ దేశాల్లో మన స్తత్వ శాస్త్రానికి సంబంధించిన నవలలు వెల్లువలా రచింప బడ్డాయి. వాటి ప్రభావం హిందీ నవలా సాహిత్యంపై కూడా పడక మానలేదు. జైనేంద్ర్, అజ్ఞేయ్ వీళ్ళిద్దరూ మనస్సుకు అంటుకుని వున్న ప్రతి పొరను వెలుపలికి లాగి వాటిని మీమాంస చేయడానికి ప్రయత్నించారు. గాంధీజీ సిద్ధాంతాల్లోంచి ఆత్మవేదనా తత్వాన్నీ, పశ్చిమాన్నుంచి మన స్తత్వ పరిశీలనా పద్ధతిని గ్రహించి ఈ రెండిటినీ తన స్వంత వివేచనా దృష్టితో సమన్వయపరుస్తూ "పరఖ్," "త్యాగ్‌పత్ర" లాంటినవలల్ని జైనేంద్ర్ అందించారు. అజ్ఞేయ్ రాసిన "శేఖర్" ఏక్ జీవనీ"గత స్మృతులని సంఘటనల్ని పునరుచ్ఛరణచేస్తూ రాసిననవల. చిక్కుగా అల్లుకున్న మనోభావాల్ని వివేచనా ప్రకటన పద్ధతిలో చిత్రించడానికి ఇది మచ్చుతునక అయితే మన స్తత్వానికి పూర్తిగా గుర్తింపు యిచ్చిన రచయిత ఇలాచంద్రజోషీ. ఆయన రచనల్లో మానసిక గ్రంథులు వ్యక్తిపై ఏ విధంగా పనిచేసేదీ, అసాధారణమైన మన స్తత్వాలు ఎలా వుండేది వ్యక్తిచరిత్ర నిర్మాణంపై వాటిప్రభావం ఎలాకనపడేదీ మొదలైనవన్నీ కనిపిస్తాయి. 1936లో లక్నోలో అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది. దాని తర్వాత హిందీ సాహిత్యంలో ఒక కొత్తమలుపు వచ్చింది. అభ్యుదయ తత్వం అనే కెరటాలు హిందీ సాహిత్య సాగరంలో ప్రవహించటం మొదలెట్టాయి. అభ్యుదయ పంథాలో నడిచి గెలిచిన నవలా కారుల్లో శ్రేష్ఠుడు యశ్‌పాల్. మార్క్సువాదం నుంచి ప్రేరేపణ పొంది సాంఘిక వైషమ్యాల్నీ, రూఢివాదాన్నీ ఖండిస్తూ యశ్‌పాల్ చాలా నవలలు రాసాడు. ఆయన తర్వాత చెప్పుకో తగినంతగా హిందీ నవలల్లో అభ్యుదయ తత్వాన్ని ప్రవేశ పెట్టిన వాళ్ళలో రాంగేయ్‌రాఘవ్, అమృతరాయ్‌లూ మొదలైన వాళ్లు.

అభ్యుదయ పంథాలో సాగక పోయినా కూడా హిందీలో ఉన్నత శ్రేణికి చెందిన రచనలు ప్రచురించ బడ్డాయి. బృందావన్‌లాల్‌వర్మ వ్రాసిన నవలలు చారిత్రిక కథల్ని ఆధారంగా తీసుకుని మధ్య భారత దేశంలోని మాండలిక వాతావరణంలో అల్లుకుని పోయి చారిత్రక కాల్పని కతకు చక్కని ఉదాహరణ అయ్యాయి. గుజరాతీలో మున్షీగారికి, ధూమకేతుకూ లభించిన గౌరవాన్నే హిందీలో బృందావన్‌లాల్‌వర్మ "విరాటాకీ పద్మినీ" "గఢ్‌కుంభార్", "మృగ్‌నయనీ", "రాణిలక్ష్మీబాయి" మొదలగు నవలలు ఆపాదించి పెట్టాయి. మహా పండిట్ రాహుల్ సాంకృత్యాయన్ మార్క్సు తాత్విక చింతనా పద్ధతిలో "జయ్ యోధేయ్" "సింహసేనాపతి" మొదలైన నవలా రచనలు చేసాడు. ఆయన తన రచనల్లో అలనాటి జీవితాన్ని చారిత్రిక పరిణామ వాద దృష్టితో పరిశీలించ డానికి ప్రయత్నించాడు. భగవతీ చరణ్ వర్మ రాసిన "చిత్రలేఖ" శుద్ధ కాల్పనికతకు ఉదాహరణైతే యశ్‌పాల్ రాసిన "దివ్యా" చారిత్రిక కాల్పనిక దృష్టిని చొప్పించి సాధించిన ఘనకార్యంగా పేర్కొన వచ్చు.

1950 తర్వాత హిందీలో నవలా రచన మరోపుంత తొక్కింది. ఎంతో మంది నవరచయితలు ఆ పుంతలో నడిచారు. నాగార్జున్, ఫణీశ్వర్‌నాథ్ రేణు మాండలిక వాతావరణంలో లభించిన నవలల గురించి ఎక్కువగా వ్యాఖ్యానించటం జరిగింది. ఒక విధంగా చూస్తే 1950 నుంచి 1955 వరకు ఈ మధ్య వ్యవధిలో హిందీ కథా సాహిత్యం మూల ప్రవృత్తే మాండలికంగా మారిందా అనిపిస్తుంది. నాగార్జునుని "బలచ్‌నమా" రేణూ "మైలా అంచల్" నవలల్లో మిథిలా ప్రాంతపు జానపద జీవితాన్ని చాల హృద్యంగా చిత్రీకరించటం జరిగింది. అయితే మాండలీకం అనే ముసుగు ఎక్కువ సంవత్సారాలు వుండలేదు. వాటికకం త్వరగానే ముగింపు కొచ్చింది. మాండలికత్వం పేరిట జీవితంలోని పై పొరల్ని మాత్రమే వింత వింతగా వెలికి తీయడానికి జరిగిన ప్రయత్నాలే దానికి కారణం. ఈ మధ్యాంతర కాలంలో పేర్కొన తగిన మూడు నవలలు వెలుగులోకి వచ్చాయి. అవి యశ్‌పాల్ రాసిన "ఝూఠాసచ్" నరేష్‌మెహతా రాసిన "నహీంపథ్ బంధుథా" అజ్ఞేయ్ రచించిన "అప్నే అజనబీ" ధర్మవీర్

భారతి రాసిన "సూరజ్ కాసాత్ వా ఘోడా" అనే నవల శిల్పం దృష్ట్యా సరి కొత్తగా చేసిన నూతన ప్రయోగం. శిల్ప ప్రదర్శనా రంగంలో అతను చేసిన ఈ ప్రయోగం ఎన్నటికీ మరువలేం. గతించిన ఐదారేళ్ళలో, హిందీ నవలా రచన మరో మలుపు తిరిగింది. ఆధా గావ్. అలగ్ అలగ్ వైతరణీ, రాగ్ దర్బారీ ఈ మూడు రచనల్ని ఎక్కువగా చర్చించడం జరిగింది.

అమృత్‌లాల్ నాగర్ సుప్రసిద్ధ హిందీ నవలా రచయిత. అన్నిటికన్న మించి ఆయనలో ఓ ప్రత్యేకత వుంది. ఉన్నత కోవకు-చెందిన నవలాకారుడు అవడంతో పాటు ఆయనకు మంచి ప్రజాదరణకూడ వుంది. జనవాణి ప్రబలంగా వుండే ఈ రోజుల్లో మంత్రించి మోహపాశాలను పన్నే ప్రచారసాధనాం తాళ్ళలో ఇరుక్కుని కళాత్మకత్వం ఉన్నత శిఖరాలను ఎక్కలేకపోవడం సాధారణంగా జరుగుతోంది. కాని నాగర్ తన కళాదర్శాన్ని మొదటి నుంచి చాలానైపుణ్యంగా మలుచుకున్నాడు. ఆయన నవలా రచనల్లో కళ తన ఉచ్ఛిష్టతను కాపాడుకుంటూ సాధ్యమైనంత ఎక్కువమంది పాఠకుల్ని ఆకట్టుకునే విధంగా ఓ ఒరవడిని ఆయన అలవాటు చేసుకోగలిగారు. రెండు వుద్దేశ్యాలు నెరవేరేలా ఇలాంటి ఒరవడిని అలవాటు చేసుకోవడంలో చాలా ప్రమాదాలున్నాయి. అయినా నాగర్ ఎంతో ధైర్యంచేసి అనేక పర్యాయాలు కృతకృత్యుదయ్యాడు. ఆయన కృతకృత్యుడవడానికి వెనుకదాగివున్న రహస్యం బహుశా ఒకటై వుండొచ్చు. మానవ జీవితంలో కనపడే యదార్థానికి నాగర్ ఎంతో ప్రాధాన్యం ఇస్తాడు. యధార్థాలతో నిండిన మానవ జీవితాన్ని పడుగు పేకగా అల్లుకున్న తీపి చేదు అనుభవాల్ని నాగర్ ఎంతో చక్కగా క్రమపద్ధతిలో అమర్చి వాటిని ఆకర్షవంతంగా నవలలోకి దింపుతాడు. అంటే నాగర్ వున్నది వున్నట్టుగా చిత్రించే వాడని లేక ఆయన నవలా రచనల్ని చుట్టుకున్న కళ కేవలం ఫోటోగ్రాఫిక్ (ఛాయారూపమైనది) కాదు. పాత్రలకు ఓపట్టూ, వారి వ్యక్తిత్వానికో వ్యక్తీకరణ ఇవ్వడంలో నాగర్ అతనికి అతనేసాటి. రాసిన ప్రతి నవల ప్రాణం పోసుకుని చదువరులపై చెరగని ముద్రవేస్తాయి. నాగర్ సృష్టించిన పాత్రలు కేవలం సమకాలీన జీవితంలో నుంచో లేక ఆధునిక జీవి

తంలో నుంచో గ్రహించబడినట్టివి కావు. ఆ పాత్రల్ని చూస్తుంటే ఒక సువిశాల మైన ఓదేశ చరిత్ర తన విశ్వాకారంలో మనకు ప్రత్యక్షం అవుతున్నట్లు తోస్తుంది అటువంటి పాత్రల నుంచి వచ్చిన వ్యక్తే సేఠ్ బాంకీమల్. మధు రంగా మాటల్ని ఒలికిస్తూ పంచదార పాకంలో పలుకుల్ని ముంచెత్తి కథగా చెప్పుకుపోయే అతని వైదగ్ధ్యం ఎవరిని సంతోష పెట్టదు? తమిళ మహా కావ్యంగా ప్రసిద్ధి కాంచిన 'శిలప్పాదికారం' కథని ఆధారంగా తీసుకుని నాగర్ రచించిన "సుహాగ్ కే నూపుర్" లోని 'కోవలన్' పాత్ర "కన్నగి, మాధవీలు" విషాదాంత ప్రేమని పంచుకున్న జీవితాన్ని అద్భుతంగా చిత్రించడంలో సిద్ధ హస్తుడు. ఇంకా చరిత్ర పుటలు వెనక్కి తిరగేస్తూ పోతే "ఏకదా నైమిషా రణ్యే" అనే భావాన్ని స్ఫురింపచేసే యూనివర్సిటీ ఆఫ్ ఫిక్షన్ మనకళ్ళకు కట్టి నట్లు కనబడుతుంది. సోమాహుతి భార్గవ, ఇక్ష్వా, సరయూ, వాసిష్ఠీ చూస్తాము. తమ వ్యక్తిత్వాలు యాజ్ఞిక కాలం నాటి సంస్కృతిలో దేదీప్యమై వున్నప్పటికీ నానామతాలూ, సంప్రదాయాలూ, శాఖలుగా చీలిన భారతీయ సంస్కృతిని సమన్వయ పరిచి దగ్గరగా తీసుకురావడానికి కృషిచేస్తున్నట్టుగా వాళ్ళంతా కనపడతారు. తులసీదాసు జీవితాన్ని "మానస్ కా హంస్" అనే నవల్లో ఓ నూతన పంథాలో పరిశీలించారు నాగర్ "అమృత్ ఔర్ విష్" నాగర్ డబుల్ ప్లాటు (రెండు కథా ఇతివృత్తాలు) శైలిలో నడిపించిన నవల. ఈ రచనలో లక్నోనగర జీవితంలోని విభిన్న వర్గాలవారి నందరినీ సునిశితంగా పరిశీలించి వ్యాఖ్యానించారు. ఆత్మారామ్, రద్దూసింగ్, పుత్తోగురు లక్ష్యం లేకుండా ప్రయాణం చేస్తున్న మన భారతీయ యువతకు ప్రతీక. లచ్చూలాంటి పాత్రలు ఒక పక్కన కనబడి మెరుగులూ తరుగులతో ముడిపడ్డ తమ వ్యక్తిత్వాలతో మనకెంతో పరిచయిస్తులుగా కనపడితే రెండోవైపు వర్గానికి చెందినవారు కావడం మూలంగా నేటి వాతావరణంలో కనిపించే రకరకాల వ్యథలూ, మానసిక సంఘర్షణా, ఓటమీ, నిస్పృహలకు ఆలవాలంగా అయినట్టు కనపడతారు.

నాగర్ రాసిన నవలల్లో "బూంద్ ఔర్ సముందర్" బహుశా అన్నింటి కన్న శ్రేష్ఠమైన రచన. "అమృత్ ఔర్ విష్" నవలకు పారితోషికాలు లభిం

చరం దృష్ట్యా సాహితీ జగత్తులో ఎక్కువగా దానిని చర్చించడం జరిగింది. కాని జీవితంలో ఒకదాని కొకటి విరుద్ధంగా వుండే మలువుల్ని, మానసిక ప్రవృత్తుల్ని చూడడానికి తరచి తరచి చూడడానికి వాటిని నివారించ డానికి "బూంద్ అవుర్ సముందర్"లో రచయిత చేసిన బృహత్తర ప్రయాసలు "అమృత్ అమర్ విష్"లో మనకు కనపడవు.

"బూంద్ అవుర్ సముందర్" రచనని విమర్శకులు క్లాసికల్ నవల అని అన్నారు. ఈ అభిప్రాయంతో చాలా వరకు నేను కూడా ఏకీభవిస్తాను. క్లాసికల్ రచనల్లో వుండే హుందా, ఉదాత్త భావం— ఈ అన్ని హంగులతోను ఇది నిండివుంది. కాని ఒక్క విషయం మనం ఈ సందర్భంలో గమనించాల్సి వుంటుంది. నాగర్ ఏ ఒక్క ఒరవడికి, శైలికి కట్టుబడి రచన చేసుకుంటూ వెళ్లే వ్యక్తికాదు. నిజానికి చూస్తే "బూంద్ అవుర్ సముందర్" నవలలో జీవితం లక్నో చౌక్ వరకే హద్దుల్ని కుంచించుక పోకుండా ఓ పెద్ద వృత్తాన్ని గీసు కుంటూ పోయింది. గోమతీ ఒడ్డున పిచ్చివాళ్ళ చికిత్స కోసం నిర్మించిన ఆశ్రమం, సజ్జన్ వనకన్యల బృందావన్ మధురా నగర యాత్ర, గోవర్ధనగిరి పర్వతంపై వాళ్ళ ప్రేమ విహారం ఆ వృత్తంలో వున్నాయి. ఇన్ని వున్నా నవల ఇతివృత్తాన్ని లక్నో చౌకువరకే పరిమితం చేయాల్సిన అగత్యం నాగర్‌కు ఏర్పడింది. బహుశా ఇలా చేయడానికి రెండు కారణాలు కావచ్చు. లక్నో చౌకు చుట్టూ తిరిగాడే జీవితాన్ని అతను దగ్గరగానూ లోతుగానూ చూసాడు. రెండో కారణం ఇతివృత్తంలో సుసంబద్ధతను కాపాడ డానికి క్యాన్వాసును మరీ విశాలంగా పరచకుండా వుంచడం అవసరం, పౌరజీవితాన్ని పరిశీలించే నిమిత్తం పెద్దమ్మ మేడలో బాడుగకి సజ్జన్‌కు గది యిప్పించడంలో రచయిత ఉద్దేశ్యం ఇదే. ఈ విషయాల్ని నాగర్ స్వయంగా అంగీకరించాడు— "నవల చర్చా పరిధిని లక్నోనూ, దానిలో ప్రత్యేకంగా చౌకునూ ఎన్ను కున్నాను. పౌర జీవనాన్ని, వాళ్ళ నాగరికతనూ, సంప్రదాయాల్ని పరిశీలించ డానికి, రచనకు నుడికారపు సొంపులు తొడగ డానికి అన్ని చోట్లకన్న ఇక్కడే నాకు ఎక్కువగా సౌలభ్యం వుండడం వల్లనే అలా చేసాను". నాగర్ నవల చౌకును

కేంద్రంగా చేసుకుని దాని చుట్టూ తిరిగాడుతూ రంగు రంగులు తొడుక్కున్న అక్కడి జీవితం, దృశ్యాలు, చిన్న చిన్న పాత్రలూ వారి చిత్రమైన మాటలూ, తీరు తెన్నులూ మొదలైన వాటిని చొప్పించి చౌకులో కనబడే స్థానిక జీవనానికి ఎంతగానో వన్నె తెచ్చింది.

వ్యక్తికీ సంఘానికీ మధ్య సంబంధం ఎలాంటిది? అది ఎలా వుండాలి అనేది ఈ నవలలో ముఖ్యమైన చర్చనీయాంశం. నీటి చుక్క వ్యక్తికి ప్రతీక అయితే సముద్రం సంఘానికి ప్రతీక. వ్యక్తినీ సంఘాన్నీ కలిపే త్రాడు తెగి పోయింది. ఫలితంగా సంఘం వ్యక్తికి ఓ గుంపుగా తయారైంది. ఇక వ్యక్తి సంఘం దృష్టిలో ఓ వింత వస్తువుగా మారి అతణ్ణి గ్రహించడానికీ గుర్తించ డానికి సంఘం సిద్ధంగా లేనట్టు తయారయ్యాడు. వ్యక్తికీ సంఘానికీ మధ్య అగాధం ఏర్పడటం వల్ల ఇద్దరి మధ్యా ఈ అభిప్రాయ భేదం పొడసూపింది అసలీ అగాధం ఏర్పడ్డానికి మూలకారణం ఇద్దరిలోనూ ఒకరిని గురించి మరొ కరికి నమ్మకం నశించడం. నీటిచుక్కలు పెద్దవి కానీయండి చిన్నవి కానీయండి సత్యం పట్ల వాటన్నిటికి చిత్తశుద్ధి, శ్రద్ధాసక్తులు వుంటే వాటి మధ్య సామర స్యాన్ని సాధించవచ్చంటాడు నాగర్. మహాసముద్రంతో పోల్చబడిన సంఘంలో మానవత్వం చొచ్చుకొని వెళ్ళడానికి వీల్లేని వస్తువుగా ఎంచబడే సమాజంలో ఇలాంటి సంసారాలు వుండడం ఎలా సాధ్యం? ఆదర్శం అనేదానికి ప్రాధా న్యం వుండే పక్షంలో దాని విలువ కూడా సరిసమానంగా వుండాలి. నీటిచుక్క చిన్నదే కానీ పెద్దదికానీ ఎంతో చిన్నది కాని- ఈ చిన్నతనం అనేది పెద్దతనం అనేదీ నైతికంగా విలువ కట్టడానికి ఉపయోగించే కొలత బద్ధముందు అప్రాసం గికం. అతను చూసేదంతా ఆ నీటి చుక్కల్లోనూ, ప్రతి అణువులోనూ సత్యం కోసం తపన, నిష్ఠ ఎంతవుందని మాత్రమే ఆ నిన్ను ప్రతి అణువూ తన క్రియాశక్తి ద్వారా ఎంతవరకు వికసింపజేసి కొంగ్రొత్త ఆదర్శాన్ని ముందుం చడానికి సామర్థ్యం కలిగి వుందనేదే కావలసిన ముఖ్యవిషయం.

సత్యం పట్ల శ్రద్ధాభక్తి కారణంగానే నవల్లోని మూడు పాత్రలు–సజ్జన్, మహిపాల్, కర్నల్-వనకన్య వదన గారిపై ఆమె తండ్రి జరిపిన దుర్మార్గాన్ని

దండించడానికి వనకన్యకు చేయూత నిస్తారు. వనకన్య విచిత్రమైన పాత్ర. ఆమెలో ఆధునిక కాలంనాటి స్త్రీత్వం మూర్తీభవించివుంది. నిజం పేరిట స్త్రీలపై జరిగే దురన్యాయాల్ని ఖండించడానికి వాటిని నివారించడానికి తన స్వంత తండ్రి పైనే ఎలాటి చర్య తీసుకోవడానికైనా ఏ మాత్రం వెనుకాడదు. వనకన్య పేరు వినగానే పట్నవాసానికి భిన్నమైన వాసనలు ఆమెలో ఉన్నట్లుస్ఫురిస్తుంది. నిజంగానే మన పట్టణజీవితంలోనూ, నగర జీవితంలోనూ, వ్యాపించివుండే పచ్చి మోసం టక్కరితనం, అబద్ధం, దగా, కుట్ర, ముఠాతత్వం, నీచత్వం, పైకి కప్పుకున్న ఆడంబరాల్ని, డంబాల్ని చీల్చి చెండాడుతూ ఏదో రూపేణా ఈ ముగ్గురి పాత్రలు తమ తమ కుటుసాల్ని వదలి పెట్టేంతగా ఆమె బలవంతం చేస్తుంది. యావజ్జీవనం సత్యానికీ, నిష్ఠకూ అంకితమై పోయిన నడవడికి, బలం చేత అజ్ఞానంలోంచి పుట్టుకొచ్చిన ద్వేషం, వేర్పాటు భావన, ఒదిగి ఒదిగి వుండే తత్వాల్ని జయించి తన సహచర్యంలోకి వచ్చిన ప్రతి వ్యక్తికీ అంగీకార యోగ్యంగానూ, ఆత్మీయురాలుగాను మారుతుంది. స్వచ్ఛమైన మణికాంతుల్ని వెదజల్లే ఆమె చరిత్ర చూడగానే అసలు ఇలాంటి పాత్ర ఎక్కడైనా వుంటుందా అన్న ధర్మ సందేహం కలుగుతుంది. యధార్థం అనే నేలపై కాలూనడానికి అవసరమైనంత మేరకు నాగర్ సహజత్వాన్ని ఖాతరు చేస్తారు. లేని పక్షంలో సందిగ్ధంగా వున్న దానిని సహజమైనదిగా చేయడానికి ఏ మాత్రం సంకోచించదు.

వనకన్య పూర్తిగా విరుద్ధమైన పాత్ర. పెద్దమ్మ, వనకన్య ఆధునిక స్త్రీ, ఏది సత్యం ఏది అసత్యం అని తేల్చగల విచక్షణా శక్తి ఆమెలో వుంది. తాను నిర్ణయించుకున్న మార్గాన్ని ఏమాత్రం చలించకుండా అంటిపెట్టుకో గలదు. సంఘం ఆమె మీద ఎన్ని కత్తులు దూసినా వాటన్నిటిని సహించి సంఘాన్నే సుసంఘటితం చేయడానికి ప్రయత్నిస్తుంది. దుర్మార్గాన్ని ప్రతి ఘటించే సమయంలో ఆమెలో వున్న జాలి అంతా కరడు గట్టుక పోతుంది. ఇక పెద్దమ్మ పాత్ర ఈమెకు పూర్తిగా విరుద్ధం భర్త తనని ఉపేక్షించాడనే కక్షతో అతని వంశాన్ని కూకటి వ్రేళ్ళతో సహా పెకిలించడానికి ఎన్నో మంత్రాలూ తంత్రాలు చేస్తుంది. మంత్రబలంతో తన ప్రతి విరోధిని భస్మీపటలం చెయ్య

లన్నది ఆమె ఉబలాటం. మారిన కాలాన్ని చూసి ఆమె బెదురుతుంది. ఆధునికత్వం పట్ల ఆమెకు పెద్ద విరోధం, పిల్లి కూనల పట్ల ఆమె జాలి చూపించకలదేమో కాని తోటి మానవుణ్ణి క్షమించడం ఆమె నేర్చుకోలేదు. ఆమెలో మంచి గుణాలు వున్నాయి. దోషాలూ వున్నాయి. ఒకదాని కొకటి పొందిక లేకుండా పరస్పర విరుద్ధంగా వుండే లక్షణాల పుట్ట కావడం మూలాన ఓ పాత్రలా కాక ప్రతీకగా తయారైంది. ఆమెను గూర్చి ఎవరిని వనకన్య ప్రశ్నిస్తే "ఈమెగారు భారత మాత" అంటూ పరిచయం చేస్తాడు సజ్జన్, పెద్దమ్మ ఈ నవలకంతా కీలక పాత్ర. రాజాసాహెబుకు అర్ధాంగి. ఉన్నత వంశాల్లో కనపడే లోటుపాట్లూ, పైటాబులూ, ముస్తాబులూ ఒక వైపు ఆమెలో ఇమిడివుంటే, రెండో వైపు తన మేడలో అద్దె కుండే సజ్జన్ అతని మిత్ర బృందం. వర్ణాంతర వివాహం చేసుకున్న వర్మ దంపతులతోనూ ఆమె మామూలు వారిలా పరిచయం కూడా కలిగి వుంది. చిల్లంగి పెట్టడం, చేతబడి మొదలైన తంత్రాల్ని నందోకు నేర్పే సందర్భంలో పొరుగులో వుండే భభూతి సునారే ఇంట్లో వీచే సినిమా గాలితోనూ గతపరాటి సతీత్వాన్ని పోగొట్టుకొని సంమంచే వెలివేయబడ్డ పెద్ద కోడలిపై సినిమా సాధించిన ప్రభావంతోనూ ఆమెకు సంబంధంవుంది. ఒక వైపు ఇరుగు పొరుగున వుండే ఆకతాయి కుర్రాళ్ళు ఆటలు పట్టించడానికి సాధనంగా తయారైతే మరోవైపు గోకుల ద్వారా రూపంలో సఖీ సంప్రదాయానికి చెందిన ముఖియాటీ, జల్ మడియాటీ, ఛతరియాటీ, మోతినియాటీలతోనూ, దేవాలయం రాజకీయాలతోనూ అత్యంత రహస్యమైన విషయంలోనూ పెద్దమ్మకు ప్రమేయం వుంది. రాజకీయాల్ని పురస్కరించుకుని జరిగే ప్రచారాలూ, ప్రదర్శనలూ, ముఠా తత్వంతోనూ ఆమెకు అకస్మాత్తుగా ప్రమేయం యేర్పడుతుంది. చివరకు తన మనస్సులోని కోరిక నెరవేర్చుకోవడానికి రాధా కృష్ణుల వివాహం చెయ్యాలనే నెపంతో పిచ్చివాళ్ళ ఆశ్రమాధిపతి అయిన బాబారామ్‌కు వియ్యపురాలిగా తయారవు తుంది. పెద్దమ్మ పాత్రను అడుగడుగునా సునిశితంగానూ, సూక్ష్మంగానూ, కొట్టొచ్చిన రంగుల్లో నాగర్ చిత్రించినట్టుగా మరెక్కడా కనబడదు.

సజ్జన్, కర్నల్, మహిపాల్ చదువుకున్న వర్గానికి ప్రతినిధి పాత్రలు. అయినా వీరిని నాగర్ మూసపోసినట్టు ఒకేరీతిగా చిత్రించలేదు సజ్జన్

నగరంలో కెల్లా పేరు ప్రఖ్యాతులుగల చిత్రకారుడు అయినా మనముందు కేవలం శారీరిక సౌఖ్యాన్ని అనుభవించే కాముక పురుషునిగానూ డాక్టర్ శీలా దృష్టిలో మధుర పరిహాసానికి పనికి వచ్చే దుర్జనుడిగాను సాక్షాత్కరిస్తాడు. వనకన్య కళ్ళకు సజ్జన్ దారం తెగి దారితప్పి తిరుగుతోన్న గాలిపటం. మెల్లిగా అతని ముక్కుకు తాడేసి ప్రేమ అనే ఒడిలో అతణ్ణి బుజ్జగిస్తుంది వనకన్య. ఆమె మచ్చికకు సజ్జన్ ఎంతగా మారిపోతాడంటే తనకున్న యావత్తు ఆస్తినీ సహకార బ్యాంకికి అప్పగించి బాబారామ్ చూపించిన ప్రజాహిత కార్యక్రమాంకై ధారాదత్తం చేసాడు.

కర్నల్‌ది, వున్నది వున్నట్టుగా కుండబద్దలు కొట్టి మాట్లాడే స్వభావం. స్నేహం అనే మార్గంలో వచ్చే అడ్డంకిని తప్పించడంలో ఎంతో నేర్పరి. సజ్జన్‌నీ మహిపాల్‌నీ కలిపే వంతెన. ఇద్దరి వ్యక్తిత్వాల్లో వుండే బలహీనతల్ని ఉదారంగా ఉపేక్షించి వాళ్ళు చేసే ప్రతి పనికి చేదోడుగా వుండడానికి సిద్ధంగా వుంటాడు. సజ్జన్ మహిపాల్ మేధావి వర్గానికి చెందిన వాళ్ళే అయినా లౌకిక జ్ఞానం అవసరం అయ్యే వ్యవహారాల్లో కర్నల్ వాళ్ళిద్దరికి కేవలం సహచరుడే కాదు వాళ్ళకు దారిచూపే గురువు కూడా. సజ్జన్‌కి వనకన్యకు మధ్య మహిపాల్, శీలాస్వింగ్, కళ్యాణి ఈ ముగ్గురుని సతమతం చేసిన ముక్కోణపు సంఘర్షణను తొలగించి చిక్కుల్ని అతిసమర్థవంతంగా విడదీస్తాడు, అహంకారంతో నిండుకున్న మహిపాల్. సాంఘిక అసమానత్వానికి గురిఅయి చరిత్ర హీనుడౌతాడు. పరిస్థితులు ఎదురు దెబ్బతీసే సరికి తట్టుకోలేక అవమానభారంతో కృంగిపోయి ఆత్మ హత్య చేసు కుంటాడు. అతని స్నేహితుడైన కర్నల్ తన కున్న యావత్తు శక్తితో మిత్రుడు ఒదిలి వెళ్ళిన బాధ్యతల్ని తనపైన వేసుకుని పూర్తిచేస్తాడు. అయితే వనకన్య, సజ్జన్‌లు ఇద్దరూ అతనితో చివరి వరకూ సహకరిస్తారు.

"సముద్రం- నీటి చుక్క" లాంటి విశాల క్యాన్వాసు మీద పరచిన మూల కథలో ఉపాఖ్యానాల్లా ఎన్నో చిన్నచిన్న కథా దృశ్యాలు మనకు గోచరిస్తాయి. కథా గమనం వెతికే పాఠకునికి ఇవన్నీ అనవసరంగానూ, అప్రాసంగికంగానూ కనపడొచ్చు. అసలు నాగర్ శైలిలో ఇదొక విడదీయలేని లక్షణం

ఆయన గుచ్చిన ఏ ముత్యం పేరులోనైనా కొన్ని తాళ్ళు తప్పని సరిగా ఒదులు ఒదులుగా వుంటాయి.

క్లుప్తంగా పై పంక్తులలో ఇచ్చిన సారాన్ని బట్టి ఒక విషయం నిష్కర్షగా తెలుతుంది. నాగర్ చిత్రించ దానికి తీసుకున్న యితివృత్తం విశాలమైంది. ప్రేమ్‌చంద్ "రంగభూమి" నవలా కృతి తర్వాత యింత విశాలమైన తెరను మరే రచయితా ఎన్నుకో లేదని విమర్శకులు అన్నారంటే అది సమంజసమే అవుతుంది. అయితే ఓ చిన్న సందేహం. క్యాన్వాసు పెద్దదిగా ఎన్ను కున్నంత మాత్రాన నవల ఆకారం అంతగా పెరుగుతుందా మరి? క్యాన్వాసు విశాలంగా వుండడం వల్ల జీవితంలోని వైవిధ్యాన్ని చిత్రించడం వీలవుతుందేమో కాని లోతుల్ని తేవడం దానికి సాధ్యంకాదు. దానిక్కావలసింది చిన్నా పెద్ద పాత్రల్ని ప్రామాణికంగానూ ప్రాణం పోసు కున్నవిగాను చిత్రించడం. "సముద్రం-సీటి చుక్క" లోని పాత్రలు చాలవరకు ఎంతో ప్రామాణికంగానూ సజీవం గానూ కనపడతాయి. సజ్జన్ పాత్ర గురించి ఓ ఆక్షేపణ చేయొచ్చు. అతని స్వభావంలో ప్రారంభంలో వున్న ముందుకు దూసుక పోయే తత్వం రచన చివరి భాగంలో కనపడదు, సేవా నిరతనీ, ఆదర్శాన్నీ ఆలంబనంగా చేసుకున్న బాబారామ్ వ్యక్తిత్వం ముందు, అతను మెత్తబడి ఏమి చేయలేని వానిలా నిర్వీర్యుడైనట్లు కనపడతాడు, అతని చరిత్రలో ఈ మార్పును చిత్రించడానికి వెనుక రచయితకో వ్యూహం వున్నట్లు అనిపిస్తుంది. వనకన్య, బాబారామ్-వీరిద్దరి మధ్యకు సజ్జన్‌ని తోసి అతని చరిత్ర ఎలా మార్పులు తొడుగుక్కుంటూ పోయిందీ అనాలోచింతగానో ఉద్దేశ పూర్వకంగానో చూపించడం బహుశా రచయిత అభిమతం అయివుండొచ్చు. ఈ సందర్భంలో మరో ప్రశ్న కూడ ఉదయించ డానికి అవకాశం వుంది. బాబారామ్ ప్రతిపాదించే ఆదర్శాలూ, చరిత్రా నాగర్ తననవలా రచనకు ప్రాతిపదికగాదృష్టి కోణంగాగ్రహించాడా? నాగర్‌ని వాస్తవిక నవలా కారుల పంక్తిలో తరుచు కూచో పెడుతుంటారు. కాని ఆయన రచనలకు ఓ ప్రత్యేకత వుంది ఆ రచనలు ఎంత సహజంగా వున్నా వాటిలో ఏ ఒక్క రాజకీయ సిద్ధాంతంపట్ల మోజు వున్నట్లు గానీ, ప్రతి

పాదించటానికి ప్రయత్నాలు జరిగినట్లుగానీ కానరాదు. సంఘంలోపలే నాగర్ మార్పురావాలని కాంక్షిస్తాడు. కుళ్ళు, దుర్గంధం, అనాచార, క్రియాశూన్యత నుంచి సంఘాన్ని బయటికిలాగి ఆరోగ్యవంతంగా అది పెరుగుదల పొందాలని ఆయన కోరిక అయితే దానికి ఆయన దగ్గర తయారుగావున్న యే సమాధానం కాని నియమిత సూత్రం గాని లేదు. కొత్తతరం నవలా కారుల కోవకు చెందిన వారేమో రచయిత కార్యత కేవలం సంఘజీవితాన్ని యథాతథంగా చూపించి సాక్ష్యాన్ని పోగుచేసి హాజరు పరచడంతోటే తీరిపోతుందనుకొని సంతోష పడరు. ఏదోరకంగా పరిష్కారాన్ని ప్రతిపాదిస్తారు నాగర్. ఉదాహరణకు ఈ నవలలో బాబారామ్ ప్రేరేపణతో మొదలెట్టిన "కుటీర పరిశ్రమల్ని అభి వృద్ధి చేయడం ద్వారా మగవాళ్ళను వడ్డీవ్యాపరస్తుల కబంధ హస్తాల నుంచీ, నమ్మక ద్రోహం నుంచీ కాపాడాలని అనుకున్నారంటే స్త్రీలను కూడా మహిళా శ్రమల్లాంటి దొంగ సంస్థల బారినుంచి కాపాడి వాళ్ళనైతిక స్థాయిని పెంచి వాళ్ల ఆర్థిక వ్యవస్థకోసం పాటుపడాలి. అప్పుడే మనం మన కార్యం సాధిం చిన వాళ్ళం అవుతాం రాంజీ" అని బాబారామ్ చేత అనిపిస్తారు.

అమృతలాల్ నాగర్ "సముద్రం- నీటి చుక్క" నవలలో ప్రతి రోజు వ్యక్తికీ సంఘానికీ మధ్య రేకెత్తే సంఘర్షణల్ని చాలా సజీవంగానూ విశాలంగానూ చిత్రించాడు. వాస్తవిక దృష్టి సంఘటనల్ని దృశ్యాత్మకంగా చిత్రించడం, ఒక్కొక్క పాత్రనూ ఎంతో హేతుబద్ధంగానూ, ప్రామాణికంగానూ ప్రవేశపెట్టే నేర్పరితనం- ఈ గుణాలన్నీ "సముద్రం- నీటి చుక్క" అనే ఈ నవలలో కనబడుతున్న కారణంగా దీన్ని హిందీ నవలా సాహిత్యానికి ప్రతి నిధిగా పేర్కొనవచ్చును.

—డాక్టర్ శివప్రసాద్ సింగ్

# 1

శీతాకాలం మధ్యాహ్నపు ఎండ ఇళ్ళకప్పులమీద తిష్ఠవేసి దర్బారులా పరచుకొని వ్యాపిస్తోంది. ఒకచోట కొంతమంది ఆడవాళ్ళు కూర్చుని లేసులు అల్లుకుంటున్నారు. కొందరు బట్టలు కుట్టుకుంటున్నారు. మరోచోట కొంత మంది గోధుమల్ని చెరుగుతున్నారు. మరికొంతమంది పప్పుదినుసుల్లో మట్టి బెడ్డలు ఏరుతోంటే ఇంకొంతమంది ఆకుకూరల కాడల్ని తుంచుకుంటూ మంచి వాటిని పోగుచేస్తున్నారు. ఏపనీలేనివాళ్ళు తీరిగ్గా విశ్రాంతి తీసుకుంటున్నారు. స్కూళ్ళకు వెళ్ళని పిల్లలు చేసే అల్లరి యింతా అంతాకాదు. ఒకటేగొడవ. అల్లరిగా గాలిపటాలు ఎగరేస్తున్నారు. శిరోధార్యంచేసే సంపాదనాపరుడైన కుమారునిలా, ఎండా వానలకు చలికి రక్షణ కల్పిస్తూ, కడుపులో చల్లకదలకుండా కాలంగడపడానికి వీలుగా వుంది ఇల్లు. ఆ ఇంటిని పొగడుకుంటూ పైనకప్పుకున్న ఉన్ని మునుగును పక్కకులాగి చేతుల్తో మోకాళ్ళు పట్టుకున్నాడు ఎక్కడో సర్వీసు నుండి రిటైరు అయిపోయి పెన్షనురాళ్ళు తింటోన్న ఓ పెద్దమనిషి. ఆలస్యంగా భోజనం చేసే యిళ్ళల్లో 'హర్‌గంగే' అంటూ చెంబుల్తో తలలపై నీళ్ళు కుమ్మరించుకొని ఇంకా స్నానం చేస్తూనేవున్నారు కొంతమంది. లోకంలో కనిపించే ఆర్భాటం, ఆరాటం, ఆందోళన, ఆనందం, కంగారు, హడావుడి అన్ని సప్తస్వరాలు ఒక్కసారి మీటినట్టుగా ఒకదానితో ఒకటి కలిసి ప్రతిధ్వనిస్తాయి. అణువు అణువూ అల్లుకుని నలువైపులా వ్యాపిస్తోంది.

లక్నోనగరంలో ఒకవీధి. ఆవీధిలో భభూతీ సునార్ అనే వ్యక్తి యిల్లు. నడివయస్సులో వున్న అతని ఇద్దరు కోడళ్లూ పిట్టగోడ మీద వంగి పక్క యింట్లో కాపురం వుంటోన్న తారతో మాట్లాడుతున్నారు. పిట్టగోడకు ప్రక్కనే క్రిందవున్న దేవదారు పెట్టెల దొంతర మీద తార కూర్చుంది. అలా కూర్చుంటే ఇంచుమించు పిట్టగోడ పైభాగానికి సమంగా వచ్చింది ఆమె. చంటాడికి స్వెట్టరు అల్లుతూ మధ్యలో సూదిని బయటకులాగి ఒకసారి అల్లిక సరిగా వచ్చిందో లేదో అని చూసుకుంది. ఆ తర్వాత కనుబొమ్మలు చిట్లిస్తూ "మీరేమీ అనుకో

కండి. మాటి మాటికి తార అని పేరుపెట్టి నన్ను పిలవకండి. మా వారు ఒక్కరే ఆ పేరుతో పిలుస్తుంటేనే నాకు ఎంతో సరదాగా వుంటుంది.''

పెద్దకోడలు చెవులకు పెట్టుకున్న రాళ్లకమ్మలమీద ఎండపడుతోంది. తల విదిలించి ఒకసారి తిప్పగానే కమ్మలోని రాళ్లు జిగేల్‌మని మెరిశాయి. తెల్లని చెంపమీద ఒయ్యారంగా అరచేతిని వుంచుతూ 'ఐతే తమరిని మరేమని పిలవాలో చెప్తారా?' అని అంది.

''మిసెస్ వర్మ అని పిలువు. మేం కూడా నిన్ను అలాగే పిలుస్తాం, ఇకనుంచి.''

చిన్నకోడలు కింది పెదవిమీద వున్న పుట్టుమచ్చ ఆమె పెదవి విరుపుకు మరతలు పడింది. ముక్కుపుటాలు ఎగరవేస్తుంటే బేసరిలో పొదిగివున్న రాయి తళతళలాడింది. దర్పాన్ని ప్రకటిస్తోన్నట్లుగా కనబొమ్మలు పైకిలేచాయి. హొయలుకు తగ్గట్టుగా మెడ వంపులు తిప్పుతూ—''అంటే మమ్మల్ని మిసెస్ సునార్ అని పిలుస్తావన్నమాట. మేం పేరుపెట్టి పిలవంలే. మమ్మల్ని అలా పిలువకు, నాకు నచ్చదు'' అంది.

''ఇందులో తప్పేముంది. ఎవరు ఏజాతివారైతే వారిని ఆ జాతిపేరు పెట్టి పిలుస్తారు. మనమేం హీనమైన జాతివాళ్లమా ఏం? వైశ్యులము కదా''.

తార ఇంటర్మీడియట్ వరకు చదువుకుంది. వర్ణాంతర వివాహం చేసుకుంది, ఆమెది ప్రేమపెళ్లి. భర్తతో కలిసి హజరత్‌గంజ్, క్వాలిటి, నిక్సర్‌స్నో రెస్టారెంట్, కాఫీహౌస్ మొదలైన సెంటర్స్‌కు వెళుతూ కొత్త ప్రపంచాన్ని చూసింది. తనకంటే తక్కువ చదువుకున్నవారూ, తిరగడానికి అంత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేనివారూ అయిన భభూతీ సునార్ ఇద్దరి కోడళ్లవైపు చూస్తూ, అభిమానాన్ని దర్పంతో జోడించి.—''అదికాదు చెల్లీ, ఈ రోజుల్లో కులం గిలం ఎవరూ పట్టించుకునేది. మావరకు మాకు కులం మతం ఇవంటే బొత్తిగా గిట్టదు'' అని అంది.

పెద్దకోడలు దృష్టిలో తార హీరోయిన్. అందువల్ల గర్వాన్ని చిందించే ఆమె మాటలకు పొంగిపోతూ పెద్దకోడలు ''నీకు పట్టడం గిట్టడం ఏమిటిలే.

నీవైతే మీ వారితో జంకూ గొంకూ లేకుండా తిరిగినదానివి" అని అభినందించింది తారను.

ఆమె మాటలకు తార నవ్వింది. ఇద్దరు కోడళ్లూ ప్రతిగా చిరునవ్వు నవ్వారు. చిన్నకోడలు దృష్టిలో కూడ తార హీరోయినే. ఆ మాటకువస్తే తారకు తన దృష్టిలో తానే ఒక హీరోయిన్.

చామనఛాయ రంగులో తీర్చిదిద్దినట్లున్న తార దేహసౌష్టవాన్ని మత్తు నింపుకున్న కళ్లతో చూస్తోంది పెద్దకోడలు. మనసులోని కోరికనీ, పైన తుళ్లే శృంగారపు చేష్టల్ని ఈ రెంటినీ కంఠంలోని చిలిపితనంతో రంగరించుకుంటూ పెద్దకోడలు గతంలో దాగిన రహస్యాన్ని బైటపెట్టింది—"ఏమైనా అనవోయ్ ప్రేమపెళ్లిలో వుండే మజాయే వేరు. ఆ ముచ్చటలే వేరు ఎనిమిదోక్లాసు చదువుతున్న రోజుల్లో నేనుకూడా ఓ అబ్బాయిని ప్రేమించాననుకో...."

గతం జ్ఞప్తికి రాగానే పెద్దకోడలు శరీరమంతా ఒక్కసారి ఆనందంతో జలదరించింది. సిగ్గు ముంచెత్తుతున్న ఆమె కళ్లు పరిసరాల్ని మరచిపోయి గతంలోకి చూశాయి. "అయ్యో బాబోయ్!" అన్నట్లుగా చిన్నకోడలు ముఖకవళికమారింది. ఆశ్చర్యంతో విడిపోతోన్న పెదవుల్ని గోళ్లకు రంగు వేసుకున్న ఆమె కుడిచేతి రెండు మధ్య వ్రేళ్లూ కిటికీలాగ అడ్డుపెట్టినయ్. ఫస్టుక్లాసులో ప్యాసైన విద్యార్థినిని అభినందిస్తూ నవ్వుతోన్న ఉపాధ్యాయినిలా పెద్దకోడలు చిన్నావిద ఆశ్చర్యాన్ని గమనిస్తూ చిన్నగా నవ్వింది.

ఇంతలో కింద చిన్న మంచం మీద నిద్రపోతోన్న పెద్దకోడలు మూడు నెలల చంటిపిల్ల ఏడుపు లంకించుకుంది. ఆమె నాలుగేళ్ల కొడుకు మెట్లకింద జ్వరప్రకోపంలో ఒళ్లెరక్కుండా నిద్రపోతున్నాడు. అతనికి దగ్గరగా సన్నికల్లులో హింగాష్టక చూర్ణాన్ని నూరుతోన్న అత్తగారు "పిల్ల ఏడుస్తుందే" అని కేకేసింది.

అత్తగారు వేసిన కేక అక్కడ మాటల్లో మునిగివున్న ముగ్గురికి వినిపించలేదు.

"అయితే నీ ప్రియుడు ఎలావుండేవాడు" అని అడిగింది తార పెద్ద కోడల్ని.

చంటిపాప కాళ్లూచేతులూ కొట్టుకుంటూ గుక్కపట్టి ఏడవటం ప్రారంభించింది. దాని నాయనమ్మ చూర్ణం మారడంలో ఈ ప్రపంచాన్ని మరచి పోయింది ముసలావిడ కూతురు నందో లోపలినించి వచ్చింది. నఖశిఖపర్యంతం కోరా చుట్టుకొన్న విగ్రహం ఆమెది. నోటిలోనూ చేతిలోను తాంబూలంవుంది. చలిలో వణుకుతూ పైకి వచ్చింది. ఆమె ఓ నిమిషం తల్లి దగ్గిర చూస్తూ నిలబడి "పెద్దమ్మ ఇంటికి ఓమారు వెళ్లొస్తానమ్మా" అంటూ నందో అక్కడ నుంచి కదిలింది.

"అలాగే, పోతూ పోతూ అక్కడ పెద్దకోడల్ని యిలాపంపు. పిల్ల ముండ ఎప్పటినుంచో ఏడుస్తోంది అదేమో కబుర్లలో పడి యీ ప్రపంచం మాటే మరచి పోయినట్లుంది" అంది.

నందో వయస్సు ఇరవైఏడు సంవత్సరాలే అయినా ఈ ప్రాపంచిక విషయాలంటే విరక్తితో వున్నట్టు కనబడుతుంది. ఈ కాలం కుర్రకారన్నా, తన యీడు వారన్నా, ఇల్లే స్వర్గంగా తలచి ఇల్లాలుగా మునిపోయే ముత్తైదువ న్నా ఈసడిస్తుంది. ఎత్తుకునే వయసు పిల్లలంటే ఆమెకు విపరీతమైన చిరాకు. వ్రతాలన్నా, ఆచారాలన్నా, వుపవాసాలన్నా పడి చస్తుంది. శరీరంతోపాటు స్వభావాన్ని కూడా కఠినం చేసుకుంది. ధర్మచింతన ఎక్కువ. రాత్రింబవళ్లు ఇతరుల్ని ఆడిపోసుకునే వాళ్ల పంచచేరి, వారి స్నేహాన్ని సంపాదించుకొని, వరాన్ని గూడా తద్వారానే ఆర్జించాలంటుంది నందో.

పెద్దమ్మ యింటికి వెళ్లడానికి నందో పైకి వచ్చింది. తారతో మాటల్లో మునిగివున్న ఇద్దరు వదినలూ కనిపించారు. చడీచప్పుడు లేకుండా మెల్లగా వచ్చి పొంచి చూస్తోన్న పిల్లిలా నందో వారిని సమీపించింది. చెవులు నిక్కబెట్టుకుని అలాగే నిలబడింది.

లోకుల్ని ఆడిపోసుకోవడానికి తనకు కావలసినంత సరంజామా దొరుకుతోన్న తరుణంలో వాళ్లమ్మ మరోసారి పెద్దకోడల్ని కేకేసింది.

కోదళ్ళిద్దరూ వెనక్కు తిరిగి చూశారు. ఎదురుగా ఆడబిడ్డ నందో తత్తరపాటులో నిలబడివుంది. నందో అక్కడ నిలబడడం చూసి వాళ్లు క్షణం నిశ్చేష్టులయ్యారు. నందో సంభాళించుకొని పెద్దమ్మ యింటికి వెళ్లడానికి పిట్టగోడ ఎక్కేందుకు గాను అక్కడ నుండి నిష్క్రమించింది.

# 2

పెద్దమ్మ అంటే రాజబహద్దరు సర్ ద్వారకాదాసు అగ్రవాల్‌గారి మొదటి భార్య అన్నమాట. లక్నోలోని శ్రీమంతులందరిలోను పేరుమోసిన వ్యక్తి రాజబహద్దరుగారు. తెల్లదొరలు మన దేశాన్ని పాలించే రోజుల్లో డిప్యూటీ కమీషనరు నుండి ప్రధాన కార్యదర్శి, హోంశాఖ మెంబరు వరకు, సంయుక్త రాష్ట్రాల గవర్నరుగారి నుండి వైస్రాయిగారి వరకు ఆయన్ని ఎరుగని వారేలేరు, గౌరవించని వారూలేరు. స్వరాజ్యం వచ్చిన తర్వాత భారతదేశ రాష్ట్రపతిగారికి, ప్రధానమంత్రిగారికి బహద్దరు గారంటే తెలియక పోయినా వారి ప్రభావం తగ్గలేదు, మార్పులేదు. ఈనాటికి కూడా న్యూఢిల్లీలో వుండే పెద్దపెద్ద హోదాల్లో వున్న అధికారులూ, ఉత్తర ప్రదేశ్‌లోని సీనియర్ మంత్రివర్యులంతా ఆయన్ను రాజాసాహెబు అనే పిలుస్తుంటారు. వ్యక్తిగతంగా ఆయనకు గవర్నమెంటు వారితో కావలసిన వ్యవహారలన్నీ శాసననియమాలనే మెట్లు ఎక్కరావలసిన అవసరం లేకుండా ఆశ్రితపక్షపాతం అనే కరెంటు లిఫ్టు ద్వారా చకచక పైకి నడచి వెళ్లి పూర్తి అవుతాయి ఇక రాజబహద్దరుగారి దానశీలత, ధర్మనిరతి గురించి పెద్దపెద్ద మఠాధార్యులే తామ్రపత్రాలిచ్చారు. ప్రతి సంవత్సరం ఆనూచానంగా వారు బైరాగులూ, సాధుపుంగవుల సభను ఏర్పాటు చేస్తుంటారు. లక్షల రూపాయలు ఖర్చుచేసి బహద్దరుగారు లక్ష్మీనారాయణ దేవాలయాన్ని నిర్మించారు. అయితే అది వారి పేరుతోగాక ఈనాటికీ అగ్రవాల్ దేవాలయం అనే పేరుతోనే పిలువబడుతోంది. ఆయన కట్టించిన లక్కీ చబూతరాపై ఎప్పుడూ అఖండజ్యోతి తన ప్రభల్ని విరజిమ్ముతుంటుంది. దానినుండి ఏర్పడే మసి నలుపు వర్ణంగా వుండక పసుపు రంగులో

వుంటుందని చెపుతారు. అట్టి కీర్తి ప్రతిష్ఠలు కలిగివున్న బహద్దరుగారి సతీమణి పెద్దమ్మ గారంటే. ఊళ్లోవారందరికి ఆవిడ అంటే గిట్టదు. అందరి అసహ్యాన్ని అగౌరవాన్ని ఈ విధంగా పెద్దమ్మ పంచుకుంటూండడం చూసిన కొందరు ఇదంతా ఖర్మ అంటూ కర్మవాదాన్ని ప్రచారం చేస్తూవుంటారు.

పెద్దమ్మ ద్వారకాదాసు ఇంట్లో అడుగుపెట్టిన కొత్తలో మెట్టినింట్లో భోజనానికి కూడ జరుగుబాటు వుండేదికాదు. పూర్వీకులు సంపాదించిన ఆస్తిని తాతగారు కోమలాంగి సంపంగుల సయ్యాటల్లో హారతికర్పూరంలా హరించి వేశాడు. మిగిలింది కొద్దోగొప్పో వుంటే దాన్ని తండ్రిగారు స్వాహాచేశాడు తనకాలంలో మిగిలిన ఋణభారంతో క్రుంగి ఆయన గోమతీ నదిలో మునిగి ఆత్మహత్య చేసుకున్నాడు. ఇక మిగిలిందల్లా ప్రస్తుతం పెద్దమ్మ స్వాధీనంలో వుండే ఆ ఒక్క భవనమే. అదే ద్వారకాదాసు గారికి చెప్పుకోతగిన ఆస్తి. తాత తండ్రులు చేసిన అప్పులు తీర్చడానికి అది కూడా వేలానికి వచ్చింది. ద్వారకాదాసుగారి తల్లిగారు అతడినీ, పెళ్లికాని తన ఇద్దరి కూతుళ్లనూ తీసుకొని ఆ మేరకే అనుకొనివున్న ఓ చిన్న కొంపలో జీవనయాత్ర సాగించింది. ద్వారకాదాసుకు అప్పుడు పద్నాలుగు సంవత్సరాల ప్రాయం. అతడు బంధువు దగ్గర సారాయి వ్యాపారం నేర్చుకోవడం మొదలెట్టాడు. ఎలాగో అక్కయ్య వివాహం జరిగింది. అతనికి కూడా వివాహం జరిగింది. అలా ఆయన పేదరికపు జీవితంలో పెద్దమ్మ అడుగు పెట్టింది.

పెద్దమ్మ పుట్టిల్లు హాత్రస్. వాళ్లు కూడా సిరిని పోగొట్టుకున్న సంపన్నులే. అయినా ఇంకా శ్రీమంతులుగానే వున్నారు. పెద్దమ్మ తల్లిదండ్రులు ఆమె చిన్నతనంలోనే చనిపోయారు. అంత పెద్ద కుటుంబంలో ఆమె ఒక్కతే ఆడపిల్ల అవడం మూలాన ఎంతో అల్లారు ముద్దుగా పెరిగింది. తాత, నాయన నాయనమ్మ గారాబంతో ఆమె మొదటినుండి మహా మొండిగా తయారయింది. ఊరకే నోరుపారేసుకునే గడుసుతనం బాగా వంటపట్టింది. మిగతా చిన్నాయన లకు పిల్లలు పుట్టడంతో వాళ్లగారాబం మెల్లమెల్లగా ఆమెమీద సన్నగిల్లి పోయింది. అందుకే పెద్దమ్మకు వాళ్లంటే చిరాకూ, కోపమునూ. గారాబంతో

వంటపట్టిన దురుకుతనంపల్ల వాళ్లంటే ఆమె మరింతగా రెచ్చిపోయేది. తేడి, నాయన జేజమ్మ బ్రతికినంతకాలం ఎవరూ ఆమెను పల్లెత్తు మాట అనడానికి సాహసించలేదు. వాళ్లు పోయినప్పటినుండి పోట్లాటలూ, కొట్లాటలూ ఆరంభ మయ్యాయి. తన దురుసుతనం పల్ల పెద్దమ్మ అందరికి కంటకంగా తయారైంది. క్రమక్రమంగా యింట్లో ఆమె అంటే ఉపేక్షాభావం, నిర్లక్ష్యమూ పెరిగినకొద్దీ ఆమెమనసంతా ద్వేషంతో నిండిపోసాగింది. ఆవిడకి మనిషిపొడంటేనే గిట్టని పరిస్థితి ఏర్పడింది. పినతండ్రులు కట్నంకానుకలు లేకుండా ద్వారకాదాసు వంటి బికారికిచ్చి వివాహం జరిపి కాళ్లు కడిగేసుకున్నారు, సరికదా పెళ్లయిన తర్వాత ఒక్క పర్యాయమన్నా పిలిచిన పాపానపోలేదు.

పెళ్లయినదిమొదలు ద్వారకాదాసు జీవితంలో నూతన అధ్యాయం మొద లైంది. సారాయి వ్యాపారంలో మునిగి దివాలా తీసిన పెద్దపెద్ద షావుకార్ల దగ్గరా, శ్రీమంతులూ, నవాబుల యిళ్లలోను వుండే ఎంతో విలువైన సామాన్లను చవగ్గా కొనేశాడు ద్వారకాదాసు. అది కలిసొచ్చింది. నెమ్మదిగా ఓచిన్న సారా అంగడి పెట్టుకున్నాడు. తన జీవితంలో ఇంత మంచి మార్పు రావడానికి తన భార్య అదృష్టమే అంటాడు ద్వారకాదాసు. ఆ కారణంచేతనే ఆమె నోట్లోంచి ఎంత విషం కక్కినా పరమశివునిలా దాన్ని భరిస్తూవచ్చాడు.

మొదటి ప్రపంచ యుద్ధంరోజుల్లో భాగ్యలక్ష్మి ద్వారకాదాసును ఎన్ని విధాలో వరించింది. ఆరోజుల్లోనే ఓచిన్న యిల్లు కొన్నాడు. దాంట్లో ఆయనకు లంకెబిందెలు దొరికాయి. అంతే, అప్పట్నుంచి ద్వారకాదాసు కీర్తిప్రతిష్టలు దిగాంతాలకు వ్యాపించసాగాయి. ఐశ్వర్యంతో తులతూగుతోన్న ద్వారకాదాసుకు తన భార్య తనను ప్రేమిస్తూ, గౌరవిస్తూ, తనవాళ్లో యీ సిరిసంపదలు అను భవించే ఒక వారసుణ్ణి కూర్చోపెడితే ఎంతబావుండును అన్న ఆలోచనలు కలిగేవి.

వివాహం జరిగిన కొన్ని సంవత్సరాల తరువాత గాని పెద్దమ్మ నీళ్లపోసు కోలేదు. కోడలంటే రాచిరంపానపెట్టే అత్తగారికి ఆమె అంటే అనురాగం పుట్టుకొచ్చింది. కాని అది ఎన్నోరోజులు నిలువలేదు. తీరా పెద్దమ్మ ప్రసవించి

ఆడపిల్ల పుట్టగానే అందరి ఉత్సాహం ఒక్కసారిగా పొంగుపొంగులా చల్లారి పోయింది. పురిటిలోనే అత్తగారు పెట్టేశాపనార్థాలు ఆమె చెవుల్లోపడ్డాయి. అంతే, ఆరోజునుంచే ఆమెలో ఒక న్యూనతాభావం ప్రవేశించింది. ఇంట్లో వాళ్ళంతా తన ముద్దుబిడ్డను పొట్టన బెట్టుకోవాలని చూస్తున్నారన్న అనుమానం కలిగింది. భర్తన్నా, అత్తగారన్నా, ఆడబిడ్డ, నౌకర్లన్నా — అందరిమీద ఆమెకు అసహ్యంకలిగింది. ఇరవైనాలుగు గంటలూ తలుపులు మూసుకుని గదిలో కూర్చుని పసిపాపను ముద్దాడుతూ వుండేది. భర్త లక్షపర్యాయాలు నచ్చ జెప్పాడు. కాని ఒక్క మాటగూడ ఆమె వినలేదు. ఎనిమిదో నెలలో ఆపసి కందు దేవుడి సన్నిధికి చేరుకుంది. పెద్దమ్మ పెడబొబ్బలు మొదలెట్టింది. ఆమె ఏడ్పులకు అంతులేదు. హృదయం తరుక్కు పోతున్నట్లున్న ఆ ఏడ్పులకు యింటిల్లిపాదీ ఎంతగానో దుఃఖించారు. ఇంత ఐశ్వర్యంవున్నది కూడా ఇంటికి వెలుతురు ప్రసాదించే దీపంలేని కారణంగా ద్వారకాదాసు మనస్సంతా చీకటితో నిండిపోయింది. రోజులు గడచినకొద్ది ఆ చీకటి మరింత దట్టంకాజొచ్చింది. శూన్యం నిండిన ద్వారకాదాసు హృదయం సంతానాపేక్షతో తపించసాగింది. మళ్ళీ వాసికం కట్టుకోవాలని తీర్మానించారు. అతని జీవితంలో రెండోసారి ఆపని చేస్తున్న రోజునే అతని మొదటి భార్య ద్వారకాదాసు గృహాన్ని వదలి వెళ్లి పోయింది.

రెండో వివాహం ఆయిన ఎనిమిది రోజులతర్వాత ద్వారకాదాసు తంటాలు పడి ఎలాగైతేనేం పెద్దమ్మను ఒప్పించగలిగాడు. ఇకపిదప తాను కొన్న భవంతిలో పెద్దమ్మ వుండేటట్లుగాను, ఆమె బ్రతికినంతకాలం ఆభవనంపైసర్వాధి కారాలూ ఆమెకే సంక్రమించినట్లుగాను, ఆమె భరణం క్రిందా, తీర్థయాత్రలకు గాని వ్రతకల్పాలు చేసుకొనడానికిగాని నెలకు రెండు వందల రూపాయలు ఆమెకు ప్రతినెలా ఇచ్చేటట్లుగాను యేర్పాటు జరిగింది.

ఆనాటి నుండి అదేపద్ధతి ఈ ముప్పైమూడు సంవత్సరాల తరబడి అవిచ్ఛి న్నంగా నడుస్తూవస్తోంది. ఈ ముప్పయ్ సంవత్సరాల కాలంలో ధర్మ సంరక్ష కులూ, గోబ్రాహ్మణ పరిరక్షణకు కంకణధారులూ, దానశూరులైన రాజబహద్దరు సర్ ద్వారకాదాసు అగ్రవాల్ కె. సి. ఇ. గారి ప్రథమ కళత్రం అయిన

పెద్దమ్మ ప్రపంచానికే పెద్దమ్మగా మారినట్టి జగడా మనిషిగా, చేతబడిచేసే మంత్రగత్తెగా, పాపాల భైరవిగా ఎన్నో బిరుదులు ఆర్జించుకుని, సంఘానికే హేళనగా తయారైంది. ఆమె చేసే చేతబడులు, వేసే మంత్రాల్ని, గురించి ఎన్నోకథలు ప్రచారంలోకొచ్చాయి. అర్ధరాత్రివేళ పెద్దమ్మ ఒంటరిగా ఎవరో పాకీవాడిదగ్గరకు వెళ్లి చేతబడి నేర్చుకొంటూందని అంటుంటారు. నల్లతాడుమ మొలనూలుగా ధరించి ఓ చిన్న కత్తినీ, కత్తెరనీ నడుముకుకట్టుకొని, తన వాళ్ల యిళ్ళలోనూ, ఆ వీధిలోవాళ్ళ యిళ్ళలోను ఎన్నోమాయలు చేసిందట. ఒకరి యింట్లో మంచంపట్టెపై సిందూరం పూసిందనీ, మరొకరియింట్లో దిండు చుట్టూ గుప్పెం పాతిక నల్లదారాన్ని చుట్టి మధ్యలో సూది గుచ్చిందని, యింకోచోట పెళ్ళికూతురు చీరెకు నాలుగు చెరుగులు కత్తిరించిందని ఒకరి యింట్లోకి దూరి వుయ్యాలలో నిద్రపోతున్న పిల్లాడిమీద చిల్లిపాత్ర వ్రేలాడ దీసి నూనెపోసిందని, కొత్తగా పెళ్ళయిన ఓ అమ్మాయి పావిటని కత్తిరించి ఆమెను గొడ్రాలుగా చేసిందని, ఒకరి గుమ్మంలో ప్రతిపాయంత్రం దీపం వెలిగించి నలభై రోజులు పెట్టిందనీ, ఎవరికో దిష్టి తగలాలని రహదారిలో దిగ తుడుపు వుంచిందని— ఇలా ఎన్నోకథలు చెబుతారు ఆవీధి వాళ్ళంతా. చేతబడిచేస్తూ ఎన్నో పర్యాయాలు ఆమె పట్టుబడింది. వందల పర్యాయాలు ముష్టియుద్ధాలు జరిగాయి. ఎన్నోసార్లు ఆమెను కొట్టడం, తిట్టడం కూడా జరిగింది. ఏ ఇంటిలోకి వెళ్లడానికి కూడా ఆమెకు అస్కారం లేకుండా పోయింది. ఆహ్వానించే వారూలేరు. ఏ ఇంటిలో ఏ చిన్న అనర్థం జరిగినా పెద్దమ్మ మీదకి దాన్ని త్రోసివేస్తుంటారు.

ఎండలో జుత్తు ఆరపోసుకుని డాబామీద కూర్చునుంది పెద్దమ్మ. చుట్టు ప్రక్కల ఇతర డాబాల మీద జరిగే ఆర్భాటం ఆమె చెవుల్లోకి దూరి ఆమెకు చిదర కల్గిస్తోంది. సగం తెల్లబడిపోయిన జుత్తులోకి వ్రేళ్లపోనిచ్చి చిక్కు తీసుకుంటూ, ఆరబెట్టుకొంటొన్న పెద్దమ్మ చికాకుతో తనలో తానే గొణుగుతుంది–"నాశనమయిపోను.వాళ్లకు దావైనారాదు దిక్కుమాలినముండాకొడుకులు వీళ్ల అటుయేడు తరాలూ ఇటు యేడు తరాలూ కూర్చునోళ్ల కూర్చున్నట్లు గానే ప్రాణాలు వదల".

పెద్దమ్మ తన జీవితారంభం నుంచి ఇప్పటి వరకూ సణగిన సణుగుడు పొడుగు కొలవడం మొదలెడితే బహుశా ఆమె ముందు హనుమంతుడు కూడా ఓడిపోతాడేమో. పెద్దమ్మకు ఈ మొత్తం ప్రపంచం అంటేనే గిట్టదు. అందరిపైనా ఫిర్యాదే. ఎప్పుడూ ఏదో ఒక వితూరియే, ఆక్షేపణే! మరి అలాంటప్పుడు దాడీలకూ ఫిర్యాదులకూ అంతు ఎలావుంటుంది? రుమ్మన్‌బజాజ్ డాబామీద ఆయన కూతుళ్లూ కోడళ్లూ కిలకిలా నవ్వుతున్నారు. వాళ్లనే యేడుతరాల శత్రువులని ఈ పెద్దమ్మ తిట్టిపోస్తోంది. "ముండలకు ఎంత పెద్ద గొంతుక లిచ్చాడు దేవుడు, ఎప్పుడు చూసినా ఒకే పనిగా విరగబడి నవ్వుతుంటారు" అనుకుంది. ఇదే అదనుగా చూసి పిట్టగోడమీద కాకిముండ కూర్చుని కూర్చోని రెట్టేసి పోయింది. చుట్టుపక్కల యిళ్లల్లో రేడియోలు పెట్టుకున్నట్లున్నారు. ఒకటే రణగొణ— హం తుమ్సే మొహబ్బత్ కర్ కే సనమ్—అంటూ. "చావైనా చావడు ఈ వండా కొడుకు" అని తిట్టిపోసింది. గున్నో పాత డాబా మీద కాకుల్లాగ పొడుచుకుంటున్నారు, అత్తా కోడళ్లు. చెవులు దిమ్మెక్కి పోయాయి. "ముసలి ముండకు గొంతు పెద్దగా వుంది. దీనినాలుక కత్తిరించుకపోను" అంది, వాళ్లవైపుచూసి. ఇంతలో లాలే బ్రోకరు వాళ్లబ్బాయి "సబ్బుబిల్ల యిచ్చి పోంద రోయ్ వెధవల్లారా, ఇక్కడ సీళ్ల చల్లారిపోతున్నాయ్" అంటూ పైనుంచే అరుస్తున్నాడు. పెద్దమ్మ చెవుల్లో ఎవరో నూనె మరగించి పోసినట్లయింది వాడి అరుపులు వింటూంటే. "అబ్బ, ఎలా అరుస్తాడో, రాక్షసుడిలా. పీళ్ల దుమ్ము కొట్టుకుపోను. ముదనష్టపోళ్లు, నడిమధ్యాహ్నమా స్నానంచేసేది. ఈ భభూతి గాడి కోడళ్లు ఎప్పుడు చూసిన కళ్లకు ఎదురుగా చస్తారు. రెండు గడియలు తిరిగ్గా కూర్చోనివ్వరుగా. అబ్బబ్బ, నన్నెందుకిలా ఏడిపిస్తారు పీళ్ల ఏడు తరాలూ నాలానే యేడుస్తారులే. పీళ్లనోట్లో పురుగులు పడిపోను. ముండలకు చచ్చేప్పుడు వంటిమీద గుడ్డగూడ వుండకపోను...మళ్లీవచ్చావుటే నష్టజాతకం దానా, నీ ఒళ్లంతా తూట్లుతూట్లు పడి.........

చంపిన ఎలకను నోటకరచుకుని కిందనుంచి పిల్లిరావడం కనబడింది పెద్దమ్మకు. సణుక్కోవడం మాని ఒక్కసారిగా తల విదిల్చింది. పెద్దకర్ర తీసుకుని దాని వెనక పడింది. మెట్లమీది గదిలోంచి పిల్లి ఒక్క గంతేసి పెద్దమ్మ

డాబామీద నుంచి భభూతీ సునార్ డాబా మీదకు పరుగెత్తింది. అదే సమయానికి నందో కూడ అటువైపునుండి దూకడంతో కెవ్వున కేకవేసింది.

"ఏమిటే దాన్ని ముట్టుకొన్నావా. వెళ్లి నీళ్లోసుకురా" అంటూ ఆమెను చూస్తోన్న పెద్దమ్మ తిట్టింది.

"అదేంటి పెద్దమ్మా, రాముడి మీద ఒట్టు. నేను ముట్టుకోనేలేదు. అది అంతదూరాన్నుంచి దూకెళ్లిపోయింది. నువ్వు చూస్తూవున్నావుగా. అబ్బ! నాగుండె ఝల్లుమంది సుమా! నోట్లోఎలుకని కరచుకునుంది. మీ ఇంట్లోంచే వస్తోందికాబోలు కదూ" అంటూ డాబామీదనుంచి మూడుమెట్లు దిగి పెద్దమ్మ దగ్గరకొచ్చి "ఇదుగో ఆకలు తెచ్చాను" అంటూ చేతిని ఆమె వైపుగాచాపింది

తుఫాను చెలరేగుతోన్నట్టున్న పెద్దమ్మ ముఖకవళిక ఆకుల్ని చూడగానే ఒకస్మాత్తుగా శాంతించింది. చేతిలో కర్రను'గోడవారగా పెట్టి, అరుగుమీద నీళ్ల చెంబుతో చేతులు కడుక్కుందామని ముందుకు 'నడచింది. నిజంగా నిన్ను పిల్లి ముట్టుకోలేదటే, నిజమేనా'అంటూ చేతులు కడుక్కుంటూ పెద్దమ్మ రెట్టించింది.

"లేదే పెద్దమ్మా. అంతపెద్ద ఒట్టేసుకొన్న తర్వాత గూడ నమ్మవేం. నాకూ నీకుమల్లే మడీగట్టావున్నాయే. నా ఇంట్లోనైతే తమలపాకుల పెట్టెకూడ ఠాకూర్ పూజామందిరములో వుంచుతాను, తెలుసా" అంటూ పెద్దమ్మవైపు చూసింది నందో.

చీరకొంగుతో చేతులు తుడుచుకొని ఆకులు అందుకుంది పెద్దమ్మ. గొంతులో మార్దవాన్ని తెచ్చిపెట్టుకుంటూ, "అంటె ఆకుల్ని కూడా కృష్ణుడిని వుంచినట్లు మడిగా వుంచుతావటే?"

"ఆఁ అవునవును అలాగే వుంచుతా'' అని నందో బొడ్డులోంచి పొగాకు సంచి బయటకు తీసింది.

ఇద్దరూ ఎండదిక్కుగా వెనక్కు తిరిగి కూర్చున్నారు. సంచిలోంచి రెండు వక్కముక్కలూ, ఓ చిటికెడు పొగాకు తీసుకొని నోట్లో వేసుకుంది. అప్పుడే ఆకులు నములుతోన్నట్లుగా. సంచిని బొడ్లో దోపుకొని కాళ్లు బారచాపుతూ

'ఏమో పెద్దమ్మా, నామటుకునేను మీ అందరి దయవల్లా ఈనాటికీ నిష్ఠగానే వున్నాననకో. మడిమట్టూ అంతా జరపాలకదా. పొద్దున్నే గోమతికెళ్ళి స్నానం చేసి వచ్చి రావడంతోటే ఠాకూరు పూజామందిరములోకి దూరుతాను. పూళ్ళవారి కాపురాల గురించి నాకేం తెలుస్తుంది. మూడు నాలుగు గంటలు భగవంతుడి పూజాపునస్కారాల్లో గడచిపోతాయ్. ఇక మిగతా విషయాలు పట్టించుకోవ డానికి నాకు తీరిక ఎక్కడ వుంది చెప్పు".

"నీదగ్గిర ఎన్ని విగ్రహాలున్నాయ్" తలలిక్కు తీసుకుంటూ అడిగింది పెద్దమ్మ.

'మా దగ్గరా ః రాధాకృష్ణుల జంట, లక్ష్మణ, బాలముకుందుడు, వినాయ కుడు, ఉద్ధు తింటోన్న గోపాలుడు, విష్ణుపది, బదరీనాథుడు, జగన్నాథుడు, శివుడూ, సాలిగ్రామా... అంతేననుకో. మిగతావన్ని పటాలేలే" అని చెప్పింది నందో వివరాలతో సహా.

'నా దగ్గర వినాయకుడులేడే. పూర్వం వుండేదికాని ఈ ఎలుక ముండ మోపులు ఈడ్చుకుపోయాయ్" తల మీదకు చెంగు తీసుకుంటూ అంది పెద్దమ్మ.

''ఇంకోటి తెప్పించుకో పెద్దమ్మా. పొన్పులో ముందుండాల్సింది వినా యకుడేగా. కార్యసిద్ధికి కావలసింది ముందు ఆయనేగా" అని సలహా ఇచ్చింది నందో.

"సిద్ధులు సంపాదించి నేనేం చేసుకోనే. భగవంతుడి పాదాల్ని భక్తితో సేవిస్తే చాలదూ. కైవల్యం కూడా దానిముందు దిగుతుడు పేనని భాగవతంలో రాసారంట''.

"అవును పెద్దమ్మా. అట్టాటి భక్తి వుండాలేగాని జన్మజన్మలకు దాని వాసన అట్టాగే వుంటోందట. ఆరోజు హరికథలో నేనుగూడా విన్నాను...'' అని నందో శ్రుతి కల్పుతోండగానే "ఎక్కడ జరుగుతోందే కథ" అని మధ్యలోనే ప్రశ్నించింది పెద్దమ్మ. అసలు ఎక్కడ కథాకాలక్షేపం జరిగినా పెద్దమ్మ వినడానికి వెళ్లదు. గోమతికి స్నానం చేయడానికి కూడా వెళ్లదు.

ఆ మాటకొస్తే ఆమె ఎక్కడికీ వెళ్లదు. పొద్దు పొడిచినప్పుడూ, పొద్దుగుంకి నప్పుడూ గోకుల ద్వారానికి మాత్రం మంగళం చూడ్డానికి, పవళింపు సేవ చూడ్డానికీ వెళుతుంది. బయటికి బయల్దేరిందే తడవుగ ఆ వీధిలో పిల్లలంతా చేరుతారు. వయసులోవున్న కుర్రాళ్లూ, ఆమె తిట్లను దీవెనలుగా స్వీకరించే కొంటెవాళ్లూ, నడివయస్కులూ, ముసలాళ్లూ కూడా ఆమెను చుట్టుముట్టి "మంత్రాల బూచి వచ్చింది, చూడండ్రా. ఇదిగో...... ఇదిగో పెద్దమ్మా, పెద్దమ్మా నువ్వెప్పుడు చస్తావే'' అంటూ అడుగడుగునా ఆమెను ఎగతాళి చేస్తారు. ఛలోక్తులు విసురుతారు. ఏడుజన్మల శత్రువులంటూ దారిపొడుగునా వాళ్లను తిట్టుకుంటూ, చీవాట్లు పెట్టుకుంటూ పోయేటప్పటికి ఆమెకు ఆయాసం వస్తుంది. ప్రపంచం కాస్త పచ్చగా వుంటే కళ్లల్లో కారం పోసుకుంటుంది. ఈ భూప్రపంచంలో ఎవరైనా ఆమెకు గిట్టేవారనే వారుంటే ఒక్క నందోయే. ఆవిడే ఆమె దగ్గరకొచ్చి ప్రపంచంలోని ముచ్చట్లన్నీ చెప్పి పోతుంటుంది.

మధ్యలో తెగినమాట చివరల్ని కలుపుతూ నందో అందుకుంది— "దూదేకులోళ్ల సందులో ఎవరో కాశీనుండి శాస్త్రుల్లు వచ్చారు. ఎంతబాగా చెప్తారనుకున్నావ్ పెద్దమ్మా. మనిషి జన్మకు సార్థక్యాన్ని యిచ్చేది నంస్కారాలే అని ఆయన చెప్పారు".

''ఆచారాలు వుంటూనే ఉంటాయి. ఈ రోజుల్లో చూడు. వీళ్ల ఆచారాలు పాడుగాను, పూర్తిగా మారిపోయారు. పున్నో కూతుర్ని చూడవే, బి. ఏ., ఎమ్మేలు చదివి వుద్యోగం ఎలగబెడ్తోందిగా. సైకిలు కూడ త్రొక్కుతోంది'' ముక్కుమీద వేలేసుకుని మరీ చెప్పింది పెద్దమ్మ.

"అడక్కే పెద్దమ్మా ఈకాలం గురించి, ఇది కలికాలం. నాలుక్కాళ్ల మీద అధర్మం నడుస్తోంది. ఎవరికి చెప్పడం, మా ఇంట్లో ఏమి తక్కువ. శంకరూ వాడి పెళ్లాం ఎనిమిది గంటలైతేకానీ మంచంమీద నుంచి లేవరు. స్టౌ తెచ్చాడు. దాన్ని వెలిగించుకొని టీ, గుడ్లూ, చేపలూ, డబుల్‌రొట్టె ఏవేవో చేస్తుంది అది పెళ్లాం. ఇక అవన్నీ మగాడితో కూర్చొని తింటుంది. అట్లా వున్నయ్ మన అచారాలు. మనియా పెళ్లాంవుంది చూశావూ, అదికూడా ఆ

చిన్నదానితో కూర్చుని కులుకుతూంటుంది. దానితోనే బినరం తాగరం అంతా. వీళ్ళిద్దరికీ గురువు వుందిగా నీయింట్లోకి కొత్తగా అద్దెకిచ్చింది - ఏం చెప్పనూ — హరి కృష్ణా !"

"అది పాపాలవుట్ట. శనిముండ, దానిపాపం దాన్నే కొడుతుందిలే. కుష్ఠోళ్ళై చస్తారు. వీళ్లతాడు తెగిపోను. ఏపని చేస్తున్నా నా ఆత్మవాళ్లకు శాపనర్థాలు పెడ్తోనే వుంటుంది".

తన యింట్లో అద్దెకుంటోన్న మిస్టర్ వర్మ మిసెస్ వర్మ అంటే భగ్గున మండిపడుతుంది పెద్దమ్మ. వర్మ వర్ణాంతర వివాహం చేసుకుని ఆర్యసమాజ్ మందిరంనుండి బయటికొచ్చిన రోజునుండి ఇరువైపులవాళ్ళ వాళ్లిద్దరికీ దూర మయ్యారు. ఆ ఇద్దరికీ తలుపులు మూసివేశారు. మిస్టర్‌వర్మ మంచి రేడియో మెకానిక్. చిన్నదుకాణం పెట్టుకొని సంసారయాత్ర చేస్తున్నాడుస్తే వర్మ తన తండ్రితో తగాదాపడి వేరైపోయాడు. హోటల్లో మకాంపెట్టి, అద్దెకొంపలు ఇచ్చే కమెటీ మెంబర్ల వెనక పడటం మొదలెట్టాడు. మెంబర్లలో వర్మకు పరిచయం వున్న ఒక పెద్దమనిషి ఇల్లు ఎక్కడైనా ఖాళీగా వుంటేచెప్తే ఇప్పించేపూచీ నాదన్నాడు. వూరంతా యిళ్లకోసం గాలిస్తున్న సమయంలో రాజబహద్దరు సర్ ద్వారకాదాసు భవంతి కనబడింది. నాలుగు గుమ్మాలన్న అంత పెద్దమేడ ఇరవై సంవత్సరాలనుండి మూతవడివుంది. ఒక భాగంలో ద్వారకాదాసుగారి పెద్దభార్యామణి, పెద్దమ్మ వుంటోంది. దాన్ని భూతాలమేడ అనడం కద్దు. ఆమేడమీద రాజబహద్దరు వారికి ఏ మాత్రం హక్కు లేదు, సంబంధమూలేదు. అంతా పెద్దమ్మదే అధికారం. బయటవుండే గదులూ, దుకాణాలూ, పాతగోశాలవున్న హాలూ అద్దెకిచ్చింది పెద్దమ్మ. కాని లోపల మాత్రం ఎవరు అద్దెకి వచ్చినా ఒప్పుకునేదికాదు. వర్మగారు అలాటుమెంటు కమెటీవారి ప్రాపుతో ఆ ఇంటిలోపల ఒక భాగాన్ని ఆక్రమించ గలిగారు. అందుకే ఆ దంపతుల్ని అస్తమానము ఆమె తిట్టిపోస్తూ వుంటుంది.

"ఇప్పుడు ఆ గురువులు ఇక్కడే చేరారుగా ఇక చూసుకో, ఏమేం వింతలు విశేషాలు జరుగుతాయో. క్షత్రియులు, బ్రాహ్మణులు, కోమట్లు

అందరూ చేరారు. బజార్లో వాళ్లందరినీ కలగాపులగంచేసి పారేస్తారు. చూస్తూ వుండు. నువ్వే చెప్పు. ఇలాంటి ధర్మభ్రష్టులైన వారితో శంకరూ మనియాల భార్యలు తింటమూ, తాగడమూ. అందుకే ధర్మం యిలా పతనమై పోయింది"; అంది నందో.

సరిగా అప్పుడే ఎవరో పెద్దమ్మ తలుపు తట్టారు.

"పోయి చూడవే నందో, మళ్లీ ఏ కుంక తగలబడ్డాదో" అని పెద్దమ్మ నందోవైపు చూస్తూ అంది.

కాందిశీకుడుగా వచ్చి ఆ యింట్లో అద్దెకున్న అసామి గోశాలకుపైనవున్న భాగంలో వుండటానికి ఎవరినో ఒకకొత్త అతన్ని తీసుకొచ్చాడని నందో కబురు తెచ్చింది.

# 3

రాజబహద్దరు సర్ ద్వారకాదాసు అగ్రవాలు పూర్వీకుల గోశాలలో పెద్ద నరవాకు పైన కట్టిన చిన్నగదిని అద్దెకు తీసుకున్న చిత్రకారుడైన సజ్జన్ ఏదో భావావేశంలో తానిక్కడకు వచ్చి పెద్దతప్పు చేయలేదు కదా, అని ఆలోచిస్తు న్నాడు. ఆ వీధిలో వారి జీవన పద్ధతులతో పరిచయం పెంచుకుని వాళ్ళజీవి తాన్నే తన చిత్రాలకు కళావస్తువుగా గ్రహించాలన్న అభిలాషతో అక్కడ అద్దెకు చేరాడు. షానజన్ రోడ్డుకో ఆయనకు సొంతబంగళావుంది. బామీనా బాదు కేసర్‌బాగ్‌లో ఆయనకు సొంత ఇళ్ళున్నాయి. ప్రతినెల ఎనిమిది వందల రూపాయలనుండి వెయ్యి రూపాయలవరకు అద్దె వస్తుంది. పూర్వీకులు సంపా దించి తనకోసం ధారాదత్తం చేసిన ఆస్తి చాలావుంది. సాధారణంగా ప్రతి కళా కారుడూ నిత్యజీవితంలో ఎదుర్కొంటూ వుండే లేమి, దారిద్ర్యం మొదలైన ఈతిబాధలనే శత్రుమూకల్ని ఎదుర్కోవడానికి అడ్డుగోడలా ఆయనకు ఈ విత్తార్జనం సహాయపడుతోంది. లాండ్‌స్కేప్, పోర్ట్రేట్ (దృష్టిగోచర ప్రదేశము, చిత్తరువు) చిత్రరచనకు సజ్జన్ ప్రసిద్ధి. అమర్‌నాథ్ నుండి కన్యాకుమారి

వరకు, ద్వారక నుండి మణిపూరు, అస్సాం వరకు దేశంలో నాలుగు మూలలు తిరిగాడు. మనదేశ ప్రాచీన వైభవాన్నంతా గుప్పిట్లో పెట్టుకున్న సాహిత్యం, సంగీతం, శిల్పకళ, చిత్రలేఖనం, నృత్యం మొదలైన లలిత కళల్ని చూసి సజ్జన్ ఎంతో ఉప్పొంగిపోయాడు. కాని నేడు మన సాంఘిక జీవితంలో పెరిగి పోతున్న సాంస్కృతిక దారిద్ర్యాన్ని చూసి దానికి కారణం ఏమిటో అని ఎంతో ఆవేదన చెందేవాడు. ఈనాడు ప్రపంచంలో నిత్యనూతన ప్రతిభను చాటే సృజనాత్మక శక్తి నశించింది. నాలుగు వైపులా గత్యావరోధం ఏర్పడింది. పరిణామాలు పొందని అట్టి నిష్క్రియత్వంలో సజ్జన్ కథావస్తువుల్ని ఎంపిక చేయడంలో కృతకృత్యుడు కాలేక పోతున్నాడు. ఈ జడత్వానికి కారణాలు ఆ సంఘంలోనే వుండి పరిశోధించాలన్న వుద్దేశం కలిగింది. తన చిత్రాలకు ఎప్పుడూ ఫ్రేములు కడుతుండే ఒక సర్దార్‌జీ తన ఇంటికి దగ్గరలోనే ఒక భాగం ఖాళీగా వుందని చెప్పగానే సజ్జన్‌కు పరమానందం కలిగింది. కాని సర్దార్‌జీ తన పొరుగువాణ్ణి పల్టీ కొట్టించడానికి తనని ఓ పావుగా ఉపయోగించు కొంటాడన్న ఆలోచన ఆయనకెప్పుడూ కలుగలేదు.

కింద గోళంలో రెండు పెద్దపెద్ద నడవలూ, రెండు గదులూ, ఒక నడవ పైన ఓ చిన్న గది వుంది. క్రింద రెండు హాల్లోనూ రెండు గదుల్లోనూ శాందిలీకుల కుటుంబాలు రెండు కాపురాలు వున్నాయి. ఒకటి ఒక సర్దార్జీ కుటుంబం. ఆయన వడ్రంగం పనిచేస్తుంటాడు. రెండో వ్యక్తి తోపుడుబండి మీద మసాలా అమ్ముతాడు. మసాలా వ్యాపారస్తుని బ్రహ్మచారి బావమరిది పైగదిలో వుండేవాడు. అందువల్ల వాళ్ళ కుటుంబం పెద్దదైనా వడ్రంగి సర్దారు కుటుంబం ఆక్రమించిన దానికన్న ఎక్కువ స్థలాన్ని ఆక్రమించుకొని ఏ ఇబ్బందిలేకుండా కాలం గడుపుతున్నాడు. బ్రహ్మచారి బావమరిది ఇటీవల కొద్దిరోజుల్నుంచి ఏదో ప్రేమకలాపంలో పడి జుత్తూ, మీసాలూ గడ్డమూ అన్నీ గొరిగించుకుని సన్యాసుల్లో కలిసిపోయాడు. ఆయన వున్నంతకాలం ఆయన ఆదాయంలో చాలా భాగం అక్క కొడుకులూ కూతుళ్ళకై ఖర్చు చేసేవాడు. ఆయన వెళ్ళిపోవడంతో పాటు బావమరిది ఆదాయం గూడా పోయింది. బావమరిది వెళ్ళిపోయినా మసాలా

అమ్మే ఆయన పైగదినీ వాడుకొంటూనే వున్నాడు. సర్దారు గారికి ఇది చూసి లోలోపలే మండుతుండేది. ఈ విషయాన్ని పురస్కరించుకొని ఇద్దరిమధ్యా ఒకటి రెండు పర్యాయాలు ఘర్షణ కూడా జరిగింది. పైగదిలోకి ఎవరైనా అద్దె కొచ్చినప్పుడు ఖాళీచేస్తానని అంటుండేవాడు షావుకారు. పెద్దమ్మకు ఏవేవో కల్లిబొల్లి మాటలు చెప్పి బుట్టలో వేసుకోవడమేగాక సర్దార్జీమీద ఏవేవో చాడీలు చెప్పి ఇద్దరి మధ్యా పొరపొచ్చాలు కల్పించాడు. ఎవరైనా అద్దెకొస్తే వాళ్లకు ఏవేవో సాకులు చెప్పి పంపించివేసేవాడు షావుకారు.

తన పొరుగున అద్దెకుంటున్న ఆ షావుకారు తనకన్నా పైచెయ్యిగా వుంటున్నందుకు లోలోపలే మండిపడుతూ పగ తీర్చుకోవడానికి అవకాశం కాచుకొనివున్న సర్దారు గారికి మాటల సందర్భంలో సజ్జన్ తనకో యిల్లు చూసి పెట్టమని అర్థించగానే పట్టలేని సంతోషం కలిగింది. పెద్దమ్మకూ సజ్జన్‌కూ శ్రేయోభిలాషిగా నటిస్తూ తన ప్రత్యర్థిపై దెబ్బ తీయడానికి సదవకాశం లభించిందని భావించాడు. ఏభైరూపాయల అద్దెకు యిరవై అయిదు రూపాయ లని చెప్పాడు. సరే, అన్నాడు సజ్జన్. గోకుల్ ద్వారాకు వెళుతుండగా సర్దారు పెద్దమ్మతో ఈ విషయం గురించి ప్రస్తావన తెచ్చాడు. పెద్దమ్మ కూడా సంతోషంతో వూఁ అంది. మరుసటిరోజునే సర్దారు సజ్జన్‌ను వెంట బెట్టుకొని వచ్చాడు. మసాలా వ్యాపారస్థుడు తోపుడు బండి తీసుకొని మసాలా అమ్ముకోవడానికి బయటికి వెళ్లాడు. సర్దారుగారి భార్య వద్దని అంటున్నా లక్ష్యం చేయక సజ్జన్‌కు పైగది చూపించాడు. పెద్దమ్మ దగ్గరకు తీసుకెళ్లి అప్పటికప్పుడు ఒక నెల అద్దె అడ్వాన్సుగా ఇప్పించేశాడు.

రెండోరోజున తన ప్రాణస్నేహితుల్ని ఇద్దరిని వెంటబెట్టుకొని వచ్చాడు సజ్జన్ గది చూపించడానికి. కాని మసాలా వ్యాపారి తాళం ఇవ్వలేదు సంసారులకు మాత్రమే ఆ గది యిస్తాను అని అన్నాడు. సజ్జన్‌కు చాలా కోపం వచ్చింది. అతనికే కాదు అతని వెంటవున్న కర్నైలూ, మహీపాలులకు కూడా కోపం వచ్చింది. ఇంతలో సర్దారు మెల్లిగా పెద్దమ్మ దగ్గర కెళ్లి ఏంచెప్పాడో ఏమో ఆవిడ పిచ్చుపహాసనాలాయి ఇచ్చినోన్నట్లా షావుకారు మీద విరుచుకు

పడుతూ వచ్చింది. పెద్దమ్మ రౌద్రరూపాన్ని చూసి షాహుకారు తోకముడుచు కున్నాడు.

ఇంత చిన్న గదిలోకి ఇంత పెద్ద మనిషి అద్దెకు రావడం చూసి వీధిలో వాళ్లందరూ వింతగా చర్చించుకున్నారు. నిజానికి వాళ్ల అలా చర్చించు కోడంలో ఆశ్చర్యంలేదు. సజ్జన్ పేరు ప్రఖ్యాతుల్ని ఎరిగిన కొంతమంది వ్యక్తులు ఆ వీధిలో వున్నారు. భభూతి సునార్ చిన్న కొడుకు శంకర్‌లాల్ వెంట ఆపేటలోనే నివసిస్తున్న ఇద్దరు ముగ్గురు యువకులు సజ్జన్‌ను కలుసుకోవ డానికి వచ్చారు. ఆ పేటలోని వారి జీవితాల్ని తనచిత్రాలకు యితివృత్తాలుగా తీసుకొనే ఉద్దేశ్యంతో సజ్జన్ వచ్చారని వాళ్లంతా ప్రచారం చేశారు. అయితే జనంలో ఆ అభిప్రాయం అర్థకాలం నిలవలేదు. బొమ్మలు గీస్తానని ఆశపెట్టి వీధిలోని ఆడవాళ్లను లొంగ దీసుకోవడమే సజ్జన్, అతని మిత్రుల వుద్దేశం, అంటూ మసాలా వ్యాపారి ప్రచారం మొదలెట్టాడు. అయినా, మరో ఇద్దరు మిత్రులు తమ సంతకాలతో స్థానిక పత్రికకు గూడా ఆ విషయం ప్రచుర ణార్థం పంపించారు. పెద్దమనుష్యుల యిళ్ల మధ్య ఈ ధనవంతులు యేర్పరచు కొన్న కోటను ఖాళీచేయక పోతే మేం నిరాహారదీక్ష పూనుతాం అని కూడా ఆ సంపాదకునికి రాసిన వుత్తరంలో బెదిరించారు.

సజ్జన్ నిర్ఘాంతపోయాడు. తను ఎలాంటి పరిస్థితుల్లో ఆవీధిలో గదిని అద్దెకు తీసుకున్నదీ వివరిస్తూ సజ్జన్ ఓ ప్రకటన చేశాడు. ఆ బజారులోవున్న వారి స్నేహాభిమానాలను సంపాదించడం ఎలాగా అని, అవి ఎలా చూరగొనడం అని ఆలోచించాడు. తనను వ్యతిరేకించే వారికి దూరంగా తొలిగి తలవంచి వెళ్లిపోవడం అనేది సజ్జన్ స్వభావానికే విరుద్ధం. ఆ వీధిలోని వారిని ఎలాగైనా తాను జయించాలని, వారి ఆత్మీయతను పంచుకోవాలని సంకల్పించుకున్నాడు.

సాయంత్రం అయింది. తన దగ్గరున్న సిగరెట్లు అయిపోయాయి బజారుకెళ్లి తెచ్చుకుందాం అని సజ్జన్ కిందికి దిగి వచ్చాడు. ఎదురుగా రాజ బహద్దరుగారు నిలబడివుండడం గమనించాడు. ఇలాటి అతి సామాన్యమైన సందు లోకి ఇంత పెద్దవ్యక్తి రావడం ఆశ్చర్యాన్ని కలిగించింది. పెద్దమ్మకు రాజ

బహద్దరు గారికి వున్న సంబంధం, ఈ సందుకూ, అంత పెద్ద మేడకూ వున్న సంబంధం, ఎరిగివుండి కూడా సజ్జన్‌కు హఠాత్తుగా రాజావారు అక్కడికి రావడం ఆశ్చర్యాన్ని కలిగించింది.

"తమరా!" అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచాడు సజ్జన్. రాజబహద్దరు గారు షేనజన్ రోడ్డులో సజ్జన్ యింటి ప్రక్కనే వుంటున్నారు. ఆ రెండు యిళ్లకూ ఇంకా రాకపోకలున్నాయి, రాజబహద్దరుగారిని సజ్జన్ బాబాయి అని పిలుస్తాడు. తన తండ్రి బ్రతికివున్న రోజుల్లో రాజబహద్దరుగారు ఆయన్ని అన్నగారూ అని సంబోధిస్తూ వుండడమే దీనికి కారణం.

సజ్జన్‌ను అక్కడ చూడగానే రాజబహద్దరుకు చిన్నతనం అయింది. చేతబడిచేసే తన భార్యను తన మనుమడికి ప్రాణభిక్ష పెట్టమని కోరుతూ ఆయన అక్కడికొచ్చాడు. మనుమడి పెళ్లికి ప్రదానం జరిగిన సందర్భంలో మిఠాయిలు యిచ్చిరమ్మని పెద్దమ్మ దగ్గరికి నౌకర్ని పంపించారు. ఆ మిఠాయిల్ని తిప్పికొట్టడమేకాక మనుమణ్ణి తిట్టిపోసింది ఆపెద్దమ్మ. ఆ మధ్యాహ్నానికే మనుమడికి తీవ్రంగా జ్వరం వచ్చింది. పెద్దమ్మే ఏదో ప్రయోగం చేసి వుంటుం దని అందరికీ అనుమానం కలిగింది. ఎలాగైనా యీ గండం నుండి గట్టె క్కించమని ఆవిణ్ణి అడగడానికి వచ్చారాయన. గద్గద కంఠంతో ఏమీ మాట్లాడ లేక ఒక అడుగు ముందుకువేసి సజ్జన్ భుజాన్ని తట్టాడు రాజబహద్దర్. అపరాధం చేస్తూ పట్టుబడి ఆత్మీయతాభావాన్ని సజ్జన్‌పై వేసి అతని సాను భూతినీ, జాలినీ యాచిస్తున్నట్లు చూశాడు సజ్జన్ కళ్లల్లోకి. మళ్లీ తెప్పరిల్లుకొని 'నువ్వు ఇక్కడ......?" అంటూ ప్రశ్నించాడు.

"అవునండి – ఆపై గదిలో వుంటున్నాను. ఈ ఏరియా లైఫ్ స్టడీ చేస్తున్నానండి" అని సజ్జన్ వారి సందేహ నివృత్తి చేశాడు.

"ఈ మేడ మా పూర్వీకులది. తెలుసు కదా!"

"తెలుసండి. ఇక్కడకు వచ్చిన తర్వాతే ఆ విషయం తెలిసింది. మీ సహాయం అర్థించడానికి నేనే తమ దగ్గరకు రావాలనుకుంటున్నాను. నా

గురించి యేవేవో తప్పుడు అభిప్రాయాలు ఏర్పరచుకున్నట్లున్నారు ఈ వీథి లోని వాళ్లు".

సహాయం అర్థించడానికి రావాలనుకుంటూన్న యాచకుని చూడగానే అలసి సొలసిపోయిన రాజబహద్దరు గారి అహంకారం మళ్లీ పుంజుకుంది. ధైర్యంగా భార్యవున్న గది తలుపుగొళ్లెం కొట్టాడు.

"ఎవర్రా ముండాకొడుకులు, గొళ్లెన్ని తెగ అదిస్తున్నారు" అంటూ కసరు కొంటూన్న కంఠంతో పెద్దమ్మ అరిచింది.

"తలుపు తియ్'' అని ద్వారకాదాస్ సమాధానం ఇచ్చాడు. ఆయన పలుకుల్లో కనిపించే గాంభీర్యం, హుందాతనం ఈ సారి ప్రయత్నపూర్వకంగా తెచ్చుకొన్నట్లు కనబడింది.

పెద్దమ్మ గొణుక్కొంటూ వచ్చి తలుపు తీసింది. తన భర్తను గుమ్మంలో చూడగానే నిరుత్తర అయింది. ఒకరికొకరు దూరం అయిపోయి సుమారు 14-15 సంవత్సరాలైంది. భార్యను అలా దగ్గరగా చూడగానే ఆయన మనస్సులో ఎలాటి వుత్సాహమూ కనబడలేదు. ఏదో భయపడుతున్నట్లుగా కనుపించాడు. మాటలు ఎలా ప్రారంభించాలా అని ఆలోచనలోపడి చివరకు ఎటూ పాలుపోక పక్కనే నిలబడి వున్న సజ్జన్‌ను చూపిస్తూ "ఈ అబ్బాయి ఎవరో తెలుసా ? మన కన్నోమల్‌జీ మనుమడు"అని అన్నాడు.

"కావచ్చు. నాకేం లాభం"అని ముక్తసరిగా అని పెద్దమ్మలోపలికి వెళ్ళింది. ఆమెను అనుసరిస్తూ ద్వారకాదాసు లోపలికెళ్లాడు. ఆలోచనా పాలోచనా లేకుండా సజ్జన్ కూడ వాళ్లిద్దరి వెనకాలే లోపలికి ప్రవేశించాడు.

చెమ్మగా వున్న గడప గడపదాటితే నడవా. దాని ఎదురుగానే ముంగిలి. ముంగిలిలో లాంతరు, మరికొన్ని వస్తువులు వున్నాయి. కుడిచేతివైపు నడవాలో కణకణ మండుతోన్న కుంపటిలోంచి నిప్పురవ్వలు ఎగురుతున్నాయి.

లాంతరు వెలుతురుకు దగ్గరగా నడుస్తూ కిందవున్న పళ్లాన్ని చూసి తక్కున ఆగిపోయాడు ద్వారకాదాసు - పాము ఎదురుబడితే చప్పున నిలబడి

పోయినట్లు. పళ్లెంలో ఏదో వెండి బొమ్మ వుంది. ఆ పళ్లాన్ని అక్కణ్ణుంచి తీసేసి ఎదురుగా వున్న నడవలో స్తంభం దగ్గర పెట్టి లాంతర్ని ముంగిట్లోంచి నడవలోకి తెచ్చింది పెద్దమ్మ. మంచం వేసి కంపుకొడ్తూన్న ఓ పరుపు పరచింది. అయిష్టంగా ముడుచుకుని కూర్చున్న ద్వారకాదాసు, ఆయన్ని అనుకుంటూ కాళ్లదగ్గర సజ్జన్ కూర్చున్నాడు. మంచానికి కొంచెం దూరంలో పెద్దమ్మ నేలమీద చతికిలబడుతూ, "ఎందుకొచ్చినట్టు" అని ప్రశ్నించింది.

"పూరికే. నిన్ను కలుసుకోవాలని వచ్చాను. ఇక్కడ జానకీశరణ్... ... '' అంటూ మధ్యలోనే ఆపి బలవంతంగా నవ్వుతెచ్చుకుని, ద్వారకాదాసు సంజాయషీ ఇచ్చినట్టుగా అన్నాడు.

సజ్జన్ మనసు పళ్లెంలోవున్న వెండి బొమ్మమీద లగ్నమైవుంది. పెద్దమ్మ కూడా అర్టిస్టే నన్నమాట ? ఆశ్చర్యంతో సజ్జన్ పళ్లెంలోంచి ఆ బొమ్మను చేతిలోకి తీసుకున్నాడు.

పెద్దమ్మ కళ్లు చింతనిప్పుల్లా మెరిశాయి. ద్వారకాదాసు సంభాషణ అంతటితో ఆగిపోయింది. పెద్దమ్మ ఒక్కొక్క మాటకీ కూడ కూస్తోందే సజ్జన్ అటువంటి ఘట్టాన్ని ఇంతకు ముందెన్నడూ చూడలేదేమో, చలించిపోయాడు. ఏదో నచ్చచెప్పాలనే ఉద్దేశంతో ద్వారకాదాసు నోరుతెరిచాడు. ఏదేదో చెప్పాడు. లాభంలేక చివరకు నోరుమూసుకున్నాడు.

అగ్గిమీద గుగ్గిలంలా భగ్గుమంటోన్న పెద్దమ్మని, ఆమె మరమలు ఒత్తే భర్తనూ చూసి ఏంచేయడానికి పాలుపోక అక్కడనుంచి జారుకున్నాడు సజ్జన్.

తన కుటుంబానికీ, తన మనుమడికీ ప్రాణభిక్ష యాచించడానికి వచ్చిన ద్వారకాదాసు అక్కడే వుండిపోయాడు. ''గవర్నర్లూ, మంత్రులూ, డాక్టర్లూ, శ్రీమంతులు మొదలయినవారి ఆదరాభిమానాన్ని నిత్యం పొందుతూండే ఓ వ్యక్తి! ఇప్పుడు నీ భార్యనే ప్రాధేయపడుతున్నావా. అలాగే ఇంకా బతిమలాడు !" అన్నట్లుగా, తనవైపు చూస్తూ వెక్కిరిస్తున్నట్లుగా, కనపడింది ఆ వెండి బొమ్మ ద్వారకాదాసుకు.

సజ్జన్ బజారుకెళ్లి సిగరెట్లు తీసుకుని తన గదిలో అడుగుపెట్టగానే అక్కడ కర్నల్‌సాహెబ్, మహిపాల్ ఇద్దరూ కూర్చుని వున్నారు.

కర్నల్ సాహెబ్ అసలుపేరు శ్రీ నగీన్‌చంద్. ఇది ఆయనకు పెట్టిన పేరు. ప్రజలకు ఆయన ఈ పేరుతోనే సుపరిచితుడు. శ్రీ నగీన్‌చంద్ వురఫ్ కర్నల్ సాహెబ్ లక్నోలోని ఓ పెద్ద మందులషాపు యజమాని. వాళ్లషాపు చాలా పురాతనమైంది. పదిమందికి మేలుజరిగే యే కార్యకలాపానికైనా ఆయన అడిగిందే తడవుగా చందా ఇచ్చేవారి జాబితాలో వున్నాడు. ఆరేడు సంవత్స రాల క్రితం ఆయనకు మహిపాల్‌ద్వారా సజ్జన్‌తో పరిచయం యేర్పడింది. కాలంతోపాటు వాళ్లిద్దరిస్నేహం గాఢమౌతూవచ్చింది. సజ్జన్, కర్నల్, మహి పాల్, వాళ్ల ముగ్గురూ శరీరాలు వేరైనా మనసులూ ఒకటే అన్నట్లు ప్రవర్తి స్తారు. మహిపాల్ రచయిత, మిగతా వాళ్లలాకాక పేదవాడు. కాని ఎప్పుడూ బాగా కనపడతాడు. కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడే స్వభావం ఆయనది. స్నేహానికి ప్రాణాన్నిచ్చే నిజమైన స్నేహితుడు.

సజ్జన్ గదిలో అడుగుపెట్టగానే 'లోర్ మహాకవిగారు కలవలేదా' అని కర్నల్ అడిగాడు.

''ఎవరూ విరహేషా ! ఏమిటి . . . ఇక్కడకు వచ్చాడా ?'' విసుగ్గా ముఖం పెట్టి అన్నాడు సజ్జన్.

"అవును, నేను ఏవో కబుర్లు చెప్పి యిక్కడ నుంచి తరిమేశాను'' అన్నాడు కర్నల్.

మహిపాల్ అందుకున్నాడు — ''ఈ వీధివాళ్లు నీకు వ్యతిరేకంగా పేపర్లో రాస్తే వచ్చిన నష్టమేం లేదు కానీ మన అడ్రసు ఇప్పుడు అందరికీ తెలిసి పోయిందనే నా బాధ. లోర్‌గారిని ఇక్కడనుంచి తరమడానికి తలప్రాణం తోక కొచ్చిందనుకో" ,

సిగరెట్లు వెలిగించాడు సజ్జన్. జారిపోతున్న శాలువను భుజాలమీదికి తీసుకుని కూర్చున్నాడు ఏమీ మాట్లాడకుండా.

"ఏమైనా విశేషం వుందా ఈ రోజు" అని ప్రశ్నార్థకంగా చూశాడు కర్నల్.

"అలాంటిదేమీలేదు. ద్వారకాదాసుగారిక్కడికొచ్చారు".

"ద్వారకాదాసు గారా? అందే రాజబహద్దర్?...."

"అవును. ఇప్పుడు పట్టపురాణి అంతఃపురంలో వున్నారు మిత్రమా, ఆవిడ చాలా చాలా విచిత్రమైన మనిషనుకో. దిష్టి బొమ్మలు చేస్తుంటుంది".

పెద్దమ్మ యింట్లో జరిగిన వృత్తాంతం యావత్తు వాళ్లిద్దరికి వివరంగా చెప్పాడు సజ్జన్. కర్నల్ ముఖంలో ఆందోళన అలముకుంది.

"నువ్వు దాన్ని ఎందుకు ముట్టుకున్నావ్? అదంత మంచిపనికాదు" అన్నాడు కర్నల్.

"నాకేం తెలుసురా. పెద్దమ్మ ఒంటరిగా ఇంట్లో వుంటూ ఏదో కాలక్షేపం చేసుకుంటుదనుకున్నా నిజం మహిపాల్. నాకు భలే సరదాగా అనిపించిందిలే. కాని"... అంటూ మధ్యలోనే ఆపి పకపక నవ్వాడు సజ్జన్. యాష్ట్రేలో సిగరెట్టు నుసిని విదలిస్తూ తిరిగి అన్నాడు — "ఏమైతే కానీ గురూ, ఇవ్వాళ ట్రెడిషనల్ ఇండియన్ స్టయిల్లో ముతక తిట్లు ఆవిడ తిడుతుంటే చెవులకు భలే యింపుగావుందిలే. కావలసినన్ని తిట్లు తిన్నాననుకో".

రాజామీద ఎవరిదో నీడ కనిపించింది. మాట్లాడుతున్న సజ్జన్ దృష్టి ఆ నీడమీదికి పోయింది. గుమ్మం దగ్గర రాజబహద్దుర సర్ ద్వారాకాదాస్ అగ్రవాల్ నిలబడివున్నాడు.

మర్యాదగా సజ్జన్ లేచి నిలబడ్డాడు. కర్నల్ సాహెబ్ ముఖంలో నమ్రత తొంగిచూసింది. మహిపాల్ మాత్రం అలాగే తొణక్కుండా కూర్చున్నాడు.

రాజబహద్దర్ ఎవరినీ చూడలేదు. చెయ్యి వూపి సజ్జన్‌ను పిలుస్తూ "ఇలారా బాబూ" అన్నాడు.

సజ్జన్ వెంటనే ద్వారకాదాసు దగ్గరకు వెళ్లాడు. సజ్జన్ భుజం మీద చెయ్యేసి మెల్లవెపుగా నడుస్తూ "చూడుబాబూ, ఈరోజు జరిగిన సంఘటనను గురించి ఎవరితోనూ ప్రస్తావించొద్దు" అన్నాడు ముక్తసరిగా.

"అలాగేలెండి"

"అప్పుడప్పుడు ఆమె బుద్ధి కొంచెం వెర్రితలలు వేస్తూంటుంది"

"అవునండి. ఆ విషయం నాకు తెలుసు".

"ఏమని చెప్పనూ, అంతా నా ప్రారబ్ధం ... సరె! నువ్వు ఎవరి దగ్గిరా ఈ ప్రసంగం తేకుసుమా. నీ ముఖ్యస్నేహితుల దగ్గరైనా సరే .... నీకు ఇక్కడ యే అసౌకర్యం కలక్కుండా వుండడానికి గాను తోవలో వెళ్తూ లాలా జానకీశరణ్‌కు చెప్పి వెళతా నీ గురించి".

సందు చివరిదాకా తోడుగా సజ్జన్ వెళ్లాడు. దర్పమూ, ఠీవి కనిపిస్తుండే ద్వారాకాదాసు ముఖం మీద అలసట, విషాదపు మేఘాల నీడలు వ్యాపించాయి. "నిజంగా ఈవ్యక్తి సుఖపడుతున్నాడా" అనుకున్నాడు తిరిగి వస్తూ సజ్జన్.

# 4

లాలా రేదలాల్ భార్యను చంపడానికి నందో పెద్దమ్మచేత చేతబడి చేయించింది. ఆరు సంవత్సరాల క్రితం మసియా వివాహ సన్నాహాల సందర్భంలో భభూతీ సునార్ యింట్లో దొంగతనం జరిగి బంగారు ఆభరణాలు పోయాయి. బంగారు ఒడ్డాణం, కాశీకాయ పూసలు, చంద్రహారం, పట్టెడ, మరమ్మతు చేయించి మెరుగు పెట్టిద్దామని సునార్ భార్య డబ్బీలోంచి బయటకు తీసి పెట్టింది. రాత్రి రాత్రే డబ్బీ మాయమైంది. మర్నాడు పుదయం చూస్తే యింటి తలుపులు బార్లా తెరచివున్నాయి. ఇంట్లో పనిచేసే నౌకరు కనిపించలేదు. ఇదంతా నౌకరు చేసినపనే అనుకున్నారు ఇంటిల్లిపాదీను. తన వ్యాపారపు చిక్కుల కారణంగా భభూతీ పోలీసు రిపోర్టు ఇవ్వలేదు. కడుపులో దిగమింగుకొని

కూర్చుంది అతని భార్య. బంగారు ఒడ్డాణం వ్యవహారంలో నౌకరుతో నందో లాయాచీ పడింది. ఆరోజుల్లో లాలేదళాల్ యింటికి వాళ్ళయింటికీ బాగా రాక పోకలు వుండేవి. అమ్మిపెట్టమని అవి అతని భార్యకిచ్చింది నందో. ఆవంక ఈవంక అంటూ ఇన్ని సంవత్సరాలు గడచినా ఒడ్డాణం డబ్బు యింత వరకు ముట్టలేదు నందోకు. బయటపడి పోట్లాడే వ్యవహారం కాదాయె. దొంగకు తేలు కుట్టినట్లుగా మనసులోనే మథనపడుతోంది ఇన్నాళ్ళు నందో. నాలుగైదు రోజుల క్రితం గోమతీ నదిలో స్నానాలవద్ద లాలేదళాల్ భార్యతో మాటా మాటా పెరిగింది. దలాల్ కోడలు అందరిముందు దొంగ అంటూ నందో పాతదొంగ తనం బయటపెట్టింది. కాని నందో దొంగతనం చేసిన కళంకాన్ని స్వీకరించలేక పోయింది ఆమె కోరిక ప్రకారం పెద్దమ్మ ఆమెను చంపాలని పిండిబొమ్మలు చేస్తుండగా ద్వారకాదాసు సజ్జన్ ఆమె ఇంట్లో ప్రవేశించారు.

ద్వారకాదాసు వెళ్ళిపోగానే మళ్ళీ బొమ్మలు చేయడం ప్రారంభించింది పెద్దమ్మ. నందో మెట్లగదిలోకి వెళ్ళి ఇంతసేపటినుండి భార్యాభర్తల మధ్య జరిగినసంభాషణ నక్కి కూచుని విన్నది. ద్వారకాదాసు అటు వెళ్ళాడో లేదో మెట్ల మీదినుంచిదిగి ఏమీ తెలీనట్లు, ఇప్పుడే వస్తున్నట్లుగా పెద్దమ్మ దగ్గరకు చేరింది. ద్వారకాదాసు తనని పొగుడుతుండే పెద్దమ్మ మైమరచిపోయింది. ఇంతకాలానికి తాను భర్తను జయించగలిగినందుకు ఆమెకు ఆనందంగావుంది. రెట్టింపు ఉత్సాహంతో పెద్దమ్మ నందో అప్పగించిన కార్యాన్ని పూర్తిచేయడానికి మళ్ళీ కూర్చుంది. లాలే, అతని కోడల్ని చంపడానికి ప్రయోగాన్ని సిద్ధంచేసింది. వర్మ దంపతుల మధ్య అంతః కలహం రేపడానికి ముళ్ళపంది ముల్లు తీసింది. తన భర్త ద్వారకాదాసు సాయంత్రం లాలా జానకీశరణ్ యింటికి వెళ్ళారన్న క్రోధంతో జానకీశరణ్ యింట్లో వారంతా రకరకాల వ్యాధులతో బాధపడడానికి గాను వాళ్ళ గుమ్మంలో వ్రేలాడదీయడానికి సన్నాహాలు చేయసాగింది. సాయంత్రం సజ్జన్ చేసిన దుస్సాహసానికి అతణ్ణి గూడ శిక్షించాలన్న రోషంతో అతని బొమ్మకూడ తయారుచేసింది. ఇప్పుడు ఆమె చాలా హుషారుగావుంది.

ఏ వస్తువును ఎక్కడ వుండాలి, ఎలా ఎప్పుడు వుండాలి అన్ని వివరాలు నందోకు తెలియజెప్పి స్నానంచేసి చీర వుతుక్కుని ఆరేసుకుంది. తతంగం అంతా పూర్తయి మేను వాల్చేటప్పటికి కొత్వాల్ గడియారంలో పన్నెండు కొట్టారు.

గంట గంటన్నర విశ్రమించిందో లేదో పిల్లుల పోట్లాటతో పెద్దమ్మకు నిద్రాభంగమైనది. కటిక చీకటిలోంచి నాలుగుకళ్లు మెరుస్తూ కన్పించాయి. భయంవేసింది. రెండూ ఒకదానిపై ఒకటి హూంకరిస్తున్నాయి. పౌరుషంతో అగ్నిశిఖల్లాగ ఒకదానిపై ఒకటి లంఘించాయి. మంత్రతంత్రాలు చేసే పెద్దమ్మ కళ్లముందు భయం తాండవం చేయ నారంభించింది. భీతితో నిండిన ఆమె కళ్లకు పిల్లులు కూడా ఆమె హృదయం ఎగనిపడుతున్నట్టుగా తమ ఆకారాల్ని పెంచుతూ తగ్గించుతూన్నట్లు అనిపిస్తోంది. పోట్లాడుతున్న పిల్లులు ఆమెవైపు నోరు తిప్పినప్పుడల్లా వాటి కళ్ల మెరువు మంత్రించిన సూదుల్లా ఆమె గుండెలోకి దూసుకొని పోతున్నాయి. వృద్ధాప్యంలో చల్లబడిన ఆమె శరీరంలోని రక్తం భయంతో గడ్డకట్టుకపోయింది. నరనరాల్లోని ఉష్ణం అంతా ఆమె గొంతుకలో కూడి ఎక్కిళ్ళు పెట్టసాగింది. ఆ పిల్లులు రెండూ పరస్పరం చీల్చి చండాడమన్న రోషంలో ఒకదానితో ఒకటి కలియబడుతున్నాయి. పెద్దమ్మ కళ్ళకు ఏవో భయంకర క్రూర మృగాలు స్వైరవిహారం చేస్తున్నట్లు కనిపించాయి. అవి రెండూ పెద్దమ్మ మంచం దగ్గర కొచ్చేశాయి. ఘుర్ ఘుర్ మంటూ అవి హూంకరిస్తోంటే పెద్దమ్మ గొంతు తడి ఆరిపోయింది. మాటలు పెకిలి రావటంలేదు. పొడిపొడిగా అస్పష్టమైన శబ్దాలు మాత్రమే బైటపడుతున్నాయి. ఆత్మరక్షణ భావం కల్గినంతనే అచేతనమైన ఆమె శరీరంలో అకస్మాత్తుగా కదలిక ప్రారంభమైంది. దిండు ఎత్తి బలంగా వాటిపై గిరాటువేసింది. పిల్లిని చంపినపాపం కాశీకి వెళ్ళినా పోదనే విషయాన్ని ఆవేశంలో పెద్దమ్మ మరిచిపోయింది.

పరిసరాలను సైతం మరచి తన్మయత్వంలో ఒకదానితో ఒకటి యుద్ధం చేస్తోన్న ఆ రసవత్తర ఘట్టంలో పెద్దమ్మ కలుగచేసుకోవడంతో, అవి బెదిరి, చెదరి పోయాయి. ముంగిలివైపు పరుగెత్తాయి. పెద్దమ్మలో చురుకుదనం

వచ్చింది. మంచానికి రెండోవైపు వుంచిన దుడ్డుకర్రను చివాలున చేతిలోకి తీసుకుంది. లోపల్నుంచి వెల్లువలా ప్రవహిస్తోన్న తిట్ల తాకిడికి ఒడ్డు మాదిరిగా వున్న రెండు దవడల క్షణ క్షణానికి సంకోచ వ్యాకోచాలు కొనసాగాయి. ఆ పిల్లుల మధ్య ఆమె కూడ మూడో పిల్లి మాదిరిగా రంగంలోకి దుమికింది. పెద్దమ్మను చూడగానే ఒకటి పరారైపోయింది. రెండోది ఖంగారులో వంటింట్లోకి చొరబడి అక్కణ్ణుంచి మెట్లవైపుకు పరుగెత్తింది. పెద్దమ్మ కూడ మెట్లవైపుకు కదిలి చరచరా మెట్లెక్కేసి పైకి వెళ్ళింది. ఎముకలు కొరుకుతున్న ఆ చలి రాత్రిలో పిట్టగోడలపై పరుగెత్తుతున్న ఆ రెండు నీడలు వాటి వెనుక దుడ్డు కర్రతో కదం త్రొక్కుతున్న పెద్దమ్మ ఆకారం చూసి, నిద్దరోతున్న దారా యాదత్తూ ఏదో పీడ కలవచ్చి గలుక్కున లేచినట్లయింది. కంబళి వెచ్చదనంలో మైమరచి నిద్రపోతోన్న వ్యక్తి వొంటిమీద నుండి ఆ చలిలో ఎవరో కంబళి లాగేస్తే ఒక్కసారిగా మెలుకువతో లేచికూర్చున్నట్లు ఆ ప్రశాంత రాత్రి హఠాత్తుగా ఆ గొడవకు చిరాకు పడింది.

పిల్లుల్ని తరిమేసి పెద్దమ్మ తనలో తాను సణుక్కుంటూ మెట్లగదికి గొళ్లెం పెట్టింది. పెద్దతనం వచ్చిందేమో పిల్లి ముండల వెంబడి పరుగెత్తగానే ఆమెకు ఆయాసం వచ్చింది. వుస్సురుమంటూ నడవాలోకి వచ్చింది. నడవా చీకటిలో ఆమె కాలికి ఏదో మెత్తని పదార్థం తగిలినట్లయింది. ఏదో జిగురు పదార్థం ఆమె కాలికి అంటుకున్నట్లనిపించింది. ఏ అంటరాని వస్తువో కాలికి తగిలి తన మడి అంతా మంటకలిసి పోయినట్లుగా అనిపించింది. వికారంతో ఒళ్లంతా జలదరించింది. మనసు ఆదోలా అయిపోయింది. అయినా ఇంత క్రితం జరిగిన సంఘటనవల్ల నిస్త్రాణగా అయిపోయిన ఆమె శరీరం మళ్ళీ కోపాన్ని పెంచుకోలేకపోయింది. నోట్లోంచి తెరలు తెరలుగా ప్రభంజనంలా రావాలనుకొన్న మాటలు ఎందుకో ఉస్సుమని నిశ్వాసం గాలిలో కలిసి, చడీచప్పుడూ లేకుండా జారిపోయాయి. అలసట ఆమె వాగ్ధాటికి ఆనకట్ట కట్టేసింది. ఏదో తప్పు చేశాననుకుంది. ఈ నెత్తురు కందుకోసమే కావచ్చు ఇంతసేపూ పోట్లాడుకు చచ్చాయని అనుమానంతో అరిపాదం ఎత్తి మడమమీద నిలిచి, మంచంమీద

కాళ్ళ వద్ద ఉన్న లాంతరు దగ్గరకు వెళ్ళింది. లాంతరు వెలిగించి మళ్ళీ అలాగే నడుస్తూ వచ్చింది. కాలికి మెత్తగా తగిలిన చోట దీపం వెల్తురులో చూస్తే అప్పుడే ఈనిన పిల్లిపిల్ల కనిపించింది. ఆ పిల్ల చచ్చిపడివుంది. తల ఎవరో కొరికేసి నట్లుంది. ఎప్పుడూ ఇంట్లో తిరగాడుతున్న పిల్లి ఈ మధ్యనే గర్భవతి అయిందన్న విషయం జ్ఞాపకం వచ్చిందామెకు. దావండి ముండల్లారా అని ఒక్క తిట్టు తిట్టేసి వూరుకుంది పెద్దమ్మ. బహుశా గండుపిల్లి కొరికేసింది గాబోలు. ఇంతకు ముందు హోరాహోరీసీ ఆ రెండు పిల్లులూ పోట్లాడుకోవ డానికి ఇదే కారణం అయివుండొచ్చు.

మడిమల మీద నడుచుకుంటూ అలాగే తూము దగ్గరకు వెళ్ళింది. శుభ్రంగా కాళ్ళూ చేతులూ కడుక్కుంది. లాంతరు చేతిలోకి తీసుకుని పూజా మందిరంలోకి వెళ్ళింది. అటక మీద నుంచి చిరిగిపోయిన ఓ పాత విసనకర్ర బయటికి లాగి, ఆ చచ్చినదాన్ని దాని మీదకు పుల్లతో నెట్టి, వీధిలో పారేద్దామని గుమ్మం వైపుకు వెళ్ళింది. అలా వెళ్ళుతుండగానే అకస్మాత్తుగా ఆమెకు ఓ ఆలోచన తట్టింది. మెట్ల కిందుగా గోడలో అమర్చివున్న పొయ్యి దగ్గర కెళ్ళింది. మంత్ర తంత్రాల సరంజామా వుంచిన పెట్టెలోంచి కొంచెం సింధూరం, నువ్వులూ తీసుకుంది. వాతజడికోసం తాను వాడుతుండే పిండి దబ్బాలోంచి కొంచెం పిండి తీసుకుని దీపాన్ని చేసింది. సింధూరం, నువ్వులు చల్లిన ఆ పిల్లి పిల్లను పాత విసనకర్రమీద వెలిగించిన దీపంతోసహా తార యింటి ముందు వుంచి వచ్చింది. "దొంగముండ! ఎప్పుడూ బానపొట్టేసుకుని తిరుగుతుంటుంది. ఈ దెబ్బతో ఉన్నది వున్నట్టుగా నెత్తురు కక్కుకుని చస్తుందిలే' అనుకుంది పెద్దమ్మ.

దీనివల్ల పెద్దమ్మకు రెండు పనులుపూర్తిచేసిన తృప్తి కలిగింది. ఒకటి, చచ్చిన పిల్లి పిల్లను బయట పారేయడం, రెండోపె ఆమె దృష్టిలో దాన్ని చక్కగా వినియోగించుకోవడం-యీ రెండూ జరిగినట్టయ్యాయి.

ఆ తర్వాత నడవా అంతా కడగడం మొదలెట్టింది. మంచం కింద చీపురుతో కడగబోతోంటే ఏదో బరువుగా తగిలినట్టనిపించింది. తొంగిచూసే

సరికి అప్పుడే పుట్టిన మూడు పిల్లి పిల్లలు ఒకదాని కొకటి అతుక్కుని ముద్దలా పడివున్నాయి. పెద్దమ్మకు చెప్పరాని కోపం వచ్చింది. "అందరు నా పుండుమీదే కారం చల్లుతారు దీని పీడ విరగడైపోను. దీని ఏడు తరాలూ వంశ నాశనం కాను ఊరంతా తిరిగి ఈ ముంద నా ఇంట్లో పడేసి పోయింది. దీని ఒంట్లో పురుగులు పడ. అసలే చలికి చస్తోంటే ఎంత పని పెట్టింది కని ముంద". అని తిట్టుకుంటూ చీపురుతో బలంగా నెట్టింది. వాటిని బయటికి ఎలా తీసుకెళ్ళడమా అని ఆలోచిస్తుంతగా ఇంట్లో కొయ్యపాత్ర వున్న సంగతి గుర్తొచ్చింది. వినకర్ర ఎలాగు నష్టమైంది. ఇదిగూడ పారెయ్యాలి. చీరె తడిపి ఆరేయక తప్పదు...ఖర్మ అనుకుంటూ ఆ మూడింటిని తన ఒళ్లో వేసుకుంది. చెమ్మ తలిగిన చేతులు తగలగానే పిల్లలకు కంపరం పుట్టుకొచ్చింది. చలికి ముడుచుకున్న ఆ మూడు ముడేసిన మూటలాగా ఆమె పొట్టకు కరుచుకున్నయ్. ఇంకా కళ్లు తెరవని ఆ మూడు జీవాలూ ఆమె పొట్టకు వెచ్చగా అతుక్కుపోయాయ్. వాటిని తీసుకుని పెద్దమ్మ గుమ్మం వద్దకు వెళ్ళింది ఒకప్పుడు ఈ ఒళ్ళోనే ముని ముని నవ్వులు వెదజల్లిన తన ముద్దుల కూతురు అమాంతంగా జ్ఞప్తికి వచ్చింది పెద్దమ్మకు. ఆమె కాళ్లు ముందుకు సాగలేదు. మళ్ళీ గుండె గట్టి చేసుకుని మూసివున్న తలుపుల వరకు వచ్చింది మాటిమాటికి ఆమె ముద్దుల కూతురే గుర్తొస్తోంది.

అంతే, పెద్దమ్మ మూసిన తలుపుల్ని తెరవనేలేదు.

x x x

ఇంకా పూర్తిగా పొద్దు పొడవలేదు. అక్కడక్కడ చీకటి తెరలు పల్చ పల్చగా వున్నాయి. పూజ సామగ్రి తీసుకుని లాల్‌దలాల్ భార్య గోమతి కెళ్ళి స్నానం చేద్దామని బయలుదేరింది. తలుపు తీయగానే మసక పొద్దులో గుమ్మానికి రెండు వైపులా ఏవో వున్నట్టుగా కనపడింది బయటకు వేయబోయిన కాలుని చటుక్కున లోపలికి లాక్కుని, వెనక్కు వెళ్ళి, గుమ్మంలోవున్న దీపం వేసింది కరెంటు బల్బు కాంతిలో రెండు బొమ్మలు స్పష్టంగా కనిపించాయి. ఎవరో చాతబడి చేయుదా కి ఇవి పెట్టి వుంటారేమోనన్న ఆలోచన రాగానే రెచ్చిపోయి, పెదాద .

-"అయ్యో బాబోయ్ ఎవరో గిట్టని ముండాకొడుకులు మమ్మల్ని చంపాలని ఇవన్నీ పెట్టారర్రా" అని గుండె బాదుకుంటూ "ఓసే కోడళ్ళూ రాండే'' అని గట్టిగాపిలిచింది.

''ఎవరే అక్కడ పిలుస్తూంట'' అంటూ వణుకుతూన్న ఓ ముసలి కంఠం దగ్గు తెరను సంభాళించుకుంటూ పలికింది.

''ఇక్కడకురా. కొంప మునిగింది'' అంటూ పెదబొబ్బలుపెడ తూలాలే భార్య నాలుగు మణుగుల నాజూకు దేహంలో పైకి వులుకుతున్న ఎగశ్వాసల్ని ఆపుదుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ, మధ్య మధ్యలో మాటల్ని గొంతులోనే సగానికి దిగమింగుతూ. తడబడ్తోన్న కంఠంతో దేవుళ్ళను, స్మరించుకుంది-" "ఓ సత్యనారాయణ స్వామీ నీ కాళ్ళు మొక్కుతాను. నీ వ్రతం చేసుకొంటా నయ్యా. ఆంజనేయస్వామీ, నీ పేరున రేపు శనివారం ఆకుపూజ చేయిస్తా. ఓ పోలేరమ్మ తల్లీ, మమ్మల్ని ఈ ఆపద నుంచి కాపాడమ్మా నీ మేలు ఎప్పుడూ మరవను.''

ఏమయిందీ అంటూ పక్కవాటాలో వుంటున్న ముసలామె వచ్చింది శీతాకాలం చలికి ఆమె గజ గజ వణికిపోతోంది.

"చూడవ్వాః అలా చూడు. ఎవరో గొర్రాలు ముండ మన గుమ్మం కాడ ఆవేవో బొమ్మలు పెట్టిందే. ఎవరు పెట్టారో వాళ్ళకే తగలాలి. ఇదంతా ఆ నందో ముండ పనేనే,అదే ఆ పెద్దమ్మతో ఇదంతా ప్రయోగం చేయించిందే'' లాలే భార్య రొప్పుతూ ఆయాసపడుతూ కడుపుగోనిదంతా బయట పెట్టేసింది.

"ఆ రాక్షసి ముండ యింటిమీదపిడుగు పడిదావ:దాని బ్రతుకంతా ఇలాటి పాడుపన్లోనే తెల్లారేట్టుంది" అని తలుపుకు కరుచుకుని, చెంగు ముక్కుకు అడ్డంగా పెట్టుకుంటూ ముసలామె కోపాన్ని వెళ్ళగక్కింది.

"అవ్వా కాస్త దాన్ని తీసేసి ఏదైనా వీధిలో వేసిరావే. గోమతి కెళ్ల డానికి నా కాలస్యం అవుతోంది".

అసలే ముసలితనం దానికితోడు ఎముకలు కొరుక్కుతినే చలిలో వణుకుతున్న అవ్వకు ఆవిడన్న మాటతో భయం ముంచుకొచ్చింది. ఆమె వైపు చూస్తూ మెల్లిగా అంది- "పాకీవాడొస్తాడుగా, ఈలోగా ఏదైనా ఆవో దూడో వచ్చి అవికాస్తా తినిపోతే గొడవేలేదు". అవ్వ ఇక అక్కడ వుంటే తన మీద మరే బాధ్యత వచ్చి పడుతుందోనని మెల్లిగా తలుపు వెనక్కి నక్కింది.

అవ్వ మాటలు వింటోంటే లాలే భార్యకి అరికాలు మంట నెత్తికొచ్చింది "కాటికి కాళ్ళు చాపుక్కూర్చుంది. ఇవ్వాళ చస్తే రేపటికి రెండు. ప్రాణం అంటే ఎంత తీపి దీనికి" అని మండిపడింది.

లాలే భార్య విసురు విని కూడా అవ్వ చలించలేదు. చివరకి ముసలామెను ఉద్దేశిస్తూ ప్రాధేయపడుతున్న స్వరంతో మళ్ళీ అంది- "ముసలివాళ్లకు దాత బడులు యేమీ పనిచేయవు... నువ్వే ఎత్తిపారేయ్, నాకు స్నానానికి ఆలశ్యమై పోతోంది".

మేడమీదకు సంతో వచ్చి నిలబడింది. "అమ్మా, నేను రానా" అని అడిగింది.

"నువ్వొచ్చి యేం యెలగబెట్తావ్. నండో ముండ ఇదంతా చేసింరే. రాత్రికి రాత్రే దీని అయ్య చచ్చిపోను. దీని కుటుంబం సర్వనాశనమైపోను. అయ్యో రామచంద్రా. నాకు అలస్యమై పోతూందే. చుట్టు పక్కలవాళ్లు అపదల్లో ఆదుకుంటారంటారు ఒక్కరకు పనికొస్తారని ఇళ్ళు అద్దెకు ఇస్తాం. అక్కరకురాని అద్దెల్లెందుకంట? అవ్వా ఇవ్వాళే మా యిల్లు ఖాళీచెయ్" అనితన అసమర్థతా అక్కసూ అంతా ఆ ముసలి అవ్వమీద కక్కేసింది శ్రీమతి లాలే

ఆమె కేకలకు వృచ్చి రగ్గుల వెచ్చదనంలో నిద్రపోతోన్న ఇరుగూ పొరుగూ త్రుళ్లిపడ్డారు రెండో అంతస్తులోంచి ఆమె భర్తా, కూతురూ, మూడో అంతస్తులోంచి కొడుకూ కళ్ళునలుముకుంటూ ఏమైంది ఏమైంది అని అన్నారే కాని ఒక్కరూ మేడ దిగిరాలేదు. లాలే భార్య ధుమధుమ లాడుతూ మళ్ళీ గుమ్మం దగ్గరకొచ్చింది.

సందులోకి ఎండపొడ వచ్చింది. ముడుచుకుని నిద్దరోతూన్న సందంతా పొద్దుతిరుగుడి పువ్వులా వికసించ సాగింది. ఒక్కొక్క యింటి తలుపులూ తెరుచు కుంటున్నయ్. ఇరుగు పొరుగు అమ్మలక్కలు ఒకరి తర్వాత ఒకరు లాలే భార్యను విషయం ఏమిటో అడిగి తెలుసుకుని శాపనార్థంతో, తిట్లతో తిరిగి ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లిపోతున్నారు. అంతలోకి లాలే, సంతో, శంభూ అంతా మేడ దిగొచ్చారు. గుమ్మం దగ్గరకొంతమంది మగవాళ్ళు చేరారు. వాళ్ళు కూడా ఈ విషయాన్నే తర్కించుకుంటున్నారు. కాలం ఎలామారి పోయింది అని వేదాంతం కబుర్లలో మునిగి పోతున్నారు. రామలోచన్ వంటవాడు "చాయ్ గరమ్- బిస్కట్ నరమ్" (వేడి తేనీరు-మెత్తని బిస్కట్టు) అని అరుస్తూన్నారు. సందులో బైరాగి తంబూర మీటుతూ గురువు మహత్యం గురించి గొంతు చించుకొని పాడుతున్నారు. సందు మొగల్లో రోజూమాదిరిగా పిల్లలు పెద్దమ్మా పెద్దమ్మా... భూతాల పెద్దమ్మా అంటూ గోల చేస్తున్నారు. ఎండెక్కుతోంది. కాని పాకీవాడు వచ్చే లక్షణాలు ఇంతవరకు కనపడటంలేదు. శంభూ ఎదురింటి భోలాతోనూ, ఎదురింటిభోలా పక్కింటి శ్రీ వచన్‌తోనూ, పాకీవాడు వచ్చి రావడంతో వాణ్ణివాళ్ల యింటికి పంపించాల్సిందిగా అంచెలంచెలుగా వర్తమానాలు చేసేశారు. ఆ వీధిన నడిచే వాళ్లందరూ ఈసంగతే చర్చించు కుంటున్నారు. లాలే దలాల్ గుమ్మంలో ఎవరో బొమ్మలు వుంచారని, అంత చిన్న సందులో కూడ నలుగురైదుగురు చేరి ఓ పెద్ద గుంపు గుమిగూడినట్లుగా, కనబడుతూ గుమ్మాన్ని ఏవో రెండు శవాలు కాపలా కాస్తున్నట్లుగా, చూస్తున్నారు. చర్చలు సాగుతూనే వున్నాయి. అంతలో అందరు నిరీక్షిస్తూన్న పాకీవాడు వచ్చాడు.

బొమ్మల్ని తొలగించగానే ఒక బొక్కెన నీళ్ళు లోపల్నుంచి తెచ్చి గుమ్మం మీద కుమ్మరించింది శ్రీమతి లాలే. ఇక ఫిరంగిలోంచి వదలిన గుండులా బయటికి వచ్చింది.

నందో యింట్లో ఆమె తండ్రి భభూతీ మట్టి అంటుకున్న చేతుల్ని కొళాయి క్రిందపెట్టి కడుగుతున్నాడు మనియా పెద్దకొడుకు పైన కటకటాలున్నచోట జిలేబీ తినిపించవే అని వాడి నాయనమ్మ కొంగు పట్టుకొని

ఫదలనవి మారాం చేస్తున్నాడు జ్వరంతగ్గనియ్ నాయనా నీకు పెడతానురా, చెప్పినమాట విని నువ్వు మంచంమీద మెదలకుండా పడుకుంటే కాని జ్వరం తగ్గదురా: అని నచ్చచెబుతోంది మనుమడికి. గదిలో పెద్దకోడలు పక్కమీద పడుకొని, చిన్నపిల్లను ఆడిస్తోంది. కాలువని తలవరకు తొలగించి ఎడమచేత్తో సిగరెట్టు దమ్ము లాగుతూ పిల్లదానిని నవ్విస్తున్నాడు మనియా. ఆపాప అటూ యిటూ మెద తిప్పుతూ నవ్వుతోంటే దాని బోసినోరు ముచ్చటకల్గిస్తోంది. దాని ఒళ్ళు కదులుతుంటే కాళ్ళ మువ్వలూ చేతి బంగారు కంకణాలకు అతికిన గజ్జెలు ఘల్లుమంటున్నాయి. కూతురిచేష్టలు చూసి తెగ మురిసిపోతోంది పెద్దకోడలు. ఇక శంకర్ గదిలో ఇంకా పొద్దుపొడవలేదు. కప్పుకున్న వున్నిరగ్గుల వెచ్చదనాన్ని ఎవ్వరూ ఒదులుకోవడానికి ఇష్టంలేనట్లుగా వుంది. నందో గోమతి నుంచి స్నానంచేసి ఇంటికి తిరిగి వచ్చేవేళ దగ్గిరపడింది. పనివాడు మధ్య అంతస్తు తుడవడం ఇంచుమించు పూర్తిచేశాడు.

అలాంటిసమయంలో లాలే భార్య భభూతి యింట్లో ప్రవేశించి ఆటం బాంబులా పేలి ఆ యింటినంతా హిరోషిమాలా మార్చేసింది. కొళాయిదగ్గర కూర్చున్న ఇంటి యజమానిని చూస్తూ చేతులు తిప్పుతూ పెద్దపులిలా మీద పడినంత పనిచేసి "ఎక్కడకు వెళ్ళింది నీ ముద్దులకూతురు...దొంగముండ మా ఇంటిమీద ప్రయోగంచేసి వచ్చింది. మామీద చాతబడెవరైనా చేస్తే చేసినవాళ్ల వంశమే నాశనం అవుతుంది ఆసంగతి తెలుసుకో మేం ఎవరికి ఏం కీడు చేశాం అని పెద్దమ్మ ముందచేత బొమ్మలు చేయించి మా ఇంటిముందు పెడుతుంది? దానియ్ నేనే నిలదీసి అడుగుతాను. నౌకరుతో చేతులుకలిపి ఇంట్లోనే దొంగతనం చేయించిన కంత్రీ అది. అదీ చెప్పినప్రకారం బంగారం ఒడ్డాణం అమ్మిపెట్టలేదని మాయింటిమీదే ప్రయోగంచేస్తుందా. ఇరుగోళ్ల పొరుగోళ్ల దొంగసొమ్ము మేం ఎందుకుంచుకుంటాం. మా యింట్లో అలాటి అలవాట్లులేవు దొంగవేరాలు ఎవరింట్లో చేసే అలవాటుందో వాడి కూతురే మగట్టివదిలేసి నూరుమగాళ్లతో కులుకుతుంది. నంగనాచిముండ, పైకి ఎంతో ర కి నటిసుంద."

ఆటంబాంబు ముందు యజమానురాలి మెషిన్‌గన్ ఏం పనిచేస్తుంది. చెవిలో చెట్లు మొలిచినట్లుగా భభూతి పలకకుండా తొణక్కుండా వేళ్ళు తోముకుంటున్నాడు. మనియం, మనియా భార్య పైఅంతస్తునుండి తొంగిచూస్తున్నారు. తీరా నందో నదినుంచి వొచ్చి రణరంగంలోకి దూకి గాండీవాన్ని సంధించగానే శంకరూ, శంకరు భార్యా గదిలోంచి బయటకొచ్చారు. నందో ఎన్నో బ్రహ్మాస్త్రాలను ఒదిలింది. మధ్యమధ్య యజమానురాలి మెషిన్ తుపాకికూడ చిక్ చిక్ మంటోంది. కాని ఆధునిక శాస్త్రయుగం పాత గాండీవాలను బ్రహ్మాస్త్రాలను నిష్ప్రయోజనం చేసినట్లుగా లాలే భార్య వాళ్ల బాణాలన్నిటినీ తుంచి పారేసింది. నందో వాదించనైతే వాదించిపారేసింది. కాని సత్యం అనే ఆయుధం లేకపోవడంచేత ఆమె వాదనలో బలంలేకపోయింది. లాలే భార్యని మనియా విశ్వాసఘాతుకి అని నిరూపిస్తూ, కోపంతో, ఊగిపోతున్నట్లు మూడో అంతస్తునుండి బరబర దిగివచ్చాడు. పాంటుజేబుల్లో చేతులు పెట్టుకుని తమాషా చూద్దామన్నట్లుగా కిందకువచ్చాడు. ఇద్దరుకోడళ్లు మాత్రం పరస్పరం అంటిపెట్టుకుని పైనేవుండిపోయారు. దిగిరాలేదు. కింద జరిగిన రాద్ధాంతంగురించి సిద్ధాంతరీత్యా వ్యాఖ్యచేస్తున్నారు.

“అమ్మయ్యో, ఈ నందో అమ్మది ఎంత పెద్దగొంతుకరా బాబు పోట్లాడిందంటే ఏడూళ్ళకు వినిపిస్తుంది” అంది చిన్నకోడలు పెద్దకోడలితో

“అదికాదు చెల్లీ. మనకే ఎవరైనా కీడుచేయాలనుకున్నారనుకో, మనకు కోపంరాదూ? ఈనందో కూడ మహా కుటిలంది. ఎవరన్నా దీనికి కుళ్లే. అందరికీ అపకారంచేయడం తప్ప దీనికి మరో పనిలేదు. కుత్సితం ముండ” అని పెద్దకోడలు ఆడబడుచుమీద అక్కసు వెళ్ళగక్కింది.

తమ డాబా పిట్టగోడదాటి మెల్లిగా భభూతి మేడపైకి వచ్చింది తార. చిన్నకోడల్ని. పెద్దకోడల్ని సౌంజ్ఞచేసి పిలిచింది అసలీ యుద్ధమంతాఎందుకు ప్రారంభమైందో తెలుసుకున్న తర్వాత “మాయింటిముందుకూడా పెట్టిపోయింది. పొలవారనే తలుపుతీశాను. చూడగానే గుండె గతుక్కుమంది. పాలవాడు

కూడ ఏవేవో మాటలుచెప్పి భయపెట్టేశాడు" అంటూ తార తన పరిస్థితి సాకల్యంగా చెప్పింది.

"భయపడాల్సిన విషయం వుందోయ్. ఇప్పుడు నీకు ఎనిమిదో నెల నడుస్తోంది. ఇది ..." అని అంటూండగానే తార మధ్యలో అందుకుంది. "మా వారు ఇవన్నీ గుడ్డినమ్మకాలు. మనసులో పెట్టుకోకు," అని చెప్పారు. అవును ఈ ఆధునిక ప్రపంచంలో ఇవన్నీ...అని నేను గూడ అనుకున్నా"

కింద పోట్లాట హద్దుదాటిపోతోంది. ఇద్దరు కోడళ్లూ కిందకు దిగి మాత్రం రాలేదు. కటకటాల దగ్గరకొచ్చి మెడ సాచించి ఎంతో ఆసక్తిగా చూస్తున్నారు. అయితే తార డాబామీదనే కూర్చుండిపోయి కోడళ్ళ మొహాల్ని కుతూహలంతో గమనిస్తోంది.

లాలే భార్య నోటికొచ్చినట్లల్లా వాగుతూ నందో మెడ పట్టుకుంది. నందో తనరెండుచేతుల్నీ లాలేగడ్డంపై ఆదిమిపట్టి, వెనక్కు తోయడానికాయశక్తులా పెనుగులాడుతోంది. లాలే భార్య పట్టుసడలనికారణంగా నందో కీచుకీచుమంటోంది. భటూతి, నందో తల్లి, మనియా, శంకర్ అందరిగొంతులు కలిసిపోయి పెద్ద రభసచేస్తున్నాయి. మనియా సాహసించి ముందుకొచ్చాడు. అతికష్టంమీద తన కోడల్ని విడిపించాడు లాలేభార్య ఆ ప్రయత్నంలో మనియాపై విరుచుకపడింది. చిరెత్తుకొచ్చింది మనియాకు, కొట్టడానికి చేయి ఎత్తాడు. అంతలో భటూతి వెనకనుంచివచ్చి, మనియా మణికట్టును పట్టుకొని, వెనక్కు తోసేశాడు. లాలే భార్యవైపు తిరిగిచేతులు జోడిస్తూ—"అక్కా, పొరపాటయిపోయింది. క్షమించండి....నందో, నువ్విక్కడ్నుంచి ముందు వెళ్ళు. ఒరే మనియా దీన్నిక్కడ్నుంచి తీసుకెళ్ళు. దెయ్యంనోరు మూయమంటేమొయ్యదే... గొంతుచించుకుని ఒకటే అరవడం" అన్నాడు.

లాలే భార్య చివరకు అక్కడనుంచి కదిలివెళ్ళిపోయింది.

కింద జరిగిన వృత్తాంతం వర్ణించడానికి పెద్దకోడలూ చిన్న కోడలూ పైకి వచ్చారు.

ఆ మాటలూ మాటా మాట్లాడినతర్వాత చిన్నకోడలు నందో ప్రసంగం ఎత్తింది. "గొంతు గట్టిగావినికివుంటే బావుండును. నందో పీడ విరగడయ్యేది. ఛస్తే ఎంతహాయిగావుండేదో. పేరుకు చెల్లెలు. అదంటే మావారికి పరమ అసహ్యం. బావగారికూడా నందో అంటే ఇప్పుడు గిట్టడంలేదు.

"ఆ ఒడ్డాణం యేదోదొంగతనం జరిగిందని అంటూవుంది. ఆకథేమిటి" అని తార అడిగింది.

"మా వివాహానికి పూర్వం వీళ్ళింట్లో దొంగతనం జరిగింది. ఇంట్లో పని వాడు దొంగిలించుకుని పోయాడని అత్తగారంది. 'ఇన్నిసంవత్సరాల తర్వాత అసలు రహస్యం బయటపడింది. ఆ దొంగతనంలో నందోకు కూడ పాలుం దన్నమాట'' అని పెద్దకోడలు పాతపురాణం ముక్త సరిగా ముగించింది.

'అంటే ఆ నౌకరుతో ఈమెకు ....?'

తారచూచాయగా వదలిన బాణాన్ని చేతిలో తీసుకుంటూ చిన్న కోడలు చెప్పింది. "వుండొచ్చు. మొగుణ్ని ఒదిలేసి ఇంట్లోనే దొంగతనం చేయించ గలిగిన ఆడది ఏమైనా చేయగలదు''

''ఇంతవరకు నేనామెను అర్థంచేసుకోలేకపోయాను. మగాళ్ళంటే ఈమె ద్వేషిస్తుంటుంది. నాకు బాగా అనుభవం. మాస్కూల్లో ఓ పంతులమ్మవుండేది. అది గూడా అచ్చంగా నందోలావుండేది తలవూపుతూ పెద్దకోడలు తన అనుభవాన్ని చెప్పింది.

రెండో అంతస్తులో మళ్ళీ గలభా ప్రారంభమయింది. ఆరుసంవత్సరాల క్రితం దొంగతనం తమయింట్లో జరిగి ఎన్నోనగలు పోయి నష్టపడిన విషయం నందో తల్లిగుండెపై కుంపటి మళ్ళీ రాజేసింది. మమకారంకూడా ఆ వేడిని చల్లార్చలేకపోయింది. డబ్బుపోయిందనేది ఒకపక్కా, అందరిలో నందోచేసిన పనివల్ల జరిగిన అవమానం మరోపక్కా ఈ రెండూ మనియాకోపాన్ని రెట్టింపు చేశాయి. శంకరకూడ నందోను వెనకేసుకురావడంలేదు. కుటుంబంలోని ప్రతివ్యక్తితో నందో ఒంటరిగానే పోట్లాడుతోంది.

అంతలో డాబామీద మిస్టర్ వర్మ కనిపించాడు. ముసుగును ముఖం మీదకు లాక్కొని పెద్దకోడలు పక్కకు తప్పుకుంది. డాబామీద నుండి కన పడుతోన్న సజ్జన్ రూమ్‌లవైపు వేలుపెట్టి చూపుతూ, చిన్నకోడలు "అక్కా అక్కా అటుచూడు. వాళ్ళింటిముందు కూడ బొమ్మ పెట్టారు" అంటోంది.

అది చూసి పెద్దకోడలు ఆశ్చర్యపోయింది. గడ్డంమీద చెయ్యి ఆన్చి "హారిరంగా! ఇది అందరినీ మింగేటట్లుగా వుందే" అంటూ ఎక్కడలేని ఆశ్చర్యాన్నీ ప్రకటించింది.

## 5

కొమ్మలనిండా చిక్కుకుపోయిన గాలిపటాలతో, సాలెగూళ్ళతో, పక్షుల కిలకిలారావాలతో ఆకుల సందుల్లోంచీ, కొమ్మల మధ్యనుంచీ గుత్తులు గుత్తులుగా కనిపించే గింజలతో ఎడతెరిపిలేకుండ ఎక్కిదిగే ఉడుతలతో నిలకడ లేని జీవితనదిలా చైతన్యం పరవళ్ళుతొక్కుతోన్న ఈ రావిచెట్టు ఎన్నోతరాల నుండి ఆ వీధికి నేస్తంగా వుంటోంది. ఈ బజారులో కనిపించే ఎంతోమంది వయసులో వున్నవారూ, ముసలాళ్ళూ ఎప్పుడో ఒకప్పుడు ఈ గంగే భూరియా రావిచెట్టుకింద బాల్యంలో కనీసం కొన్ని క్షణాలైనా గడిపినవారే. చెట్టు మాత్రం గంగే భూరియాకు జ్ఞాపకచిహ్నంగా అలాగేవుంది కాని దాని పక్కనే వున్న గోడమాత్రం యిన్సూరెన్సు యేజంటైన బాలూఛేవాలాల్ సొంతమై ఎప్పుడో హక్కుభుక్తమైపోయింది. మునిసిపల్ రిజిస్టర్‌ప్రకారం ఆయన ఇంటి నెంబరు. 420 ఆయన కీర్తికి తగ్గట్టూ ఇంటినెంబరు గూడ దొరికింది. చెట్టుకు మూడువైపులూ రాజవారి పూర్వీకులొకాయన పక్కా అరుగు కట్టించి రాతి మండపంలో వీరాంజనేయస్వామి వారి విగ్రహాన్ని ప్రతిష్ఠచేయించారు. గంగ సింధూరం పులుముకున్న హనుమాన్ దేహాన్ని వెండిరేకుల్తో బంగారురేకుల్తో ఆయన భక్తగణం అలంకరించింది. సందుమొగలో అడుగుపెట్టగానే ప్రతివ్యక్తి దృష్టి ముందు ఈ గంగసింధూరం మూర్తిమీదే లగ్నమౌతుంది. కర్రితో

తరుముకుంటూ ఆ బజారువెంట తిరిగే గడ్డోళ్ళకు సరైనమార్గాన్ని చెబుతుంది ఆ అరుగు.

మండపానికి కుడివైపు లోపలికి ఓసందు పోతుంది. దాని మొగలోనే ఈ అరుగుంది. అది ఆ బజారువాళ్ళకు గ్రామకచేరీలా వుంటుంది. దానికి ముందో ఓ చిన్న ఎత్తైన దిబ్బవుంది. అందుచేత అక్కడ ఎందభయం వుండదు. రెండు మూడు హుక్కాగొట్టాలు, వేపపుల్లలు, ఒకటో రెండో వార్తా పత్రికలు, కూరగాయలు పచ్చగంపలు, [1]కుల్ఫీ, జిలేబి, [2]సుహాల్, [3]అందరసే, [4]గజక్, లౌజుబీడీలు, నువ్వులుండలు, వేరుశనక్కాయలు వేయించి అమ్మేబండ్లు ఇవన్నీ ఆ అరుగుపై వాటివాటి టైమ్‌టేబల్ ప్రకారం ప్రత్యక్షమౌతూ మాయ మౌతుంటాయి.

మండపానికి ఎడంవైపు ఎదురుగావున్న సందలోకి ప్రవేశించగానే తేనె పట్టు కనపడుతుంది. దానికి దరిదాపునే గోశాలగేటు వుంది. ఈవైపు అరుగు సాధారణంగా ఖాళీగా పడివుంటుంది. ఒక్క మంగళవారం మాత్రమే అక్కడ హడావుడి. మంగళవారంనాడు బసంతూ తోటమాలి పూలహారాలూ, [5]బతాషాలు శనగపిండితో చేసినలడ్లూ చిన్న చిన్న పాల కోవాబిళ్ళలు పెట్టకొని కూర్చుం టాడు. కొన్ని సంవత్సరాలనుండి ఒక మునలి సింధీవ్యక్తి కూడా ఏవేవో చిల్లర దినుసుల్తో అంగడి పెట్టుకుని కూర్చుంటున్నాడు. రావిచెట్టు కింద మండ పంలో గదాధారి అయిన ఒకటిన్నర అడుగుల ఎత్తు ఆంజనేయస్వామి చూపే మహిమలు ఆవీధిలో వారందరికి బాగా తెలిసినవే.

ఉదయం తొమ్మిదిన్నరైంది. ఆంజనేయస్వామి మండపానికి కొంచెం పక్కగా జరిగి సూర్యుడు తన ప్రభలను వెదజల్లుతున్నాడు. అరుగుమీద గోనె పట్టా పరచివుంది. పట్టామీద ఆసనం జమాయించి హుక్కా గుడగుడమని

(1) చేళవాళి ఐస్‌క్రీమ్. (2) మైదాపిండిలో నెయ్యి కొద్దిగా కలిపి తయారుచేయు కారా. (3) ఒరకం మిఠాయి. (4) కారం, మసాలా కలిపి తయారుచేసి నిషాతో తినే వస్తువు. (5) చక్కెర బిళ్ళలూ, చిలకలూ.

తాగుతున్నాడు లాలా ముకుందీమల్. పైజామా, కోటూ వేసుకునివున్నాడు. తలను చెంపల్ని మూస్తున్నట్లు వుంది టోపి. రోల్డు గోల్డు రిమ్ముల లావుపాటి కళ్ళద్దాలు ముఖంలో మెరుస్తోంది. చేతికి నీలం పొదిగిన వెండివుంగరం వుంది. భుజాలమీద మఫ్లరువుంది. కాళ్ళకు మేజోళ్ళున్నాయి. చలినుంచి శరీరాన్ని కాపాడుకోవడానికి కావలసిన అన్నిహంగులూ వున్నాయి హుక్కా తాగుతూ, మధ్య మధ్య ముకుందీమల్ ఖంగుఖంగుమని దగ్గుతున్నాడు. అరుగు పక్కగానే కూర్చీవేసుకుని సెక్రిటేరియట్‌లో సూపర్నెంటు బాబూ గులాబ్‌చంద్ కూర్చున్నాడు. అతనికి దగ్గరగా అరుగుమీదనే బాబారాం స్వరూప్ పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు. ఆంజనేయస్వామి మందపానికి ఆనుకొని వెన్నపూస భగవాన్ దీన్ కూర్చుని వెన్నపూస తూస్తున్నాడు. లాలా ముకుందీమల్ ఇంట్లోంచి వచ్చిన పళ్ళెంలో పావుసేరుచొప్పున ఏడు గిన్నెలు పెట్టాడు. ఎనిమిదో గిన్నె ఇంకా త్రాసులోనేవుంది.

లాలాముకుందీమల్ కళ్ళన్నీ భగవాన్‌దాస్ త్రాసుపైనే వున్నాయ్. గిన్నెలోంచి ఒక చమ్చా వెన్న తీసి, కుండలో వేయబోతూంటే "ఏమిటి! ఒక్క చంచావెన్నకూడా కక్కుర్తిపడ్డావేమిటి! లాభానికూడా అంతుండాలి. వెయ్ గిన్నెలో" అని ముకుందీమల్ అన్నాడు.

భగవాన్‌దీన్ ముకుందీ మాటలకు నవ్వుతూ చంచా వెన్న మళ్ళీగిన్నెలో వేస్తూ అన్నాడు—"బాగుంది మాకు ఒక్క చంచాయేగా లాభందొరికేది పెద్ద పెద్ద పాములన్నీ మింగే మీలాంటివారికి ..." అంటూ పూర్తిచేయకముందే కోపంతో ముకుందీమల్ "చాల్లే నీ సంజాయిషీ. గాంధీగారు స్వాతంత్ర్యం యిచ్చింది యిందుకేనేమిటి పైకులాలవాళ్ళు మొదలుకొని సన్నాసోళ్ళవరకు కదిలిస్తే చాలు కొండచాంతాడంత నాలుక విప్పుతాయి. లాభంతీసుకోద్దనలేదు కానీ అది ఖాతాదారులకు మరీ కష్టంగా వుండకూడదు" అన్నాడు.

అంతలో లాలేదలాల్ పల్చని రజాయీ కప్పుకుని సందులోంచి వచ్చాడు. అరుగుమీద కూర్చున్న ముగ్గురు వ్యక్తుల్ని చూసి 'జై రాంజీకి' అని నమస్కారం చేశాడు.

"మీ ఇంటిదగ్గర పొద్దున్నే ఏదో యుద్ధకాండ జరిగినట్లుంది" అని వచ్చీ రావడంతోనే గులాబ్‌చంద్ లాలేదలాల్‌ను ప్రశ్నించాడు.

"పెద్దమ్మ ఏదో చిల్లంగి చేసిందట. నిజమేనా" అని రాంస్వరూప్ అడిగాడు.

"ఏం చెప్పేదిరా. ప్రతివీధిలో వుండే గొడవలేగా. వెయ్యి పర్యాయాలు చెప్పాను" నీచజాతివాళ్ళ నోట్లో నోరుపెట్టకండే అంటే వింటారా. నాలుగురాళ్ళు సంపాదించినంతమాత్రాన ఉచ్ఛస్థితివాడు ఎలా అవుతాడు. ఏరా ముకుందీమల్, నేను చెప్పేది నిజమూకాదా?" అని లాలేదలాల్ అతని ముఖంలోకి చూశాడు.

సరిగ్గా అప్పుడే ఛేదాలాల్ ఎక్కణ్నుంచో హఠాత్తుగా వూడిపడ్డాడు. "ఏమోయ్ గులాబ్‌చంద్, అది విన్నావా" అని అడిగాడు.

ఆ ప్రసంగం అంతటితో ఆగిపోయి వేరేవిషయంవైపు మళ్ళింది. గులాబ్‌చంద్ కుర్చీమీద చేతిని ఆనించి నిలబడే అన్నాడు — "ఇవ్వాళ ఉదయాన కంపెనీ బాగ్‌లేదూ, అక్కడ ఎవరో పసిపిల్లాడి శవం దొరికిందట...."

"శవమా"! ముకుందీమల్ ఆసక్తిని కనబరుస్తూ అన్నాడు. అందరూ ఏ రహస్యం బయటపడుతుందోనని చెవులు నిక్కపెట్టి వింటున్నారు. ప్రశ్నార్థకంగా తనవైపు చూస్తోన్న అందరి ముఖాలూ ఒకసారి చూసి ఛేదిలాల్ ఇలా ప్రారంభించాడు— అరె, మీకు యింకా తెలీదన్నమాట. పొద్దున్నే ఎంతమంది చేరారని. అప్పుడే పుట్టిన పసికందు శవమయ్యా అది. మాస్టరు జగదంబా సహాయ్ అతని అన్నకొడుకు పెళ్ళాం. విధవరాలు లేదూ—వాళ్ళిద్దరూ దొరికిపోయారు.

"ఎవరూ, మన జగదంబా సహాయ..."

"అవును అతనే, భైరోసందులోవుంటాడు. అతనికొడుకు వెర్రిబాగుల వాడిలా వుంటాడు కదా. అతని కూతురు లేదయ్యా! కమ్యూనిస్టు. వాడే అన్నకొడుకు పెళ్ళాంతో ... దేనికైనా హద్దూపద్దూ వుండాలి" అని ఛేదాలాల్

అరుగుమీద కూలపడ్డాడు. ఛేదాలాల్‌కు ఎదురుగావుండాలన్న వుత్సాహంతో గులాబ్‌చందు తన కుర్చీని అతనివైపుకు తిప్పుకున్నాడు.

ఒళ్ళువిరుస్తూ "ఇంకేం మిగిలిందిలే ప్రపంచంలో. మతంగితం నీతీ నియమం అన్నీ కొట్టుకపోయాయి" అని లాలాముకుందీమల్ ఒక ఆవలింత తీశాడు.

"ఎన్నైనా చెప్పు. పోలీసోళ్ళు తొందరగా పట్టేసారులే. ఇలా పొద్దున్నే జరిగింది అలా వెంటనే వాళ్ళు పట్టేసారు"

"అది కాదయ్యా బాబూ. వాడులేడూ ఆ సాలిగ్రాం, వాడు పట్టించాడయ్యా" అని లాలేదళాల్ మాట్లాడుతుంటే మధ్యలోనే ఛేదాలాల్ తుంచేసాడు.

"అదా అసలుసంగతి"అని కనుబొమ్మలు పైకెగరేస్తూ మెద వూపాడు రాంస్వరూప్. "ఇదంతా ఆ నాయకమ్మగాడి తెలివితేటలా. అఘోరించినట్లుంది. ఎవరొస్త్రి నిఖారసుగా బతుకుతోంది ఈరోజుల్లో. ఆడవాళ్ళను ఏడిపిస్తే ఈవెధవ చెప్పుల్తో రెండుసార్లు చిదగొట్టారుగా కాందిశీకులు."

"అయితే ఆమెకేమైంది ఛేదాలాల్ ఆదే జగదాంబా సహాయ్ కోడలుకి'' అని గులాబ్‌చంద్ కుతూహలంతో ప్రశ్నించాడు.

''డాక్టర్ని వెంటపెట్టుకుని పోలీసులొచ్చారు. భైరోసందు జనంతో కిట కిట లాడుతోంది" ఛేదాలాల్ అంతకుమించి చెప్పలేకపోయాడు.

ఇంతలో విశ్వనాథశాస్త్రిలుగారు అక్కడకు తన వెండిపొన్ను కర్రను ఆడించుకుంటూ వచ్చారు. చతుష్కోణాకారంలోవున్న తలపాగా, విశాలమైన నుదురు, నుదుటిజాగాన దిద్దిన చందనపుబొట్టూ, వెండిఫ్రేములో అమర్చిన నీలి రంగు కళ్ళజోడూ, చామనఛాయ ముఖంలో అక్కడక్కడ అమ్మవారి మచ్చలూ. వాటిమధ్య బాగా పెంచిన తెల్లటిదుబ్బు మీసాలూ ఒడ్డూపొడుగూ గల వొంటిపైద ఉన్నికోటూ, దానిమీద జరీశాలువ, తెల్లటిధోవతికి తగ్గట్టుగా

కాళ్ళకు వంప్షూ, చేతివేళ్ళకు ముత్యాలూ వజ్రాలతో పొదిగిన వుంగరాలు —
గురు గాంభీర్యం అతని మొహంలో ప్రకాశిస్తోంది.

"రండి, మహాత్మా నమస్కారాలు" అంటూ దూరాన్నుంచే లాలా ముకుందీమల్ నమస్కరించాడు శాస్త్రులుగారికి. అతణ్ని అనుసరిస్తూ అరుగు మీద కూర్చున్న మిగతా వాళ్ళంతా చేతులు జోడించి అభివాదనం చేశారు.

"శుభమస్తు" అందరి నమస్కారాలకు ప్రత్యుత్తరమిస్తూ చేయి వూపుతూ అన్నారు విశ్వనాధశాస్త్రిగారు.

"చెప్పండి మహాత్మా. రాజాసాహెబ్‌గారి యింట్లో పారాయణం చేసి వచ్చారా?"

"ఆఁ"

"మరిప్పుడు వారి మనుమడి ఆరోగ్యం ఎలావుంది? నిన్న చాలా జబ్బుగా వుందే?"

"ప్రమాదంలేదు. జ్వరం మాత్రం వుంది" అని అంటూ శాస్త్రిగారూ ఇంటికి వెళ్ళడానికి ఓ అడుగు ముందుకు వేసారో లేదో ముకుందీమల్ మళ్ళీ అడ్డుకున్నాడు— "మరి రాజా సాహెబ్ ఏపక్షం? కాంగ్రెసా, జనసంఘా."

మొహాన్ని వెనక్కు తిప్పి గంభీరంగా ఆయన అన్నారు — "ధనవంతుడూ, వేశ్య — వీళ్ళిద్దరూ ఎవరితో తమ పనులు నెరవేరుతాయో వాళ్ళదాహాన్నే తీరుస్తారోయ్ ముకుందీమల్"!!

శాస్త్రిగారి మాటకు అందరూ గొల్లున నవ్వారు: గులాబ్‌చంద్ కుర్చీ లోంచి లేచాడు. "రండి పంతులుగారూ" అని అన్నాడు.

సిలికళ్ళద్దాల్లోంచి కుర్చీవైపు దృష్టిమళ్ళించి "లేదులే. ఇంటికి వెళ్ళతాను" అని విశ్వనాథశాస్త్రిగారన్నారు.

'రండి శాస్త్రులుగారూ' అని నొక్కి పలికి తన యింటివైపు తిరిగి బిగ్గరగా ముకుందీమల్ అరిచాడు. "అరే భగోతియా, చేతులుబాగాకడుక్కుని

ఓ ఎనిమిది పది తమలపాకులు తీసుకురా. కొంచెం పొగాకుకూడా వెంటనే పంపించు" అన్నాడు. మళ్ళీ శాస్త్రిగార్ని చూస్తూ "మీరు లక్షరూపాయలు విలువచేసే మాటన్నారు. కాని ఓ చిన్న సందేహం. ధనవంతుడే కాదు. ప్రతి వ్యక్తి వాడివాడి స్వార్థాన్నే చూసుకుంటాడు"అన్నాడు తిరిగి.

"స్వార్థం అనేది కేవలం జ్ఞానులూ, యోగులకే చెల్లుతుంది. మిగతా వాళ్ళంతా స్వార్థం చూపెట్టడం మొదలెట్టితే దానివల్ల అనర్థమే సంభవిస్తుంది".

''నమస్కారం బాబూజీ, ఇలా ఒకసారి దయచేయ్యండి''అంటూ తన గదికి వెళ్తోన్న సజ్జన్‌ను చాలా ధైర్యంగా పిలిచాడు రాంస్వరూప్.

అరుగుమీద కూర్చున్న పెద్దమనుషులందరితోనూ సజ్జన్‌కు ముఖ పరిచయంవుంది. అయితే ఎవరితోనూ వ్యక్తిగత పరిచయంలేదు. రాంస్వరూప్ పిలవగానే అతనికి కొంచెం సంకోచం కలిగింది. వెళ్దామా వద్దా అన్న ఆలోచనలో పడ్డాడు నిజానికి వాళ్ళు అలాపిలవడం అతనికి సంతోషంగానేవుంది. నమ్రతాపూర్వకంగా చేతులెత్తి నమస్కరించి అక్కడికివచ్చాడు. అరుగుమీద కూర్చున్న అందరిమొహాలు ఆయనవైపు తిరిగాయి.

"ఇవ్వాళ పేపర్లో మీమీద ఓ వ్యాసం ప్రచురించారు" అని మళ్ళీ రాంస్వరూప్ పలకరించాడు.

రాంస్వరూప్ మళ్లీ పలకరించగానే క్రితంరోజు సాయంత్రం రాజా సాహెబ్ దాని గురించి చర్చించివుండొచ్చు అన్నభావంకలిగింది. కాని తన కీర్తిప్రతిష్ఠలు ఆధారంగా వారంతా తన్ను గౌరవించడంతో అతని మనస్సు వుప్పొంగింది. నమ్రతాభావాన్ని ప్రకటిస్తూ "అది..." అంటూ ఏంమాట్లాడాలో తెలీక ఆగిపోయాడు.

లాలే అసక్తిరింపుకున్న కళ్లతో సజ్జన్‌ను చూస్తున్నాడు. గులాబ్‌చంద్ మాత్రం మర్యాదా మన్నన అన్నట్టుగా వున్నాడు. ఛేదాలాల్ ఓరకళ్ళతో చూస్తున్నాడు. శాస్త్రిగారు తన నీలిరంగు అద్దాల్ని సవరించి, మళ్ళీగంభీరంగా కూర్చుండిపోయాడు. లాలాముకుందీమల్ ముఖంలో ఏమాత్రం చలనంలేదు.

ఇంతలో వెండిపళ్లెంలో తమలపాకులు వచ్చాయి.

రాంస్వరూప్ పళ్లాన్ని ఒక్కక్షణం చూశారు. శాస్త్రిగారిని వుద్దేశిస్తూ 'వీరు మన భారతదేశంలో ఓ ప్రఖ్యాత చిత్రకారులండి. శ్రీమాన్ సజ్జన్‌వర్మ గారు. ఇటీవల కొన్ని రోజుల్నుంచి వీరు మనవీధిలోనే....'

చాలసేపటినుంచి కుతూహలంగావున్న లాలా ముకుందీమల్ అర్థం చేసుకున్నట్లుగా తలఆడిస్తూ, "అలాగా, నువ్వు కన్నోమల్ మనుమడివికదూ। నిన్న సాయంత్రం జానకీ శరణ్ సమక్షంలో రాజాసాహెబ్‌కు నీ గురించి చెప్పారు" అని అన్నాడు.

కన్నోమల్ పేరు వినపడగానే శాస్త్రిగారి ఏకాగ్రత భంగమైంది. అతని నీలం కళ్ళద్దాలు సజ్జన్‌వర్మపీద నిలిచాయి. ''కన్నోమల్ మా మిత్రుల్లో ఒకరు" అని తన ఆత్మీయతను వెల్లడించారు.

లాలాముకుందీమల్ పాత జ్ఞాపకాల్ని నెమరేసుకుంటూ ఉత్సాహంగా తమ స్నేహాన్ని ఏకరువు పెట్టాడు. 'వారితో మాకు చాలా వ్యవహారం నడిచింది. చాల చిన్నవయసులో పోయారు పాపం. అతని కుమారుడు కూడా ఎక్కువరోజులు జీవించలేదు వెధవసారాయే అతణ్ని ముంచేసింది'

చనిపోయిన తండ్రిగారిని గురించి ఇటువంటి అభిప్రాయంవిన్న సజ్జన్‌కు సంకోచం ఎక్కువైంది.

''కన్నోమల్ నా సహపాఠి. నాకంటే వయసులో ఒక సంవత్సరం పెద్ద వారి తండ్రిగారు. ఇక్కడే చౌకులో వుండేవారు. తనకాలంలో చక్రవర్తిలావుండేవారు'' అంటూ శాస్త్రిగారు హితసంగతులు మననం చేసుకున్నారు.

"అరే. ఎదుటివ్యక్తిని మింగేయగల వ్యక్తిత్వం ఆయనిది. మాకు తెలిసినవాళ్ళలో ఆయనే ముందు విదేశాలకు వెళ్ళింది. వచ్చిన తర్వాత ప్రాయశ్చిత్తంగూడ చేసుకోలేదు. హౌనజప్‌లో మేడకట్టించుకున్నారు. పెద్ద పెద్ద తెల్లదొరలు వారిదగ్గరకొస్తూ వుండేవారు. వైసాౖయిగారిదగ్గర వారికి కుర్చీ వేసేవారు. ఆయన మంచి పేరు ప్రతిపలు సంపాదించుకున్నారు".

ఆత్మీయత, అభిమానాలన్నిటినీ ఈ ఇద్దరు ముసలాళ్ళే కొట్టేస్తున్నారనీ తాను పిలిచినందుకు తనకేమీ దక్కడంలేదని గ్రహించాడు బాబురాంస్వరూప్. వెంటనే అందుకున్నాడు. "సజ్జన్‌గారైతే వాళ్ళపూర్వీకుల్ని తలదన్నేంత పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. పేపర్లల్లో వీరి గురించి వ్యాసాలుపడుతూంటాయ్. చూడలేదూ. వీరి చిత్రం ఆమధ్య ఇలస్ట్రేటెడ్ వీక్లీల్లో చూశాను.

తన ప్రయోజకత్వాన్ని ఎప్పుడు బైటపెడదామా అని ఎదురుచూస్తూన్న లాలేదలాల్‌కు అవకాశం దొరికింది. "అయితే నాకు తెలీక అడుగుతాను. మరి వారు ఫోటో గ్రాఫరా లేకపోతే చేత్తో బొమ్మలు గీసేవారా" అని ప్రశ్నించాడు.

తన కళ గురించి ఇటువంటి తెలిసీతెలియని వ్యక్తులు ప్రశ్నలూవేస్తూంటే సజ్జన్ అక్కడనుంచి వెళ్ళిపోదామా వద్దా అన్న సందిగ్ధావస్థలో పడ్డాడు.

లాలాముకుందీమల్‌కు మళ్ళీ హుక్కా పీల్చడానికి పొగాకు వచ్చింది. హుక్కా ముందుకు జరిపి దాని గొట్టాన్ని ఎలావంచాలో వివరించడం మొదలెట్టాడు,

సంకోచిస్తూ, మంచితనాన్నంతా కంఠంలో నింపుకొన్నట్లుగా, నమ్రతగా, "అవునండి, నేను చేత్తో గీస్తానండి చిత్రాల్ని" అని మృదువుగా టూకీగా చెప్పాడు సజ్జన్.

కొత్త పుగాకు వేసినతర్వాత తాజాగా ఒక్కపట్టుపడదాంఅని అనుకుంటూ ప్రసంగాన్ని ఆపడానికి ఇష్టంలేక డొంకతిరుగుడు నుండి మళ్ళీ రాచమార్గానికి వచ్చారు. ముకుందీమల్ "చేత్తో బొమ్మలు గీయడం అయితే మా దగ్గర పండిత్ రాంనాథ్‌గోసాయి కూడ గీసేవాడు. అదే సోంధీటోపావాలా లేదూ అతనే ఏనుగుదంతంమీద యేమేమి బొమ్మలు గీసాడనుకున్నారు! అని తన చిత్రకళా పరిజ్ఞానాన్ని చాటుకున్నాడు.

అతని హుక్కా గుడగుడమంటోంది. లాల్ నోరుకూడ మూతపడింది. సజ్జన్‌కు మాత్రం ఈ కొద్దిపరిచయం చాలునన్నట్లుగా అక్కడనుండి వెళ్ళాలని వుంది. వాళ్ళమధ్యన వుండికూడా వాళ్లకు తాను పరాయివాడినన్న భావం

సజ్జన్‌కు కలుగుతోంది. ఇంక అక్కడ వుండలేకపోయాడు. శాస్త్రిగారికి నమస్కరిస్తూ "నాకు అనుజ్ఞ ఇప్పించండి. మరల తమ దర్శనం చేసుకొంటాను" అని అంటూ లేచి నుంచున్నాడు.

"ఆ తప్పకుండా కలవాలి. నాకూ ఆనందదాయకమే, అయుష్మాన్ భవ. నీకీర్తి దశదిశలు వ్యాపించుకాక" అని దీవించారు శాస్త్రిగారు.

గాంభీర్యంతో నిండుకున్న శాస్త్రిగారి కంఠంలో సజ్జన్ ఆత్మీయతా భావాన్ని స్పృశించాడు. వెళుతూ వెళుతూ వంగి శాస్త్రిగారి పాదాలకు నమస్కరించాడు. కన్నతల్లిని తప్ప ఆయనచేతులు ఈరోజువరకు యేపాదాలను తాకలేదు.

విశాలంగావున్న సందువైపుగా సజ్జన్ వెళ్లడాన్ని నీలిరంగు కళ్ళద్దాల్లోంచి చూస్తున్నాడు శాస్త్రిగారు. "ఈ అబ్బాయి ఇటువైపు ఎందుకు వెళ్ళుతున్నాడు?" అని అక్కడవున్న వారివైపు చూస్తూ ప్రశ్నించారు.

''ఏమోనండి తెలీదు. ఇతనికి వ్యతిరేకంగా కాందిశీకులు పేపర్లో ఏదో వ్రాశారు. దాన్ని ఖండిస్తూ ఇతను స్టేటుమెంటు ఇచ్చాడు పేటలోవుండే వారి జీవనసరళికి సంబంధించిన కొన్ని చిత్రాల్ని గీయడానికి వచ్చాననీ, మన ప్రాచీన సాంప్రదాయాల్ని అవగాహనచేసుకోవాలని అనుకుంటున్నాననీ రాశాడు. ప్రస్తుతం యితను పెద్దమ్మ యింట్లో అద్దెకు వుంటున్నాడు. ''మరైతే యింకా పెద్దమ్మ బొమ్మను గీసేడా లేదా'' అన్నాడు ఎగతాళిగా లాలే.

'ఈయన పెద్దమ్మను చిత్రం వేసిన రోజు నేను బహుమానంగా పతకం ఇస్తా' చిరునవ్వు నవ్వుతూ ఛేగాలాల్ అరుగుమీద నుంచి లేచాడు.

''అరరేరె నువ్వు ఎక్కడికయ్యా పోతున్నావ్. నీ గురించి పాపం శాస్త్రిగారిని కూర్చోపెట్టాం కదా అంతత్వరగా నువ్వెటో జారుకుంటున్నావేమిటి కూర్చో, కూర్చో. ఓటు ఎవరికివ్వాలో చెప్పు మరి''

చిత్రాలనుండి చర్చ ఎలక్షన్లవైపుకు మళ్ళింది. కొంచెం సేపయినతర్వాత ఓ పళ్లెం చేత్తో పట్టుకొని సజ్జన్ అరుగువైపునుంచి వెళుతూండడం వారికి కనిపించింది. ఆ పళ్లెంలో ఓ పిండిబొమ్మ కూడా వుంది. లాలే దలాక్‌కళ్ళు

వళ్లెంమీద పడ్డాయి. ఓహో, ఆయన యింటిదగ్గర కూడా ఈ కానుక వుంచొచ్చిందన్నమాట. "ఏం బాబుగారూ, మీ ఇంటిలో కూడా...."

అందరూ సజ్జన్ వైపు చూశారు. లాలాముకుందీమల్ "ఏమయ్యా, యజమానురాలి సాంగత్యదోషం నీకు కూడా తగిలినట్టుందే. ఎవరికోసం బొమ్మను తీసుకెళ్తున్నావ్?" అన్నాడు నవ్వుతూ.

"నేను ఇంటికి వెళ్లేటప్పటికి కాకులు కావ్‌కావ్ మంటూ గుమిగూడి వున్నాయి ఏమిటా అని చూస్తే యిది. దానిని తీసిపారెయ్యమనీ, కాకులు తమ యిళ్లల్లో ఎంగిలిపడేస్తాయనీ చుట్టుపక్కలవాళ్లు అన్నారు ఇలాటివంటే వాళ్లకు భయంగాబోలు. సరే నేనే పారేసి వస్తానన్నాను" అని నవ్వుతూ సజ్జన్ జరిగిందంతా చెప్పాడు

"మీరు నాస్తికల్లా వున్నారు. అందుకె మీకు భయం గియం లేదు. మా యింటిముందు ప్రొద్దున లేచీలేవడంతోటే ......"

"ఏం ఛేదాలాల్‌గారూ, ఇదే కదూ మన భారతీయ సంస్కృతి. దీన్నిగా మీరు ఇంతగా కాపాడాలంటున్నారు".

గులాబ్‌చంద్ విసురుకు రాంస్వరూప్ ముసిముసిగా నవ్వుతూ ఛేదాలాల్‌ను కన్నార్పకుండా చూడసాగాడు కాకులు సగం పొడిచిపారేసిన బొమ్మను చూస్తూ సజ్జన్‌కూడా ఓ చిరునవ్వు నవ్వాడు

ఛేదాలాల్ తన వాదాన్ని సమర్థించుకుంటూ ఇంకా స్పష్టంగా అన్నాడు— "మన హిందూమతంలో అనాచారాలు లేవని నేను అనడంలేదు. ఆ చెడును తొలగించం అని చెప్పడం లేదు. కాని మతంలోవున్న మూలస్వభావాన్ని మనం కాపాడాలని మాత్రమే చెప్తున్నా".

"సరిగా చెప్పాడు" మతాభినివేశం ముఖంలో కనిపిస్తుండగా లాలేదలాల్ అన్నాడు. ఆవెంటనే మళ్ళీ దృఢచిత్తంతో—"ధర్మాన్ని ఎట్టి పరిస్థితిలోనూ కాపాడాలి. మేం శాస్త్రాల్ని గురించి చెప్తున్నాం. ఈ చదువుకున్నోళ్లను చూసి

మేమేమీ అంకం. ఆర్గుమెంటు అల్లావుంచి ముందు ఈ మంత్రపు పళ్లాన్ని ఇక్కడున్నుంచి తీసేయండి"

"విన్నారా ఛేదాలాల్ గారూ," అని గులాబ్‌చంద్ బిగ్గరగా నవ్వి "అదృష్ట వశాత్తు శాస్త్రులు గారు కూడ ఇక్కడే వున్నారు. చెప్పండి మహాశయా, ఏ శాస్త్రంలో ఇదంతా రాసివుందో" అన్నాడు తిరిగి.

శాస్త్రిగారు నీలం కళ్లద్దాల్ని సవరించుకుంటూ గులాబ్‌చంద్‌ను ఎగాదిగా చూశాడు. తెల్లతెల్లని బుంగమీసాల్లో సంస్కారాన్ని మెలేస్తూ గులాబ్‌చందు వ్యంగ్యానికి యమకాన్ని జోడించి "శాస్త్రాల గురించి కాదు లాలే మాట్లాడడం అతనేదో శాస్త్రిల్లూ, ఆలు గురించి మాట్లాడుతున్నాడు'' అని లాలేమీద తాను కూడా విసిరారు.

శాస్త్రిగారి మాట విని అందరూ గొల్లున నవ్వారు. గారపట్టిన కట్టుడు పళ్లు ఇకిలిస్తూ లాలాముకుందీమల్ కూడ ఇ హ్హి హ్హి అని నవ్వుతోంటే కింద దాకా జారిన అతని దవడలు మరింత వూగిసలాడాయి. "అహా మహాత్మా, ఎంత బాగా తుంచారూ లాలే మాటని'' అని తానుకూడా లాలేమీద చిన్న ఛలోక్తి విసిరాడు.

తన మాటల్లోంచి విపరీత అర్థాలు తీస్తుంచే లాలేదలాల్ ఏమీ అర్థంకాక కళ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు. వాళ్లంతా తన్ను ఎగతాళి చేస్తున్నట్లు గ్రహించి సిగ్గుపడ్డాడు. ఛేదాలాల్ మోకాళ్లు ముడుచుకొని రెండుచేతుల్తో వాటిని బంధించి కూర్చున్నాడు. ఎగతాళి అతని చెవుల్లో గుడగుడమంటున్నా ముఖం మాత్రం ఏకావేషం లేకుండా నిర్వికారంగా వుంది. గులాబ్‌చందూ, రాంస్వరూప్ ముఖాలు తమ వాదనకు బలం రావడంతో కలకల్లాడుతున్నాయి. లాలేవైపు తిరిగి శాస్త్రి గారన్నారు—"మేం నీ ఉచ్చారణలో దోషాన్ని వేలెత్తి చూపడంలేదు. మరోలా తీసుకోవద్దు. నీ మాటలోనే నాకు కావలసిన అర్థం దొరికింది. ఈదేశంలో ఎన్ని మతాలున్నాయో, ఎన్ని శాస్త్రకారులున్నారో, ఎంతమంది శాస్త్రుళ్ళు ఆలులూ వున్నారో అన్ని శాఖలున్నాయి అన్నీ సంప్ర

దాయాన్నాయి. శాస్త్రి గురువనుకో. అలు శిష్యురాలనుకో. గురువును మించినది యిల్లాలు. అన్ని తరాల్లోనూ శాస్త్రుల్ని ఎంతమంది వుండే అన్ని భాష్యాలు అన్ని మతాలు బయలుదేరాయి" అన్నారు శాస్త్రిగారు. అందరికి నవ్వొచ్చింది శాస్త్రిగారి వివరణ వింటోంటే. కాని శాస్త్రిగారిలాంటి పెద్ద మనిషి ముందు చిరునవ్వును దాచేసుకున్నారు. శాస్త్రిగారు తన వుపన్యాసాన్ని మళ్ళీ పొడిగించారు—"ఇక అంతరాలు అంతస్తులంటావు, అవి హిందూమతం దేవుళ్ళలో వున్నాయి. క్రైస్తవమతంలో వున్నాయి. పీర్లు, ఓఝూలు, ముల్లాలూ అందరూ ఆఫీసులో ఎల్.డి.సి., యు.డి.సి. సూపర్నెంటులా తమతమ అంతస్తులూ అంతరాలు నిర్మించుకున్నారు. ఈ మధ్యనే ఓ పుస్తకంలో చదివాను బొంబాయిలో ఓ క్రైస్తవ దేవత వుందట. ఆమెను మౌంట్ మేరీ అని పిలుస్తారట. ఆ దేవినే హిందువులు మాతమాపళి అని పూజిస్తారట. యీ సంగతి చూడండి, మహమ్మదీయుల పరిపాలనా కాలంలో వారి ప్రభావానికి లోనై మన హిందువులే అల్లోపనిషత్తు అన్న పేరుతో ఒక కొత్త ఉపనిషత్తు కూడా రాశారట. మన మంత్రాలూ ప్రయోగాలూ మొదలైన వాటిమీద వాళ్ళ ప్రభావం పడింది. చేతరామీ అనే ఓ శాఖ వచ్చింది. అది ఓ కొత్తతరహా మతాన్ని సృష్టించింది. చతుర్ముఖుడైన బ్రహ్మకు తిలోదకాలిచ్చి అతని స్థానంలో ఏకముఖుడైన అల్లాను త్రిముఖుడైన దత్తాత్రేయుణ్ణి కూర్చుండ పెట్టింది. అంటే ఓ కొత్త చతుర్ముఖ సృష్టికర్తను కల్పించిందన్నమాట. పరమేశ్వరుడు విష్ణువు పర్యాయపదమట. మరి శివుడేమో లయాన్ని ఖువాకప్పగించి బంగు నూరడానికి వెళ్లాడన్నమాట"

అరుగంతా నవ్వుల కెరటాలతో పొర్లిపోయింది విరగబడి నవ్వుతోన్న సజ్జన్ తన చేతిలో వున్న పళ్లాన్ని పరధ్యానంలో అరుగు మీద పెట్టాడు శాస్త్రిగారి మాటలు తన్మయుడై వింటున్నాడు.

లాకే దలాల్ దృష్టి బొమ్మపై పడగానే వెంటనే "బాబుగారు' ఇది ఆంజనేయస్వామి సన్నిధి. క్షమించండి" అని అన్నాడు పళ్లెంపైపు చెయ్యి చూపిస్తూ

"పొరపాటైంది. మన్నించండి" అంటూ వెంటనే సజ్జన్ పళ్లాన్ని చేతి లోకి తీసుకున్నాడు. బయలు దేరడానికి లేస్తూ "దీన్నెక్కడైనా రహదారిలో ఎవరికి అభ్యంతరం వుండనిచోట వుంచి వస్తాను.

"అద్దదీ. అలా చేయండి. ఆ ముందు కొళాయి దగ్గర కావలసినంత జాగా వుంది అక్కడ పెట్టేయండి. పెట్టేశాక కాళ్ళూ చేతులూ కడుక్కోండి".

కాకులు పొడిచెయ్యగా మిగిలిన సగం బొమ్మను పళ్లెంలో ఎత్తుకుని వీధి వెంట తీసుకెళ్తోంటే సజ్జన్‌కు చిన్నతనంగా కనిపించింది. తనకు తానే ఓ వింతగా తోస్తున్నాడు. సందులో అటూ ఇటూ నడిచే వాళ్ళూ, కిటికీల వద్ద తలుపుల దగ్గర నిలబడి చూస్తోన్న జనం దృష్టిని ఆకర్షిస్తూ పోవడానికి అతనికి సిగ్గేసింది. "ఇక్కడ కూడ ఓ నౌకరును పెట్టుకోవాలి" అనుకున్నాడు. "వీధిలో వుండేవాళ్ళు అతనితో వ్యవహరించే టప్పుడు ఒక్కోసారి ఆప్యాయం గానూ. మరోసారి ముభావంగానూ వున్నట్టు రెండు రూపాల్లోనూ కనపడు తున్నారు, మహిపాల్ నిజాన్నే ఎంతబాగా చెప్పారు. మన దేశమంటే వారికో వింత మ్యూజియం. ఈ జనంతో ఆత్మీయతను ప్రదర్శిస్తూ పాలలో నాలుకలా మసలుకోవడం అతనికి చేతగాదట. వీళ్ళ దారిద్ర్యాన్ని పారదోలడం ఏ ఒక్క రోజులో సాధ్యం అయ్యేది కాదు. చివరకు వాళ్లతో పూర్తిగా ఏకం కావడం కూడా మన లక్ష్యం కాదు కదా. మన పనల్లా సంస్కారాలతో ఘర్షణపడడం, వాటిని తెలుసుకొని తోసి రాజనడం. ఈ సమాజం రూపు రేఖలు మార్చి అది పోతోన్న దిశను మార్చడం అంతే అనుకున్నాడు. అంతలో శాస్త్రిగారు గుర్తు కొచ్చారు. "శాస్త్రిగారి ఆలోచనా పద్ధతి ఎంతఉన్నతమైనది! తను శాస్త్రిగారి కాళ్ళు తాకాడు... తనెందుకు ఆపని చేసినట్లు? అమాంతంగా తనలో ఆ భావా వేశం ఎలా వచ్చిందో? పోనీలే. దానికి అర్హతా యోగ్యతా అన్నీవున్న వ్యక్తేలే ఆయన. మహిపాల్ ముందు ముందు ఇంకా ఎంతో తెలుసుకొంటాడు. మహిపాల్ అభిప్రాయం సరైంది కాదు. నెమ్మది నెమ్మదిగా అతనే తెలుసు కొంటాడు.

పరంపరగా వస్తోన్న ఆలోచనల ముడుల్ని చిక్కు తీసుకుంటూ సజ్జన్ చౌరస్తా వైపుకు సాగిపోతున్నాడు.

# 6

ఎన్నికల చిహ్నాలతో ఆయాపార్టీల నినాదలతో, గిట్టనివాళ్లమీద బూతు పంచాంగాలతో, అపూర్వకుస్త్రీప్రదర్శన, జాడీ బీడీలు మాయాలోషన్‌కు సంబంధిచిన రాతలతో, ఏకాహం మొదలు సినిమాలు నాటక ప్రదర్శనల వరకు రక రకాల వాల్ పోస్టర్లతో, వేడికీ వాపూకూ నపుంసకత్వాన్ని పోగొట్టేందుకు మందుల ప్రకటనలతో, మిఠాయి కిల్లీ నుంచి కాశ్మీరీకిమాం వరకు అన్ని రకాల్ని గోడల కెక్కించి ప్రజాజీవితాన్ని అన్ని కోణాల్నుంచి పరిశీలించే రకరకాల ప్రచార చిత్రాల్ని చూస్తూ, ఒక్కొక్కదాన్నే దాటుకుంటూ, సజ్జన్ కొళాయి దగ్గరకు చేరాడు. అతని చేతిలో పళ్లెం అలానే వుంది.

బజారుసందులోంచి నలుగురు పోలీసులు చాలాహుషారుగా రావడం చూశాడు. వాళ్లవెంట కొంతమంది జనం కూడా చిన్న గుంపుగా వస్తున్నారు. సాధారణంగా పోలీసుల్ని చౌరస్తాలల్లోనో, పోలీసుస్టేషనులోనో మైదానంలో కవాతు చేస్తూనో పెద్ద పెద్ద ఇళ్లలో వివాహసందర్భాల్లో బ్యాండు వాయిస్తూనో, జట్కా వాలాల జూదగృహాల్లోనో చేతులు చాపుకుని మామూలు వసూలు చేసుకొంటూ కనపడుతుండడం కద్దు. అప్పుడు ఎవరికి ఆశ్చర్యంకానీ కుతూహలం కానీ వుండదు. కాని నడిరోడ్డులో నలుగురైదుగురు జట్లుజట్లుగా వెళుతున్నారంటే ఏదో విశేషం వుందని అనుకోవాల్సివస్తుంది. అతను మన పరిపాలనకు చిహ్నం. మానవుని న్యాయబద్ధత ఈ చిహ్నాన్ని ఏర్పరచుకుంది. ఇలాటి భావనే సజ్జన్‌కు కలిగింది. పోలీసులు కుడిచేతివైపు సందులోకి మళ్లారు. లాలేదలాల్, జానకిశరణ్, వర్మ, భరూతీ సునారు మొదలైన వారు వుండేది ఆ సందులోనే.

చేతిలో పళ్లెం వుందన్న విషయం మరచి సజ్జన్ పోలీసుల్నీ ఆ గుంపునూ చూస్తూ వుండిపోయాడు. అదే సమయానికి ఆ సందులోంచి మిస్టర్ వర్మ, రాధే

శ్యామ్ వస్తున్నారు. రాధేశ్యామ్ ఈ సంవత్సరమే బి.ఏ. పాసయ్యారు. గుమాస్తాగిరి కోసం పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్ష రాసొచ్చారు. రాధేశ్యామ్ తాను సోషలిష్టనీ, ఈలా ఉన్నతమైన ఆశయాలు ఆలోచనలూ వున్న వ్యక్తిననీ అనుకుంటాడు. శంకర్‌లాల్‌తో కలిసి సజ్జన్‌ను ఓ పర్యాయం అతను కలుసుకున్నాడు కూడా. అతణ్ణి చూడగానే రాధేశ్యాం వెంటనే నమస్కరించాడు. వర్మ కూడ సజ్జన్‌కు వినయపూర్వకంగా చేతులు జోడించాడు.

వాళ్లను చూసీచూడగానే సజ్జన్‌కు అతని చేతిలో పళ్లెం వున్న విషయం జ్ఞప్తికొచ్చింది. భుజాలెగరేస్తూ మనసులోని సంకోచాన్ని నవ్వు ద్వారా దూరం చేయాలని ప్రయత్నిస్తున్నట్లుగా "ఈ వీధిలో నాకు మొదటిసారి ఈ కథా వస్తువు దొరికింది. అది సరేకానీ ఆ సందులోకి జనం పోలీసులూ అలా వెళ్తున్నారేమిటి? ఏమిటి విశేషం'' అని అడిగాడు.

ముందే జవాబు సిద్ధంచేసుకుని అడిగిందే తడువుగా వప్పగించే విద్యార్థిలా రాధేశ్యాం వృత్తాంతాన్ని టూకీగా చెప్పాడు -"మాస్టర్ జగదంబా సహాయ్ టీచర్ లేడండీ? వెరేసర్వ్‌డ్....లుచ్చా...."

చేతిలో పళ్లెం క్షణక్షణానికి గుర్తు రావడం కనిపెట్టి "ఒక్క నిమిషం క్షమించండి. ఈ పళ్లేన్ని చౌరస్తాలో" వుంచొస్తాం అంటూ సజ్జన్ అన్నాడు.

అతణ్ణి వారిస్తూ మిస్టర్ వర్మ అన్నాడు-"అక్కడికెందుకండి. ఇక్కడే ఈ కాలువలో పారేస్తే సరిపోదూ"?

కొళాయి దగ్గర బట్టలు వుతుకుతోన్న వ్యక్తివైపు చూస్తూ "ఎవరికైనా అభ్యంతరం వుండదు కదా" అని ప్రశ్నించాడు సజ్జన్

"ఏమీ వుండదండి. నిర్భయంగా అక్కడ పారెయ్యండి."

విరిగిపోయిన మేన్‌హోల్‌లో పళ్లాన్ని విసిరేసి కొళాయి దగ్గర సజ్జన్ కాళ్లూ చేతులూ కడుక్కున్నాడు. చేతులు తుడుచుకుంటూ "ఆ ఇప్పుడు చెప్పండి ఏమిటీ విషయం" అని మళ్ళీ ప్రశ్నించాడు.

"అదేనండి, వాడి అన్నకొడుకు పెళ్లాం లేదూ, యువవితంతువు పెళ్లయి మూడేళ్లయింది. అది అయిన ఆరునెలలకే ఆమె భర్త ఆకస్మాత్తుగా మరణించాడు. మాస్టర్ జగదంబసహాయ్ దగ్గరే వుంటోంది ఏ దిక్కూ లేక. అంతే ఆమె నిస్సహాయతను అన్ని విధాలా ఉపయోగించుకున్నాడు, అదేనండి, మన సంఘంలో వుండే ట్రేజిడి. ఛీ.... "అంటూంటే క్రోధంతో రాధేశ్యాం మొహం ఎర్రబారింది. కళ్లలో మాత్రం నీళ్లు నిలిచాయి.

"ఆ తర్వాత?" అని ప్రశ్నించాడు సజ్జన్.

మాట అందుకుంటూ మిస్టర్ వర్మ చెప్పాడు- "ఆమె రాత్రి ప్రసవించింది. కొడుకు పుట్టాడు. వాడి గొంతు పిసికి ఏ తెల్లాపు ఝాముననో కంపెనీ తోట దగ్గరవుండే కాలవలో పారేయించాడు. ఉదయం పోలీసులకు ఈ విషయం తెలియగానే ఇటొచ్చారు.

"మరి పోలీసులకు ఈ సమాచారం ఎలా తెలిసింది?"

సజ్జన్ ప్రశ్న నోట్లోంచి బయటకు వచ్చిరావడంతోనే రాజకీయ వేత్తలా కనుబొమ్మలు చిట్లిస్తూ, సంఘం మీద విరుచుకుపడ్డాడు. రాధేశ్యామ్ మహాశయా ఈ దేశానికి ఎప్పుడు ఏ విపత్తు వచ్చినా దానికి కారణం విభీషణులేగా. వాడు లేడు వెధవ సాలిగ్రాంగాడు. వాడు సాధించిన ఘనకార్యం ఇదంతా, జగదంబా సహాయ్ కుమార్తె కమ్యూనిస్టుట. పార్టీ వాళ్ళు ఈ మధ్య కొన్ని రోజుల్నుంచి అక్కడ నాటకం రిహార్సల్సు వేస్తున్నారు లెండి, పక్కలో బల్లెంలా తయారయ్యారు సాలిగ్రాంగాడికి. సజ్జన్ గారూ, చాలా మందికి విషయం తెలీదనుకుంటాను. ఈ వార్డులో ముఖ్యమైన వ్యక్తులు ఎవరైతే వున్నారో వాళ్ళు ఏందేనేదీ వాళ్లను ఎవరెవరు కలిసేది, మొదలయిన సమాచారమంతా సాలిగ్రాంకు మోసుకు పోయేవాళ్ళున్నారు. నాయనా, ఇవి కాంగ్రెసువారు అల్లిన వేగులవుచ్చు. 'గెస్టోపో' స్వామీ. ఈసారి ఎలక్షన్లలోనైనా ఈ పురుగును పూరదీయలేక పోయామంటే ఇక...." అంటూ ఆగిపోయాడు.

సందులోంచి జనం వస్తున్నారు. కొళాయి దగ్గర ఎవరో ఒకరు వుంటూనే వున్నారు. ఇంత సేపట్నుంచి, ఇప్పుడిపుడే దానికి తెరపి దొరికింది.

"ఆమె నిప్పంటించుకుంది...." అని సందులోంచి వస్తోన్న ఓ వ్యక్తి వర్మతో అన్నాడు.

"ఎవరూ?" సజ్జన్, రాధేశ్యాం, వర్మ ముగ్గురు ఒకే కంఠంతో ప్రశ్నించారు.

"ఆవిడేనండి. డాక్టరు పరీక్షకోసం ఆమెను పిలిచారో లేదో, ఏదో మిష మీద వంటింట్లోకి వెళ్ళి వంటిమీద స్పిరిటో, కిరసనాయిలో పోసుకుని గుడ్డలకు నిప్పంటించుకుంది....తర్వాత జరిగింది విని ఏం చేస్తారు? ఈ జగదంబా సహాయ్ గాడ్ని వురితీయాలి, వాడి పెళ్ళాం, అన్నగారి పెళ్ళాం అంటే వదిన—ఈ యంగ్ విడో అత్తా...." అని ఇంకా చెప్పబోతూంటే

"ఆవిడకి ఎలావుంది?'' ఆగలేకపోతున్నట్లుగా సజ్జన్ అడ్డు తగిలాడు.

"ఆమె నిమిషాల్లో కాలిపోయింది. ఒళ్లంతా కాలింది. ఇల్లంతావాసన. తలుపులు బద్దలుకొట్టి పోలీసులు లోపల ప్రవేశించేసరికి ఆమె స్మారకం తప్పి పడిపోయింది. ఒళ్లంతా కాలి మాంసం ముద్దయింది. గుడ్డలు కాలిపోయినవేమో, దేహం అంతా నగ్నమైపోయింది."

"మీరు స్వయంగా చూశారా?" అని సందేహంగా ప్రశ్నించాడు సజ్జన్.

"అరె' నేను కళ్ళారా చూస్తే" చెప్పే వ్యక్తి మెల్లకన్ను వకీలు గారి సుపుత్రుడు. ఆత్మహత్య చేసుకున్న ఆ యువతి గురించి ఆ వ్యక్తి వర్ణిస్తోంటే అతడేదో రహస్యంగా ఆనందాన్ని అనుభవిస్తోన్నట్లు సజ్జన్ గ్రహించాడు. సజ్జన్‌కు బాధ కలిగింది. "మీరు నన్నో పర్యాయం అక్కడికి తీసు కెళ్ళండి" అని రాధేశ్యాం వైపు చూస్తూ అడిగాడు.

"అలాగేలెండి" రాధేశ్యాంకు ముందే వర్మ ఊ అన్నాడు. రాధేశ్యాం కూడ సరేనని ఒప్పు కున్నాడు. అక్కడ నుంచి వాళ్ళు కదిలారు.

వెళూతూ వెళూతూ దారిలో, "అక్కడ చాలా మంది వుండొచ్చను కుంటా. మీరేం చూస్తారు"? అని ప్రశ్నించాడు రాధేశ్యాం.

"చూసేదేంలేదు. ప్రజల మనోభావాలు ఎలా వుంటాయో చూడాలనీ వుంది. వాళ్లేమి అనుకొంటున్నారో వినాలని వుంది" అన్నాడు సజ్జన్.

సూర్యుడి ఎండ దూరని మురికి యిరుకు వాడలూ, వాడల్లో రాత్రిం బవళ్లూ కష్టాలతో తెల్లవార్చుకునే వారి జీవితాలూ మొదలైన ఎన్నో విష యాలపై రాధేశ్యాం పలికే సర్మోక్తులు వింటూ ఆంజనేయ స్వామి గుడి, సైఖద్ దర్గా, గోలీలు ఆడుకుంటూ బొంగరాలు తిప్పు కుంటూ మట్టిలో దేహాల్ని మలినం చేసు కుంటోన్న మనభావి భారత పౌరులూ ఆవులూ దూడలూ మీద మీదకు రాసుకుని పోతూన్న జనాన్ని తప్పించు కుంటూ. మూడు నాలుగు యిరుకు పాటి సందుల్ని దాటి ఆ మిత్రమండలి చివరికి ఓ ఖాళీ ప్రదేశానికి చేరుకుంది. చాలా మంది జనం అక్కడ గుమి గూడి వున్నారు

ఎదురుగా ఓ పెద్ద పాత ఇల్లు, వాకిలి దగ్గర ఇద్దరు పోలీసులు నిలబడి జనాన్ని లోపలికి పోకుండా ఆపుతున్నారు ఇంటికి ఎడమవైపు మెయిన్ రోడ్డు వరకు ఖాళీస్థలం వుంది. రోడ్డు మీద పోలీసు వాళ్ల పికప్ వ్యాను వుంది. ఖాళీ స్థలంలో కూడా చాలా మంది గుమి గూడి వున్నారు.

అంతలో లోపల్నుంచి ఇన్స్పెక్టరు వచ్చి అక్కడ నిలబడ్డ ఓ పోలీసు అధికారి చెవిలో ఏదో చెప్పాడు. వెంటనే అతను వ్యాన్‌వైపుకు పరుగెత్తాడు. ఇనస్పెక్టరు అక్కడ మూగిన జనాన్ని బెదిరిస్తూ అన్నాడు- పొండి పొండి. ఇక్కడేమైన లడ్లు పంచుతున్నారనుకున్నారా? "వెళ్లిపోండి.... సజ్జన్ గార్ని చూసి "ఏమిటండీ' మీరు కూడా దయ చేశారా!" అని పరామర్శించాడు.

సజ్జన్ పోలీసు అధికారితో కరచాలనం చేశాడు. అతని వెంట రాధేశ్యాం, వర్మ ఇద్దరూ ఇనస్పెక్టరు గారి వద్దకు వెళ్లారు.

"ఎలా వుందండీ ఆవిడకి?" అడిగాడు సజ్జన్ అధికారిని.

"ఫార్మాలిటీ కోసం హాస్పిటల్లో వేసి వస్తాం. బతకడం కష్టం" అన్నాడు ఇనస్పెక్టరు.

"బాగా కాలి పోయిందా?"

''బాగానే కాలి పోయిందను కోండి. అంతకన్న ఎక్కువగా ఆమె మనస్సుకు తగిలింది. ఇంకా యింజక్షన్లూ మందులూ అవీ ఇస్తున్నారు. ఏమైనా లాభంలేదు, సింక్ అవుతోంది, అంటూ అతను మళ్ళీ లోపలికి వెళ్ళాడు, సజ్జన్ శిలా ప్రతిమలా చూస్తూ నిలబడ్డాడు. "నేను.... " అని అంటూండగానే "ఓ ష్యూర్' తప్పక రండి" అంటూ పోలీసు అధికారి సజ్జన్ చేతిని పట్టుకుని లాగాడు. గేటు లోపల కాంపౌండు చిన్నదిగా వుంది. దాన్లో మూడు ఇళ్ళున్నాయి. మాస్టర్ జగదంబా సహాయ్ పూర్వీకులు బాగా ఓ వెలుగు వెలిగిన వాళ్ళే అయినా ఆరిపోతున్న దీపాలమల్లే వాళ్ళ స్థితిగతులు తయారయ్యాయి. పాతకాలపు పళ్ళని పొట్టి ఇటుకలతో కట్టిన గోడలు. ఒక్కొక్కటి విచ్చిపూడుతుంది. ఎదురింట్లో ఇంటి యజమాని వుంటాడు. ఇంట్లోకి ప్రవేశించగానే ముందు ధనుప్పాకారంలో వున్న వసారా, దానికి ఎడంచేతి వైపుగా ముఖద్వారం, కుడిచేతివైపు విశాలమైన హాలు.

వసారాలో ముంగిలిలో ఇంట్లో ఎక్కడ చూసిన పోలీసులు నిండిపోయారు. మాస్టర్ కూతురు కమ్యూనిస్టైన కారణంగా పోలీసులు ఇల్లంతా సోదా చేసిపారేశారు. చెప్పుకోతగ్గ వస్తువేదీ వాళ్ళకు చిక్కలేదు.

సజ్జన్ వాళ్ళు గడపదాటుతుండగా ఓ పోలీసు వచ్చాడు. అతణ్ణి చూడగానే పోలీసు అధికారి పందలోనే నిలబడిపోయాడు. అతన్ని సమీపించి కానిస్టేబిల్ సెల్యూట్ చేశాడు. మళ్ళీవార్త చెప్పాడు– ''కమీషనర్ గారికి వైర్‌లెస్ మెసేజ్ ఇచ్చాంసార్. మీర్జాగారు చూస్తున్నారని చెప్పమండి. అంబులెన్స్ పంపిస్తున్నాం అని చెప్పారండి".

''సరే ఎక్కణ్ణుంచైనా రెండు కుర్చీలు తీసుకొచ్చి ఆ ఎండలో వెయ్'' అన్నాడు ఇనస్పెక్టర్.

'యస్సర్' అనుకుంటూ పోలీసులోపలికెళ్లాడు. సజ్జన్ వైపు తిరిగి పోలీస్ ఇనస్పెక్టరు "ఇవ్వాళ వుదయం నుంచి టీ కూడా తాగలేదంటే నమ్మండి. ఈ వెధవ పోలీసు వుద్యోగం. పొద్దున లేవగానే పేపరు తిరగేస్తున్నా–మీ

గురించి వచ్చిన ఆర్టికల్ టూకీగా చూస్తున్నా. ఇంతలో సాలిగ్రాం గారు వచ్చారు. ఎలక్షన్ గురించి వారు నాతో ఓ విషయం అర్జంటుగా మాట్లాడాల్సి వుంది. అంతలో పనివాడి శవం కాలువలో కనిపించిందన్న రిపోర్టు వచ్చింది. మాస్టర్ జగదంబా సహాయ్ యింటిని ముట్టడి వేయండని సాలిగ్రాం గారు సలహా యిచ్చారు. వాని వుద్దేశ్యం ఏమంటే ఇక్కడేదో కమ్యూనిస్టు సాహిత్యం దొరుతుందని. ఇక టీ తాగడానికీ టిఫిన్ చేయడానికి సమయంయేదండి"

వాళ్ళున్న చోటికి కుర్చీలొచ్చాయి. కుర్చీలో కూర్చుంటూ సజ్జన్ జేబులోంచి సిగరెట్ కేసు తీసాడు. గోపురం ఆకారంలో ఏనుగు దంతంతో చేయబడిన సిగరెట్ కేసు అది. అతను ప్రత్యేకంగా ఆర్డరిచ్చి తెప్పించాడు. కేసు మధ్యభాగంలో నటరాజమూర్తి మనోహరంగా చిత్రించబడివుంది. సిగరెట్ కేసు తన చేతిలోకి తీసుకున్నారు శుక్లాగారు. తెరచి అటూ యిటూ చూసాడు. మళ్ళీ సజ్జన్‌కు ఇచ్చివేస్తూ "అదేమిటి. మైథిలీశరణ్ గుప్తగారన్నాడే ... అదేనండీ హైస్కూల్లో చదువుకున్నాం - పాయీ తుమ్‌హీసె వస్తు త్రైసే తుమ్ హే అర్పణ్ కరూ." నీ దగ్గర నుండి పొందిన వస్తువును నీకే ఎలా మళ్ళీ సమర్పించడం?

కేసులోంచి ఓ సిగరెట్టూ జేబులోంచి లైటూ తీసాడు సజ్జన్. శుక్లాగారు కూడ కేస్‌లోంచి ఓ సిగరెట్టు తీసుకుని పనితనాన్ని మెచ్చుకుంటూ మీ ఆర్టిస్టులు ఎక్కడెక్కణ్ణుంచో ఈ వస్తువులు ఏరుకొని వస్తుంటారు' అభినందించాడు.

"ఎవరు దేన్ని వెతుక్కుంటూ వుంటారో వాళ్ళకు అదే కనబడుతూ వుంటుంది. కదా" అన్నాడు సజ్జన్.

ఇంతలో తలుపు దగ్గర నిలబడివున్న షేర్ అలీని పిలిచాడు ఇనస్పెక్టరు

"సాబ్" అంటూ షేర్ అలీ వచ్చాడు.

"కొంచెం లోపలికెళ్ళి చూసిరా చచ్చిందో బతికిందోముండ''.

యస్సార్ అంటూ షేర్ అలీ వెళ్ళిపోయాడు. ఇనస్పెక్టర్‌తో నవ్వుతూ సజ్జన్ అన్నాడు–"పోలీసు వుద్యోగంలో మానవత, కరుణ ఇవన్నీ వుండవను కుంటా".

"ఏం చేయమంటారు. రోజూ ఇలాంటి సంఘటనలే చూడాల్సి వస్తుం టుంది. సజ్జన్‌గారూ, ఈ పోలీసు వృత్తిలో వుంటోందే అసలు మానవత్వం అనేది ప్రపంచంలో లేదన్న నమ్మకం ఏర్పడుతుంటుంది. పోలీసువాళ్ళదైరీ ఓ సారి తిరగేయండి. మీకే అనుభవం అవుతుంది– నిజం చెప్పాలంటే ఈ దేవా లయాలూ మసీదులూ, మతంగితం, ధర్మం, కర్మం ఈ మంచి విషయాలూ, మీ ఈ ఆర్ట్స్ కల్చర్ ఇదంతా ఓ పెద్ద వంచన, దగా, మోసం అనిపిస్తుంది. ప్రపం చం ఇంతమంచితనముతో నిండికూడా వేల సంవత్సరాలు కాలగర్భంలో కలిసిన తర్వాత మానవుని మేధస్సుపై తమ ప్రభావాన్ని వేయలేకపోయాయంటే నమ్మండి...." అంటూ ఓ సాంఘిక శాస్త్రజ్ఞునిలా మాట్లాడుతున్న ఇనస్పెక్టర్ శుక్లా అక్కడికివచ్చిన షేర్‌అలీవైపు తిరిగి "ఆఁ ఏం జరిగింది" అని అడిగాడు.

అధికారి మాటల్లో మునిగిపోయివుండడం చూసిన షేర్ అలీ మెదలకుండ వాళ్ళముందు నిలబడ్డాడు. ఇన్‌స్పెక్టరు అడిగిందే తడువుగా"ఇంకా అప్పుడే ఏం చెప్పలేం అంటున్నారండి డాక్టర్'' అని బదులు చెప్పాడు.

''చంపేసిందిరా ముండా ఛాంచో...."

"మీకు తిట్టడానికి అధికారం ఎవరిచ్చారు?" హాలు తలుపు దగ్గర నిల బడివున్న ఓ అందమైన యువతి తటాలున ప్రశ్నించింది.

శుక్లా దృష్టి మళ్ళించి వెనక్కు తిరిగి చూసాడు, తన అధికారాన్ని సవాలు చేస్తోన్న వ్యక్తి ఎవరా అన్న వుద్దేశ్యంతో, సజ్జన్ కూర్చున్న చోటు నుండి ఆ యువతి ఎదురుగా కనబడుతోంది. ఆమెను ఇంతకు ముందెక్కడో చూసినట్లుంది. నలుగురైదుగురితో కలిసి ఆమెతో మాట్లాడినట్లు కూడా జ్ఞప్తికి వచ్చింది కాని ఎక్కడ కలిసిందీ ఏ సందర్భంలో కలిసిందీ సజ్జన్‌కు జ్ఞప్తి రాలేదు. ఆ అందమైన సుందరిని ముఖంలో కళ్ళు ఆవేశాన్ని కురిపిస్తున్నాయి.

ఇన్స్పెక్టరు గారు నవ్వుతూ సంజాయిషీ చెప్పుకొన్నారు. "ఏం చెప్పమంటారు. మాకు మొట్టమొదట ఓ తెల్లాయన బాస్‌గా వుండే వాడు. అతడు కూడా తిట్టూతూనే మాట్లాడేవాడు. వాళ్లు పోయిన తర్వాత కాంగ్రెస్ దొరలు వచ్చారు. వాళ్లు కూడా అదేవిధంగా తిట్టూతూనే మాట్లా డుతున్నారు. ఇక మీ రొస్తే - మీ కమ్యూనిస్టు రాజ్యం వచ్చిన తర్వాత ఈ బూతు పంచాంగం కట్టిపెట్టాంలెండి."

" అలాటిది జరగాలే కాని మీలాంటి వాళ్ళను చావబాదైనా ఈ అలవాటు మాన్పిస్తాం" అంటూ ఆ యువతి హాల్లోకి తిరిగి వెళ్ళి పోయింది. ఆ యువతి శుక్లాతో మాట్లాడే టప్పుడు సజ్జన్ వైపూ చురచుర చూసింది. ఆ చూపుల్లో సజ్జన్‌తో ఆమెకు ఏదో పరిచయంవున్నట్లుగా అవుపించింది. ఇనస్పెక్టరు నవ్వుతూ "అందుకే అమ్మా కమ్యూనిస్టు రాజ్యాన్ని మేం రానివ్వనిది, ఏమంటారు మీరు?" అంటూ సజ్జన్ వైపు చూశాడు.

''ఏమైనా అనండి, ఈతిట్ల దండకం జపిస్తూ మాట్లాడడం నాకు కూడా బాగా అని పించడం లేదు" అని సజ్జన్ తన అభిప్రాయాన్ని బయట పెట్టాడు,

''నిజమే అనుకోండి, ఏం చెయ్యాలి, ఈ పోలీసు డిపార్ట్‌మెంట్ తిట్లు లేకుండా పని చెయ్యలేదే?"

''సార్, హాస్పిటల్ నుండి బండి వచ్చింది సార్'' అని పోలీసు అన్నాడు.

"నన్నేం చెయ్య మంటావ్ డాక్టర్ని అడగరా, తీసుకెళ్లే స్థితిలో ఆమె గారు వుందో లేదో. నువ్వుండు. నేనే వెళ్ళి వాటితో మాట్లాడి వస్తా. సజ్జన్‌గారూ, మీరిక్కడే వుండండి" అంటూ లేచాడు ఇనస్పెక్టర్ కుర్చీలోంచి.

"అః అః వెళ్లిరండి. నేను కూడా వెళ్లాస్తాను''

''అరె, కూర్చోండి. ఇప్పుడే వచ్చేస్తాను,,

ఇనస్పెక్టరు ముందూ, కానిస్టేబిల్ వెనుకా లోపలి కెళ్లారు.

సజ్జన్ జేబులోంచి సిగరెట్ కేస్ తీశాడు, అనవసరంగా ఇరుక్కు పోయాను. పాపం ఆమెకెలావుందో అన్న సంగతి గుర్తు కొచ్చింది. నిప్పు

అందించుకునే ముందు ఆమెకు కొంచెం కూడ భయం కలగలేదా! చావు ఎంత నికృష్టమైంది? ఆ ఆలోచనతోనే సజ్జన్ శరీరంలో గగుర్పాటు కలిగింది.

ఆ యువతి తిరిగి వచ్చి కాళీ కుర్చీ దగ్గర నిలబడి పోయింది.

"దయ చేయండి" అంటూ సజ్జన్ సౌమ్యాన్ని ప్రదర్శిస్తూ అన్నాడు.

"మీరిక్కడికి ఎందుకు దయ చేసినట్లు?"

ఇంగ్లీషులో కర్కశంగా అడిగిన ఆ ప్రశ్నకు సజ్జన్ తత్తర పడ్డాడు. అతను జవాబు చెప్పక ముందే ఆమె అందుకుంది.- "పోలీసు వాళ్ళతో మీకు స్నేహం ఎప్పట్నుంచి? క్షమించండి, నేను కొంచెం మోటుగానే ప్రశ్న వేసాను"

సజ్జన్ గంభీరంగా ఇలా అన్నాడు- "అందరూ అను కుంటూంటే విని వచ్చాను. ఈశుక్లా నాకు తెలుసు, ఇక్కడికి రాగానే నన్ను చూసి లోపలికి తీసు కొచ్చాడు"

"అయితే, పోలీసు వారితో పరిచయం వుంది కదా అని ఇతరుల నిస్సహాయతను మీరు ఆసరాగా తీసు కుంటారన్న మాట". ఆమె పలుకులు వాడిగానూ, ఆర్ద్రతను పూర్తిగా పీల్చి వేసిన వాడిలా పొడిగాను వున్నాయి.

సజ్జన్ తల వంచేసు కున్నాడు. "నా వల్ల పొరపాటైంది క్షమిచండి, ఇప్పుడే వెళ్ళిపోతున్నా" అని అన్నాడు.

ఈసారి యువతి కంఠంలో వాడితనంలేదు. కొంచెం నమ్రతగా అంది, "మిమ్మల్ని వెళ్ళిపొండని చెప్పడం లేదు. ఇంకో సమయంలో వచ్చివుంటే నేను చాలా సంతోషించేదాన్ని, నా మహద్భాగ్యం అని అనుకునేదాన్ని. అపరాధులు నా తండ్రి, నా వదిన అన్న విషయం మీకు తెలుసా?"

"ఆ సంగతి నాకేం తెలియదు. మీరు అన్యథా భావించకుండా వుంటే అసలు మీరెవరో కూడా తెలీదు. బహుశా మీరు కమ్యూనిస్టు పార్టీలో పనిచేస్తూ వుంటారను కుంటాను"

''లేదండి. నేను కమ్యూనిస్టును కాదు. కాని పార్టీ వాళ్ళతో నాకు సంబంధాలున్నాయి". అంటూ యువతి సమాధానం ఇచ్చింది.

''అసలు ఈ ఆపద మీ యింటిమీద రావడానికి కారణం మీరే అని మీకు తెలీదనుకుంటా'' రహస్యాన్ని బయట పెడుతూ అన్నాడు సజ్జన్.

దానికి ఆమె బదులు చెప్ప లేక సజ్జన్‌ని అలాగే చూస్తోంది.

''మీ దగ్గరకు కమ్యూనిస్టు పార్టీ వాళ్ళు పోగవుతుంటారు,

అందు వల్లనే మీ ఇంటి మీద ఒక కన్ను వేసి వుంచారు. ఆమూలాన్నే మీ ఇంట్లో జరిగిన ఈ అపరాధాన్ని ఇంత త్వరలో....'' అంటూ ఆగిపోయాడు సజ్జన్.

''ఎవరు అపరాధం చేసింది? నా తండ్రా నా వదినా?''

ఒక క్షణం ఆగాడు సజ్జన్ ఆలోచిస్తూ. మళ్ళీ చెప్పాడు– "ఇద్దరూ అప రాధులే. కాని ఇప్పుడు మీ వదిన...,, అంటూ మరేం మాటాడలేక పోయాడు.

''నా తండ్రి చేసిన అపరాధానికి ఆమె శిక్ష అనుభవిస్తోంది'' అంటూ యువతి నిష్క్రమిస్తూ మళ్ళీ తిరిగి" ఒదిన చేసిన అపరాధం ఏమిటి? నిండు యవ్వనంలో పసుపు కుంకుమ పోగొట్టుకోవడమా, లేక నిండు చూలాలు అవడమా?" అని ఎదురు ప్రశ్న వేసింది.

ఈ యువతి ఇప్పుడు చాలా వుద్రేకంలో వుంది. ఏదో విధంగా విరుచుక పడాలని చూస్తోందని సజ్జన్ గ్రహించాడు. ఆమెను శాంతింప చేయాలన్న సంకల్పంలో మృదువుగా అన్నాడు– ''నా దృష్టిలో ఆమె దోషికాదు. కాని పసి పాపను చంపినందుకు మాత్రం నేను....'' అని పలికి మళ్ళీ ఎందుకో ఆగి పోయాడు.

''అది నా తండ్రి చేశాడు. ఒదినను అన్ని రకాల బలవంతం చేశాడు. నాకన్నీ తెలుసు నేనే చెప్తున్నాగా''.

ఉద్రేకంలో ఆ యువతి ముఖం ఎర్రబారింది. ముందుకు రెండడుగులు వేసి మళ్ళీ ఆగిపోయింది. "ఒదిన తప్పంతా ఆమె ఒక ఆడదిగా వుండడం, ఆర్థికంగా ఆమె సర్వ స్వతంత్రురాలుగా లేక పోవడం. అంతే'' అంటూ ఆమె తనలో తాను గొణుక్కుంది.

గుర్లప్పగించి నేలను చూస్తూ ఆ యువతి నిలబడి వుంది, నిశ్శబ్దంగా సజ్జన్ ఆమెను అలాగే చూస్తూ వున్నాడు. కళ్ళతో చూడని అపరాధిని తలుచుకొనగానే అతని హృదయంలో సానుభూతి పెల్లుబుకుతోంది. ఆమె నిర్దోషిత్వాన్ని చాటుతోన్న దగ్ధ హృయానికి ఆ సానుభూతినే పంచి పెట్టాలని అతని హృదయం ఆరాట పడుతోంది. చెరిగి పోయిన ముంగురులతో, బాధతో ఐరు వెక్కిన కళ్ళతో, దుఃఖాతి శయంతో జేవురించిన సుందరని ముఖాన్ని జాలీ స్నేహమూ నింపుకున్న కళ్ళల్లోంచి చూస్తోంటే ఆమెను ప్రేమించాలనే భావం కలిగింది సజ్జన్‌కు. మళ్లీ వెంటనే తనలో తనకు తెలియకుండా ప్రవేశించిన మనో భావాన్ని తలుచుకో గానే మనసు సిగ్గుతో కుంచించుకుపోయింది. అతను తన కళ్ళను ఎత్తి ఆమెను చూడ లేకపోయాడు.

"మీరు ఒక ఉపకారం చేసిపెట్టండి. ఇక్కడ్నించి పోలీసువాళ్ళను తక్షణం వెళ్లిపొమ్మని చెప్పండి. మేము తనివితీరా ఏడవ డానికూడా అవకాశం ఇవ్వడంలేదు వాళ్ళు" అని ఆమె అంటోంటే కళ్ళలో నీరు నిండు కుంది. ముక్కు పుటాలు కంపిస్తున్నాయి.

ఆ దృశ్యాన్ని చూడలేక సజ్జన్ మళ్ళీ కళ్ళు దాచు కున్నాడు "ఛీ ఛీ, ఆడది అనుభవించే వస్తువేనా కేవలం?'' తనకు తానే ప్రశ్నించు కున్నాడు. యువతి అక్కడనుంచి హాల్లోకి వెళ్ళిపోయింది.

# 7

"ఇది ఆలిండియా రేడియో, లక్నో, అలహాబాదు, పాట్నా కేంద్రాలు. మీరు కోరిన సినిమా పాటల కార్యక్రమం ఇంతటితో సమాప్తం..."

తార చటుక్కున లేచి లాహోరు స్టేషను పెట్టింది.

"ఛం ఛం బాజె పాయల్ మోరీ

ఆజా చోరీ చోరీ ఆజా చోరీ చోరీ"

ఆకాశవాణి ప్రసార సంగీతానికి పంతెన కట్టింది పాకిస్తాన్ రేడియో ఫిలిం సంగీత కార్యక్రమం. ఆనందానుభూతిని హఠాత్తుగా పోగొట్టుకున్న సినిమా పాటల శ్రోతల లోకం మళ్ళీ ఒక్కసారిగా పుంజుకుంది.

తార మళ్ళీ వచ్చి మంచం మీద వాలింది. బోర్లా పండుకుని గడ్డాన్ని అరచేతిమీద ఆన్చి రికార్డులు వింటోంది, పెద్దకోడలు ఈజీఛైర్‌ను మంచానికి కలిపి కుర్చీలోనే పద్మాసనం వేసుకుని కూర్చుంది. తారమళ్ళీ మంచం మీదకు వచ్చిన తర్వాత ఆపేసిన ప్రసంగాన్ని ప్రారంభిస్తూ చిన్న కోడలు అంది-"నేను చూశాను నందో భర్తని అతనికి రెండో పెళ్ళి మా పిన్నమ్మ పెద్ద కోడలు అన్న కూతురితో అయింది. ఏదో పాతకాలం మనిషి. కాని పెద్ద మనిషి. చూడ్డానికి బావుంటాడు.

"ఆమె గారికి సాక్షాత్తు మన్మథుడొచ్చినా అంతే మొగుణ్ణి కాల్చుకుతినే దయ్యం అది. నీకి విషయం తెలుసా"అంటూ మెరుపుతీగెలా కుర్చీలోంచి లేచి మంచంమీద కొచ్చి కూర్చుంది పెద్దకోడలు. పెద్దకోడలు హుషారుగా లేచి కూర్చోవటం చూసి చిన్న కోడలకు మతిపోయినట్లయింది.

అరదాని అందాన్ని కొద్దిగా వికృతంచేసినా సృష్టి సౌందర్యంతో ఆమె మనస్సును మధురోహలలో ముంచెత్తే తార కడుపులో పెరుగుతున్న ఎనిమిది నెలల పసిగుడ్డు, ఆమె ఆసియనాల్ని ఇష్టంవచ్చినట్లు తిప్పుకోవడానికి అవకాశం ఇవ్వకపోయినా, ఆ ఇచ్చినంత మేరకే కాళ్ళు ముడుచుకున్న తార, పెద్ద కోడలు మాటతో హుషారై ఏమిటి చెప్మా అని ఎదురు చూస్తోంది.

ఎడమ కాలుకు బాచిపట్టుగా వేసి కుడికాలు ముడిచి మోకాలిపై చేతిని ఆనించి వేళ్లు ఆడిస్తూ మెల్లిగా అంది పెద్దకోడలు- "సందో పెట్టెలో కొన్ని ఫోటోలు దొరికాయ్. ఒక్క డజను ఫొటోలు. అవన్నీ ఒకే సెట్టు".

5

''ఏం ఫోటోలు?" అంటూ చిన్న కోడలు ఓపిక పట్టలే నన్నట్టుగా అడిగింది. ఆ రహస్యాన్ని ఎంత త్వరగా విందామా అన్న తొందర ఆమె ముఖం మీద స్పష్టంగా కన పడు తోంది. ఆమె చెప్పే ఆసక్తి కరమైన విషయం ఏమిటా అని ఆరాటంతో తార కూడ పెద్ద కోడలు వైపు చూసింది.

''బజార్లో కనబడవూ అబూతు ఫొటోలు. అవిచూస్తూంటే నాకుకడుపులో దేవేస్తున్నట్లుగా వుంటుంది'' అని పెద్ద కోడలు చెప్తూంటే ఆమె మాటల్లో తొట్రుపాటు కనిపించింది. శరీర మంతా ఒక్కసారి పులకించి కళ్ళలో మత్తు లాంటిది వ్యాపించింది.

''నువ్వు చూశావా ఆ ఫోటోలను?" అని అడిగింది తార

''అవునోయ్, చూసానంటే. పొద్దున మా వారు నందో ఇంకా యేమేమి రొగిలించిందో చూద్దామని ఆమె పెట్టె సోదా చేశారు, ఎంత పోట్లాట అయిందను కున్నావ్ దాని గురించి మా చెల్లెల్ని అడుగు. మా వారి స్వభావం నీకు తెలిసే వుంటుందను కుంటా. వారికి కోపం వచ్చిందంటే వైస్ రాయిని కూడ లెక్క చేయరు"

పెద్ద కోడలు భర్త మనియా రసికుడు. అందుకనే కాలేలు మొదట్లో భార్యను మహా సంతోష పెట్టేవాడు కాని అది ఎంతసేపు, మనియా అంటే పెద్దకోడలు వణకి పోయేది. ఆడబిడ్డైన నందో విషం మూట. ఎప్పుడూ అన్న చెవులు కొరుకు తుండేది. లేనిపోని చాడీలు చెప్పి ఆమెను ఏడి పిస్తుండేది. దెబ్బలు కూడ వేయిస్తూ వుండేది. తన అన్న తను చెప్పి నట్లు వుండేందుకు నందోయే సంతో కోడలితో అతనికి అనుచిత సంబంధాన్ని యేర్పాటు చేసింది. ఇవ్వాళ నందోను తన భర్త దావబాదు తుంటే అందుకే ఆమెకు అంత సంతోషంగా వుంది.

ముగ్గురూ కలిసి మాటామంతీ మాట్లాడుకొంటూండగా తార మిస్టర్ వర్మ గొంతులతోపాటు తన భర్త గొంతు వినపడగానే చిన్నకోడలకు ఏమి చేయాలో తోచక వుబ్బితబ్బిబ్బైంది పడక కుర్చీలోంచి లేచి తలుపు దగ్గరకు

వెళ్ళి చేతులు జోడిస్తూ వర్మగారికి నమస్కరించింది. తర్వాత తిరిగి ఆమె ఏదో అడగాలని అనుకుంటూ వుండగానే వర్మగారన్నారు. చూడండి, పారి పోయిన మీ ఖైదీని జందిచేసి తీసుకువచ్చాను.

ఆ మాటలు వింటోంటే చిన్న కోడలు ముఖం మీద తెరలు ముంచు కొచ్చాయి. ఓ చిరునవ్వు నవ్వింది తార.

"అలా ఎందుకనుకోవాలి. పారిపోయిన ఇద్దరు ఖైదీలు ఒకరికొకరు చిక్కుకుని తమతమ రాణుల సన్నిధిలో చేతులు కట్టుకొని నిలబడ్డారని ఎందుకు అనుకోరాదూ" అని తమాషాగా శంకర్‌లాల్ అన్నారు.

నలుగురూ ఆ మాటకు పెద్దగా నవ్వుతూంటే వాళ్ళ నవ్వుతో ఆహాలంతా ప్రతిధ్వనించింది.

లోపలగదిలో మంచం కాళ్ల కట్టు మీదకు వంగి చెవులు నిక్కించి వాళ్ళు ఎట్లా మాట్లాడుకుంటారా అన్న వుత్సాహంతో వుంది పెద్దకోడలు. తార అన్నా, తన తోడికోడలన్నా ముఖ్యంగా తోడికోడలంటే మనస్సులో ఓ మూల అసూయ వున్నా ఆమె అంటే కుళ్ళిపోదు పెద్దకోడలు. తార చిన్నకోడలు తమ అస్తి త్వాన్ని మరచి వేళాకోళంగా మాట్లాడుతోంటే శృంగారాన్ని అద్దుకున్నా ఆ కబుర్లు వింటూ పెద్దకోడలు మహా ఆనందపడ్తోంది.

ఇంతలో మరిదిగారి కంఠం వినపడింది- "పద సరూప్, ఇంటికి త్వరగా వెళ్దాం. వెంటనే ముస్తాబు చేసుకొని బయలుదేరాలి".

"వుండండి. కొంచెం టీ సేవించి వెళ్లురుగాని" అని తార అంది. "ఇవన్నీ పెట్టుకోకండి" అని శంకర్ వారిస్తోంటే వర్మగారు అందుకొన్నారు. "అరే కూర్చోండి మహాశయా, మీ పేరున నేనూ ఓ కప్పు తాగుతా. లేకపోతే మా ఆవిడగారు ఏదో వంకపెట్టి ఎగనామం పెడ్తుంది."

"వింటున్నారా మిసెస్ వర్మగారూ, మీ వారు ఫిర్యాదు చేస్తున్నారు."

"ఆ ఫిర్యాదులన్నీ మీరే వినండి బాబు. కృతజ్ఞతలేని వారి మాటల్ని ఎంత కాలం వినడం?"

తార లోపలికి వెళ్లినట్లుంది. చిన్ననవ్వు తర్వాత వర్మగారి కంఠం మళ్ళీ పెద్దకోడలు చెవుల్లో పడింది. ఏదైనా సినిమా ప్రోగ్రాముందా ఏం అని ఆమె మరిదిని అడుగుతున్నారు.

"అవునండి అతను మా స్నేహితుడే. మీరు పేరు కూడ వినివుంటారు. విరహేష్జీ 'బహార్ ఆయీరే' చిత్రానికి పాటలు వ్రాశారు.

అవునవును. ఇప్పుడు నడుస్తోంది. ఎలావుందేమిటి పిక్చరో? అని వర్మ ప్రశ్నించారు.

'ఇదిగో' అని దూరనన్నుంచి తార మొగుణ్ణి పిలిచింది. అప్పుడు కాని తార వంటింట్లో వుందని పెద్దకోడలికి తెలియలేదు.

"శంకర్ బాబూ, ఇప్పుడే వస్తున్నా" అని దూరంగా మిస్టర్ వర్మ పలికారు.

"చూడండి మిస్టర్ వర్మా. ఇలాకూర్చోండి. ఎందుకండి ఈమర్యాదలన్నీ అని శంకర్‌లాల్ అంటున్నాడు.

"ఏం లేదు ఇప్పుడే వస్తా" అంటూ వర్మగారు మాయమయ్యారు.

ఏవో మిఠాయిలు తేవడానికి వెళ్ళివుంటారనుకుంది పెద్దకోడలు

"మిసెస్ వర్మ గారూ, అనవసరంగా మీ వారికి శ్రమయిస్తున్నారు" శంకర్‌లాల్ తారతో అంటున్నాడు.

"అదేమిటి ఏదో దారితప్పి మా యింటికి వచ్చారు. సరూప్, మోహినిని పిలువు. ముసుగేసుకుని లోపల్నే కూర్చుంది"

'ఏమీ, వదినగారిక్కడే వున్నారా? వదినా" అంటూ శంకర్ కేకేసాడు. అతనికేకతో పేపరు పేజీలు తిప్పుతూ వున్నచప్పుడు అయింది.

మోహిని అంటే పెద్దకోడలు సంకోచిస్తూలేచింది. గది తలుపుదాక వచ్చి నిలబడిపోయింది. హాలులో శంకర్‌లాల్ సోఫాలో కూర్చున్నాడు. "ఏమమ్మా వదినగారూ, ఏదో దొంగలా అలా దాక్కుని కూర్చున్నావేమిటమ్మా? ఇంట్లో నిన్ను వెదకివెదకి రానంటే నమ్మ" చిరునవ్వు నవ్వుతూ శంకర్‌లాల్ అన్నాడు.

"ఇది రేడియో పాకిస్తాన్ ఫిలిం రికార్డులు" అని చెప్తుండగా నే "మోహిని. రేడియో మూసెయ్" అంటూ వంటింట్లో నుంచి ముందానికి ఆనుకొని నిలబడివున్న తారకొంచెం బిగ్గరగా పలికింది. టీకెటిల్ దించి పాంగిన్నె స్టౌమీద పెడ్తుంది. మరిది అడిగిన దానికి జవాబు చెప్తూ మోహిని రేడియో మూయటానికి "మనస్సులో వున్న దొంగను వెతుక్కొంటూ ఇంతదూరం వచ్చి పైగా నాకెందుకు కృతజ్ఞతలు తెల్పుకోవడం" అన్నది పెద్దకోడలు.

రేడియో ఆగిపోయింది. "ఈమె ఎక్కడుంది నా హృదయంలో ఆమె అసలే వెలుతురు. నా మనస్సులో దాక్కుంది నువ్వే" హాల్లోంచి సమాధానం యిచ్చారు శంకర్.

నవ్వుతూ వదిన గదిలోంచి బయట కొచ్చింది. ఆమెను చూస్తూ "అన్నయ్య మనస్సులో దాక్కున్నావనుకో. అలాగైనా ఒకదేగా" అన్నాడు.

తార, చిన్న కోడలు ఇద్దరూ నవ్వుతూండడం పెద్ద కోడలు చూసింది కంఠంలో కొంచెం వయ్యారాన్ని తెచ్చుకుని "వింటున్నారుగా మరిదిగారి మాటలు. అబద్ధాలాడడంలో మా మరిది ఎం. ఏ. పట్టం పుచ్చుకున్నారు. పైకి మాత్రం మనసు మమతా అంటూ ఏవేవో నటిస్తారు. వదినా, నిన్ను పిక్చరుకు తీసుకెడాతానని అంటాడేమో చూడు" అంటూ పెద్ద కోడలు మరిదిపై ఓ చిన్న విసురు విసిరి వంటింటి వైపు వెళ్ళింది.

"ఒదిన్నకు ఎవరూ కుంకుమ బొట్టు పెట్టి పిలిచే ఆచారం లేదు. వాళ్ళే బలవంతంగా మెడకు తగుల్కొంటారు. మిసెస్ వర్మగారు నా అభిప్రాయంతో ఏకీభవిస్తారని నా వుద్దేశ్యం" అంటూ హాల్లోంచే జవాబిచ్చాడు శంకర్.

ఇంతలో వర్మ పొట్లాలు తీసుకుని వచ్చారు. భర్త చేతిలోంచి పొట్లాలు అందుకోడానికి ముంగిట్లోకి వెళ్ళింది తార. ట్రేలో టీకప్పులూ పాలు సర్దుతోంది చిన్న కోడలు. ఆమె దగ్గర కూర్చుంది పెద్ద కోడలు, వర్మ గొంతు వినగానే మోహిని ముసుగు కొంచెం సవరించుకుంది.

టీపి. కారం రెండు పొట్లాలూ భార్య చేతికిచ్చి శంకర్‌లాల్ దగ్గర కొస్తూ వర్మ ఇలా అన్నాడు - "ఎవరినండీ సమర్థించ మంటున్నారు?"

"అఁ ఏమిలేదు. ఒక వదిన అఘాయిత్యం చేస్తుంటే ఇంకో వదినగారిని ఆ విషయం గురించి తీర్పు చెప్ప మంటున్నా. అంతే" అంటూ శంకర్‌లాల్ నవ్వుతున్నాడు.

సోఫా మీద నుంచి తల వెనక్కి తిప్పి నడువా వంటింట్లోకి చూశాడు వర్మ. "అదా సంగతి. మీ వదినగారూ ఇక్కడే వున్నారన్న మాట. కాని మీరేదో తీర్పు చెప్పమని మరెవ్వరినో అడుగు తున్నారు. అలా అడిగేముందు... మరి వాళ్ల అర్హత గిర్హతా గురించి మీకేమైనా తెలుసా...." అంటూ మెల్లగా బాణం సంధించాడు వర్మ.

"మిస్టర్ వర్మ, ఇప్పుడు ఆడవారిని అయోగ్యులుగాను అనర్హులుగాను నిర్ణయించే రోజులు పోయాయి. రాజ్యాంగం కూడ వారికి సమానాధికారాలు ఇచ్చిందిసుమా"

తార ట్రే తీసుకొచ్చి గుండ్రని బల్లపై వుంచుతూ "ఇవన్నీ సంస్కారం వున్న వాళ్ళకు అర్థం అవుతాయి మీలోటి పల్లెటూరి రైతుతో చెప్తే ఏం అర్థ మౌతుంది శెలవివ్వండి, అంటూ తన భర్తవైపు సొగసుగా చూస్తూ వ్యంగోక్తిని విసిరింది. ఆమె నర్మోక్తికి శంకర్ వర్మ ఇద్దరు నవ్వారు.

"ఇంక నాకు మాటలు చేత కావడంలేదు మిసెస్ వర్మగారు" అన్నాడు శంకర్.

చిన్న కోతలు టీపీ కారం ప్లేటు తీసుకుని అక్కడికి వచ్చింది. ఆమెను చూడగానే శంకర్‌కో కొత్త వుత్సాహం వచ్చింది "సరూప్ కూడ నన్ను పల్లె టూరి రైతు కింద జమ కట్టుందేమో అని భయం"

"పొలికల్చి ఇట్టి అంటాను" అని సరూప్ అనగానే వర్మ తార నవ్వారు శంకర్‌లాల్‌కు కూడ నవ్వొచ్చింది.

వంటింట్లో వున్న మోహిని ఇద్దరు దంపతుల సరసవాక్చాతుర్యాన్ని వింటోంది. ఆమెకూ ఓ భర్త వున్నాడు, కాని ఏం లాభం? ఆమె తమాషాగానైనా అతణ్ణి అనగలదా? ఇంతలో తార వచ్చి రమ్మనమని పిలిచింది. చేతి సౌంజ్ఞతోనే నాకు సిగ్గేస్తుందన్నట్లుగా మోహిన వారించింది.

శంకర్‌లాల్ లేచి తారతో "మీరిలా కూర్చోండి" అని అన్నాడు.

"మీ వదినగార్ని పిలవండి ఆమెగారికి సిగ్గుగా వుందట" అని తార శంకరును చూస్తూ అంది.

పెద్ద కోడలు తారను గుడ్లు మిటకరించి చూసింది. శంకర్ ఒదినను పిలిచాడు. తార శంకర్‌లాల్ సోఫాపై వచ్చి కూర్చుంది. చిన్న కోడలు సరూప్ టీ కలుపుతోంది.

శంకర్‌లాల్ లేచి ఒదిన దగ్గర కొచ్చాడు. సిగ్గుతో ముసుగు తలపై లాక్కొని సంకోచంతో అడుగులు వేస్తూ మెల్లిగా వస్తోంది. ఆమె వైపు చూస్తూ "మా వదినగారి బెట్టు మీకు తెలీదు లెండి. అన్నయ్య ఆమెను పొగడ్తలు చేయించు కొనేలా చేశాడు" అని అన్నాడు.

మోహిని నడవాలోకి వచ్చింది మిస్టర్ సర్ఫ్ లేచి నమస్కరించాడు. మోహిని కూడ ప్రతి నమస్కారం చేసి తార వద్దకు వచ్చి కూర్చుంది. మిఠాయీ ప్లేటును తార చేతిలో తీసుకుని శంకర్‌లాల్ వైపుగా తోసింది. చిన్న కోడలు టీ కప్పును వర్మగారికి అందించింది.

స్త్రీ పురుషులు కలిసి ఈవిధంగా కూర్చుని టీ త్రాగే అవకాశం పెద్ద కోడలుకు ఎన్నో సంవత్సరాల తర్వాత తిరిగి లభించింది స్కూల్లో చదువుకునే రోజుల్లో క్రిష్టియన్ సిస్టర్‌తో వాళ్ళ బంధువు లింట్లో ఆ దంపతులితో పాటు కలిసి ఆమె టీ త్రాగింది. కాని అప్పటి విషయం వేరు. ఆమె ఇంకా వివాహిత కాదు. ఇప్పటి బంధనాలూ సంకెళ్లూ అప్పుడులేవు. ఆమెకు చాలా ఆనందం కలిగింది ఇప్పుడు కూడా మజావుంది కాని ఎన్నో బంధనాలూ, సంకెళ్లూను. తార, చిన్న కోడలు స్వేచ్ఛగామాట్లాడుతోంటే ఆమెకు చిన్న తనంగా వుంది.

ఆమె కుదించుకుని పోతున్నట్లనిపించింది. అందరికీ టీ అందించిన తర్వాత సరూప్ అక్క దగ్గరకొచ్చి కూర్చుంది.

వర్మ దంపతులు వారిచే ఫలహారం చేయించితే దానికి బదులుగా శంకర్ లాల్ దంపతులు వాళ్ళిదరినీ సినిమాకు రమ్మనమని ఆహ్వానించారు.

"మీకు సాంగ్ రైటర్ గారు ప్యాసు....." అంటూ నడిగాడు వర్మ.

వర్మగారి సందేహాన్ని తుంచుతూ శంకర్‌లాల్ అన్నారు– "అటువంటి దేమీలేదు, ప్యాసులూ ఏవీలేవండి. అతడు పదేపదే కోరుతూంటే పోనీలే ఇవ్వాళ ఎలాగూ ఆదివారం కదా, ఏదో ఒక పిక్చరు చూడాలి అనుకున్నాం. పదండి మిసెస్ వర్మా, మేము మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాం"

వర్మ దంపతులు ఒకరి నొకరు చూసుకుని కళ్లతోనే మాట్లాడు కున్నారు. సినిమాకు రావడానికి అంగీకరించారు

ఒదినని చూస్తూ– "ఒదినగారు, మీరుకూడా పదండి. ఇవ్వాళ్ళ మిమ్మల్ని షికారుకు తీసుకెళ్తాను. ఖంగారు పడకండి అన్నగారి దగ్గిర నుండి ఆజ్ఞా పత్రం తెప్పిస్తా లెండి" అన్నాడు మరిది.

అనుజ్ఞ అనగానే సిగ్గుతో కుంగి పోయింది మోహిని. ఆ ఇద్దరు దంపతులూ ఆమెకు సానుభూతి ప్రకటిస్తున్నా రన్నట్లనిపించింది. "నేనెంత అశక్తురాలిని. కేవలం నా భర్త కారణంగా నలుగురు మధ్యా తక్కువగా వుండాల్సి వస్తోంది–అనుకుంది.

పెద్ద కోడలు దించిన కళ్లు ఎత్తలేదు. అందరూ లేచారు సినిమాకు వెళ్ళడానికి. ఆమెకు కూడ వారి వెంటనే లేచి మెల్లగా అనుసరించింది.

# 8

మేటినీ ఆట వదలంగానే హాల్లోంచి జనం గొట్టంబావిలోంచి వస్తున్న నీటిలా ధారావాహికంగా బయటికొస్తున్నారు. సరీగా ఆట ఒదిలేటప్పటికి వర్మ,

శంకర్‌లు తమతమ కుటుంబాలతో టాంగాల్లో సినిమా హాలుదగ్గరకు చేరుకున్నారు. టాంగా దిగగానే వాడికిడబ్బు యివ్వడానికి శంకర్ పర్సుతీసాడు. మిసెస్ వర్మ మోహినితో రెండోటాంగాలో వచ్చిన వర్మ "మీరు వుండండి, నేను యిస్తాను" అంటూ టాంగావాల వైపు చూసి "నీ బాడుగ ఆ టాంగావాలాకి యిచ్చేశాను తీసుకో" అన్నాడు.

శంకర్ పర్స్ జేబులో పెట్టుకుంటూ "భలేవాళ్లండి నేను టిక్కట్లు తీసుకోస్తాలెండి' అని నవ్వుతూ అన్నాడు.

"నేను వెళ్తాను" అని వర్మ ముందుకు నడవగా శంకర్ వారిస్తూ మిస్టర్ వర్మ ప్లీజ్ అని బతిమాలుకున్నాడు. వర్మ వెనక్కు తగ్గాకు టిక్కట్ల కోసం శంకర్ వెళ్లాడు.

ముగ్గురు ఆడవాళ్లను తీసుకొని వర్మ ముందుకు నడిచాడు. ఒకవైపు ఆడవాళ్లఅందాన్ని ఆకలికళ్ళతో జుర్రుకొనేజనాన్నీ తప్పించుకుంటూ, మరోవైపు ఆధునికనాగరికతావ్యామోహంతో రకరకాలఫ్యాషన్లతోఅలంకరించుకున్న మహిళా సమూహాన్ని ఓరకంట చూస్తూ నెమ్మది నెమ్మదిగా దారిచేసుకుంటూ, ముందుకు నడుస్తున్నారు హాలుగేటు వైపుకు.

అంతలో శంకర్‌లాల్ వచ్చి వాళ్ళను కలుసుకున్నాడు. అతని వెంట మరో వ్యక్తికూడా వున్నాడు. వుంగరాలు తిరిగిన పొడుగాటి జుట్టూ, కళ్లకు పెద్ద కూలింగ్ గ్లాసులూ, వున్ని చొక్కా, పైజామా, కళ్ళకు జోళ్లు, పెషావర్ చప్పల్స్. ఎడంచేతిలో ఎస్టర్‌కోటూ, కుడిచేతిలో ట్రిబుల్‌ఫైవ్ సిగరెట్టు టిన్నూ చూడ్డానికి చాలా ఆధునికంగా వున్నాడు.

"మిస్టర్ వర్మ. వీరే సుప్రసిద్ధ కవి విరహేష్జీ. ఈ పిక్చరుకు పాటలు రాసింది వీరే. మరి వీరు....మిస్టర్ త్రిభువన్‌నాథ్‌వర్మ. కేసరీ బాగ్‌లో అటంతా రేడియో యింజనీరింగ్ వర్క్స్ వీరిదే. వారు మిసెస్ వర్మ. వీరు నా ఒదినగారు మిసెస్ మోహినీలాల్. ఈమె – మీ కవులు ఒళ్ళు మైమరచి తన్మ

యత్వంలో ఏవేవో మనోహరమైన పేర్లతో పిలుస్తుంటారే-వారే పీరు-మిసెస్ సరూప్ కుమారిలాల్" అంటూ అందర్నీ పరిచయం చేసాడు శంకర్.

తార కొంచెం స్టైల్‌గానూ, సరూప్ చిరునవ్వుతోనూ, మోహినీలాల్ సిగ్గుచాటున పులకించుతోన్న హృదయపు టంచుల్ని స్పృశిస్తూనూ, కవిగారికి నమస్కరించారు. విరహేష్‌గారు పెదవుల మీదికి సన్నని చిరునవ్వు తెచ్చుకొని నాజూగ్గా చేతులు జోడించి, ఆధునిక కాలంలో ప్రతి రచయితా కళాకారుడూ నాయకుడూ ఉపనాయకుడూ వగైరా వగైరా చిల్లర దేశాలు పేటెంట్ చేసిన పద్ధతిలో నమస్కరించాడు.

విరహేష్ గారిని చూసిన తర్వాత వర్మ తానెంతో కృతార్థుడైనట్లు భావించాడు. ఏ దేవతల్ని దర్శించడానికి నూటికి ఎనభైమంది పిల్లలూ పెద్దలూ పొంగకారుస్తూ వుంటారో ఆ కోవకు చెందినవాడు విరహేష్. ఇక ఆడవాళ్ళ విషయం అంటారా. వాళ్ళు కూడ ఎవరో ఓ అయ్యకు అమ్మగానో, భార్యగానో, కూతురుగానో వున్నవారే కద. ఉదయం లేవగానే మేలుకొలుపుపాటలూ సుప్రభాతాలూవల్లించడమానేసి "బే ఇమాన్ బలమా జా-బలమా జా బలమా జా" అంటూ సినిమారికార్డువినడం, కూనిరాగాలుతీయడంఅంటే వాళ్ళకుఎంతోసరదా. ఏ సినీతార ఏఏ చిత్రాల్లో నటిస్తోంది, ఏఏ కంట్రాక్టుపై సంతకం చేసింది, వాళ్ల తల్లి తండ్రులూ తాత ముత్తాతలు ఎవరైంది వాళ్ళను అడగండి. గడగడమని వంశవృక్షాన్నంతా క్షణంలో ఏకరువుపెడతారు. ఏ స్టార్‌తో ఎవరికి ప్రేమాయణం నడుస్తోంది, ఇప్పుడది ఎన్నో అంకంలో పడింది, ఎవరి ప్రేమ విఫలమైంది, మొదలైన వివరాలన్నీ తాజాగా చెబుతారు. చిత్రజగత్తుకు సంబంధించిన ఎంతోమంది నిర్మాతలూ, దర్శకులూ, సంగీత దర్శకులూ, కెమెరామేన్‌లు, నేపథ్యగాంతుకలూ, రచయితలూ, పాటలు రాసే వారూ తమ వివరాలన్నీ తమవద్ద కన్న తాము అంటే పడిచచ్చే ప్రేక్షకలోకం చేతుల్లోనే చాలభద్రంగా వుంటాయని మంటా పథంగాచెప్పగలరు. ముఖ్యంగా పట్టణాల్లో ఎనభైశాతం కుర్రకారు దృష్టి అంతా సినిమామీదే అనుకోండి. విరహేష్‌ని కలుసుకోగలిగి

నందుకు తారకూ చిన్న కోడలకూ, పెద్దకోడలకూ, ఎంతో వుల్లాసం కలిగింది. గర్వపడ్డారు.

"కేవలం నా బలవంతం మీదే యీయన ఇక్కడికి ఇలా రావడం జరిగింది" అని అంటూ శంకర్‌లాల్ తన గొప్పతనాన్ని చాటుకున్నాడు.

"కరెక్ట్. ఇవ్వాళ ముగ్గురు స్నేహితులు కారు వేసుకొచ్చి మాతో కూర్చోని సినిమా చూడాలి రమ్మని బలవంతంచేశారు. కాదనలేకపోయాను. కాని శంకర్‌లాల్‌తో యిక్కడకు వస్తానని మాట యిచ్చానాయె. అందుకుని వాళ్ళతో సినిమా చూడలేనని చెప్పి వదిలించుకుని యిలా వచ్చాను" విరహేష్ తనడాంబికానికి మరింత పూసుకున్నాడు. భక్తులందరికి దర్శనమిస్తూ అందరినీ కృతార్థులుగ చేస్తూ నిలబడ్డాడు.

"వెళ్దామా" అంటూ ముందుకు నడిచాడు శంకర్‌లాల్.

చుట్టూ పరివేష్ఠించివున్న గోపికలూగోపాలకుల మధ్య విహరిస్తోన్న కృష్ణునిలా వున్నాడు విరహేష్.

అంతలోకే కర్నల్ కారుతో వచ్చాడు. పార్కింగులో కారు ఆపాడు. అద్దాల్ని పైకెత్తుతూ కర్నల్ అతనివెంట సజ్జన్ ఇద్దరూ కార్లోంచి దిగారు. చెయిన్‌లో తాళాన్ని వెతుకుతున్నాడు కర్నల్ మోటారుని లాక్ చెయ్యడానికి. సజ్జన్ తలెత్తి చూసాడు. నాలుగువైపులూ ఇసుకవేస్తే రాలకుండా వున్నారు జనం. వాళ్ళమధ్య మహాకవి బోర్. అతన్ని చూడగానే సజ్జన్ ఉత్సాహమంతా నీరుగారిపోయింది. ఇక్కడ కూడా యీ బోర్ తప్పదా అన్నట్టు ముఖంపెట్టాడు సజ్జన్.

"కర్నల్, తిరిగెళ్ళిపోదాం పద, మనం ఈ సినిమా చూడొద్దు" అకస్మాత్తుగా మనస్సు మార్చుకుని అన్నాడు సజ్జన్. అతను ఈ మాటలు అంటోంటే అతని ముఖంమీద విసుగు, చికాకు కనిపించాయి.

"ఎందుకు?" కనుబొమ్మలు ఎగరేస్తూ అడిగాడు కర్నల్.

"ఏంలేదు కర్నల్, సినిమా వద్దులే, డబల్ బోర్‌గా వుంటుంది"

చిన్న కుర్రాడిలా సజ్జన్ అలిగాడు. కారును లాక్ చేసి తాళాలగుత్తి జేబులో వేసుకొంటూ, నాలుగడుగులు ముందుకు వేసాడు కర్నల్. విసుక్కుంటూ సజ్జన్ అన్నాడు- అసలే బొంబాయిలో తయారైంది. ఈ స్టిక్ చేస్తు వుండదూ-పాడూందదూ. అందులో నీ సెలక్షను. అన్నికంటే ముఖ్య కారణం మహాకవి బోర్‌గాడు ఇక్కడ తారసిల్లడం.

బోర్ పేరు వినగానే కర్నల్‌కు నవ్వొచ్చింది చట్టూచూశాడు. బోర్ ఎక్కడా కనిపించలేదు. "ఎక్కడా" అని రెట్టించాడు.

"అదుగో, ఎదురుగా కనపడ్డంలేదూ, మెల్లెక్కుతున్నాడు వచ్చినందుకు ఫలితం దక్కదు. పోదాం పద. గోమతీ ఒడ్డునైనా కూర్చుందాం. ఏకాంతంగా కబుర్లు చెప్పుకోవచ్చు. సజ్జన్ మాట్లాడుతూంటే అతని కంఠంలోంచి అసహనం తొంగిచూసింది.

"అసలు నువ్వే బోర్‌కొడ్తున్నావ్. నాకు సినిమా చూడాలని వుంది. తీరా ఇక్కడికి వచ్చాం కదా. ఇదే చూద్దాం బోర్‌గాణ్ణి ఈ దరిదాపుకు రానివ్వనుగా. నువ్వు అలా చూస్తూవుండు. పద" అని దబాయింపుగా అన్నాడు కర్నల్.

హాలు తలుపులు దగ్గరకు సజ్జనూ, కర్నలూ చేరారు వాళ్ళిద్దరి టిక్కట్లు చూపిస్తుండగా బోర్ దృష్టి సజ్జన్ మీద పడింది.

విరహేష్ తదితరబృందం కళ్ళన్నీ సజ్జన్ మీదే వున్నాయి. మరీ పొడుగూ పొట్టీకాకుండా తీర్చిదిద్దిన రూపం, రక్తంతో ఉబికి పల్చని చర్మం లోంచి స్పష్టంగా కనపడుతోన్న తెల్లని అందమైన ముఖం, ఎత్తైన నుదురు, కాశ్మీరు గుడ్డతో కుట్టించుకున్న షేర్వానీ, వదులు పైజమా, చేతిలో ఓవర్‌కోటు. అందరూ చేతులెత్తి నమస్కారం చేశారు. కొంచెం ముభావంగా సజ్జన్ ప్రతి నమస్కారం చేసి హాల్లోకి వెళ్ళిపోయాడు. బోర్ వెంటనే లేచి ముందుకు వచ్చాడు అతనివెనుక శంకర్‌లాల్‌వర్మ లేచి వచ్చారు. తార కూడాలేచి కోటు మీద రాలిన శెకుముక్కల్ని దులుపుకొని పక్కనేవున్న కాఫీ కప్పు చేతిలోకి తీసుకుని గడగడ తాగసాగింది. చిన్నకోడలు సీటులోంచి కొంచెం లేచి కాలువను

తలమీదకు తీసుకుంది. సన్నగాదగ్గి రాళ్ళవుంగరాల వేళ్ళతో రుమాలు తీసుకొని నోటిదగ్గరకు పోనిచ్చి లిప్‌స్టిక్ రంగరించుకున్న పెదవులను పైకి క్రిందకూ అదించి, మళ్ళీ మామూలుగా కూర్చుండి పోయింది. వచ్చినవారికి నమస్కారం చేసి వాళ్ళు అలాముందుకి సాగగానే పెద్ద కోడలు చిన్న కోడలు వైపుకు తిరిగి త్వరత్వరగా కేకును తినడం ఆరంభించింది. ఈ రోజంతా ఇంద్రలోకంలో వున్నట్లు అనిపిస్తోంది పెద్దామెకు. నర్గీస్, సురయా, రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్, దేవానంద్, నిమ్మి, ప్రేంనాథ్ ఇంకా ఎందరు పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకున్న వ్యక్తులు వున్నారో వాళ్ళందరికీ పరమ మిత్రుడైన విరహేష్ గారితో చిత్ర జగత్తు ముచ్చట్లు వింటూ వారి పాట వినడం ఈ మహద్భాగ్యం ఆమెమనస్సును మత్తెక్కిస్తూ పిచ్చిదానిలా చేస్తోంది. ఉత్సాహం అతిశయించి ఆమె మనసు గాలిలో తేలిపోతున్నట్లుగావుంది.

"అరే నువ్వా- భలేవుంది. మీరు కూడా వచ్చారా మిస్టర్ సజ్జన్. కర్నల్ సాహెబు గార్ని చూడగానే పరమానందభరితుణ్ణయ్యాను" బోర్ కీర్తించడం మొదలెట్టాడు.

ఇంతలో శంకర్‌లాల్ సజ్జన్ దగ్గరకొచ్చి "సజ్జన్‌గారూ, మా కుటుంబం కూడా వచ్చింది. మిమ్మల్ని చూడాలని చాలా వుత్సాహంగా వున్నారు" అని వాళ్ళను లేచి రావలసిందిగా సౌంజ్ఞచేసాడు. సంక్షిప్తంగా అందరితోనూ పరిచయం చేసుకుంటూ "చాల సంతోషం" అని మాత్రమే అంటూ తన సీటు దగ్గరకెళ్ళ డానికి వెనక్కు తిరిగాడు సజ్జన్.

వర్మ అందు కున్నాడు- "మిస్టర్ సజ్జన్‌గారు, మీ పెయింటింగ్స్ చూడాలని నా భార్య మిసెస్ లాల్ మొదలైన వారంతా ఉవ్విళ్ళూరుతున్నారు. ఈరోజే తమను గురించి పేపర్లో ఓ వ్యాసం...."

వర్మ వాక్యాన్ని పూర్తి చేయకముందే కల్పించుకుని విరహేష్ తన వుంగరాల జుట్టును వెనక్కు తోసు కుంటూ- "మీరెప్పుడు కావాలంటే అప్పుడు చూపిస్తాను రండి'' అని ఏదో మాట్లాడబోయాడు కాని సజ్జన్ ముఖం బిగుసుక

పోవడాన్ని గమనిస్తోన్న కర్నల్ విరహేష్ వైపు గుర్రు పురుమతూ "బోరేష్" అనగానే ఉంకాడు.

ఆ పేరు వినగానే విరహేష్ ముఖం ముడుచుకు పోయింది. శాంత పూర్ణ మైన కంఠంతో సజ్జన్ వర్మను వుద్దేశిస్తూ—"వీరి నందరిని తీసుకుని ఎప్పుడైనా రాండి కాని దయచేసి ముందుగా తెలియ జేయండి. వెళ్దామా కర్నల్?"

అక్కడ నుంచి వాళ్లిద్దరూ కదిలి పోయారు.

కర్నల్, సజ్జన్ బాక్సులోకెళ్ళి కూచోడం శంకర్‌లాల్. విరహేష్ అందరూ చూశారు.

బాల్కనీలో కూర్చోడం విరహేష్‌కు ఎబ్బెట్టుగా అనిపించింది. కాని తన అభిమానులపట్ల మర్యాద చూపించాలి. అందుకని కిమ్మన కుండా కూర్చున్నారు. ఇద్దరు కోడళ్ళూ, తార కూర్చున్న తర్వాత ఒక సీటు వదిలేసి శంకర్‌లాల్ మిస్టర్ వర్మ కూర్చున్నారు. చిన్నామె ఎందుకో మళ్ళీలేచి శంకర్‌లాల్ ప్రక్కనే వున్న కాళీ సీటులోకి వచ్చి కూర్చుంది. తార ప్రక్కనేవున్న సీటు కాళీగా వుంది కూర్చుందామని విరహేష్ దగ్గరకు వచ్చాడు. మళ్ళీ ఎందుకో ఆగిపోయాడు.

''ఇప్పుడే:స్తా" అంటూ విరహేష్ బాక్సు వైపుగా వెళ్ళాడు.

బాక్సులోకి విరహేష్‌రాగానే కర్నల్, సజ్జన్ ఇద్దరికీ కోపం వచ్చింది. "తమలాంటి వారు వచ్చినందుకు ఎన్నో ధన్యవాదాలు" అంటూ విరహేష్ పళ్ళికిలించాడు.

కర్నల్ తొడమీద సజ్జన్ గిల్లాడు. కళ్ళెర్రజేసి "బోరేష్' నువ్విక్కణ్ణుంచి వెళ్లిపో. మమ్మల్ని డిస్టర్బ్ చేయకు. పో'' అంటూ కర్నల్ గదిమాడు.

"పోతా, ఇప్పుడే పోతాను" అంటూ విరహేష్ వెనుక సీట్లో కూల పడ్డాడు. కళ్ళల్లో దైన్యాన్ని నింపుకుని ''సజ్జన్ భాయీ, ఈపిక్చర్లో అంటే నా వుద్దేశ్యం ఈ పిక్చర్లో నా పాట ..." అని చెప్ప బోతుండగా

"అయ్యో' ఈ పిక్చర్లోనే వుందీ...అర్మ" అన్నాడు వెటకారంగా సజ్జన్.

కర్నల్ అందు కున్నాడు - మాకీవిషయం తెలిస్తే రానేరాక పోదుము. సరే. నువ్విక్కణ్ణుంచి ముందు నడు"

'ఆఁ ఆఁ ఇప్పుడే పోతున్నా. ఇందులో మ్యూజిక్ డైరెక్టరు నా రాగాన్ని....,

"బోరేష్, అంటూ గర్జించాడు కర్నల్.

చేతులు జోడిస్తూ "అందరి ముందు నన్ను దయచేసి అలా పిలవకండి. ఒంటరిగా వున్నపుడు కావాలంటే వంద చెప్పు దెబ్బలు వడ్డించండి ...." అంటూ విరహేష్ చిన్నగా ఐతిమాలు కున్నాడు.

"ఆలాగైతే ముందు కదులు"

"ఆఁ సరే"

"బో..."

మర్యాద దక్కదని బోరేష్ అక్కణ్ణుంచి లేచాడు. మూడో బెల్లు కొట్టారు. రికార్డులు ఆగి పోయాయి, విరహేష్ తన వరుసలోకి వచ్చాడు. దారిలో నాలుగు జతల దంపతులకు "క్షమించండి" "థాంక్యూ" అని చెప్పు కుంటూ పెద్దకోతలా వద్దకొచ్చి ఆగి పోయాడు. ఖాళీసీటు వైపు చూపిస్తూ తారతో విరహేష్ అన్నాడు.

"మిసెస్ ప్లీజ్....నేను యిక్కడే కూర్చుంటాను. ఇక్కణ్ణుంచి స్క్రీన్ యాంగిల్ బాగా వుంటుంది. మీకేమీ అభ్యంతరం లేదు కదా? పీకు? సీట్లో కూర్చుంటూ చాల సున్నితమైన భాషలో తారను పెద్దామెను అడిగాడు ఓవర్ కోటూ, సిగరెట్టు టిన్నూ ఒళ్ళో పెట్టుకుంటూ శంకర్‌లాల్ వైపు తిరిగి "మీరు దూరమైపోయారు. సరే కానివ్వండి" అని కంఠం కొంచెం పెద్దది చేసి అన్నాడు.

అందరికన్నా విరహేష్ దూరం ఆపడం చిన్నామెకు బాధగా వుంది. మాటలు వినడానికి ఆమెకు కుదరదు.

న్యూస్‌రీల్ ప్రారంభమైంది. మెల్లగా తారతో మాట్లాడు తున్నాడు విరహేష్ "పిక్చర్లో ఒక చోట నేను కూడా యాక్టుచేసానండి. సినిమా చూశాక ఏ సీన్లో వున్నానో చెప్పండి చూద్దాం" అన్నాడు.

"నిజంగా!' ఆశ్చర్యపోతూ తార అడిగింది.

"ఏమిటి?'' తారను పొడుస్తూ చిన్నామె ప్రశ్నించింది

''మిస్టర్ విరహేష్ పిక్చర్లో నటించారట కూడాను'' అంది తార.

''అలాగా'' అంటూ వుత్సాహంతో యీ విషయం తన భర్త శంకర్ లాల్‌కు చెప్పింది. శంకర్‌లాల్ మిస్టర్ వర్మకు చెప్పారు.

పెద్దామెకు వాళ్లేం మాట్లాడుతోంది వినపడలేదు. విరహేష్ సీట్లో సరిగ్గా కూర్చోగానే అడిగింది ''మీరేం చెపుతున్నారు'' అని.

విరహేష్ ఆమె వైపు తలవంచి నవ్వుతూ అన్నాడు- "నేనీ పిక్చర్లో కొంచెం నటించాను కూడా. డైరెక్టరూ మిగతా వాళ్ళంతా గొడవ పెడితే నేను కూడా కొద్దిగా యాక్టింగు చేసాను".

''మీ పోర్షన్ వచ్చి నపుడు దయచేసి నాకు చెప్పండి' అంది పెద్దామె.

'' ఐతే మీరే స్వయంగా నన్ను గుర్తించలేరన్న మాట'' అంటూ విరహేష్ ఆమె వైపు చూశాడు.

చీకట్లో, దగ్గరే కూర్చున్న పెద్ద మనిషిని సిగ్గుతో నిండిన పెద్దామె కళ్ళు ఓసారి చూసాయి. మళ్ళీ విరహేష్ వైపు తిరిగి ''ఆయితే అచ్చంగా ఇదే వేషంలో కనపడతారా?' అని అడిగింది.

''ఆ( కచ్చితంగా ఇదే వేషంలోనే. ఈమోస్తరుగానే" పెదామె అంద మైన తెల్లని దేహఛాయ ఆ అందానికి వన్నెలు తెచ్చిపెట్టే ఆ అమాయకంతో కూడిన ప్రశ్న- ఈరెండిని చూసి విరహేష్ నవ్వుతున్నాడు. పెద్దామె తన అమాయకత్వానికి సిగ్గు పడింది.

న్యూస్ రీలులో పండిట్ జవహార్‌లాల్ నెహ్రూగారు ఆటల పోటీల కార్య క్రమానికి ప్రారంభోత్సవం చేస్తున్నారు.

పిక్చర్ ప్రారంభంలో సెన్సారు బోర్డు సర్టిఫికెటు కనపడగానే అందరి

కళ్లూ విరహేష్ పేరు చదవడానికి తెర అంతా అదే పనిగా దారెడంత చేసుకుని కాచుకూర్చున్నాయి.

విరహేష్ పేరు కనపడింది తెరమీద. అంతే విరహేష్ బృందం అంతా కృతార్థులయ్యారు. తన పేరు రాగానే హుషారుగా విరహేష్ సిగరెట్టు దమ్ము గట్టిగా పీల్చి బూడిద విదిలిద్దామని చేతిని కిందకు వంచగానే పెద్దామె మణికట్టు చుర్రుమంది. పెద్దామె, విరహేష్ ఇద్దరూ తమ చేతుల్ని వెనక్కులాక్కొన్నారు. చేయికాంలేదు కద అని విరహేష్ పరామర్శించాడు పెద్దామెను. అబ్బే లేదంది.

పెద్దామె లోలోపల మురిసిపోతోంది. నిజంగా విరహేష్ ఆమె చెయ్యి కాల్చినా ఆమె అదే సమాధానం చెప్పేది.

తన సీన్ వస్తుందనగా విరహేష్ ముందు తారకు తెలిపాడు జాగ్రత్తగా చూస్తూ వుండమని. తార చిన్నామెకు అలా చివర కూర్చున్న వర్మ వరకు ఈ వార్త అందిపోయింది. అందరూ వూపిరి బిగపట్టి ప్రపంచంలోకెల్ల విచిత్రమైన ఎనిమిదో కళాఖండం తెరమీదకు రాబోతున్నట్లుగా సీట్లను అదిమిపట్టి కూర్చున్నారు.

నాయికకు నిశ్చయ తాంబూలం జరుగుతోంది. చాలామంది పార్టీకి వచ్చారు. వాళ్ళలో విరహేష్ ఒకడు. హీరోయిన్‌ను విష్‌చేసి ఓ కుర్చీలో కూర్చుంటాడు. తర్వాత రెండు మూడు పర్యాయాలు కెమెరా ముందు అతడు కనపడ్డాడు.

తన సీను రాగానే పెద్దామెతో మెల్లిగా విరహేష్ అన్నాడు—"ఇప్పుడే ఈ దీపజ్ఞి గుర్తించండి".

విశ్రాంతిసమయంలో పెద్దామె విరహేష్ ఒకరినొకరు చూసుకున్నారు. ఇద్దరి కళ్ళూ కలిసాయి. అంతే. విరహేష్ తన జీవితం సాఫల్యం పొందినట్లు పొంగి పొయ్యాడు

# 9

ఆటవదలగానే కర్నల్, సజ్జన్ హాల్లోంచి బయటకు వచ్చి కారులో కూర్చు న్నారు. చూస్తుండగానే వాళ్ళు హజరత్‌గంజ్ చేరుకున్నారు. దగ్గరలోనే వున్న రెండు చౌరస్తాల్లో వరుసలు తీర్చినట్లు కార్లన్నీ నిలబడివున్నాయి. ఎలక్ట్రిక్ దీపాల కాంతితో, రకరకాల ష్యాషన్ల తళతళలతో ధగధగ మెరిసే ఆభరణా లతో కిలకిలమంటూ తిరుగుతూ షాపింగుచేస్తోన్న వయసులో వున్న ఆడా మగాతో ఎప్పుడూ పరిమళిస్తూ వుండే హజరత్‌గంజ్, ఎముకలు కొరుక్కుతినే ఆ చలిరాత్రిలో, తన సువాసనలన్నీ పోగొట్టుకుని, కళావిహీనంగా వుంది. అప్పుడే పసుపుకుంకుమను పోగొట్టుకున్న వితంతువుకు గాజులు పగలగొడు తోంటే మణిబంధాన్ని అంటుకున్న ఆఖరి గాజులా మేఫ్లాయిర్ సినిమా వద్ద మాత్రం వెలుతురూ, కళా కానవస్తున్నాయి. లాల్ బాగ్ వైపు కారును పోనిస్తూ "ఇప్పుడే నా కోటు తీసుకొస్తాను. డ్రయ్‌వాష్‌కు ఇచ్చాను. నిన్ను వదిలి వచ్చే ప్పటికి ఆలస్యం..." అని కర్నల్ సజ్జన్‌తో అంటూండగానే సజ్జన్ అతను మాట ముగించకముందే నన్నిక్కడే వదిలేసిపో, నువ్వు అటునుంచే ఇంటికి వెళ్ళి పోవచ్చు" అన్నాడు.

"ఎందుకు?" అని రెట్టించాడు కర్నల్.

"నేను అలా ఇలా పచార్లు చేసుకుంటూ వెళ్తాను" అన్నాడు సజ్జన్. కారు ఆగింది.

"అరె నిన్నిక్కడ దింపేసి వెళ్తానా? కోటు రేపు తెచ్చుకుంటాలే" అన్నాడు కర్నల్.

"లేదురా బాబు. నేను నడచి వెళ్తాలే" కార్లోంచి దిగాడు సజ్జన్.

దిగాలుగా వున్న సజ్జన్ ముఖాన్ని చూస్తూ "పొద్దున్నుంచి నిన్ను చూస్తున్నా. ఏదో దిగులుగా వున్నావేమిటి? ఏమైనా విశేషం వుందా?"

"ఏమంత విశేషంలేదు. వూరికనే. తర్వాత చెబుతాగా"

ఫుట్‌పాత్ వైపుగా వెళ్లాడు సజ్జన్.

ఇవ్వాళ వుదయంనుంచి సజ్జన్ మనస్సు ఏంబాగోలేదు. కళాకారుని నాజూకు హృదయంపై సమ్మెట దెబ్బలు ఒకటి తర్వాత ఒకటిగా ఉదయంనించి పడ్తునే వున్నాయి సజ్జన్‌ను పొగడ్తూ వచ్చిన వ్యాసాన్ని పురస్కరించుకుని వుదయం మహిపాల్ ఏవేవో అనరాని మాటలు అన్నాడు. ఈ సంఘటనతో అతని మనస్సు గాయపడింది తర్వాత బొమ్మను తట్టలో పెట్టుకుని బజార్లో వాళ్లందరికి చూపించుకుంటూ తానే ఒక వింతగా తయారయ్యాడు. దాన్ని తీసుకెడ్తూతూంటే అతనికి చాలా సిగ్గేసింది. ఇబ్బందిగా అనిపించింది. తర్వాత మాస్టర్ జగదంబా సహాయ్ అభ్యుదయ భావాలుకల కుమార్తె రెండు మూడు సూటి పోటి మాటలతో అతన్ని పొడిచింది. ఆ యువతిని పొందాలనే వాంఛ అతనిలో రేగింది. అంతే, అతని అంతరాత్మ కొరడా దెబ్బలు కొట్టడం మొద లెట్టింది. ఇక చిత్ర ఇప్పుడే అతని వ్యక్తిత్వానికి వున్న రెండు పొరలూ విడదీసి ముందుభాగాన్నీ వెనుక భాగాన్నీ చిత్రించి వెళ్ళిపోయింది.

అతనికిప్పుడు వయస్సు ముప్పైరెండు సంవత్సరాలు. ప్రౌఢావస్థలో అవివాహితునిగా వుండడంచేత అతనిలైంగిక జీవితం కూడ వొంకలు తిరగడం మొదలెట్టింది. ఒక్కొక్క పర్యాయం రెండు మూడు నెలలు అతనికి స్త్రీ వాసనే తగలదేమో, అలాంటి అవకాశం వచ్చి రాగానే మరీ అతిగా ప్రవర్తించేవాడు అతని జీవితంలో ముగ్గురు స్త్రీలు ప్రవేశించారు. ఒక వ్యక్తిని అతను గబ్బిచ్చి కొనుక్కుంటాడు. రెండోవ్యక్తితో ప్రేమవ్యవహారం నడిపిస్తూ రసానుభూతిని పొందుతుంటాడు. మూడో వర్గానికి చెందిన ఆడవారంతా మర్యాదకోసం అనేక సంబంధాలు ఏర్పరచుకుని అతనితో కలిసేవాళ్ళు ఒక తల్లి అంటేనే అతనికి అపారమైన శ్రద్ధాశక్తవుండేది. స్త్రీపట్ల అతనికున్న అశ్రద్ధాభావనే ఈరోజు అతని చెంప ఛెళ్ళుమని కొడుతోంది. అతనికి చాలా కలవరంగా వుంది మాటిమాటికి అతని తల్లి జ్ఞప్తికి వస్తోంది.

సజ్జన్ తల్లి గతించి పదకొండు సంవత్సరాలు గడిచాయి. తండ్రి శ్యాం మనోహర్ వర్మ చాల విలాస పురుషుడు. విదేశాల నుండి బారిస్టరుపట్టం పుచ్చు

కొర్పాదే కాని ఒక్కరోజూ వకాల్తాచేసింది లేదు. ఎప్పుడు చూసినా నృత్యం, సంగీతం, మేజువాణీలు, మద్యం అలాగే వ్యసనాల్లో మునిగితేలేవాడు. దాదాపు పది లక్షల రూపాయల వరకు హారతికర్పూరంలా హరించుకుపోయింది. ఇంటికి ఎప్పుడోకాని వచ్చేవాడు కాదు. అథవాఎప్పుడొచ్చినా ఇంట్లో పనిచేసే నౌకర్లూ-ఆఖరుకు సజ్జన్ తల్లికి కూడ ఎవరో కాటు వేసినట్లుండేది. తండ్రి అంటే ద్వేషించేవాడు సజ్జన్. చీటికిమాటికి తన తల్లిపై ఆయన విరుచుకుపడేవాడు. బూతులు తిడుతుండేవాడు. అప్పుడప్పుడు చెయ్యి కూడా చేసుకొనేవాడు. సజ్జన్ తల్లి మహాసాధ్వి. శాంతస్వభావం కలది. గుంభనమైన మనిషి. వ్రతాలు నియమాలూ, ఉపావాసాలతో జీవితమంతా కఠోరంగా గడిపేది. ఆమె బ్రతికున్నంత కాలం ఒక్కరోజు కూడా గడపదాటి బయటికి వెళ్లడం తను చూడలేదు. ఒక పర్యాయం ఆమె తనతో అన్నట్లు జ్ఞాపకం-"నా అత్తగారు మరణించేప్పుడు నాకు చెప్పిపోయింది. ఇల్లు చక్కపెట్టుకో. వంటింటితాళం ఎప్పుడూ నీ దగ్గరే వుంచుకో, గుమ్మందాటి ఎప్పుడూ బయటికి వెళ్లొద్దు" అత్తగారు చెప్పిపోయిన మూడు మాటలూ చివరివరకు ఆమె నిలబెట్టుకుంది.

సజ్జన్ తాతగారైన కన్నోమల్ ముప్పైరెండుసంవత్సరాలే [illegible]చి 1902 లో కన్ను మూశాడు. సజ్జన్‌తండ్రి శ్యాంమనోహర్ అప్పుడు [illegible]డి పిల్లవాడు. ఎస్టేటుకోర్టు పరమైంది శ్యాం మనోహర్ మేజర్ అయ్యేవరకు ఎవరికి వారు చేతికందినంతా లక్షలకొద్దీ తినేశారు. సజ్జన్ నాయనమ్మ పాపం ఆ[illegible]యకురాలు చుట్టపక్కాలు యిల్లంతా దోచుకొంటూంటే గుండె బద్దలు కొట్టుకునేది కాని ఆమె మొర ఆలకించేది ఎవరు? కొడుకు తండ్రికిమల్లే చాలా తెలివి గలవాడుగా పెరుగుతున్నాడని ఆమెకు సంతృప్తిగావుండేది. పట్టుబట్టి బారిస్టరు చదవడానికి విదేశాలకు వెళ్లాడు శ్యాం మనోహర్. ఆ తర్వాత నాయినమ్మ చనిపోయింది. ఇదంతా సజ్జన్‌కు ఈ రోజుకూడా బాగా జ్ఞాపకం.

విదేశాల్నుంచి రాగానే శ్యాంమనోహర్ పూర్తిగా మారిపోయాడు. పారిస్ లోని నైటుక్లబ్బుల ప్రభావం అతనిమీద ముద్రవేసింది. డబ్బులు పుష్కలంగా వున్నాయామె, యవ్వనంలావున్న గుడ్డిగుర్రానికి కళ్లెం వదిలేసి తోలడం మొదలెట్టాడు.

అయితే దురదృష్టవశాత్తు అతని తండ్రి కూడా తాతగారిలా ముప్పయ్ రెండు సంవత్సరాలకన్నా ఎక్కువ జీవించలేదు. ముప్పైరెండు రాగానే అతను కూడా యిహలోకయాత్ర చాలించాడు. సజ్జన్ అప్పుడు జూనియర్ కేంబ్రిడ్జి చదువుతున్నాడు. పదమూడు సంవత్సరాల ప్రాయంలో కొత్తమలుపులు తిరిగే మనస్సు సజ్జన్‌ను వేధించడం మొదలెట్టింది. పుట్టుకగిట్టుక, పరమేశ్వరుడు-మతం, స్వాతంత్ర్యం-పాలకులమెప్పుపొందే రాజకీయ ఎత్తులు, దేశపరిస్థితులు ఇంకా ఎన్నెన్నో ఆలోచనాతరంగాలతో పాటు యవ్వన మాధుర్యాన్ని బయటకు లాగి చూద్దామనే తపన, అతని మనసులో మెదలడం ప్రారంభించాయి.

భర్త మరణించగానే కొడుకు వివాహం చేయాలని తల్లితహతహలాడింది. కాని సజ్జన్ చేసుకోనని మొండిపట్టుపట్టాడు. ఇంత చిన్న వయసులో పెళ్ళి చేసుకోవాలన్న తలంపు అతనికి లేదు. పెద్దవాడయ్యాక తనకు నచ్చిన అమ్మాయిని చేసుకోవాలన్న కోరిక అతనిలో బలీయంగా వుండేది. తల్లి ఇష్టపడి తెచ్చిన సంబంధాన్ని తను ఒప్పుకోలేనని అతను నిర్భయంగా చెప్పలేడు. ఆమె ఎంపిక చేసిన పిల్లను వివాహం చేసుకుంటే అతని జీవిత సహచరణికాలేదన్న విషయాన్ని మూడు సంవత్సరాలు గడిచిన తర్వాత నూనూగు ప్రాయంలోకూడా అతను తల్లికి ధైర్యంగా చెప్పలేకపోయాడు. అతనికి పువ్వుతోపాటు పరిమళం కూడా కావాలి. సువాసన అంటే ఏమిటో అతనికతడే నిర్వచించుకున్నాడు. వ్రతాలు, అనుష్ఠానాలు, నోములూ, ఉపవాసాలు చేసే కఠోరదీక్షా పరులు అతనికి ఎప్పుడూ నచ్చదు. బాగా చదువుకొన్నదీ, ఆధునిక భావాలు కలదీ, అందమైనదీ, నేర్పూ, ఓర్పూ కలది ఇంకా ఇంకా ఎన్నో యోగ్యతలు కల అర్ధాంగి కావాలని అతని ఆరాటం. వీటన్నిటికీ తోడు ఆమెను వివాహం చేసుకునే ముందు ఆమెతో ప్రేమవ్యవహారం కూడా నడపాలి.

వున్నట్టుండి ఓరోజు అతని తల్లి హఠాత్తుగా సజ్జన్ కాళ్లు పట్టుకుంది. కళ్ళలో నీళ్ళు నింపుకుని "నాయనా, నిన్నొకటి యాచించాలనుకుంటున్నాను. నీ తండ్రి అడుగుల్లో నడచిన జీవితం అంతా ఏడుస్తోనే గడిపాను ... నువ్వు మాత్రం నన్ను ఏడిపించకురా" అని ప్రార్థించింది.

తల్లి అంటే సజ్జన్‌కు ఎనలేని ప్రేమ. తనకు కాబోయే భార్యలో ఏ లక్షణాలు వుండరాదను కున్నాడో వాటినే తన తల్లిలో చూసి ఆమెను గౌరవించే వాడు. ఇది అతని ఓ విచిత్రమైన మానసిక స్థితి. చరిత్ర హీనుడైన తండ్రికి వ్యతిరేకంగా తల్లిలో వున్న సౌశీల్యత అతనికి అద్దంలా ఎప్పుడూ కళ్లకు కట్టినట్లు కనపడు తుండేది. అత్యాచారాల, అఘాయిత్యాలు చేసిన తండ్రి, ఎప్పుడూ మౌనంగా, ఓర్మితో మమకారాన్ని పంచుతుండే కరుణామయి అయిన తన తల్లి ముందు కాంతి హీనంగానూ. జుగుప్సాకరంగానూ కనపడుతూ వుండేవాడు.

ఒక్క తండ్రి మినహా యింకెవరిని చూసినా వాళ్ళను మనస్సులో గౌరవించేవాడు. అతని తల్లి ఇతరుల కష్ట సుఖాల్లో భాగం పంచుకునేది. శుచి, మడి, నిష్ఠ అంటే అమితమైన అనురాగం వున్నా తన ఇంట్లో పనిచేసే నౌకరు భార్య క్షయ వ్యాధితో బాధపడ్తోంటే ఆమె వుమ్మి గూడా ఎత్తిపోసి శుభ్ర పరిచేది. అలా చేస్తుండగా అతను స్వయంగా ఓ పర్యాయం చూశాడు కూడాను.

సజ్జన్ మనస్సు మీద అతని తల్లి చెరగని ముద్ర వేసింది. తండ్రి తొక్కిన దారి తొక్కనని తల్లికి మాటయిచ్చి అతను మానసిక సంఘర్షణను కొనితెచ్చు కున్నాడు. ఈలోగా చిన్నతనం నుండి అతనిలో పాలు పోసుకుని పెరుగుతున్న చిత్రలేఖనం అవకాశం రాగానే వ్యాపకంగా మారింది.

సీనియర్ కేంబ్రిడ్జి పాసు కాగానే పై చదువులకు పోక ఆర్ట్స్ స్కూల్‌లో చేరాడు సజ్జన్.

తండ్రి మరణించిన ఆరు సంవత్సరాలకు అతని తల్లి కూడా స్వర్గస్థురాలైంది. తల్లిని కోల్పోయిన సజ్జన్ మనసు నిండా శూన్యం వ్యాపించింది. ఆ మనోవ్యథనుండి తప్పించుకోవడానికై చిత్రకళ వంక పెట్టుకుని దేశమంతా పర్యటన చేయడానికి సంకల్పించాడు.

తల్లికి ఇచ్చిన వాగ్దానంతో ఆమె బతికి వుండగానే రహస్యంగా లాలూచీ పడ్డాడు సజ్జన్. తండ్రిలాగె మితిమీరి ఖర్చు పెట్టకుండా వుంటానని నిశ్చయించుకున్నాడు. జమీందారీ గొడవలు కోసం వున్నా ఆస్థి పాస్తుల ఆదాయవ్యయాల

లెక్కలు వేయడమన్నా తండ్రిలా కాక ఎక్కువ శ్రద్ధాసక్తులు చూపించేవాడు. నౌకర్లపైనా, గుమాస్తాల పైనా ఒక కన్ను వేసి వుంచేవాడు ఆస్తిని పెంపొందించాలన్న ఆసక్తి లేకపోయినా ఆ మిగిలిన ఐశ్వర్యాన్ని సంరక్షించు కోవడానికి జాగ్రత్త పడేవాడు. ఇన్ని విషయాల్లో నిగ్రహం ప్రదర్శిస్తూ ఒక్క స్త్రీ విషయంలో మాత్రం అతను మనస్సును కట్టేయలేకపోయాడు.

ఐదు సంవత్సరాల్లో ఆర్ట్స్ స్కూలు డిప్లొమా ప్యాసయి, దేశ వ్యాపితంగా తిరిగి అనుభవం మీద ఓ సిద్ధాంతం తెలుసుకొన్నాడు వివాహం చేసుకోవడం కనీసం అతని విషయంలో అవసరం కాదని, ఒకవేళ అవసరమని మనిషనే వాడు ముప్పై సంవత్సరాలు దాటిన తర్వాత సరైన వ్యక్తిని జీవిత భాగస్వామినిగా ఎంపిక చేసు కోవడం సుకరం అవుతుంది. ఎంపిక చేసుకునే లోకజ్ఞానం, అవగాహన అబ్బుతాయి. చిత్రకళ ద్వారా సాఫల్యాన్నీ కీర్తినీ సంపాదించగానే అతనిలో పెరుగుతున్న వుత్సాహం స్వార్థాన్ని కోరు కోవడం మొదలైంది. ఆ దృష్టితో చూసినపుడెల్లా స్త్రీ అనేది అతనికి భోగ్య వస్తువుగా, మనస్సు రంజింపచేసే సాధనంలా, దేహానికి స్ఫూర్తినిచ్చే పనిముట్టుగా కనిపించసాగింది. పైన కప్పుకొన విదేశాల ఆదర్శాలను మెచ్చు కుంటూ అతను స్త్రీని అందమైన వుపమానాలతో అలంకరించే వాడు. కాని పైన పేరుకొన్న విదేశీ నాగరికత అనే ఆనాచు తొలగి పోయింది. ఒకస్త్రీపై జరిగిన ఘోరంతో, దయనీయ పరిస్థితుల్లో ఆమెకు వచ్చిన చావుతో సజ్జన్‌లో దాగివున్న నిజాయితీ వుద్రేకంతో పొంగిపైకి వచ్చింది ఆదే నిజాయితీని ప్రకటిస్తూ జగదంబా సహాయ్ కూతుర్ని సజ్జన్ చూడగానే అతనిలో లైంగిక వాంఛ ఒలీయం కావడం చూసి, అతడు సిగ్గుతో తల వంచుక పోయాడు.

పలాయనం చిత్తగిస్తున్న మానవుని మనస్సు ఒ విచిత్రమైన చిక్కు. మొట్ట మొదట మనిషి తన నీడ నుండే దూరంగా జరగడం మొదలెడతాడు. అప్పుడు తన దాకచక్యాన్ని చూసి అతడు గర్విస్తాడు. అతని చాకచక్యం గర్వానికి హేతువైనప్పుడు దాని నుండి పారి పోతాడు. ఆ భయమే బరితెగిన అంబోతులా అతణ్ణి కుమ్మటం మొదలు పెట్టగానే దాన్నుంచి వేగంగా తప్పించు

కునే ప్రయత్నంలో అతని అణువు అణువు చెల్లా చెదరు కావడం మొదలవు తుంది ఇంకా భయా క్రాంతుడై మరింత పిచ్చిగా పరుగెత్తడం ప్రారంభిస్తే తనకు తాను నిర్మించుకున్న మాయా మందిరంలో దారి కానరాక ప్రతిస్తంభంతో ఢీకొంటూ వెర్రి వాడవుతాడు. తనలో వెర్రితలలు వేస్తున్న ఆ పిచ్చితనాన్నే మళ్ళీ జోకొట్టి నిద్రపుచ్చే ప్రయత్నంలో అతని లోని చైతన్యం మొద్దుబారి పోతోంది. సజ్జన్ శరీరంలో చలనంవున్నా కూడ మానసికంగా ఒకచోట దిగ బడి పోయాడు. ముందడుగు వేతలేని అగుంటలోపడి కొత్తగా పట్టి మచ్చిక వేసుకున్న దున్నపోతు తాళ్ళు తెంచుకుని పారి పోవడానికి ప్రయత్నించే విధంగా అతను కూడ స్వేచ్ఛను పొందాలని బుస కొడుతున్నాడు. జనసందారం పల్చ బడిన అతని దొడ్డిపైపు పరాగ్గా నడచి పోతున్నాడు. అయినా ఎందుకో అలవాటు చొప్పున అతని కాళ్ళుసరైన మార్గంలోనే నడుస్తున్నాయి. చలిగా వున్నట్లు మనస్సుకు తోచింది. అప్రయత్నంగానే చెస్టర్ కోటు వేసు కున్నాడు. అతను షానబన్ రోడ్డులో నడుస్తున్నాడు. రెండు వైపులా మొహరించివున్న బంగళాలు రోడ్డు మీద నడుస్తోన్న వ్యక్తిని చూసి నిర్లిప్తంగా వున్నట్టున్నాయి. అతను కూడా వాటిని పట్టించు కోనట్లు ఆ వాతావరణంలో వుండి కూడా అంటీ అంట కుండా ముందుకు నడచి పోతున్నాడు.

ఎదురుగా వస్తున్న కారు ముందు లైటు అతని మీద పడింది. సజ్జన్ వులిక్కిపడ్డాడు. గబుక్కున రోడ్డాకుఎడంగాతొలగి మామూలుగా తలవంచుకుని నడుస్తున్నాడు.

కారు వచ్చి అతని ప్రక్కనే ఆగింది. హఠాత్తుగా కారు అతని ప్రక్కనే ఆగగానే సజ్జన్ తుళ్ళిపడ్డాడు. కంగారులో అతను పడి పోయేటంత పనయింది. కార్లోంచి ఓ కోమల కంఠి బిగ్గరగా నవ్వింది.

పక్కకుతిరిగిచూశాడు. కార్లో షీలా ఒయ్యారంగా వెనుకబడి నవ్వుతోంది. ఆమె పక్కనే మహీపాల్ కూర్చున్నాడు. ఈసుకోమంటున్న అతని మనస్సుకు ఆక్షణంలో షీలానింగూ, మహీపాల్ కనపడడం కొంత ఊరట కలిగింది.

"ఎక్కణ్ణుంచి వస్తున్నావ్ మహాశయా" అంటూ ఓవర్ కోటు కాలర్ పట్టుకొని లాగి షీలా మత్తిలిన స్వరంతో ప్రశ్నించింది.

ఇంతకుముందు మనసంతా వికలంగా వుంది సజ్జన్‌కు. ఇప్పుడు కొంచెం తేటక పడ్డాడు, "మరి మీరెక్కణ్ణుంచి దయచేస్తున్నట్టు" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"యమలోకం లోంచి" నవ్వుతూ మహిపాల్ అన్నాడు.

మహిపాల్ భుజం మీద గుద్దుతూ షీలాసింగ్ అంది– "మన రహస్య లోకం అడ్రెసు చెప్పకు యూఫూల్ తెలిసిందంటే అక్కడి ఫ్యూడల్ శయారౌ తారు యాపిల్ చెట్లు నాటటానికి"

షీలాసింగ్ విసిరిన మర్మోక్తికి సజ్జన్ కీలుపై వాతపెట్టినట్లయింది, కాని పైకి దెబ్బతిన్న వాడిలా కనబడకుండా నటిస్తూ పైకి నవ్వేశాడు.

"అయితే రాండి. నా రూములోనే కూర్చుందాం. కాఫీ తాగిస్తాను. అదీ వద్దంటే మరికొంత ఆ మందే పుచ్చుకుందురు కాని".

"చాలసేపవుతుందోయ్. ఏం, డాక్టర్, ఇప్పుడెంతయింది?"

"ట్వంటీమినిట్స్ పాస్ట్ ఎలెవెన్. ఏమంత ఎక్కువకాలేదు. మరైతేకార్లో కూర్చో దుర్జన్। వెళ్దాం",

"ఇప్పుడు రానలే. ఇంకోసారి చూద్దాం. సంజాయిషీ ఇచ్చుకోవడానికి షీలాకి శ్రీవారు లేకపోయినా నాకో ఇల్లాలుందిగా ఇంటిదగ్గర యక్షిణిలా కాచుక్కూచునుంటుంది".

చివరికి సజ్జన్ కార్లో ఎక్కి కూర్చున్నాడు. మహిపాల్ మాటల్ని లెక్క చేయకుండా లేలాంతులావున్న తన స్టూడిబేకర్ని వెనక్కి తిప్ప సాగింది షీలా.

ఇంతలో మహిపాల్‌ని చూస్తూ సజ్జన్ అన్నాడు– "ఏదో రోజు నిన్ను తప్పక నా కేన్వాసు మీదకి దింపేస్తాను. ఒకవైపు సముద్రం మరోవైపు అగ్ని గోళం–ఈ రెంటికి మధ్య మండుతూ ఆరుతూ నువ్వు నిలబడి వున్నావు".

"నో-నో, షీలాను జడిపించాలనుకుంటున్నావేమిటి. అంతతేలిక మనిషి కాదులే. వెయ్యి డిగ్రీల వేడివున్నా ఆమె కరగదు, జీరోపాయింటు వచ్చినా గడ్డ కట్టదు".

"దయచేసి నా వకల్తా తమరు పుచ్చుకోకండి. పిరివిసుర్లు నిన్ను గురించి కావు. ఈజిట్ నాట్ దుర్జన్?"

సర్టెన్లీ నాట్. ఫేర్ సెక్సంటే నాకు ఎంత అభిమానమో మీకు తెలుసు, అని చెప్తూంటే సజ్జన్ గుండె వేగంగా కొట్టుకుంది. జగదంబా సహాయ్ కూతూరూ చిత్ర అతని మనస్సులో మెదిలారు.

సజ్జన్ ఇంటిగేటు దగ్గరకు రాగానె కారు హారన్ మోగింది. ఇన్ ఆల్ ఫేర్‌నెస్, షీలా హృదయం కళాకారులకు మల్లేవేడే కాని ఆమె బుఱ్ఱమాత్రం సైంటిస్టులా కూల్'' అని అన్నాడు మహీపాల్.

మహీపాల్ వెలిబుచ్చిన అభిప్రాయం షీలాకు బాగా నచ్చింది. ''నావృత్తి కూడా కోరుకొనేది అదే. ఆర్టు ప్లస్ సైన్స్-"

"నువ్వు నాకావేశాన్ని తెప్పిస్తున్నావు షీలా, ఈ రోజుల్లో తాంభైళాతం డాక్టర్లంతా హంతకులు. కసాయివాళ్లు. న్యాయంగా చెప్పాలంటే అన్‌కాన్షస్‌లీ ఐనో- ఆ కోవకు నువ్వుకూడా...."

కాపలాదారు వచ్చి గేటు తెరిచాడు.

——

అర్ధరాత్రి వేళ మాస్టర్ జగదంబా సహాయ్ అఘాయిత్యాన్ని చెప్తున్నాడు సజ్జన్. సజ్జన్, మహీపాల్. షీలాసింగ్ ముగ్గురి నరాల్లోకి స్కాచ్‌విస్కీ ప్రవేశించి వాళ్లలో గడ్డకట్టిపోయిన కులీనత్వాన్ని ద్రవింపచేసి దయారసాన్ని కాలువ కట్టించుతోంది. అసలే వుద్రేకమూర్తయిన మహీపాల్ కళ్లల్లోంచి ఇటువంటి ఆర్తిగాథ వినగానే కన్నీళ్ళు కారసాగాయి.

ఆత్మహత్య చేసుకున్న వ్యక్తి మానసిక స్థితిని వూహిస్తూ సజ్జన్ ఇలా అన్నాడు– "ఆమెగురించి కన్నీరు కార్చాల్సిన అవసరంలేదు. వంటిమీద కిరసనాయిలు పోసుకుని మంటల్లో దేహం భగభగమని మండుతోంటే ఆమెకు కొంచెం కూడ బాధ అనిపించివుండదని నాగట్టి నమ్మకం. ఆ పరిస్థితిలో ఆమె పూనకం పూనిన వ్యక్తిలా భావావేశంలో...."

"ఆత్మహత్య చేసుకోవాలన్న ఆవేశం కన్నిటి నుంచే బలాన్ని పుంజుకుంటుంది సజ్జన్: అసలు ఎవరికైనా ఇలాంటి చావురావాల్సిన అవకాశంఎందుకు కలగాలి? మానవుని సంతతి ఈ భూమి మీద అడుగుపెట్టి వూపిరి పీల్చక ముందే అత్యంత గర్హనీయంగా వాడి గొంతు నులిమివేయడమా! ఇటువంటి వార్తలు మీరు నేనూ, ఈమే చూస్తూ సహించి వూరుకోవడమా?" వుద్రేకంగా మహీపాల్ లేచి పాలరాతిబల్లమీద పిడికిలి బిగించి గుద్దాడు. హృదయంలోని ఆవేశాన్ని ఇంతకన్న గట్టిగా ప్రకటించడంచేతగాక, కాగితం పువ్వులతో, జెండాలతో అలంకరించబడివున్న ఆ పెద్దహాల్లో అటూ యిటూ పెద్ద పెద్ద అంగలేసుకుంటూ పచార్లు చేయనారంభించాడు. ఇటువంటి వ్యవహారాలొచ్చినప్పుడు మహీపాల్ వ్యక్తి కోపతాపాలకు లోనుకావడం సహజం. అందులో విస్కీ అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. వుండివుండి అతని గుండెలోని గాయం రేపు పెరగ సాగింది ఓ చిన్న ముల్లు గుచ్చుకుంటేనే మనిషికి భరించరాని బాధ కలుగుతుంది. అటువంటి సుకుమార శరీరానికి మానవుడు తనచేతుల్తోనే స్వయంగా నిప్పంటించుకుంటే భగభగమంటూన్నా ఆ మంటలో అతని శరీరం కాలి నుసైపోతోంటే? మహీపాల్ కళ్ళనుంచి కన్నీరు కారిపోతోంది. భగవంతుడా, అటువంటి చావు....ఎవరికి....ఎవ్వరికీ వద్దు!"

కాలుతున్న ఆ యువతి పడుతున్న ఆవేదన మహీపాల్ మనసును కలచివేస్తోంది. నీళ్లనింపుకున్న అతని కళ్ళలో కోమలమైన కనుకందు మెడచుట్టూ ఎవరిదో ఇనుపహస్తం పెనవేసుకున్నట్లుగా ఓ రాక్షసచిత్రం నిలిచింది. మహీపాల్ మనోవేదన న్యాయంతో, క్రోధంతో నిలదీసి అడుగుతోన్న వుద్రేకంగా మారింది.

మహీపాల్ వేదనాపూరితమైన మాటల ప్రభావం సజ్జన్ మీదకూడ పడింది. పొద్దున్న ఈవార్త వినగానే అతనికి కొంచెం సేపు మతిపోయినట్టయింది. కోపం కరుణ కలిసి అతణ్ణి ముంచెత్తేసాయి. ఇప్పుడు మహీపాల్ మాటలు వింటోంటే తను ఎంత అడుగున వున్నాడో అర్థమైంది. ఇవ్వాళ అతని మనస్సు మరో భావ పుటంచును. స్పృశించింది. మానసిక సంఘర్షణ తర్వాత అతని హృదాయాన్ని ఎవరో మెల్లిగా స్పృశించినట్లయింది. అతనిలో ఈ నాజూకు మనోవృత్తి మేల్కో గానే హృదయంలో దాగివున్న చెడు అతన్ని వేధించడం మానేసింది. ఈ మనో వృత్తిని మూలధనంగా భావించి సజ్జన్ లెక్క చూసుకున్నాడు—"నేను అను కున్నంత చెడ్డ వాణ్ణి కాదు" అనుకున్నాడు.

బల్లమీద నుంచి మహీపాల్ దిగడం డాక్టర్ షీలాసింగ్ గమనిస్తూవుంది. ఆమె బుర్ర సమాధానంలేని ప్రశ్నలధారల్లో కొట్టుకుపోసాగింది. మానవుడు చావుకూ జీవితానికీ మధ్య కొట్లాడుతున్న ఇటువంటి ఎన్నో కేసులు ఆమె కళ్లకు కట్టాయి. ఇలాంటి సందర్భాలతో ఆమె పోట్లాడింది. "జీవితం ఆరిపోకూడదు" ఇది ఆమె బుద్ధి ప్రసాదించిన నీతివాక్యం. ఈ సంఘటనను వినగానే ఆమెలోని నిర్లిప్తత తగ్గి దయారసంతో గుండె తడిసింది.

ఆవేశంలో మహీపాల్ కిటికీ దగ్గరకు వెళ్లాడు. కిటికీలో కాలెత్తిపెట్టి దానిపై పిడికిలి బిగించిన చేతిమీద గడ్డాన్ని ఆనించి చీకటి దుప్పటికప్పుకొని నిద్దరోతున్న 'కంపెనిబాగ్'ను చూశాడు—సుదూరంగా చీకట్లోకి చూశాడు. అతని లోని భావాలన్నీ కుదించుకునిపోయి ఏదైనా ఒకకొత్త ఆలోచన వస్తుందా అని ఎదురు చూస్తున్నట్టున్నాయి చూపులు.

అతని వెనక కూర్చునివున్న షీలా అంది—"అది నిజమే కాని అలాంటి వందల విషాదాలు చూస్తున్నాం. మరేంచెయ్యాలి? దీనికి విరుగుడులేదా?"

ఆలోచనాపాలోచనా లేకుండ కూర్చున్న సజ్జన్ ఈ మాటలు వినగానే ఆలోచిస్తున్న మొహంపెట్టి — "దీని కంతటికి కారణం విద్యాగంధంలేక పోవడం. మన ప్రజానీకం చాలా వెనకపడి వున్నారు."

''విద్యా? వాట్? ఎటువంటి విద్య ఇవ్వాలి? ఇలాంటి అక్రమాలు కూడ దని చిలకకు నేర్పినట్టు నేర్పాలా?'' అంది డాక్టర్ షీలా.

''గవర్నమెంటు వాళ్ళకు అర్థమయ్యేట్టు చేయాలి మానవత్వం అంటే ఏమిటో, మానవత్వపు విలువలు అంటే యేమిటో వారికి అర్థమయ్యేట్టు చెయ్యాలి''.

''కాని వాళ్ళకు ఏవిధంగా తెలియచెప్తారు? మీ దగ్గర అలాంటి సాధనాలు వున్నాయా?'' కిటికీలోంచి కాలు తీసి వాళ్ళవైపువస్తూ మహీపాల్ సజ్జన్ తర్కానికి అడ్డు తగిలాడు.

''ఎందుకు లేవూ, గవర్నమెంటు టీచర్లను ఎపాయింట్ చెయ్యాలి. కళా, సంస్కృతులకు సంబంధిన కార్యక్రమాలు ఏర్పాటు చెయ్యాలి. ఇంటింటికి తిరిగి పారిశుద్ధ్యాన్ని గూర్చి మనం బతకాల్సిన తీరు తెన్నులూ, నీతి నియమాలను గూర్చి తెలియజేసి, వాళ్ళకు నచ్చచెప్పగలిగే స్త్రీ పురుషుల్ని ఎన్నుకుని వాళ్ళ మానసిక స్థాయిని పెంచడానికి కృషిచేయాలి."

"చచ్చు వుపదేశాలంటే నాకు నమ్మకం లేదు సజ్జన్.'' సజ్జన్ మాటలు చప్పరిస్తూ "ఇదేదో హోప్‌లెస్ కేసు" అన్నట్లు ముఖాన్ని పెట్టి షీలా "సరే నౌ కమాన్. నువ్వు నా దగ్గరకు వచ్చానని వూహించుకో. నీ స్నేహితుడు కలవిచ్చినట్లు నేను కసాయిదాన్ని. ప్రపంచంలో మనిషి ప్రాణాలు కాపాడటం కన్న మహత్తరమైంది మరేంలేదని నేనూ నమ్ముతాను. కాని ఆ కర్తవ్యమే నా విషయంలో నాకు ఆదాయాన్ని కల్పించే మార్గం ఇంత శ్రమించి, ఇంతడబ్బు దుబారా చేసి, ఏపనినైతే నేను నేర్చుకున్నానో దానివల్ల ఎందుకు లాభంపొందకూడదు? ఎవరైనా వ్యక్తికి అతనికి ప్రాణం తీపైనప్పుడు అతడు దానికోసం డబ్బు ఎందుకు ఖర్చుచేయకూడదు? నేనెందుకు ప్రతిఫలాన్ని స్వీకరించకూడదు? నా జీవితం సుఖాన్నీ, విశ్రాంతినీ కోరుతుంది. నేను మీరనుకొన్నట్లుగా, గాంధీ వాదులూ క్రిష్టియన్ మిషనరీలూ, ఈ రామకృష్ణ మిషన్ వాళ్ళూ చెపుతున్నట్లు ఇతరుల ప్రాణాలు కాపాడుతూ సన్యాసిగా జీవిస్తూవుండాలన్న సిద్ధాంత ప్రకారం

నడచుకోలేను...." మనసులో ముడుచుకున్న భావాల గొడుగును విప్పి మళ్ళీ ఎందుకో షీలా కంఠం మూగపోయి మహిపాల్‌ను ప్రశ్నార్థకంగా చూసింది. అతని ముఖంలో ఏభావం కనిపిస్తుందో అని తరచి తరచి చూసింది. మహిపాల్ మాత్రం తలదించుకొని ఆలోచనలో మునిగి వున్నాడు.

సజ్జన్ కూడా ఆలోచనలో పడ్డాడు. "సహజంగా ఇది జటిలమైన సమస్య. ఎవరి స్వార్థాన్ని వాళ్ళు చూసుకోవడం సహజం. అది మానవ ప్రకృతి. అలాంటి హద్దున్ని అతిక్రమించి ఒక్కొక్కప్పుడు మహాత్ములు కనపడుతుంటారు. వారి విషయం ఒదలి పెడదాం. కాని చాల వరకు ప్రజల మనస్తత్వం ఇలాగే వుంటుంది. మనం ముందు మన సంగతి చూసుకుని ఇతరుల సంగతి గమనిస్తాం... వేరే దృష్టితో ఈ సమస్యను పరిశీలించితే మానవ స్వభావం ఇలాగే వుంటూ మారక పోయిన పక్షంలో మానవత్వం అనేది పునాదిగా చేసుకొని, మనం నిర్మించుకున్న మానవత్వపు విలువలు అనే ఈ భవంతి, ఆకాశ కుసుమం మాత్రమే అవుతుంది. ఒక ఎండమావి మాయామాహాత్మ్యమే అవుతుంది. మనిషి మనసు ఎలా మార్చాలో అర్థం కావడంలేదు." అంటుండగా సజ్జన్ కంఠస్వరం జీరపోయింది. అతని మనసులో చిత్ర మాస్టర్ జగదంబా సహాయ్ కూతురుతో పాటు పాపపంకిలమైన తన ఆత్మకూడా ప్రతిబింబించాయి. ఆఛాయల్ని చూసి సజ్జన్ చలించిపోయాడు.

"మార్చగలం" అంటూ మహిపాల్ అతనివైపు దృష్టి మళ్ళించి "అత్యాచారాలు! ఇతరులను అనుచితంగా దోపిడి చేయడం మానెయ్ ఈపని నువ్వు సక్రమంగా చెయ్యకపోతే జనమే నిన్ను చావబాది అక్రమంగా చేయించి చూపిస్తారు. నీకు తెలివితేటలు తెప్పిస్తారు"

"నేనేదో దౌర్జన్యం, అత్యాచారం చేస్తున్నట్లు నా మీద మండి పడుతున్నావేమిటి" అన్నాడు సజ్జన్. మహిపాల్ ఎత్తిపొడుపు వినగానే సజ్జన్‌కు పుండు మీద కారం చల్లినట్లయింది. మహిపాల్ విసిరినబెదిరింపులోని ఆవేదనని సన్నగా తియ్యగా నవ్వడం ద్వారా పోగొట్టడానికి ప్రయత్నం చేస్తూ అతడు మహి

పాల్‌కు సమాధానం ఇచ్చాడు. షీలాకూడ నవ్వొచ్చింది. కాని వాళ్ల నవ్వు మహీపాల్ ముఖ కవళికను మార్చలేక పోయింది.

మహీపాల్ ఇంకా చెప్పుకుపోయాడు- "నువ్వూ, నేనూ, మనం అందరం అత్యాచారాలు చేస్తున్నాం గురూ! నా మాటల అర్థం కేవలం నీకూ నాకూ సంబంధించింది కాదు, యావత్తు సమాజానికే సంబంధించినది. అణగి వుండడం ఇతరుల్ని అణచడం అనేవి మనకు వుగ్గుపాలతో వచ్చిన అలవాట్లు కాని ఇన్నాళ్ళు నుంచి అణిగివుంటూ నోరు మెదపకుండా సహిస్తున్న వాళ్ళు ఏదో ఒక రోజు వాడి మెడమీదే ఎక్కి వాడి గొంతు నొక్కే పరిస్థితి వస్తుంది! చూస్తూండు. అలాంటి రోజు రావడానికి ఇంకా ఎంతో ఆలస్యం లేదు సజ్జన్"

"అంటే నువ్వనేది భారత దేశంలో కమ్యూనిస్టుల పలుకుబడి ఇంకా హెచ్చవుతుందనేనా? వాళ్ళొస్తే రక్తపాతం చేస్తారు" రెండు అరచేతి వేళ్లనూ ఒకదానిలో ఒకటి పోనిచ్చి కాళ్ళు ఆడిస్తూ షీలా ప్రశ్నించింది.

"ఏపార్టీ వస్తుందో నేను చెప్పలేను. నేను రాజకీయ పండితుణ్ణి కాదు. కాని నేనుఅనుకునేది ఒక్కటే. కార్ల్‌మార్క్స్ సిద్ధాంతాల్ని రష్యాలోనూ ఇటీవల నుంచి చైనాలోనూ జరుగుతోన్న నవనిర్మాణ సంరంభాన్ని చూసిన తర్వాత, ప్రపంచంలోని ప్రతి పాలకుని అంతరంగంలోనూ విప్లవాత్మకమైన మార్పు వస్తోంది. దళిత జాతులూ, అణచబడిన వర్గాలూ, దోపిడీకి నిరంతరం గురి అవుతోన్న శ్రామికులూ, అందరూ దెబ్బతిన్న నాగరాజులా పడగవిప్పి బుసకొడుతున్నారు. ఈ మాటు వాళ్ళను ఏశక్తి ఆపలేదు .... అన్నట్లు స్త్రీ కూడా మన సమాజంలో దోపిడి చేయబడుతున్న వర్గానికి చెందిందే. హద్దుకు మించి ఆమెను హింసించాం. వద్దును పైగా?"

ఆ చివరి మాటలు వింటోంటే సజ్జన్‌కు భర్తచేతిలో నానా హింసలు పడిన అతని తల్లి జ్ఞప్తికి వచ్చింది.

ఇంతలో షీలా అందుకుంది- "ఆడవాళ్ళ విషయంలో నువ్వు చాలా రోమాంటిక్‌గా ఆలోచిస్తావు మహీపాల్! ఈరోజు ఆడది నువ్వనుకున్న దాని

కంటే ఎక్కువ చదువు సంఖ్యలు కలదీ. ఎక్కువ సంస్కారం కలదీ మును పటికన్న ఎంతో ఎక్కువగా స్వేచ్ఛ అర్జించు కొన్నదీను, పిల్లల చదువు...."

వుబుకుతోన్న ఉద్వేగాన్ని ఆపుకోవడానికి ప్రయత్నించినా, నోట్లోంచి జడివానగా కురుస్తోన్న మాటల్లోని పదునును అణచుకోలేకపోయాడు మహీపాల్ మధ్యలోనే అందుకుని అన్నాడు-"స్వేచ్ఛా వాయువులు పీలుస్తున్న ఆడాళ్లని వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. వాళ్ళలో నువ్వొక దానివి. రోగిని ఒకసారి పరీక్ష చేయడానికి ముప్పై రూపాయలు ఫీజు తీసుకుంటావ్. అందరూ నీలాటి సుఖ జీవులు కాదుగదా. అధిక సంఖ్యలో వున్న ఆడవాళ్ళనొసట మలమల మాడుతూ కుళ్ళి చావమనేగా రాసివుంది!"

షీలామృదువుగా మహీపాల్‌ను ఎదుర్కొంది- "నీవు మొండిగా మాట్లాడు తున్నావ్. అటువంటి కేసులు ఏవో పది పదిహేను వుంటాయనుకో.... ఆ విషయం వేరు...."

"వేరుకాదు. అదే అసలు విషయం. వందకు అయిదూ పది ఇళ్ళను ఒది లేస్తే మిగిలిన తొంభై అయిదు ఇళ్ళన్నీ నరకాలే!"

"ఉదాహరణకు నీ ఇల్లా?" అంటూ వ్యంగ్యంగా అడిగాడు సజ్జన్.

అది వినగానే మహీపాల్ నోటికి తాళం పడింది. అతని ముఖంలో గాంభీర్యం కన్పించింది. మళ్ళీ నిగ్రహాన్ని తెచ్చుకుంటూ "అవును, నేనూ ఓ కసాయి వాణ్ణే!" అన్నాడు.

"ఎందుకో!" అపరాధిని ప్రశ్నిస్తున్న న్యాయమూర్తిలా దర్పంతో అడిగాడు సజ్జన్. అపరాధాలు చేసే ఇతరులను చూడగనే అతని నోరు పెచ్చింది.

సమాధానంగా మహీపాల్ ఎలాంటి అరమరికాలేకుండా అన్నాడు— "నా వివాహం సామాన్యంగా అందరి విషయంలో తల్లి తండ్రులు నిర్ణయించిన ప్రకారం జరిగింది. అనేక మందిలాగ నా విషయంలో కూడ వివాహం సౌఖ్య వంతంకాలేదు. మా ఇళ్ళల్లో నూటికి తొంభై శాతం ఇలాగా అవుతూ జీవిత

పర్యంతం ఏదో తీర్చలేని అప్పులా మోస్తుంటారు. దాని ఫలితం అందరికీ తెలిసిందే. ఒక వ్యవహారంలో భర్తో, ఇంకో వ్యవహారంలో భార్యో ఇలా భర్తా, భార్యలు ఒకళ్ళు కొకళ్ళు తెలియ కుండా వ్యభిచరిస్తుంటారు.''

"అక్కడిదాకా ఎందుకు. ఈ లవ్ మేరేజెస్‌లో కూడ ఇదే జరుగుతోంది. రోమియో జూలియట్లుగా వున్నంత కాలం కొత్తలో ఇద్దరి మధ్యా ఎంతో సన్నిహితత్వం వుంటుంది. ఆ కొత్త మోజు తీరగానే విడాకులో లేకపోతే ఒకళ్ల నొకళ్ళు మోసం చేస్తూ బతకడమో- ఈ మార్గాలే వాళ్ళకు మిగిలేది. దీనివల్ల తేలిన పర్యవసానం ఒక్కటే వివాహం అనే ఆచారం వుందే, ఇది మనుష్యునిలో వున్న మోసపు బుద్ధినీ, అసత్యతనూ, అత్యాచారాల్నీ, అఘాయిత్యాల్నీ తట్టి లేపుతూ వుంటుంది. ఈ ఆచారాన్ని తొలగించేయండి. ఆర్థికంగా ఆడవాళ్ళకి స్వాతంత్ర్య మివ్వండి. తర్వాత చూడండి స్త్రీ పురుషుల సంబంధం ఎంతగా స్వాభావికం అవుతుందో" తన మనోవ్యధను ఈసొకుతో వెళ్ళగక్కింది డాక్టర్ షీలాసింగ్.

"అంటే స్త్రీ పురుషుల మధ్య మిగిలే సంబంధం ఒక్క దేహాన్ని అనుభవించడం వరకే పరిమితం చేస్తానన్న మాట" రుసరుస లాడుతూ మహీపాల్ వెటకారంగా అన్నాడు.

"కాని ఇవ్వాళ మనం యింతకు మించి చూస్తోన్నదేమిటి? నైన్టీ నైన్ పాయింట్ నైన్ రికరింగ్ కేసుల్లో ఆడది మగాడు ఆదృష్టితో చూడడం లేదా', మేజా బల్లమీద వున్న సిగరెట్ కేసును చేతిలోకి తీసుకుంటూ సర్జన్ డాక్టర్ షీలాను సమర్థించాడు.

"నా కళ్లముందే ఎన్నో కొంపల్లోని ఎన్నో కాపురాల భాగోతాలో బయట పడ్డాయి కావాలంటే ఎన్నో వృత్తాంతాలు చెప్పగలను. మొదట్లో ఎబార్షన్ కేసులు టేకప్ చేసేవాణ్ని కాదు తర్వాత ఆలోచించాను ఎందుకు అభ్యంతరం పెట్టాలని. జంతువులూ పక్షులూ ఏ పని సహజంగా చేస్తున్నాయో, ఆ పని ఆదమ్ ఈవ్‌కు పుట్టిన ఈ మానవ సంతతి ఏదో కారణవశాత్తు పాపంగా

రావించి చేస్తోంటే, నేను ఎందుకు లాభం పొందకూడదా? తెలివితక్కువ తనాన్నించి నేను లాభం పొందితే ఏం తప్పు?" అంటూ వుద్రేకంగా వున్న షీలా బల్లమీంచి గ్లాసు చేతిలోకి తీసుకొని నోటిదగ్గరకు పోనిచ్చింది.

షీలా వాదం సజ్జన్‌కు బలాన్నిచ్చింది. తన గ్లాసును నోటికి తాకిస్తూ అన్నాడు-"నువ్వు సరిగ్గా చెప్పావ్. వివాహం దాని ఆచరణా ఈ రెండూ సాంఘిక బంధనాల్ని బిగుతుచేయడం కన్న ఎక్కువగా ఒదులే అవడానికి దోహదం చేస్తున్నాయి. వీటిని మనం శీఘ్రంగా రూపుమాపాలి".

"దానంతట అదే రూపుమాసి పోతుంది. ఆడదీ మగాడూ ఇద్దరూ ఉన్నత విద్యపొంది, సమానంగా సంపాదించడం ఏరోజు నుంచీ మొదలెడతారో ఆ రోజునుంచి మనం రాసుకున్న ఈ మోరల్‌కోడ్ దానంతట అదే అమల్లోకి రాకుండా పోతుంది"

"ఇక లేస్తావా యముడా!" నవ్వుతూ షీలా మహీపాల్‌ను అంది. "గడియారం చూసుకో, మీ విరహోత్కంఠిత నీకోసం కళ్లు పొడుచుకుని చూస్తూ వుంటుంది".

ఆ మాటకు రెండు జతల కళ్ళు మౌనంగా చిరునవ్వు నవ్వాయి. వెంటనే మహీపాల్ గడియారం చూసుకున్నాడు. ఒకటి నలభై నిమిషాలైంది.

# 10

షీలా చిన్న కారు ఫుట్‌పాత్‌కు ఆనుకుని రోడ్డు పక్కకు వచ్చి ఆగింది.

కారు తలుపు తీస్తూ మహీపాల్‌తో అంది షీలా—"అండ్ టీనైస్ టు యుచర్ మిసెస్.. డార్లింగ్! ఇవ్వాళ నిజంగా ఆలస్యమైంది నీకు..."

"అవును. ఒన్స్ ఇన్ ఎ బ్లూమూన్. అదికూడా ఒకందుకు మంచిదే". నిర్లక్ష్యంగా నవ్వాడు. అంతలోకే మళ్ళీ—"నేనే చిత్రకారుణ్ణయి వుంటే నా చిత్రాన్నే చిత్రించుకుని వుంటే, దాన్నిండా పాలిపోయిన రంగులు పులిమే

వాడిణ్ణి, ఒక్క హృదయంలోని కంపనారే నాలోవున్న తెల్లని శుభ్రపదార్థం.... ఇక మెదడు—ఆఁ మెదడు నిర్మలంగానే వుంది. కాని చిక్కులతోనూ పుచ్చుల్లోనూ చిక్కుకొనివుంది....నా అలసట తీర్పదంలో నాకు నువ్వొక్కతివే సహచారిణివి. కళ్యాణి నాజీవితానికి దీక్షలాంటిది. నిజంచెప్పాలంటే నేను మీ యిద్దరి ఋణం తీర్చు కోలేను.

అలని సొమ్మసిలిపోతోన్న రోగిష్టిలా మహీపాల్ షీలాను చూశాడు. షీలా తన హస్తాన్ని అతని దెంపపై వుంచి- "ఎంతఆకర్షణీయంగా వున్నావ్? సొటేక్ కేర్ఆఫ్ యువర్ హెల్త్, డియర్! నీ ఆత్మపదే తపనకు నీ సాహిత్యంలో పదకల్పన చేసి నిన్ను నువ్వే మరచిపో" అంది.

షీలా చేతిమీద వాళ్ళిద్దరి తలలూ ఆనుకున్నాయి. చీకట్లో వంగిన ఆ నాలుగు కళ్ళల్లో ఒకేకాంతి మెరుస్తోంది-షీలా కళ్ళల్లో కాంతులు వెదజల్లే రవ్వలా, మహీపాల్ కళ్ళల్లో ముడుచుకుపోతున్న గులాబీ పుష్పంలా. షీలా పెదవుల్లో అనుభూతివేడి వుంది, మహీపాల్ పెదవుల్లో అనుభూతి తాలూకు వాసన అయితే వుందికాని వేడి మాత్రం లేదు.

"రేపు కలుస్తావా?" కారులోంచి దిగుతూ షీలా అడిగింది.

"ఏదైనా రాతపని చేయాలనుకుంటున్నాను." కారు తలుపు తీస్తూ అన్నాడు మహీపాల్.

"మాయింటికి రారాదూ. మధ్యాహ్నం అక్కడే భోజనం చేసేసి రాసుకోవచ్చు"

"సమాధిలో కెళ్ళిన తర్వాత యోగి బయటకు రాలేడు....సాయంత్రానికి రావాలని మనసుకోరితే నీకు ఫోనుచేస్తా"

"అలా కాదు. రేపు క్రిస్మస్ ఈవ్. నువ్వు తప్పకరావాలి"

"అహా! అదా సంగతి! ఆ విషయం నేను మరచేపోయాను....వస్తాను.... రేపు నేను ....సుమారు ఏడు గంటలకు నీ దగ్గరకు వచ్చేస్తా, బైబై!"

"బైబై" అంటూనే కారు సర్రునముందుకు దూసుకుపోయింది. కారు వున్న రెడ్‌లైటు కూడా దృష్టిని దాటుకుపోయింది. గత్యంతరంలేక మహీపాల్ తనఇల్లున్న సందువైపు మరలాడు. ఫుట్‌పాత్‌కు ఆనుకుని కిందకు ఇటుకలతో కట్టిన నాలుగు వూడిపోతోన్న మెట్లు దిగి మహీపాల్ సందులోకి ప్రవేశించాడు. అతని మనసులా ఆ సందుకూడా నిర్మానుష్యంగా వుంది.

మూసిన తలుపుల్లోపల ప్రశాంతంగా నిద్రిస్తున్న జనం మధ్య నుంచి పోతూంటే మహీపాల్ మనసులో ఆలోచనలు రెక్కలు విప్పుతున్నాయి. హృదయంలోని వేదన నిట్టూర్పుగా బయటకొచ్చి ఆకాశంలోకి ఎగిరింది. దాన్ని వెతుక్కుంటూ కళ్ళు పైకిచూశాయి. ఒకదానికొకటి పక్కపక్కనే నిలిచివున్న ఎత్తైన గోడల పైనుండి పుష్యమిరాత్రి తీవ్రంగా తళ తళ మెరుస్తున్నది.

మహీపాల్ అనుకున్నాడు, ప్రపంచం ఎంత విశాలమైంది? ఈ చుక్కలు ఎంతదూరం వ్యాపించివున్నాయి! ఎంతమంది వ్యక్తుల్నీ కుటుంబాల్నీ, ఈ అపారమైన జనాన్నీ, దేశ విదేశాల్ని సైతం తమకాంతి దృశ్యాంలో ఆకట్టుకుంటున్నాయో!

సందులో సగంవరకు అడ్డుగా ఆక్రమించి వుంది. ఓ ఆవు. పక్క సందులోంచి కాబోలు కుక్కలు భౌ భౌ అని అరుస్తూ పోట్లాడుకుంటున్నాయి. ఈ గోల కూడ మహీపాల్‌కి రాత్రినిస్తబ్దతలో ఒక అంతర్భాగంగానే అవుపించింది. ఇంచుమించుగా ఇదేసమయంలో ఓ పదిహేను ఇరవై గజాలదూరంలో ఎవరో ఏదో వస్తువును పై అంతస్తునుండి గిరవాటేయడం చూశాడు. మహీపాల్ ఉలిక్కి పడ్డాడు. అంతమాత్రానికే రాత్రికి నిద్రాభంగమైందనుకున్నాడు. పై నుంచి ఏం పడినట్లు? ఇలాటి సమయంలో ఎవరు మేలుకున్నారబ్బా? సందులో దీపం వెలుతురిలో ఏదో తెల్లని పొట్లంలావుంది ఆ క్రిందపడిన వస్తువు. ఎవరిపాపమో.... ఎవరికో రహస్యంగా పుట్టిన ఏ పసికందు శవమో అన్న ఆలోచన కలిగింది మహీపాల్‌కు. దడదడ కొట్టుకుంటున్న గుండెను పట్టుకొంటూ దగ్గరకెళ్ళి చూశాడు ఏదో పాత దిండు-తంనూనెకు మాసిమాసి చింకి చినిగిపోతోన్న దిండు. దానిలోంచి దూది బయటికి వచ్చి గాలికి సందులో మెల్లమెల్లగా వ్యాప

స్తోంది. దిండు చూసిన తర్వాత అతనికి కొంతవూరట కలిగింది. నవ్వు కూడా వచ్చింది. లేకపోతే ఈ ముదనష్టపు వస్తువును కిందపారెయ్యడానికి వేరే సమయం చిక్కడా ఏమిటీ ఖర్మం! మళ్ళీ అనుకున్నాడు. ఇది ఎంతోమంది నివసించే సందు. రాత్రి అయినంతమాత్రాన అందరూ నిద్రపోతారా ఏం? అంతెందుకు, తాను ఇంకా మేల్కొనేవున్నాడు కదా. సందులో నడుస్తున్నాడు. సమస్యల్ని కథగా అల్లుకుని భుజానికి తగిలించుకుని నడుస్తున్నాడు. మళ్ళీఅనుకున్నాడు- ఈ నాలుగు గోడల మధ్యా ఎన్ని జీవితగాథలు మేల్కొన్నవీ, నిద్దరోతున్నవీ, వెలుగులోకి రాకుండా నిద్రపోతున్నాయో! మరెన్ని వెలుగు చూస్తున్నాయోకదా!

ప్రతి ఇంటి మూసిన తలుపులను దాటుకుని లోపలికి అడుగుపెట్టింది అతని ఊహాకల్పన. తలుపుల్లోంచి పంచల్లో ఆరబెట్టినఅంట్లూ, విరిగిపోయిన సన్నని వుయ్యాళ్ళుగాయితూ పందిరిమంచాలపై నిద్రించే వారివరకు, చిరిగి పోయినబొంతలు మొదలు సిల్కుపరదాల్లో వెచ్చగా నిద్దరపోతూన్న సంపన్నుల వరకు అందరిజీవిత దృశ్యాలు తలపు సందుల్లోంచి అతని సమక్షంలోకి వస్తున్నాయి. విరహావిదగ్ధులుగానో, ఆనందడోలికల్లో వూగుతూనో, ఎంతో మంది మేల్కొని వుండొచ్చు. ఎంతమంది మాయామోహజగత్తే నిత్యమని భావిస్తూ దానిలో మునిగి తేలుతున్నారో, ఎంతమంది మాస్టర్ జగదంబాసహాయ్‌లు వున్నారో, ఎంతమంది అబలలు పురుషుని ఆకలికి బలియైపోతున్నారో, యీ తాత్కాలిక సౌఖ్యానికి ప్రాణాల్నిసైతం మూల్యంగా చెల్లించడానికి కలకాల్లా మంటల్లోకి దూకడానికి సిద్ధపడుతున్నారో.

మహీపాల్ ఒళ్లంతా జలదరించింది. అతనికి చలివేస్తోంది. ఈ జీవితం కూడా ఓ వింత సమస్యలాంటిది. ఈ వీధులన్నీ అటువంటి సమస్యలతో నిండిపోయాయి సందులూ, గొందులూ, రోడ్లూ, బజార్లూ యివన్నీ గతించిన శతాబ్దాల చరిత్ర జంజాటంలో యిరుక్కుని సతమతమౌతున్నాయి. ప్రతివాడికీ- మంచి చెడ్డల ప్రసక్తిలేకుండా ఎవరిపట్ల ఎలాంటి తరతమభేదాలు లేకుండా ఈ సందులు ఆశ్రయమిచ్చాయి. శ్రీమంతులూ, షాహుకార్లువుండే ఎత్తైన మేడల్నుంచి నికృష్టమైన హేయపు బతుకులు బతికే మానవస్వరూపాన్ని తొడు

క్షున్న ఈ లఘు మూషికాల కన్నాల వరకు అన్నీ ఒకదానితో ఒకటి పోటీ పడి సమానంగా జీవయాత్ర చేసే హక్కును సంపాదించుకున్నాయి. దొంగలు జేబుదొంగలు, హంతకులు అంతా ఈ సందుల్లోనే అందరిమాదిరిగా జీవిస్తున్నారు చిత్తశుద్ధి కలవారి శీలాన్ని మెరుగు రాతిమీద రెక్కించి వారి నాణ్యాన్ని ఇక్కడే తేల్చుతుంటారు.

శతాబ్దాలు దొర్లిపోతాయి. సమస్యలు మరో రూపందాలుస్తాయి. ఇళ్ళు కూలిశిథిలాలౌతాయి. మళ్ళీ కొత్తవి పక్కనే వాటిలోంచే లేస్తాయి. అంత శిథిలావస్థలో కూడా వీధిచావలేదు. కొత్త కొత్త ఆశలు సింగారించుకొని తన జీవితేచ్ఛను చాటుతుంది ఇది ఎప్పుడూ ఆగిపోని సమాప్తం కాని నిరంతర జీవ స్రవంతి. ఇక్కడే మానవుడు జీవించే కొంపా గోడూ వున్నాయి.

ఇల్లు చేరుకున్న తర్వాత తలుపుతట్టడానికి సంకోచించాడు మహీపాల్. నోట్లోంచి సారావాసనవొచ్చి తనస్థితిని బట్టబయలుచేస్తుందేమోనని అతనిభయం. తలుపుతడుదమా వద్దా అని సందిగ్ధంలోపడ్డాడు. ఇల్లు చేరడానికి ఇవ్వాళ ఆలస్యమైంది. చాలా ఆలస్యం అయింది.

సందిగ్ధావస్థలో కొంతకాలం గడిచింది. మనసు చిక్కపట్టుకొని చివరకు తలుపు తట్టాడు.

"ఎవరూ?" అంటూ కొంచెం సేపటి తర్వాత లోపల్నుంచి కళ్యాణి గొంతుక వినిపించింది

"నేనే" అని మహీపాల్ అంటూండగానే తలుపు దబాలునతెరుచుకుంది. గుమ్మంలోని వెలుతురు మహీపాల్పై పడసాగింది. భార్యాభర్తలు ఓ పర్యాయం పరస్పరం చూసుకున్నారు అతని కళ్ళు ఆమె ముఖంలోకి చూడలేక పోయాయి. నోరు మెదపకుండానే లోపలికి వెళ్ళి డ్రాయింగ్రూమ్ తలుపులు తెరిచాడు. స్విచ్వున్నచోటికి వెళ్ళాడు.

వీధి తలుపు గడియపెడుతూ కళ్యాణి మెల్లిగా అడిగింది. "ఏమన్నా చదువుకొంటారా?"

"రాసుకోవాలి" ముక్తసరిగా అని మహీపాల్ టేబుల్‌లేంప్ వెలిగించాడు. బల్లమీద ఏదో అర్జంటు కాగితాన్ని వెదుకుతున్నట్టుగా కాగితాలన్నింటినీ కిందా మీదా చేస్తున్నాడు. ఏదో పనిలో మునిగివున్నట్లు భార్యవైపు వీపు పెట్టి "రెండు తమలపాకులు నా కిచ్చివెళ్ళు" అన్నాడు.

"పెట్టెలో వున్నాయ్" అంది భార్య. మహీపాల్ వెదుకుతున్న కాగితాల్ని వదిలివేసి పెట్టె తెరిచాడు. దాంట్లోంచి నాలుగాకులు నోట్లో వేసుకుని నిశ్చింతు డయ్యాడు దొంగసరుకుతో ఊరు దాటి తేలిగ్గా ఊపిరిపీల్చినదొంగలా.

అతని భార్య అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. బ్రతుకు జీవుడా అని నిట్టూర్పువిడిచి మహీపాల్ ఓ చిటికెడు పొగాకు పొడుంని నోట్లో వేసుకున్నాడు

రెండురోజుల్నుంచి ఇద్దరిమధ్యా ఎడమొహం. పెడ మొహం. నిన్న మధ్యాహ్నం అయితే తీవ్రంగా పోట్లాటకూడా అయింది. ఈరోజు కూడా కలహంతోనే పొద్దుపొడిచింది. భోజనంచేస్తూ పళ్ళెంలో చేయి కడుక్కోనిలేచిపోయాడు. ఇంటి ఖర్చు గురించి ఇద్దరిమధ్యా ఈ కలహం! నెలన్నరనుంచి అతని ఆదాయం బాగా తగ్గిపోయింది. సెప్టెంబరుమాసంలో మహీపాల్ పెద్దకూతురికి డబుల్‌నిమోనియా వచ్చింది. చావు బతుకులమధ్య పూగిసలాడి ఎలాగైతేనేం బతికింది. షీలా, కర్నల్ వున్న కారణంగా అతనికి డాక్టరు ఫీజు కింద ఎక్కువ ఖర్చుకాలేదు. కాని మనసులో అశాంతి అలుముకున్న కారణంగా అతను ఏమీ రాయ లేక పోయాడు. దిప్పిక అయినప్పుడల్లా బావిత్రవ్వుకునేవ్యక్తికి ఏరోజు దొక్కాడక పోయినా డొక్కాడదని అంటారు. మహీపాల్‌కు నవంబరు నెలనుంచే డబ్బు యిబ్బంది ఎక్కువైంది. డిశంబరులో పుస్తకాలు తాలూకు రాయల్టీ ఏ పది హేనువందలో రెండువేలో వస్తుందని ఆశపడ్డాడు. ప్రచురణకర్తలకు రాయగా రాయగా వ్యాపారం సరిగాలేదనీ, ఇప్పుడు చేయి తిరగడంలేదనీ, అతని రాయల్టి సొమ్ము ఫిబ్రవరిలోగాని, మార్చిలోగాని పంపిస్తాం అనీ, సమాధానం రాశారు.

కేవలం రొట్టె తింటూ గడుపుతుండే కుటుంబాల్లో సైతం తొమ్మిదిమంది ప్రాణుల్ని పోషించడానికి కనీసం మూడువందలడెభై అయిదు—నాలుగువందల

రూపాయలు కావాలి. అతని ఇద్దరు కొడుకులూ హర్షవర్ధన్, శ్రీవర్ధన్, అక్క కూతురు శకుంతల ముగ్గురు ఇంటర్మీడియట్ రెండో సంవత్సరం చదువుతున్నారు. పదిహేను సంవత్సరాల రాజ్యశ్రీ తొమ్మిది. సిద్ధార్థుడు ఏడు చదువుతున్నారు. తపోధన్ వయస్సు యేడు సంవత్సరాలు, రెండో క్లాసు. ఆఖరి సంతానం- అనామిక, పాలుతాగుతున్న ఏడాది పసిది.

రేడియోకు నాటకాలూ, ప్రసంగాలూ రాయడం, పత్రికల్లో కథలూ వ్యాసాలూ రాస్తూవుండడమేకాక అయిదారు నెలల్నుంచి స్థానికంగా వెలువడే ఓ దిన పత్రికకు రోజూ మాటా మంతీ శీర్షిక క్రింద హాస్యరస సన్నివేశాలను రాయడానికి ఒప్పుకున్నాడు. అది రాసినందుకు నెలకు నూటయాభై రూపాయలు ముడుతుంటాయి. నిజం చెప్పాలంటే అదే అతనికిప్పుడు నికరంగా లభిస్తున్న ఆదాయం మిగతావన్నీ స్థిరంగావచ్చే ఆదాయంకాదు. మార్కెట్టులో ఇప్పుడు అతనిపుస్తకాలు చలామణిలో వున్నవి పదకొండు. అయినావాటిమీద ఆదాయం అంతగాలేదు. ఈరోజుల్లో పాఠకులకు కావలసిందీ, వాళ్లు కోరుకొనేది చవుకబారు శృంగారం. అది అతని పుస్తకాల్లో లేకపోవడం అతని తక్కువ ఆదాయానికి కారణం. దీని అర్థం అభ్యుదయా భావాలూ ఆలోచనల్ని రేకెత్తించే నవలా సాహిత్యం అమ్ముడు పోవడం లేదని కాదు. కాని ఈ 'కాని' మీద మరో 'కాని' ఎక్కువుంది. అటు వంటి సాహిత్యాన్ని అమ్మకం చేసుకోవాలంటే దానికో కిటుకు వుంది. ముందు వాటిని గురించి విమర్శనా సాహిత్యం ప్రచురింప చేయాలి. మాస పత్రికలు చదివే వారిని అటు వంటి గ్రంథాల ద్వారా బ్రహదేశ్వరాలయం ముందు కూర్చున్న బికారుల మాదిరి చుట్టు ముట్టనంత వరకు పై చెప్పబడే అభ్యుదయ సాహిత్యంవైపు వారి మొగ్గును లాగడం కష్టం అలా ఎత్తులు వేయలేని రచయితల ఆదాయం మరింత తక్కువ. మహీపాల్ రాసిన నవలలకు ఈలోటు కారణంగా అంతగా ఆదాయం రావడం లేదు. ఏదైనా రాజకీయ మఠాలనో, సాహితీ మఠాలనో పొత్తు ఏర్పరచుకో గలిగి రచయిత పుస్తకాల గురించి అటువంటి సంరంభం ఏమీ కనపడదనో మహీపాల్ తరుచు అనుకుంటుంటాండు. అప్పుడప్పుడు వెల్లడి చేస్తుంటాడు కూడా. ఏ

ముఠాకు ఎంత ఎక్కువ ఆర్గనైజింగు కెపాసిటీ వుంటే ఆ ముఠాకు చెందిన రచయితలకు అంత ప్రచారం వుంటుంది, వారి ఆదాయం కూడా అంత ఎక్కువగా వుంటుంది. మహీపాల్ దౌర్భాగ్యం అతను ఏ ముఠా వారితోనూ సయోధ్యత కలిగి వుండక పోవడమే.

ఒక విధంగా అతను తన తోటి రచయితలకు భిన్నంగా అందరికీ దూరంగా వుంటాడు. ఈ ఏకాకి తనం అతణ్ణి రోజు-రోజుకు మానసికంగా దిగ జారుడు స్థితిలోకి తోసివేస్తోంది. లేమి తనం అతణ్ణి కాచేయగానే లక్షల కొలది డబ్బుతో తను తులతూగే రోజు రాకపోతుందా అని పగటి కలలు కంటూ పొరదిల్లుతాడు, మరోసారి ఇదంతా మిథ్యాకల్పన అనుకుంటూ తన్ను తాను నిందించు కుంటాడు, మహాత్మా గాంధి, ఏసుక్రీస్తు, రాముడు, గౌతమబుద్ధుడు మహావీర్ మన ప్రాచీన ఋషుల్ని, మునుల్ని, ఆదర్శంగా తీసికొని అప్రేరణతో రచనలు చేయడానికి వుపక్రమిస్తాడు. అతని పని పాటలు, భార్య కలాపాలా, పనికి రానితనం, ఇక ఈపని చేయరాదన్ని ప్రతిజ్ఞా, లెంపలేసు కోడం ఇవన్నీ ఒకదాని తర్వాత ఒకటి నిరంతరంగా అతని మెదడులో పరిభ్రమిస్తుంటాయి. కోవెల్లో విగ్రహం ముందు అంగలారుస్తూ ఎంతదీనంగా వేడుకున్నా దేవుడు కాని పూజారికానీ కరుణించని బీద భక్తుసిలా వుండ అతని పరిస్థితి. ఎవరికి మొర పెట్టుకొన్నా అతని గోడు వినేవాడు లేడు.

డ్రాయింగ్ రూములోంచి భార్య వెళ్ళిన తర్వాత మహీపాల్ తన అంత రంగాన్ని తడుము కున్నాడు. ముప్పై ఎనిమిది సంవత్సరాలు పూర్తిగా నిండక ముందే కళ్యాణి జుత్తు నెరవ సాగింది. ఆమె ముఖం మీద కొద్దిగా ముడతలు కూడా పడి మొద్దుబారి పోయింది. వున్న వయసు కన్న ఏడెనిమిది సంవత్స రాలు ఎక్కువగా కనబడుతుంది. మహీపాల్ ఆలోచించాడు. ఆమెను ఈ గతికి తేవడానికి తనే కారకుడు. కళ అంటే సంస్కృతి. సాహిత్యం అంటే ఆమెకు బొత్తిగా తెలియనే తెలియదను కుందాం. ఆమె మాట్లాడే తీరు ఛాందసంగా వుం టుంది. ఏం మాట్లాడినా, ఏపని చేసినా, ఏది ఆలోచించినా రూపాయాలూ పైస ల్లోనే వుంటుంది. అన్నిట్లో ఇచ్చి పుచ్చుకొనే ధోరణే గోచరిస్తుంది. కాని

అమెది దీక్షా కంకణం కట్టుకొన్న జీవితం అమెలాటి నియమనిరతికల అథ వాళ్ళు అరుదుగా కనిపిస్తారు. ఒళ్ళు హూనం చేసుకుని ఇతరులను సుఖపెట్ట గలదు. వాళ్ళ కోసం ప్రాణాలైనా ఒడ్డుతుంది. ఆమెలో వుండే ఈ ప్రత్యేకత బహు కొద్ది మందిలో వుంటుంది. అతను అలాంటి వాళ్లను చూడనే లేదు. ఆమె ముందు మహిపాల్ పూర్తిగా తల ఒగ్గుతాడు.

కళ్యాణి తిరిగి వచ్చింది. ఒక చేతిలో నీళ్ళ గ్లాసు మరో చేతిలో ప్లేటు. ఆమె గదిలోకి రావడం చూసి మహిపాల్ అదిరి పడ్డాడు. వస్తోన్నట్లు ముందు తెలిసివుంటే కాగితమో కలమో తీసుకుని ఏదో రాస్తున్నట్లు అభినయింపుతూ కూర్చుండే వాడు. కాని తీరా తెలియకుండా ఆమె వచ్చే సరికి కాగితం, కలం, పేన్ దగ్గరలేదు సరికదా దిండుమీద అనకొని తన అంతరంగాన్ని తడుము కుంటున్నాడు. ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాడు. కాని భార్యపట్ల తాను ఎంత సానుభూతి కలిగి వున్నాడో తన మనసు ఎలా ప్రాయశ్చిత్తం చేసుకుంటోందో ఆమె ముందు విప్పి చెప్పలేడు. ఆమె వెనుక ఆమెను ఎంతగా గౌరవిస్తాడో ఆమె గుణాన్ని ఎంతగా మెచ్చుకుంటాడో వివరించలేడు. ఆకారణంగానే ఆమె వచ్చి రావడంతోనే అతనేదో ఇబ్బంది అనుభవించాడు.

బల్లమీద గ్లాసువుంచి స్టూల్ మీద పడివున్న ఏదో పాత పత్రిక తిరగేస్తూ అడిగింది- "ఇక్కడే పెట్టమంటావా? నువ్వు పనిలో వున్నట్లుంది"

"ఇక్కడే పెట్టు. శెనగపిండి హల్వాయా" దాన్ని చూడగానే మహి పాల్ కు ఆకలి వేసింది. పాన్ దాన్ లో నములుతున్న తమలపాకు మడ్డని వూసి గ్లాసులోని నీళ్ళతో దాంట్లోనే పుక్కిలించాడు.

హాల్వా ప్లేటుని పెరుగు ఆవడ పళ్లాన్ని అక్కడ వుంచుతూ కళ్యాణి "పెద్దవాడు చాలా రోజుల్నుంచి అడుగు తున్నాడు. అమ్మా హల్వా చెయ్యవూ అని. సరేనని చేశాను" అంది.

లొట్టవేస్తూ "భలే భలే" చక్కగా చేశావు.... అబ్బ...ఎంత బాగుంది" అన్నాడు తనలో తనే అనుకుంటున్నట్లు. కొబ్బరికోరు, ఏలకపొడి, కలకండ ముక్కలతో శనగ పిండి హల్వా అంటే మహిపాల్ కు ఎంతో ఇష్టం.

కళ్యాణి అంది– "కరెంటు పొయ్యిమీద ఇప్పుడే మళ్ళీ వెచ్చ చేశాను. పొద్దున్న కంచం తోసేసి కోపంలో వెళ్ళిపోయారు. పొద్దున్నుంచి నా గుండె మీద సెగపెట్టినట్టుంది..." దుఃఖంతో మాటలు గొంతులోనే ఆగిపోయాయి. కళ్యాణి కనుకొలకల్లో నీళ్లు నిలిచాయి. పెదిమలు వణక సాగాయి.

ఆమెను చూడగానే మహీపాల్‌కు జాలి వేసింది. పైకి కనబర్చకుండా చిరునవ్వుతూ "అదా సంగతి. అంటే ఈ శ్రమంతా అలిగిన భర్తగారిని బతిమాలు కోవడానికి ప్లాను అన్నమాట. పెద్దవాడు ఉత్త వంకన్న మాట" అన్నాడు.

ఎండిపోయిన కళ్యాణి ముఖం చిరునవ్వు జల్లుతో తడిసింది. కళ్యాణిని చూస్తూ "మేం ప్రసన్నులమయ్యాం, చూడు" అన్నాడు మహీపాల్.

చెంచాతో హల్వాతీసి ఆమె పైపు చేతిని చూపాడు.... "నా కొద్దు. మీరు తినండి" అంది కళ్యాణి.

"ఓస్' అంటు తగులుందనా? హరి రామ! వంటింట్లో తినడం లేమగా. ఇక్కడ వేరే గదిలో తినడానికి మరి ఏమిటి!! ఫరవాలేదు తిను" ముద్దుగా బెదిరిస్తూ చెంచాను ఆమె నోటికి బలవంతంగా తగిలించాడు మహీపాల్. వెంటనే కళ్యాణి మూతి బిగించుకొని "వద్దు" అంది దృఢంగా.

మహీపాల్ నుదుటి భాగం కోపంతో బిగుసుకుంది. అయినా కోపాన్ని తమాయించుకుని గంభీరంగా అన్నాడు– "స్వామీ వివేకానందుడు ఏమన్నాడో తెలుసా ! అసలు వివేకానందుడు అంటే ఎవరో తెలుసా నీకు!"

"ఆ.... ఆ.... ఆయన పటంచూశాను".

"అవును. ఆయనే.... మన హిందూమతం గురించి ఏం చెప్పారో విను. హిందూమతం ఎక్కడుంటుందని చెప్పారంటే వంటింట్లోనట. మనదేవుడు ఎవరని చెప్పారో తెలుసా–మనం పప్పు అన్నం వండుకొనే అన్నపు తపాళా అంట. అంతేకాదు. మన మతం యిక్కడికి ఎలా వచ్చిందీకూడా చెప్పారు"

కళ్యాణి భర్తకు సమాధానం ఇవ్వకుండా అతని వైపు ప్రశ్నార్థకంగా చూడసాగింది.

"మన సనాతన ధర్మం వుంది. చూశావ్ ... కొజ్జాలాంటిది. ముక్కు మీద వేలు వేసుకొని ఎవరైనా వినేవాళ్ళుంటే ఏం చెపుతుందో తెలుసా? అరె ముదరష్టుల్లారా, అరే సచ్చినోళ్లారా, నన్ను ముట్టుకోకండి. నేను చాల పవిత్రంగా పరిశుభ్రంగా వున్నాను అని"

మతం గురించి మహీపాల్ ఈ విధంగా ఎగతాళి చేయడం కళ్యాణికి అపరాధంగా తోచింది. గుచ్చినట్లయింది. ఆమెకు భయంవేసింది. ఆతర్వాత మహీపాల్ మౌనంగావుండిపోయాడు. హల్వా సగంతిని మిగతాసగాన్ని ప్లేటులోనే వది లేస్తూ, అవడం పళ్లాన్ని తీసుకుంటూ తనమాటకు భార్య ఏంచెపుతుందా అని ఎదురుచూస్తున్నాడు.

"చూడు. మనం గృహస్థులం. పిల్లా జల్లా కలవాళ్ళం. మతం గురించీ, దేముణ్ణి గురించీ అలాచెడ్డగా మాట్లాడొద్దు. పాపంచుట్టుకుంటుంది" అంది ఆమె. కంఠం కంపిస్తోంది.

"పాపం గీపం అనేది నీ అంటులోనూ, నీ మడిలోనూ దాక్కునుంది. ఆ. అది అంటు యిది అంటు-రామ-రామ... సరేగాని నువ్వు హల్వా దొడ్డిలో ఎందుకు చేస్తావు.? అక్కడే కూర్చొని తింటావు. వడ్డిస్తావ్. నీ తెలివితేటలు ప్రకారం అక్కడా కూడా అంటు వుండొద్దూ?"

"ఎందుకూ?"

"ఎందుకంటే? మరి అరబ్బు దేశాల్నుంచి తిండిగింజలు వస్తున్నాయిగా. మహమ్మదీయులవి."

"వుండొచ్చు. నాకేం సంబధం. మామ్మదీయుడు వాడింట్లో వాడొండు కొంటాడు. నా యింట్లో నేనొండుకొంటాను."

"అదేనోయ్. నేన్ను అడిగేది. నువ్వేమి వండుకొంటావ్ అని. కేవలంనీకు పదాల్లోనూ, అక్షరాల్లోనూ మడి అనాచారం కనపడ్తోంది."

"అట్లాగేంకాదు" కళ్యాణి ఫలానా అని ఖండించలేకపోయింది, భర్త చెప్పిందానికి ఔనన్నట్లుగా తల ఆడించనూ లేకపోయింది. తడుముకోకుండా కంగారులో అనేసింది. మహిపాల్ మళ్ళీ అడ్డుకున్నారు.

"అట్లా కాదంటావూ? అట్లాగైతే మరి ఏదోపదంలో ఏదో అక్షరం వుందంటూ నువ్వు [1]గొబిర్‌గడ్డా, [2]గోభీపువ్వు మరెందుకు తినవూ. దాన్లో 'గా, గో' అనే అక్షరాలు వస్తాయనేగా కదూ? నువ్వు అవడలు కూడా తినొద్దు. దాన్లోకూడ 'గ' అనే అక్షరంవస్తాది. రోషంతో సగంకొరికి ''అబ్బ, ఎంతబాగా నానాయ్" అని అన్నారు.

"ఆ అక్షరాల్లో గా, గో ఎక్కడుంది?" అవడలను పొగడ్తూంటే హుషారుగా అడిగింది కళ్యాణి.

వడను తెలుగులో గారంటారు. ఇకనుంచి గారెలు చెయ్యకుతినకూ,వడలు ఇంకా తీసుకరా. కొంచెం కారప్పొడి చల్లీచల్లనట్టుగా [3]బుకునూ మాత్రం కొద్దిగా చల్లు. ఇకచూడు ఎంతమాజాగా వుంటాయో!

"ఇంక చాల్లెండి, ఇంత ఆలస్యంగా తింటూ ఎక్కువ తినడం మంచిది కాదు. ఇవిగూడా నేను తెచ్చేదాన్నికాదు. మనసుండలేదు. రేపుపొద్దున తినొచ్చులెండి" నవ్వుతూ కళ్యాణి వారించింది.

"ఒకే" అంటూ పళ్లెంలోని పెరుగును చెంచాలోకి తీసుకోసాగాడు.

వేళాకోళంగా భార్యను ఏడిపించాలన్న వుద్దేశంతో అన్నమాట అతని మనసులోని ఆలోచనను నిజంగా రేకెత్తించింది—"హల్వా విదేశీవంటకం. అయినా మన దేశంలో మనం నిత్యం చేస్తున్న ఆహారంలో ఒక ప్రధానమైన భాగంగా మారిపోయింది. అలాగే తినడం, తాగడం, చివరకు ధరించే దుస్తులూ ఇతర రకాల గుడ్డలూ, పదాలు, ఆచారాలూ, అలవాట్లూ ఒకరికొకరు సొంతం చేసుకోవడం ద్వారా అవి ప్రజాజీవితంలో అంతర్భాగంగా అయిపోయాయి.

---

(1) ముల్లంగి. (2) క్యాబేజీ (3) శొంఠి, జీలకర్ర, వుప్పు కలిపి మెత్తగా నూరిని పొడి.

అవర అనేది హిందూదేశంలో మొట్టమొదటి ఏ ప్రాంతంలో ఎవరో ప్రయోగంగా తయారుచేసి వుంటారు. లేదా అన్నిచోట్ల పాకశాస్త్రరంగాలలో ప్రయోగాలు చేస్తూ ఇది కనిపెట్టివుంటారు. కాని ఆ ప్రాంతంనుండి మరో ప్రాంతానికి అలా అలా వ్యాపిస్తూ యావత్తు దేశ ప్రజల భోజనంలో తప్పకుండా వాడబడు తోంది. వస్తువులు ఒకచోటికి ఎలా ప్రయాణం చేస్తాయి? సంస్కృతి ఎలా వ్యాపిస్తుంది? వస్తువూ ఆలోచన ఇవి రెండూ కాలవాహినిలో ఏవిధంగా ప్రవహిస్తూ మన సంస్కారాల్లో కలిసిపోతాయి? మానవ జీవితం ఎంత విచిత్రమైంది! ఎంత జటిలమైంది! ఎంత సరళమైంది! ఒక్కసారిగా....'

కళ్యాణి పెదిమలు ఏవో పలికాయి. ఆలోచనల్లో మునిగిపోయి తన్నుతాను మరచివున్న మహీపాల్ ఆమె మాటలకు ఈ లోకంలోకి వచ్చాడు. పాపం, ఏంకాలంవొచ్చింది వాళ్ల కాపరానికి. వింటోంటే నా మనసు ఒణికిపోయిందనుకోండి"

"ఏమైందీ?"

"ఏం చెప్పను పార్వతి తండ్రికి పిల్లల ఆలనా పాలనా పట్టదు. పిల్లల కడుపు మాడపెట్టి పెద్దవాళ్ళు జలసాచేస్తోంటే నరకంలోకి తోసేయకుండా వుంటాడా?"

పార్వతి పొరుగును వుండే ఓ గవర్నమెంటు వుద్యోగి కూతురు. పద్దెనిమిది సంవత్సరాలపిల్ల. తండ్రి పెళ్ళిచేయలేదు. చదువు చెప్పించలేదు. ఆమెకు తమ్ములూ చెల్లెళ్ళూ మొత్తం అయిదుగురు. పక్కనే ఆమె పిన్నమ్మ పిల్లలతో వుంటోంది వారికి వీరికి మధ్య గోడే అడ్డం. ఐదు సంవత్సరాలైంది. చిన్నాయనకు ట్రాన్స్‌ఫరు అయింది. జలంధర్‌లో ఒక్కడే వుంటున్నాడు నెలజీతం అక్కణ్ణుంచే పంపిస్తాడు. పార్వతి తండ్రి సంపాదించే జీతంలో చాలారాళ్ళు పినతల్లి పెట్టెలోకే పోతాయి. పార్వతి తల్లి తోటికోడలు కారణంగా అనాథలా ఎప్పుడూ దబ్బు యిబ్బందిని ఎదుర్కొంటూ వుంటూంది. లేకపోతే తన్నులో చెప్పుదెబ్బలో తిట్లోతింటూ వుంటుంది. ఏంచేయగలదు. భర్తకు చెల్లెలికి సంబంధం వుందని ఆ బజారంతా పొక్కిపోయింది.

కాళీ ప్లేటును పేపర్‌పై వుంచుతూ గ్లాసును చేతిలోకి తీసుకొందామని చేయి చాపుతూ అన్నాడు - "దీనిలో కొత్త ఏముందీ?"

"అదే, ఈసారి జీతం అసలు ఇవ్వనే లేదంట ఇంట్లో. పార్వతి అమ్మ వెక్కి వెక్కి ఏడుస్తూ చెప్పింది రెండు రోజులుగా పిల్లలు తిండిలేక మాడుతోంటే నేను గుండెను ఎట్టాగట్టిచేసుకొనేది?"

వణికే కంఠంతో కళ్యాణి మళ్ళీ చెప్పసాగింది- "వాళ్ల పిల్లలకు ఏదైనా ఉద్యోగం చూసిపెట్టమని మీతో చెప్పమంది. రెండు పూటలు అన్నం పెడితే చాలు. ఏదైన చింకిగుడ్డ గోచీ...."

అలా అంటుండగా ఆమె కళ్లల్లోంచి కన్నీరు జః జలరాలింది. క్షణంసేపు ఆమె కంఠాన్ని పెకిలించలేకపోయింది. మళ్ళీ వుద్రేకాన్ని నిఁదొక్కుకుంటూ కొంగుతో కన్నీళ్ళు తుడచుకుని "ఆమె కూతురు చెప్పంటే నా గుండె చెరువైంది. బిడ్డను ఇంట్లోంచి వెళ్లగొట్టాలని ఏతల్లి మనస్ఫూర్తిగా కోరుకొంటుఁది"? ఆమె కళ్ళల్లో నీరు నిలవక జారిపడుతోంది.

ఓ దీర్ఘమైన నిట్టూర్పు విడుస్తూ మహీపాల్ అన్నాడు-"పాపిష్టి కడుపు. తోడికోడలు నోటికి ఒడిసి పాపం ఆమె గుండెను రాయి చేసుకుఁటోంది. ఇదంతా విఁటోంటే ఈ దొంగవెధవ దీప్‌నారాయణ్ గాణ్ణి మెత్తగా తన్నాలనిపిస్తోంది. ఎముకలు బుగ్గి బుగ్గి అయిపోయేలా..."

దయను చిల్పుకుంటూ ఇల్లాలు ఆజ్ఞాపిస్తున్న కంఠంతో అంది. బాణంలా ఆమె మాటలు వేగంగానూ వాడిగానూ వున్నాయి!"ఒద్దు మీకు పుణ్యముంటుంది ఇరుగుపొరుగు గొడవల్లో ఎంతకని తలదూరుస్తాం. మన కేమిటి సంబంధం? మన ధర్మాన్ని మనం పాటిద్దాం. వాళ్ళతో మీరు పగకొని తెచ్చుకొంటారేంటి?" అంటూ కళ్యాణి లేచి యింట్లోకి వెళ్ళిపోయింది.

మహీపాల్ తనలో అనుకున్నాడు - "దీపనారాయణ్‌లా నేనూ నీచుణ్ణే, నా భార్యను యేడిపిస్తాను. మోసం చేస్తాను. నేను దుబారా చెయ్యను. నిజమే కాని నా పిల్లలకు సరైన ఆహారం పానీయాలు యివ్వలేను....రేపు క్రిస్మస్ ఈవ్

షీలా దగ్గరకు వెళ్లాలి. ఆమెకు ఏదైనా బహుమతి తీసుకెళ్లాలి. ఇంట్లో ఐదు రూపాయలు మిగిలాయి. ఒకటో తారీకు మనకూ వస్తుందన్న ఆశలేదు. "లోక సత్తా'' వాళ్ళ నుంచి కూడ జనవరి ఎనిమిదీ పదో తారీకు కల్లా డబ్బురావాలి. రాలేదు. ఇన్ని రోజులు ఎలా గడుస్తాయి? ఎలా సంసారాన్ని నడపడం? పర మేశ్వరా!"

కళ్యాణి చెంబుతో నీళ్లతెచ్చింది. పాన్‌దాన్‌ను తీసి భర్తకు కాళ్ళు చేతులు కడుక్కోవడానికి నీళ్ళు పోస్తూ నిలబడింది. దగ్గిరగా వుండేమో భర్త మొహం కడుక్కొని పుక్కిలిస్తూంటే గప్పున అతని నోట్లోంచి వాసన వచ్చింది. వెంటనే ముక్కుకు చెంగు అడ్డం పెట్టుకుంది. భార్యపమిటతో చేతులు తుడుచుకుంటూ మహిపాల్ దొంగతనం బయటపడిందన్న విషయం గ్రహించాడు. అయినా ఫర్వా లేదని నచ్చజెప్పుకుని ధైర్యంగా - "ఇవ్వాళ కొద్దిగా పుచ్చుకున్నామేడమ్! సజ్జన్ ఇంట్లో. వాడు మరీ బలవంతం చేశాడు." అన్నాడు.

"వారైతే మారాజులు. ఎంతతాగినా ఫరవాలేదు. దానికి తగ్గ తిండి తింటారు మీరు చూడండి ఎంత నీరసంగా వున్నారో..."

''అరె, రోజూ ఎవరు తాగుతున్నారు....? రేపు, ఎల్లుండి మాత్రం మళ్ళీ పుచ్చుకోవాల్సి వుంటుందిలే. క్రిస్మస్‌కు ముందుగానే చెప్తున్నా ఎడ్వాన్సుగా ఏమీ అనుకోకు''.

బల్ల మీద నుంచి ఆకులపెట్టె పోగాకు పొడుంరబ్బీ ఇస్తూ కళ్యాణి వూరు కోలేక మెల్లిగా అంది-"పెద్దగా అనుకోపోతే ఓమాట చెప్పనా ?"

"చెప్పు"

"చెప్పనులే, పోనీలెండి. రెండు రోజుల తర్వాత ఇవ్వాళ మన గ్రహాలు కలిసేయ్" అంటూ పెట్టెలోంచి రెండాకులు తీసుకుని నోట్లో వేసుకుంది. పెట్టె మూసింది. మహిపాల్ పొడుంరబ్బాని ఆమె వైపు దాపి "సంకోచించకు మహా రాణీ, నేను అభయం ఇస్తున్నాగా",

"శకుంతలకు ఆ మూడు ముళ్ళు ఎప్పుడు పడతాయా అనిచింతగావుంది. మన మంచితనాన్ని ఎవరూ చూడరు. పెద్దతనం కొంచెం వుంటేరాలు వెంటనే ఎత్తిచూపుతారు" ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ కళ్యాణి హితవు చెప్తున్నట్లుగా అంది.

దిండు మీద ఆనుకుంటూ మహీపాల్ కాస్త కంఠం హెచ్చుస్థాయిలోనే అన్నాడు. "ఎవరనుకున్నావ్ వీడు. జాలా వంశంలో పుట్టిన షట్కులస్థుడు ఈ శుక్లా-బాల శుక్ల గ్లాసు పట్టించినా బాలాశుక్లాయే వీడి మీద వేలెత్తి చూపడానికి ఎవడికి గుండెలంటా!"

భర్త ప్రతాపం చూడగానే కళ్యాణికి నవ్వొచ్చింది— "తాతగారి ఎస్టేటంతా తన వాటాకేవచ్చినట్లు శుక్లాగారు ఎందుకో ఇప్పుడు తెగనీల్గుతున్నారు" అంది, ఆ వెంటనే మళ్ళీ మామూలు ధోరణిలో లక్షా రెండు లక్షల స్తోమతు మనకే వుంటే ఎవరికి అన్ని గుండెలుంటాయ్. మనవైపు వేలెత్తి చూపడానికి! గట్టూ పెద్దవాడయ్యాడు, ఏమైనా యింకా వాడు బాలా శుక్లాయేగా. మల్లరు అమ్మ ఏమందో విన్నారూ నిన్న? మీ ఆయన నిజంగా పేరు ప్రఖ్యాతులు కల వాడే. కాని ఏం లాభం? చేతిలో కాసులు లేవు. మేనకోడలు పెళ్ళికి కట్నం ఇచ్చుకోవడానికి ఏముందనీ అంది".

ఈ మాటలు వింటూండే ముల్లర్ తల్లి మీదా, అసలు ఈ సమాజం మీదే అతనికి ఎంతో రోత కలిగింది. గట్టూ మహీపాల్ ఉక్కకు తమ్ముడు. లక్నోలో పేరున్న డాక్టర్ జయపాల్ శుక్లా సంసారం తనసంసారం కన్నా ఎన్నో రెట్లు సౌఖ్యంగా వుంది. అతనిదర్జా, హుందాతనం తన కాపురం నాగజెముడు తుప్పలా అనిపించింది. అతనికినాగజెముడు ముల్లుగుచ్చుకున్నట్లయింది దరిద్రదేవత తన కరాళహస్తాన్ని మహీపాల్పై విసిరింది. ఒక్క దెబ్బకే అతని సాహితీ వైభవం అంతా పొరలు పొరలుగా ఊడిపోయింది. అతని ప్రాణాలు గిలగిలకొట్టుకున్నాయ్ కోపంతో పిడికిళ్ళు బిగించి మహీపాల్ అన్నాడు – "పది సంవత్సరాల తర్వాత ఎవర్ని గొప్పవాడంటారో నేనూ చూస్తాను. గట్టూయో నేనో? డబ్బుకోసం అమ్ముడు పోయే ఈ ప్రపంచం ఎన్నాళ్లు ఇలా వుంటుంది? ఇప్పుడు

సమాజాన్ని పరిపాలించేది నమ్మక ద్రోహులూ, ఇంటిదొంగలూను. సమాజాన్ని నడిపించే వారిని ఇట్టి లోకంలో విలువలు వుంటాయి. ఈ రకపుమోసాన్ని దగానూ యిదే సమాజవైభవంగా చెప్పుకొంటూ చెలామణీఅవుతున్నారు. చావడానికి సిద్ధపడ్డవాడు దేనికైనా తెగిస్తాడు అన్న వజ్రసంకల్పంతో కోట్లాది ఆకలి అరుపులు వాళ్ల వెనకనే తరుముకొస్తూ వున్నాయన్న విషయం వాళ్ళు మర్చిపోయారు. ఈ దరిద్రనారాయణులేగాని కోపిస్తే వేళ్ళమీద లెక్క పెట్టకలిగే ఈ ఈటక్కరిమూకలు బూడిదచేసేస్తారు. ఆరోజున నాకూతుళ్ళకు తోడుగా జ్ఞానం అనే కట్నం అత్తగారింటికి వెళ్తుంది. దానికే విలువ వస్తుంది అప్పుడు. దొంగ వెధవలు...నా పేదరికాన్ని ఎగతాళి చేస్తారా!"

రౌద్రాకారమూర్తయ్యాడు మహీపాల్. గదిలో అటూ ఇటూ తిరగాడసాగాడు.

భర్త ఏం మాట్లాడాడో కళ్యాణికేమీ అర్థం కాలేదు. కాని అతని మహోద్రేకాన్ని చూసి ఆమెకు భయం వేసింది. తనవరకు తాను దుర్భరంగా గడుపుతూ నిత్యం డబ్బు కష్టంతో మర్దనపడుతోన్న కారణాన ఆమెక్కూడా వున్న వాళ్ళంటే ద్వేషం. ఈనాటి ప్రపంచం ముక్కుకు సూటిగా పోయేవాళ్ళది కాదు. చిత్తశుద్ధిగా వున్నవాడు దిక్కులేని చావుచస్తాడు. మోసం, కపటం, దగా చేతయినవాడు ఆర్థికంగా బాగా పుంజుకుంటున్నాడు. వాళ్లే అష్టైశ్వర్యాలతో తులతూగుతూండడం ఆమె చూస్తోంది. కాని అదంతా మారేది ఎలా? ప్రపంచంలో ఎప్పుడూ అటువంటి వాళ్లే సర్వసుఖాలూ అనుభవిస్తున్నారు. భగవదేచ్ఛ అలా వుంది.

భర్తను చూడగానే ఆమెకు జాలివేసింది. పాపం ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటారు. ఇంతకష్టించిన ఆయనకు సౌఖ్యం లభించడంలేదు. మెరదుతో ఎంత పనిచేసినా చిటికెడు నెయ్యి తినలేకపోతున్నారు. తినలేకపోతున్నారు ఎలా సన్నబడిపోయారో....

మానసికంగా పరిస్థితులు విషమించినపుడు ఒక నిమిషం కూడా బ్రహ్మకల్పం అంత పొడుగ్గా కనపడుతుంది. రెండు నిమిషాలు గదిలో నిస్తబ్దత

వ్యాపించింది. మహీపాల్ గదిలో పచారుచేస్తోంటే అడుగుల చప్పుడు వినపడడం మినహా అంతా నిశ్శబ్దంగా వుంది.

వున్నట్టుండి మహీపాల్ కళ్యాణి ఎదురుగా నిలిచి "నేను నిశ్చయించు కున్నాను. శివచరణ్ దుబేగారి అబ్బాయితో సంబంధం ఖాయం చేసుకుంటా. ఆయన మంచివాడు. వాళ్ళ పిల్లవాడు మర్యాద మన్నన అన్నీ ఎరిగినవాడు. ఈ సంవత్సరం ఇంజనీరింగ్ పాసౌతాడు. ఏం, అర్థమైందా?" అన్నాడు.

మహీపాల్ మాటల్లోని తీవ్రతను గుర్తిస్తూ కళ్యాణి వూరుకోలేక మెల్లిగా అంది– "శివచరణ్ [1]దుబేధాకరు-వంశస్థులుకదూ. వాళ్ళతో వియ్యం ఎలా పొందడం?"

"అయితే తేరాదూ లక్నో అంతా వెతికి ఏ వాజపేయీ పుత్రుణ్ణో సత్య సంధుడూ, కట్నం అడగని వాడూ–మంచిదేగా" చేతులు ఆడిస్తూ వెక్కిరించాడు మహీపాల్.

"అంటే శివచరణ్ కట్నం పైకం అడుగడా?"

"అడగడు. శివచరణ్ నిఖార్సయిన మనిషి. అతన్ని చాలాసార్లు తరచి చూశాను."

కళ్యాణి దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది. "లోకం ఏమంటుంది? శకుంతల నాన్న బతికుంటే మజ్‌గల్ మిశ్రాలఇంటి ఆడపడుచు ధాకర్ల యింటికి పోవడమా అని మనల్ని ఆడిపోసుకుంటారు" అంది.

---

1. కన్యాకుబ్జ బ్రహ్మణుల్లో ఇతర కులాలకు మాదిరి చాలా శాఖలు ఉపశాఖలూ ఉపజాతులూ వున్నాయి. ఈ ఉపజాతులు మళ్లీ గోత్రాల కిందా ఆగోత్రాలు కులాల కింద చీలాయి. కులాలు తిరిగి మూడు భాగాలకింద చీలాయి– షట్‌కుల్, మధ్యమ్, ధాకర్, షట్‌కులస్థులు అందరికన్న శ్రేష్ఠులని అనుకుంటారు. ధాకర్ల కులస్థులంటే వాళ్లు నీచంగా చూస్తారు. బాలా అనే వ్యక్తి ప్రసిద్ధిగన్న కులంలో పుట్టిన మహీపాల్ శుక్లాపక్ష్ కులస్థుడు. అతని మేనకోడలు తండ్రిపైపు ఉత్కృష్టమైన కులం కలది. వాళ్లు మాజ్‌గావ్‌కు చెందిన మిశ్రాలు. వుత్తమ మర్యాదలతో జన్మించిన వాళ్ళు.

"ఐతే తేవే, ఓ ఇరవైవేలు బయటకు తీయ్. వాళ్ళు మగాళ్లకూ ఆడా ళ్లకు పెళ్లిచేస్తున్నారా? కాదు. వీళ్ళు చేసే పెళ్ళిళ్ళు డబ్బుకూ అహంకారానికీని. పరమ నీచులు వీరు. అమానుషం....వాడు ఆ తివారీగాడు లేడూ? పెద్దరైటర్.. థింకర్....కాలేజీ ప్రిన్సిపాల్ అమ్మాయి జాతకం తెమ్మంటూ పాతిక వేలు రొఖ్ఖం తే అన్నాడే. ఇరవై అయిదు వేలురొఖ్ఖం కావాలట. మిగతా లాంఛనాలన్నీ మీ యథాశక్తి అని వాగాడు...వాళ్లా చదువు సంస్కారాలు వున్న వ్యక్తులు? వీళ్లా నాగరీకులు! ఛీ!"

మహీపాల్ కాళ్ళలో మళ్ళీ వేగం హెచ్చింది. అంత చిన్న గదిలో కూడా అతను ఎంతో వేగంగా పచార్లు చేయసాగాడు. మళ్ళీ తటాలున కళ్యాణి కుర్చీ దగ్గరకొచ్చి ఆమె భుజాన్ని నొక్కుతూ కళ్లెగరేస్తూ-''చెవులు నిక్కపొడుచు కుని విను, శకుంతల పెళ్ళి శివచరణ్ దుబ్బేగారబ్బాయితో ఖాయం చేస్తాను. జాతకాలు ఏమీ చూడను-ఇంకా మీనమేషాలు లెక్కపెట్టావంటే వేరే జాతిలో పెళ్ళి కుదురుస్తా, నాకు జాతీ గీతీ అంటే నచ్చదు. ఇవన్నీ అంటే నాకు అస హ్యం-పరమ అసహ్యం ఓయ్‌మాలోకం! విన్నావుగా? విన్నావాలేదా?' అన్నాడు.

భర్తకు ఎదురు మాట్లాడానికి భయంవేస్తోంది కళ్యాణికి. అతను మాట్లా డుతూ పోతూంటే ఆమె ముఖకవళిక అనేకరంగులు మార్చింది. భర్త మొండిగా అలా అడుగుతూంటే ఆమె తొందరగా ఓ నిశ్చయానికి వచ్చి ఇలా అంది- "మన పిల్లలకు పెళ్లిచేసేప్పుడు మీ ఇష్టం వచ్చినట్లు చెయ్యండి. మన శకుంతల పరాయిబిడ్డ. వాళ్ళమ్మ బతికుంటే ఆమె సలహా తీసుకొని ఠాకర్లకు చేస్తారో ఇంకోళ్ళకు ముడిపెడతారో అది వేరే విషయం. ఇప్పుడలాకాదు మరి."

"ఠాకర్లంటే తక్కువ అని మళ్ళీ అంటున్నావ్ కదూ? ఎవరూ ఎక్కువ తక్కువకాదు''

"కాకపోవచ్చు. కాని శకుంతల్ని వాళ్ళకు యివ్వడానికి వీల్లేదు. ఇదా రంటే నేనింత విషం తిని చస్తాను."

"మరి రూపాయలు ఎక్కణ్ణుంచి తేనే?"

"షట్ కులపోళ్ళలో మనం ఒక్కరమే బీదవాళ్ళలా వుంది. మనలాటి వాళ్ళు ఎంతో మందున్నారు. మనం బీదవాళ్ళమయినంతమాత్రాన ప్రపంచం ఆగిపోతుందా? ఏం అయితే అయ్యాం, లేనివాళ్ళం అయితే మాత్రం."

"ఈ గుండెలు బాదుకొనేవాళ్ళ ప్రపంచమే నిజమైన ప్రపంచం. వాళ్ళ కాళ్ళిప్పుడు తడబడుతున్నాయి. లోకులు పెళ్ళి పబ్బం ఎలా చేస్తున్నారో తెలుసా? ఇంట్లో జరిగే వేడుకల్ని ఎలా చేసుకుంటున్నారో నీకేమైనా తెలుసా అని? అప్పు చేసి పప్పుకూడులా అఘోరిస్తున్నారు. వాళ్ల జీవితాల్ని చీకు, చింత, అవమానం, కన్నీళ్ళలో పూర్తిగా తడుపుకొని మెడవరకుమునిగి ఇవన్నీ జరుపుకుంటున్నారు. నా కంత హృదయమూలేదు. నా కంత బుర్రాలేదు. ఇన్ని చింతలు పెట్టుకొని ఏ షావుకారు దగ్గరకో పోయి వాడు వేసే వుచ్చులో చిక్కుకునివున్న బరువుతో పాటు ఆ వడ్డీ బరువుని కూడా మోయలేను. ఆ పని నేనెన్నటికీ చేయను"

భర్త పడుతున్న మనోవ్యథచూసి కళ్యాణి చాలా కలతచెందింది, కాని నాస్తికుడిలా అతను మాట్లాడిన మాటలు విని ఆమెకు కోపం వచ్చింది. మహీపాల్ స్వభావం తెలియనిదికాదు. తనమీద కోపంవచ్చి అవమానిస్తే ఆమె ఆశ్చర్యపోదు. ప్రపంచంలో ప్రతి యింట్లో ఆమె ఈతతంగాన్ని చూస్తూనేవుంది మగవాడు ఆడదానిపై పెత్తనం చేస్తాడు. ఈ విషయంలో బీదా సాదా' శ్రీ శ్రీమంతులూ, మధ్యతరగతి కుటుంబీకులూ అందరిదీ ఒకటేనీతి-ఒకటే పాలసీ. మహీపాల్ చరిత్రహీనుడు, అతని వ్యక్తిత్వంలోని ఈ మచ్చ ఆమెకు తెలుసు. ఆచారమూ, మడీ, శాస్త్రదారాలంటే పడిచచ్చే ఇళ్ళలో కూడా మనవాళ్ళు తప్పతాగి వ్యభిచారం చేస్తూండడం, ఇంకా ఎన్నో విధాల వాళ్ళు చరిత్రహీనులు కావడం కళ్యాణి చూసింది. కానిఆమె సహించలేనిదల్లా మహీపాల్ మాటల్ని తన ఇరవై నాలుగేళ్ళ దాంపత్య జీవితంలో ఆమె భర్త జీవనసరళిని, అతని ఆలోచనా పద్ధతినీ ఇంతవరకు అవగాహన చేసుకోలేకపోయింది. చాలా రోజుల్నుంచి ఆమెలో ఓ సందేహం పెరుగుతూంది. తన భర్తకు, అతని ఈ రకమైన

నా స్తిక ధర్మానికి సంబంధించిన అభిప్రాయాల గురించి కాదు కదా ప్రపంచం అతణ్ణి గౌరవిస్తూంది? ఈ విషయాలు రాసినందుకా అతణ్ణి అందరూ గొప్ప రచయిత అని అంటున్నారు? ఇన్ని సంవత్సరాల్నుంచి వీరు ఇవేమాటలు రాస్తు న్నారు. చెపుతున్నారు; మీటింగుల్లో వారి అభిప్రాయాలను మన్నించి సన్మానాలు చేస్తారు. కాని ఏం ప్రయోజనం. ప్రపంచం మళ్ళీ పాతపాటే పాత బాణీలోనే పాడుతూంటుంది. వీరి అభిప్రాయాలకు కలియుగం వాళ్ళు విలువ యివ్వాల్సిందే కాని వాటిలో సారం లేదు. కులం, మర్యాద, మతం, రివాజులూ, ఆచారాలూ, పరమేశ్వరుడు తయారుచేసిన ఈ విధానాలన్నీ మాయమైపోతాయా? ప్రపంచం పూర్వం ఇలాగే నడిచింది. ఇకముందు కూడా అలాగే నడుస్తుంది. అప్పసప్ప చేసి పిల్లలకూ కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు అందరూ చేస్తారు? దీనిలో ఆశ్చర్యం ఏముంది కనుక!

రెండో కాలు కూడా కుర్చీమీదకు లాక్కుంది కళ్యాణి. మోకాళ్ళమీద చేతులు పెట్టి వ్రేళ్లవిరుస్తూ "అప్పు చెయ్యండి లేదా మరో ఉపాయం ఆలో చించండి. అదంతా నాకు తెలీదు. ఏమైనా శకుంతల మటుకు షట్కులం వారి గుమ్మాన్నే మెట్టుతుంది. ఇక మీ పిల్లల పెళ్ళిళ్ళు గుడిసెల వాళ్ళతో మాదిగలతో చేస్తారో-నాకేం తెలీదు మేం గంగానది ఒడ్డుకు వెళ్ళిపోతాం. ఆ బిడ్డ మాత్రం మన పాతకాల ఆచారాల ప్రకారమే అత్తగారింటికి వెల్తుంది. ఇది ఖండితంగా చెప్తున్నా మీరు ఏ చెవితో విన్నా సరే "అంది. అంటూ వెళ్ళి పోవడానికి కుర్చీ లోంచి లేచింది.

శకుంతలకు పెళ్ళి, కట్నం- భార్య తనమీద కోప్పడడం వీటికి తోడు అతనిలో వున్న విసుగూ ఇవన్నీ చేరి అతణ్ణి లోతుగా ఆలోచించడానికి పుసి కొల్పాయి. కుర్చీకి దగ్గరగా టేబుల్ మీద అనుకొన్న మహీపాల్ ఆడదనేది ప్రపంచంలో తమాషా అని ఆలోచించాడు. చరిత్ర పుట్టినప్పట్నుంచి ఆడది మగాడికి పెద్ద సమస్యగా దాపురిస్తూనే వచ్చింది. ప్రస్తుత సాంఘిక వ్యవస్థలో స్త్రీ జాతి ఏ రూపంలో చూసినా అగౌరవపు బతుకు బతుకుతూంటుంది. చిన్న వాళ్ళసంగతి అడగొద్దు. సభ్యతా, పాండిత్యమూ, డబ్బూ ఐశ్వర్యమూ అన్ని

ఏధాలా సంపన్నమైన కుటుంబాల్లో కూడా స్త్రీజాతి దమననీతికి గురి అవుతోంది. రకరకాలుగా ఆమెను అవమానించడం జరుగుతోంది. ఆడది పనీపాట చేయడానికే అందరి సేవా సుశ్రూషలూ చేయడానికి మగవాడు అనుభవించే వస్తువు అని సాధారణంగా అందరి అభిప్రాయం. ఆమెపిల్లలు కనేయంత్రంగానే చూస్తుంటారు. మానవ జీవితం నిరాఘాటంగా సాగిపోవడానికి సంతానం అనేది అవసరం కనుక అసంతానాన్ని ఉత్పత్తి చేసే కర్మాగారంగా ఆమెను భావిస్తుంటారు. కాని ఇన్ని అవమానలకు లోనై, పురుషుని చేతిలో అమానుషంగా "జీవిస్తూ కూడా ఆమెను తప్ప ప్రపంచంలో అతను ఏ ఇతర వస్తువునూ ఇంతగా అరాధించడం లేదు. ఆదరించడం లేదు. ఎందుకంటే స్త్రీ అనేది ఇప్పటికీ సంఘ గౌరవానికి ప్రతీకగా నిల్చివుంది. ఆడది లేకుండా మగవాడు పూర్ణత్వాన్ని పొందలేదని యావత్ప్రపంచానికి తెలుసు.

ఈ ద్వంద్వ రూపం మన సంఘ నిర్మాణం ప్రారంభమైన రోజునుంచీ దాని పునాది కనపడుతోంది. సరిగ్గా చెప్పాలంటే ఈ పునాది రాయి ఒరిగి వున్న కారణంగా సంఘం అనే ఈ భవంతి ఆరంభం నుంచి నిటారుగా నిలబడ లేకపోతుంది. అలాంటి వంకరపునాదుల మీద మానవుడు ఇల్లు కట్టుకొన్నాడు అతని ఆహారాలు అలవాట్లూ యేర్పడ్డాయి. అతనిసభ్యతా, సంస్కృతి, మతం, లోకవ్యవహారం అన్నీ సంతరించుకుంటూ వచ్చాయి. మరెందుకు అంతా తలకిందులుగానే కనపడుతుంది.?

కళ్యాణిలేచిపోతూంటే మహిపాల్ ఆలోచనలుకళ్లెం పట్టుకున్న ఎద్దులాగా ఆగిపోయాయి. "ఎక్కడికి వెడుతున్నావ్" అంటూ ప్రశ్నించాడు.

మహిపాల్ తన భార్యతో ఎంతో మామూలు ధోరణిలో సాధారణంగా అడిగాడు భర్త చెప్పుతున్న అభిప్రాయాల్ని తాను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నా అతను అడిగిన పద్ధతి చూసి అతని ముఖంలోకి చూస్తూ నవ్వకుండా వుండలేకపోయింది. కళ్యాణి. "ఇంక వెళ్లాతాలాలు. ఇంకాస్సేపు ఇలానే వుంటే మీరు మరీ హడావుడి చేసేస్తారు. పెద్దగొంతు పెట్టుకుని అరిస్తే ఈ వీధిలో వాళ్ళంతా లేస్తారేమోనని భయం" అంది.

భార్య మాట విని మహిపాల్‌కు నవ్వొచ్చింది.

"మీకేం! మీ ఇష్టం వచ్చినట్టు అరనూ పెడబొబ్బలు పెట్టారు. ఇరు/ పొరుగూ నన్ను గేలిచేస్తారు. ఏవిటమ్మా, పంతులు గారికి నెలకూ ఓ పదిహేను రోజులు ఏదైనా శివం ఎత్తుతుందా ఏమిటని" అంది తిరిగి కళ్యాణి.

ఎవరో అతనిమీద గాటు పెట్టినట్లయింది మహిపాల్‌కు. ఆమె చెప్పే మాటలకు నవ్వుకూడావచ్చింది. "నీ పొరుగువాళ్ళు నిన్ను ఎగతాలి చేస్తారన్న మాట" అంటూ అడిగాడు.

ఆ మాటకు కళ్యాణి కిలకిలా నవ్వింది. నోటికి కొంగు అడ్డం పెట్టుకుంటూ-"మన పొరుగువాళ్లేం ఖర్మ, పిల్లా పీచులేరూ వాళ్లేఎక్కిరిస్తారు. అమ్మా నువ్వు వూరికే వుండవే, లేకపోతే నాన్నాగారు ఆటంకాలులు కూడా వేలుస్తారు అని నాతో అంటున్నారు.

పిల్లల మాటలు విని మహిపాల్ పకపకా నవ్వేసాడు. "అవునోయ్, నిన్ను చాలా చాలా బాధపెడతాను కదూ. కాని ఒక్క విషయం, భగవంతుని మీద ఒట్టేసి చెపుతున్నా. నిన్ను బాధపెట్టి నేనే బాధపడతాను. నువ్వులేకపోతే నాకు గతేలేదు. కళ్యాణి లేకపోతే మహీపాల్, లేడు" అని మనస్సులోని మర్మాన్ని వెళ్ళగక్కాడు మహిపాల్,

కళ్యాణి తన్మయురాలైన ప్రశాంతంగా భర్త అన్న ఆ చివరి మాటలు వింది.

ఇంతలో అఖరమ్మాయి నిద్రలో లేచి యేడుస్తున్న చప్పుడు వినిపించింది ప్లేట్లను చేతిలోకి తీసుకుంటూ భర్తతో ఆప్యాయంగా "పనేమీలేకపోతే పైకి రాగూడదండీ! మూడు గంటలు కొట్టారు కదా. నేను వెళుతున్నా అంది.

"నాకు నిద్ర రావడంలేదు. నువ్వెళ్ళు" అన్నాడు మహిపాల్.

# 11

ఆరోజు పర్వ దినం. పండిట్ విశ్వనాథ్‌శాస్త్రి గారింటికి వెళ్ళి కర్నల్, సజ్జన్ తిరిగి వస్తున్నారు. ఉదయం తొమ్మిదీ తొమ్మిదిన్నర అయి వుంటుంది. పగలు ఎండచేత ఆకాశం బంగారు ఛాయలో వుంది కాని చలికాలమేమో సందులో నేల ఇంకా చెమ్మగానే వుంది.

"సజ్జన్‌భాయీ" ఇవ్వాళ చలి విపరీతంగా వుందోయ్. ఎక్కడో దగ్గర్లో మంచుపడినట్లుంది" అన్నాడు కర్నల్.

వాతావరణం వైపు సజ్జన్ దృష్టిని ఆకర్షించడానికి ప్రయత్నించాడు కర్నల్. కాని సజ్జన్ చలించలేదు. ఇక లాభంలేదను కొని "ఇంటలెక్చువల్" టాపిక్ తెచ్చాడు. "ఎన్నైనా అనవోయ్. జ్యోతిష శాస్త్రం అనేది నమ్మాల్సిందే నయ్యా. బాగా నేర్చినవాడు చెప్పగలిగినవాడు వుండాలి. అంతే. నేటినుంచి నేను శాస్త్రిగారి శిష్యుడయ్యాను"

"మనిషి చాలా ఉదారస్వభావుడు" జ్ఞాన సంపత్తి కలవాడనడంలో సందేహం లేదు". అని అన్నాడు సజ్జన్. "ఇవ్వాళ పాప పుణ్యాల గురించి వ్యాస మహాముని చెప్పిన వ్యాఖ్య విన్నతర్వాత నాఅపోహలన్నీ పటా పంచలై పోయాయి. పరోపకారం పుణ్యం' ఇతరులను కష్ట పెట్టడం పాపం, ఎంత సరళ మైన వాక్యం. ఈ సరళత్వం- ఈ వాస్తవిక అనుశీలన శ్లాఘించ తగ్గవి!"

"దుకాణంలో జరిగిన దొంగ తనం' లబ్బొరిలో మేము వేరు పడడం" నా భార్య రూపు రేఖలూ అన్నీ చెప్పేశాను. మరి జ్యోతిషాన్ని ఎట్లా నమ్మక పోవడం!" తనకు తోచిన రీతిలో శాస్త్రిగారి గొప్ప తనాన్ని చాటుతున్నాడు కర్నల్.

సజ్జన్ చిన్నగా నవ్వుతూ అన్నాడు- "నా గురించి వారు ఓ కొత్త రకమైన విషయం చెప్పారు".

సజ్జన్ భుజాన్ని తన భుజంతో కొట్టి కర్నల్ నవ్వాడు– "ఏం కొత్త. నీకు అపఖ్యాతే కాదు, అధోగతి కావాలి. నువ్వూ ఆ మహీపాల్ గాడూ మీ ఇద్దరికీ...."

"నాకు చెడ్డపేరు వస్తే సంతోషించే టట్టున్నావే. ఇక నువ్వు నా ప్రాణ స్నేహితుడివన్న మాట? అవునా?".

"స్నేహితుణ్ణి అయితే ఏం? చెడ్డ పనుల్లో కూడా తోడుగా వుంటా" అని కర్నల్ జవాబిచ్చాడు.

"ఏదైనా చెడ్డపని చేస్తాననీ' దానివల్ల నాకు చెడ్డపేరు వస్తుందనీ అతను నాకెప్పుడూ చెప్పలేదు".

"ఆఁ ఆఁ. అవునవును. ఆ చెడ్డపేరు వచ్చిన తర్వాత బాగా పేరు వస్తుందని కూడా చెప్పాడనుకో". ఓ చిన్న నిట్టూర్పు విడిచి జేబులోంచి సిగరెట్ కేసు తీస్తూ సజ్జన్ మళ్ళీ– "నరేంద్ర కవివరేణ్యులు శలవిచ్చినట్లు నీ రహస్యం అనేది వికసించని మొగ్గ లాంటిది. దాని రేకుల్ని విప్పినంత మాత్రాన అది వికసించదు" అన్నాడు.

సిగరెట్ కేసు కర్నల్ వైపు చూవుతూ అతను కూడా ఓ సిగరెట్ తీసి వెలిగించు కున్నాడు. నోట్లో పెదవుల మధ్య నొక్కిపట్టి "అందుకే నేను నా జాతకాన్ని చూపించడం సిద్ధాంతరీత్యా అంగీకరించలేను. రాబోయే దాన్ని గురించి తెలుసుకోక పోవడమే శ్రేయస్కరం. రేపు గురించి చింతిస్తూ కూర్చుంటే ఇవ్వాళ కూడా ఆనందాన్ని చవిచూడలేం".

సిగరెట్టు వెలిగించుకోవడానికి వారొక చోట ఆగారు. వెలిగించికుని సిగరెట్ లైటర్ని జేబులో పెట్టుకుని సజ్జన్' కర్నల్ ముందుకు సాగారో లేదో' ఎవరో ఓ వ్యక్తి వాళ్ళ దగ్గరకు వచ్చి "బాబుగారు, ఈ సందులో డాక్టరు బాబుగారి దుకాణం ఎక్కడా? అని అడిగాడు.

"ఏ డాక్టరోయ్?" అని తిరిగి ప్రశ్నించాడు కర్నల్.

"బాబూ' పెరుగు అమ్మఁరాదే, అరండి''

అతని మాట వినగానే వాళ్ళిద్దరికి మతి పోయినంత పనైంది. ఓ సామాన్య వ్యక్తి తనతో వేళా కోళం ఆడుతున్నాడని కర్నల్‌కు కోపంకూడా వచ్చింది.

"మర్యాద లేనోడా' వేళా కోళంగా వుందా!".

"లేదు ప్రభో" ఆ అడిగిన వ్యక్తి చెవులు పట్టుకొన్నాడు. చేతులు జోడిస్తూ "నాకే మతి చెడ్డదయ్యా మా యజమాని సెప్తుందేను. డాకదేరు దుకానానికి పోయి పెరుగుతే అని అంటున్నాడు"

''నీ యజమాని పరమ మూర్ఖుడిలా వున్నాడే. ఎక్కడైనా డాక్టరు పెరుగు అమ్ముతాడట్రా!'' అంటూ కర్నల్ ముందుకు నడిచాడు.

దారిన పోతూన్న లాలాజీ వారి సంభాషణ విన్నాడు- "ఎవరు కావాలి! డాక్టర్ హల్వాయ్ కావాలా నీకు! అదిగో ఎడం చేతివైపు దుకాణం వుంది చూడూ అదే"

నౌకరు లాలా చెప్పిన ప్రకారం ఎడంవైపు దుకాణాల్ని వెతక సాగాడు.

"అద్బే.... అదిగో! ఆ రేషన్‌దుకాణం పక్కన పండ్ల కొట్టులేవు దానికి ఆనుకునే వుంది" అని లాలా మళ్ళీ ఒక్కసారి చూపించాడు.

కర్నల్' సజ్జన్ తిరిగి నడుస్తున్నారు. "భలే తమాషాగా వుంది. పేరు డాక్టరంట' చేసేది హల్వా వండి అమ్ము కోవడం. ఇంటి పేరు కస్తూరి వారు ఇంట్లో గబ్బిలాల కంపు".

"మందు లాయన కర్నల్ ఆవ్వేగలిగి నపుడు....'' అని సజ్జన్ వాక్యాన్ని పూర్తి చేయ కూడానే "నువ్వంటావని తెలుసు" అన్నాడు సిగ్గు పడుతూ కర్నల్

డాక్టర్ అనే బిరుదుగల ఆ మిఠాయి దుకాణ దారుణ్ణి చూద్దామనే కుతూహలంతో సందుకు రెండు వైపులా వున్న దుకాణాల్ని జాగ్రత్తగా చూడడం మొదలెట్టాడుసజ్జన్. ఆవులూ, కుక్కలూ, కొంచెంగానే జనసమర్ధంతో కనిపించే సందులో కూడ సైకిలు మీద ఫీట్లు చేసే వాళ్ళతో రకరకాల మాటల్తో అటూ

ఇటూ తిరిగే ఆడ వాళ్ళతో' మగవాళ్లతో ఆ బజారంతా వికసించిన పూతోటలా కళకళలాడు తోంది. శాస్త్రిగారి సందులో కన్నా ఈ సందులో ఎండ మరీ తీవ్రంగా ఉన్నట్లనిపిస్తోంది. ఎడంవైపు పిండిమర వంపు. మరతిరుగు తోంటే తెల్లగా దుమ్ము లేచి చుట్టు వ్యాపిస్తూ మర ఆడించే కూలి వానికి తెల్ల బురఖా తగిలించి నట్టుంది. వాణ్ణి చూస్తోంటే సజ్జన్‌కు సరదాగావుంది. కుడివైపు సన్న సందు. దానిలో ముందుగా దర్జీ దుకాణం- కడ్‌కడ్ మంటూ తిరుగుతోన్న మిషను చక్రం. దానికి పక్కనే గోరింటాకు రంగు గడ్డం వున్న ఖలీఫాగారు తలుపుకు అనుకొని కాజాలు కుడుతూ కూర్చున్నాడు. అతనికి ఎదురుగా మట్టితో చేసిన హుక్కావుంది అతని శిష్య బృందం బట్టలు కత్తిరిస్తున్నారు టైలరింగ్ షాపు తర్వాత ఎవరిదో ఇల్లు. మళ్లీ దర్జీ దుకాణం, పండ్ల దుకాణం, గాజులూ రిబ్బన్ల దుకాణం' వైద్యశాల వాటి తర్వాత మళ్ళీ ఓ ఇల్లు. ఎడంవైపు పిండిమర పక్కనే పచారీ దినుసుల దుకాణం- "దామోదర్! పావుకిలో శనగ పిండి! రెండణాలు కిస్మిస్... మా సరుకులు ఇయ్యవయ్యా... ఆఁ తీసుకోండి.... అరె లోపల్నుంచి పటిక తీసుకరా". ఈ సందడి దాటుకున్న తర్వాత రాజ వైద్యుడని బిరుదాంకితులైన తలపాగాధారులైన వైద్య మహాశయుడు చికిత్సాలయంలో ఒంటరిగా కూర్చొని కనిపించాడు. తర్వాత మళ్ళీ పళ్లకొట్లు. గడ్డం మీసం గొరుక్కొని, ఆడవాళ్ళు కట్టుకునే ధోవతి ధరించి, ఓ నపుంసకుడు ఆకులకు సున్నం రాస్తూ కూర్చున్నాడు. ఆతర్వాత కాని హల్వా శిరోమణి డాక్టర్‌గారి దుకాణం రాలేదు. దుకాణం పెద్దదే. పీటమీద పోత విగ్రహంలా' పెద్ద వినాయకునిలా వున్నాడు. శరీరఛాయ ఆఫ్రికా నుండి అప్పుడే పట్టుకొచ్చిన ఎలుగుబంటి కన్న నాలుగు వన్నెలు ఎక్కువ. తలా' చెవులూ' ముఖాలను అన్నీ మూస్తూ టోపీ తగిలించుకుని డాక్టరుగారు జిలేబీ తూస్తూ దర్శనం ఇచ్చారు. అతణ్ణిచూసే సరికి సజ్జన్ మనసు సరదా పడింది.

''గురూ, పీడి దగ్గర ఏదో ఒకటి కొందాం. ఎలా వున్నాడో చూడు అచ్చంగా జపాను ఫిరంగిలోంచి దూసుకొచ్చిన గుండులా'' అన్నాడు సజ్జన్.

మిఠాయిలు వున్నచోట్లల్లో ఇత్తడి జాలీని అడ్డంపెట్టాడు. దానికింద పళ్లాల్లో ఒక్కొక్క తినుబండారం వుంది. కొట్టునిండా బొమ్మలు వేలాడదీశాడు.

ఆంజనేయస్వామి, గాంధిజీ, నెహూ్రు, నేతాజీ, శివాజీ, రాణాప్రతాప్ ఇంకా ఇంకా. శివాజీ పటానికి పూలదండ వేసివుంది. బయటి ఇత్తడిగొలుసుల్తో కట్టి ఇద్ద రెండు గంటలున్నాయి. కొట్టుదగ్గర అంతగా జనంలేరు.

''జిలేబీలు తీసుకో'' అన్నాడు కర్నల్.

టోపీలోంచి బ్రెమక్కు, చింతపండు గింజల్లా కళ్లు కనపడుతున్నాయి. వాటిపై వెండిఫ్రేం కళ్లద్దాలు, తెలువు నలుపూ-చీకటి నీడలాంటి మీనం, నోట్లోంచి చొంగలా కారుతోన్న తమలపాకుల రసం. ఇదీ అయన ఆకారం. మొత్తం ఐదారుగురు కన్నా ఎక్కువమందిలేరు కొనేవాళ్లు. కాని సందడి అంతకన్న ఎక్కువగా కనపడ్తోంది. డాక్టరుగారి చేతులు నెమ్మదిగా కదులుతున్నాయి. ఇక నోట్లోంచి మాటలుతపాలామోసుకొని వెళ్లే వ్యానులావుంది. జిలేబీ, ఉర్లగడ్డచిప్స్ చిక్కుడు గింజలూ ఆర్డరిచ్చాడు సజ్జన్.

కొట్టుకు ఎదురుగా అందే సందు అవతలి వరుసలతో ఓ అరుగుమీద కూర్చుని ఎండతాపటం పెట్టుకొంటున్నాడు ఓ ముసలాడు. అతని మాటల్లో మోటుతనం తొంగిచూస్తోంది. అతనెవరితోనో ముసలితనం ప్రత్యేకత గురించి ఉపన్యాసం దంచుతున్నాడు-''అదే, వయసులో వున్నప్పుడు అందరూ తేలిగ్గానే కాలం వెళ్లపుచ్చుతారు. కాని ముసలితనాన్ని వెళ్లబుచ్చినోడే అసలైనమగోడు. తప్పదియ్య. పళ్లూడిపోయి, కళ్లమసగ్గా వుంటూ, చేతులూ, కాళ్లూ, చెప్పరాని నొప్పి పెడ్తోంటే, నాయాల్ది నన్ను పుట్టించినోడూ వాణ్ణి పుట్టించినోడూ తాత ముత్తాతలు అంతా జ్ఞాపకం వస్తారు. మంచినీళ్లు కూడా పోసేవాళ్లుండరు. మునలోడిగా బతకాలంటే ఊరులకేచెల్లు. అందరివల్ల కాదెహే! నన్ను చూడు. తొంభైమూడు సంవత్సరాలొచ్చెయ్. చిత్రగుప్తుడి చిఠాలో మన పేజీయే చిరిగిపోయిందట.

నిలబడి ఇవన్నీ వింటున్నాడు సజ్జన్. ఆమాటల ప్రభావం సజ్జన్‌మీద పడింది-ఏదో ఓరోజు అతను కూడా ముసలాడై పోతాడు-బహుశా ఇలాగేకావచ్చు నిజం చెబ్తున్నాడు ఈ ముసలాయన. నిజంగా ముసలి బతుకుల్ని ఈదడం అందరికీ చేతకాదు.

"అరే బాబూ, ఆరోజు యీాయన పైకం యియ్యలేదు గ(ద్రా [1]రబడీ తీసుకున్నారు."

"ఎవరు తీసుకున్నారు?....ఈయనా." సజ్జన్‌వైపు వేలు చూపిస్తూ అడిగాడు కర్నల్. సజ్జన్ నిర్ఘాంతపోయి డాక్టరును చూస్తున్నాడు.

"నేనా, నేనెప్పుడూ నీ దుకాణానికి రాలేదే?"

"బాగుందయ్యా. ఆరోజు రబడీ తీసుకెళ్లింది నువ్వేగా- మొన్నేకదయ్యా పట్టుకెళ్లావ్. డాకటర్‌కు ఆమాత్రం గురుతువుండదనుకున్నావా?"

అనవసరంగా కొట్టువాడు తనతో ఘర్షణపడుతూంటే సజ్జన్‌కు కోపం వచ్చింది. సజ్జన్ పక్కనే కళ్లకు కాటుక దిద్దుకొని నోట్లో కిళ్లీ నమూలుతూ తలకు నూలుటోపీ పెట్టుకొన్న ఓ పెద్దమనిషి సజ్జన్ ఇరకాటాన్ని గ్రహించాడు. వెంటనే డాక్టర్ని బెదిరిస్తూ" నీకేమైనా మతిపోయిందా? నల్లమందు మత్తులో ఏ మనిషి ఎవరో గుర్తించే పరిస్థితిలో కూడా లేనట్లుందే? అన్నాడు.

ఆ పెద్దమనిషివైపు చూస్తూ సజ్జన్ సంజాయిషీ చెప్పుకున్నట్టుగా "ఈ దుకాణానికి నేను యిదే మొదటిసారి రావడం" అన్నాడు.

"మొదటిసారి ఏమిటి? రోజూ మాకొట్లోంచి అరువు తీస్కుపోతోందే?.

కర్నల్‌కు నవ్వొచ్చింది- "మీరు ఎవరో అనుకుని పొరపడినట్లున్నారు డాక్టర్. ఈయన రబడీ గిబడీ తినడు. ఈయనకు కావలసింది పుడింగ్ తెలుసా?.

వేడివేడి జిలేబీల పళ్లాన్ని లాలాదగ్గర వుంచుతూ "వూరికనే ఎందుకు వదరుతావయ్యా. ఆయన వేరేవ్యక్తి అయితేను" అన్నాడు నౌకరు.

చేయి విదిలిస్తూ డాక్టరు నౌకరు మీద మండిపడ్డాడు- "నాకే తెలివి నేర్పుతున్నావంటరా. ఈయన టీమూహెరెన్ కొడుక్కాదంటరా? ఏం?"

"అరే డాక్టర్ ఇటుకరాయంత మందం జోడు పెట్టుకో. ఈ అద్దాల్లోంచి నీలాటి నల్లమందు భాయీలకు కనపడవు." నవ్వుతూ సజ్జన్‌ను ఇంతకు ముందు సమర్థించిన పెద్దమనిషి అన్నాడు.

(1) మిఠాయి

తర్వాత అతడి పూర్వ వృత్తాంతాన్ని సవిస్తారంగా కర్నల్‌కు చెప్పాడు-

"అతనికిదో చెడ్డ అలవాటు లెండి ఎన్నో ఏళ్లనుంచి. రాత్రిపూట నల్ల మందు నిషాలో ఒకరికి తక్కువ తూస్తాడు. ఇంకోకరికి ఎక్కువ తూస్తాడు. రాత్రిళ్లు ఎవరో అరువు తీసుకెళ్లితే పొద్దున్న నాటాకీయేదంటూ ఎవరినో నింది స్తాడు. అందుకనే ఈగలు ముసురుతున్నాయ్ రోజూ. అరె డాక్టర్, భలేవాడి వయ్యా నువ్వు. నీకు నువ్వేసాటి."

దుకాణం నుంచి బయల్దేరారు ఇద్దరూ. దారిలో కర్నల్‌తో "జీవితంలో ఇన్ని సంవత్సరాలు ఇలాటి సమాజానికి దూరంగా గడిపానని పశ్చాత్తాపం కల్గుతుంటుంది. అసలు కేరక్టర్సు వున్నవి ఇలాంటి సందుల్లో గొందుల్లోనే. జీవి తం ఎంత వైవిధ్యంగా వుంటుందో ఇక్కడ చూడాలి" అన్నాడు.

అతని మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ ఎగతాళిగా కర్నల్ "నీ కళా హృదాయాన్ని మరీ ఎక్కువగా చూపించకు నాయనా. ప్రపంచంలో వున్న మురికి,కుళ్లూ, మూర్ఖత్వం అంతా ఇక్కడే వుంటుంది. నువ్వు కేరెక్టర్స్‌ని వెతుకు తున్నావా, నాటాబే"? అన్నాడు.

కర్నల్ మాటలకు సజ్జన్ మనస్సు చివుక్కుమంది. కాని కర్నల్ చెప్పింది అక్షరాలా సత్యం. అతణ్ణి ఖండించడానికి సజ్జన్ దగ్గర ఏ ఆయుధం లేదు.

ముందుకు నడుస్తున్నారు. "మహిపాల్ ఎక్కడున్నదీ తెలీడంలేదు. నిన్నట్నుంచి. నిన్నట్నుంచేం ఖర్మం. మొన్న మధ్యాహ్నం కలిసాడు. అంతే ఆతర్వాత ఇంతవరకు అడ్రసులేదు." అని అంటూ కర్నల్ ప్రసంగం మార్చాడు.

"మొన్నరాత్రి మా ఇంటికొచ్చాడు. వెంట ఆ పెన్నాని కూడా తీసు కొచ్చాడు మహాశయుడు".

"ఆఁ ఆఁ నాకు తెలుసు. కిస్మస్ సెలిబ్రేట్ చేస్తూ వుండొచ్చు శ్రీమాన్ శుక్లాగారు. అందుకే వుదయాన అంత ఆలస్యంగా లేస్తాడు."

"పడుకోనీయ్ గురూ" అన్నాడు సజ్జన్. "తపిస్తోన్న ఓ మానవ హృదయం కనీసం నిద్రలోనైనా బాధలు మరచిపోగలిగితే దానివల్ల ప్రపంచానికి ఏం కొంపమునుగుతుంది గనక."

తను వుంటుండే యింటి నందులోకి అడుగుపెట్టాడు సజ్జన్. అరుగు మీద సభ తీర్చివుంది. ఇవ్వాళ మంగళవారం కావడం చేత బసంతూతోటమాలి కూడా ప్రసాదాన్ని పరుచుకొని కూర్చున్నాడు. అక్కడే పండిట్ మహిపాల్ శుక్లాగారుకూడా బాచిపట్లు వేసుకొని గప్పాలు కొడుతున్నాడు. ఇద్దరూ రావడం దూరంనించే చూసాడు లాలాజి "రండి రండి! మీరొక్కరే తక్కువ" అని పిలిచాడు- కర్నల్‌నూ సజ్జన్‌నూ.

సజ్జన్ అందరికీ నమస్కారం చేశాడు. కర్నల్ చిరునవ్వు నవ్వుతూ గులాబ్‌చంద్ కూర్చున్న కుర్చీ వెనకువచ్చి నిలబడ్డాడు. గులాబ్‌చంద్ తల మీద చిన్నగా తట్టి "ఏమండి సూపర్నెంటుగారు, బావున్నారా?" అంటూ పరామర్శించాడు. "గులాబ్‌గాడు నాకు చుట్టమోయ్ ఎలాగో చెప్పకూడదు కాని" అని అన్నాడు.

గులాబ్‌చందు నోరుమెదపకముందే లాలాముకుందీమల్ తాగుతోన్న హుక్కాను పక్కగానెట్టి "భాయీ, నగీన్‌చంద్" అని కర్నల్‌ను సంబోధించాడు.

"ఏం లాలాజీ?"అని సమాధానం ఇచ్చాడు కర్నల్.

లాలా మాట్లాడుతూండగా మధ్యలో రాధేశ్యామ్ నౌకరు చేత మరిరెండు కుర్చీలు తెప్పించమని ఛేదాలాల్ కోరాడు. ఛేదాలాల్ ఇంట్లోకి కేకవేసాడు.

'విజయ్ లక్ష్మీపండిట్‌ను ఆహ్వానించడానికి స్టేషన్‌కు వెళ్లలేదా? నువ్వు కాంగ్రెసుకు పెద్దశిష్యుడివిగా!' కర్నల్‌ను అడిగాడు లాలాజీ.

"అవును లాలాజీ. ముందు అలాగే అనుకున్నాను. తీరా బాగా ఆలోచించిన తర్వాత మళ్లీ మనస్సు మార్చుకొన్నాను. జనసంఘం తరఫున అంత పేరు ప్రఖ్యాతులు గల ఏ మహిళా లేదు. మరి మాబోటివాళ్లు ఆహ్వానించడానికి వెళ్తే మీబోటి పెద్దలకు బాగుండదు." అంటూ కర్నల్ లాలాజీపై వ్యంగ్యంవిసిరినాడు.

సజ్జన్ వీరాంజనేయస్వామి మండపానికి ఆనుకుని మహీపాల్‌కు దగ్గరగా కూర్చున్నాడు. మెకవంచి సజ్జన్ చెవికొరుకుతూ మహీపాల్ మెల్లిగా అడిగాడు చేతిలో ఆపొట్లం ఏమిటని.

"జిలేబీలులే. నిన్న సాయంత్రం నీ మకాం షీలా ఇంట్లో వేసావా ఏమిటి" మెల్లిగా అడిగాడు సజ్జన్.

అవునన్నట్లుగా మహీపాల్ తల ఆడించి నవ్వాడు. సజ్జన్ కూడా నవ్వాడు ఏళ్లిద్దరు మౌనంగా నవ్వుకుంటూంటే లాలాముకుందీమల్ కర్నల్ విసిరిన జోకుకు సమాధానం ఇచ్చాడు- "మాకు బాగా ఎందుకనిపించదు భాయీ, మా జనసంఘంలో లేకపోతే ఏం, కనీసం మావార్డులో అటువంటి పేరు ప్రతిష్ఠగల మహిళ కమ్యూనిస్టుల్లోంచి వస్తోంటే, ఇల్లంతా గందరగోళం చేసిపారేస్తేను."

సజ్జన్ చెవులు నిక్కపొడుచుకున్నాయి. ఛేదాలాల్ వైపు తిరిగి లాలా ముకుందీమల్-"అరే ఛేదా, ఆ రహస్యాల కుండ బద్దలుకొట్టిన ఆ కరపత్రం ఏదీ"?

"ఏదైన కమ్యూనిస్టు పార్టీ కరపత్రం వచ్చిందా ఏం" అని వుత్సాహంగా అడిగాడు కర్నల్.

ఛేదాలాల్ జేబులోంచి కాగితంతీసాడు. ఇదంతా "సాంబ్రాంగాడి దుర్మార్గం లెండి. ఎలక్షన్లనీ దోషిని విడుదల చేయించి ఏపాపం ఎరుగని...." అని రాధేశ్యాం చెప్పబోతూంటే ఛేదాలాల్ అడ్డం తగుల్తూ "మీరు ఎలా చెప్పగలరు? చచ్చిపోతూ ఆమె మరణవాఙ్మూలం ఇస్తేను" అని అంటూ కరపత్రం మడతలు విప్పారు చదవడానికి.

'వాఙ్మూలం దాని తొంద-'

ఇంతలో ఛేదాలాల్ నౌకరు రెండు మడత కుర్చీలు ఇంట్లోంచి తెచ్చాడు. రాధేశ్యామ్‌ని ఖండిస్తూ లాలా ముకుందీమల్-"అరే వుండవయ్యా, అతణ్ణి చెప్ప నియ్. గులాబ్‌చంద్, నువ్వు చదువు. నువ్వు బాగా చదువుతావ్" అన్నాడు.

"పంతులు గారికియ్, వారు పెద్ద రచయితలూ, చదువు కొన్న వారు. నా వల్లకాదులే." అన్నాడు గులాబ్‌చంద్.

"అవునవును, మహిపాల్, నువ్వేచదివి వినిపించు" కుర్చీలో కూర్చుంటూ కర్నల్ ఉత్సుకతను చూపిస్తూ అడిగాడు.

"అరే, భాగోతియా, ఆకులు తీసుకరారా తొందరగా.... ఆఁ. పంతులు గారూ, చదవండి" అంటూ లాలాముకుందీమల్ ఇంట్లోకి అరచి, మళ్లీ మహిపాల్‌ను చూస్తూ అన్నాడు.

మహిపాల్ చదవడం ఆరంభించాడు- "ఇది విన్నారా? రష్యా ఏజంట్లు చేస్తూన్న చీకటి పనులు. ప్రజల్లారా, కమ్యూనిస్టుల మీద ఓ కన్ను వేసివుండండి. కిందటి ఆదివారం డిశంబరు 28వ తేదీన కంపెనీబాగ్ దగ్గర బాద్‌షాహీ కాల్వలో అప్పుడే పుట్టిన ఓ పసికందు కుక్కలూ నక్కలూ పీకివేసి వుండగా కనపడింది. ఈ వార్త మనవార్డు ప్రజలందరికీ బాగా తెలిసిన విషయమే. మన జాతీయ ప్రభుత్వం, వారి కర్తవ్యపరాయణులైన పోలీసు డిపార్టుమెంటువారు ఈ క్రూర అమానుషమైన హత్యను కూపీతీసారన్న విషయం కూడా ఎవరికీ తెలియనిది కాదు. మనవార్డునివాసి, సుయోగ్యులు అందరికీ సుపరిచితులైన మాస్టర్ జగదంబా సహాయ్ వయసులో వున్న కోడలు - అంటే చచ్చిపోయిన అన్న కుమారుని భార్య- జసోదా నామధేయం కలది, తన కళంకగాథను దాచుకొనేందుకు, దురదృష్టవశాత్తు ఆత్మహత్య చేసుకుంది. ఈపాపాన్ని పంచుకుందనీ అందరికీ తెలుసు మన దురదృష్టవశాత్తు ఈకళంకాన్ని మనవార్డు ప్రముఖులైన జగదంబా సహాయ్ గారికి అంట గట్టడం జరిగింది. ఈవ్యవహారంలో ఏ ప్రమేయంలేని మాస్టర్ జగదంబా సహాయ్ గారిని అనవసరంగా అపకీర్తిపాలు చేయడానికి ప్రయత్నం జరుగుతోందని ప్రజలకు చెప్పడం మా కర్తవ్యంగా భావిస్తున్నాము.

"భగవత్ స్వరూపులైన మాస్టర్ జగదంబా సహాయ్ యావజ్జీవనం ఈ అపవాదును మోయవలసివచ్చేది. కాని మంచివాళ్లను భగవంతుడు కూడా ఎప్పుడూ చల్లగానే చూస్తాడు. మన పట్టణానికంతటికీ ముఖ్యనాయకుడు, మన

వార్డు నాయకరత్నం లోకసేవాదీక్ష, కంకణధారి, సాలిగ్రాం జయస్వాల్ గారి సమయస్ఫూర్తి మన జాతీయ ప్రభుత్వం వారి సుశిక్షిత పోలీసుల చాకచక్య కారణంగా మన అమాయకపు ప్రజానీకం ఏపాపం ఎరుగని ఓ ఆత్మకు కళంకం ఆపాదించకుండా వుండకలిగిందంటే అదంతా ఆసాలిగ్రాంగారి అనవరతకృషియే. వారికి మా మనఃపూర్వకమైన ధన్యవాదాలు అర్పిస్తున్నాం. అసలు దోషి ఎవరో పట్టుపడ్డారు. ఆ లయవంచకి ఎవరో తెలుసా? ఈవిధంగా రెండు అపరాధాలు చేసి ధర్మపరాయణులైన ప్రజలను తప్పుదారిపట్టించడానికి ప్రయత్నించిన ఆ నీచురాలు ఎవరు? దీనికి సూటిగా సమాధానం చెప్పకుండా చచ్చిపోయేముందు స్వర్గస్తురాలైన జసోదాగా పోలీసు సమక్షంలో ఇచ్చిన మరణవాఙ్మూలం ఈ సందర్భంలో వుటంకిస్తున్నాం. పాపజ్వాలలో దగ్ధమైన ఆమె తన చివరి ఘడియల్లో పోలీసులకు ఏమనిచెప్పింది?

"భల్లేబాబూ నా అడబిడ్డకు స్నేహితులు. ఇద్దరూ ఒకే పార్టీలో, అంటే దేశద్రోహంముఠావుండే కమ్యూనిస్టుపార్టీ అన్నమాట, పనిచేస్తుండేవారు. భల్లేబాబు ఇక్కడకు తరుచుగా వస్తుండేవారు. ఓరోజు అతను, నా ఆడబిడ్డ వనకన్య ఇద్దరూ నన్నేలాగో వశం చేసు కున్నారు. అప్పట్నుంచి భల్లేబాబు నన్ను అదిరించీ బెదిరించీ నన్ను స్వాధీనంలో వుంచుకొంటూ వచ్చారు. ఇంతలో వారికి నేను గర్భవతిని అయ్యానని తెలిసింది. కాని కుటుంబ గౌరవం ఎక్కడ మంటకలిసి పోతుందోనని భయపడ్డారు. చిన్న సాయంత్రం నా పాపం పెరిగి పసికందు రూపంలో [illegible]గానే [illegible] దేవతా సమానులైన మామగారు భల్లేబాబును పిలవనంపారు. అతని చేతికో ఆపసికందును వుంచుతూ, నీసంతానాన్ని నువ్వే తీసుకెళ్ళమని చెప్పారు. నా కొడుకును భల్లేబాబే చంపి పారేశాడు. నేను సంఘంలో [illegible] [illegible]కుని మరణిస్తున్నాను".

ఆమె [illegible] ఒక దీనురాలైన అబల చాలివేస్తోన్న ఆర్తనాదాన్ని పవిత్ర మనస్సుతో ఆలోచిస్తే న్యాయనిరతికి కట్టుబడే ప్రజా హృదయంలో అగ్ని పర్వతం బద్దలు కావా? వివేకి నాగరికతా ముసుగులో పెరుగుతూ భగవంతుడు మతం, ధర్మం, పాపం, పుణ్యం అందే విచక్షణలేని కమ్యూనిస్టులు స్వార్థ

9

సాధన కోసం ఎటువంటి నీచానికైనా దిగజారు తారన్న సంగతి నిస్సందేహం. ఈ కరపత్రాన్ని ఎలక్షను కోసం ప్రచురించలేదు. ఈ విషయం ప్రజలు గుర్తించాలి. మన వార్డులోని వారందరికీ ఏక నాయకత్వం వహిస్తోన్న పరమపూజ్యులైన సాలిగ్రాంగారి మనస్సులో రేగుతోన్న తుఫాను, వారి ఆక్రందన మీకందరికీ వినిపించడానికే ఈ కరపత్రాన్ని ప్రచురించటం జరిగింది. వార్డులో ఇటువంటి వ్యభిచార వివాహిక సంఘటన జరిగినాటి నుంచి రాత్రింబవళ్లు దుఃఖిస్తున్నారు. 1942వ సంవత్సరపు దేశ ద్రోహం పిదప కూడా ఈ వార్డుపై పద నివ్వను అని వారు ప్రతిజ్ఞ చేశారు. మన ప్రియతమ నాయకుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవడంలో వార్డు ప్రజలు అండదండలుంటాయని ఆశిస్తున్నాను",

కరపత్రం చదివి మడిచాడు మహిపాల్. సజ్జన్‌కు అయితే అంత పెద్ద కరపత్రంలో ఒకే ఒక్క విషయం నచ్చింది. జగదంబా సహాయ్ కుమార్తె వనకన్య. ఆరోజు వనకన్య తనతో అన్న మాటలు గుర్తు కొచ్చాయి "హత్య నా తండ్రి చేశాడు. నాకు తెలుసు నా వదిన చేసిన అపరాధం ఒక్కటే- ఆమె ఆడది. ఆర్థికంగా స్వతంత్రురాలు కాదు." సజ్జన్ కళ్లముందు వృత్తేజంతో నిల బడివున్న అందమైన వనకన్య ముఖం కనపడింది. ఈ కరపత్రంలో వనకన్యపై ఎన్నో అసత్యకరమైన ఆరోపణలు చేయబడ్డాయి. ఈ కరపత్రం అబద్ధాలపుట్ట.

"ఈ కరపత్రం అంతా అబద్ధం" ఎవరూ మాట్లాడక ముందే సజ్జన్ గబుక్కున అనేసాడు. మహిపాల్ నుంచి కరపత్రాన్ని తీసుకుని జేబులో పెట్టుకుంటూ సజ్జన్ బాధపడు తున్నట్టుగా ఛేదాలాల్ గ్రహించాడు. లాలాముకుందీ మల్ హుక్కా ఆరిపోయింది. "ఇందులో అనుమానించటానికి శతాంశంకూడా ఆస్కారం లేదు".

జగదంబా సహాయ్ దగ్గరకు నేనే స్వయంగా వెళ్ళాను, సబ్‌ఇన్‌స్పెక్టరు శుక్లాగారు అతనికి జరిగిందంతా చెప్పారు. మరో విశేషం ఏమిటంటే యశోదా గారికి రాత్రిపదకొండు పన్నెండు గంటల వరకు తెలివి రాలేదు. ఆమెకు వస్తుందన్న ఆశకూడా లేదు. డైయింగ్ డిక్లరేషన్ తీసుకోగలమా లేదా అని చింతించారు"

"ఇందులో కొంత అబద్ధం వుండొచ్చు" అని అంటూ లాలాముకుందీ లాల్ "ఎలక్షను రోజులు ప్రచారం చేసేప్పుడు అబద్ధాన్ని కూడా చేస్తారు. కాని ఈ వ్యవహారం కమ్యూనిస్టుది కాదంటానికి ఏం ఆధారం?" అని ముగించాడు.

ఈ మాటకు రాధేశ్యాంకు కోపం వచ్చింది "ఏమండీ, మీరు కమ్యూనిస్టోళ్లను ఎందుకు ఆడిపోసుకుంటున్నారు! జగదంబా సహాయ్ గారి గురించి అందరికి తెలుసు- వరసు కిరాతకుడు. కేవలా పచ్చూపులని వ్రాశారు. సాలిగ్రాం గారి గొప్పతనం గురించి ఆహా ఓహో అని రాసారు. మీరనేది ఏమిటండే...."

"దీనిలో వుండే పాలసీ మీరు అర్థం కాలేరు" తొణుకూ బెణుకూ లేని కంఠంతో అన్నాడు కన్నల్. "హకీవాళ్లవి రిక్షా యూనియన్ తాలూకు సుమారు రెండు వేల వోట్లు ఖచ్చితంగా ఇప్పుడు వున్నాయి. సాలిగ్రాంలాంటి ధూర్తుడు ఈ అవకాశాన్ని వదులుకుంటాడా? ఏలాగైనా కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని చెడ గొట్టి వాళ్ల వోట్లు చీల్చాలని పథకం వేసాడు".

"మీ పాయింట్ కరెక్టు కాదు. కాని వోట్లు తప్పకుండా కమ్యూనిస్టులకూ పడవు, కాంగ్రెసు వాళ్లకు పడితే పడవచ్చు ఏమో" అంటూ ఫనాలాల్ చిటికెతో సిగరెట్టు నుసిని విదలిస్తూ గట్టిగా ఒక దమ్ము పీల్చాడు.

రాబోయే దాన్ని ముందే గ్రహించినట్లుగా ముకుందీలాల్ తల ఆడిస్తూ "సత్యం చెప్పావ్ ఫనాలాల్. ఆ వోట్లు తప్పకుండా జనసంఘ్‌కు పడతాయి" అని అన్నాడు.

మీరేం లెక్కలు కట్టారు కానీ, హకీవాళ్లలో మహమ్మదీయులున్నారు. రిక్షా వాళ్లలో మహమ్మదీయులున్నారు. ఈసంగతి ఎలా మరుస్తారు? వాళ్ల వోట్లు జనసంఘ్‌కు ఎలా పడతాయండీ! అయితే కమ్యూనిస్టుకో లేకపోతే కాంగ్రెసుకో పడతాయిగాని మంచి అదను చూసి సాలిగ్రాం ఈ వలపన్నాడు. మీరేమైనా అనండి" అంటూ కన్నల్ తన అభిప్రాయం చెప్పాడు.

"మరి మేమలా చెప్ప..."

గులాబ్‌చంద్ వాక్యాన్ని పూర్తి చేయకముందే మహీపాల్ మధ్యలో అందుకున్నాడు— "మేంకూడ చెపుతాం వుండు గులాబ్‌చంద్. ఈ ఎలక్షన్లు నాలుగు రోజుల ముచ్చట. ఈనాలుగు రోజుల ముచ్చట్లో ఇంత పెద్ద పాపం అడుగున పడిపోవడాన్ని ఎలా సహిస్తాం?''

"పంతులు గారూ, అలా మాట్లాడతా రేమిటండీ!'' లాలాముకుందీమల్ ప్రసంగాన్ని ఎత్తగానే ఆకుఁతో పళ్లెం వచ్చింది. ముందు కూర్చున్న కర్నల్ వైపు పళ్లాన్ని జాపాడు నౌకరు. మళ్లీ మొదలెట్టాడు ముకుందీమల్- "అయ్యా' ఇది ప్రపంచం. నడుస్తోన్న ప్రపంచం. ఇదేమైనా కొత్తదికాదు కదా! ఇటు వంటివి ఎన్నో చూస్తూ వింటూ ముసలాళ్లై పోయాం".

"ఇంకా ఎన్నాళ్ళు వింటూ వుంటారు! సమాజంలో ఇలాంటి పాపం వున్నంత కాలం ఈ ఎలక్షనూ ఈ పార్టీలూ అన్నీ తప్పదండుగ".

"అవును మహాత్మా' దండుగనే మేం కూడా అనేది. బలం వున్నోడిది రాజ్యం. ఎటువంటి వ్యక్తి రాజ్యం ఏలినా, ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా అదే సిద్ధాంతం. ప్రజలూ అలాగే వుంటారు. పాపం వుంటూ వుంటుంది. పుణ్యం వుంటూ వుంటుంది. ఇదంతా శ్రీ కృష్ణపరమాత్ముని లీలలు. ఎలా మారుస్తావ్! ఇంత మంది ఋషులూ మునులూ వచ్చారు. శ్రీరామచంద్రుడూ' శ్రీకృష్ణ పరమాత్ముడూ వచ్చారు. అవతారాలు ఎత్తారు ఐనా ప్రపంచం ఏమైనా మారిందా అంట' ఇప్పుడేం మారుతుంది?".

ఇంతలో ''ఎర్రలంగోటీవానికి జై ఎనభై నాలుగు గంటలవానికి జై. భజ్‌రంగ్, నువ్వేనయ్యా మాకు ఆసరా! అంటూ ఎముకలు కొరుకుతున్న చలిలో ఒంటిపై వుత్తరీయం గానీ, మరేమీ దుస్తులుగానీ, లేకుండా బోడితరికరంపై వేలాడుతోన్న జందెంలో పెద్ద తాళాంగుత్తిని భుజంమీద వేసుకొని, రొమ్ము చూపిస్తూ, మీసాలు మెలేస్తూ, మెడ నిటారుగా నిలబెట్టి అక్కడికో భక్తు డొచ్చి ఆ వాతావరణాన్ని ఒక్కసారిగా పావనంచేసాడు.

భక్తుడి ఆవేశాన్ని తనమాటల్లోకి బట్వాడా చేసుకున్నట్లుగా పళ్లెంలోంచి ఆకులు అందుకుంటూ రాధేశ్యాం అన్నాడు - "మారుతుంది లాలా. కమ్యూనిస్టులు వచ్చిన తర్వాత వాళ్లే మారుస్తారు అంతా. పెట్టుబడిదారీవర్గం ఆటలు బహుకొద్దిరోజుల్లోనే కట్టేస్తాయి".

ఆ మాటలకు గులాబ్‌చంద్ నవ్వుతూ "గురూ, రోజు రోజుకు కామ్రేడ్ స్టాలిన్ అయిపోతున్నావు. నీ పిల్లా జెల్లా, ఉద్యోగం కాస్త జ్ఞప్తివుంచుకో. ఇది కాంగ్రెస్ ప్రభుత్వం గురూ" అన్నాడు నవ్వుతూ.

"ఏ ప్రభుత్వం అయినా సరే గులాబ్‌చంద్ హృదయం మందుతోన్న వ్యక్తి నిట్టూర్పు ఎవ్వరాపినా ఆగదుసుమా"అని రాధేశ్యాం సమర్థించుకున్నాడు.

అంతలో మహీపాల్ కూడా అందుకున్నాడు - "నేను కమ్యూనిస్టును కాదు. కాని రష్యాలో నిరుద్యోగ సమస్యలేదని విన్నప్పుడు, అక్కడి ప్రతి వ్యక్తికీ ఆహారం దొరుకుతుందని అంటున్నప్పుడు మాత్రం మనదేశంలో కూడా కమ్యూనిజమ్ వస్తే ఎంత బాగుండును అనిపిస్తుంది నా మటుకు నాకు. నేను కమ్యూనిస్టును కాకపోయినా ఆ మాటలు వింటోంటే ఇక్కడ కూడ వస్తే బావుండని అనుకొంటున్నా".

ఇంతలో వెనుకవైపున సందులోంచి ఒక స్త్రీ పరుగెత్తుకుంటూ వచ్చింది. ఆమెను చూస్తే ఇరవై ఎనిమిది ముప్పై సంవత్సరాల వయసు వుండొచ్చని పిస్తోంది. కళ్ళు వెర్రిచూపుల్తోనిండివున్నా ఇంకా అందంగానే వున్నాయి. అంద రినీ ఆకర్షించే శక్తిని కోల్పోలేదు. అరుగుమీద తీర్చిన సభను చూడగానే ఆమె హఠాత్తుగా ఆగిపోయింది. "పట్టుకోండి....పట్టుకోండి" అంటూ వెనుక సందు లోంచి, ఎవరో అరుస్తున్నారు. ఆ యువతి లాలాముకుందీమల్ దగ్గరకొచ్చి నిల బడింది. ఆమెను చూడగానే టోపీ దానిపై లావుటద్దాల కళ్ళజోడు, పండి పోయిన మీసాల లాలా ముఖం బిగుసుకుంది. వెంటనే ఆమె లాలాపై తుప్ అని వుమ్మేసింది. అంతే. సగం అరుగు కాళీ అయిపోయింది. ఎక్కడివాళ్ళక్కడే ఒకదే పరుగులంకించుకున్నారు. అరుగుమీద నుంచి దిగి సజ్జన్ ఆమెను సమీ

పించాడు. డెబ్బై తొమ్మిది సంవత్సరాల శ్రీమంతుడు లాలా ముకుందీమల్ పరువు మట్టిలో కలిసిపోయింది. ఖంగారుగా మొహం తుడుచుకుంటూ లేచిపోయాడు. అతను తాగుతోన్న హుక్కానేలకు ఒరిగింది రణరంగంలో వీరుడు స్వర్గం అలంకరించినట్లు.

సజ్జన్ దగ్గిరకు రాగానే ఆమె కళ్ళు అతిణ్ణి నిదానంగా చూడసాగాయ్. సందులోంచి రొప్పుతోన్న ధ్వనులు పరుగెత్తే కాళ్ల చప్పుడు క్రమక్రమంగా దగ్గరకొచ్చాయి. యువతి వెనక్కు తిరిగి చూసింది. సజ్జన్ కూడ వెనక్కు తిరిగి చూసాడు. పొందాగా నిండుగా, రాజసంపుట్టిపకతో ... అయిదు డెబ్బై సంవత్సరాలకు మధ్యవున్న ఓ పెద్దమనిషి "పట్టుకో మైడియర్! పట్టుకోండి! థాంక్యూ థాంక్యూ" అంటూ ఆడుస్తూ వస్తున్నాడు.

"మై డియర్" అంటూ ఆ యువతి సజ్జన్‌తో పెనగులాడడం ప్రారంభించింది. సజ్జన్ ముందే తెలివిగా ఆమె రెండు మణికట్లూ పట్టుకొని" కదిలావంటే చూడు, ఖబర్దార్ అని ఆమెను బెదిరించాడు.

"ఇప్పుడు చేయను. ఇప్పుడు చెయ్యను. ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మి నన్ను విడవండి. నన్ను కొట్టకండి" అంటూ ఆ యువతి సజ్జన్‌ను ప్రాధేయపడుతోంది.

అంతలో ఆ వృద్ధుడు అక్కడకొచ్చాడు. ఆయాసం పొర్లుతూ చెమటలూ రొప్పు, కర్నల్, గులాబ్‌చంద్ ముంగిసం దగ్గినినాయకుల్ని వచ్చాను. చేదీలాల్ అరుగుమీద తన ఇంటిగోడకు ఆనుకొని కూర్చున్నాడు. రాధేశ్యాం కూడా అతనిపక్కనే వున్నాడు. మహీపాల్ కూర్చున్నచోటు నుండి పళ్లేను, ప్రసాదం పళ్లెం పూజాబుట్టమీద రెండు చేతులూ వేసి ఏకంతూపాలి మోకాళ్లపై గాఢరా పడుతూ కూర్చున్నాడు.

ఆ ముసలాయన్ని చూస్తూ ముకుందీమల్ అన్నాడు-"వకీలు గారూ, ఈమె మీ కోడలు కదూ? అదే పిచ్చామె!".

"జంటిల్‌మెన్, యూ ఆర్ మై ఫాదర్, మై బ్రదర్, మై ఎవెరిథింగ్"

సజ్జన్ చేతుల్ని విదిలించుకోలేక ఆ యువతి జాలికురుస్తోన్న కంఠంతో కన్నీళ్ళు నిండుకున్న కళ్ళతో ప్రాధేయపడింది.

"నన్ను నా రాజేష్ దగ్గరకు చేర్చండి. రాజేష్! మై డార్లింగ్! ఫ్లవర్ ఆఫ్ మైహార్ట్! నా మనస్సు మండిపోతోంది. ఇక్కడ. ఇక్కడ. నన్ను వదలండి. ఎక్కడ మండిపోతుందో చూపిస్తాను. శ్మశానం ధగధగమంటోంది!"

"ఆమె మామగారు మంచిగా నచ్చజెప్పుతున్న ధోరణిలో" మంచిదమ్మా ఇంటికిపద. ముందు నిగుడ్డలూ సామాన్లూ సర్దుకోవాలిగా. అప్పుడు వెళ్ళవుగాని రాజేష్ వద్దకు" అన్నాడు పిచ్చికోడలితో.

వెళ్తాను. నేను అక్కడికే వెళ్తాను. మైడియర్ హస్బెండ్ ఈజ్ ఏ కెప్టెన్. వాళ్ళు నాకు చీరెలు కొనిపెడతారు కార్లో తిప్పుతారు. నేను వెళ్ళి అమాంతంగా రాజేష్ను కౌగిలించుకుంటా". అంటూ ఆమె సజ్జన్ను కౌగలించుకో పోయింది. ఆమె చేతుల్ని గట్టిగ విదిలిస్తూ "ఇంటికి పదండి" అన్నాడు.

"వద్దు. నన్నక్కడికి తీసుకెళ్ళకండి. యూ ఆర్ ఎ డెవిల్ మన్. హెల్ప్ మీ. అక్కడ గోపి వున్నాడు. వాడు పెళ్ళాన్ని కౌగిలించుకుంటాడు. దాన్ని కిస్ చేస్తాడు. నన్ను పాయిఖానాలో బంధిస్తాడు. ఈ ముసలాడు ఈ మామ నన్ను అమ్మా అంటూ పిలుస్తాడు ముసల్ది కూడా నా ముద్దుల కూతురు, నా రాణీఅని అంటుంది. వాళ్ళకు కూడా నా మీద జాలిలేదు. రాత్రికి ఈ ముసలోడు ఆ ముసలి లోపలికి దూరి....''

సజ్జన్ ఒకచేతిని లాక్కొని ఆమె చెంపపై ఛళ్ళున కొట్టాడు. యువతి భయపడి మేకపిల్లైపోయింది. తన ప్రదేశానికి తనలో సిగ్గుపడుతూ వకీలు వైపు తిరిగి "నన్ను క్షమించండి. అని అన్నాడు.

''లేదు నాయనా....నో....నో..." అని ఏమీ అనుకోనట్లుగా అన్నాడు వకీల్ గారు.

"ఇంటికి వెళ్ళండి" అని సజ్జన్ మరో పర్యాయం అనగానేమచ్చికైన కుక్క పిల్లలా తోక ఆడించుకుంటూ ఆమె యింటి వైపుకు మరలింది. వకీలు

గారు తలవంచుకుని అలసిపోయిన కాళ్ళను ఈడ్చుకుంటూ ఆమె వెనక నడిచాడు.

"సజ్జన్, నేను నీ వెంటరానా?" అని అడిగాడు కర్నల్.

"అక్కర్లేదు ఇప్పుడే వస్తాను" ముఖం తిప్పకుండానే జవాబిస్తూ సజ్జన్ వాళ్ళవెంట వెళ్ళాడు.

# 12

తిరిగి వచ్చి చూసేసరికి అరుగు ఖాళీగా వుంది. సరేలే అనుకుంటూ సజ్జన్ తన గదికి వెళ్ళాడు తీరా గది దగ్గరకు వెళ్ళే సరికి తలుపు తెరచివుంది. ఆశ్చర్యంగా లోపల అడుగుపెట్టేసరికి ఎదురుగా వనకన్య కనిపించింది. థామస్ క్రేషన్ రాసిన 'ది స్టోరీ ఆఫ్ వెయిటింగ్' తదేకధ్యానంతో చదువుతోంది. ఆమెను అనుకోకుండా తన గదిలో చూడగానే అతని హృదయం ఎగిరిగంతేసింది. మహీపాల్‌గానీ కర్నల్‌గనీ ఎవ్వరూలేరు. జిలేబిలు కారా పొట్లాలు మాత్రం పక్కన పెట్టివున్నాయి.

వనకన్యను చూడగానే సజ్జన్ తన హోదాగూడా మరచి అలవాటుకు విరుద్ధంగా చేతులు జోడించి నమస్కరించాడు. మందహాసంతో వనకన్య కూడా నమస్కరిస్తూ అంది–"ఆ రోజు మీరు మా యింట్లో భోజించారు."

"దానికి బదులు తీర్చారుగా మీరిప్పుడు." అన్నాడు సజ్జన్. అతని కేం చేయాలి తోచడం లేదు. గది మధ్యగా నిల్చున్నాడు.

"మా అప్రమాజకులిద్దరూ ఎక్కడికి పోయారో? మీరు కలిసేవుంటారు" సంభాషణ ప్రారంభిస్తూ అడిగాడు సజ్జన్.

వనకన్యను చూడగానే ఉత్సాహం పరవళ్ళు తొక్కసాగింది. ఆ పారవశ్యంలో అర్థయుక్తమైనవీ వ్యర్థమైనవీ ఆశ్లే దొర్లుకుపోతున్నాయి. స్త్రీ సన్నిధిలో పురుషులు సన్యాసులుగా మారినా ఆశ్చర్యపడనక్కరలేదు.

''అవును వారిలో మహీపాల్‌గార్ని ఎరుగుదును. వారి వెంట మరో మహాశయుడు కూడా దయచేసాడు. నేను వచ్చినపుడు ఇద్దరూ వున్నారులెండి"

"ఎక్కడికెళ్ళారో. మీకేమైనా చెప్పివెళ్లారా?''

చిన్న టేబుల్ వైపు చెయ్యి చూపుతూ "అక్కడేదో చీటీ వ్రాసి వెళ్ళారనుకుంటా" అంది ఆమె.

సజ్జన్ టేబుల్ మీద వున్న చీటీని తీసి చూసాడు. బొంబాయి ఆర్ట్ సొసైటీకి సంబంధించిన పాత ఆహ్వానపత్రిక దాని కవరు మీద సొసైటీ అడ్రసుకు పైభాగంలో మహీపాల్ దస్తూరితో "మెనీ హాపీ రిటర్న్ ఆఫ్ ది డే'' అనివ్రాసి వుంది.

విద్యుచ్ఛక్తిలా నరనరానికి ప్రవహిస్తోన్న ఆనందం అతని పెదవులపై చిరునవ్వుగా కనిపించింది-'ఉద్దండపిండాలే' అని అనుకున్నాడు.

కవరు తెరిచాడు. పాత అహ్వాన పత్రికకు వెనుకగా మహీపాల్ రాసాడు "జిలేబీ మీద ఒట్టు, ఈ బ్రాహ్మణుడు విరహసంతృప్తి హృదయంతో వెళ్ళు న్నాడు. నేడు ఈ జిలేబీని నేను త్యజించిన ఉదంతాన్ని దయచేసి నీ డైరీలో రాయి స్వర్ణాక్షరాల్లో కర్నల్ కూడా జిహ్వాచాపల్యాన్ని చంపుకుని తాను కూడా జైనుడని నిరూపించుకున్నాడు. ఈ ఏకాంతాన్ని ''ఏకాంతతో పెద్దదినం కానుకగా నీకు సమర్పించి వెళ్తున్నాం. నీ గురువులకు థాంక్సు చెప్పాలి మా ఆజ్ఞను శిరసా వహిస్తోండు. ప్రస్తుతం మేం నీ గురించి ఇంతే ప్రార్థించగలం".

దాని క్రింద ఒ.కే పంక్తి కర్నల్ స్వదస్తూరిలో రాసాడు- ''మిత్రమా! కమ్యూనిస్ట్ కాకు".

మనస్సనే పూతోటలో పురివిప్పుతోన్న ఆనందాన్ని పైకి కనపరచకుండా ఏదో ధుమధుమలాడుతున్నట్టు నటిస్తూ జేబులో ఆ కవర్ను మడిచిపెట్టుకుని, వనకన్య కూర్చున్న వైపు తిరిగాడు సజ్జన్. సృష్టికర్త కొంచెం అతిగాఆమె భాగంలో కలిపిన తెల్లని దేహఛాయ, అందమైన వ్యక్తిత్వం వనకన్యకు ముఖ్యమైన అకర్షణలు. ఆమె రూపు అతని కళ్ళలో మెరిసింది. విసుక్కొంటూన్న

కంఠంతో "నా ఇద్దరు స్నేహితులు ఎంతగా అభిమానులో మీకెలా తెలియచెప్పను. వెళుతున్నాం అనైతే రాసారు కాని ఎక్కడికి వెళ్లేదీ, మళ్ళీ ఎప్పుడు కలిసేదీ రాయలేదు చూడండి. నా క్రిస్మస్‌డే అంతా పాడు చేసారు" అంటూ దిండును అనుకుంటూ వనకన్యకు దగ్గరగా కూర్చున్నాడు సజ్జన్.

ఆ రెండో వ్యక్తి తన వెంట మహిపాల్ గారిని కూడా తీసుకెళ్ళారు. మహిపాల్ గారుంటే బావుండేది"

ఆమాటకు ప్రేమికుని హృదయంకంచుగంటలా ఖంగుమని మోగింది.

"మహిపాల్‌తో మీకేమైనా పనివుందా?"

"లేదండి. వారివి చాలా పుస్తకాలు చదివాను. అభిమాన రచయిత

మహిపాల్ ప్రశంస సజ్జన్‌కు నచ్చలేదు. అయినా ఆ మాటకు అతను కూడా తృప్తిపడినట్లు ముఖకవళిక కనిపించింది.

మళ్ళీ నవ్వుతూ వనకన్య తన మనోభిప్రాయాన్ని చెప్పింది – ఎన్నాళ్ళ నుంచో అనుకుంటున్నాను వారిని చూడాలని. అయితే ఈ కళాకారుల్ని రచయితల్ని ఎంతోమంది పరిచయం వున్నవారూ, లేనివారూ తరుచూ కలుస్తూ వుంటారు. అందుకనే వాళ్ల రోజురోజుకూ నెత్తికెక్కుతోన్నారని కలవడానికి ప్రయత్నించలేదు. కాకతాళీయంగా వారిక్కడ కలిసేరు.

"దానికేముంది. మీరెప్పుడు చూడాలనుకుంటే మీ అభిమాన రచయితను చెవులు పట్టుకొని మీ ముందు హాజరుపరుస్తాను చెప్పండి, ఇప్పుడు చూడాలన్నా సరే, నేను సిద్ధం. వాళ్ళిద్దరు ఇంటికే వెళ్ళి వుంటారు".

వనకన్య కొంచెం నిగ్రహించుకుంటూ అంది– "నేనిప్పుడు ఓ పనిమీద మీ దగ్గరకు వచ్చాను".

సజ్జన్ జాలీమూడ్ కొంత శాంతించింది. ఏదో వ్యవహారం చర్చించాలన్నట్లుగా గంభీరంగా ముఖం పెట్టాడు. "ఆ పేంప్లెంట్ గురించా?" అని ప్రశ్నించాడు.

"అవును".

"నేనింతముందే మన వీధిలో వాళ్ళంతా చదువుకుంటూంటే విన్నాను. ఆ కరపత్రం భద్రపర్చాల్సిన రికార్డు. రాబోయే తరాలు అది చదివి మన మీద వుమ్మేస్తారు",

"రాబోయే తరాల సంగతి అలా వుంచండి. నాకిప్పుడే సమస్య అయి కూర్చుంది" అంటూ విచారంగా తలను దించేసుకుంది, వనకన్య. రెండు కాళ్ళ వేళ్ళను కలుపుతూ తీస్తూ కత్తెరలా చేస్తోంది. ఆమె ముఖాన్ని తనివితీరా చూసే అవకాశం కలిగింది అతనికి. నల్లనాగులావున్న ఆమె జడలోంచి రెండు ముంగురులు పిల్లనాగుల్లా చెవుల మీదకు వేలాడుతున్నాయి. చాలా అందంగా వుంది. అతి సుందరంగా వుంది. ఎంతో ఆపదలో వుంది పాపం ఈమె తన కష్టాల్ని నాకు పంచడానికి వచ్చింది. నా మీద ఎంతో ఆశ పెట్టుకుని వచ్చింది.

కొంచెం ఆవేశం తెచ్చుకుంటూ సజ్జన్ అన్నాడు—"మీరేం చెయ్యదలచుకున్నారు? ఈవిషయంలో మనస్ఫూర్తిగా మీకు సహాయం చేస్తాను". అతని చెవుల్లో శాస్త్రిగారు పల్కిన సూక్తి మారుమోగింది-పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం".

వనకన్య తలఎత్తి అతని కళ్ళల్లోకి చూసింది ఏదో గ్రహించినట్లుగా. మళ్ళీ "నాకు అపఖ్యాతి వస్తుందన్న చింతలేదు. స్వర్గస్థురాలైన ఉదినకు న్యాయం లభించాలి" అంది.

"పేంప్లేట్‌లో వేసిన డయ్యింగ్ డిక్లరేషన్—"

ఆ మాటకు వనకన్య నీరసంగా నవ్వి-" సాలిగ్రాం గారు చాలా తెలివిగలవారు. పొంగిపోయిన పాలలోంచి కూడా లాభం చేసుకున్నారు. మా తండ్రిగారికి మంచి అని ఎందుకనిపించదు? హత్యచేసినా హంతకుడు సిలువమీదనుంచి తప్పించుకున్నాడు కదూ. ఇది మన స్వతంత్ర దేశంలోని న్యాయం"

సజ్జన్ ఆలోచనలో పడ్డాడు.

వనకన్య మళ్ళీ చెప్పుకపోయింది- "మరణిస్తోన్న ఒదినగారిని ఇంకోసారి వుపయోగించుకోవడం జరిగింది. ఆమె చెయ్యిపట్టుకుని స్టేట్ మెంట్ మీద సంతకం పెట్టించారు....ఆనాటి అనుభవాన్ని నేను జన్మాంతం మరువలేను. మేజిస్ట్రేటు, పోలీసులు, సబ్ ఇనస్పెక్టర్, డాక్టరు, ఒక నాయక మహాశయుడు- న్యాయానికి ప్రతీకలుగా మన దేశంలోవున్న ఈ పంచములంతా ఆ రోజు విజంగా న్యాయాన్ని నులిమిచంపేశారు. మరణిస్తోన్న ఆత్మ వెళుతున్నప్పుడు కూడా ఎటువంటి కటువైన అనుభవాన్ని తీసుకపోయిందో చూడండి. ముక్తసరిగా చెప్పాలంటే ఆఖరు వూపిరి వున్నంతవరకు ఆమె నుండి లాభం పొందదానికే కుట్రపన్నారు"

"సౌండ్రెల్స్"

"మానవత్వానికి వ్యతిరేకంగా ఇంత పెద్ద కుట్ర కేవలం ఒక్క ఎలక్షన్ కోసం జరిగింది. మన నాగరికతకు యిదొక సరికొత్త పుచ్చుతునక''

ఒక నిమిషం సేపు గదిలో నిశ్శబ్దం. మళ్ళీ వనకన్య మాట్లాడడం మొదలెట్టింది-"పైవైతే అందరికి తెలిసిన సీచులనుకోండి. కాని విశేషమేమిటంటే, పార్టీవాళ్ళ దృక్పథం చూసి నాకు చెప్పరాని బాధ కలిగింది."

సజ్జన్ కళ్ళు ప్రశ్నార్థకంగా చూశాయి. కన్య చెప్పుకపోతుంది. "ఈ కరపత్రం తీసుకుని ఇవ్వాళ వుదయం భలేబాబు ఆతని ఇద్దరు సహచరులు నా దగ్గరకొచ్చారు. వారిదగ్గర మరో కరపత్రానికి డ్రాఫ్టువుంది. ఆ డ్రాఫ్టులో కూడా అదదానికి జరిగిన అన్యాయం కన్న భల్లేబాబుగారి గౌరవాన్ని కాపాడే ప్రయత్నమేవుంది. నన్ను సంతకంచేయమని అన్నారు. నేను చేయనన్నాను. నాకు తెలియక అడుగతాను. ఒక స్త్రీ గౌరవాన్ని కాపాడడం కన్న ఈ పార్టీ ప్రతిష్ఠ అంత ముఖ్యమైనవా? వాళ్ళు ఈ అన్యాయాన్ని ఆమెకే పరిమితం కాకుండా మొత్తం సంఘానికే చేసారు."

ఆ మాటలకు సజ్జన్ ఆత్మను పరిశోధించుకుంటున్నాడు.

'అందరూ తమస్వార్థాన్ని చూసుకునేవాళ్లే సజ్జన్‌గారూ! నాకు వీళ్ళను చూస్తోంటే మానవజాతిమీదే నమ్మకం పోయేలా వుంది!

మౌనం అంగీకార సూచకం అన్నట్లు సజ్జన్ మౌనంగా వున్నాడు. కన్య తన బ్యాగ్‌లోంచి ఒక కాగితాన్ని తీసి బల్లమీద పెడుతూ "నేనో చిన్న వ్యాసం రాశాను. దీన్ని ఏదైనా పేపర్లో ప్రచురించేయేర్పాటు చేయండి. అదే నేను మిమ్మల్ని కోరేది". అంది.

ఫుల్‌స్కేప్‌లో వున్న నాలుగు పేజీల వ్యాసాన్ని అందుకుని చదువు తున్నాడు సజ్జన్. వనకన్య గది నాలుగువైపులా చూస్తూ, మధ్యమధ్య వ్యాసం చదువుతోంటే అతని ముఖంలో కలిగే మార్పుల్ని గమనించడానికి అతనివైపు చూస్తోంది.

వ్యాసం చదివిన తర్వాత ఒక పేడి నిట్టూర్పు విడుస్తూ సజ్జన్ "మీరు చాలా బాగా రాశారు. కాని దీన్ని పేపర్లో ప్రకటించవద్దని నా విజ్ఞప్తి. ఎలక్షన్ సందడిలో దీని ప్రాముఖ్యం పోతుంది ఇప్పుడంతా కరపత్రాల సీజను" అన్నారు.

"కాని నాకు అంతకన్న వేరే వుపాయం తోచడం లేదు."

"మహీపాల్‌తో ఇక్కడకు వచ్చాడే. అతనే కర్నల్. అతనితో ఈ విష యాన్ని చర్చిస్తాను. అమీనాబాద్‌లో విక్టోరియా మెడికల్ స్టోర్ లేదూ... కర్నల్ దానికి ప్రొప్రయిటర్. ఎలక్షన్ ఎత్తుగడలు అతనికి కొట్టినపిండి. ఇప్పుడే మనం ఇద్దరం వెళ్దాం. కర్నలూ, మహీపాలూ, మీరూ, నేనూ దీనికో మార్గాన్ని ఆలోచిద్దాం. ఎలక్షన్ హడావుడికన్న ఎక్కువగా ఈ వ్యాసం ప్రచారం పొందితేనే గాని ప్రజల దృష్టి దీనివైపు మళ్ళదు".

"జీవితాంతం మీ వుపకారాన్ని మరువలేను" అంది వనకన్య కృతజ్ఞతతో. ఆమాట సజ్జన్ మనస్సుకు నచ్చింది. కాని ఈ నచ్చడానికి వెనక అతని అంత రంగంలో దాగివున్న కోరికను తలచుకోగానే సజ్జన్ సిగ్గుపడ్డాడు. "నన్నింత పెద్దగా భావించకండి. ఈపని మీకెంతసొంతమో నాకూ అంతే. నాకేకాదు న్యాయం

అంటే ఇష్టపడే ప్రతివ్యక్తికినీ. ఇందులో ఉపకారం చేసేది ఏముందీ కృతజ్ఞత చూపించటానికి."

వనకన్య కళ్ళు సందేహంతో గౌరవంతో-యీ రెండింటినీ కలగలిపి కిందకు చూడసాగాయి.

పొట్లాంమీద సజ్జన్ దృష్టిపడింది. వాటిని తీసి విప్పుతూ "రండి. కొద్దిగా ఫలహారం చేద్దాం. [illegible] పూర్తిగా చల్లబడిపోయాయ్" అన్నాడు.

అంతలోకి సజ్జన్ అతిథి సత్కారం చేయాలనే వుద్దేశ్యంతో సూచన ప్రాయంగా-"ఫలహారంతో పాటు టీ కూడ సేవిస్తే బావుంటుందని. నా అభిప్రాయం. ఏమంటారు?" అన్నాడు సజ్జన్.

"నేను చేస్తాను లెండి" అంటూ వనకన్య లేచింది. మూలగా వున్న చిన్న టేబుల్‌పై టీ తయారుచేయడానికి కావలసిన సామగ్రి అంతా వుంది.

కర్నూల్ యింటినుంచి రాత్రికి గదికి వెళ్ళిన కారణంగా సజ్జన్ అంతకు ముందు పాలసీసా తీసుకురాలేదు. టీ చేస్తానని వనకన్య లేవగానే పాలు తెద్దామని బజారుకు బయలుదేరాడు.

---

టీ తాగుతూ అంతకుముందే జరిగిన అనుభవాన్ని సజ్జన్ ఆమెకు చెప్పాడు "మీరు వచ్చిన కొద్దిసేపటిక్రితం ఓ చిన్న సోషల్ సర్వీసు చేసిన అనుభవం దక్కింది. ఈ సందులోనే అటువైపు ముందు వకీలుగారున్నారు. చాలా పెద్దవారు. మాటల్లోకూడా చాలా ఇంటరెస్టింగ్‌గా అనిపించారు. అతని చిన్నకోడలు పిచ్చిది. ఇవ్వాళ హఠాత్తుగా ఇంట్లోంచి పారిపోయి సందులో పరుగెత్తటం ప్రారంభించింది. పెద్దగగ్గోలు పెట్టింది. ఆమెను కంట్రోలు చేయడానికి చెంపకాయ ఒకటి వడ్డించాల్సివచ్చింది. నా జీవితంలో మొదటిసారిగా ఓ ఆడామె పై చెయ్యి చేసుకున్నాను...కొట్టానే కాని చాలా సేపటివరకు నా అరచేతిలో ఛెళ్ళుమన్న ఆ ధ్వని వినిపిస్తూవుంది నాకు".

"పిచ్చి రావడానికి కారణం?"

"మీ ఒటిసగారు ఒక అత్యాచారాన్ని సహిస్తే ఆమె మరోరకమైన దాన్ని మోసింది. రెంటికీ పర్యవసానం రెండువిధాలు—అంతే తేడా." కంఠంలో ఆవేదన ఆలోచన కనబరుస్తూ సజ్జన్ అన్నాడు. అతను చెప్పుకపోతోంటే కన్య ఏకాగ్రతతో వింటూవుంది.

కొద్దిసేపు వూపిరి తీసుకుని సజ్జన్ [illegible]. "వకీలు గారికిముగ్గురు కొడుకులు. ముగ్గురూ అదృష్టవంతులే. [illegible]కి మాత్రం ఆ అదృష్టం పట్టలేదు. పెద్దాబ్బాయి డాక్టరీ చదవడా[illegible] వెళ్ళాడు. అక్కడే ప్రాక్టీసు పెట్టుకొని స్థిరపడ్డాడు. [illegible] పిలిపించుకున్నాడు. అసలు సంబంధం లేనట్టేవుంటున్నాడు. అయ[illegible] వుత్తరం రాస్తే రాస్తాడు. రెండో కొడుకు ఐ.ఏ.యస్. [illegible] తల్లిదండ్రులతో ఏం సంబంధం పెట్టుకొంటాడు? ఆర్థిక సహాయం [illegible] అప్పుడప్పుడు చేస్తూ వుంటాడు. ఆఖరాయన మిలిటరీలో పనిచేస్తున్నాడు. [illegible] కుటుంబ యజమాని అన్నమాట— [illegible] పినతండ్రి కూతురితో సంబంధం పెట్టుకొని [illegible] వెలగబెట్టి చివరకు పెళ్ళిచేసుకున్నారు. పాపం ఆమె [illegible] సంవత్సరాల నుండి క్రిందె మీద్ సరుకులా ఇక్కడ [illegible] వకీలుగా[illegible] వెలగ[illegible]. ఆ వింతకాపురం చూసి [illegible] భాగ్యపాపం ఇద్దరూ రాత్రింబవళ్ళూ [illegible] కాపాడుతూవుంటారు. మనస్సులోని కోరికలు ఒక్కొక్కటే [illegible] చివరికి ఈ పరిస్థితి దిగజార్చాయి ఆమెను".

సజ్జన్ ఆ విషయం చెప్పి [illegible] కన్యవైపు చూస్తూ వుండిపోయాడు కొద్దిసేపు. [illegible] కప్పును చేతిలోకి తీసుకుని గడగడ తాగాడు. అప్పటికి [illegible] చల్లారిపోయింది.

"అయితే ఇప్పుడేమౌతుంది? ఎంతవరకు ఈ ఆటసాగుతూవుండాలి? దీనికి అంతం లేదా?" అని అమాయకంగా, కంగారుగా అడిగింది వనకన్య.

"తప్పక వుంటుంది. ఎందుకులేదూ?" అన్నాడు సజ్జన్. అంతలోనే మళ్ళీ.

"ఎలావుంటుందో అదే నా కర్థంకావడంలేదు. ఇవ్వాళ వుదయాన్నుంచి నన్నో మరో ఆలోచన వేధిస్తోంది.....మీ రాజకీయ వృద్ధేళాలు నాకేమీ తెలియవు కాని కమ్యూనిజమ్ అంటే నాకు ఇంటిలెక్చ్యుయల్ సంబంధం వుంది. ఆ సంగతి మీకు గూడా తెలుసు'' అన్నాడు తిరిగి.

"ఉండోచ్చు. కాని స్త్రీసన్వురుమని ఇజాల్లో బంధించి చూసే అలవాటు లేదు నాకు.''

"ఈ రోజుల్లో కమ్యూనిస్టనిపించుకోవడం ఎంతో ప్రమాదకరంగా జనం భావిస్తున్నారు. అందులో కూడా వున్నవారంతా మీలోటి వారూ నాలోటి వారూను. అందుకని ఆ నాల్సివచ్చింది. భల్లేబాబుగారితో సుమారు మూడు సంవత్సరాల నుంచి పరిచయం. ఎక్కువధింకరూ, లెర్నడ్ కాదనుకోండి. అయినా ఏదో చదివినవాడూ ఆలోచించగలవ్యక్తి. అసలు అతను ప్రాక్టికల్ కార్యకర్త. ప్రజలు అతణ్ణి గురించి ఏమనుకున్నా నేను నిజం చెవుతున్నా అతను పదహారణాలు నికారసు మనిషి. నేను అతన్ని గౌరవిస్తాను. కాని ఇవ్వాళ వుదయం అతను మాట్లాడుతోంటే ఈతను ఆ వ్యక్తేనా అన్న సందేహం కలిగింది. ఎవరో కొత్తవ్యక్తిని చూస్తున్నానా అనిపించింది."

బుద్ధిమంతునిలా సజ్జన్ నవ్వాడు– "నేను మీ రాజకీయ వృద్దేళాల్ని తుయ్యబట్టి మీ మనస్సు కష్టపెట్టతలచు కోలేదు. కాని కమ్యూనిస్టులు ఎప్పుడూ వాస్తవతాయుతంగా ప్రవర్తించ రనడంలో సందేహం లేదు".

"మీ లాజిక్ వట్టి భ్రమ" అని ఖండించింది కన్య. సజ్జన్ మనస్సు చివుక్కుమంది. అతను సంబాళించు కున్నాడు. కన్య మళ్ళీ చెప్ప సాగింది. "ఎన్నాళ్ళ నుంచో ఒక యధార్థం నాకు ముల్లులా గుచ్చుకుంటూ వుంది. ఇవ్వాళ జరిగిన సంఘటనతో నా సందేహం తీరింది. రాజకీయ పార్టీల పోట్లాటలు ఫుట్ బాల్ మ్యాచిలా వుంటాయి. అవునా? ప్రజలు బంతివంటి వారు. రాజకీయ పార్టీలు అవి ఏవైనా కిక్కులు ఇస్తున్నాయి. ఎవరికి? ప్రజలకే. ఈ ఎన్నికలు మన ప్రజా స్వామ్యంలో సాంఘిక వ్యవస్థ ఎలా వుంటుందో నిరూపిస్తున్నాయి".

సజ్జన్ చాలా ఆసక్తితో వింటున్నాడు.

"భల్లేబాబు తెచ్చిన స్టేట్‌మెంటులో నా తండ్రి చేసిన పాపం నా వదిన విషాదాంతం ఈరెంటి విషయాల్నీ ఎలక్షను ప్రాపగేండా రూపంలోనే వుప యోగించు కోవడం జరిగింది, ఆ ప్రకటనలో కమ్యూనిస్టు పార్టీ ఎన్నికలు గురించే ఎక్కువగా చెప్పారు. ఆ పార్టీకి వ్యతిరేకంగా అబద్ధపు ప్రచారం ఎందుకు చేస్తున్నారూ దాని బండారాన్నంతా ఎంతో వుద్రేక పూర్వకంగా బయట పెట్టారు. నేను వాళ్ళని ఒక్కటే ప్రశ్నించాను. పార్టీ విషయంలో మీరు చూపించిన ఈ ఆవేశం ఒక స్త్రీపై అఘాయిత్యం జరిగినప్పుడు ఎక్కడకు పోయింది అని అడిగాను. ఈ ఆదర్శాల్నే తీసుకుని పార్టీ నడుస్తుందని చెప్పారు. పార్టీ ఎన్నికల్లో గెలిచిన తర్వాత యీ సమాజాన్ని మార్చి వేస్తుందట. ఆ మాటలు నాకు తృప్తి కలిగించలేక పోయాయి. వీళ్ళంతా సమాజాన్ని జనరల్‌గా చూస్తున్నారని పించింది. వ్యక్తి దోపిడీని, అత్యాచారాన్ని సామాజిక ప్రతిబింబంగా చిత్రించుకుని రూపొందించు కొన్న ఈ రాజకీయ సిద్ధాంతాలు చూస్తోంటే ఆ వ్యక్తి అనుభవించిన నరకయాతన జీవితాంతం తపన మనసులోంచే మాయ మౌతోంది. మన దృష్టి అంతా పొలిటికల్‌గా మారి పోయింది. కేవలం రాజకీయాల వరకు పరిమితమై పోయింది. గానుగు ఎద్దులా అలవాటు ప్రకారం చుట్టుముడుతూ వున్నాయి పనేముంది గనుక'' అంది వనకన్య.

"మీరు నా మనస్సులోని మాట చెప్పారు. నాకు రాజకీయాలంటే అసహ్యం". అంటూ సజ్జన్ కెటిల్ తీసుకున్నాడు. దాన్ని చూస్తూ "మాటల్లోపడి టీ టొత్తిగా చల్లారి పోయింది మళ్ళీ చేయ మంటారా?'' అని అడిగాడు.

"మీకు కావాలంటే చేస్తాను. నేనైతే ఇప్పుడు...."

"ఆఁ చేయండి. ఇంకోసారి తాగాలని పిస్తోంది. చూడండీ. సిగరెట్లు, టీ ఇవన్నీ తీరికగా వున్నప్పుడు మరీ మరీతాగాలని సరదాగా వుంటుంది. కాని ఏమైనా ఆలోచనలుముందుకొచ్చినప్పుడు ఈవస్తువులన్నీ నిరర్థకంగాకనిపిస్తాయి." అంటూ జేబులోంచి సిగరెట్ కేసు తియ్యడానికి సజ్జన్ చెయ్యిపోనిచ్చాడు.

"జిలేబీ తిన్నారు. చేతులు అంటు కోవడం లేదు? దయచేసి చేతులు కడు క్కోండి'' అని సజ్జన్ జేబులో చేతులు పెట్టుతుంటే అంది వనకన్య.

సిగ్గుతో సజ్జన్ చిరునవ్వు నవ్వుతూ ఎడమ చేత్తో సిగరెట్ కేసును బయ టకి తీసాడు. "ఇక యీ ప్రసంగానికి ఫుల్‌స్టాప్ పెట్టాం. ఇఫ్ యూ డోన్ట్ మైండ్.... మరో పర్యాయం టీ పెట్ట గలరా? అరే... ఇదేమి? మీరింకా పిటిని ముట్టుకో లేదే! పోనీలెండి తర్వాత నిదానంగా పెట్టుకోవచ్చు".

"వద్దులెండి. ఇంక చాలు.''

"అహా. అది కుదరదు. అన్యాయాన్ని ఎదిరించాలంటే మనకు మనమే అన్యాయం చేసుకో కూడదు. మగవాళ్ళతో సమానాధికారాలు కావాలని కోరుకునే వాళ్ళు ఫలహారం కూడా సమంగా చేయాల్సి వుంటుంది!''

ఆ ఛలోక్తి కన్య నవ్వింది. "సమయం వచ్చినప్పుడు న్యాయం అడు గుతాం న్యాయం ...యందని నేను అడిగి నప్పుడు మీరు పూర్తిగా కాదంటారు లెండి" అని ఆమె అంటోంటే ఆమె గొంతులో స్త్రీ జాతి ఆత్మాభిమానం ధ్వనిం చింది. ఆమె కనుపాపలు గులాబీ సిగ్గు దారంలో గుచ్చిన మొగ్గలు విచ్చు తునట్లు చెవుల వరకు వ్యాపించాయి.

సజ్జన్ హృదయం మరోసారి సంతోష తరంగాల మీద తేలింది. కన్య మనోభావాలు ఆమె టీలోని సరళ రేఖల్లా బింబువుల్లా ఆమె ముఖం మీదా కళ్ళల్లోనూ ప్రతిబింబించడం అతను గమనిస్తునే వున్నాడు. ఏమాత్రం అసహ జత్వమూ ఆమె ముఖంలో లేదు. స్పష్టంగా హృదయం అద్దంలోంచి కనిపిస్తున్న ట్టుగా కొట్టొచ్చినట్లు వుంది.

"మీరు నన్ను తరచి చూడ కుండానే ఏకపక్షంగా డిక్రీని..." అంటూ నవ్వుతూ సజ్జన్ అన్నాడు.

క్షణికావేశంలో తన్ను తాను మరచి తీసుకొన్న చొరవను గ్రహించి నిగ్రహించు కుంటూ కన్య "నా వుద్దేశ్యం అందరు మగాళ్ళ గురించి. మీ గురించి ప్రత్యేకంగా చెప్పలేదు'' అని అంది.

"మారండి కన్యగారూ, మీరు స్త్రీజాతిని అలా సమర్థిస్తోంటే మీకూ, నాకు ఘర్షణ అరక్కమానదు. ఆడవాళ్లేమంత తక్కువ తిన్నారండీ? మగాళ్ళను చెప్పులతో పూజచేసే ఆడవాళ్ళను కూడా నేను చూశాను".

కన్య కిలకిలా నవ్వింది.

"కొద్ది రోజుల క్రితం 'ఉమ్‌రావ్‌జాన్ అదా' అనే ఉర్దూ నవల చదివాను. అందులో ఓ ముసలాయన పాత్రవుంది. అతని ప్రియురాలైన వేశ్య [illegible] తన ప్రియుల్ని సంతోషపెట్టడానికి గాను అతణ్ణి మాటిమాటికి చెట్టు ఎక్కిస్తూ దింపిస్తుంది".

కన్య మరింతగా నవ్వి-"అతని పాత్రలే అంత. సరేలెండి, మీరన్నదానికి ఒప్పుకుంటున్నా. అవసరం వచ్చినపుడు ఆడవాళ్ళు కూడా మగవాళ్ళకన్న ఎక్కువ కిరాతకాలు చేయగలరు" అంది.

ఫలహారం అవగానే కాగితం విస్తరాకు చెత్తడబ్బాలో వేసి వచ్చి కెటిల్‌ను మళ్లీ కడిగి రెండో పర్యాయం స్టౌవ్ మీద ఎక్కించారు.

పరుపు మీద వాలాడు సజ్జన్. జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించుతూ, గట్టిగా ఓ దమ్ము పీల్చాడు, ప్రపంచంలో వున్న చక్రవర్తి తనాన్నంతా తన గుండెలో నింపుకుంటూ. సజ్జన్ ఇవ్వాళ చాల హుషారుగా వున్నాడు. వనకన్య అతని గదిలో వుంటే ఓ పచ్చని సంసారాన్ని ఈదుతోన్నంత నిండుతనం వచ్చింది అతనికి. స్టాండు మీద వున్న ఓ పూర్తికాని తైలచిత్రాన్ని ఆమె కన్నార్పకుండా చూస్తోంది.

"ఈ వనకన్య అనేపేరు మీకు మీరు పెట్టుకున్నారా లేక మీ తల్లి తండ్రులు పెట్టారా?" ఏమీ ఉబుసుపోనట్లుగా అడిగాడు సజ్జన్.

ఆ ప్రశ్నకు నవ్వుతూ-"ఎందుకలా అడుగుతున్నారు?'' అని ప్రశ్నించిందామె.

పెదిమలకింద సిగరెట్టు వుంచుతూ సజ్జన్-"ఇలాటి పేర్లు మనలో కామన్‌గా వుండవుగా....ఎప్పుడు మార్చుకున్నారు? హైస్కూల్లో అడ్మిషన్‌ఫారమ్ పూర్తి చేసేప్పుడా?" అని అడిగాడు.

"మీకు జ్యోతిషం కూడా తెలుసునట్లుందే!" అంది వనకన్య ఆశ్చర్యంగా.

"మీకు తోచిందా లేక ఎవరైనా సలహా....?"

"నాకే స్వయంగా తోచింది-ఎలావుందంటారు?"

"ఓహో బ్రహ్మాండంగా వుంది. వనకన్య అంటే అర్థం ఆడపిల్లకదూ!" అన్నాడు సజ్జన్. ఇద్దరు గొల్లున నవ్వారు.

చిత్రంవైపు చూపిస్తూ కన్య ఇది సత్యనారాయణ కథ కదూ? అని ప్రశ్నించింది. "చాలా బావుంది. ఇదంతా మహారాష్ట్ర వాతావరణం. స్కెచ్ ఎక్కడ గీసారు?" అని అడిగింది.

"కొవాపూరులో"

"మీకు ఈ సోకాల్డ్ బీవా బిక్కాతో కూర్చోడానికి సంకోచం లేదు. నేను ఈ విషయంలో అభినందిస్తున్నాను".

"క్షమించండి. మీ అభినందన ఒక్కషరతుతో అంగీకరిస్తాను. నాకు జంకు వుంటుంది".

"మరి?"

"కాని మనస్సు కోరినప్పుడు సంకోచాన్ని లెక్కచేయను".

"మీరు ఎప్పటికి ఆ సంకోచాన్ని నివారించుకోకలిగితే నా వెంట రండి. అజంతా ఎల్లోరాల చిత్రాలు చాలా గీసారు. ఇకచాలు ఈ జీవించే దుర్భర బతుకుల చిత్రాలు గీయండి. మన పెద్దపెద్ద గొప్ప గొప్ప నాయకులున్నారు చూడండి. ప్రపంచానికే స్వేచ్ఛా స్వాతంత్రాలను దానంచేసి పారేస్తాం అని రేత్రింబవళ్ళు గప్పాలుకొడ్తుంటారే కనీసం వాళ్ళకైనా తమ ప్రజానీకం ఎలా

వుందన్న విషయం తెలుస్తుంది మీ చిత్రాల్ని చూసి'' కన్య ముఖం కందగడ్డై పోయింది.

ఆమె మాటలతో సజ్జన్ శరీరం అంతా పులకరించిపోయింది. ''మీరు నన్ను ఇన్‌స్పైర్ చేస్తున్నారు కన్యగారూ! నేను అదేమిషన్‌తో అసలిక్కడకు వచ్చింది. అజంతా ఎల్లోరా చిత్రాలు ప్రజా జీవితానికి పనికిరావన్న మీ వాదనతో మాత్రం నేను ఏకీభవించలేను''

''నా వుద్దేశ్యం అదికాదు''

''అజంతా ఎల్లోరా చిత్రాల్ని సూక్ష్మంగా పరిశీలించి తే మీకే తెలుస్తుంది. సంపూర్ణ మానవ జీవితాన్ని సౌందర్యవంతంగాను ప్రయోజనకరంగాను చేసుకోవడానికి ఆ చిత్రసంపత్తి చాలు''

''నేను....''

''నిజంగా చెప్తున్నా. ఆ గుహల్ని చూస్తోంటే నాకు ఈజిప్టులోని పిరమిడ్లు జ్ఞాపకం వచ్చాయి. రెంటినీ పోల్చిచూడండి ఎలాంటి తారతమ్యం వుందో. ఒకవైపు మనపూర్వీకులు పర్వతాల్నే నిలబెట్టారు. ఏకాలంలో కట్టినా వాళ్ళ ప్రతిభా బుద్ధిబలం తలచుకొని శరీరం గగుర్పొడుస్తుంది, ఈనాటికీ. అయితే మానవుడు నిర్మించిన ఈ పర్వతాల్ని ఏ ప్రయోజనంతో నిర్మించారు ? చచ్చిపోయిన వారి కోసం!....ఇక రెండో వైపు చూడండి. మన హిందూదేశంలోని పూర్వీకులు పర్వతాల్నే దొల్లలుగా తొలిచి తమ సౌందర్యసంపద అంతా ఆ గుహల్లో నింపేసారు వాటిన్నింటినీ విజ్ఞాన కేంద్రాలుగా రూపొందించారు. ఈజిప్టులోని ఫిరావురాజ వంశస్థుల విలాసార్ధంగానూ కాదు, మరణించిన వారిని పాతిపెట్టడానికీకాదు. ఈ రెండు సంస్కృతుల దృక్పథంలో ఎంతతేడా వుందో చూడండి. మనం కళను ఇక్కడ జనజీవితంతో ముడిపెట్టుకుంటూ ఆరాధిస్తాం. మన కళలో అద్భుతాలు ఎక్కువగా వున్నాయి. కాని అవి మనల్ని భంగారు పెట్టవు. వాటివల్ల మన మనస్సుకు ఆహ్లాదం లభిస్తుంది. శాంతిలభిస్తుంది. ఆ సౌందర్యాన్వేషణే మనల్ని వాటివైపు ఆకర్షిస్తుంది. ఆరాధకుల్ని కూడా అలాగే ఆకర్షణీయంగా చేస్తుంది''

సజ్జన్ మాట్లాడుతుంటే ఆమె రాతిబొమ్మలా కదలక మెదలక వింటోంది. చివరకు సజ్జన్‌కూడా తన మాటల ప్రభావానికి లోనై మౌనంగా వుండిపోయాడు.

కొంచెంసేపాగి కన్య అందుకుంది–"మీరు చెప్పింది నిజమే. మీ అనుభవాన్ని తెలిపి నాకీనాడు వున్నత ఆసనాన్ని ఇచ్చారు. ఐ షల్ నెవర్ ఫర్గెట్ ఇట్!... కాని ఒక్కసంగతి నా కర్థంకావడంలేదు. ఈ దేశంలో ఒకవైపు ఇంత మహోన్నతమైన వేదాంతం, సాహిత్యం శిల్పకళ–వీటికి సంబంధించి ఒక దాన్నుంచి ఇంకోదాన్ని విడదీయలేని ముడులు వున్నాయి. రెండోవైపు మనం ఇళ్ళల్లో రోజూ చూస్తోండే సత్యనారాయణ కథలూ, ఈ మూఢాచారాలు, నా ఒదినగారూ, ఆ పిచ్చిదానివంటి స్త్రీ జాతి, నా తండ్రిగారు, నా అన్నగారూ....

"మీ అన్నగారా? వారేం చేసారు?"

కన్య వాగ్ధోరణి సజ్జన్ ప్రశ్నతో హఠాత్తుగా ఆగిపోయింది. చెప్పకూడదన్న భావంతో ఆమె పేలవంగా నవ్వి గొంతు సన్నగా చేసుకుని-"మా ఇల్లు అక్షరాలా నాకు ఒక యూనివర్సిటీ లెండి. ఏమని చెప్పను? మా అన్నగారు ఓ నిస్సహాయతలో చిక్కున్నారు...ఎలా చెప్పడం మీకు?" అంటూ ఆగిపోయింది. సిగ్గుతో ఆమె ముఖాన్ని దించేసింది. అంతలోకే లేనిధైర్యాన్ని తెచ్చుకుని తల ఎత్తి అంది "కాని వింతలూ కల మన సమాజాన్ని పరిశీలించడానికి బయలు దేరారు కనుక ఓ నమునా కేసు కింద నిస్సంకోచంగా మీకు తెలియచేస్తాను-నా ఈ ఒదిగారున్నారే "పయి" లెండి...."

కన్య ముఖకవళికను గమనిస్తోన్న సజ్జన్ ఇంకా ఏమి చెబుతుందా అని ఆత్రుతగా ఎదురుచూస్తున్నాడు. కాని అతని వూహకు భిన్నంగా ఒదినగారు గురించి చెప్తోంటే, అది కూడా ఏదో కొత్తపదంతో మొదలెట్టిన కా ర ణం గా అతను "ఈ పయ్" అంటే? అని ప్రశ్నించాడు.

తూచి తూచి మాట్లాడుతూ కన్య– "ప్రకృతి చేస్తోన్న ఒక ఎగతాళి ఇలాంటి అరది ఆరదిగా కనపడుతున్నా నిజానికి నిరర్థకం"

"ఓహో.... అంటే హిస్"

"అవును, మామూలు ఆడవాళ్ళకు మాదిరి ఎక్స్టీరియర్ పూర్తిగా డెవలప్ అయినదిగా వుంటుంది. అంతే తేడా".

"మరి ఈ వివాహం ఎందుకు జరిగినట్లు?"

"ఎన్ని మోసాలు జరగడం లేదు. అమ్మకూ నాన్నకూ పదిహేను వేల రూపాయలు కట్నం దొరికింది. కొంచెమూ దొరక లేదని తాతగారు వదిన్ని ఎముకల్లో సున్నం లేకుండా కొడతారు, మీ కేమని చెప్ప మంటారు? వదినపడే యాతన చూడలేక పోతున్నా. తాతకు షాకు తగిలింది నిజంగా. వారి మనస్సు మెత్తన. భోళా మనిషి. కాని వారికి మూర్ఛలు వస్తుంటాయి, ఆ ఫిట్స్ వచ్చినప్పుడు వారు నరరూప రాక్షసు లౌతారు. ఒకరాత్రి అమె నిద్రిస్తుండగా తాతగారు అమె జడకు నిప్పంటించారు. ఒక రోజైతే తెల్లవారక మునుపే అమెను స్నానం చేయించ డానికి గోమతికి తీసు కెళ్లారు. అక్కడకు వెళ్ళగానే 'పద మనం ఇద్దరం తలలు గొరిగించు కుందాం గోమతిలో ఇద్దరం ఒకే మునక వేసి చచ్చి పోదాం' అని మొండి పట్టు పట్టారు''.

''అరె, అలాగా?"

"అక్కడ వారు ఓ సీను ఎనాక్టు చేయడానికి ప్రయత్నించారు. వదిన వప్పుకోకపోతే వారికి కోపం వచ్చింది. వదిన వెంటనే నేర్పును ప్రదర్శించింది. నువ్వు ముందు గొరిగించుకో. నేను తర్వాత తలతీయించు కుంటాను అని ఒప్పించింది. అంతే తాతగారు గొరిగించు కోవడానికి కూలబడ్డారు. వారలా తల వంచుకుని కూర్చొని వుండే అమె చప్పుడు కాకుండ లేచి వచ్చేసింది. దారిలో రిక్షా కట్టుకొని ఎలాగోలా ఇంటికి చేరింది''

చ....చ...చ"

"ఇంకా ఏమని చెప్పను మా ఇంటి భాగోతం. వారి మూలంగా ఇంట్లో రోజూ ఎన్ని తగాదాలు అవుతున్నాయి. నేను నిజం చెపుతున్నాను. నాకు ఇవన్నీ చూసి సిగ్గేస్తోంది. నా ఇల్లొక విషస్ సర్కిల్ – ఓ విషవలయం అనుకొంటి. నా పెద్దమ్మ నా అమ్మ సవతులు, నా పెద్దమ్మ తాతగారి మెప్పు సం

పాటించు కోవడానికి మొగుడు చచ్చిన తన కోడల్ని అతనికి తార్చాలని చూసింది. ఇక నా అన్నగారు ధర్మనిష్ఠగలవాడే అయినా అయనే తనంత తానుగా మళ్ళీ పెళ్ళిచేసు కుంటానని ముందుకొచ్చారు. అందుకు నా వదిన ఇష్టం గూడ వుంది. ఈ లోపల మా అమ్మ పెద్దమ్మ ఎత్తుగడ కనిపెట్టింది. ఆమె ప్రవర్తన మంచిదైనా అధికార దాహం కల వ్యక్తి. ఆమె నా తండ్రిని వుసిగొల్పి ఆమె మీద యీ అఘాయిత్యం చేయించింది. ఎందుకంటే కేవలం యీ పెద్దమ్మకు గుణపాఠం నేర్పడానికి– ఆమెపై పగ తీర్చు కోవడానికి.

దీర్ఘమైన నిట్టూర్పు విడుస్తూ "మిస్ కన్యగారు, ఐ సింప థైస్ విత్ యూ" అని సజ్జన్ తన సానుభూతిని ప్రకటించాడు.

"నో థాంక్స్, మీ సానుభూతి నాకక్కర్లేదు. నాపాట్లు నేనే ఒంటరిగా పడతాను లెండి... ఇంత గ్రంథసాంగం ఎందుకు చెప్పానంటే మన సంస్కృతి ఒకవైపు అజంతా, ఎల్లోరా మొదలైన రూపకల్పనల ద్వారా నిర్జీవమైన పదార్థాలకు ప్రాణం పోస్తోంటే మన సాంఘిక వ్యవస్థలో ఎక్కడో లోపంవల్ల చైతన్యం కలిగివున్న మనిషి కూడా జడమయమై పోతున్నాడు. సంఘంలో ఇన్ని మంచి ఆదర్శాలు వుండికూడా, తమ ప్రభావాన్ని ప్రసరిస్తూ కూడా ఎందుకూ కొరగాకుండా పోయాయి. కొత్త శక్తినీ స్ఫూర్తినీ కల్గించలేక పోయాయి, దీనికి కారణం ఏమిటి? వ్యక్తిలో ఇంతమంచి నిష్ఠవుంది కూడా మనం ఎందుకు నేషనల్ కేరెక్టర్ని బిల్డప్ చేసుకో లేకపోయా మంటారు?"

చివరి మాట సజ్జన్‌కు బాధ కలిగించింది. వెంటనే అతను అందుకున్నాడు. "మనకు నేషనల్ క్యారెక్టర్ లేదన్న విషయాన్ని సుతరామూ అంగీకరించను. చరిత్ర బలంలేని జాతిలో వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు లాంటి మహా కవులు ఎలా పుడతారు? మనకు కనిపించే ఈ ఉత్కృష్ట శిల్పసంపద వచ్చి వుండేది కాదు. మన చరిత్రలోకి తొంగిచూస్తే అశోకునిలాంటి చక్రవర్తి మనకు కనపడతాడు, బుద్ధుడూ జైన మహావీరుడు, గాంధీలాంటి మహనీయులు కనబడతారు.... మీ ఇంటిలోని వాతవరణం దృష్ట్యా యావత్ హిందూ దేశం అంతా మురికి కూపంలా కనపడు తోంది. అది పూర్తిగా నిజం కాదు ఉదా

హారణకు మా అమ్మగారే నాకు ఆదర్శమూర్తి. ఆమెలా ప్రపంచంలో ఎంతో మంది వున్నారు. ఇవ్వాళ వుదయాన్నే– ఇక్కడే– గున్నోమల్‌గారి తోటలో పండిట్ విశ్వనాథశాస్త్రి గారుంటున్నారు- చాలా పెద్ద విద్వాంసులు, వారిని చూద్దామని వెళ్లాను, వారు నాకు మన సంప్రదాయం గురించి చెప్పిన మాటలు వింటోంటే ఎంతో ఆశ్చర్యం కలిగింది. మీరు చెప్పిన దాన్ని నిజమని ఎలా ఒప్పుకోవాలో నాకు అర్థం కావడం లేదు".

టీ కప్పును అందిస్తూ వనకన్య–''నేను వీటన్నిటినీ కాదనడం లేదు. మన సాంఘిక వ్యవస్థలోనే ఎక్కడో ఏదో పొరపాటు దాగివున్నట్లనిపిస్తుంది. అదే మనకున్న ఈ నైతిక సౌందర్యం కప్పు పొడుస్తోంది... చక్కెర తక్కువగా వుందా" అంది.

నో "థాంక్స్' కొంచెం ఎక్కువగానే వున్నట్టుంది. మీరు రెండు స్పూన్లు వేసి నట్టున్నారు. ఫర్వాలేదు. తీపిని ఎంజాయ్ చేయొచ్చు".

సజ్జన్ నర్మగర్భంగా మాట్లాడినదాన్ని వనకన్య గ్రహించి కూడా విన నట్లు వూరుకుంది. మళ్ళీ మొదలెట్టింది- "చూడండి ఈ సత్యనారాయణ కథలో ఏమి వుందంటారూ? లక్షల కుటుంబాల్లో ఈ కథ ను శ్రద్ధా భక్తులతో చదువు తారు కదా. కాని దీనిలో ఏం నీతివుంది? నేనూ యీ కథ చదివాను. దానిలో సత్యమూ లేదు నారాయణుడూ లేదు".

సజ్జన్ కాస్త కోపాన్ని ప్రదర్శిస్తున్నట్టుగా "ఏమండోయ్ మీ కమ్యూనిజమ్ అన్ని వేళలా నాకు రుచించదండి" అన్నాడు. అంతలోనే అతనికేదో విషయం గుర్తుకొచ్చినట్లుగా "అన్నట్లు మరిచాను, మీరింత వరకు ఏమీ తిన్నట్లు లేదు" అని అడిగాడు వనకన్యను చూస్తూ.

''అదేమిటి, ఇప్పుడేగా ఫలహారం చేశాను".

''మీరు మరీను, అదికూడా ఒక ఫలహారమేనా? ఇప్పుడు రెండు కొట్టారు. ఇంతవరకు మీరు భోజనం చేయకపోతే మీ యింట్లో వూరు కుంటారా?"

టీ తాగుతున్నాట్లుగా నటిస్తూ కన్య ఏమీ జవాబు ఇవ్వలేదు. ఆమె ముఖంలో లేని గాంభీర్యం తెచ్చుకుని "వెనకటి రోజుల్లో నయితే కోప్పడేవాళ్లు... కాని మొన్నటి నుంచి నాకూ ఆ యింటికీ సంబంధం తెగిపోయింది" అంది.

సజ్జన్ ప్రశ్నార్థకంగా ఆమె కళ్లలోకి చూశాడు.

"నన్ను ఇంట్లోంచి వెళ్ళ గొట్టారు" అని చటుక్కున అనేసింది వనకన్య.

"ఎప్పుడు!"

"మొన్ననే",

"ఏదైనా విశేషం జరిగిందా!"

"ఆఁ అవును. విశేషమే జరిగింది. సాలిగ్రాం గారి సలహా ప్రకారం మా ఇంటిల్లిపాదీ యావత్తూ మా ఫాదర్ దైవసమానుడని స్టేటు మెంటు యిచ్చారు.

"సౌండ్రైల్స్!.... అయితే మీరిప్పుడు ఎక్కడ వుంటోన్నట్లు? కమ్యూనిస్టు పార్టీఆ...."

"లేదండి. మొన్నరాత్రి నుంచి నిన్నటి మధ్యాహ్నం వరకు ఒక స్నేహితురాలింట్లో వున్నాను. నేను అక్కడ వుండడానికి ఆమె ఇంట్లో వాళ్లు అంగీకరించలేదు. అక్కణ్ణుంచినా 'ఇప్టా' అంటే ఇండియన్ పీపుల్స్ థియేటర్లో పని చేసే ఓ కామ్రేడ్ ఇంటికి వెళ్ళాను. ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాలో ఏంచెయ్యాలో అర్థంకావడంలేదు. ప్రస్తుతం అంతా అయోమయస్థితిలో వున్నాను.'' ఆమె ఎంత నిగ్రహించుకున్నా ఆ మాటలు అంటోంటే ఒక వేడి నిట్టూర్పు బయటికి వచ్చి పై కప్పుతో ఢీకొని మళ్ళీ గదిఅంతా వ్యాపించింది.

"మీకు ఎలాటి కష్టంరాదు. నాకు బోలెడు ఇళ్ళున్నాయి'' సజ్జన్ భావావేశంలో అనేవాడు.

"కాని మీ యిళ్ళలో నేను వుండలేను.''

''ఎందుకు?"

"మీ యింట్లో వుందామన్న ప్రసక్తేలేదు'' కన్య కంఠంలో దృఢత్వం కనపడింది.

సజ్జన్ గంభీరకరదాల్చారు. "మీ మానసిక పరిస్థితిని అవగాహన చేసు కున్నాను. మీరింత వరకు చూసి గ్రహించినదాన్ని బట్టి అందరి స్త్రీల మాదిరిగా మీరుకూడా పురుషుణ్ణి ద్వేషించడానికి, అతణ్ణి అనుమానించడానికి మీకు అధి కారం వుంది. నేను పురుషుణ్ణి, పెద్దవాణ్ణి కూడా. అయినా....ఎక్ యువర్ పర్మి షన్ మిస్ వనకన్యగారూ, నాలో కొన్ని మంచి గుణాలు కూడా వున్నాయండీ".

కిందకు వాలిన రెప్పలు ఎత్తి సజ్జన్‌ను ఎగాదిగా చూసి చిరునవ్వు నవ్వింది కన్య. "అలా అనుకోకపోతే మీ సహాయం అర్థించడానికి వచ్చేదాన్ని కాదు" అని అంది.

"అలాగైతే లేవండి. వెళ్దాం",

"ఎందుకు?"

"నా యింటికి. ఇవ్వాళ మహాత్ముడు ఏసుక్రీస్తు పుట్టినరోజు. మాయింట్లో మీకు విందు"

"నేను బొమ్మల ప్రదర్శనాన్ని చూడ్డానికి పోతున్నాను"

సజ్జన్ వెంటనే అందుకుంటూ, "అవునవును. నేను కూడా వస్తాను. మహిపాల్ కర్నల్‌ని కూడ తీసుకెడదాం".

"సజ్జన్‌గారూ, నేను—"

"చూడండి. ఈ విషయంలో ఇక ఏ ఒక్క మాటకూడా విననుం. మీరు మా విందును స్వీకరించి తీరాలి. మీరు యింతవరకూ మగవాళ్ళతో అంటూ గొంటూ లేకుండా తిరగలేదూ? మరి యీ బిడియం ఎందుకు చెప్పండి. అదీకాక ఈ పేంప్లేట్ గురించి మనం కర్నల్‌తో సంప్రదించాల్సింది కూడా వుంది".

తానింతవరకు ఎంతోమంది స్త్రీల పొందులో అనుభవించిన సంతోషం కన్నా సజ్జన్‌కు ఈరోజు మిస్ వనకన్య బయటికి వస్తోంటే ఎంతో ఆనందగా వుంది. ఇది అతనికి సరికొత్త అనుభవం. జీవితంలో మొదటిసారిగా కన్నతల్లిని కాక ఒక పరాయి ఆడపడుచును గౌరవించడం అతను నేర్చుకున్నారు.

# 3

సంవత్సరం ఆఖరకు జమాఖర్చులు పోను నిలవతేలిన నగదు రొఖ్ఖంలా ఎలక్షన్ల సందడి మధ్యలోంచి డిశంబరు 31 వ తేదీనాటి పత్రికల్లో ఒక వార్త వచ్చి లక్నో నగరవాసుల్నందరినీ దిగ్భ్రాంతుల్ని కావించింది.

లక్నోనగరం చివరభాగాన రైల్వేలైనుకు పక్కగా ఎవరిదో ఓ శవం పాతిపెట్టి వుంది. కుక్కలు ఆ శవాన్ని పెకలిస్తున్నాయి. అది స్త్రీ శవం. ఆ దారుణ దృశ్యాన్ని కొంతమంది కురాళ్ళు చూశారు. పట్టణం యావత్తూ ఆ వార్తతో అట్టుడికిపోయింది. సుమారు యిరవై అయిదువంవత్సరాల వయసుగల ఆ యువతి నీలిరంగు చీర కట్టుకుంది. చేతికి ప్లాస్టిక్ గాజులున్నాయి. రెండు మూడు రోజుల క్రితం ఆమెను పాతిపెట్టినట్టుంది. ఆమె ఓ కాలి తెల్లసేండల్ కూడా అక్కడే పడివుంది. శవం కంపుకొడుతోంది.

కొత్త సంవత్సరం ప్రారంభంకాక పూర్వమే ఈ వార్త గురించి పట్టణం నలుమూలలా చర్చించడం మొదలెట్టారు జనం. ఇటీవల అక్కడక్కడ హత్యలూ దోపిడీలూ, బలత్కారాలకు సంబంధించిన వార్తలు ప్రజల దృష్టిని చాలాసార్లు ఆకర్షించాయి. అందువల్ల ఎలక్షన్ హడావుడిలో వచ్చిన ఈ వార్త కూడా కాంగ్రెసు పరిపాలనకు వ్యతిరేకంగా ఫిర్యాదుగా తయారైనాలుగు మూలలా బచ్చలితీగెలా అల్లుకుంది. ఆ యువతి ఎవరన్నది పోలీసులు ఇంతవరకు ఆరా తీయలేకపోయారు. కొంతమంది ఆమె హిందువు అనీ, మరికొంతమంది ఆమె మహమ్మదీయ వనిత అనీ అన్నారు. ఈ వూళ్లోనే వుంటుందని ఒకరంటే కాదు రైల్లో ఎవరో ఆమెను గొంతుపిసికో, చంపో, లేక తినుబండారాల్లో విషం కలిపో చంపి ఇక్కడ పాతిపెట్టారు అని ఇంకో ఆయన అన్నాడు. ఇలా ఆ యువతి హత్య గురించి తలాఒకరకంగా వూహిస్తున్నారు. ఎన్నినోళ్ళున్నాయో అన్ని రకాల అభిప్రాయాలు. వుత్తిమాటలు. కొత్త సంవత్సరంలో కొత్త రోజు, గతించిన సంవత్సరాల్లోని ప్రతిరోజు మాదిరిగానే ప్రతిమనిషి గుండెమీద నిప్పుల కుంపటి పెడుతోంది. సామాన్యుడిబతుకు ఆర్థికబాధలనే దెబ్బలు తినితిని

నానాటికీ దుర్భరంగా తయారై ఇసుకలా ఎక్కడికక్కడ విచ్చిపోయింది. ఇక అక్రిమ లాభాల్తో దోచుకొనేవాళ్ళు 1942 సంవత్సరంతో మొదటిరోజున కూడా పాత సంవత్సరాల లాగా ఇసుకలోంచి తైలాన్ని తీయడంలో మునిగిపోయారు. ఎక్కడ చూసినా బియ్యం, పప్పు, నూనె గురించి హాహాకారం వినబడుతోంది. పైకిమాత్రం ఎలక్షన్ల హడావుడి. ప్రతిగార్డులోనూ ప్రతి సందులోనూ గొంది లోనూ రాజకీయ పార్టీలు పెద్దపెద్ద లౌడ్‌స్పీకర్లు తగిలించి ఒకటే రణగొణధ్వని చేస్తూ చెవులుచిల్లులు పడేట్టుగా అరుస్తున్నారు. ఉపన్యాసాలిస్తున్నారు. ఎర తెరపిలేకుండా ప్రచారం చేస్తున్నారు మధ్యమధ్య ఒకపార్టీమీద మరోపార్టీ మాటల బురద చల్లుకొంటూ, తెగనాడుకుంటూ, ప్రజల జీవన సమస్యల్ని మాత్రం పక్కదారి పట్టిస్తున్నారు.

కొత్తసంవత్సరంలోని కొత్తరోజు రాత్రి మిలమిల మెరిసిపోతోంది. పీడించబడిన వారకాంత తన మనస్సులోని బాధను దిగమింగుకొని, శరీరాన్ని అనుభవించడానికి వెతుక్కుంటూ వచ్చే విలాస పురుషుల్ని సంతోషం పెట్టడం కోసం రంగురంగామని సింగారించుకుని కిటికీవద్ద వయ్యారంగా కూర్చునట్టుగా, కొత్తరోజు రాత్రి చీకటినంతా కడుపులో దాచుకొని బయటికి మాత్రం ధగధగా వెలిగి పోతోంది.

అప్పుచేసి పెళ్ళిళ్ళూ, వుపనయన సంస్కారాలూ చేసి పైపైకి ఎంతో ఆడంబరాన్ని కనపరుస్తూ ఆనందాన్ని వెదజల్లుతూ, కేరింతలుకొడుతూ లోలో పల చింతల చితిని పేర్చుకుని దానిలో మండిపోతున్న ప్రతిష్ఠావంతుల కుటుం బాల్లా బజారంతా సందడితోనూ, వెలుగుతోనూ నిండివుంది.

నాలుగు రోడ్ల కూడళ్ళ దగ్గర బస్సులూ, కార్లు, చిన్నకార్లు, టాంగాలు, బట్కాలూ, రిక్షాలూ, సైకిల్ రిక్షాళ్ళూ, కాలినడక నడిచే ప్రజానీకం–అందరూ ప్రతిరోజూ మాదిరిగా ఒకదాని ప్రక్కన ఒకటిగా, ఒకదాని తర్వాత ఇంకొకటిగా బార్లు తీర్చి, దివాలా తీసిన వ్యాపారస్థుని కార్ఖానాలా, బడబడా చప్పుడు చేస్తూ రెండువైపులా కదులుతున్నాయి. నిజానికి ఎక్కడైనా ఘరఘరమంటూ సేఠ్ గారి యంత్రాలు తిరుగుతూంటే ఉత్పత్తిబాగా జరుగుతోందనీ, కొత్తకొత్త వస్తు

వుల్ని తయారుచేసే కార్యక్రమంలో వున్నారనీ, బయటవున్న వారనుకుంటారు. కాని లోపల జరుగుతోన్న యథార్థం ఎంతమందికి తెలుసు? ఉత్పత్తి చేసేది తక్కువ అనీ, పవర్‌ను పూరికే వృథాచేస్తున్నారనీ, ఇదంతా ఆర్భాటంకోసం సేఠ్‌గారు కేవలం తనపేరు నిలబెట్టుకోవడానికి చేయిస్తున్నాడని ఎంతమందికి తెలుసు? లోపల కంపుకొడుతూ పైకి కస్తూరి వాసనల్ని వెదజల్లుతూ, గమ్యస్థానం అనేది లేకుండా ముందుకు సాగిపోదామనుకొంటోన్న ఈ పెట్టుబడిదారీ వర్గపు విధానాలు ఇంకెన్నాళ్ళు కొనసాగుతాయి? ఎన్నాళ్ళు సాగుతాయి వీళ్ళ ఆటలు? వాళ్ళ దమ్ము ఇంకెన్నాళ్ళు?

రేడియోలో వార్తలు ప్రసారమవుతున్నాయి హోటళ్ళలోంచి, మిఠాయి దుకాణాల్లోనూ, కిళ్ళీ కొట్లలో కూడ రేడియోలు వార్తలు ప్రసారం చేస్తున్నాయి. బజారు రోడ్ల మీద నుండి సందుల్లోకి వచ్చేవాళ్ల చెవుల్లో క్రమం తప్పకుండా వార్తల్ని వినిపిస్తోంది రేడియో ఒక్కొక్కచోట, ఒక్కోరోడ్డు మీద ఈ చివర నుండి ఆ చివర వరకు అడుగడుగునా రేడియోలుఅమర్చివున్నాయి. అన్నీ ఒకే స్వరంలో ప్రతిధ్వనిస్తున్నాయి. క్రీడారంగం గురించి వార్తలు వస్తున్నాయి. ఇంగ్లండు జట్టుకూ భారత్ జట్టుకూ మధ్య కలకత్తాలో జరుగుతున్న మూడో టెస్టులో ఇవ్వాళ మూడోరోజు. రాయ్, ఉమ్రిగర్, హజారే యిరవై ఎనిమిది రన్‌లు మాత్రమే చేసి గంటలోపలనే అవుటయ్యారు. మంజ్రేకర్ నలభై ఎనిమిది రన్‌లు చేసి మందకొడిగా వున్న ఆటకు కొంత ప్రాణంపోసాడు....ఇంక వాతావరణానికి సంబంధించిన సూచన వినండి..."

రేడియో ఎక్కిళ్ళు పెట్టడం మొదలెట్టింది తర్వాత కార్యక్రమం ప్రసారం కావడానికి ముందుగా. డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్న సజ్జన్ వనకన్య ఇద్దరూ కన్నార్పకుండా ఒకరినొకరు చూసుకుంటున్నారు. నాల్గురోజుల్లో ఇద్దరి దృష్టిలోను దాగుడుమూతలు కొంతవరకు తగ్గాయి. ఇంతలో రేడియోలో ఎక్కిళ్ళు తగ్గాయి.

"ఆలిండియా రేడియో లక్నో, అలహాబాదు, పాట్నా కేంద్రాల నుండి

ప్రసారం. వరాగ్ సాహితీవేదిక కార్యక్రమం కింద మహీపాల్ శుక్లాగారు "కొత్తరోజులు వస్తాయి" అనే కథను వినిపిస్తారు"

సోఫాపై జారగిలపడిన సజ్జన్ కళ్ళు మూసుకున్నాడు. కన్యమాత్రం రేడియోకు ఎదురు కూర్చుని వింటోంది, మహీపాల్ కంఠంలోంచి అతని రూపాన్ని చూస్తున్నట్లుగా. మహీపాల్ కంఠస్వరం గంభీరంగా వినిపిస్తోంది. ఆ కంఠంలో టీపీతేజస్సూ రెండూవున్నాయి. అతని నోట్లోంచి మాటలు మారు మోగుతున్నటుగా వస్తున్నాయి. కాని కంఠస్వరంలోంచి అసలు మాట్లాడి నప్పుడెల్లా.

కళ్ళు తెరచి "కొంచెం ట్యూనింగ్ సరిచేస్తారా" అని సజ్జన్ కన్యను అడిగాడు. ఆమె ట్యూన్ సరిచేసివచ్చింది. "థ్యాంక్యూ" కృతజ్ఞత చెప్పుకు న్నాడు సజ్జన్.

కథావస్తువ 'ఆదిమ కాలంలో అధికారం, ఆధిపత్యం కోసం స్త్రీ పురుషుని మధ్య జరిగిన సంఘర్షణ' సాహిత్యవేదిక కార్యక్రమం అయిపోయింది.

"ఇప్పుడే మీరు మహీపాల్ శుక్లాగారి కథ విన్నారు. ఇది ఆల్ ఇండియా రేడియో..." అంటూ ఓ ఆడగొంతుకు ముక్కుతో మాట్లాడుతోంది.

"కథ ఎలావుంది?" టెలిఫోన్ దగ్గరకు పోతూ సజ్జన్ అడిగాడు.

"హుషారుగావుంది. చాలావరకు బాగానేవుంది" అప్పుడే ప్రసారం అయిన కథగురించి ఇంకా ఆలోచనలో మునిగివున్న వనకన్య సమాధానం ఇచ్చింది.

సజ్జన్ రేడియో స్టేషన్‌లోని డ్యూటీ ఆఫీసర్‌కు ఫోనుచేసి మహీపాల్ గార్ని పిలవమని కోరాడు

కన్యసోఫాలోంచి లేచి రేడియోగ్రాం దగ్గర కొచ్చింది.

"ఆయన అభిప్రాయాలు ఎలావున్నాయి మీకు?"

రిసీవర్ను చెవికి పెట్టుకొని తల ఆడిస్తూ సజ్జన్ బదులు చెప్పాడు- "నాకు కేవలం నావీ, నా ఆత్మీయుల అభిప్రాయాలే నచ్చుతాయి.... హలో ఆఁ.. చెప్పండి రచయిత మహాశయా, మీరు రోజు రోజుకు చెట్టెక్కి పోతు న్నారు. ఆఁ చూస్తున్నా మీ గొప్పతనాన్ని. 'ఎందుకు' అంటున్నారా? ఆ మాటపై మిమ్మల్ని పదిహంటర్ దెబ్బలు కొట్టాలనివుంది. సిగ్గులేదూ. ఆరు రోజుల్నుంచి కంట్లో నలుసైపోయావ్. పొద్దునా లేదు....సాయంత్రం లేదు... అరరె...ఛా.. ఛా అయితే బాగాపని పడిందన్నమాట. ఆరే నిక్, అందుకే ఎక్కువగా తాగొద్దు అని మొత్తుకునేది. హా...హా....వెరీగుడ్. నా అభిప్రా యమా? నా అభిప్రాయం కన్న అమూల్యమైన అభిప్రాయం వినిపిస్తా. ఇఫ్ ఐ. యాం నాట్ రాంగ్,, ఓ విమర్శకురాలి ప్రశంసను ఆమె నోటనే వినిపిస్తా "మౌతు పీస్ ని నోటికి కొంచెం దూరంగా తీసుకెళ్ళి" రాండి కన్యగారు, ఐ విల్ ఇంట్రడ్యూస్ యూటూ యువర్ మోస్ట్ ఫేవరెట్ ఆథర్" అని అన్నాడు సజ్జన్.

సజ్జన్ టెలిఫోన్లో మాట్లాడుతోంటే వనకన్య వాల్యూమ్ బాగా తగ్గించి ఒక చెవి టెలిఫోన వైపు పారేసి రేడియో ద్వారా ప్రపంచం అంతా పర్య టిస్తోంది. సజ్జన్ ఆమెను పిలుస్తోంటే ఎవరో మధురగాయని కర్ణాకట సంగీతం వినిపిస్తోంది. అంకుతూ కన్య టెలిఫోన్ దగ్గరకు వచ్చింది.

మహీపాల్తో అన్నాడు సజ్జన్ - "చూడు మహాశయా, ఆమెగారు వచ్చారు. పేరు మిస్ వనకన్యగారు. రెండో వైపున వున్నవారు నా స్నేహితుడు. వృత్తచపట" అంటూ రిసీవర్ని కన్య చేతికిచ్చాడు.

మందహాసంతో రిసీవరును అందుకుంది మిస్ వనకన్య. "నమస్కార మండి!" అంటూ పలకరించింది. అంతలోకే ఆమె పెదాలమీద చిరునవ్వు కది లింది. మళ్ళీ ఆమె, "లేదండీ... నేను నిజంగా నమ్మలేదు. మీరిద్దరూ స్నేహితులు ఏమి కావాలనుకుంటే అది చేసుకో గలరు. నేను మీ యిద్దరి కళా ప్రతిభల్ని చూసి ఆనందించ గలను మాత్రమే, ఏమంటారూ.... బాగుంది.... చాలా బావుం దని అనననుకోండి. మీరు రాసిన "దేవత" చాలా బాగుందండి..."

ఆమె టెలిఫోన్లో మహీపాల్‌తో మాట్లాడుతూంటే అదే సమయంలో ఒక జెట్ విమానం కిందగా గోలచేసు కుంటూ ఎగురుతూ వెళ్ళింది. చెవులు చిల్లిపడ్డం తగావుంది దాని చప్పుడు. వనకన్య మళ్ళీ మాట్లాడుదాం అనుకొంటూ వుండగా మరో విమానం వచ్చి మళ్ళీ పెద్దగోల చేసుకుంటూ ఎగిరి వెళ్ళింది. అవతలంవైపు నుంచి మాట్లాడేది వినడం కష్టంగా వుంది. సజ్జన్ మాత్రం ఉత్సాహంగా బాల్కనీ మీదకు వెళ్ళాడు విమానం చూడడానికి.

"నేనిప్పుడే సజ్జన్ ఇంటికి వస్తున్నా," అంటూ రిసీవర్ పెట్టేసాడు మహీపాల్. రెండు విమానాలు వరుసగా అంత కిందుగా ఎగురుతూ పోయి నందుకు రేడియో స్టేషన్ వాళ్ళకూ మహీపాల్‌గారికీ విసుగ్గా వుంది. ఇంతలో మహీపాల్‌కు మరో ఫోను వచ్చింది ఈసారి కర్నల్ మాట్లాడాడు.

"ఇక్కడే వుండిపోనా? ఎందుకు? నేను సజ్జన్ దగ్గరకు పోతున్నా. ఏరోడ్రోం నుంచి మాట్లాడు తున్నావా? అక్కడెందుకు తగలడ్డట్టు?" అని మహీపాల్ ఫోన్లో మాట్లాడు తున్నాడు కర్నల్‌తో.

ఇంతలో ఆకాశంలో మళ్ళీ విమానాల చప్పుడు. ఒకటి తర్వాత ఇంకొకటి గోలచేస్తూ. అంతే వేగంతో, అలాగే ధ్వని చేసుకుంటూ.

విమానాలు పట్టణం మీద స్వైరవిహారం చేస్తున్నాయి లక్నో వాసులంతా తల్లడిల్లి పోయారు. ఇదేమిటి చెప్మా అంటూ. శీతా కాలపు రాత్రి. కొత్త సంవత్సరం కొత్తరోజు. ఆకాశంలో జరుగుతోన్న ఈగోల ప్రజల్ని స్తంభింపచేస్తూ వుంది. ఐదు నిమిషాలపాటు విమానాలు నగరం మీద చుట్టూ తిరుగుతూ ఎగిరాయి. మూస్తోన్న దుకాణాలు హఠాత్తుగా ఆగి పోయాయి. వేలకొలది వున్న దుప్పట్లు తమ వెచ్చదనాన్ని కోల్పోయాయి. అన్ని బజారుల్లోనూ, మార్కెట్లలోనూ సందుమొగదల్లోనూ, రాజబాటమీదా నగరంలో నాలుగు వైపులా జనం మూగిపోయి నగరం అంతా కోలాహలంగా వుంది.

ఇంతలో రాగిణాలు ఎగురు తున్నాయని గోల రేగింది. ముత్తైదువ చంద్రముఖంలా తెల్లగా మెరుస్తోన్న చవితి వెన్నెల కాంతిలో తెల్లపావురాల్లా అసంఖ్యా

తంగా కరపత్రాలు ఎగర సాగాయి ఆకాశం ప్రసాదించిన ఆ తెల్లపావురాల్ని అందుకోవడానికి వాడ వాడలా, సందుల్లో, రోడ్లమీదా డాబాలపైనా లక్షల చేతులు ఒక్క సారి పైకిలేచాయి. కరెంటు తీగెల స్తంభాలకు కొంచెం పైకి ఎత్తుగా ఎగురు తుంతగా ఇవేవో చిన్న చిన్న పుస్తకాలని ప్రజానీకం గ్రహించింది.

ఎవరి చేతుల్లోకి పుస్తకం వచ్చిందో వాళ్ళ ఆనందానికి మేరలేదు. తర్పి లాటరీ గెలిచినట్లుగా వుంది వాళ్ళకా పుస్తకాల్ని అందు కోవడం అందుకుందా మన్న తొందరలో తొక్కిసలాట, గుంజు కోవడం, ఒకరి నొకరు దుర్భాషలాడు కోవడం వరకు వచ్చింది. పుస్తకాలు దొరకని వారు కాలు కాలిన పిల్లిలా తిరు గుతూ వేటాడు తున్నారు. ఉర్దూ పుస్తకం అందుకున్న హిందీ వ్యక్తి తన సం దులో ఎవరు చదివి చెపుతారా అని వెతుకు తున్నాడు. హిందీ పుస్తకం అందు కున్న ఉర్దూ మనిషి స్కూలు కుర్రాళ్లను లేపు తున్నాడు. ప్రతి వ్యక్తికీ ఆ పుస్తకంతో ఒక పెద్ద పని వచ్చి పడినట్లయింది

ఇటువంటి సమయాల్లో ప్రజలు కూడా చాలా హుషారు ప్రదర్శిస్తారు. ఓ ప్రచార పుస్తకాన్ని పొందాలనే తొందరలో ఎన్నో ప్రమాదాలు జరిగాయి. విమానాలు రావడం అయింది. కాగితాలు వెదజల్లడం అయింది. నిమిషాలమీద జరిగి పోయింది. పుస్తకాలు అందుకున్న వాళ్ళంతా మళ్ళీ తమ తమ చోటుల్లో చేరి తీరిగ్గా పేజీలు తిరగేస్తున్నారు.

పుస్తకం మీద టైటిల్‌గా మూడు మనుగుల పెన్సిల్ స్కెచ్ వుంది. క్రింద పెద్ద పెద్ద అక్షరాల్లో "తెరవెనుక భాగోతం''- రచయిత కుమారి వనకన్య అనివుంది.

తన యింట్లో జరిగిన దురంతం గురించి సంక్షిప్తంగా వివరించిన తర్వాత చివర కుమారి వనకన్య ఇలా రాసింది- ''మగవాళ్ళతో నేనేమీ చెప్పా ల్సింది లేదు. దోపిడీ చేయడానికి అలవాటు పడిన తన జాతి అలవాటును అంత సులభంగా వదిలి పెట్టలేదు. నా నివేదన నాలాటి అక్క చెల్లెళ్లకు మాత్రమే. స్కూళ్లల్లో కాలేజీల్లో చదువు తుండే చెల్లెళ్ళకు, నాలుగు గోడల మధ్యా బందీగా

వున్న నా అక్కలకూ నేను మరీ మరీ విన్నవించుకునేది ఒక్కటే. 'ప్రేమ' అనే పదంతో ఆడజాతికి విరుద్ధంగా మన సమాజం ఎటువంటి పాపభూయిష్ట మైన వూహా చిత్రాన్ని నిలుపు కుందో దాని నుండి మహిళా సమాజం దూరంగా వుండమని నా ప్రార్థన. అత్యాచారి ఎవరినైతే తన దాసిసగా చేసుకుని వాళ్ళ మీద పెత్తనం చలాయించాలని చూస్తాడో వాళ్ళనైతిక బలాన్ని ముందు విర గ్గొడతాడు. వేల సంవత్సరాల చరిత్ర ఎంత తిరగేసినా మనకు కనపడేది సమా జంలో ఎక్కువ భాగం ఆడజాతితో అన్నిరకాల ఆటల్ని ఆడడం, దాని రసాన్ని పీల్చిపిప్పి చేయడం, తర్వాత వాళ్ళను తన ఇనుప పాదాలకింద తొక్కుతూ జీవిత పర్యంతం వాళ్ళను తపింప చేయడం. వైవాహిక మంత్రాల్లో మనకు కన బడే స్త్రీరూపం, అధికారం, అర్ధనారీశ్వరి రూపంలో పురుషునితో సమానంగా ఆమెకు యిచ్చిన హోదా ఇవన్నీ పుస్తకాల వరకు పరిమితమైనవి మాత్రమే. నిజానికి ఆడజాతి భారత దేశంలో కన్నా విదేశాల్లోనే ఎక్కువగా సన్మానించ బడుతోంది. "యత్రనార్యస్తు పూజ్యంతే తత్ర దేవతా" అన్న ఆర్యోక్తిని మన భారతీయులు ఎక్కడ పాటిస్తున్నారు? ఆడదానితో శూద్రులతో, పశువులతో సమానంగా సిగ్గు ఎగ్గూ లేకుండా వ్యవహరిస్తున్నారు. దీన్నే వాళ్ళు ధర్మం అంటారు. మతం అంటారు. ధర్మం, న్యాయం, రాజ్యం అన్నింటిపైనా పురుష లకేనా అధికారం వుండేది? పురుషుడు మోసంచేసి ఆడజాతిని సంకెళ్ళలో బం ధించి ఆమెను దాసిగా చేస్తూంటే అశక్త అయిన ఆమె నిస్సహాయతను ఏమ నాలి? దేవతలుగా మారి ఈ టక్కరి వాళ్ళంతా ఆమె సర్వస్వాన్ని అపహరించు కుని పోతూంటే ఆమె ఏమి చేస్తుంది? కాని ఇప్పుడు ఈ అసత్య ధర్మాన్ని, ఈ దొంగ పాతివ్రత్యం అనే మాయతెరను తొలగించి నిజాన్ని బయటకు లాగాలి. దానికోసం అవసరంవస్తే పోట్లాడాలి.

నా ఇంట్లో నా తండ్రిగారు చేసే దుర్మార్గాల్ని ఖండిస్తూ నోరు విప్పాలను కొంటే నా ఒదినగారే బలిమాలి నా నోరు మూయించింది. ఈ రాక్షసత్వానికి వ్యతిరేకంగా ప్రజా వాక్యాన్ని సేకరించే ప్రయత్నంలో మన శీలం మంట కలిసి పోదు అన్న సత్యాన్ని ఆమెకు నచ్చచెప్పి ఒప్పించలేక పోయాను. ఆడదాని

ఇష్టం లేకుండా పశువుతో సమానంగా వాళ్ళ శీలాన్ని భంగం చేయాలను కున్నప్పుడు కదా ఆడదాని గౌరవం పోయేది. ప్రేమ ద్వారా ఇతరుల్ని ఆ కట్టుకునే మాయను వ్యాపింప చేసి ఆడదాని సంకల్పాన్ని పురుషుడు ఎంత లాఘవంగా విరమింప చేస్తారో స్త్రీ శీలం అప్పుడే చెడి పోతుంది. అమాయకు రాలైనా స్త్రీ, తనను పురుషుడు నిజంగా ప్రేమిస్తున్నాడనీ, జీవితాంతం కష్ట సుఖాలు వాళ్ళు సమంగా పంచు కొంటారనీ నమ్ముతుంది కాని నేడు అమృతంలా తియ్యగా వుండి మర్నాటికి హాలాహలంగా పరమ చేదుగా మారేదేనా ప్రేమ అని నా సోదరీమణులను అడుగు తున్నాను. మనం విడిచే ఒక్కొక్క వేడి నిట్టూర్పుతో క్షతగాత్రయై రక్తంలోని ప్రతి బొట్టును కన్నీటి బొట్టుగా మార్చే దేనా ప్రేమ? రోజంతా మోహపాశంలేని కపట వ్యక్తి కోసం కళ్ళు తెరచి వేచి వుండాలి, దేనికి పనికి రాకుండా పోవాలి, ఏడ్చి ఏడ్చి కళ్ళతడి ఆరిపోవాలి, ఒకొక్కప్పుడు కన్నీటిని దిగమింగు కుంటూ లోలోపల కుళ్లుతూ వుండాలి.... ఏ ఉత్సాహమూ, ఏ ఉల్లాసమూ మనలో వుండరాదు. ఇదేనా ప్రేమ అంటే? ఈ ప్రేమ వ్యామోహంలోపడి ఆడజాతి మగజాతికి సహాయం చేస్తూ తన పత నాన్ని తానే తెచ్చుకుంటూ వుంది. ఓ నా అక్క చెల్లెళ్లారా! ఈ మోహాన్ని త్యజించండి. ముసుగులు తీసి పారెయ్యండి పురుషునికి వ్యతిరేకంగా సంఘ టితులై మీ నోరు విప్పండి పురుషుడు చేస్తున్న అత్యాచారాల్ని అంతం చేయా డానికి ఆడజాతి కంకణం కట్టు కోనంత వరకు వాళ్ళ అత్యాచారాలు మానిపోవు, ఇది నిశ్చయం."

సోఫామీద ఒకరిమీద ఒకరు కొద్దిగా వంగి సజ్జన్, కన్యా పుస్తకాన్ని చదువుతున్నారు. వనకన్య రాసిన వ్యాసం చివర ఓ చిన్న నోట్ వుంది. "సోదరి వనకన్య వ్యాసాన్ని ఎన్నికల పార్టీ రాజకీయ తంత్రం సంసారజంజ నాలకు కొంచెం అతీతులై పాఠకులు చదవాలనిమనవి చేస్తున్నాం. ప్రజలంతా ఈ విషయమై ఆలోచించాలని అందరినీ సవినయంగా ప్రార్థిస్తున్నాం. ఎలక్షన్లు నడుస్తున్నాయి. ఈ సందడిలో ప్రజలు ఏ న్యాయం కావాలని తహతహలాడు తున్నారో ఆ న్యాయాన్నే కుమారి వనకన్య తన ఈ రచన ద్వారా మ...ల్ని

కోరుతూంది. ప్రజలు ఈ విషయం గమనించాలని కోరుతున్నాం" కింద సంత కాలు చేసినవారు. మహిపాల్ శుక్లా, సజ్జన్ వర్మ, నగీన్‌చంద్ జైన్ పురవ్ కర్నల్ సాహెబ్.

పుస్తకం చదువుతోంటే కన్యకు వినోదం కలిగింది. సజ్జన్‌కు నవ్వూ కోపమూ రెండూవచ్చాయి. ఈ కర్నల్‌గారు ఎప్పుడూ ఇంతే. ఎలాంటి అతు కుల బొంత స్టేట్‌మెంటు అచ్చువేయించి కింద నాపేరూ, మహిపాల్ పేరువేస్తాడు అని అన్నారు సజ్జన్.

ఆ మాట విని నవ్వుతూ కుమారి వనకన్య "దానిలో ఆశ్చర్యం ఏముంది?....ఏమైనా అనండి కర్నల్ సాహెబ్ అద్భుతాన్ని సాధించాడు'' అంది.

సిగరెట్ నోట్లో వుంచి జేబులోంచి లైటర్ తీసి ముట్టిస్తూ ''క్రిస్మస్‌నాడు మీ ముందట వాడికిచ్చాను, మీరు రాసిన ఆ ఆర్టికల్‌ను. అంతే. ఇవ్వాళ సాయంత్రం వరకు నన్ను కలవలేదు. ఈ విషయంలో ఏమీ చెప్పలేదు. చర్చించలేదు''- అన్నాడు.

''మీకు చెప్పలేదా'' అంటూ కళ్లలో అపనమ్మకాన్ని వెల్లడిస్తూ మొహం అరోలా పెట్టింది, కన్య. విజయం సాధించామనే వుత్సాహంతో వురూగ్రితలూగు తోన్న ఆమె మనసు మైమరచి హృదయంలోని రహస్యాన్ని కళ్ళల్లో ఎగరేసి చూపింది. మంత్రించిన వ్యక్తిలా సజ్జన్ అలా చూస్తున్నాడు కన్యను. అంతర్యం లోని రహస్యంపై ఇన్నాళ్ళ నుంచి కప్పుకున్న ముసుగు ఇద్దరి సమక్షంలో తొలగిపోతూంది. ఈ అనుభూతిని నేను అనే ఇనప్పెట్టెలో భద్రించేసి మళ్ళీ పుస్తకం గురించి ప్రసంగాన్ని ఎత్తుతూ వనకన్య ''ఈ స్కెచ్ మీరు వేసినదే'' అని అంది.

అకారణంగా సజ్జన్ బిగ్గరగా నవ్వుతూ " ఈ పరిస్థితుల్లో ఇది కూడా కర్నల్ గీసిందేనని నమ్మటం వుచితం. నా స్కెచ్ బుక్కులోంచి ఎత్తుకపోయి నట్లుంది. దేవా, బటేశ్వర్, మిస్రిఖ్ పీటిలో ఏదో ఓ తిరునాళ్ళలో స్కెచ్‌లు

గిచినట్లు జ్ఞాపకం నాకు, నన్నడిగినట్లయితే నేను కొత్తగా మరో మంచిచిత్రాన్ని గీసి ఇచ్చేవాణ్ణే-"అన్నాడు.

"కాని ఇది కూడా బాగానేవుంది. చాలా డబ్బు కర్చుచేసి వుంటారు''.
''రూపాయలు వుండేదే అందుకు''

"ఎవరు మట్టుకు వారు తమకోసమే ఖర్చుచేసుకుంటుంటారు. కాని పరాయివాళ్ళకోసం ఖర్చుచేయాలంటే చాలాకష్టం. అందులో ఏదైనా ప్రయోజనం సిద్ధించాలన్న వుద్దేశ్యం కోసం డబ్బు ఖర్చు పెట్టాలంటే ఇంకా కష్టం''. కన్య లోకం తీరు చెప్పింది.

తానూ, తన మిత్రులూ-ముఖ్యంగా తమ-ఏదైనా ఒక కార్యం నెరవేరడానికి మనసావాచాకర్మణా సర్వస్వం ఒడ్డేందుకు ఎప్పుడూ వెనుకంజ వేయమని వనక్కకు చెప్పడం సజ్జన్ ఉద్దేశం. సోఫా చెయ్యిమీద రెండు చేతులూ చాస్తూ సజ్జన్ "నా జీవితంలో ఈ సిద్ధాంతానికే ఫస్ట్ ఇంపార్టెన్సు ఇచ్చాను. నా మనస్సు కూడ అంతటి విశాలమైన మనస్సు కలవారితోనే కలుస్తుంది. ఇలా వుందని చెప్పుకోవడం నాకేమీలబాయి వస్తుందనికాదు. ఆ మాటకొస్తే ప్రతి సామాన్య వ్యక్తిలో ఇలాంటి గుణం వుండి తీరాలి''.

ఎంతో సంతృప్తిచెందిన కళ్ళతో కన్య అతణ్ణి చూసింది. ఇప్పుడు అతణ్ణి చూస్తోంటే ఆమెకు సిగ్గుకలగడంలేదు. ఇంకా సాన్నిహిత్యమే పెరుగుతోంది. ప్రతిస్త్రీ, పురుషుడూ కావాలని కోరుకునే ఆధారం సజ్జన్ వ్యక్తిత్వంలో ఆమెకు కనపడుతోంది. కన్య చూపులో వున్న ఈ నిజాయితీయే సజ్జన్ అంతర్యంలో నిద్రిస్తున్న సత్యానికి కిచకిచలు పెట్టింది. ఈ పులకరింతలో అతనికి ఆనందం కూడా కలుగుతోంది, దానితోపాటు అవకాశం ప్రసాదించిన సవాలును ఎదుర్కోవాలన్న ధైర్యం కూడా కలుగుతోంది. కన్య సమక్షంలో వుండగా స్వాధీనం తప్పిపోతోన్న మనస్సును ఎన్నోసార్లు కట్టివేయాల్సి వచ్చేది. కన్య అతనివైపు నిశ్చలమైన ఆత్మీయతాభావంతో చూస్తోందని తెలిసి తనమాటల బరువునే తూచుకొంటూ సజ్జన్ జాగ్రత్తపడ్డాడు. ప్రసంగాన్ని మారుద్దామనే ప్రయత్నంలో

సజ్జన్—'మీ వ్యాసం చాలా బావుంది. ప్రజలపై దీని ప్రభావం తప్పక పడగల దని పందెం కడతాను" అన్నాడు.

తలవంచుకుని కన్య ఏదో ఆలోచిస్తూవుంది. సమాధానంగా ఆమె "ఏం జరుగుతుందో చెప్పలేకున్నాను. మనసులో మాట మీకు చెప్పాను. ఈ అఘాయిత్యం, ఈ అబద్ధాల కుంభ జిద్దులు కానంతవరకు మనస్సంతా క్షోభతో నిండిపోయింది. చిరాగ్గా కోపంగా వుంది. ఆ రోజు మనస్సులో ఎంత ఆర్తి నింపుకొని మీ వద్దకా వ్యాసం తెచ్చానో మీరు వూహించనైనా వూహించలేరు. ప్రథమంగా మీరు, తర్వాత కర్నల్ సాహెబు నాకు హామీ యిచ్చారు. అప్పుడు నా మనస్సు కుదుటపడింది. అప్పుడుకాని ఆలోచన రాలేదు ప్రపంచంలో అన్యాయం జరుగుతోందే దానిని ఎదిరించడానికి సాధనాలు కూడా వున్నాయన్న విషయం. నా కర్తవ్యం తీర్చుకొన్నాను అనిపిస్తోంది. ఇంత హడావుడిచేసి కేవలం నా అంతర్యంలోని నిజాయితీయే సంతృప్తిపడిందా లేక ఏమైనా ప్రయోజనం ఈ ప్రచారం వల్ల సిద్ధిస్తుందా? వేలజనం ఈ పేంప్లెంట్ చదువుతారు. నాలుగైదురోజులు ఎక్కడ చూసినా ఈ విషయంపైనే చర్చ జరుగుతుంది. కాని తర్వాత జరగబోయేదేమిటి? మళ్ళీ ప్రపంచం మామూలు గాడిలోనే పడి నడవడం మొదలెడుతుంది. దొంగసంతానం అంటూ పిల్లల్ని చంపుతుంటారు. లోకనిందను భరించలేక పురుషుడు చేసిన అఘాయిత్యానికి ఆడజాతి ఇలాగే ఆత్మహత్యలు చేసుకుంటూ బలిఅయిపోతూవుంటుంది."

తన ప్రియురాలిని (పెదిమలతో సజ్జన్ ఈ పదాన్ని ఉచ్చరించక పోయినా అతని మనస్సుకు అలాటి సంబోధనే ఇష్టం) వూరడించాలన్న భావంతో సజ్జన్ "లేదు. చివరి వరకు ఈ అన్యాయాన్ని కూకటివేళ్ళతో పెకలించే వరకు మేం విశ్రమించం" అన్నాడు ఉద్రేకంతో.

సజ్జన్ మాటల్లోనిబలాన్ని అతని కళ్ళల్లో అంచనావేస్తూ, వనకన్య మళ్ళీ దృష్టిమరల్చి ఒక దీర్ఘనిట్టూర్పు విడిచింది. "ఏం జరుగుతుందో చెప్పలేం. మన పొలిటికల్ పార్టీలన్నీ సమాజం నుంచి వేరయి అధికారం కోసరం పెనుగులాడుతున్నాయి"-అంది.

పెనుగులాడుతూ దాని వెనుకనే పరుగెత్తనివ్వండి. సమాజమే వాళ్లని హూట్ అవుట్ చేస్తుంది".

"హూట్ అవుట్ చేసినంత మాత్రాన వ్యవస్థలో మార్పురాదు సజ్జన్‌గారూ అరాచకం ఏర్పడుతుంది. అరాచకం సమస్యకు పరిష్కారంకాదు. సామాజిక చేతనాన్ని మార్చాలి. అది మార్పనంతవరకు ఈ అన్యాయాలు ఇలాగే సాగి పోతూ వుంటాయి రాజకీయాల్లోవున్న ఈటక్కరి వైఖరిని మనం ఏమని నిందించినా సమాజం అనే బండిని కంట్రోలు చేసే స్టీరింగ్‌చక్రం ఈ పాలిటిక్స్ కదండీ".

"నేను దీనికి ఒప్పుకోను. కల్చర్"...

"కల్చరనేది బండికి పెంట్రోలులా అవసరం. అది లేకుంలేదా బండినడవదు. కాని అంతమాత్రాన స్టీరింగ్ ప్రాధాన్యాన్ని మీరు కాదనలేరు. ఈ సెక్రటేరియట్, పోలీస్, మంత్రివర్గం ఏవీ లేకపోయినా ప్రతిపనీ సులభంగానూ చక్కగానూ చేసుకోగలిగినంతగా సంస్కృతినీ, సభ్యతనూ మన సమాజం జీర్ణించుకొననంత వరకు రాజకీయాల ప్రాధాన్యత ఇలానే జోరుగా వుంటుంది. అలాంటి పరిస్థితి రావడానికి ఇంకా కనీసం నూరుసంవత్సరాలైనా పడుతుంది. అప్పటివరకు పాలిటిక్స్ ప్రాధాన్యం కొనసాగుతూవుండవలసిందే".

కన్య మౌనంగావుంది. సజ్జన్ కూడా ఆలోచిస్తూ వుండిపోయాడు. ఆలోచనా మేఘాల్ని నిలదీసి చూస్తూ కన్య మళ్ళీ చెప్పడం మొదలెట్టింది—"మన రాజకీయ నాయకులు ఏ పార్టీకి చెందిన వారైనా సరే నూటికి తొంభై మంది సాంస్కృతిక దృక్పథంతో ఏసమస్యనూ ఆలోచించలేరు. సాంస్కృతిక దృక్పథాన్ని అలవాటు నేసుకోకుండా పాలిటిక్సులో స్పిరిట్యుయల్ ఫోర్స్ అనేది రావాలదని వాళ్లు ఫీల్‌కారు. ఆ ఫోర్స్ లేనంతకాలం పాలిటిక్స్ అధికార బూటకంగానే చలామణి అవుతూంటుంది.

"అంటే స్పిరిచ్యుయల్ ఫోర్సును మీరు అంగీకరిస్తారన్నమాట. కమ్యూనిస్టులు ఇవన్నీ ఒప్పుకోరని అనుకుంటూ వచ్చాను ఇంతకాలం"

"కమ్యూనిస్టులు ఒప్పుకోరనుకోండి. మిగతావాళ్లంతా కరక్టుగా ఒప్పుకొంటున్నారా?" అని నవ్వుతూ కన్య ప్రశ్నించింది. వెంటనే మళ్ళీ "ఆమాటకు కమ్యూనిస్టులూ ఒప్పుకుంటారు. కాని ప్రతివ్యక్తి, వర్గం ఒప్పుకొనే పద్ధతి వేరువేరుగా వుంటుంది. నిజంచెప్పాలంటే స్పిరిట్, ఆత్మ పరమాత్మ అనేవి ఏ శక్తిని సూచిస్తాయో నాకు తెలియదు. ఏదైనా మనోభావాన్ని ప్రకటించాలనుకొన్నప్పుడు మనం తప్పకుండ ఇలాంటి పదాల్ని వాడుతూవుంటాం" అంది.

"నాకు తెలుసు. కనీసం నాకు సంబంధించినంతవరకు నాకు తెలుసు." అని సజ్జన్ చెబుతూంటే కన్య అతణ్ణి నిదానించి చూసింది. సజ్జన్ చిన్నగా నవ్వుతూ కంఠంలో తియ్యదనం నింపుకుని-" నా స్పిరిట్, ఆత్మ, పరమాత్మ ఏమైనా అనండి-ఒక అడవి జాతి పిల్ల అనుకోండి" అన్నాడు.

సజ్జన్ వ్యాఖ్యకు వనకన్య ముఖం మీద తీవ్రంగా సంచలనం కలిగింది. ఆమెకు కనుపాపల్లోంచి ఆనందం వర్షించింది. కాని వెంటనే ఆమె నిగ్రహించుకుని తల దించేసుకుంది. నోరుమాత్రం మెదపలేదు.

గుమ్మం బయట కర్నల్, మహిపాల్ మాటలు వినపడుతున్నాయ్. దగ్గరగా మాట్లాడుకుంటూ ఇద్దరూ వస్తున్నారు. కర్నల్ మహిపాల్‌తో అంటున్నాడు-"గురూ, రేపు చూడు నగరంలో దీని ప్రభావం".

ఇద్దరూ గదిలోకి రాగానే చేతులు జోడిస్తూ వనకన్య నిలబడింది. మహిపాల్ ఆమెను తెచ్చిపెట్టుకున్న సంతుడనంతో చూశాడు. కర్నల్ మాత్రం ఆప్యాయతను కనబరుస్తూ నవ్వాడు.

"ఇవ్వాళ చేసిన అద్భుతం గురించి మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి" అని అడిగాడు కర్నల్.

కన్య సమాధానం ఇవ్వకముందే కర్నల్‌ను చూస్తూ సజ్జన్ అడిగాడు- "మిత్రమా ఎవరైన పెద్ద లాయరుంటే చెప్పు".

మహిపాల్ ఏదో చెబుదాం అని అనుకుంటూండగానే కర్నల్ అందుకున్నాడు-"లాయరా! ఆఁ! అవునవును! ఇప్పుడే ఫోను చేస్తా. ఏం పని?"

"420 చేసినందుకు మీమీద దావా వెయ్యాలి" ముఖాన్ని గంభీరంగా పెట్టి సజ్జన్ అన్నాడు.

"దొంగనాయాల అది మీద తప్పక దావావెయ్" అంటూ చటుక్కున మహీపాల్ ఆగిపోయి కన్యవైపు చూస్తూ "క్షమించండి. పొరపాటున అనరాని మాట అనేసాను" అంటూ క్షమాపణ చెప్పుకున్నాడు.

కన్య నవ్వేసింది. సజ్జన్ అందుకున్నాడు–"వీడు దానికి తగినవాడేలే. మన పేరుతో ఎలాంటి స్టేటుమెంటు ప్రచురించాడో, కొంచెం నువ్వు చూడు" అంటూ స్టూల్‌మీదున్న పేంప్లెట్‌ను అందుకుంటూ మహీపాల్‌కు ఇచ్చాడు. కర్నల్ బిడియంతో నవ్వడం మొదలెట్టాడు.

మహీపాల్ కూడా వంతపలికాడు- "దారిపొడుగునా వీణ్ణి బెదిరిస్తూ వచ్చాను, ఎలాంటి అవకతవక భాషావీడూను. పైగా నాపేరు తగిలించాడు"

"భాష చూడకండి, అతని ఆశయాన్ని చూడండి. భాషా తప్పులు పెద్ద పెద్ద సాహితీ వేత్తలే చేస్తారు. బాలముకుందగుప్తగారు, మహావీర ప్రసాద్ ద్వివేదీలాంటి గొప్ప విద్వాంసుల భాషలోనే దోషాల్ని వేలెత్తి జూపారు. ఈ రోజు వీరు లక్నో నగరాన్నే నిర్ఘాంత పోయేలా చేశారు, మనల్నీ, మిమ్మల్నీ అందరినీ అదిరి పోయేలా చేయడం ఏమంత సాధారణ కార్యమా?"

కర్నల్ ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. ఆర్భాటం చేస్తున్నట్టుగా– "దాలు- దాలు- దాలు! దీర్ఘాయుష్మంగా వుండండి. ఇప్పుడు నా తరపున ఈ మూర్ఖులకు ఇంట లెక్చ్యువల్‌గా సమాధానం యివ్వ గలిగిన వ్యక్తి లభించాడు. వీళ్ళనుకునేది కాయల్నికాదు. ఆకుల్ని, కొమ్మల్నినూ. పెద్ద ఆర్టిస్టని మళ్ళీ పోజు ఒకటి"

మహీపాల్ అడ్డుపడి- "సరేలే మీరున్నారు గనుక వీణ్ణి వదిలేస్తాను. మీరు రాసిన వ్యాసం చాల బాగుంది. మీరు బాగానే రాస్తారు".

నమ్రతగా కన్య కళ్ళు దించుకుని 'అచ్చుకాక పూర్వంతమకు చూపించా లని అను కున్నాను. చాలా తప్పులున్నాయను కుంటాను" అంది.

లేదండి, చాలా బాగా రాశారు. ఒక్కటే కొరత వుండి పోయింది. ఈ మూర్ఖుడు నాకు మొదటే చెప్పివుంటే మీ ఆర్టికల్‌కి సపోర్టుగా మాంచి స్టేట్ మెంటు రాసి ఇచ్చి ఉండేవాణ్ణి" అని అక్కసు వెళ్ళ బోసాడు మహీపాల్.

వెంటనే సజ్జన్ అందుకుని-" అదేగా నేనూ మొత్తుకునేది! ఏదికి ఏం శివం ఎత్తిందో ఎవరినీ అడగనైనా అడుగలేదు"!

"గురువుగారూ, ఇదేనండీ పాలిసీ అంటే. ఎన్నికల్లో పేంఫ్లెట్ వెయ్యాల్సి వుంది. మనం హేండౌట్ కాని పేంఫ్లెట్ గాని ఎప్పుడేం తీస్తున్నామో రెండోకంటికి తెలియకూడదు. అప్పుడేగా ప్రజల్ని మనం ఇంప్రెస్ చేసేది" అంటూ కర్నల్ దర్పంతో అన్నాడు

"ఇంప్రెషా నీపలనా....?"

"రేపు చూస్తూండు".

"లేదు. తప్పకుండా జనం ఇంప్రెస్ అవుతారు" అని కన్య అంటూండగా సజ్జన్ ఆమె మాటకు అడ్డొచ్చి "ఇప్పుడేగా మీరు అంటూంట ప్రభావం పడదని" అన్నాడు కన్యలో కంట్రాడిక్షన్ చూపిస్తున్నట్లు.

తనలో వచ్చిన కంట్రాడిక్షనుకు కన్య సిగ్గుపడింది. విసుగుదలను కొద్దిగా కనపరుస్తూ నవ్వుతూ సజ్జన్‌తో-"పోండి! మీరు నా మాటలకు పెడర్థాన్ని తీస్తున్నారు" అంది. అంతలోకే కర్నల్‌వైపు చూస్తూ "నేను వీరితో అన్న దేమిటంటే, వ్యర్థంగా ఇన్ని రూపాయలు ఖర్చుచేసారే అని, నాలుగురోజులు ప్రజలు మన విషయం గురించి ముచ్చటించుకుంటారు. మళ్ళీ యథాప్రకారం జరిగే అత్యాచారాలు జరుగుతూనే వుంటాయి" అంది.

కన్యను సమర్థిస్తూ మహీపాల్-"నిజంగా! సమాజాన్ని మార్చాలంటే ఎన్నో ఆచారాలూ, రివాజులూ, నమ్మకాలూ మార్చాలి. దీనికి పెద్దఎత్తున ఓ సంస్థను స్థాపించి వుద్యమాన్ని నడపాల్సివుంటుంది" అన్నాడు.

చాలాసేపు తర్జన భర్జన జరిగింది. కర్నల్, మహీపాల్ ఇక వెళ్దాం అని లేస్తే వాళ్ళను సాగనంపడానికి గుమ్మందాక వచ్చాడు సజ్జన్. "ఎంత ఖర్చయింది?" అని కర్నల్‌ని అడిగాడు.

"ఏం, పేమెంట్ చేస్తారా తమరు?"

"అవును"

మహీపాల్ వైపు చూస్తూ- "వింటున్నారుగా శ్రీమంతుని మాటలు" అన్నాడు కర్నల్. మళ్ళీ సజ్జన్ వైపు తిరిగి "బాబుగారూ, అప్పుడే ఏం ఖర్చయిందండీ. ఇంకా మీ డియర్‌కు వెయ్యి రెండు వేలు సమర్పించుకోనీయండి. అంతా కలిపి అప్పుడు బిల్లు పంపుతాను-లెండి". అంటూ వెక్కిరించాడు.

"అవునోయ్, పెళ్ళికూడా ఈ అమ్మాయినే చేసుకుంటాడనిపిస్తోంది. పిల్ల చాలా మంచిది. నాకు నచ్చింది" అని మహీపాల్ అన్నాడు.

మిత్రులు మాట్లాడుతోంటే సజ్జన్ లోలోపల వుప్పొంగిపోయాడు. నవ్వుతూ అన్నాడు-"మీరు నాకు ఆటోసజెషన్ ఇస్తున్నట్లుంది. నా వరకు నేను పాపం ఆ అమ్మాయికి నిస్వార్థంగా సాయం........"

"అవ్వనా, నువ్వు ఎంత నిస్వార్థపరుడివో నాకు తెలీదా" అని నవ్వుతూ కర్నల్ మళ్ళీ-"కాదు గురూ, ఈ అమ్మాయి నాక్కూడా నచ్చింది. కొద్దిగా కమ్యూనిస్టు అంతే. ఆమె కళ్ళే చెపుతున్నాయి శీలవతి అని".

వారిద్దరూ వెళ్ళిన తర్వాత సజ్జన్ కన్యను ఆమె యింటిదగ్గర దిగపెట్టడానికి వెళ్ళాడు. తనకు సహాయం చేస్తున్న సజ్జన్ పంచ వుండడం ఇష్టంలేక కన్య పదిరూపాయలకు చిన్నగది అద్దెకు తీసుకుంది. కార్లోంచి దిగుతోంటే జేబులోంచి ఓ కవరు అందిస్తూ సజ్జన్ అన్నాడు-దీన్ని మీ దగ్గర వుంచుకోండి".

"ఏమిటిది?"

"తీసుకోండి చెపుతాను"

"రూపాయలా?"

"అవును. అక్కరకొస్తాయి"

"వద్దండి"

"నేనుండగా మీరు కష్టాలు పడుతూండటం నేను భరించలేను".

"నాకేమీ కష్టం అనిపించడంలేదు".

"ఖర్చుకోసం మీ దగ్గర రూపాయలు వున్నాయా?".

కన్య మాట్లాడలేదు.

సజ్జన్ అన్నాడు—"మరి యివి వుంచుకోండి! నేను యిచ్చానన్న అవమానం కానీ ఏదో కృతజ్ఞత అనీ అనుకోవద్దు"

"క్షమించండి .. నమస్తే" అంటూ తలవంచుకుని వనకన్య తన గది వైపు మెల్లిగా నడుస్తూ వెళ్ళింది.

జీవితంలో మొదటిసారి సజ్జన్ రూపాయలు ఒక స్త్రీ ముందు ఓడిపోయాయి.

# 14

పెద్దమ్మ యింట్లో పిల్లికూనలు మూడూ గుట్టుచప్పుడు లేకుండా పెరుగుతున్నాయి. కళ్ళు తెరచినప్పట్నుంచీ ఒకచోట నిలకడగా వుండడంలేదు. వాటిని చూస్తోంటే పెద్దమ్మకు పోగొట్టుకొన్న ధైర్యం, జీవితేచ్ఛ తిరిగి దొరికినట్లయింది. తూముకు ఇటుక అడ్డం పెట్టింది. మెట్లదగ్గర తలుపుకు ఎప్పుడూ గొళ్ళెం పెట్టే వుంటుంది. గండుపిల్లి వచ్చి వాటిని ఎప్పుడు కొరుక్కుతుందోనన్న భయం. వాటిని కన్న తల్లినికూడ పెద్దమ్మ చూస్తూండగా లోపలికి రానీయదు. వందసార్లు కాపుకాచుకొనివుంటే ఎప్పుడో ఒక్క పర్యాయం లోపలికి దూరి వాటికి పాలివ్వడానికి దానికి అవకాశం దొరుకుతుంది. దాని ఖర్మంకొద్దీ పెద్దమ్మ కళ్ళల్లో పడిందంటే ముద్దుకర్ర తీసుకుని పెద్దమ్మ దాని వెంటపడి దాన్ని వెళ్ళగొట్టేదాకా నిద్రపోదు.

చీకటి గది గోడమీద నుంచి వచ్చి గంగాళం మీదకు దూకింది పిల్లి. దాన్ని చూడగానే పిల్లికూనలు మూడూ మంచం పట్టెమీద అతుక్కుని మ్యావ్

మ్యావ్ అనసాగాయ్. పిల్లి మంచంమీదకు దూకి పడుకుంది. కూనలు తల్లి దగ్గరచేరి పాలు తాగుతున్నాయ్. ఒకటైతే తల్లి వీపుమీదకెక్కి పాలు తాగుతోంది. మిగతావాటితో ఇరుక్కొని తాగే సందడిలో జారిగి కిందపడింది. మూడుకూనలు ఆనందాతిశయంతో తోకలాడిస్తోంటే తల్లికూడ వాటికి మమతను పంచుతూ తోకాడిస్తూ పడుకుంది.

పెద్దమ్మ పిల్లికూనలకోసం పాలు తేవడానికి బజారువెళ్ళింది. పాలు తీసుకొని వస్తూంటే దారిలో పరభూ మురహా తారసిల్లాడు. ఆకులు నములుతూ పిడికిలిబిగించి సిగరెట్ తాగుతూ, ఖలీఫా తమోలీ అరుగుమీద కూర్చున్నాడు. పెద్దమ్మ వాడి కంటపడగానే గభాలున అరుగుమీదనుంచి ఒక్కదూకులో ఆమెను చేరుకున్నాడు. ఆమె ముందుకు వచ్చి బైఠాయించి ఆమె కర్రను పట్టుకున్నాడు. పెద్దమ్మ గింజుకుంది. కుండలోంచి పాలు ఒలికాయి.

"పెద్దమ్మా! కాటికి కాళ్ళు చాచావ్ కదా, యింకా పాలూ యెన్నా నీకెందుకే? మాలాంటి పిల్లగాళ్ళు తాగాలి గాని, పాలకుండ కట్టిస్తేయ్ కర్ర వొగ్గేస్తా" అన్నాడు మురహా.

పెద్దమ్మకు ఒళ్ళుమండింది. మురహా "మళ్లా సూత్తున్నా. అదిగో మళ్లీ తిడుతున్నావ్, నరుకుతా సంపుతా అంటున్నావ్. నాకు కోపం వచ్చిందంటే సాం సెట్టోట్టి. నీకే నస్టవమ్మోయ్. పాలన్ని పారవోత్తా" అన్నాడు.

వాడి బెదిరింపుతో పెద్దమ్మ నిజంగా ఆలోచనలో పడింది. చాలారోజుల్నుంచి ఇటువంటి పరిస్థితిని ఆమె ఎదుర్కోలేదు. జీవితంలో బహుశా మొదటిసారి రణరంగంలో ఆమె ఓడిపోయి బలవంతంగా సంధి చేసుకోవాల్సి వచ్చింది. అయినా ఆమె కోపంగా అంది–"వదలా ముండకొడకా! పిల్లికూనలు ఆకలితో చచ్చిపోతోంటే"

"ఏం పెద్దమ్మ, మేం కాక నూకోరన్నారే పిల్లా పీనూ? ఓరై నాన్నంటే నానుకూడ నీపిల్లోణ్ణే. ఒరేయ్, వినండ్రా, పెద్దమ్మ నాన్ను దత్తు సేసుకుంది ఈమె ఆస్తంతా మనది. సచ్చింతరోత కానీ బతికుండగాకానీ".

వాడి మాటలు విని రోడ్డుమీద కొట్లవాళ్ళంతా-కంసాలీ, దర్జీ, చిల్లరకొట్టా యనా, కిళ్ళీషాపువాడూ, మిఠాయి అంగడాయనా అంతా పకపకా నవ్వుతున్నారు. రోడ్డు మీద నడుస్తోన్న జనం ఈ వింత దృశ్యాన్ని చూసి నోటికిగుడ్డ అడ్డం పెట్టుకుని మెల్లిగా నవ్వుకుంటూ వెళుతున్నారు. నాలుగుమూలలూ అందరూగేలి చేస్తున్నా పాలు చేతిలో వున్న కారణంగా పెద్దమ్మ ఏమిచేయలేనట్టుగా నిలబడి చూస్తూవుంది. ఆమె తిట్లు తిట్టడం మానేసి కొలిమిలో కాలుతోన్న ఇనుంలా కరిగిపోతూవుంది

హఠాత్తుగా ఆమె కర్ర వదిలేసి ముందుకు సాగింది.

పెద్దమ్మ కర్ర వదిలేసి వెళ్ళిపోతుందని పకభూ మురహా ఊహించలేక పోయాడు. ఎవరూ పట్టుకొనేవాళ్ళు లేక కర్ర కిందపడింది. మురహాను ఎవరో గట్టిగా తిదిలించినట్లయింది. వాడు లేచి కర్రనందిస్తూ పెద్దమ్మతో అన్నాడు "ఓ పెద్దమ్మో! ఇదిగో నీ కర్ర తీసేసుకో"

దూరంగా వెళ్ళి పెద్దమ్మ తీక్షణంగా మురహా వైపు చూసింది. "ఇంటికొచ్చి మర్యాదగా కర్ర యిచ్చి వెళ్ళు. లేకపోతే రేపు పొద్దునకల్లా నీ వంశాన్ని నాశనంచేస్తా!" అంది.

పెద్దమ్మ పెట్టిన శాపం వాడి గుండెకు గుచ్చుకొన్నట్లయింది. ఎగతాళిని మరచిపోయి అతనికి భయం వేసింది. కానీ చుట్టూ వున్న వాళ్ళంతా చూస్తొన్నందువల్ల వాడికి అభిమానం పొడుచుకొచ్చింది. [illegible]తో నవ్వుతూ అన్నాడు. "పో పోవే, రేపు కదా నువ్వు నా వంశాన్ని నాశనం చేస్తువ్. నిన్నిప్పుడే సఫా చేస్తాను నేను. ఇదుగో నీ కర్ర. కావాలంటే తీసుకో లేకపోతే ఒగ్గేయ్. నేను మాత్రం తీసుకొనిరాను. చెవులు పెట్టుకొని విను. ఓ పెద్దమ్మోయ్".

పెద్దమ్మ హనుమాన్ అరుగుదగ్గర చేరుకొని తన ఇంటివైపు మలుపు తిరిగింది.

కొట్లవాళ్ళంతా వాడికి నచ్చచెప్పారు కాని వాడు బిర్రబిగుసుకున్నాడు. ఓ వయస్సుడైన కంసాలాయన కర్రతీసుకెళ్ళి పెద్దమ్మకిచ్చిరమ్మని కొడుకును పంపాడు.

గొణుక్కుంటూ పెద్దమ్మ ఇంట్లోకి వచ్చేసరికి పిల్లి పాలిస్తున్నదల్లా ఒక్క గంతేసి మంచం కిందకు పోయింది. ఇందాక తల్లిపాలు తాగుతూ కింద పడిపోయిన కూన నడవాలో పెద్దమ్మను చూడగానే సన్నగా మ్యావ్ అంటూ ఆమె దగ్గరకు పరుగెత్తింది. నక్క మంచం మీద పాలు తాగి పొర్లాడుతోన్న మిగతావి రెండూ మూడోకూన అరవడం చూసి వెంటనే మంచం చివరకు వచ్చేసాయ్. ఇప్పుడు పాలు తాగే వేళ అని ఈ పది పన్నెండు రోజుల అనుభవంతోనే వాటికి తెలిసిపోయింది. నడవాలో వున్న కూన పరుగెత్తుతూ చిన్న అరుగుమీద నుంచి పడింది. మళ్ళీ అక్కణ్ణుంచి ముంగిట్లోకి చేరుకుంది. మంచంమీద వున్నకూనల్లో ఒకటి ఫీట్సు చేస్తూ కిందపడి పరుగెత్తింది. మూడోది మాత్రం కిందపడడం చేతకాక పై నుంచే అరుస్తోంది.

రెండు కూనలూ అరుస్తూ ముంగిట్లోకి వచ్చి పెద్దమ్మ కాళ్ళను మూతితో రాయడం మొదలెట్టాయి. ఆమె కదలడమే కష్టమైపోయింది. భగ్గునమండుతోన్న శరీరం ఆకూనల స్పర్శ తగిలేసరికి చల్లబడింది. ఆరెంటికోసం కొంచెం పాలు కిందపోసి వాటిని విడిపించుకుంటూ నడవాలోకొచ్చింది. స్తంభానికి ఆనించి పెట్టిన అల్యూమినియం మూకలో కుండలోంచి పాలు పోసి పెద్దమ్మ నడవాలో వున్న రెండు కూనల్ని ఎత్తుకొని తెచ్చింది మళ్ళీ మంచం మీదున్న మూడో దాన్ని ఎత్తుకొని తెచ్చి పాలగిన్నె దగ్గర వుంచింది.

ఇంతలో తలుపును ఎవరో తడుతున్నట్లయింది. నరవాసన తగలగానే పెద్దమ్మ మళ్ళీ మండిపడింది.

"పెద్దమ్మా, నీ కర్ర తీసుకెళ్ళు, ఓ పెద్దమ్మా" అంటూ బయటి నుంచి ఎవరో అరుస్తున్నారు. గోడకిటికీలోంచి కాసిని నువ్వులు చేతిలోకి తీసుకొని తిట్లు తిట్టుకుంటూ గుమ్మంవైపు వెళ్ళింది

పరభూ మురహరి అనుకొని పరసోత్తమ్ సునార్ అబ్బాయిమీద పెద్దమ్మ నువ్వులు మంత్రించి చల్లిందనీ ఆ అబ్బాయికి అప్పట్నుంచి సుస్తీ చేసిందనీ బజార్లో అంతా అనుకుంటున్నారు. ఎవరెవరినో భూతవైద్యుల్నీ, డాక్టర్లనూ

పిలిపించి వైద్యం చేయిస్తున్నారనీ వారికి ఇంకా నెమ్మదింత లేదనీ ఎవరినోట విన్నా అదేమాట. భభూతీసువార్ దుకాణం మూసి వంటవాని నెత్తిమీద దినుసుల పెట్టె పెట్టి సందులోకి వస్తున్నారు బల్లెం చేతిలో వుచ్చుకొని చౌకీదార్ అతని వెంట వస్తున్నారు. సందులోకి రాగానే ఈ గొడవ అతని చెవుల్లో పడింది. పరస్తోత్తం అంగడి దగ్గర నిలబడి అతని తమ్ముణ్ణి పిల్లాడికెలా వుందని కుశల క్షేమం అడిగాడు. పరస్తోత్తం అంటే సానుభూతివున్న ప్రతి వ్యక్తి పెద్దమ్మను ఛీ ఛీ, అనడం మొదలెట్టారు "ఇంటికెళ్ళి వచ్చే పక్షంలో మళ్లీ నీదగ్గర కొస్తా" అన్నాడు భభూతి.

భభూతి ఇంట్లో నందో, పెద్ద కోడలు తప్ప ఎవరూ లేరు. చిన్నకోడలు, ఆమె భర్త శంకర్ రెండో ఆట సినిమాకు వెళ్ళారు. మరిదిగారు చనిపోతే పలక రించి వద్దామని భభూతి భార్య కాన్‌గంజ్ వెళ్ళి ఆరు రోజులైంది. తనకు తోడుగా ఉద్దండపిండమైన మనుమణ్ణి గూడా వెంట పెట్టుకుని వెళ్ళింది. సరుకు తీసుకు రావడానికని మనియా కలకత్తా వెళ్ళారు.

దొంగతనం బయటపడి మనియా చేతిలో దావు దెబ్బలు తిన్న నందో ఇంట్లోంచి బయటకు అడుగు పెట్టడమే మానేసింది. గోమతికిగాని, గుళ్లోకిగాని, పెద్దమ్మ ఇంటికిగాను ఆమె రాకపోకలు ఆగి పోయాయి. మొదటి రెండు రోజులైతే తన గదిలోంచి బయటికే రాలేదు. తర్వాత నెమ్మదిగా ఇంటిపనుల్లో తోక్యం చేసుకోవడం ప్రారంభించింది అమ్మను కదిలించింది కాని ఆమె ఎడ ముఖం పెడముఖంగా వుంది. మనియాను మంచి చేసుకోవాలన్న వుద్దేశంతో అతని పిల్లల్ని దగ్గిరకు తీయడం, ముద్దాడడం మొదలెట్టింది. మనియా స్నానం చేస్తూండగా అతని ధోవతి, కండువాను అడక్కుండానే వుతికి ఆరేయ సాగింది. ఇంతలో సొంత మరిది మరణించాడన్న వుత్తరం రాగానే అమ్మ కాన్‌గంజ్ వెళ్లిపోయింది. అమ్మ ఊరికి పోగానే నందోకు కొంచెం జంకు తగ్గింది. ఇంటి పనుల్లో వదినలకు సాయం చేయడం మొదలెట్టింది. చిన్న కోడలుకైతే ఇంటి పనులు చేయడానికి తీరికే దొరకదు. ప్రొద్దున్నే మొగుడికి టీ పెట్టివ్వాలి. తర్వాత హైస్కూలుకోర్సుకు పాఠాలు చదువుకోవాలి. తర్వాత భర్త ఏమైనా

హోమ్‌వర్క్ యిస్తే అది చెయ్యాలి. ఆతర్వాత తారతో గప్పాలు కొట్టాలి. ఇలా ఎన్నో ఎన్నో పనులతో ఆమె సతమతమౌతూంటుంది. అందువల్ల అత్తగారు వూరికిపోగానే ఇంటిభారం అంతా పెద్దకోడలు మీదపడింది. మనియా గూడ ఆమె బాధ్యతకు కొంతవరకు కారణం. ఈ కారణంగా నందో పెద్దకోడలుకు చేదోడు వాదోడుగా వుండటానికి అవకాశం చిక్కింది. చిన్న మేనకోడలుకోసం ఆమె స్వెటర్ కూడా కుట్టింది. పెద్దకోడల్నడిగి కొత్త కొత్త రకాల కుట్టు కూడ నేర్చుకోవడం మొదలెట్టింది.

"తలుపుతీయ్" అని భభూతి గుమ్మంలోనిలబడి అరుస్తోన్నప్పుడు నందో, పెద్దకోడలు మంచంమీద కూర్చొని బాతాఖానీ కొడ్తున్నారు. నందో చిన్నమేనకోడలు వుయ్యాల్లో నిద్రపోతోంది. రేడియో మోగుతోంది. సినిమా రికార్డులు వస్తున్నయ్.

భభూతి ఇంట్లోకి రాగానే పెట్టెను గదిలో పెట్టించి గదికి తాళం వేసాడు భోజనం చేసి తలుపు వేసుకోమని కూతురికి చెప్పి, పరసోత్తం పిల్లాడి పరిస్థితి ఎలా వుందో కనుక్కుందామని బయటికి వచ్చాడు.

ఇంక నిశ్చింతగా పెద్దకోడలు, మూడో అంతస్తులో వున్న పతగ్గదికి వెళ్ళింది. ఆమె వెంట నందో కూడా వెళ్ళింది. వున్నట్టు వుండి నందోకు మిఠాయి తినాలనిపించింది. పెద్దకోడలు డబ్బులిస్తానన్నా వారించి తన గది లోంచి డబ్బులు తీసుకుని నందో సందులోకి వచ్చింది. ఎదురుగా వసారాలో పక్కపరచుకుని కూర్చున్న నౌకర్ని పిలిచింది. వాడికామాట యీ మాటచెప్పి తినడానికి మిఠాయి, కొద్దిగా కారా, అర్ధశేరు పాలు తెమ్మనమని బజారుకు పంపింది. పిల్ల ఒక్కర్తేపైన ఒంటరిగా నిద్దరపోతున్నదని పెద్దకోడలు పక్కి మేడమీదకు వెళ్ళిపోయింది. మిఠాయిలు తీసుకెళ్దామన్న వుద్దేశ్యంతో నందో కిందనే వుండిపోయింది.

నిన్నటి రాత్రి నుంచి ఒంటరితనం కారణంగా నందో పెద్ద వదిన దగ్గిరే పడుకుంటోంది. అమ్మ వూరికి వెళ్ళినప్పట్నుంచి పెద్ద వదినంటే నందోకు

ఎక్కువలేని ప్రేమ పుట్టుకొచ్చింది. కొత్తగా పెళ్ళిచేసుకుని ఒదిన ఇంటికివచ్చిన ప్పుడు కూడా ఆమె ఇలాగే ప్రేమ ఒలకపోసేది. అయితే ఈసారి కిందటిరెండు పర్యాయాలకన్న మరింత ఎక్కువగా చెప్పలేనంతగా ప్రేమ చూపించటం మొదలెట్టింది నందో.

మనియా సంపాదనాపరుడు అతనితో ఏ విధంగానూ విరోధం తెచ్చు కోవడానికి ఆమె సిద్ధంగాలేదు. దానికి తగ్గట్టు మనియా భోళా మనిషి. ఏకొంచెం పొగిడినా కరిగిపోతాడు. పెద్దామెకు వివాహం అయిన కొత్తలో భార్య అంటే పడిచచ్చేవాడు మనియా. ఆమె కూడా ఒదిన అంటే ప్రేమ కురిపించేది. కాని కొన్నాళ్ళ తర్వాత సంతో కోరల్తో మనియాకు బాదరాయణ సంబంధం కుదర్చ టంలో నందో కృతకృత్యురాలైన్నా టినుంచి పెద్దామెకు బద్ధశత్రువైంది. పాపం పెద్దామె మీద ఎన్ని అత్యాచారాలు చేయించాలో అన్నీ చేయించింది. మళ్ళీ మనియా కొంచెం దారికిరాగానే వదినా ఆడబిడ్డల మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమం టోంది. మనియాకు జ్ఞానోదయం కాగానే నందో చేస్తున్న అఘాయిత్యాలంటే అతనికి అసహ్యం ఏర్పడసాగింది. చెల్లెలు తంపుల మారితనాన్ని మాన్పించాలని ప్రయత్నం చేసాడు. అది చూసి నందోకు మనియా అంటే కోపం వచ్చింది. తండ్రిదగ్గ ఆమెకు గారాబం. అన్నా చెల్లెళ్ళ ఇద్దరి గుట్టుమట్టులు తెలిసివుండి కూడ పైకి చెప్పేవారు కాదు ఆయన. ఆ కారణంగా నందో అంటే మనియా ఈసడించుకునేవాడు సంబంధంలేనట్టుగా నటించేవాడు. ఇద్దరి పాపాలు మొన్న మొన్నటివరకు సమానంగా తూగుతూవున్నాయి. నందోచేసిన సరికొత్త పాపంతో ఆమె వైపు త్రాసుమొగ్గు చూపింది. ఆరోజు గదిలో సోదా చేస్తానన్న నెపంతో అతను నందోను బాగా అదిలించాడు, బెదిరించాడు. ఆమె పెట్టెలోంచి ఫోటోల అల్బమ్ బయటపడగానే సింహమైపొయ్యాడు. ఆమెను బెదిరిస్తూ జడిపించాడు. "ఈఫోటోలు అందరికీ చూపించి నీవు తలెత్తుకోకుండా చేస్తా. నువ్వు నాకు వ్యతిరేకంగా ఎన్ని చెప్పినా నమ్మేవాళ్ల లేరు. జాగ్రత్త. నా జోలికి వచ్చావంటే కొప్పుపట్టుకుని బయటకీడుస్తా. నీ తండ్రి కూడా నన్నేం చేయలేరు సుమా" అంటూ అరిచాడు. తన జుత్తు మనియాకు చిక్కగానే నందో కుక్కినపేనులా

ఎంతో మంచిదానిలా ప్రవర్తించడం మొదలెట్టింది. ఇంట్లో పోయిన తన గౌరవం పెరగాలని పెద్ద ఒదినగారితో స్నేహం పెంచుకోసాగింది. చిన్నాయన మరణించడంతో ఆమె గ్రహాలు ఒకసారి మంచిరాశిలో కొచ్చాయి. పెద్దామెతో ఒంటరిగా వుంటూ వుండడం మనియాను ఏదో విధంగా సంతోషపెడుతూ వుండడానికి ఆమెకు చక్కటి అవకాశం దొరికింది.

రాత్రి ఆడబిడ్డా పెద్ద ఒదినా ఇద్దరూ ఒకే చోట పడుకున్నారు కూడా. నందో అంటే పెద్దామెకు కూడా ఎంతో అప్యాయత ఏర్పడింది. పొద్దున్న చిన్నామెతో నందోనుసమర్థిస్తూ పెద్దామె అంది-"నందో పైకి కనపడుతున్నంతగా చెడ్డదికాదు. మనతో కలుపుగోలుగా తిరిగితే ఆమె బాగుపడడానికి ఎంతో కాలం పట్టదు."

పాలూ, మిఠాయి, కారా తీసుకుని నందో పైకి వచ్చింది. పెద్దామె అంత పెద్ద ఇంటికి తానొక్కటినే రాణిని అన్నట్లు హుషారుగా విరహేష్ రచించిన గజల్ పాడుతోంది.

సిర్ సే కఫన్ లపేటి నికలే హైఁ ప్యార్ కర్‌నే
నజరోం కో దార్ కర్‌కే మీఠా గునాహ్ కర్‌నే.

[నెత్తిమీద ముసుగేసుకుని ప్రేమించడానికి బయలు దేరాం
దారదేసి కళ్లతో తియ్యని పాపాలకు పూనుకున్నాం]

వదినా ఆడబిడ్డలూ అరమరికలేకుండా అన్నీ మాట్లాడుకున్నారు. ఇవ్వాళ ఆడబిడ్డతో మాట్లాడరాని విషయాలు మాట్లాడుతోంటే పెద్దకోడలు వళ్ళు పులకరిస్తోంది. చిన్నతనం నుంచి ఈరోజు వరకు తనఅనుభవాలన్నీ పూసగుచ్చినట్లు వదినగారికి చెప్పింది నందో. పెద్దామె కూడా తన మనసులోని అప్‌టూడేట్ అకౌంట్ చూపించేసింది ఆడబిడ్డకు.

నందో గురించి స్వయంగా వాళ్ళమ్మే ఎన్నోసార్లు చెప్పింది-"నూతులంకూ సముద్రాలకూ లోతు కనుక్కోవచ్చు కాని నందో కడుపులో లోతును కనిపెట్టడం కష్టం" అంటూ. కాన్‌గంజ్ వెళ్ళేముందు అత్తగారు ఇద్దరు కోడళ్ళనూ పిలిచి

నందోపట్ల జాగ్రత్తగా వుండమని మరీ మరీచెప్పింది. చిన్నకోడలు చాతుర్యం కలది. కాని పెద్దకోడలు ప్రవాహంలో కొట్టుకుపోయేరకం. నందో అదృష్టంవల్ల ఇద్దరి స్వభావాల్లో ఒకపోలిక కుదిరింది.

ముఖానికి ముఖందగ్గిరగా పెట్టి ఒకరి వూపిరి ఒకరుపీల్చు కొంటున్నట్లుగా మోచెయ్యిమీద తల ఆనించి, మహానందంగా మాట్లాడుకుతున్నారు వాళ్ళిద్దరూ. శ్రీరామజానుల్లాంటి ఎన్నో కథలు తనవీ పొరుగువాళ్ళవీ రకరకాలుగా చిలువలు వలవలు కల్పించి చెప్పి పెద్దామె నరనరాన్ని పసిగట్టేసింది నందో. తను తార్చుడు వుద్యోగం చేస్తానని నందో స్పష్టంగా చెప్పేసింది. అలా చేయడాన్ని సమర్థించింది కూడ—"మగముండాకొడుకులు పాడుపనులు చేస్తూంటే ఆడవాళ్ళు ఎందుకు చెయ్యకూడదు? భగవంతుడు ఏ ఆడదానికన్నా అందచందాలు ఇస్తే నాలుగైదుసొమ్ములు ఎందుకుచేయించుకోకూడదు? ఆడది మగాణ్ణి ఎలాంటిపరిస్థితిలోనూ నమ్మరాదు. మన ఒళ్ళంతా సొమ్ముల్తో నింపుకోవాలి మనం చేసే ప్రతి పని ఎదిరి కంటివానికి కూడా తెలియనట్లు వుండాలి. మనం ఏం సంపాదించినా, ఈచేత్తో పెడ్తే ఆచేతికూడా తెలియకుండా దాచుకోవాలి".

ఇంతలో తండ్రి వచ్చాడు. నందో వెళ్లి తలుపు తీసింది. తండ్రి తలవద్ద హుక్కావుంచి వచ్చింది. మళ్ళీ పెద్దామె దగ్గరకొచ్చి శృంగారంలో పడింది.

మాటల సందర్భంలో పెద్దామెకు కావాలంటే ఎవరితోనైనా సంబంధాన్ని కుదర్చగలను అని కూడ ప్రస్తావించింది. మూడోకంటికైనా తెలియకుండా తాను తార్చగలను అని గొప్పలు చెప్పుకుంది. ఇద్దరూ కలిసే ఏర్పాటు తాను చేయగలనని ప్రియుడు ఇచ్చిన కానుకల్లో నాల్గోభాగం తనకు ఇస్తే చాలునని నందో చెప్పింది. పెద్దామె నందో మాటల వలలో చిక్కుకుంది. రాబోయే ఫలితాన్ని వూహించుకోకుండా విరహేవ్‌ను తాను ప్రేమిస్తున్నట్లు చెప్పేసింది. నందోకు కావల్సింది దొరికింది. పెద్దామె ఆయువుపట్టు ఆమెకిప్పుడు లభించింది. అదే సమయంలో డాబామీద ఎవరో నడుస్తున్న అలికిడి అయింది. భయంతో ఇద్దరూ బిక్కచచ్చి పోయారు. పెకలించలేని కంఠంతో నందో "శంకర్.... శంకర్"

అంటూ పిలిచింది. కాళ్ళ చప్పుడు పిల్ల దాబామీదనుంచి నెమ్మదిగా పెద్దమ్మ ఇంటివైపుగా వెళ్ళి పోయింది.

పిల్లి కూనలపై దుప్పటి కప్పి పెద్దమ్మ నోరు తెరుచు కుని గుర్రుపెట్టి నిద్రపోతోంది. ఈ మధ్య పెద్దమ్మకు అలస్యంగా గాని నిద్ర రావడంలేదు. పిల్లి కూనల మూలంగా ఆమె పని ఇబ్బదై పోయింది. ఇంటినంతా మురికి మురికి చేసేస్తాయి కూనలు. విసుక్కొంటూ పెద్దమ్మ ఇంటినంతా మళ్ళీ కడిగి తుడు స్తుంది. పిల్లి కూనలు పెద్దమ్మను భలే విసిగిస్తాయి. పూజ చేసుకోవ డానికి కూర్చున్నా, జపం చేసుకుంటున్నా ఆమె ఒళ్ళోవచ్చి వాలుతాయి, ఎక్కణ్ణుంచో. పాలు తాగే వేళకు మ్యావ్ మ్యావ్ అంటూ పాలు పోసేదాక మొత్తుకుంటాయి. రాత్రి ముసుగు తన్ని పెద్దమ్మ పండుకుంటే దాలు ఆమె పొట్టమీద, గుండెల మీద కుప్పి గంతులువేస్తూ కురుక్షేత్రాన్ని సృష్టిస్తాయి.

ఇవ్వాళ పిల్లి కూనలకు అన్నం తినిపిస్తూ పెద్దమ్మ అమాంతంగా ఒక దాన్ని చేతుల్లోకి తీసుకుంది. దాని కళ్ళల్లో తన కళ్ళుపెట్టి చూడ సాగింది– దాని కళ్ళల్లోంచి కిష్టయ్యను చూస్తున్నట్లుగా.

అంతే. పెద్దమ్మ మనస్సంతా భక్తిభావంతో నిండి పోయింది. దాన్ని వాత్సల్యంతో గుండెకు హత్తుకుంది. మూడింటినీ మంచం మీద పడేసి దుప్పటి కప్పి జపం చేసుకుంటూ చేసుకుంటూ అలాగే నిద్ర పోయింది.

ఎవరో గుంజినట్లు అనిపించగానే ఆమె కళ్ళు తెరచింది. ఆమె నోట్లో ఎవరో గుడ్డ కుక్కారు. తల పాగాలు కట్టుకొన్న ఇద్దరు గుంట కళ్ళోళ్ళు పెద్దమ్మ జబ్బల్ని గట్టిగా అదిమి పట్టు కున్నారు. ఆమె పైవున్న దుప్పటిని లాగి విసిరేసారు. పిల్లి కూనల్ని క్రూరంగా అలానే కింద పడేసారు. చిలకకు తగిలించిన ఎర్ర కాలువ తీసి దానిలో పెద్దమ్మను పెద్ద తాడుతో కట్టేశారు. ముఖాన్ని మాత్రం బయటకు వుంచి నోట్లో గుడ్డ తురిమి చెవుల దాకా బిగుతుగా కట్టు కట్టారు.

ఆమె చూస్తుండగానే ఇంట్లో ప్రతి వస్తువునూ తీసి గిరవాటెస్తూ యిల్లు యావత్తూ చిందర వందర చేశారు. తిను బండారాలన్నీ తినేసి కావలసిన సామాన్లు మూటకట్టు కున్నారు. డబ్బూ దస్కం కోసం పెద్దమ్మ యింటిని గాలిస్తోంటె ఒక దొంగాడికి పెద్దమ్మ చేతబడి పెట్టె దొరికింది. వాడు ఎంతో అప్యాయంగా దానిలోంచి గంగ సింధూరం తీసుకుని అక్కడే వున్న నెయ్యిలో పోసి కలిపాడు. పెద్దమ్మ ముఖం అంతా ఆ సింధూరాన్ని పులిమి, కాటుకతో నల్లటి చారలు ఆమె ముఖాన్నిండా గీసాడు పెట్టెలో నువ్వులు, జవలు వున్నాయి. వాటినేం చేయాలో తోచక ఇంటినిండా పారపోసి రూపాయల సంచీని ఖనఖనమని మోగించు కుంటూ ఎగరేసు కుంటూ వెళ్ళి పోయారు.

మంచం దగ్గర పిల్లి కూనలు భయంతో ముడుచుకుపోయి దిక్కు తెలియక మెల్లిగా మ్యావ్ మ్యావ్ మంటూ అరవడం మొదలెట్టాయి.

# 15

వనకన్య తన జీవితంలో ఇంత తొందరగా ప్రవేశిస్తుందని సజ్జన్ వూహిం చలేక పోయాడు. తీరా తాను అనుకొన్న దానికంటే ముందుగానే అతని మనో మందిరంలో ఆమె ప్రవేశించే సరికి అతను వాస్తవానికి గాభారా పడ్డాడు. ఇంతకు ముందు కూడా అతని జీవితంతో ఎన్నో బంధాలు ఇంతకన్న త్వరగా పెనవేసు కోడం జరిగింది. కాని అవన్నీ కలిపి ఒకఎత్తు. ఇది ఒక్కటీ ఒకఎత్తు అతను ఎంతో మంది ఆడ వాళ్ళతో కలిసి తిరిగాడు, వాళ్ళ జ్ఞాపకాల్ని దిండుగా చేసుకుని ఇప్పటి వరకు జోగుతూ వచ్చాడు. కాని వనకన్య వాళ్ళందరి మాదిరి కాదు. విలక్షణమైంది. కన్య అతణ్ణి ఆకర్షిస్తూ కుదిపి వేస్తుంది. మొదటి కలయిక లోనే కన్య అతనికి ఓ గీటురాయిగా తోచింది. అతని స్నేహితులు అతణ్ణి ఎగ తాళిచేస్తూ కన్యతోనే అతనికి వివాహం అవుతుందని జోస్యం చెప్పారు. అతను కూడా ఇంచు మించుగా అదే ఒరవడిలో ఆలోచిస్తున్నాడు. అలా ఆలోచించ లేకుండా వుండడానికి మరి ఏ ఆధారమూ అతనికి కనపడడం లేదు. కన్యవైపు

అతనిలో పెరుగుతున్న ఆకర్షణకు అతను ఏరకంగా నిష్కృతి ఇవ్వ గలడు? కన్య కూడా అతని మాదిరిగానే ఆలోచిస్తూందా? తన వల్ల లాభం పొందుదా మనే వుద్దేశ్యం పెట్టుకొని తీరా ఆమె పనులన్నీ నిర్వహించు కొన్నాక తనను వంచించి వెళ్ళిపోదు కదా! అన్న సందేహం అప్పుడప్పుడు సజ్జన్‌ను పీడించటం మొదలెట్టింది.

మొన్న రాత్రి కర్నల్ చేసిన అద్భుతానికి వనకన్య, కీర్తి సౌధం శిఖరం మీదకి ఎక్కి కూర్చుంది. సన్న హృదయం దేశంలోని ప్రముఖవార్తా పత్రికలన్నీ విమానాల మీద నుంచి పేంఫ్లెట్లు తల్లిన ఉదంతం గురించి రాస్తూ వనకన్య వ్యాసం గురించి చాలా వ్యాఖ్యానాలు చేశాయి. నగరంలోని పత్రికలైతే ఈ సంఘటన గురించి చాలా విస్తారంగా పేర్కొంటూ దీనికెంతో ప్రాధాన్యం వున్నట్లు చిత్రించాయి. మరునాడు తన పేరు నగరంలో ఎంతగా పాకి పోయిందీ వనకన్య చూసింది. పరిచయం వున్న అనేక మంది వ్యక్తులు ఆమె సాధించిన ఈ అద్భుతానికి అభినందనలు తెల్పడానికి వచ్చారు. పత్రికా సంపాదకులు ఆమెను ఇంటర్వ్యూ చేసారు, ఆమె ఫోటో తీయడం కోసం రిపోర్టర్లు ఎగబడ్డారు. ఈ కోలాహలం అంతా చూస్తుంటే వనకన్యకు ఎక్కడలేని వుత్సాహం, ఆనందం వెల్లివిరిసాయి. పగలంతా ఎంగేజిమెంట్లతో బిజీగావుంది. కొంచెం తెరపి దొరికిన తర్వాత సజ్జన్‌కు ఆమెతో ఏకాంతంగా వుండడానికి అవకాశం చిక్కింది. వన కన్య మారినట్లు కనిపించింది. ఆమె తనను కావాలని తప్పించుకు తిరుగు తోన్నట్లు గానూ, మాట్లాడడం తగ్గించి వేసినట్లు గానూ, కలవడం తప్పని సరై నప్పుడు ఏదో సాకు చెప్పి తనను వదలించుకుని వెళ్లాలనే తొందరలో వున్నట్లు గానూ సజ్జన్ గ్రహించాడు. సజ్జన్‌తో కార్లో కూర్చుని షికారుకు రావ డానికి నిరాకరించింది. ఒంటరిగానే వెళ్ళింది. ఆమెతో కలిసి కార్లో తిరగాలని సజ్జన్‌కు చాల కోరికగా వుంది. ఇద్దరూ కలిసి కార్లో వెళ్తతోంటే రోడ్లమీద, కాఫీ హోటల్లోనూ, అందరూ తననీ, తన హీరోయిన్‌గురించి చర్చిస్తోంటే, తామిద్దరినీ జనం చూసి ఈర్ష్యపడు తోంటే ఎంత బావుండేదో! కాని అతని వూహాసౌధా లన్నిటిని పడగొట్టుతూ వనకన్య ఒంటరిగానే వెళ్ళిపోయింది. ఆమె వెళుతూ

వెళుతూ ఒక మాట మెల్లిగా ఒదిలేసి మరీ వెళ్ళింది—"మహీపాల్ గారు రాసిన 'దేవత' అనే కథలో ఒక వింత వాక్యం వుంది. బహుశా మీరు కూడా దాన్ని చదివి వుండొచ్చు. "భగవంతుడు ఏదైనా వ్యక్తిని శిక్షించాలను కొన్నప్పుడు అతణ్ణి దేవతగా మార్చి వదలేస్తాడు". ఆమె మాట్లాడిన ధోరణి చూస్తే అది అతనికే అన్వయించినట్లుగా వుంది.

నిన్న సాయింత్రం నుండి ఇవ్వాళ వుదయం వరకు సజ్జన్‌కు కాలం గడపడమే కష్టమైంది. తన నీచగుణాన్ని వనకన్య గ్రహించినట్లను కున్నాడు సజ్జన్. అతను చాల బాధ పడ్డాడు. వనకన్య తన దగ్గరకు ఇంక- బహుశా ఎప్పటికీ రాదేమో అన్న అనుమానం కలిగింది. నిన్నటి సాయంత్రం నుండి సజ్జన్ దిగాలుగా గడిపాడు. టెలిఫోను వేరే గదిలోకి మార్పించాడు. కర్నల్, మహీపాల్, ఇప్పుడే వెళ్ళిన మేం సాహిబా' ఎవరొచ్చినా నేను కలవనని నౌక ర్లకు చెప్పి తలుపులు మూసివేసు కున్నాడు. ఆ గదిలోనే వుండి అయిన దానికీ కానిదానికీ నౌకర్లమీద విరుచుక పడ్డాడు. మద్యం సేవించాడు. నిమిష నిమిషా నికీ ఒంటింట్లో కొత్త కొత్త ఫలహారాలు చేయమని ఆర్డర్లిస్తూ అందరికీ మతి పోయేట్లు చేస్తున్నాడు. రేడియో ఆన్ చేసాడు, వెళ్ళి ఆఫ్ చేశాడు. ఇది కాదని పుస్తకాలు తీసాడు— గీత, గౌతమ బుద్ధుడు....

కామ వాంఛ నుండి క్రోధం పుడుతుందనీ, క్రోధంవల్ల బుద్ధి చెడుతుందనీ గీతావాక్యం

చెదరిన మనస్సుతో ఘర్షణ పడుతూ అలసి పోయి చివరకు ఈ వాక్యం చదివిన తర్వాత కొంచెం శాంతించాడు. కామాన్ని జయించగలనని అతని మనస్సు పలికింది. తన జీవితానుంచే 'ఆడది' అనే పదాన్ని తుడిచివేస్తాడు. ఒక చోట బుద్ధుడూ అతని శిష్యుడైన ఆనందునికీ సంభాషణ జరిగింది.

ఆనంద్: గురుదేవా! స్త్రీలపట్ల మనం ఎలా వ్యవహరించాలి?

బుద్ధుడు: వారిని కన్నెత్తి చూడకుండా వుండాలి.

ఆనంద్: మరి కనపడినప్పుడు ఏం చెయ్యాలి?

బుద్ధుడు: వారితో మాట్లాడకు.

ఆనంద్. మాట్లాడాల్సి వస్తే?

బుద్ధుడు: నిన్ను నువ్వు నిగ్రహించు కోవాలి.

ఇప్పటి నుంచి సజ్జన్ కూడ అలాగే చేస్తాడు. ఆడజాతి అతనికి చాలా ఆశలు పెట్టింది. ఇకనుంచీ అతను నిగ్రహించుకుని వ్యవహరిస్తాడు. అతను బ్రహ్మ చర్య వ్రతాన్ని పాటిస్తాడు- తప్పకుండా పాటిస్తాడు. ప్రపంచంలో ఎంతో మంది బ్రహ్మ చర్యాన్ని పాటించారు. అతనెందుకు పాటించలేడు? బ్రహ్మ చర్యం మన భారతీయ సంస్కృతి ప్రసాదించిన గొప్ప ఆదర్శం. మనం ఆ రంగంలో కూడా ముందుకు పోవాలి. అనుభవం కొత్తదైతే కొత్త చైతన్యం కలుగు తుంది. కొత్త చూపు అలవడు తుంది. మన జీవితాన్ని ఎటు మలుపు తిప్పాలన్న సరియైన జ్ఞానం మనకు కలగాలి. పుస్తకం తిరగేస్తున్నాడు. బుద్ధుడు ఒకచోట రాశాడు, "మనం కూడా కదులు తున్నాం. ముందుకు పోతున్నాం. గాని మనం ఎక్కడకు వెళ్లాలి? మనకు తెలియదు. అలా పోతూనే వుండాలి కాని నిగ్రహంలో లోటు రానీయరాదు. విరక్తి వుండాలి కాని సేవా ధర్మంలో కొరత వుండరాదు. స్వాభిమానం వుడడం వుచితమే కాని నమ్రత లేకుండా వుండరాదు. క్షాత్ర ధర్మాన్ని పాటిస్తున్నట్లు వుండలి కాని అయు ధాల్ని ధరించరాదు. ఇలా వున్నప్పుడు ధమ్మపథం సాక్షాత్కరించడంలో ఆలస్యం ఎందుకు?" తాను కొత్త పుంత తొక్కుతున్నట్లు సజ్జన్‌కు అనిపించింది. ఇక మిగిలింది వనకన్య. పాపం ఆమె కష్టాల్లో కూరుక పోయిన ఓ ఆడది. తాను చేతనైనంత వరకు ఆమెకు సాయం చేసాడు. పరోపకారం పుణ్యం అని అంటారు.

మనస్సును ఆధ్యాత్మిక స్థాయి వరకు పెంచుకొని రకరకాలుగ వూహిస్తూ గడిపాడు రాత్రి సజ్జన్. ఎప్పుడో తెల్లవారు తుండగా అతనికి కునుకు పట్టింది. నిద్ర దిగిన తర్వాత కూడా అతని బ్రహ్మ చర్యం నిలచింది. ఇదే ఆలోచన మరునాడు పొద్దు పొడవడంతోటే అతని మెదడులో ప్రథమంగా దూరి పీఠం వేసుకుంది.

ఇవ్వాళ ఉదయం స్థానికంగా ప్రచురించబడే ఓ ఇంగ్లీషు పత్రిక వన కన్య వ్యవహారంపై సంపాదకీయం కూడా రాసింది. అసలా కూపీ తీసి కూలం కషంగా విచారణ చేయించాల్సిందిగా ప్రభుత్వాన్ని కోరింది. ఎలక్షన్లు గెలవడం కోసం రాజకీయ పార్టీలు మానవత్వాన్నే నులిమివేయ వద్దని విజ్ఞప్తి చేసింది. ప్రపంచం అనేది ఏవో కొన్ని నమ్మకాలపై నిలబడి వుంది. అవెపోతే రాజకీయ పార్టీల గొప్ప గొప్ప ఆదర్శాలన్నీ నేల విడిచి సాము చేసినట్లవుతాయి.

కన్య పట్ల అతనికి ఈర్ష్య కలిగింది. మళ్ళీ అనుకున్నాడు తాను బ్రహ్మ చర్యం చేస్తున్నాడు. ఆమెకూ తనకూ ఏమిటి సంబంధం?

మనసు చిక్కబట్టుకుని అతను దైనందిన కార్యక్రమంలో కాలక్షేపం చేసాడు. కొన్ని సంవత్సరాల తర్వాత తల్లి పూజా గృహంలోకి వెళ్ళాలన్న కోరిక కలిగింది. ఇంటి నౌకర్లందరికీ అతనిలో మార్పు ఆశ్చర్యం కలిగించింది. భవనం వెనుక భాగంలో చలువ రాళ్ళతో పూజా గృహం నిర్మించ బడివుంది. ఈ ఠాకుర్ ద్వారాను అతని నాయనమ్మ తల్లిగారు దేవీ దేవతల్ని పూజించే నిమిత్తం కట్టించింది. కన్నోమల్ తల్లిగారు విదేశాల నుంచి తిరిగి వచ్చిన తర్వాత మరణించేంత వరకు తన దేహాన్ని ముట్టుకోనివ్వ లేదు. ఠాకుర్ ద్వారాలో అతణ్ణి అడుగైనా పెట్టనివ్వ లేదు. కుల దేవతల్ని పూజించే పరిపాటి అత్తగార్ల నుంచి కోడళ్లకు సంక్రమిస్తూ వచ్చింది. సజ్జన్ తల్లి జీవించి వున్నంత వరకు ఈ పరంపర నిర్విఘ్నంగా నడిచింది. సజ్జన్ తల్లిగారు బతికి వున్న కాలంలో వున్న పూజారి అన్న కొడుకే ఇప్పుడు అర్చన, పూజ. నైవేద్యం అన్నీ జరుపుతున్నాడు. రోజూ కులదేవత పూజ చండీస్తోత్రం చదివిన తర్వాత పూజారి తీర్థం ఇచ్చి ఆశీర్వచనం చేస్తాడు. అంత వరకే సజ్జన్ పూజా గృహంతో సంబంధాన్ని ఇంత కాలం పెట్టుకొన్నాడు. భగవంతుడు వున్నాడా లేదా అనే విషయంపై అతను తన జీవితంలో ఒక్క క్షణం కూడ ఆలోచించలేదు. సర్వసాధారణంగా భగవంతుడంటే అతను కొంచెం చులకనగా మాట్లాడతాడు కాని ఇవ్వాళ స్నానం చేసి పూజా గృహంలో ప్రవేశించగానే పూజారి కునికిపాట్లు పడుతూ చండీస్తోత్రం చదవడం కనిపించింది. అనుకో కుండా యజమాని రావడంతో పూజారి త్రుళ్ళి పడ్డాడు.

బెంగాళాలో అవతలి భాగంలో అడుగు పెట్టి కొన్ని సంవత్సరాలైంది. అతనెప్పుడు పూజా గృహాని కెళ్ళినా తల్లివెంట వెళ్ళేవాడు. తల్లి మరణించిన తర్వాత ఠాకుర్ ద్వారాలో మొదటి సారిగా వెళ్లాడు. ఎంతో సంతృప్తి చెంది నట్లయింది మనస్సు. గది అంతా కళా విహీనంగా వుంది. చలవ రాళ్ళతో కట్టిన ఠాకుర్ మండపం బాగా పాతపడి బూజుపట్టి నట్టుంది. మఖ్‌మల్ ఛత్రం, దానిపై జరీ అల్లిక మాసిపోయి అపరిశుభ్రంగా వుంది. ఛత్రానికి పోటీగా నిలబెట్టిన వెండి గదలు చాలా రోజుల్నుంచి తుడవ లేదేమో నల్లపడ్డాయి. ఇష్ట దేవతల బృందం చందనం, పుష్ప హారాలతో అలంకరించి వుండి కూడా కళా విహీనంగా వున్నాయి. ఇదంతా చూడగానే సజ్జన్ హృదియం బద్దలైంది. కోపంతో పూజారిని గద్దించాడు. "నువ్వు ఏ మతస్థుడవయ్యా? ఏ భగవంతుణ్ణి పవిత్రంగా భావిస్తావో అతణ్ణే యింత అపవిత్రంగా వుంచుతే ఎలా? ఇంతమంచి పనికి కూర్చుని పూరికే జీతం తీసుకో వడానికి నీకు సిగ్గులేదూ"

పూజారి గజగజ వణకి పోయాడు. ఏదో చెప్పాలను కున్నాడు. ఎంత ప్రయత్నించినా అతని నోట మాట పెగల్లేదు. వంశ పారంపర్యంగా పూజారి కొలువు చేస్తూ ముఫై రాళ్ళు తీసుకునే బ్రాహ్మణుడు యజమాని కోపం చేస్తోంటే సాహసించి ఏమని ప్రత్యుత్తరం ఇవ్వ గలడు?

ఠాకుర్ ద్వారాను శుభ్రంగా కడిగి తుడవాలని నౌకర్లను ఆజ్ఞా పించాడు సజ్జన్. తల్లిగారు బ్రతికి వుండగా జరిగి నట్లుగానే రోజూ మంచి పూల గుత్తులూ తోరణాలూ. దండలూ తెమ్మనమని తోట మాలికి చెప్ప వలసిందిగా తన నౌకర్లకు ఆర్డరు జారీచేశాడు. ఇంత శ్రమించి పెంచిన పూలన్నీ ఆతను ఇకనుంచి నా గదిలోనే అలంకరించి వెళ్లొద్దని చెప్పి పంపాడు. రేపు పుదయానికి నేను చెప్పిన ప్రకారం ఏది జరక్క పోయినా రేపు తలా ఐదు రూపాయలు జరిమానా వేస్తానని అందరినీ బెదిరించాడు. 'రేపటి నుంచి మీరు మనస్ఫూర్తిగా పూజార్చన చేయని పక్షంలో నేను వేరే యేర్పాటు చేస్తాను. అంటూ పూజారిని కూడ అదిలించాడు.

''లేదు ధర్మావతా" అని మొత్తుకో బోయాడు అతను.

"మాట్లాడక వూరుకో. నా ఇంట్లో దీపారాధన, స్తోత్రపాఠం అన్నీ నియమనిష్ట ప్రకారం జరగాలి. తెల్సిందా"

పూజారి మీదా ఇంట్లో వున్న నౌకర్ల మీదా అధికారం చలాయించిన తర్వాత అతని మనస్సు కొంచెం శాంతించింది. విగ్రహాంపై అతని దృష్టి పడింది. వాటిని చూడగానే అతని కేమాత్రం శ్రద్ధాభక్తులు కలగలేదు. అతను ఆలోచించ సాగాడు. మానవుడు ఈ విగ్రహాల్లో ఏంచూస్తున్నట్లు? ఎవరిని సంతోషం పెట్టాలని ఈకైంకర్యమూ ఈ తతంగాలన్నీ? అతని నాయనమ్మ. అమ్మగారు సైతం గంటల తరబడి ఈ పూజా గృహంలో కూర్చొని ఈ విగ్రహాల్ని పూజిస్తుండే వారు. పురాణ కాలక్షేపం చేయిస్తూ వుండగా ఎన్నో పర్యాయాలు అతను చూసాడు. విద్యుత్తు పంకా వుండగా ఇష్టదేవతకు గంటల తరబడి చామరాన్ని తల్లిగారు వీచుతుండగా స్వయంగా చూసాడు. తాను భారత దేశం అంతా పర్యటించి ఎన్నో దేవాలయాలు చూశాడు. ఏగుళ్ళో కెళ్ళినా అతని దృష్టంతా అక్కడి శిల్పకళ మీద వుండేది. అక్కడున్న దేవుడి మీద ఎప్పుడూ లగ్నంకాలేదు, పండాలు పూజారులు దేవుడి పేరుతో ఎన్నో దురాగతాలు చేయడం చూసాడు. అయినా అటువంటి చోట్లకు వేలకొలది భక్తులు బారులు తీరి రోజూ ఎందు కొస్తుంటారన్న విషయంపై సజ్జన్ తీవ్రంగా ఎప్పుడూ ఆలోచించలేదు. కాని ఈ విషయమై ఇవ్వాళ మొదటి పారిగా ఆలోచించాడు. అతనెంతో దీనికి సమాధానం వెతక డానికి ప్రయత్నించాడు. కాని అతనికి సమాధానం దొరక లేదు. తిరిగి పోయి కళ్ళు పెద్ద పెద్దగా అతుకు పెట్టినట్లుగా వున్న రాధా కృష్ణుల ఇత్తడి విగ్రహం. ఇంకా చిన్న చిన్న విగ్రహాలు, రాతిబొమ్మలు, శాలిగ్రాం, శివలింగాలు, బాల ముకుందుని విగ్రహం, నాగుల్ని కంఠ హారంగానూ భుజకీర్తులు గాను ధరించిన వెండి శివుడు, వినాయకుడు, మారుతి పెద్దపెద్దవి మూడు రాగి యంత్రాలు ఇన్ని వున్నాయి. అతని ఠాకూర్ [illegible] ఏ ఒక్క విగ్రహంలో గాని అతనికి ఏ సత్యమూ గోచరించ లేదు. మరైతే కోట్ల కొలది ప్రజలు ఈ విగ్రహాల్లో ఏం చూస్తున్నట్లు?

కొన్ని క్షణాలు ఎంతో గంభీరంగానూ, ఏకాంతంగానూ గడిపాడు సజ్జన్ కాని ఏదో అంతుపట్టలేని ప్రభావం తనపై పడినట్లు భావించాడు. ఇంక రోజూ

ఇక్కడకు [illegible] దేనిమీదా కుదరకపోతే పూజాగృహాన్ని ధ్యాన మందిరంగా వాడు [illegible] ప్రకవస్తాను. ఇంతమాత్రపు క్రమ శిక్షణ తనపై తాను విధించుకో [illegible] సం సజ్జన్‌కు వుంది!

ఇవ్వాళ పొద్దున్నుంచి సజ్జన్ మొండిపట్టుపట్టాడు. స్త్రీకి సంబంధించిన వ్యవహారంలో తాను ఎప్పటికినిమనసు పరిపరివిధాల పోనివ్వనని దృఢంగాతీర్మానించుకున్నాడు. ఒకవేళ కన్య అతని జీవితంలో ప్రవేశించినా ఆమె పట్ల తను ఒక సాధారణ స్నేహితునిలా వ్యవహరిస్తాడు. ఆమె వైపు నుంచి మనస్సును తిప్పుకోవడానికి ప్రయత్నిస్తాడు.

ఇవ్వాళ అతను స్టూడియోకు వెళుతూ ఇద్దరు నౌకర్లను వెంటతీసుకెళ్ళాడు. పూలు, పూలగుత్తులు తీసుకున్నాడు మానసికంగాను భౌతికంగానూ అన్నివిధాల కల్మషాన్ని కడిగేయాలనుకున్నాడు. సషాదిగిన తర్వాత తనలో మతాభినివేశాన్ని నింపుకోవాలనే ప్రయత్నంలో మునిగివున్నాడు.

నౌకర్లతో సజ్జన్ గదిలోకి రావడం ఇదే మొదటిసారి. ఒక్క డ్రైవరు మినహాయించి మరెవ్వరూ అతని గదిని ఇంతకు ముందు చూడలేదు. బంగాళాలో పనిచేసే నౌకర్లు యజమానిని అనుసరిస్తూ గోళాలలోకి వచ్చారు. మెట్లు ఎక్కుతుంటే పెద్దమ్మ యింటివైపు తలుపులు తెరచి వుండడం సజ్జన్ చూశాడు. నౌకరు నెత్తిపై పూల బుట్ట చూడగానే పెద్దమ్మ ఠాకూర్ ద్వారాకు కూడాకొన్ని పూలు ఇస్తే బావుంటుందేమో అన్న వుద్దేశ్యం కలిగింది. పూలు చూసి ఆమె సంతోషిస్తుంది. నౌకర్ల చేతికి తాళం చెవి యిచ్చి గదినిబాగా కడిగి తుడవమని ఆర్డరిచ్చాడు. ఎదురు తీగెల బుట్టలో కొన్ని పూలు తీసుకుని పెద్దమ్మ యింటి వైపు వెళ్ళాడు సజ్జన్. గుమ్మంలో కెళ్లగానే పెద్దమ్మ ఆశీర్వచనాలు వినాల్సి వస్తుందేమో అని మొదట్లో శంకించాడు. కాని చల్లకొచ్చి ముంతదాస్తేఏం లాభం? అనుకున్నాడు.

ముంగిట్లో పిల్లికూనలు మూడు నీరసంగా కూర్చున్నాయి. అతణ్ణి చూడగానే ఒక్కసారి మ్యావ్‌మ్యావ్ అని అరవసాగాయి అతను వాటిని తప్పించు

కుంటూ ఒక్క అడుగు కూడా ముందుకు వేయడం అసాధ్యం అయిపోయింది. ఖంగారులో పొరపాటున ఏదైనా అతని కాళ్ళ కిందపడి నలుగుతుందేమోనన్న భయం. అతని కాళ్ళనట్టూ అంటుకొని తిరుగుతూ ఆ మూడు అతణ్ణి దాదాపు బంధించివేసాయి.

ఎదురుగా నడవాలో కొంచెం చాటుగా మంచానికి కట్టేసిన పెద్దమ్మ కని పించింది. ఆమెను ఆ అవస్థలో చూడగానే సజ్జన్ అదిరిపడ్డాడు. మొహం అంతా ఆంజనేయస్వామికి మల్లే గంగసింధూరం పులిమివుంది. నోట్లో గుడ్డలు కుక్కి వున్నాయి. చెంపలపై, నుదురుపై కాటుకతో గీసిన నల్లని చారలూ_గీతలూ శవంలా కట్టివేసివున్న ఆమె శరీరం కనిపించింది. మంత్రతంత్రాలు చేసేవాళ్ళ మాది రిగా వున్న ఆమె వేషం చూసి పెద్దమ్మ చనిపోయిందనుకున్నాడు సజ్జన్. పెద్దమ్మ దగ్గరకెళ్ళదానికి కొంచెం జంకాడు. అంతలో పెద్దమ్మ తలపక్కకు కదిలించింది. దట్టంగా ముఖానికి పూసిరంగులోంచి కళ్లు చింపుకుని మెరుస్తు న్నాయి. వెంటనే ఆమెను సమీపించాడు. నోటికి అడ్డంగా కట్టిన గుడ్డ ముడి విప్పి నోట్లో కుక్కిన గుడ్డల్ని బయటికి తీసాడు. ఎంతసేపటి నుంచి ఆమెనోరు అలావుందో ఆమె దవడల్ని ఆడించలేకపోయింది. పెద్దమ్మ ఒంటిమీన కట్లన్నీ విప్పి చల్లబడిపోయిన ఆమె కాళ్లు చేతుల్ని దవడల్ని మర్దనచేయడం మొద లెట్టాడు.

కొంచెం సేపటికి గాని పెద్దమ్మ నరాల్లో సంచలనం రాలేదు. దవడల్ని ఆడిస్తూ ఆమె మాట్లాడడానికి ప్రయత్నిస్తుంది. మెడదగ్గిర మర్దన చేస్తూ సరి చేస్తున్నాడు సజ్జన్. ఆమె స్థితి ఇంకా మామూలు స్థితికి రాలేదు. మంచం రెండు పట్టెలమీద చేతులు పెట్టి బలవంతంగా లేచి కూర్చుంది. సహాయానికి సజ్జన్ దగ్గ రగా రాబోతే వద్దన్నట్లు అతన్ని మెల్లిగా నెట్టింది.

నేనిప్పుడే డాక్టర్ని పిలుచుకొస్తానన్నాడు సజ్జన్. చేతిని వూపుతూ వద్దంది. మంగిల్లో గింగిలమని తన్నుకుంటూ వున్న పిల్లికూనవైపు చేతులు సాచి బిగుసుకుపోయిన దవడలమధ్య నలిగిపోయిన కంఠాన్ని మాట్లాడించడం మొదలెట్టింది.

సజ్జన్‌కు ఏమీ అర్థంకాలేదు "ముందు నీకు తాపడం పెడతాను పెద్దమ్మా. తర్వాత అవసరం అయితే డాక్టర్ని పిలుచుకొస్తాను" అని సజ్జన్ అన్నాడు.

ముంగిలివైపు చెయ్యి చూపుతూ పెద్దమ్మ ఏదో మూగగా చెప్పింది. సజ్జన్ తప్పుగా అర్థంచేసుకొని "నేను మీ బిడ్డలాంటివాణ్ణి నాకేమైనా పని చెప్ప దానికి సంకోచించకండి" అని అన్నాడు.

పెద్దమ్మ తిరిగి అటువైపే చెయ్యి చూపసాగింది. నౌకర్లను పిలుద్దామని సజ్జన్ బయటికి వెళ్ళాడు.

కూనలు ముంగిట్లో అదేపనిగా గోల చేస్తున్నాయ్

తన నౌకర్‌తోపాటు ఒక స్టౌవ్ తీసుకుని వచ్చాడు సజ్జన్. ఇంతలో పెద్దమ్మ మంచంమీద కూర్చుంది తలపట్టుకుంటూ, కింది దవడను గట్టిగా పట్టు కొని కదిలించాలని ప్రయత్నిస్తుంది. సజ్జన్ విడువకుండా మర్దన చేస్తున్నాడు. తన మఫ్లర్, నౌకర్ల దగ్గరున్న మఫ్లర్లను తీసుకుని వేనీళ్లలో ముంచి తాపడం మొదలెట్టాడు. అతికష్టం మీద కొంత సేపటికి పెద్దమ్మ నోట్లోంచి ఒక్కమాట వెకలి వచ్చింది. "పాలు" అని. పెద్దమ్మ పాలు తాగాలంటుందని భావించాడు సజ్జన్. ఒక సేరు పాలు వెంటనే కొని తెమ్మని నౌకరును పరుగెత్తించాడు, పెద్దమ్మ కొంగుముడి విప్పుతూండగానే

చాలా సేపు పెద్దమ్మ అతణ్ణి చూస్తూనే వుండి పోయింది. చివరికి నెమ్మ దిగా ఇలా అంది. "కన్నోమల్ మనవడా" అని మళ్ళీ పూపిరి పీల్చి కొని అంది "నందో తండ్రి వున్నాడా!" అంటూ ఆగి పోయింది. కాటుక, సిందూరం, నువ్వుల్తో యిష్టం వచ్చినట్లు పూయబడిన ఆమె ముఖం చిత్ర విచిత్రంగా కనపడు తుంది. ఆదిమజాతుల వారికి పౌరోహిత్యం చేసే వాళ్ళ మాదిరిగా వుంది చూడ్డానికి.

మళ్ళీ పెద్దమ్మ లేచి ముంగిట్లోకి వెళ్ళింది ఆమెకు చేయూత ఇస్తూ సజ్జన్ పక్క పక్క నడిచాడు, రెండు పర్యాయాలు ఆమె వారించింది కాని ఆమె మాట వినిపించుకోలేదు సజ్జన్. అరుగుమీద కూర్చుంది. కూనల్ని తన

ఒళ్ళోకి తీసుకుంటూ, సజ్జన్‌ను చూస్తూ కొంగు ముడి విప్పి పైసలు యివ్వబోతూ పాలు తెప్పించమని అంది.

"తెప్పించాను పెద్దమ్మ"

''వీటి కోసం తెప్పించు"

నౌకరు వచ్చేంత వరకు మెదలకుండ చూస్తూ ఆలోచిస్తూ నిలబడ్డాడు పెద్దమ్మను అందరూ చెడ్డదని అంటారు. అందరిని తిట్టుందని, దుర్భాషలాడు తుందని, మంత్ర తంత్రాలు చేస్తుందని అంటారు. అందర్నీ ఆమె అసహ్యించు కుంటుందని చెప్తారు. అటువంటి పెద్దమ్మ ఆ పిల్లి కూనలకి పాలు తాగించాలని ఎంతసేపటి నుంచో తహ తహ లాడుతూ వుంది. అన్నిటి కన్న ముందు ఆమెకు వాటి ఆకలి గురించే చింతపట్టు కుంది. రాతికి కూడ కరగడం తెలుసు. మానవుని అంతర్యంలో ఇంత ఆత్మ సౌందర్యం ఎక్కడదాగి వుంది? ఇంత సౌందర్యానికి అధికారిగా వుంటూ చుట్టూ ద్వేషం క్రౌర్యం, దౌర్జన్యం వీటి వల ఎందుకు అల్లు కుంటారు? అన్నది సజ్జన్ గ్రహించలేక పోయాడు. ఏదిఏమైనా పెద్దమ్మ పట్ల అతనికి శ్రద్ధాభావం కలిగింది.

పిల్లి కూనలు పెదమ్మ ఒళ్ళో దూరి పండుకోవడానికి ఒక దానితో ఒకటి కీచులాడు కుంటున్నాయి. రెంటికి స్థలం దొరికింది. మూడోది స్థలం దొరక్క పోవడంతో ఆమె చేతి మీదుగా భుజం మీదకు ఎక్కి కునుకు పాట్లు పడు తోంది. అది కళ్ళు మూస్తూ తెరుస్తూంటే పెద్దమ్మ దానివైపు మెడ వంచి ఆప్యా యంగా చూస్తోంది. ఆ దృశ్యాని చిత్రించాలన్న కోరిక కలిగింది సజ్జన్‌కు. ముఖానికి పులిమిన రంగులతో ఆమె ఎంతో భయంకరంగా వుందో పిల్లి కూనలతో ఆమె అంత కరుణామయిగా కనపడుతోంది.

నౌకరు బజారు నుంచి పాలు తెచ్చాడు. పిల్లల్ని కొంగులోకి తీసుకుని అల్యూమినియం మూతలో పాలు పొయ్యమని వాడికి చెప్పి సజ్జన్‌తో 'నువ్వు వెళ్ళు' అని అంది.

"కొంచెం మీరు తాగండి పెద్దమ్మ"

"నా కరొక్కచే మిగిలింది. దొంగముండా కొడుకులందరు కలరా పుట్టి చావ. నువ్వు నీ పాలు తీసుకపో. ఊఁ వెళ్ళు"

ఆకలితో వున్న కూనలు త్వరత్వరగా పాలు నాకు తున్నాయి. సజ్జన్ అతని నౌకరు వెళ్ళగానే పెద్దమ్మ తలుపు వేసేసింది. ఒక్కొక్క గదిలో కెళ్ళి దొంగలు ఏ ఏ వస్తువుల్ని ఎలా చిందర వందరగా పడేసింది, పెట్టెలు మొద లైనవన్నీ చూసింది. దేవుడి దగ్గర దాచుకున్న రొక్కం అంతా చెక్కు చెదర కుండా వుంది. అది చూడగానే ఆమె ప్రాణం లేచి వచ్చింది. రిజర్వు బ్యాంకు భద్రంగా వుండటంతో చిన్న చిన్న బ్యాంకు లన్నింటినీ తనిఖీ చేయడం మొద లెట్టింది. విసురురాయి పూడదీసి దాని కిందవున్న హుండీని ఖాళీచేసారు. డబ్బు ఏమైనా దాచారేమోనని పొయ్యంతా పగల గొట్టారు అనవసరంగా. పడవ లోపలికి వున్న గదిలో దూరి డబ్బు యేమైనా దొరుకుతుందన్న పేరాశతో గది నాలుగు మూలలూ పగల గొట్టి చూసారు. లాంతరు వెలిగించి- పాత గుడ్డల మూటలో కట్టి దాచిన రూపాయల సంచి వెతికింది. అది కనబడలేదు. తల మీద చెయ్యి పెట్టుకుని కింద చతికిల బడి పోయింది. చాలా సేపు విచారిస్తూ కూర్చుంది. కడుపు నిండిన పిల్లి కూనలు ఎగిరి గంతులేస్తున్నాయి

దొంగలు పాడుచేసి పోయిన సంసారాన్ని చక్కపెట్టు కుంది పెద్దమ్మ. వంటింట్లో పారేసిన పప్పుల డబ్బాలూ. ధాన్యం దిమ్మ, పగిలి పోయిన కుం డలూ, చిన్న చిన్న మసాలా డబ్బాలూ అన్నింటినీ తిరిగి నింపి యథా స్థానంలో వుంచింది. తల స్నానం చేసి ఠాకూర్ పూజ చేసుకుని సజ్జన్ తెచ్చిన పూలను విగ్రహాలకు అలంకరించింది. తర్వాత తలుపుకు తాళం వేసి సజ్జన్ గదికి వెళ్లింది. నౌకర్లు గదిని పైకప్పునూ శుభ్రంగా కడిగి తుడిచారు. ప్రతి వస్తువూ తీర్చి దిద్దినట్లుగా చక్కపెట్టి వుంచారు. పూల గుత్తులు గదినంతా గుబాళింప చేస్తున్నాయి. సజ్జన్ కూర్చొని పెద్దమ్మ స్కెచ్‌ను గీస్తున్నాడు. తలుపు వద్ద పెద్దమ్మను ఆకస్మాత్తుగా చూసి కొంచెం తడబడుతూ, "రండి పెద్దమ్మ" అని ఆహ్వానించాడు.

"నాది మూడు వేల యిరవై ఆరు రూపాయలు దొంగముండా కొడుకులు ఎత్తుకెళ్లారు. వాళ్ళు నాశనం కాను, ఒళ్ళు వళ్ళంతా కుష్ఠుయి తూట్లుపడి అటా పైసల్తో సహా నా డబ్బు కక్కుతారు. నువ్వు చూస్తుండు'' అని పెద్దమ్మ నిట్టూర్పులు విడుస్తూ శపించింది.

దొంగలు ఆమె సర్వస్వాన్ని ఎత్తుక పోయారేమో అనుకున్నాడు. ఆమెను వూరడించాడు సజ్జన్. వున్నటుండి అమాంతంగా "కన్హైమల్ మనవడా, నీకు పెళ్ళయిందా" అని ప్రశ్నించింది.

"ఇంకా కాలేదు."

గోకుల ద్వారాలో నా కొడుకు ఒకళ్ళు వచ్చారు, మొత్తం పది మంది వున్నారు. పిల్ల చక్కనిది, ఇంటి పనుల్లో మంచి చురుకు, ఆరోక్లాసు దాక ఇంగిలీకం చెప్పించారు ఇంట్లోనే. నువ్వు వూఁఅంటే మాట్లాడతా"

ఆమె మాటలకు నవ్వుతూ "ఒద్దులే పెద్దమ్మ, అప్పుడే చేసుకోను అన్నాడు సజ్జన్.

''ఇప్పుడు చేసుకోకపోతే ముసలాడైన తర్వాత చేసు కుంటావేం? కన్హైమల్ ధర్మ భ్రష్టుడయ్యాడు. నువ్వు కూడ అలాగే అయ్యేలా కనపడు తున్నావ్'' అంది ఆమె. నవ్వుతూనే సమాధానం ఇచ్చాడు "నేను అలాంటి వాణ్ణి కాదు చాల పవిత్రంగా వుంటాను"

"రాత్రి ఎవరు చేస్తారు? వంటోళ్ళా? హోటల్లో తింటావా?''

"వంటమనిషి చేస్తాడు పెద్దమ్మా. ఒక్కొక్కసారి నేను కూడా చేసుకుంటా." పెద్దమ్మ ముందు తన ఆచారాన్ని వెల్లగబుతూ ఉండే సజ్జన్ నవ్వాపు కోలేక పోతున్నాడు. పెద్దమ్మ పెళ్లి ప్రసంగాన్ని మళ్ళీ తెస్తూ "నువ్వు గనక రామ చంద్రుడి కూతుర్ని పెళ్లిచేసుకుంటే" అని నెమ్మదిగా "పందతులాల బంగారం పెడతాను నీ ఆవిడకు. నన్ను ఎంత దోచుకోవాలని ప్రయత్నం చేసినా గోకుల్ నాథ్ రక్షించాడు ముండాకొడుకులందరిని ఒక్కొక్క వంశాన్ని నాశనంచేస్తా. నువ్వు పెళ్లిచేసుకో మనవడా. పంద తులాలు..."అంది.

సజ్జన్, పెద్దమ్మ తలెత్తి చూసారు గుమ్మంవైపు కన్యనిలబడివుంది. ఆమెను చూసి సజ్జన్ గాబరాపడ్డాడు. తనకు తానుగా, పెద్దమ్మ వున్న కారణంగానూ. పెద్దమ్మ ఆమెను పరీక్షగాచూసింది కన్య వచ్చి చాపమీద కూర్చుంది. "ఈమె ఎవరు?" అని అడిగింది పెద్దమ్మ.

సజ్జన్ ధర్మసంకటంలో పడ్డాడు. మరోకులస్తురాలిని కానీ, కుమారి అని కానీ చెప్పారో పెద్దమ్మ ఒక్కసారి ఉవ్వెత్తున లేచిపోతుంది. కన్య ఎదురుగా వచ్చేప్పటికి అతని మనస్సు మళ్ళీ పూసలాడడం మొదలయింది. చటుక్కున జవాబు చెప్పే తొందరలో "ఈమె మీ కులస్తురాలే" అన్నాడు.

"ఎవరి అమ్మాయివి నువ్వు?" అంది ముసలావిడ

"ఈమె . పెద్దమ్మా.... ఈమెదీవూరు కాదు" అంటూ సర్దేశాడు సజ్జన్.

"అయితే అత్తగారిల్లు ఇక్కడవుందామరి? ఈమెతాలూకు ఇక్కడ ఎవరున్నారు?"

కన్య మాట్లాడకుండా వుండాలని సజ్జన్ అభిమతం. అబద్ధంపై అబద్ధం ఆడుతూవెళ్లాడు ఒకపక్క పెద్దమ్మ ప్రశ్నలు వేధించడం, మరోపక్క కన్య అక్కడే వుండడం ఈరెంటికి మధ్య కంగారులో నలిగిపోతున్నాడు. ఆలోచించు కోవడానికి వ్యవధిలేదు. గాజులేని కన్య చేతులమీద సజ్జన్ కళ్లు పడ్డాయి వెంటనే మనసులో ఓ మెరుపులాటి ఆలోచనతట్టింది. ఆదికాదు పెద్దమ్మా ఈమె అత్తగారి వైపు అంతా చచ్చి పోయారు. ఇక్కడ స్కూల్లో టీచరుగా వుంటోంది" అని తడుముకోకుండా అనేసాడు,

"నీదగ్గరకు ఎందుకొస్తుంది?"

"పని నేర్చు కొందామని వస్తుంటాను అమ్మగారూ" అంది కన్య' ఈమె ఎవరో సజ్జన్ తాలూకు బంధువురాలనుకొని కొని. నజ్జన్‌గాభరా పడుతోన్నట్లు కన్య గ్రహించి నవ్వుతూ పెద్దమ్మను తన సమాధానాలతో సంతృప్తిపరచ సాగింది.

"అయితే నువ్వు విధవరాల్ని చేసుకుంటావా?"

"లేదు పెద్దమ్మా! ఈమెకు పాఠం చెవుతాను. నెలకు పది రూపాయలు జీతం కూడాను. పెద్దమ్మ ఏమీ మాట్లాడలేదు. కాస్సేపు ఆలోచిస్తూ కూర్చుంది. కాస్సేపయ్యాక లేచివెళ్లిపోతూ "కన్నోమల్ మనవడా, నువ్వాలోచించు. నేనైతే నీ చెవిలోమాటేశాను. ఏదైనా అలాంటిఅప్రాచ్యపు....చేయ[illegible]ంది.

చేయనులే పెద్దమ్మ. సరేకాని పోలీసులకు రిపోర్టుఇవ్వమంటావా?

"పోలీసులు అక్కర్లేదు. వాళ్ళసంగతి నేను చూసుకుంటా–" అంటూ పెద్దమ్మ వెళ్లిపోయింది. ఆమె వెళ్లిన తర్వాత కన్యఆమెఎవరని అడిగింది.

"భారతమాత" నవ్వుతూ అన్నాడు సజ్జన్.

సజ్జన్ అన్నది ఆమెకర్థంకాలేదు. ఈముసలిసైతానును భారతమాత అని సజ్జన్ అంటోంటే ఆమెకునవ్వొచ్చింది. "నా గురించి ఆమెకు అబద్ధాలు ఎందుకు చెప్పారు?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు ఎలాసమాధానం చెప్పాలో తెలియక తికమకపడ్డాడుసజ్జన్. తిరిగి సంభాళించుకొని—"నిజం చెప్పినట్లయితే నీ గురించి—మీ గురించి ఆమె వైఖరి ఇంకా బాగావుండేది'' అన్నాడు.

'మీరు' అనిసజ్జన్ సంబోధించడం చేసిన మార్పును గమనించింది కన్య. సజ్జన్ కూడ తన మనో నిశ్చయం కాపాడుకోవడమూ లేక కన్య తన్ను సహజంగా ఆకర్షించిడం ఈరెంటి మధ్య ఏదీ తేల్చుకోలేక అవస్థ పడుతున్నాడు. అతనికళ్లు నేలను చూస్తున్నాయి. ముఖం గంభీరంగా ఏదోఆలోచనలో వున్నట్లు పెట్టుకున్నాడు. నిన్నటి సంఘటన కారణంగా సజ్జన్ బిగుసుకున్నాడా అనుకుంది కన్య. అతని కోపాన్ని వుపేక్షిస్తూ వనకన్య "నేను కర్నల్ భాయి దగ్గర కెళ్లి వచ్చాను" అని అంది.

ఆమాటలకు సజ్జన్ తలఎత్తి చూశాడు. కన్య చెప్పడం ప్రారంభించింది. "మధుర నుండి ఓ పెద్దమనిషి ఇవ్వాళ వుదయం కర్నల్భాయీతో నాయింటికి వచ్చారు.''

అప్పటికి సజ్జన్ మామూలు మనిషి అయ్యాడు. కావాలని శిష్టాచారం నటిస్తూ సజ్జన్ అడిగాడు—"వారికి మీ—తమ ఇంటి గురించి వివరం ఎలా తెలిసింది?"

"నిన్న పేపర్లలో రాగానే వారు బయలుదేరొచ్చారు. ముందు మా ఇంటికి వెళ్ళారట. అక్కడ మంగళహారతులు తగలగానే ముఖం కందగడ్డ చేసుకుని నాఇంటికోసం వేట మొదలెట్టారట. ఇంతలో ఎవరో కర్నల్ ఛాయీ పేరు వారికి చెప్పారు. అంతే అతణ్ణి తీసుకొని ఇద్దరూ మా యింటికొచ్చారు" అంటూ మడచి వున్న ఓ కాగితాన్ని హేండ్‌బాగ్‌లోంచి, కన్య బయటికి తీసింది. మడతలు విప్పి సజ్జన్ చేతికి అందిస్తూ అంది—"ఇది మా వదినగారు రాసిన వుత్తరం. ఆమె తన స్నేహితురాలికి రాసుకుంది".

ఉత్తరం తీసుకుని సజ్జన్ చదవసాగాడు. చెయ్యి తిరిగిన రాతలా వుంది వుత్తరం ఎంతో జాలిని కలిగించేలావుంది. "నేను రాక్షసుల పాలిటపడ్డాను. త్రిభువన్ లాలాజీ భార్యకు మనస్సంతా కుళ్ళు. వారు నన్ను పునర్వివాహం చేసుకోవడానికి అంగీకరించారు, అమ్మగారైతే పెళ్ళికి ఒప్పుకోలేదు. కాని నాకు ఆయనకూ సంబంధాన్ని కుదిర్చితే అతణ్ణి తన స్వాధీనంలో పెట్టుకోవచ్చు అని అనుకుంది. ఈ ఇందీవరసవేరు చెల్లీ. దీని మహిమలే చెప్పతరంకాదు. ఎవరెవరిని వేలెత్తి చూపమంటావ్? త్రిభువన్ భోళా మనిషి. అతను ఇంట్లోవారందరి ముందర నన్ను వివాహం చేసుకుంటానని చాటి తన నిజాయితీని ఋజూ చేసుకున్నాడు. పిన్నమ్మ, పినతండ్రి నన్ను కొట్టడానికి వచ్చారు. నన్ను కాపాడదామనే ప్రయత్నంలో అమ్మ కూడ దెబ్బలు తింది. పినతండ్రి సంగతి ఏమని చెప్పను? అతను పినతండ్రికాదు. పరమ కిరాతకుడు. నన్ను కొట్టి తిట్టి నా సర్వస్వం పూడ్చుకున్నాడు. చెల్లీ నేను చావాలన్నా నాకు చోటే దొరకడంలేదు. నా ఇంట్లో నాకు సాయం చేసేవ్యక్తి ఒక్కరూ లేరు. భగవంతుడు కూడ నా నమ్మకాన్ని వమ్ముచేసాడు. తండ్రిముందు త్రిభువన్ నోరెత్తలేడు. కన్య అయితే నా పక్షాన్నే మాట్లాడుతుంది. కాని పాపం ఆమె మాటవినిపించుకునేదెవరు? నీకీవుత్తరం రాసి నా మనోభారాన్ని కొంత తగ్గించుకుంటున్నా.

నువ్వు తిరిగి వుత్తరం రాయకు. పొరపాటున వాళ్ల చేతుల్లో వుత్తరం పడిందంటే నన్నింక బతకనివ్వరు కూడాను."

వుత్తరాన్ని మరోసారి చదివాడు సజ్జన్. మళ్ళీ ఓ సారి చదివాడు. వుత్తరంలోకి కళ్లు పాతిపెట్టుకున్నట్టుగా చూస్తున్నాడు. "ఈ వుత్తరం ఆధారంగా నాన్నగారిని ఇరికించవచ్చని కర్నల్ భాయీ అన్నారు. నన్ను మేజిస్ట్రేట్ దగ్గరకు తీసుకుపోవాలనుకున్నారు. మిమ్మల్ని అడిగి వెళ్దాం అని అన్నాను".

సజ్జన్‌లో వున్న మానవుడు మళ్ళీ వూగిసలాడటం మొదలెట్టాడు. నిగ్రహించుకుని దించిన తల ఎత్తకుండానే–"కర్నల్ మంచి సలహాయే ఇచ్చారు. తమరు మేజిస్ట్రేట్ దగ్గరకు వెళ్ళి వుండాల్సింది. తమరిని కలుసుకోవడానికి వచ్చిన ఆవ్యక్తి ఎవరు?" అని అడిగాడు.

సజ్జన్‌లో వచ్చిన ఈ మార్పుకు కారణాల్ని వెతుకుతూ, అతని వైపే చూస్తోన్న వనకన్య గోళ్ళను కొరుకుతూ–"మా వదిన స్నేహితురాలి భర్తేనండి. ఆమె అర్నెల్ల నుంచి పక్షవాతంతో బాధపడుతోంది. నడవలేదు. లేచి కూర్చో లేదు. వీళ్ళు నాకీవిషయంలో పూర్తిగా సహకరించడానికి సిద్ధంగా వున్నారు. మనం కావాలనుకుంటే కోర్టు వారి అనుమతి తీసుకుని మధురలో ఆమె స్టేట్‌మెంటు కూడ ఇప్పించగలనని చెప్పారు" అంది.

"అయితే తమరేమంటారు?" అంటూ సజ్జన్ అడిగాడు.

"తమరేమంటే అదే"

జేబులోంచి సిగరెట్టు తీశాడు సజ్జన్. దాని వైపు వేదాంతిలా చూస్తూ "నేనీ విషయంలో ఏమని చెప్పను. ఇది మీ స్వంత వ్యవహారం" అన్నాడు సజ్జన్.

"నా స్వంత వ్యవహారమే అన్నమాట. మానవత్వానికి దీనితో ఏమీ సంబంధంలేదా?"

"అలా కాదు. నా వుద్దేశ్యం అదిగాదు. ఇందులో మీ తండ్రిగారూమరీ... మీ కుటుంబం....అందరి ప్రతిష్టకు సంబంధించిన విషయం అని"

"తండ్రిగారి ప్రతిష్ఠా" అంటూ పెద్దగా అరిచింది కన్య. అంతలోనేమళ్ళీ మెల్లిగా అంది- "వారి గౌరవంతో కాని అగౌరవంతో కాని నాకేమీ సంబంధం లేదు. ఒదినగారి గురించి వారిపై నేను ప్రతీకారం తీర్చుకోవాలి. నిన్నటి నుంచి వారు నా పని పట్టారు. నా శీలాన్ని గౌరవాన్ని మంటకలిపేందుకు కొంతమంది రౌడీలను కూడా నియమించారు".

ఆ చివరి మాటలు వినగానే సజ్జన్‌లో కన్యపట్ల ఇంతవరకూ చూపిస్తూ వచ్చిన సర్లిప్తత ఒక్కసారిగా పటాపంచలైంది. గాభరా పడుతూ-"వాళ్ళు ఏ అఘాయిత్యం చేయలేదు కదా" అన్నాడు.

కన్య చెప్పింది సవిస్తారంగా, "నిన్న రాత్రి మా నాన్నగారు గదికి వచ్చారు. తలుపు బయట గర్జించి నానామాటలు అన్నారు. నా గౌరవాన్ని మంట కలిపేస్తానని బెదిరించారు. నేను మాత్రం తలుపు తీయలేదు"

"తర్వాత?"

"తర్వాత ఆయన వెళ్ళిపోయాడు. వెళ్ళిన తర్వాత ఎవరో గుండాలువచ్చి తలుపు కొడుతూ నానా రకాలుగా కూతలు కూసారు. కేకలు వేసారు. వెక్కిరించి, బెదిరించారు. నా గది వున్న ఆవరణలో అంతా బోయవాళ్ళు. కూలీనాలీ చేసుకునే వాళ్ళు. వాళ్ళలో చాలామందిని బహూశా సాలిగ్రాం డబ్బులిచ్చి కొనేసి నట్టుంది. నాకు శత్రువులుగా మారిపోయారు. ఇవ్వాళ పొద్దున్నుంచి అక్కడే వుంటున్న ఇద్దరు ముగ్గురు బోయీలు వాళ్ళ ఆడవాళ్లు కూడా నాగది ముందు నుంచి వస్తూ వెళుతూ ఏదేదో మాట్లాడుతూ ఇబ్బంది పెడుతున్నారు. అప్పుడు కర్నల్ భాయీ వస్తేకాని....పోతే ఒట్టు". ఆమె చెపుతుంటే ఆమె కళ్ళన్నీ నీళ్ళు నిండుకున్నాయి.

సజ్జన్‌కు అదంతా వింటే ఆమె మీద జాలివేసింది. అతను గడ్డకట్టించు కున్న దయారసం అర్ధ్రమైపొంగింది. కోపంతో ముఖం జేవురించగా మీరక్కడ

ఎందుకుంటారు? ఎన్నో పర్యాయాలు చెప్పాను. అందరిమాదిరి నేను తిరుగు తోతనే కంట్రీవాణ్ణనేగా మీ వూహ?'' అన్నాడు.

"అలా నేనెప్పుడూ అనుకోలేదు''

"మరేమని అనుకుంటున్నారో చెప్పండి. ఇంత పెద్ద నా స్వంతబంగళా వుంది. బంగళా మొత్తంలో నేనొక్కణ్ణీ వుండలేను కదా. మీరు కావాలనుకుంటే గోడ పెట్టింతమన్నా పెట్టిస్తాను. ఇంతకన్న ఏంకావాలి?'' సజ్జన్ మాటలు వింటోంటే ఆమెకు నవ్వొచ్చింది. "మీ దంతా అర్థంలేని కోపం. అయినా నేనే మనుకోనులేండి" అని అంది నవ్వుతూ.

కన్య పకపకా నవ్వగానే సజ్జన్ కొంచెం తమాయించుకున్నాడు. తాను అనవసరంగా తెచ్చుకున్న భావోద్రేకానికి కించపడ్డాడు. అతని మానసిక పరిస్థితి విచిత్రంగా తయారైంది. రాత్రి నిర్ణయించుకున్న ప్రకారం అతను ఆమెను పూర్తిగా మరచివుండలేక పోతున్నాడు. పోనీ ఇన్నాళ్ళ నుంచి ఆమె వ్యవహారంలో చూవుతూ వచ్చిన ఆత్మీయతను మళ్ళీ అంగీకరించలేకుండా వున్నాడు. ఏం చెయ్యాలో తోచక కన్య కళ్ళల్లోకి చూస్తున్నాడు. వెనకటిలా ఆమెకు ఎంతో దగ్గిరగా వున్నట్లూ, రాత్రిఅనుకున్న ప్రకారం అంటకుండా వుండాలనుకొన్నట్లు.

కన్య మళ్లీ అంది- "అంత పెద్ద బంగాళాలో ఏదో ఒక భాగాన్ని కిరాయికి తీసుకుని వుండేంత అర్హత నాకు లేదు. ఒకవేళ నా మనస్సు తృప్తికోసం కిరాయి పదిరూపాయలని ఇద్దారకోండి. అది మరి ఎంతవరకు సమంజసంగా వుంటుంది?"

దానికి సమాధానం ఇస్తూ సజ్జన్ అన్నాడు- "నా అద్దె కొంపలో దేనినీ నేను మీకు ఇవ్వటం లేదు కదా. నీకెందుకుకీ దుర్గ? పైగా అలా ఇద్దామని నేను అనుకున్నా ప్రస్తుతం ఏదీఖాళీలేదు. మీరు కష్టాల్లో వున్నారు. ఒకస్నేహితునిలా ఆదుకోవాలని కోరుకుంటున్నాను. మీరు నాకు ప్రతిఫలంగా ఏమీ ఇవ్వనక్కర్లేదు. నేను చెప్పిన ప్రకారం చేసే పక్షంలో ఈ చిక్కులోంచి ప్రస్తుతం బయట పడతారు. ఇప్పుడే ఏమీ అపాయం వుండదనుకోండి. కాని తీరా ఈ వుత్తరం

ఆధారంగా మీరు కోర్టుపరంగా చర్య తీసుకొన్న రోజూ మీకు మళ్ళీ అలాంటి విపత్తు తప్పదు".

"మీరు నన్ను 'నువ్వు' అని సంబోధించేవారు. మళ్ళీ 'మీరు' అని మొద లెట్టారేమిటి?"

"ఎందుకంటే నేనిప్పుడు దేవత నయ్యానుగా" వ్యంగ్యంగా అన్నాడు సజ్జన్ ఆనర్కోక్తిని విని కన్య మెదలకుండా వూరుకుని తలదించుకుంది.

కొన్ని క్షణాలు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం. చివరికి నిశ్శబ్దాన్ని చెదరగొడు తున్నట్లుగా పొడిగా దగ్గుతూ కన్య అంది "ఓ మాట చెప్పమంటారూ?" అలా అడుగుతోంటే ఆమె కళ్ళు సజ్జన్ కళ్ళల్లోకి చూశాయి.

"ఏమిటి" అన్నాడు సజ్జన్ కూడా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

కన్య రెప్పలు దించుకుంది. ఆమె ముఖం గంభీరమైంది. ముఖకవళిక కొంచెం ఎర్రగా కూడా అయింది. తల ఎత్తుతు మళ్ళీ ఆమె అంది- "నేనుమిమ్మల్ని ప్రథమంగా కలిసినప్పుడు ఓ మంచి పనికి ఓ వ్యక్తి నుంచి సహాయం పొందాలనే కోరిక మినహా మరేభావమూ నాలో లేదు. కాని మీరు మన కలయికల్ని మీ మనోరథంప్రకారం చాలా త్వరగానే మలచుకొన్నారు. అది నాకు చెడ్డ అనిపించ లేదనుకోండి. కాని మీలో వచ్చిన ఈ మార్పుకు నేను ఆశ్చర్యపడ్డాను.... వుండండి... నన్ను మాట్లాడ నియ్యండి. మీరు చెడ్డవారని నేను అనుకోవడం లేదు. కాని ఒక్క నిజంచెప్తాను. క్షమించండి. మీరు నన్ను ఓ స్నేహితురాలికంటె ఎక్కువగా, మరోవిధంగా అనుకొంటున్నారు. అనుకోవాలని కోరుకుంటున్నారని నేను ఫీలవుతున్నాను. ఆ మీ వైఖరి నేను సరిగా అర్థంచేసుకోలేక పోతున్నాను!

నిర్మొహమాటంగా కన్య చెప్పిన మాటలకు సజ్జన్ ఉలిక్కిపడ్డట్లయ్యాడు. "నువ్వు నిజాయితిపై నొక్కి ఎలా మాట్లాడుతున్నావో, నేను కూడా అలానే మాట్లాడితే? నీగురించి నేను ఇంకోవిధంగా అనుకోవడానికి నువ్వేమాత్రం తోడ్పర లేదా?" అని అడిగాడు.

ఆ మాటలకు కన్యకు సిగ్గు ముంచుకొచ్చింది. అది గ్రహించిన సజ్జన్ కొంచెం ధైర్యం తెచ్చుకొని మళ్ళీ మొదలెట్టాడు.– "నా వరకు నేను ఖచ్చితంగా ఒక్కమాట మాత్రం చెప్పగలను, నేను పూర్తిగా సత్ప్రవర్తనకల వాణ్ణి కాక పోవచ్చు. కాని నానడవడిక అంత చెడ్డదికాదు. మరి నీగురించినేను ఏర్పరచుకున్న అభిప్రాయానికి సంబంధించినంతవరకు–నిన్నటి వరకు ఏవిధంగా నీ గురించిఅను కొంటూవుందీ, అవిషయం గురించి అప్పుడే ఇదమిత్థంగా చెప్పడంకష్టం. ఏది ఏమైనా కానీయ్, నావల్ల ఏమైనా పొరపాటు జరిగివుంటే నన్ను క్షమించు, నేను స్త్రీలంటే గౌరవభావం కలిగివుంటానని నిరూపించుకోవడానికి అవకాశం ఇయ్యి".

"మీ గురించి నా మనస్సులో ఎప్పుడూ అపనమ్మకమూలేదు, అనుమా నమూలేదు. ఇకముందు అలాంటిది ఎప్పటికీవుండదు కూడా. మీ పరిచయం కలి గిన తర్వాత నా జీవితంలో ఓ కొత్త నమ్మకం అంకురించింది".

సజ్జన్ ప్రతిష్ఠించుకున్న ఆదర్శాల మహలు మళ్ళీ వూగిసలాడడం మొద లెట్టింది. అతను చాలా తీక్షణంగా ఆమె కళ్ళలోకి చూశాడు. అతని దృష్టి ఆమె గుండె లోతుల్లోకి దూసుకుని పోయేటంత వాడిగా వుంది అ వాడితనానికి ఆమె తట్టుకోలేక పోయింది. ఉద్రేకాన్ని నిగ్రహించుకుంటూ ప్రసంగాన్ని మార్చి అడి గింది.

"మరి ఈ వుత్తరం గురించి ఏమి చేయమంటారు?"

సజ్జన్ కూడా అప్పటికి సంబాళించుకున్నాడు. ఏమీ జ ర గ న ట్టు గా అన్నాడు – "కర్నల్ దగ్గరకు వెళ్ళదాం పద. నా వుద్దేశంలో ఈ వ్యవహా రంలో వెంటనే చర్య తీసుకోవాలి. అది కూడా ఇవాళే అయిపోవాలి. అది సరే. ఇప్పుడు నువ్వు ఎక్కడవుంటావ్? అక్కడైతే ఎట్టి పరిస్థితులోనూ నిన్నుండనియ్యను".

కన్య కదలకుండా కాలిబొటనవేలుతో నేలరాస్తూ వుంది. చివరికి నోరు విప్పి "ఇవాల్టికి ఎక్కడైనా వుంటాను. మీ దగ్గరైనా, కర్నల్ భాయి దగ్గ రైనా. రేపటికి ఏదో ఒక ఏర్పాటు మీరే చెయ్యాలి".

కొంచెం ఆలోచించి సజ్జన్ అన్నాడు – "కేసర్‌బాగ్‌లో నా ఇల్లుంది. దానిపై ఇంకో అంతస్తు వేయడానికి పర్మిషన్ ఇచ్చారు, ప్లాను అప్రూవ్ చేశారు. నీకోసం వెంటనే ఓ అంతస్తు కట్టిస్తా. అప్పటివరకు...."

కన్య అతనివైపు చూస్తువుంది. కళ్ళార్పకుండా ఆమె వైపు చూస్తూ సజ్జన్ ఆ వాక్యాన్ని పూర్తిచేసాడు – "అప్పటిదాకా నువ్వు నాదగ్గరేవుండు. నువ్వు కర్నల్ దగ్గిరవుండడానికి నాకేమీ అభ్యంతరంలేదు, కాని భార్య పాతకాలం మనిషి. నీగురించి ఎవరూ మరో విధంగా భావించడం నాకిష్టంలేదు"

'కాని మీ దగ్గిరవుంటే ప్రపంచం నన్నాడిపోసుకోవడం మానేస్తుందా? ఒక రిదాకా ఎందుకు. స్వయంగా నా తండ్రిగారే మిమ్మల్ని ఓ విసురు విసరారు. పోనీలెండి. మీరు చెప్పిన ప్రకారమే వుంటాను లెండి

సజ్జన్ హృదయం ఆనందంతో పరవళ్ళు తొక్కడం మొదలెట్టింది. కన్యను తన చేతుల్లో బంధించి వేద్దామన్న ఉద్రేకం వచ్చింది. కాని సజ్జన్ భౌతికంగా సజ్జనునిలాగే కనిపించాడు. ''జాగ్రత్తగా వుండాలి సుమా" అని ఆ నందుడికి బుద్ధుడు చెప్పిన సలహా సజ్జన్‌కు జ్ఞప్తికి వచ్చింది.

# 16

సజ్జన్ రోజువారీ కార్యక్రమంలో నేటి నుంచి మరో మార్పు వచ్చింది. కర్నల్ ఇంట్లో ఫలహారం చేసి అతను చౌక్‌కు పోకుండా తన బంగళాకు వచ్చాడు. యజమానికి దేవుళ్ళంటే శ్రద్ధాసక్తులు కలగడం చూసి అతని నౌకర్లంతా నిన్న మధ్యాహ్నంనుంచి పరమ భాగవతోత్తములయ్యారు. వారికృషి ఫలితంగా నిన్నటి వరకు బూజు కూడా దులప డానికి నోచుకోని ఠాకూర్ ద్వారా ఇవ్వాళ కొత్త పెండ్లి కొడుకులా అన్నిటినీ విప్పి తుడిచారు. ఠాకూరు ఛత్రానికి పోటీగా నిలబెట్టిన వెండి కర్రలు తళతళ మెరుస్తున్నాయి. ఠాకూర్ మంటపంలో రెండు వైపులా చలవ రాతి స్తంభాలపై నెమిలి ఈకల దామరాల్ని

పట్టుకొన్న స్త్రీల బొమ్మలు మునపటి కన్న ఎక్కువ పరిశుభ్రంగా కనపడు తున్నాయి. తోటమాలి కూడా ఈరోజు ఒళ్ళుదాచుకోలేదు. బంతిపూల తోరణాలు దండలూ మందిరం అందాన్ని నాలుగు రెట్లు చేశాయి. పూజారి కూడా వేళకు ముందే వచ్చి ఠాకూరుకు స్నానం చేయించి బాగా అలంకారం చేశాడు. భక్తిని చాటుతున్నట్లుగా ''జయ్ జగదీష్ హరే'' అంటూ మంగళాన్ని పాడు తున్నాడు. అటువంటి సమయంలో మందిరంలో కొచ్చాడు సజ్జన్. యజమానిని చూడగానే పూజారి కాళ్ళు చేతులు వణికాయ్. ఏదో విధంగా మంగళ హారతి ఇచ్చాడు కన్నార్పకుండ ఇదంతా చూస్తూ నిలబడ్డాడు సజ్జన్. తన తల్లి ఆత్మ ఆస్థానంలో వుందనీ తన దగ్గరకు రాగానే ఆమె ఆత్మ శాంతించిదన్నట్లుగా అనుకొన్నాడు సజ్జన్, పంతులుగారు భయంతో తడబడుతూ స్తోత్రం చేస్తోంటే అది చూసి సజ్జన్‌కు నవ్వొచ్చింది. మతం కొని వేసిన ఈ దివాలాకోరు బ్రాహ్మణ దళారి నిండు నిష్ఠతో ఎలా చెయ్య గలడని తలచాడు.

తనకు ఎంత వరకు దైవం పట్ల నిష్ఠవుందని లెక్కకడుతూ ధ్యాన మందిరం నుంచి సజ్జన్ బయటికి రాగానే సాలిగ్రాం, లాలా జానికీశరణ్ వచ్చి వేచివున్నట్లు తనకోసం పెట్టిన చీటీద్వారా తెలుసుకున్నాడు. "ఎంత సేపయింది వాళ్లొచ్చి'' అని అడిగాడు ఓ నౌకర్ను.

"అరవై నిమిషాలకుపైన అయిందండీ"

"టీ ఇచ్చావా!"

"అవును ప్రభూ"

"వాళ్లకేమని చెప్పావ్!"

"యజమానులు పూజా మందిరంలో వున్నారని చెప్పాను".

"బాగుంది" అని సజ్జన్ గదిలో కెళ్లాడు గుడ్డలు మార్చుకోవడానికి.

గుడ్డలు మార్చుకుని సజ్జన్ డ్రాయింగు రూంలోకి రాగానే ఇద్దరు మహాశయులు హృదయ పూర్వకంగా స్వాగతం పలికారు. సాలిగ్రాంతో సజ్జన్‌కు పూర్వ పరిచయం లేదు. లాలా జానకీశరణ్ రాజా సాహెబ్‌గారి పొరుగింటి

వ్యక్తి కావడం చేత స్వయంగా తాను కన్నోషుల్ మనుమడు అవడం చేత, అతనితో మాత్రం సజ్జన్‌కు కనపడి నప్పుడల్లా ఒకరి కొకరు నమస్కరించు కోవడం వుంది.

చేతులు జోడిస్తూ సజ్జన్ తాను రావడం ఆలస్యమై నందుకు క్షమాపణ చెప్పుకున్నాడు. లాలా జానకీశరణ్ బక్కగా వుంటాడు. నిగ్గుదేరిన దేహం. పల్చని పెదిమలు, దట్టంగా లేని మీసం, సున్నితమైన ముక్కు. నడివయస్సుం టుంది. సజ్జన్ క్షమాపణకు సమాధానంగా లాలా జానకీశరణ్ "ఏమీ ఆలస్యం కాలేదు. నువ్వు పూజ కూడా చేస్తావని తెలిసి ఇంకా ఎంతో సంతోషించాం" అన్నాడు.

ఇక సాలిగ్రాం దుబ్బు మీసాలు, తలపై తెల్లటి టోపీ కళ్లద్దాల్లోంచి తొంగి చూస్తోన్న కళ్ళను దైన్యంగా చిన్నవిగా చేస్తూ సజ్జన్‌పై తానూ ఓ పొగడ్తను విసిరాడు- "సజ్జన్ సాహెబ్ వంశం అంటే ఏమిటి? ఏం కథ! ఆయన ఎంత పెద్ద కళాకారుడు, ఏం సంగతి ఇండియా హోల్ మొత్తంలో, అందులో సరస్వతీ వరప్రసాది. ముఖ్యంగా అటువంటి కళకు దైవ కటాక్షం కావాలండీ. అటు వంటి వ్యక్తి పూజే చెయ్యరా. హి హి హి" అంటూ ఇకిలించాడు.

వెండి నగిషీ పొన్ను తొడిగిన కర్రపై రెండు చేతులూ ఆనించి సరిగ్గా కూర్చుంటూ లాలా జానకీశరణ్ మళ్ళీ ప్రారంభించాడు. "మన వాళ్ళలో వాడివి ఇంత పేరు సంపాదించగా వంటే మాకు చాలా సంతోషం ఇప్పుడు మా వీధిలోనే వుంటున్నావు. ఓ రోజు రాజా సాహెబ్ మా యింటి కొచ్చి నీగురించి ఎంతగానో చెప్పారు. వట్టప్పుడు కూడా నిన్ను అడుగు తారనుకో".

"వారు మాకు పెద్దలు. ఎప్పుడూ మా యోగక్షేమం కనిపెడుతుంటారు" అంటూ ముఖంపై కృతజ్ఞతను తెచ్చుకున్నాడు సజ్జన్.

ఇంతలో మళ్ళీ సాలిగ్రాం అందు కుంటూ "మేము వీరిద్దరి స్నేహితుల్ని బాగా ఎరుగుదుం. వీరి పేరు మాత్రం విన్నాం. తీరా ఇప్పుడు చూస్తే అక్షరాలా

సజ్జనుని లాగే ఉన్నారు. హె....హె...హె..." అంటూ మళ్ళీ ఓపర్యాయం పళ్ళు ఇకిలించాడు.

బాయీ, ఇవ్వాళ మీ దగ్గర కో ప్రపోజల్ తీసుకొచ్చాం. దాని విషయంలో వీరిని అంటే సాలిగ్రాం గార్ని కూడ ఒప్పించాం. రాజకీయాలు అనేవి ఎప్పుడూ వుంటూనే వుంటాయి, కొంచెం ప్రజానీకానికూడా పనికి వచ్చే పని కూడా చెయ్యాలి అని వీరితో అన్నాను. సరే అని ఒప్పుకున్నారు. శుక్లాగారు, కర్నల్ గారు మాకు చిరకాల స్నేహితులు. ప్రారంభించే ముందు నీ సలహా కూడా తీసుకుంటే బాగుంటుందని అనుకున్నాను. నీ అభిప్రాయం ఏమిటో చెపితే తర్వాత మేం ఉపక్రమిస్తాం." లాలా జానకీశరణ్ ప్రసంగాల మధ్య తనకు కావలసిన పాయింట్లను అతి నేర్పుగా ఇరికిస్తాడు. ఇదంతా విమానాల పేంఫ్లెట్ యొక్క ప్రభావం అయి వుంటుందని సజ్జన్ గ్రహించి వేసాడు. చాలా వరగ్గా ప్రవర్తిస్తూ పైకి ఏమీ తెలియనట్లుగా "ప్రతి మంచి పనికీ నా సహకారం ఎప్పుడూ వుంటుంది. చెప్పండి, నన్నేం చేయమంటారు?" అని అడిగాడు.

సాలిగ్రాం యుక్తిగా అన్నాడు- "మహాశయా! మేం రాజకీయాల బురదలో దొర్లుతుంటాం. మాకు మీటింగులు చెయ్యడం, అందులో వుపన్యాసాలు ఇవ్వడం- ఒక్కటే విషయం తెలుసండి. ప్రజా సామాన్యుల జ్ఞానాన్ని పెంచడానికి ఏదైనా వుపాయం మీరే చెప్పండి".

"అవును బాయీ నువ్వు దేశం అంతా తిరిగి వచ్చావు. ప్రజల్ని ప్రభావితం చెయ్యగల ఏదైనా వుపాయం చెప్పు. [illegible] లో మొన్న పెట్టించి చూశావు బొమ్మల ఎగ్జిబిషన్. దాన్నే కొద్ది కొద్దిగా మన ఊళ్లోకి తెప్పు అని చెప్పాను".

"దాని వల్ల ఏమీ ప్రయోజనం వుండదు. దాన్ని చాలా మంది చూశారు. పైగా మీలో ఇప్పుడు బొమ్మలాట కొనేవారు కూడా ఎవ్వరూ లేరు. హ హ హ... మీ చిత్రాల ప్రదర్శనం పెడితే బాగుంటుందని నేను వారికి సలహా ఇచ్చాను. దీనివల్ల ఈనాటి కళను ప్రజలు తెలుసుకోవడానికి అవకాశం దొరుకు

తుంది" అంటూ సాలి గ్రాం ప్రసంగానికి కావలసిన మలుపు ఇచ్చారు. సాలిగ్రాం అంచనా ప్రకారం అతను సంధించిన బాణం వెళ్ళలక్ష్యానికి తగిలింది తన చిత్రాలతో ప్రదర్శనం పెట్టే ప్రస్తావన సజ్జన్‌కు నచ్చింది.

సాలిగ్రాం మళ్ళీ అందు కున్నారు— "హర్ ఎక్సలెంసీ ద్వారా దీనికి ప్రారంభోత్సవం చేయిద్దాం. ఇరవయ్యో తేదీకల్లా మనం బ్రహ్మాండంగా ఈ ప్రదర్శనాన్ని చెయ్యాలి. అన్ని పనులు నెరవేరు తాయి... అయితే సజ్జన్ గారూ, మీరు ఆర్టిస్టులందరి చిత్రాల్నీ సేకరించండి అలా సేకరించడం ఒకవేళ ఇబ్బందిగా వుంటే మీ చిత్రాలతోనే ఏర్పాటు చేద్దాం. ఒకటి ఆరా గాంధీగారి చిత్రాలు కూడా వేయండి.''

దీనికి నవ్వుతూ సజ్జన్ అన్నారు— ''అంటే ఇది కూడా ఎలక్షన్ స్టంటులో ఓ భాగం అన్నమాట''.

లాలా జానకీశరణ్ చిన్నగా నవ్వారు. సాలిగ్రాం ఏమీ మాట్లాడ కుండా గంభీరంగా ముఖం పెట్టారు. లాలాజీ అందుకుని "దీనివల్ల ఎలక్షన్‌కు కూడా కొద్దిగా లాభం వుండొచ్చు. కాని మా తలంపంతా ప్రధానంగా ప్రజానీకానికి ఈ చిత్రాల ప్రదర్శనం ద్వారా చైతన్యం కలిగించాలనే" అని అన్నారు.

తానేగాక నగరంలోని చిత్రాకారు లందరి సహకారంతో ఓ చిత్రాకళా ప్రదర్శనాన్ని ఏర్పాటు చేయడానికి సజ్జన్ అంగీకరించాడు. వెళ్ళుతూ వెళ్ళుతూ ప్రదర్శనానికి సంబంధించిన కరపత్రం వేయడానికి దాంట్లో సజ్జనూ అతని యిద్దరి స్నేహితుల పేర్లూ వేయ డానికి అనుమతి పొందారు.

మహిపాల్ తన పేరు వేయడానికి అభ్యంతరం చెపుతాడని అనుకోలేదు సజ్జన్. అతనిప్పుడు కలుసుకుందామా అనీ, ఆమెను కలుసుకొని ఈ ప్రదర్శనం ఏర్పాటుకు తాను అంగీకరించడం వల్ల ఆమె మరో విధంగా భావించరాదనీ కోరాలనుకుంటున్నాడు. సాలిగ్రాం ఒకవేళ తన ఎత్తులో సజ్జన్‌ని చిత్తు చేయా లనుకుంటే దానికి పైఎత్తు వేసి అతణ్ణి చిత్తుగా ఓడించగలడు.

లాలా జానకీశరణ్‌ను తనకారులోనే దిగబెట్టించాడు సజ్జన్.

సజ్జన్ తన గదిలోకి వచ్చాడు. నిన్నటి వాడిపోయిన పూలు చూడగానే తటాలున పెద్దమ్మ జ్ఞప్తికి వచ్చింది సజ్జన్‌కు. నిన్న వేళ నోట్లో గుడ్డలు కుక్కు-మందానికి కట్టేసి వుండగా చూశాడు. ఇంత అయినా కూడా దొంగ తనానికి కాక పిల్లికూనలు ఆకలిగావున్నాయని ఎంతో విలవిలలాడింది. పెద్దమ్మ స్వభావంలోవున్న ఈ వైరుధ్యం చూసి అతనికి ఆశ్చర్యం వేసింది, ఎప్పుడూ పరుల్ని ద్వేషించే పెద్దమ్మ దయారసం చిందించగల్గినప్పుడు తప్పుతోవపట్టిన తన మనస్సును ఎందుకు సక్రమమార్గంలో పెట్టలేడు? ...తనకు కన్య మళ్ళీ మళ్ళీ ఎందుకు జ్ఞాపకం వస్తోంది? కన్య తనను మంచివాడిగా అనుకుంటుందా, చెడ్డవాడిగా అనుకొంటుందా అన్న తలంపే ఎందుకు రావాలి? మనస్సును ఏకాగ్రం చేసుకుని సజ్జన్ పెద్దమ్మ చిత్రాన్ని గీయడం ఆరంభించాడు.

అలాంటి సమయంలో మహాకవి బోర్‌గారు పళ్ళు ఇకిలిస్తూ గదిలో మెల్లిగా అడుగుపెట్టాడు. బోర్‌ని చూడగానే సజ్జన్‌కు అరికాలి మంట నెత్తికెక్కింది. అయినా నోరు విప్పకుండా తన పని చేసుకుంటున్నాడు.

విరహేష్ "నాకు తెలుసు సజ్జన్ భాయి! ఈ సమయంలో తాముకళా సాధనలో మునిగి తేలుతూ వుంటారని." అని వెకిలిగా నవ్వుతూ "ఎవరి చిత్రాన్ని గీస్తున్నావ్?" అని సజ్జన్‌ను ప్రశ్నించాడు.

"నీ తలకాయ!" అని అందామనుకున్నాడు సజ్జన్. కాని ఎందుకోవూరుకున్నాడు. కిమ్మనకుండా బ్రష్‌తో పని సాగించటం మొదలెట్టాడు.

విరహేష్ బయటి తలుపుకు ఆనుకుని చతికిలపడ్డాడు. పెద్దకోరలు ఇంటి కిటికీ వైపు చీటికి మాటికి చూస్తూ, ఏదేదో కల్పించుకుని బిగ్గరగా నవ్వుతూ వెకిలి చేష్టలు చేస్తూ ముప్పావుగంట గడిపాడు. మధ్యమధ్య నేను తాజాగారాసిన గీతాలంటూ వినిపించాడు.

చెయ్యి చూపిస్తూ సజ్జన్ చాలాసార్లు విరహేష్‌కు నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు, ఈ సమయం రచ్చచేయవద్దని ఇక్కడ నుంచి పలాయనం చిత్తగించమని ఒకసారైతే నోరు కూడా విప్పి కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు "నాకిప్పుడు ఏకాంతం కావాలి. మరో సమయంలో రా" అని.

"మరో సమయంలో వస్తా అనుకో. కాని....సజ్జన్ భాయీ అసలు విష యం ఏమిటంటే నీ దగ్గరకు వస్తే నాకేమిటో ప్రేరేపణ కలిగినట్లుంటుంది. నీ ఇంటికి వస్తే ఏదో కొత్తస్ఫూర్తి కొత్త చైతన్యంతో నా మనస్సు ప్రాణం పోసుకున్నట్లు అవుతుంది. నేను నిన్ను-మిమ్మల్ని తొందర చేయనుగా. ఇక చూడు నేను నోరు విప్పితే అడుగు''.

అవిధంగానే కాస్సేపటి వరకు బోర్ పెద్దకోడలు కిటికీ వైపు చూస్తూ మెదలకుండ కూర్చున్నారు. మళ్ళీ కూనిరాగం తీయడం మొదలెట్టారు. మళ్ళీ అతని పుర్రెలో ఏం దూరిందో ''సజ్జన్ భాయీ'' అంటూ అతణ్ణి పలకరించారు. "టీ చెయ్యనా? నాకు మంచి మూడ్ వస్తోంది". అంటూ సజ్జన్ బదులు చెప్పకముందే స్టౌవ్ దగ్గరకు చేరపోయాడు. స్టౌవ్ వెలిగించి నీళ్ల పెట్టారు. ఓ నిట్టూర్పు విడుస్తూ పురాణం మొదలెట్టారు-''సజ్జన్ భాయీ, గాలిబ్ మహాకవి ఎంత బాగారాశాడు ప్రేమగురించి-

ఇష్క్ పర్ జోర్ నహీ హై యే ఓ ఆతిష్ గాలిబ్"
కి లగాయే న లగే ఔర్ బుఝాయే న బనే

[ పణయం అంటే ఒక చిత్రాతి చిత్రమైన అగ్నిజ్వాల. అది అంటిస్తే అంటుకోదు. ఆర్పితే ఆరిపోదు.]

"ఆహా! సజ్జన్ భాయీ, మీతో నిజం చెపుతున్నాను హృదయం రగలు నంతకాలం ఏ కవి కూడ మహత్తర రచన చెయ్యలేదు సుమా. మీరు చూస్తూ వుండండి. అతి త్వరలోనే నా రెండో మహత్తర గీతాన్ని రాయబోతున్నాను''.

సజ్జన్ మాట్లాడకుండా బొమ్మకి రంగులు వేస్తున్నారు. విరహేష్ మళ్ళీ తలుపు దగ్గరకొచ్చారు. తలుపుమీద చెంప ఆనించి, పెద్దకోడలు కిటికీ వైపు చూస్తూ మళ్ళీ కూనిరాగం తీయడం మొగలెట్టారు. ''బాట్ తుమ్హారి తక్తే ప్యారీ! అంఖియాన్ హారి అంఖియాన్ హారీ'' [ప్రేయసీ, నీ కోసం ఎదురు చూసి చూసి నా కళ్లు కాయలు కాచాయి.]

టీ తయారయింది. వీరహేష్ ఒక్కడే టీ అంతా తాగేశాడు సజ్జన్ సిగరెట్ కేసులోని సిగరెట్లన్నీ వూదేసాడు. చాలాసార్లు మనోవ్యధను ఒలికిస్తూ పాటలు పాడాడు. ఒక్క పర్యాయం పెద్దకోరలు కిటికీ దగ్గర తటుక్కుమని ఎవరి ముఖమో మెరిసి మాయమైంది. మజునులా విరహేష్ దారెడంత కళ్లు చేసుకుని అటువైపు చూశాడు. అతనికి కావలసిన వ్యక్తి కాదు. నిరాశతో విరహేష్ మరింత బిగ్గరగా విరహగీతాలు పాడడం మొదలెట్టాడు.

మెట్లు ఎక్కుతూ వస్తోన్న మహిపాల్‌కు కళ్లు మూసుకుని చెంపచెయ్యి ధరించి తన్మయంగా పాడుతూన్న విరహేష్ కంటపడ్డాడు. ఆ అవతారాన్ని చూడగానే అతనికి కంపరం పుట్టుకొచ్చింది.

ఎవరో వస్తున్న అలికిడికాగానే కన్య వస్తూందని అనుకున్నాడు సజ్జన్. అతని మనస్సు ఉల్లాసంతో నిండిపోయింది.

తలుపుకు అడ్డంగా చతికిలబడ్డ విరహేష్‌ను చూస్తూ "కొంచెం కాళ్లు ముడుచుకుంటావా మహాకవీ! లోపలకు పోనీయ్" అని అన్నాడు మహిపాల్.

"గురూ, గురూ" అంటూ మహిపాల్ రెండు కాళ్ళు పట్టేసుకున్నాడు; విరహేష్. ముఖం మీద కొచ్చిన జులపాలను వెనక్కు విసురుకుంటూ లావు కళ్ళద్దాల్లోని గుడ్లని భావయుక్తంగా ఆడిస్తూ "గురువుగారిని సందర్శించుకున్నాను. ఇక నా పని నిర్విఘ్నంగా నెరవేరుతుంది" అన్నాడు.

కన్యకు బదులుగా మహిపాల్ రావడంతో సజ్జన్‌కు కొంత ఆశాభంగం కలిగింది. అయినా మనసు సరిపెట్టుకున్నాడు.

మహిపాల్ ఎంతో అలసిపోయినట్లుగా కదిపించాడు దిండును ఆసరా చేసుకుని కూర్చున్నాడు. స్నేహితుని ముఖవర్చస్సు కనిపెట్టిన సజ్జన్ బ్రష్‌ను పక్కపెట్టేశాడు.

"గురువుగారూ మళ్ళీ ఓ కొత్తపాట రాస్తున్నాను" అ విరహేష్ అన్నాడు.

సజ్జన్ మర్యాదగా విరహేష్‌కు చెప్పాడు-"విరహేష్ మహిపాల్‌తో నేను కొన్ని అవసరమైన విషయాలు మాట్లాడాలి".

''ఆఁ ఆఁ. నిర్భయంగా మాట్లాడుకోండి. నేను డాబా మీదకు పోతాను. ఇవ్వాళ గురువుగారొచ్చారు. వారి దయవల్ల నాపాట పూర్తి అయిందంటే-గురువు గారూ, మీరు ఆశీర్వదించారంటే, ఇది నా రెండో మహత్తర గీతం అవుతుంది. ఇది పూర్తి చేయడమే ఆలస్యం. చక్కా కొంటాయి వెళ్ళిపోతాను". గొప్ప కార్యాన్ని సాధించాలనే కాంక్షను గుండెలో పదిలపరుచుకొని, వుంగరాల జుత్తు వెనక్కు తోసుకుంటూ విరహేష్ లేచాడు. ఒళ్ళంతా విరుచుకుంటూ పెద్దకోడలు కిటికీ వైపుగా చూస్తూ బయటికి నడిచాడు.

విసుక్కుంటూ సజ్జన్ అన్నాడు-"పీడ దుంప తెగ, పట్టుకుంటే జలగలా ఒదలడు. ఎవరు చెప్పినా వినడు ఒక్క కర్నల్ మినహా. సరే, ఎందుకలా దిగులుగా వున్నావ్? వదినగారితో ఏమైనా మహాభారతం నడిచిందా?"

కాదన్నట్టుగా తల ఆడించాడు మహిపాల్. సజ్జన్ మళ్ళీ అడిగాడు-''నువ్వేదో దిగులుగా వున్నావ్. నిన్న నీ మరిది పెళ్ళని కర్నల్ చెప్పారే"

"పెళ్ళి మొన్నే అయిపోయింది. నిన్న సమారాధన''

సజ్జన్ కొంచెంసేపు మౌనంగా వుండి మళ్ళీ అడిగాడు - "అయితే ఏదో బహుమానం ఇవ్వాల్సివుంటుంది".

"ఇచ్చేసాను''

ఏమీ తోచక సిగరెట్ కేసు తీసాడు జేబులోంచి, కేసు ఖాళీ. బయటికి చూస్తూ ''అరే లోర్" అంటూ పిలిచాడు.

"సిగరెట్టా, ఇదిగో'' అంటూ మహిపాల్ జేబులోంచి పెట్టె తీసి సజ్జన్ వైపుకు విసిరాడు నేలమీద.

"గురూ, నాకూ ఒక్క సిగరెట్'' అంటూ ఒక్క పరుగులో వచ్చాడు లోర్.

మహిపాల్ లోర్ని అడిగాడు-''ఏం చేస్తున్నావ్ ఇప్పుడు'' నేలమీద సిగరెట్ ప్యాకెట్ చేతిలోకి తీసుకుని వాళ్ళిద్దరికీ చెరి ఒక సిగరెట్టు అందిస్తూ నవ్వుతూ లోర్ అన్నాడు-''గురూజీ, పనా. అదే ఈ పాట రాస్తున్నాను''

"నీ పొట్ట ఎలాగడుస్తుంది? కుటుంబాన్ని ఎలాపోషిస్తున్నావ్? నీకు పెళ్ళయిందనీ, పిల్లా జల్లా వున్నారని విన్నాను.

"పిల్లా జల్లా అంతా పుట్టింట్లో వున్నారు, గురూజీ. మీకేమని చెప్పను గురూ నా భార్య గురించి. మా ఆవిడ బొత్తిగా పల్లెటూరు గొడ్డనుకోండి. ఆమెతో నేను వున్నానంటే నా కవిత్వం అంతా మంట కలిసి పోవాల్సిందే. శుద్ధపల్లెటూరి బైతనుకోండి".

"పిల్లలెంత మంది?"

"మీ దయవల్ల అయిదుగురు గురూ.

ఆమాట విని మహీపాల్‌కు అరికాలు మంట నెత్తికెక్కింది. "ఐదుగురు పిల్లల్ని పెట్టుకుని బేవార్సుగా వున్నావా? నీకు సిగ్గులేదూ? మరి వాళ్ళ బతుకు తెరువు?" అంటూ గద్దించి నట్లుగా నిలదీసి అడిగాడు.

విరహేష్ ఏమీ బదులు చెప్పకుండా సిగరెట్టు దమ్ములాగు తున్నాడు.

"ఏదైనా ముఖ్యమైన పెయింటింగు వేస్తున్నావా? లేకపోతే మీ యింటి కెళ్దాం. ఇక్కడ నాకు వూపిరి ఆడటం లేదు" అని సజ్జన్‌తో అన్నాడు మహీపాల్.

"అయితే పద. నేనిక్కడో వ్యక్తి వస్తాడేమో అని చూస్తూన్నా?"

"వస్తానని ప్రామిస్ చేసారా?"

"లేదు"

పానకంలో పుడకలా విరహేష్ వాళ్ళ సంభాషణలో జోక్యం చేసు కుంటూ "నువ్వు వెళ్ళుతూంటే తాళం నాకిచ్చిపో సజ్జన్ భాయ్. నాకు మూడ్ వస్తోంది. కొంచెం సేపురాసు కుంటాను?" అన్నాడు.

విరహేష్ అఁ ఊఁ అని బలిమాలు తున్నాడు. మహీపాల్ చాలా విసుగ్గా అన్నాడు. "తొందరగా వెళ్దాం పద. ఇక్కడే ఇంకొంచెంసేపు గనక వున్నా నంటే ఎవర్నో ఒకర్ని కొట్టి పారేస్తాను. నాకు ఇక్కడ బొత్తిగా బాగోలేదు"

సిగరెట్టు దమ్ము లాగుతూ విరహేష్ డాబాపైకి వెళ్లారు. అతను పోగానే విసుక్కుంటూ మండి పడుతూ అన్నాడు, "వాడొస్తేనే తలనొప్పి. ఎప్పు డొచ్చినా మూడ్ అంతా చెడ గొడతాడు''.

"నువ్వే నెత్తికెక్కించుకున్నావ్'' అన్నాడు మహీపాల్.

మధ్యలోనే కల్పించుకుని "ఇవ్వాళ వుదయం సాలిగ్రాంగారు లాలా బానకీ శరణ్‌గారు నా దగ్గర కొచ్చారు. ఇక్కడ వీధిలో ఆర్ట్ ఎగ్జిబిషన్ పెడ్తా రంట" అని చెప్పాడు సజ్జన్.

"పెట్టు కోనీయ్ దొంగ వెధవల్ని"

"మనల్ని ఈ సభ ఏర్పాటు చేయమన్నారు".

"ఆ నీచుల ముఠాలో నేను చేరను. ఈ దబ్బుగం వాళ్ళు ఆ కాంగ్రె సోళ్ళు ఇద్దర్నీ నమ్మడానికి వీల్లేదు''.

సజ్జన్ నవ్వుతూ మొన్న విమానాల మీద నుంచి మనం సాధించిన అద్భుతం బాగా పని చేసిందని నాకు తెలుసు. నేను సరేనన్నాను. ఒక వేళ వాళ్ళు మనల్ని తెలివి తక్కువ వారి కింద జమ కడితే మనమే తిప్పి కొడతాం" అన్నారు.

"వాళ్ళ కంటే నువ్వు తెలివిగల వాడివను కుంటున్నావా? మోస పోతావు''

''ఎందుకోయ్ మోస పోయేది? మనం ఏమైనా వాళ్ళతో పొలిటికల్‌గా ఒప్పందం చేసుకున్నామా ఏమి? ఈ నెపంతో వీధిలోని వాళ్ళందరితోనూ పరి చయం కలుగుతుంది'',

''దాని కోసం ఇంకో మార్గం ఆలోచించు, వీళ్ళతో కుమ్మక్కై ఏ పని చేసినా తప్పే"

పిట్టగోడ మీద ఆనుకుని విరహేష్ ఎదురుగా కన పడుతోన్న కిటికీ వైపు చూస్తూ పాడుతున్నాడు. సజ్జన్ తాళం వేస్తుండగా బోరగారికి చంద్ర ముఖి దర్శనమైంది. అంతే. బోరుగారి నరనరం వుబ్బి పోయింది. మహీపా

అయితే తన ఆలోచనల్లో మునిగి తేలుతూ వున్నాడు. తాళం వేసిన తర్వాత సజ్జన్ చూశాడు బోర్ కోసం. గుండెపై చెయ్యి పెట్టుకుని మత్తు నిండిన కళ్లతో పైకి చూస్తూ తనకు తానే పులకరిస్తూ పాడు తున్నాడు విరహేష్. సజ్జన్ పైకి చూడ కుండానే "ఇంక పద" అన్నాడు.

"వస్తున్నా, స్నేహితుడా, ఇప్పుడే వస్తున్నా. కొంచెం ఆగవయ్యా". అని అంటూ మళ్ళీ పాట లంకించు కున్నాడు.

మహీపాల్ బోర్ మీద మండి పడుతూ బెదిరించాడు. "చాల్లే ఈ వెధ వేషాలు, ఇంక పదపద. ఆలస్యం అవుతోంది. మర్యాదగా కదులు ఇక్కణ్ణుంచి.

మహీపాల్ ముందు మెట్ల మీదకు దిగాడు. అతని వెనక సజ్జన్. వీళ్లిద్దరి వెనుక బోర్ వెనక్కి చూసుకుంటూ మెట్లు దిగు తున్నాడు. అమాంతంగా మెట్లు మీద నుంచి కాలు జారింది. తపుక్కున వచ్చి సజ్జన్ వీపు మీద పడ్డాడు. సజ్జన్ బోర్ బరువును ఆపుకోలేక మహీపాల్ మీద వచ్చి పడ్డాడు. మహీపాల్ రెండు చేతుల్ని మెట్లకు రెండు వైపులా గట్టిగా మోపి నిలబడి పోయాడు. మహీపాల్ ఆపక పోయివుంటే అందరు దొర్లేవారే. ఆ చప్పుడుకు సర్దార్జీల అద్దె వాళ్ళు "ఏమైంది ఏమైంది" అంటూ కిందచేరారు. సజ్జన్ భుజానికి దెబ్బ తగిలింది మహీపాల్ బుర్ర వేడెక్కి పోయింది. అమాంతంగా కోపంలో బోర్ జుత్తు పట్టు కొని ఈడుస్తూ నాలుగు వడ్డించాడు "చూస్తూ నడవలేవట్రా. నాలుగు తన్నులు తగిలించా నంటే భావ కవిత్వం గీవ కవిత్వం కక్కేస్తావ్. గుర్తుంచుకో" అని బెదిరించాడు.

జారి పోతోన్న కళ్ళద్దాల్ని సవరించుకుంటూ, "గురూజీ" అంటూ కాళ్లా వేళ్లా పడ్డాడు బోర్. మహీపాల్ చేతిని విడిపించి సర్దాడు సజ్జన్. బోర్ తుమ్ములు తింటూంటే సర్దార్జీల పిల్లలు మహా సరదాగా పకపక నవ్వ సాగారు.

బోర్‌పైపు చూడ కుండా సజ్జన్ చెయ్యి పట్టుకుని మహీపాల్ గేటు వైపుగా వెళ్లాడు. కోపంలో విరహేష్‌ను కొట్టాడేకాని మళ్ళీ నాలుక కరచు

కున్నాడు. కాని బయట పడడానికి అభిమానం అడ్డు వచ్చింది. నిన్న రాత్రి జరిగిన సంఘటన తర్వాత అతని మనస్సు చాలా అస్తవ్యస్తంగా వుంది.

సొంత బావమరిది పెళ్ళి వారు లక్నో వచ్చారు. మామూలుగా అతను దాయాదులూ, బంధు కోటిలో పెళ్ళి పట్నాలకు వెళ్ళకుండా తప్పించుకుంటాడు కాని ఈసారి తప్పని సరైంది. రేపు రాత్రి ఆడపిల్ల పెళ్ళివారి యింట జరగ బోయే సమారాధన గురించి మాటల సందర్భంలో మన సమాజంలో పాతుకు పోయిన కుళ్ళు గురించి ఘాటుగా విమర్శలు చేశాడు మహీపాల్. ఎవరో నున్నగా గుండు గొరిగించు కున్న ఓ బ్రహ్మణోత్తముడు మహీపాల్ మీద వ్యంగ్యోక్తులు విసిరాడు. "నాస్తికులు కదూ. అందుకని సనాతన ధర్మాన్ని ఈసడించు కుంటారు, నిందిస్తారు. మొదట్లో సేఠ్‌జీని చిక్కించు కొని ఇల్లు నింపు కున్నారు. ఇప్పుడు డాక్టరమ్మను పట్టారు. కిరస్తానీ వాళ్ళతో విందులూ విహారాలూ". మహీపాల్‌కు పట్టలేని కోపం వచ్చింది. చివరకు అతని మామగారు ఆ బ్రాహ్మణ్ణి అల్లుణ్ణి కాళ్ళా వేళ్ళా పడి బతిమాలి ఆ వాగ్వివాదం యుద్ధ కాండ కింద మారకుండా చేసాడు.

తార్కమణి వుదయాన్నే సవతివిషయమై నాలుగైదు సార్లు గుచ్చిగుచ్చి అడుగుతూ బాకా వూదింది. మహీపాల్ అలిగి ఇక్కడకు వచ్చాడు. ఆ కోపం అంతా విరహేష్ మీద చూపించాడు. "నువ్వు కోపాన్ని కొంచెం తమాయించు కోవాలిమిత్రమా'' అని ఇందాక సజ్జన్ చెప్పాడు.

లోపల కుతకుత ఉడుకు తోంచే అప్పు చేసుకోలేక పోయాడు మహీపాల్. "చేతల్లోనా తమాయించు కునేది. నేనసలు జీవితంలోనే అలిసి పొయ్యాను"

అంతటితో సంభాషణ ఆగి పోయింది. ఇద్దరు మిత్రులూ రెండు సందులూ దాటి ముందుకు వెళ్లారు.

# 17

మహీపాల్ శుక్లా తాలూకాదారీ వంశానికి చెందినవాడు ఇద్దరు అక్కలూ ఒక తమ్ముడూ మొత్తం వాళ్ళు నలుగురు. అతని తండ్రి జిల్లా హైస్కూల్ హెడ్‌మాస్టరు. అతను ఎంతో స్వాభిమాని. వున్నది ఉన్నట్లుగా మాట్లాడే స్వభావం. నీతికి నిజాయితీకి పెట్టింది పేరు పెద్దఇళ్లలో తరుచుగా కనబడే బలహీనతలన్నీ మహీపాల్ తల్లిగారిలో వున్నాయి. నెలకు ఇరవై రోజులు ఆమె పుట్టింట్లోనే మకాం. కూతురంటే తండ్రికీ అన్నలకీ అంతులేని ప్రేమానురాగం. ఎక్కువ కాలం పుట్టింట్లో వుండడం కారణంగా ఇంటి కోడళ్ళపై పెత్తనం చలాయించేది. ఎస్టేటు అంతఃపుర కలహాలు ఎత్తులు వేసి నడపడంలో ఆమె అందెవేసినచెయ్యి. కొంతవరకు ఆమె కర్కోటకంగా వుండేది. ఆమె అంటే లోలోన అసూయపడుతుండేవారు ఇంటిల్లిపాదీ.

మహీపాలు ఇద్దరి అక్కల్ని మంచి కుటుంబాల్లో సంబంధాలు చూసి వివాహంచేసారు. మహీపాలు కూడా మంచి కుటుంబంలో వివాహం చేసుకున్నాడు. అతని వివాహం అయిన కొద్దిరోజులకే ఇంటి పరిస్థితి మారడం ప్రారంభించింది. తండ్రిగారు తీవ్రంగా జబ్బుపడి దానితోనే ప్రాణం వదిలారు తండ్రి చనిపోయిన సంవత్సరం పూర్తికాగానే పెద్దమేనమామ కాలం చేసాడు. పెద్ద అన్నగారు మరణించగానే పుట్టింట్లో వుండలేకపోయిందిమహీపాల్ తల్లి. మొదలే ఆమె పుట్టింట్లో అందరినీ విరోధం చేసుకుంది. అవకాశం రాగానే వాళ్ళు కాటు వేయసాగారు. ఒకసారి అవమానకర పరిస్థితుల్లో పట్టుబడ్డది. అంతే అకళం కాన్ని మోయలేక ఆమె ఆత్మహత్య చేసుకుంది.

తల్లి చనిపోయిన తర్వాత మహీపాల్, అతని భార్య, తమ్ముడు జయపాల్ ముగ్గురు ఏ మాత్రం తాతగారింట్లో వుండలేకపోయారు. ఆడబిడ్డ మీద కసిని అత్తంతా ఆమె కొడుకులమీదా కూతుళ్ళ మీద తీర్చుకోవడం మొదలెట్టారు. అప్పుడు మహీపాల్ ఇంటర్మీడియట్ చదువుతున్నాడు. అతని తమ్ముడు తొమ్మిదిలోవున్నాడు.

సాహితీ విషయాలంటే మహీపాల్ చిన్నప్పటి నుంచి చెవికోసుకునేవాడు. తల్లిపట్ల శ్రద్ధాభక్తులు, తండ్రిపట్ల ఆకర్షణ, కష్టంచూస్తే కదిలిపోయే అతని మనస్సులోని లోటు భర్తీచేసాయి. చిన్ననాటినుంచి తండ్రి దగ్గరే వుండాలనే కోరికవుండేది మహీపాల్‌కి. కాని తల్లి మొండికావటం వల్ల అతని కోరిక నెర వేరలేదు. అతని తండ్రి చాలా శాంతస్వభావం కలవాడు. గంభీరంగా ఆలో చించే వ్యక్తి, అప్పుడప్పుడు కాస్తోకూస్తో, ఏదో రాస్తూ వుండేవాడు. తండ్రిగారు సవైయా, ఘనాక్షరీ ఛందస్సులో ఖడీబోలీ భాషలో రాసిన అతని కావ్య సంగ్రహం మహీపాల్ దగ్గర ఈ నాటికీభద్రంగా వుంది. చరిత్ర, సంఘం, విద్య మొదలైన విషయాలకు సంబంధించిన వ్యాసాలు అతను అప్పుడప్పుడు రాస్తుండే వాడు. అతని రచనల్ని 'సరస్వతి', 'మాధురి', 'చాంద్', 'సుధ', మొదలైన పత్రికలు ప్రచురించేవి. చిన్నతనం నుంచి తండ్రి మొస్తరుగా విద్యను ఆర్జించా లనీ, తండ్రిమాదిరిగా ఓ రచయితగా రాణించాలని బలవత్తరమైన కోరిక వుండేది. ప్రేంచంద్, భవిష్య, ప్రతాప్, అభ్యుదయ మొదలైన వారి రచనల ప్రభావం అతనిపై పడింది. తన మేనమామలూ, వారి దగ్గర పనిచేసే చిల్లర గుమాస్తాలూ వ్యవసాయదారుల్ని పీడించుకు తింటుంటే అతని మనస్సు బాధ పడేది. కట్టుకుంటానికి జానెడు పేలికైనా నోచుకోలేని ఈ బీదవాళ్ళపై అఘా యిత్యాలు చేస్తున్నట్లు తర్కించుకుంటోంటే అతని మనసు కలచివేసేది. పంటపండించేవారిని బెత్తాలతో హింసించడం, వాళ్ళను చెట్లకు తలకిందుగా వేలాడతీసి కింద మంటలు పెట్టడం, ఇష్టంవచ్చినట్లు వెట్టిచాకిరీ చేయించుకుని తిండి కూడా పెట్టకుండ మలమల మాడ్చడం, వాళ్ళను దోపిడీ చేయడం మొద లైన ఇంకా ఎన్నో అత్యాచారాలు రోజూ అతను చూస్తూవుండేవాడు. అవి చూసి అతని మనస్సు వెన్నపూసలా కరిగిపోయేది. తన మామలు మగ్గురూ పూరిలోని ఆడవాళ్లను బలాత్కారం చేయడం కూడా ఎన్నోసార్లు చూశాడు. ఆ ముగ్గురి లోనూ, రెండో మామ వట్టి వ్యభిచారి. కన్నెపిల్లల్ని చెడగొట్టడం అంటే ఎంతో వుత్సాహం ఆయనకు.

కూతురి ఈడు వున్న ప్రతి బీదరైతు పిల్లా అనుభవించే వస్తువు, అతని దృష్టిలో. అతని ఆత్మ ఎంతమాత్రం అలాంటి తలపుకు క్షోభించదు.

దసరా, క్రిస్మస్ లేదా వేసంగి శలవులు రాగానే మహీపాల్ తండ్రి దగ్గరకి వెళ్లేవాడు. అక్కడ ఎన్ని రోజులు వున్నా ఇబ్బందిగానే వున్నట్టుండేది. మళ్లీ అమ్మదగ్గరకొస్తూంటే పచ్చిక మైదానాలలో నుంచి తోలివేసిన ఆవుదూడలా అయిష్టంగా వుండేవాడు. జీవితాంతంగా అతణ్ణి పట్టి ఎవరో గాలీ వెలుతురూ చొరని బందిఖానాలోకి లాగుతున్నట్టుగా అనిపించేది. గంజాయి, సారాయి, బంగు, కొట్లాటలు, హత్యలూ, మానభంగాలు, అత్యాచారాలూ, లంజతనాలు, ఇలాటి ఎన్నో దురాచారాలకూ, దురాగతాలకూ నెలవైన తాలూకాదారీ వాతావరణంలో వుంటూ రాత్రింబవళ్ళూ దానిలోంచి బయటపడాలని తపించేవాడు. కాని అతనేం చెయ్యగలడు? అతని నాలుకను మాట్లాడనీయకుండా ఎవరో కోసివేసినట్లుండేది. అలాంటి మూగ నోము పడుతున్న సమయాలలో సాహిత్యం అతని భావప్రకటనకు వీలైన మార్గంగా కనపడింది. కవిత్వంతో శ్రీకారం చుట్టి కథలు రాయడం ప్రారంభించాడు. తండ్రిగారి మాదిరి అతను కూడా డైరీ రాయడం అలవాటు చేసుకున్నాడు. ఈ అలవాటే తర్వాత కథా రచనకు బాగా సాయపడింది. ఇంటర్మీడియట్ పరీక్ష పాసు అయ్యేటప్పటికి 'చాంద్', 'సుధ'లో అతనివి ఐదారుకథలు ప్రచురితమయ్యాయి.

తల్లిగారు మరణించిన తర్వాత ఇంకా ఆ ఊబిలో కూరుకుని వుండడం అతనికి అవమానకరం అనిపించింది. ఒక రోజు తాతగారింట్లో తీవ్రంగా తగాదా పడ్డాడు. ఇంటర్ పరీక్షా ఫలితాలు ఇంకా ప్రకటించకముందే తన కొత్త పెళ్లికూతుర్ని తీసుకుని బయటికి వచ్చేసాడు. బయటికి రావడానికి భార్య అడ్డుపెట్టలేదు సరికదా పైగా అతనిలోని స్వాభిమానాన్ని రేకెత్తించి వేరుగా రావడానికి పురికొల్పింది కూడా. వేరేకాపురం పెట్టాలనే వుద్దేశ్యంతో ఉద్యోగాన్వేషణకోసం లక్నో వచ్చాడు.

అది 1980వ సంవత్సరం. దేశం అంతావుద్యమాలతో అట్టుడికిపోతోంది. 'సుధ' సంపాదక శాఖలో నెలకు నలభై రూపాయలమీద ఉద్యోగం దొరికింది. అక్కడ పనిచేస్తోంటే దిగ్గజాల్లాంటి సాహితీవేత్తల దర్శనభాగ్యం కలుగుతుండేది మహీపాల్‌కు ఇక్కడ వుంటూండగానే ప్రేమ్‌చంద్, నిరాలా, మిశ్ర

బంధు, సుమిత్రానందన్ పంత్, రూప్‌నారాయణ్ పాండె, కృష్ణ బిహారీమిశ్ర మొదలైన ఎంతోమంది సాహితీ బంధువుల్ని చూడడం తటస్థించింది. దానివల్ల అతనికి తనసాహితీవ్యక్తిత్వాన్ని నిర్మించుకుని పెంచుకొనే అవకాశం లభించింది. నిరాలాగారితో అతనికి ఎక్కువగా సాన్నిహిత్యం వుండేది ఉద్యోగంలో వుండే విసుగుదల అసహచర్యంవల్ల అతనికంత బాధాకరంగాకనిపించేదికాదు. ఉద్యోగం చెయ్యడం తన ప్రకృతికి విరుద్ధం అయినా తప్పనిసరి పరిస్థితుల్లో మనసును సరిపెట్టుకొని మహీపాల్ ఆ ఉద్యోగాన్నే అంటిపెట్టుకున్నాడు. అక్కడ చేరిన మూడునెల్లోగా అమీనాబాద్‌లో ఓ చిన్న అద్దెఇల్లు దొరికింది. వెంటనే గర్భవతిగా వున్న భార్యనూ, తమ్ముణ్ణి వెళ్ళి తీసుకొచ్చాడు. అతనికి ఆపదలో ఆదుకొనడానికి అతని భార్య ఒంటిమీద వున్న ఆభరణాలే శ్రీరామరక్షగా పని చేసాయి.

తాతగారింటి నుంచి బయటికి వచ్చేటప్పుడు భగవంతునిపైన అంతా భారం వేసి వచ్చాడు. వచ్చీరాగానే ముందు తమ్ముణ్ణి హైస్కూల్లోచేర్పించాడు. నువ్వెంతవరకు చదవాలనుకుంటే అంతవరకు నేను చదివిస్తానన్న అభయం ఇచ్చాడు తమ్ముడికి. ఒళ్ళు ముక్కలయ్యేలా శ్రమించాడు. ఒకవైపు 'సుధ'లో పనిచేస్తూమరో వైపు "బుక్ ఆఫ్ నాలెడ్జ్", చరిత్ర కోర్సుపుస్తకాలూ ఇలాంటివి ఎన్నెన్నో రాస్తూ తిర్జుమా చేస్తుండేవాడు. కాపీరైట్‌ని అమ్మేసేవాడు. ఇవికాక నెలకు ఒకటో రెండో కథలు రాసేవాడు. ఈ ప్రకారం నెలకు వందరూపాయలు సంపాదించే మార్గం ఏర్పరుచుకున్నాడు.

అప్పటి రోజులు కూడా అతని సాహిత్య కృషికి అనుకూలంగా వున్నాయి. లెక్కకు పత్రికలు తక్కువైనా చేవ గలిగిన రచయితలకు ప్రోత్సాహం లభించేది. పేరు ప్రతిష్ఠలు సులభంగా ఆర్జించుకో కలిగేవాడు. అప్పటి సాహితీ వేత్తలు కూడా చిన్న వారికి చేయూత ఇచ్చేవారు. మహీపాల్ కలంలో చేవవుంది. రాయాలనే వుత్సాహం వుంది. దానితో నెమ్మదిగా అభివృద్ధి పొంద సాగాడు.

అతని కారోజుల్లో రూప్ రతన్ అనే ఓ భాగ్యవంతునితో పరిచయం కలిగింది. రూప్‌రతన్ యువకుడే కాక అతని కథల్ని ఎంతగానో మెచ్చుకునే వాడు. అతను జాతీయ భావాలు కలవాడు. అతని తండ్రి సేఠ్ భజగోవిందదాసు పెద్ద షావుకారు. రూప్‌రతన్ స్వయంగా ఓ హేండ్‌లూం ఫ్యాక్టరీ నడుపు తుండేవాడు. అదీకాక కొంత మంది వైద్యుల్ని నియమించి ఆయుర్వేద రసాయనశాల ఆయుర్వేద ఔషధాలయం నడిపిస్తున్నారు. ద్రాక్షాసవం, చ్యవన్ ప్రకాశ్, దశమూలారిష్ట మొదలైన మందులన్నీ అతనే తయారు చేయించే వాడు. పెద్దవాళ్ళు ఎవరైనా వస్తే వాళ్ళకు తన మన కార్యాల్ని చూపించి సర్టిఫికెట్లు సంపాదించే వాడు. ఒక వస్తువుకు నాణ్యం ఎంత అవసరమో ప్రచారం కూడా అంతే అవసరం అని అతని నమ్మకం. వీటన్నిటి వల్ల అతనికి రాబడి కూడా బాగా వుండేది. రూప్‌రతన్ కాంగ్రెసు నాయకుడు కూడాను. నగర శాఖకు కోశాధ్యక్షుడు ఎవరితోనో ఉమ్మడిగా చేరి విదేశీ సారా అమ్మే దుకాణం నడుపు తుండేవాడు. రూప్‌రతన్‌కు ఎన్నో వ్యాపారాలు. ఎన్నో వ్యాపకాలు. అందరితో చక్కగా కలుస్తాడు. బాగా చదువు కొన్న వ్యక్తి. చాలా త్వరగా ప్రవాహ వేగంగా మాట్లాడాడు. 1981–82ల లోనే తాము సోషలిస్టులమని చెప్పుకొని ముద్ర వేయించు కున్న బహుకొద్ది మందిలో అతను ఒకడు.

రూప్‌రతన్‌తో మొట్ట మొదటి సారి పరిచయం జింఖానా క్లబ్బులో కలిగింది మహీపాల్‌కు. మహీపాల్ తాతగారి తరపు మనిషి లక్నో విశ్వవిద్యాలయంలో చదువు తుండేవాడు. అతనితో మహీపాల్ చాల చనువుగా వుండే వాడు. అతనితో కలిసి తరుచుగా క్లబ్‌కు వెళ్ళుతుండే వాడు. సంస్కారం దృష్ట్యా అతనిలో కులీనుల లక్షణా లున్నాయి. ఆకారణంగా సొసైటీలో అప్పర్ స్ట్రేటా వాళ్లతో సులభంగా కలిసి పోయేవాడు. లక్నో రాగానే అతను ఖాదీ ధరించడం మొదలెట్టాడు. ఆ-దువల్ల అతనిలో అణగారిన కోరిక మళ్లీ పుంజుకోవడానికి వీలు కల్గింది. ఖరీదుగల బట్టలు లేని లోటును ఖాదీ ధారణ చాలా భాగం భర్తీ చేసేది మద్యసేవనం చేస్తూండగా ఇద్దరి ఆలోచనలు ఒకే మూసలో పోసి నట్లుగా వున్నాయని రూప్‌రతన్‌కూ మహీపాల్‌కూ అని పించింది అప్పటి

నుంచి ఇద్దరి మధ్య ఎడం తగ్గి స్నేహం దిన దినాభివృద్ధి పొందింది. ఒకరోజు తానొక పత్రిక పెట్టబోతున్నట్లు రూప్‌రతన్ బయట పెట్టాడు. మహీపాల్‌కు రూప్‌రతన్ ఆలోచన బాగా నచ్చింది.

రూప్‌రతన్ తండ్రిగారి వద్ద ఎవరిదో ప్రెస్సు తాకట్టుగా వుంది. ఆ తాకట్టు ధనం అతను ఇచ్చేసాడు తండ్రికి, తర్వాత నెమ్మదిగా కోర్టు వ్యాజ్యం లోకి మళ్ళించి ప్రెస్సును హక్కు భుక్తం చేసు కున్నాడు.

అతను "నవచేతన" అనే వార పత్రిక ప్రారంభించాడు. ఆరోజుల్లో నవ చేతన నిప్పులు కక్కుతుండేది. మహీపాల్ సంపాద కత్వంలో ప్రచురించ బడుతోన్న దాన్ని మూడు పర్యాయాలు జప్తు చేసారు. జప్తు చేసిన ప్రతి పర్యాయం దాని అమ్మకం పెరుగుతోండేది పత్రికా ప్రచురణ ఆగి పోకుండా ఎంత వరకు సాధ్యమో అంత వరకే అది నిప్పులు కురిపించాలన్న అంశంపై రూప్‌రతన్ ఎలాగో మహీపాల్‌కు నచ్చ చెప్పి ఒప్పించాడు. చూస్తుండగానే 'నవచేతనా' కార్యాలయం వుదుకు రక్తం ప్రవహించే నవయువకులకు ఆటపట్టై కూర్చుంది. కొద్ది రోజుల తర్వాత నవచేతనా పబ్లికేషన్స్ అనే పుస్తక ప్రచురణ సంస్థ కూడ బయలు దేరింది.

రూప్‌రతన్ ఈ సంస్థ ఉద్దేశ్యాల్ని వివరిస్తూ సోషలిస్టు సంస్థ అని ప్రక టించాడు, ఈ సంస్థ స్థాపించడానికి కారణం లాభార్జన కాదనీ దీని ద్వారా రచయితలకూ, కవులకూ, ప్రెస్ వర్కర్లకు ఆర్థికంగా తోడ్పడడం, సోష లిజాన్ని ప్రచారం చెయ్యడమే అని వివరించాడు. సోషలిజం పేరు చెపుతూ ప్రతివ్యక్తి చేత సంతోష పూర్వకంగా శ్రమనూ, ధబ్బునూ త్యాగం చెయ్యడం నేర్పాడు. వారు చేసే ప్రతికృషి ఒక తపస్సు లాంటిదని మభ్య పెట్టేవాడు.

మహీపాల్ జీవితం సుఖంగా కదుస్తోంది. త్యాగం, తపస్సు పేరిట అతనికిచ్చే ఐదు వందల రూపాయల్లో మూడు వందలు మినహాయించుకునే వాళ్లు. రూప్‌రతన్ తియ్యగా మాట్లాడుతూ వేసిన ఎత్తుగడను భోళా అయిన మహీపాల్ అర్థం చేసుకోలేక పొయ్యాడు. అతని త్యాగ నిరతిని చూసి కంపో

జీటర్లూ, ప్రెస్సులో పనిచేసే ఇతరులూ తాము కూడా ఏదో కొంత త్యాగం చెయ్యాలనే స్ఫూర్తి పొందే వారు. మహీపాల్ చాలా అభివృద్ధిని సాధించాడు బాగా చదవడం, కథలూ నవలలూ రాయడం, ఉత్సాహంతో వూరూరు తిరిగి అక్కడ నివసించే పేద ప్రజానీకం ఎటువంటి దుర్భర పరిస్థితుల్లో జీవయాత్ర సాగిస్తూ వుంది మొదలైన వివరాల్ని సేకరించి సోదాహరణంగా రాస్తుండేవాడు. ప్రభుత్వం వారి అవక తవకలతో పాటు పెట్టుబడిదారీ వర్గం వారి బండారాలు బయట పెట్టడం అంటే రెట్టింపు వుత్సాహంతో పనిచేసే వాడు. అటువంటి విషయాలు రాస్తోంటే అతని కలంలో వేగం హెచ్చేది. ఇదంతా ఇతరులపై తన ప్రభావాన్ని పెంచుకోవడానికే రూప్‌రతన్ చేయిస్తున్నాడన్న యథార్థం మహీపాల్ పసికట్ట లేక పోయాడు.

జయపాల్‌ని ఇంటర్ పాసు చేయించి డాక్టర్ కోర్సులో చేర్పించాడు. భార్యతో అతని భావాలు కలిసేవి కావు. రోజూ మనస్పర్థలూ, తగదా పడుతుండే వాడు. కాని అతని నైతిక ప్రవర్తన ఏమాత్రం చెదర లేదు. రూప్‌రతన్ వైన్ అన్నా వుమన్ అన్నా స్వేచ్ఛగా, తేడాలేకుండా వుపయోగించే వాడు. మహీ పాల్ మాత్రం వైన్‌కు అలవాటు పడ్డాడు. రెండో దాని జోలికి పోలేదు.

1986లో ఎలక్షన్లు జరిగాయి. 'నవచేతన' ఎన్నికల్లో పరోక్షంగా ఎంతో ప్రధానమైన పాత్ర వహించింది. కాంగ్రెసు టికట్టు మీద రూప్‌రతన్ ముందు ఎం. ఎల్. ఏ అయ్యాడు. తర్వాత పార్లమెంటరీ సెక్రటరీ కూడా అయ్యాడు, ఉన్నత పదవి రాగానే తన పత్రిక పాలసీని మార్చ డానికి ప్రయత్నం చేయ సాగాడు ఆఫీసులో జరిగే ప్రతి పనికీ అడ్డు పుల్లలు పెట్టడం మొదలెట్టాడు. త్యాగం త్యాగం అంటూ ప్రెస్సు సిబ్బందికి రెండేళ్ల నుంచి ఏ ప్రమోషనూ యివ్వలేదు. ప్రపంచ నైజాన్ని బాగా ఎగిరిన వర్కర్లు రూప్‌రతన్ అనే సమాజ వాదం, త్యాగం అంటే యేమిటో బాగా తెలుసు కున్నారు. కాని ఈ పర్యాయం వాళ్ళంతా ఎదురు తిరిగారు వాళ్ళకు ప్రమోషన్ ఇవ్వాలని ఈ పర్యాయం మహీ పాల్ కూడా పట్టుపట్టాడు. రూప్‌రతన్ అవేమీ వల్ల కాదని మొండి చెయ్యి చూపించాడు.

ఆకాశం మీద నుంచి నేలమీద పడినట్లయింది మహీపాల్‌కు రాజీనామా ఇచ్చాడు. రూప్‌రతన్ వ్యక్తిగతంగా మహీపాల్‌తో మామూలుగానే సంబంధాన్ని మెరుగ్గా వుంచుకోవాలనుకున్నాడు. అతణ్ణి ఈ వ్యవహారంలో పట్టుపట్టవద్దని వారించాడు, ఎన్నో ఎరలు చూపించాడు. ససేమిరా అన్నాడు మహీపాల్. వర్కర్ల న్యాయ పూరితమైన కోరికల్ని కాదని కేవలం తన స్వార్థాన్ని సాధించుకోవడానికి ఇష్టపడ లేదు. వర్కర్లు సమ్మె చేసారు. ఆలజడి చేసారు. పోలీసు సహాయంతో రూప్‌రతన్ కార్మికుల్ని అణచాడు. ఎంతో మందిని అరెస్టు చేయించాడు కాని మహీపాల్‌ని ముట్టుకో లేదు. కేసు పూర్తిగా అణగి పోయిన తర్వాత మహీపాల్‌తో వ్యక్తిగతంగా కూడా తెగ తెంపులు చేసుకున్నాడు రూప్‌రతన్.

ఎంతో మంది మీద రాజకీయంతో పెత్తనం, అధికారం దర్పంచలాయించిన మహీపాల్ ఇప్పుడు అన్నిటినీ పోగొట్టు కున్నాడు. ఒకప్పుడు ఎందరో రచయితలు అతణ్ణి ఆశయిస్తూ వుండేవారు. ఇప్పుడంతా పోయింది. మహీపాల్ నిబ్బరాన్ని కోల్పోలేదు కాని అతని మనస్సులో ఏదో వెలితి యేర్పడి నట్లయింది. నవచేతనా సంస్థ ప్రచురించిన అతని పుస్తకాల వల్ల అతని కన్నా సేఠ్ రూప్‌రతన్‌కు ఎక్కువ రాబడి వచ్చింది.

ఖచ్చితమైన ఆదర్శవాది అవడంచేత మహీపాల్ తన తమ్ముడికి కానీ కట్నం తీసుకోకుండా మంచి కుటుంబంలోని ఓ సౌశీల్యవతితో పెళ్ళిచేశాడు. ఎం.బి.బి.ఎస్ ప్యాసైన తర్వాత విదేశాలకు వెళ్ళి చదవాలని మాతాగారికి తమ్ముణ్ణి ప్రేరేపించేవాడు. కాని తీరా అతను ప్యాసై విదేశాలకు పున్నత విద్యకోసం వెళ్లే సమయంలో అతనే పూర్తిగా నిరాధారుడై పోయాడు. అయినా అతను ధైర్యం కోల్పోలేదు. భార్య ఒంటిమీద నగల్ని అమ్మి తమ్ముణ్ణి ఇంగ్లాండుకు పంపించాడు. ఆ తరుణంలోనే అతని రెండో అక్కయ్య, ఆమె భర్తా చనిపోయారు. తాతగారి యింట్లో ఏ దిక్కూలేనిదై అతని మేనకోడలు శకుంతల తన పంచచేరింది.

భార్యాపిల్లలూ, మేనకోడలు, మరదలూ వాళ్ళు దత్తత తీసుకున్న కుమారుడు వీళ్ళందరి పోషణభారం అతనిపై పడింది. రెక్కలు నలగ్గొట్టుకొని కష్టించేవాడు. ఎంత శ్రమించినా నెలకు నూటఏభై లేక నూటడెబ్బై అయిదు రూపాయలకన్నా ఎక్కువ సంపాదించలేకపోయాడు.

ఇంతలో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. పసికిమాలిన వారందరూ బాగా ధనార్జన చేయడానికి మంచి సాధనంగా ఉపకరించింది యుద్ధం. వ్యాపారస్తులు చీకటిబజారు దయవల్ల విపరీతంగా లాభాలు ఆర్జించి కడుపులు కండలూ పెంచుకున్నారు. కాని మహిపాల్ విషయంలో మాత్రం రెండవ ప్రపంచయుద్ధం ఎంతో నష్టం తెచ్చిపెట్టింది. అతని ప్రాణాలే తోడేసింది. ఒకవైపు దిగజారిన ఆర్థిక పరిస్థితి, గోరుచుట్టుపై రోకటిపోటన్నట్టు ఇంగ్లండులో చదువుతున్న తమ్ముడికి డబ్బు పంపించాలి. 1941 కల్లా జయపాల్ చదువు పూర్తిచేసుకొని ఏదోవిధంగా డిగ్రీ తీసుకుని తిరిగివచ్చాడు. తమ్ముడు తిరిగి రావడంతో మహిపాల్‌కు ప్రాణంలో ప్రాణం వచ్చినట్లయింది. తమ్ముడి జీవితాన్ని ఒకదారికి నిలపడానికి అభిమానాన్ని చంపుకుని రూప్‌రతన్‌ను కలిసాడు. అతని పలుకుబడితో ఎక్కువ కష్టం లేకుండానే మెడికల్ కాలేజీలో వుద్యోగం దొరికింది. తన కష్టకాలం గడిచిందని మనస్సులో మురిసిపోయాడు. కాని అతని మురిపెం ఎన్నాళ్లో నిలవలేదు తోడికోడళ్ళకు ఇంట్లో ఎడమొహం పెడమొహం అవడంతో జయపాల్ కూడ మార్పుచెందినట్లు కనపడ్డాడు.

1942 ఉద్యమంలో మహిపాల్‌కు కారాగారవాస శిక్ష పడింది. అటువంటి తరుణంలో జయపాల్ అన్నగారి కుటుంబాన్ని గాలికి వదిలేసి వేరే కాపురం పెట్టాడు. రెండు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించిన తర్వాత అతనికి తీవ్రంగా సుస్తీచేసింది. దయతలచి ప్రభుత్వం మహిపాల్‌ని విడుదల చేసింది. ఇంటికి రాగానే తన తమ్ముడు చేసిన ఘోరం చూసి కుప్పలా కూలాడు మహిపాల్. తను రాత్రింబవళ్ళు వానకి ఎండకక నిర్మించుకున్న ఆశాసౌధం చూస్తుండగనే కూలిపోయింది. డబ్బు సంపాదించే పోటీలో

ప్రపంచం అతణ్ణి ఎప్పుడో నెట్టేసి ముందుకు పోవడం చూసాడు. అతని చుట్టుపక్కల ఎన్నో కొత్త ఇళ్ళు, భవనాలు, మేడలు లేచాయి. అతని పొరుగున వుంటోన్న ఓ బక్క పీనుగు యుద్ధసమయంలో రేషనింగ్ ఇనస్పెక్టరుగా నియమింపబడి ఇప్పుడు ఎంతో బలిష్ఠంగా, నున్నగా తయారయ్యాడు. అతని పాడుపడ్డ కొంప దేదీప్యమానంగా వెలిగిపోతోంది. ఒకరిదాక ఎందుకు? అతని స్వంత తమ్ముడు ఇప్పుడు కార్లో తిరుగుతున్నాడు. స్వంత బంగళాలో వైభవంగా జీవితాన్ని గడుపుతున్నాడు. మహీపాల్ జైలునుంచి రాగానే ఒక్కరోజు తమ్ముడు వచ్చాడు అన్నను పలకరిద్దామని. నిలబడే మాట్లాడి వెళ్లాడు. అప్పట్నుంచి అతని జాడేలేదు. "మా అన్న నాకేంచేసాడు? నా పెళ్ళికి కట్నం తీసుకొనివుంటే నా డబ్బుతోనే విదేశాలకు వెళ్లేవాణ్ణి. ఆదర్శాలకు పోయి అతను మూర్ఖత్వంగా వుంటే దానికి నేనెలా బాధ్యుణ్ణి అవుతాను" అని అంటూ బయట ప్రచారం చేస్తున్నాడు.

స్నేహితుడైన రూప్‌రతన్, స్వంత తమ్ముడు జయపాల్–జీవితంలో అతడు నాటుకున్న ఆదర్శాలను, నమ్మకాలను వేళ్ళతో సహా పెకిలించివేసారు. అతను జీవితంలో విరక్తుడుగా మారిపోయాడు. యుద్ధం జరిగే కాలంలోనూ, యుద్ధం అయిపోయిన తర్వాత ఇప్పటివరకూ జీవితంలో అడుగడుగునా ఘర్షణ పడుతూ చీటికిమాటికి చిరాకుపడుతూ మనఃస్థిమితం లేనివాడయ్యాడు. అణువు అణువునా స్వాభిమానాన్ని నింపుకుని సజ్జన్, కర్నల్ అంతరంగిక మిత్రులైనా వాళ్ళను యాచించడానికి ఇష్టపడలేదు. డాక్టర్ షీలాసింగ్‌తో అంత దగ్గిర సంబంధం వున్నా హోదాలో ఆమెకు ధీటిగా వుండడానికే ప్రయత్నించాడు కాని ఒక్కరోజు కూడా కిందిచెయ్యిగా వుండడానికి అతని మనస్సు అంగీకరించలేదు. అతనిలో తిష్ఠవేసుకుని వున్న ఈ స్వాభిమానాన్ని కనిపెడుతుంటారు అతని స్నేహితులైన కర్నల్, సజ్జన్, డాక్టర్ షీలాసింగ్. అతని అభిమానంపై దెబ్బతీసే పల్లెత్తుమాట కూడా అనకుండా జాగ్రత్తపడుతుంటారు.

అటువంటి వ్యక్తిని అందరి సమక్షంలో నువ్వు ఫలానా సేఠ్‌ని మోసం చేసి డబ్బు కాజేసావు, ఫలానా స్త్రీని వల్లోవేసుకుని ఆమె సంపాదన తింటున్నా

వని బహిరంగంగా ఆరోపణచేస్తే ఆ వ్యక్తి ఎలా సహించగలడు? అటువంటి అవమానాన్ని దిగమింగి ఎలా వూరుకొంటాడు? తనపై వచ్చిన ఈ నీలాపనిందకు అతనికి గంగ వెర్రులెత్తాయంటే ఎంతైనా సహజం.

సందుల్లో సజ్జన్, మహీపాల్ మౌనంగా నడుస్తున్నారు. అగ్గి రగిలినట్లు కుతకుతలాడుతోన్న మహీపాల్ ముఖంలోకి చూస్తూ 'ఏం సంగతి మిత్రమా! రోజుకన్నా ఇవ్వాళ మరీ సీరు కారినట్లున్నావ్....నువ్వు నా దగ్గర నుంచి దల్పుసహాయం స్వీకరించవని నాకు తెలుసు. ఇంట్లో ఇబ్బందిగా వుందా ఏం?' అన్నాడు సజ్జన్.

అతని మాటలకు మహీపాల్ సూటిగా సమాధానం చెప్పకుండా సజ్జన్ భుజంమీద చెయ్యేసి స్నేహితునివైపు చూడకుండానే "అవసరం వచ్చినప్పుడు మీ యిద్దర్నీ ఆదక్కపోతే నాకు ఆత్మీయులు యింకెవరున్నారోయ్" అని అంటూ ఆ చేతిని అలానే వుంచి సజ్జన్ పక్కనే ముందుకు నడుస్తున్నాడు. బజారు సందడిగా వుంది. నడుస్తోంటే అన్నిరకాల చర్చలూ సంభాషణలూ వినపడుతున్నాయి నాలుగురోజుల క్రితం విమానాలనుంచి చల్లిన కరపత్రాలు మొదలు ఇవ్వాళ మార్కెట్టులో కూరగాయలు అమ్ముతోన్న ధరలవరకు అందరూ చర్చిస్తున్నారు. ఎలక్షన్ల విషయం అందరి మాటల్లోనూ ఎక్కడో ఓచోట చోటు చేసుకుంటూ వుంది. ఒకరిదగ్గరైతే ఎన్నికలకూ, మతానికీ, కులాలకూ వున్న లంకెల గురించి చర్చిస్తున్నారు. అది మహీపాల్ చెవిన పడింది. "రెండురోజులు పరిపాలన చేయడానికి నాకు అవకాశం ఇస్తే ఈ మతాలూ గితాలూ గురించిన ధర్మపన్నాలను పలికేవాళ్ళను చెప్పుదెబ్బలు తినిపిస్తా. రాస్కెల్స్" అంటూ వాళ్ళను దుయ్యబట్టాడు సజ్జన్‌తో మహీపాల్.

మహీపాల్ మాటలకు నవ్వుతూ "పోనీవోయ్, వాళ్ళకిష్టం వచ్చింది మాట్లాడుకోనియ్ అయినా ఈ మతాలవాళ్ళు నీకేం అపకారం చేసారయ్యా?" అని సజ్జన్ మహీపాల్ కోపగించుకోని విధంగా అడిగాడు.

సజ్జన్ అడిగినదానికి సమాధానంగా రాజకీయ వేదాంతధోరణి "నాకే కాదు, వీళ్ళు మొత్తం మానవత్వానికే మహా అపకారం—ఒక పెద్ద అపవాదం

చేస్తున్నారు. గుడ్డిగా నమ్మిన కొన్ని శుష్క సిద్ధాంతాలు పట్టుకొని వేలాడుతూ ఎంతో సంస్కారవంతమైన సద్విమర్శను సైతం పీకె నులిమేస్తున్నారు వీళ్ళ మతాంధత మొత్తం జీవితాన్నే అమానవీయమైన దృక్పథంతో చూస్తోంది" అన్నాడు మహీపాల్.

"బావమరిది పెళ్ళిలో నువ్వేదో అమానవీయమైన అపచారాన్ని చూసినట్లుగా కనపడుతోంది. అదికూడా ఆనవాయితీ ప్రకారం పిల్లవాడి తరపు వాళ్ళు చేసినట్లుంది అవునా ?"

'హూం' అంటూ రెండడుగులు వేసి మళ్ళీ ప్రసంగాన్ని అందుకున్నాడు మహీపాల్ – "చెప్పడానికి మాత్రం ఈ బ్రాహ్మణజాతి దేశానికి ఇంటలెక్చ్యుయల్ లీడర్స్. నిజానికి వీళ్లకన్న పతితులైనవాళ్లు దాంభికులూ, మూర్ఖులూ మరేజాతిలోనూ ఇంతగా వుండరు. నేను షీలా సంపాదన తింటున్నానట. ఏదైనా అనడానికి ఒక హద్దూ వుండి."

"తింటున్నావుగా. మరి దీనిలో అబద్ధం ఏముంది గనక" అంటూ సజ్జన్ నవ్వాడు.

మహీపాల్ వేళాకోళంగా మాట్లాడే మూడ్‌లో లేడు. బిగుసుకుని పోతున్నాడు. రోడ్డు మీద నడుస్తున్నాం, బాగుండదని తమాయించుకున్నాడు లేకపోతే అమాంతంగా గర్జించే వాడే. అయినా కోపాన్ని నిగ్రహించుకో లేక "సామాజంలోని మురికినంతా పూసుకొని, నీచాతినీచులు, సనాతన ధర్మం గురించి గొప్పలు చెపుతారు నమ్మకద్రోహులు. నాకు ఏవేవో కళంకాలు అంటకడతారు. డబ్బుకోసం ప్రాణం వదిలేవాడినైయుంటే ఈపాటికి ఈ మహీపాల్ శుక్లా లక్షలు గడించి వుండేవాడు"

"ప్రేమా ఎందుకిలా వూరికనే ఉడుక్కుంటావ్ ఎక్కడివాడి కాలులాగుతూండడం మానవ స్వభావం అది ప్రపంచ నైజం ఇన్ని అవాంతరాలున్నా వాటిని అన్నిటినీ దాటుకుంటూ నువ్వెలా ముందడుగు వేయగలవో ప్రపంచానికి ఋజూ చేయ్."

సజ్జన్ చల్లని మాటలు మహీపాల్ మనస్సులో పొంగు మీద నీళ్ళు కొట్టిన పని చేసాయి. తల వంచుకుని మెదల కుండా ముందుకు సాగుతున్నాడు. "ఈ చీకటిని దాటి పోవాలి. సత్యం అనే వెలుగు ద్వారాన్ని కనుక్కోవాలి. జీవితం అనే ప్రచంఠ ధారలో నిశ్చయంతో ప్రవహించాలి. సత్య మార్గాన్ని వీడ కుండా మనో నిబ్బరంతో వుంటూ విరోధంతో కుస్తీ పట్టు పట్టు" అన్న మహా కవి నిరాలా మాటలు జ్ఞాపకం వచ్చాయి మహీపాల్‌కు.

రోగికి ప్రాణ వాయువు ఇవ్వగానే వూపిరి పీలుస్తున్నట్టుగా జీవితంలో ఓడి అలసిన మహీపాల్ వ్యక్తిత్వానికి ఆసరా దొరికింది. సందు మొగలోంచి పెద్ద బజారులోకి వెళ్లేసరికి ఎన్నికల గురించి పెద్ద గలాటా జరుగుతోంది.

# 18

కన్య ఇవ్వాళ రాలేదు. వుండడానికి ఆమెకు ఇల్లు దొరికిందో లేదో, ఒక సారి వెళ్ళి చూసివద్దామని అనుకున్నాడు సజ్జన్. పాపం కష్టాల్లో వుండికూడ స్వాభిమాని నోరు తెరచి అడగదు కనుక ఆమె స్వాభిమానానికి అడ్డురాకుండా ఆమెను ఆదుకోవడమే మానవత్వం.

కారు తీసుకుని తిన్నగా కన్య ఇంతకు ముందున్న చోటుకి వెళ్లాడు. నిన్నరాత్రే సామానుమొత్తం తీసుకుని ఎవరి కార్లోనో కూర్చుని వెళ్ళిపోయిందని చుట్టుపక్కల వాళ్ళు చెప్పారు. ఆ విషయం తెలియగానే అతనికి ఈర్ష్య కలిగింది. కాని బ్రహ్మచర్యవ్రతాన్ని పాటిస్తున్న సజ్జన్ కన్య లేకుండా ఎలా వుండగలడు ఆమె కనపడని కొరత కలుక్కుమంటోంది మనస్సులో.

అక్కణ్ణుంచి సజ్జన్ కర్నల్ మెడికల్ స్టోర్సుకు వెళ్ళాడు. మహీపాల్ అక్కడే వున్నాడు. జానకీశరణ్, సాలిగ్రాం, సజ్జన్ ఇంటికొచ్చిన విషయం, ఎగ్జిబిషన్ సంగతీ అన్నీ మహీపాల్ చెప్పినట్టుంది. సజ్జన్ రాగానే కర్నల్ అతనిమీద మండిపడ్డాడు-"నువ్వు ఎవర్ని అడిగి ఒప్పుకొన్నావ్. మేం ఇంత

వరకు చేసిందంతా నువ్వు బూడిదలో పోసిన పన్నీరులా చేయాలను కుంటున్నావా?"

కర్నల్ తన ఉద్దేశాన్ని వ్యతిరేకించగానే తాను చేసింది పొరపాటేనేమో అని అనుకోసాగాడు సజ్జన్. తీరా తను రోట్లో తలదూర్చిన తర్వాత ఏం చేయడం? దాన్ని సమర్థించుకోవడం మినహా అతనికి మార్గంలేకపోయింది. మహిపాల్ ముందు తన తప్పును ఒప్పుకోవడం అతనికి ఇష్టంలేదు. మొహాన్ని అదోలా పెట్టి తెగింపుతో "నీక్కూడా ఇష్టంలేకపోతే నువ్వూ రావడం మానేయి. నేనంతా ఆలోచించే యీ నిర్ణయం తీసుకున్నాను" అన్నాడు

"నిర్ణయం కాదు. నా బొంద" అన్నాడు కర్నల్. "అసలు నీపు రెత్రిలో ఈ ఆలోచన ఎలాకలిగిందంట? తెల్లవారగానే జానకీశరణ్, సాలిగ్రాం గాళ్ళు ఇంటి మీదికి రాగానే మొహమాటం వచ్చి పడిందన్నమాట. అసలే ఇప్పుడు 'బిన్నో' కేసు నడుస్తోంది కదా. నీ అజ్ఞానం వల్ల దానిపై ఎలాంటి ప్రభావం పడుతుందో అంతమాత్రం వూహించలేకపోయావు".

కర్నల్ నోట్లో ఆ కొత్త పదం వినగానే సజ్జన్ కొంచెం ఆశ్చర్య పడ్డాడు. కేసూగట్రా అనగానే బహుశా కన్యకు కర్నల్ తాయి కొత్తగా నామకరణం చేసి వుండొచ్చని గ్రహించాడు. కన్యమీద కర్నల్ చూపిస్తోన్న ఈ గారానికి అతనికెందుకో అసక్తికలిగింది. కన్య ఎక్కడుంది? ఆమె గురించి మళ్ళీ అతని బుర్ర వేడెక్కుతోంది. మనస్సు బాధగా వుంది. తాను చేసిన పొరపాటు సిగ్గు తోడుక్కొని గింది. పొద్దున్న వాళ్ళ ముందు సరే అంటున్నప్పుడు కన్య అతనికి జ్ఞాపకం వచ్చింది. అయినా అతను సరే అని అనేసాడు. కన్య విషయంలో అతనెందుకో వెర్రివెర్రిగా వ్యవహరిస్తున్నాడు. అతని మనస్సులో ప్రతిష్టించుకొన్న బ్రహ్మచర్యం ఏమైనట్టు? అది కేవలం మానస తరంగం కాదు కదా! తన బుద్ధి గురిపోగుట్టుకుందా? అందుకు కారణం? అదే అతనికి అర్థం కావడంలేదు. అతని మేధస్సు, కోసిన పనసపండు ముక్కల్లా విచ్చిపోతుంది. ఏదైనా విషయాన్ని మనసుకు పట్టించుకోవడానికి అతను ఎంతగా ప్రయత్నిస్తోంటే అంత తొందరగా దాని నారలు వూడిపోతున్నాయి. సజ్జన్‌కు కోపం

వచ్చింది. కర్నల్‌తో అన్నాడు "నేను అన్నీ బాగా ఆలోచించాను. శత్రువుతో కూడా చెయ్యి కలపగలిగిన వాడే అసలు మానవుడు. దటీస్ అవర్ ఇండియన్ కల్చర్. మనం కేసు నడుపుతూనే ఎగ్జిబిషన్‌లో పాల్గొందాం. మీరంతా ప్రతి దాన్నీ చిన్నచూపుతో చూస్తారు. అలా చూడ్డం నా ఆర్టిస్టిక్ మెంటాలిటీకి విరుద్ధం" అంటూ ఓచిన్న ఉపన్యాసం ఇవ్వగలిగినందుకు సజ్జన్ సంతోషపడ్డాడు.

"బ్రేవో! నా సాంగత్యం వల్ల మంచి గుణాన్నే సంపాదించావ్" తన గురుత్వాన్ని వెళ్ళబోసుకుంటూ మహిపాల్ సజ్జన్ మీద తన శిష్యరికాన్ని ఒలకపోసాడు. "కాని ఈ మాటలే నీ పెదిమల నుంచి రాకమనసులోంచి వచ్చివున్నట్లయితే శ్రద్ధాభక్తుల్తో నీ పాదపూజ చేసి నెత్తిమీద నీళ్ళు చల్లుకునేవాణ్ణి"

మహిపాల్ ఎత్తిపొడుపుతో సజ్జన్‌కు మరింత సిగ్గూ, రోషం వచ్చాయి. కడుపులో వున్న ఆక్రోశం మొహంపై వ్యాపించింది.

అప్పుడే తలుపుకు తగిలించిన తెరలోంచి మెట్లమీద నుంచి దిగుతోన్న కన్య కనిపించింది.

స్టోర్‌కు వెనుకభాగంలోనే ఆఫీస్ రూంలో వాళ్ళు కూర్చుని వున్నారు. ఆమెను చూడగానే తలుపు దగ్గరకు వెళ్లాడు. తెర ఎత్తుతూ ఆమెను అడిగాడు.

"నువ్విక్కడున్నావా? అక్కడున్నావేమోనని వెళ్లాను."

సమాధానంగా కన్య చిన్న నవ్వు నవ్వింది. తెరను తొలగించుకుంటూ గదిలోకి వచ్చింది. పక్కకు తప్పుకొని దారిచ్చాడు సజ్జన్. కన్యను చూడగానే మహిపాల్ చేతులు జోడించి నిలబడ్డాడు. కర్నల్ కూర్చునే నవ్వుతూ కన్య వైపు చూసి "నువ్విక్కడ వుండడం చూడగానే అయ్యగారికి మతిపోయింది. ఇవ్వాళ ఘనకార్యం సాధించుకొచ్చారు పిచ్చిదాసుగారు. పైగా తను చేసింది సమర్థించుకుంటూ ఉపన్యాసం దంచేస్తున్నారు, ఇందాకట్నుంచి" అన్నాడు.

ఆ మాటలు విని సజ్జన్‌కు మళ్ళీ కలవరం కలిగింది. కాని నిగ్రహించుకున్నాడు.

మూలవున్న కుర్చీని లాక్కుంటూ "కర్నల్ భాయి ఈ పైన వుండేందుకు నాకు చోటు ఇచ్చారు. వెంటనే నువ్వు సామానంతా కార్లోవేసి నా వెంట వచ్చేసేయ్ అని పట్టుపట్టారు." అంది కన్య.

నవ్వుతూ కర్నల్ మహీపాల్‌తో చెపుతున్నాడు-'మొదట ఈమెగారు కమ్యూనిస్టులా వ్యవహరించింది. అది అలా ఇది ఇలా అని వాదించింది. వాదించాల్సిందేమైనా వుంటే తర్వాత వాదించుకో, ముందిక్కణ్నుంచి కదులు అన్నాను. నువ్వు నన్ను అన్నగా భావిస్తే నేను చెప్పింది వినాలి. నువ్వే చెప్పు. ఎలాంటి చోట్లో వుంటుందో-బోయవాళ్ళు వుండేచోటు అదంతా. అసలే ఆ సాలిగ్రాంగాడు ఈమె అంటే నమిలి మింగేద్దామా అన్నట్టున్నాడు. ఎవరికైనా డబ్బులిచ్చి అవమానిస్తే? ఆ మానవతి చూడండి. చూస్తుండగానే ఆత్మహత్య చేసుకుంది"

"నువ్వు చాలా మంచిపని చేసావ్ పైగది ఖాళీగానే వుందాయె"

"ఆ( ఏముంది? దేవదారు పెట్టెలూ, సీసాలూ, విరిగిపోయినవి తరిగిపోయినవి. అంతా పనికిరాని సరుకువుంది. ఇవ్వాళ వుదయమే అదంతా ఎత్తించి కొట్టంలోకి పంపించాను. దానితో గది అంతా ఖాళీ అయిపోయింది. ఒక్కగది, బాత్‌రూం, కొళాయి వున్నాయి. మామూలు సౌకర్యాలకేం లోటులేదు."

కర్నల్ పంచన వుండడానికి కన్య ఎందుకు నిరాకరించలేకపోయిందా అన్న దుగ్ధపట్టుకుంది సజ్జన్‌కు అతను చెప్పితే కన్య వినలేదు. ఏం కారణం? సజ్జన్‌తో ఆమె వుంటున్నందువల్ల అపవాదు ఎదుర్కోవలసి వస్తే కర్నల్ పంచన వుంటూ కూడ దాన్ని ఎదుర్కోవాలి కదా! అతనిపట్ల ఆమె ఈ అపనమ్మకానికి కారణం? వేగంగా వీస్తోన్న గాలికి పరపరమని కొట్టుకొంటున్న గుడ్డలావుంది అతనిమనస్సు. సాలిగ్రాంతో సహకరిస్తున్న విషయం ఇంక దాచకూడదనుకున్నాడు. ఎలా చెప్పడమా అని సంకోచిస్తూ వున్నాడు ఇంతవరకు. కర్నల్, మహీపాల్, కన్య, సాలిగ్రాం, జానకీశరణ్ అందరిమీద అతనికి అక్కసు వచ్చింది. కుర్చీలోంచి లేచి పారిపోదామనిపించింది. కాని లేవడానికి

అతనికాళ్ళు కూడా చచ్చుపడ్డట్లయింది. లేవలేక అలాగే యీజీఛైర్లో పాతుకుని పోయాడు.

"'బిన్నో' బయటికి వెళ్లుతున్నావా"

"అవునండి, ఇప్పుడే వచ్చేస్తా".

"నువ్వు ఆలస్యంగా నైనారా. నేను చౌకీదారుకు చెప్పి వుంటా. ఇటు వైపు తలుపుకు తాళం వేయిస్తాను. నువ్వొచ్చి చౌకీదార్ని లపిలే అతనే తలుపు తెరుస్తాడు"

భాయిసాబ్ (అన్నగారు) వాకు రెండో ఆట సినిమాలు చూసే అలవాటు లేదు లెండి" అంది కన్య నవ్వుతూ.

"నీకు తెలియదు చెల్లీ, ఈ కర్నల్ ప్రతి మాట ఓ పాలసీతో చెపుతాడనుకో. కమ్యూనిస్టు పార్టీలో పనిచేసే ఆడ పిల్లలంతా చేతిలో కొడవలి, సుత్తి తీసుకుని రాత్రిళ్ళు తిరుగుతుంటారని వీడి వుద్దేశం" కన్యతో మాట్లాడుతూ ప్రథమంగా 'నువ్వు' అన్న శబ్దం ప్రయోగించాడు మహీపాల్.

అతని మాటలకు కన్య కిలకిలా నవ్వింది. కర్నల్ సిగ్గు పడుతూ తను కూడా ఆ నవ్వుతో శృతి కలిపి- "ఈ రచయితలూ, ఆర్టిస్టూలా వున్నారు చూసావు వీళ్ళ మాటలు ఎప్పుడూ నమ్మకు. వీళ్ళంత మూర్ఖులు ఎవ్వరు లేరనుకో. వాళ్ళ మూర్ఖత్వంతోనే బాగా చలా మణి అవుతుంటారు" అన్నాడు.

కర్నల్ ఎగతాళిగా అన్నమాటలకు నవ్వొచ్చింది కన్యకు. పైకి నవ్విందే కాని ఆమె కళ్లన్నీ విచారంగా ఒదిగి కూర్చున సజ్జన్ మీదే తారట్లాడుతున్నాయి. సజ్జన్ తల వంచుకుని కూర్చున్నాడు. మహీపాల్, కర్నల్ కన్య వైపు చూస్తూ వుండి పోయారు. వాళ్ళున్నారన్న విషయం కూడా మరిచి కన్య అలా కన్నార్పకుండా సజ్జన్ను చూస్తోందే ఆమె మానసికంగా పడుతున్న ఆందోళన ఆమె కళ్ళలో కన్పించింది. మహీపాల్ ఇదంతా గమనిస్తున్నాడు కన్య అంటే అతనికి ఎటువంటి దుర్భావంలేదు. అయినా ఓ జవ్వని హృదయాన్ని స్నేహితుడు ఇట్టే ఆకట్టుకో కలిగాడన్న తలంపు రాగానే సజన్పై కొద్దిగా

ఈర్ష్య కలిగింది. అటువంటి పట్నంలో సాలిగ్రాంతో సజ్జన్ చేసుకున్న ఒప్పం దాన్ని బయటపెట్టి ఆమె ముందు అతణ్ణి న్యూనతపరచాలన్న ఆలోచన వచ్చింది. కాని ఎందుకో పూరుకుని మామూలు ధోరణిలో కన్యను ప్రశ్నించాడు- "నీ కేసు ఎంత వరకు వచ్చింది"?

మహీపాల్ గొంతు వినగానే ఆమె కొంచెం కంగారు పడింది. దృష్టి సజ్జన్‌వైపు నుంచి మరల్చింది. కన్య సమాధానం వెతుక్కుంటూ వుండగానే మధ్యలో కలుగచేసు కుంటూ కర్నల్- "నేనింకా ప్రదర్శని సంప్రతిస్తున్నాను. కన్య వదిన తాలూకు ఇద్దరి బంధువు లొచ్చారుగా పూరి నుంచి. వాళ్ళకు సూర్య హిందూ హోటల్‌లో వసతి ఏర్పాటు చేయించాను ఇవాంటావా అవన్నీ చూడ మని ఇవ్వాళ కన్య నిచ్చి పంపాడు" అని చెపుతూ సజ్జన్ వంక తిరిగి "సజ్జన్' నీకో శుభ వార్త చెప్తున్నా. బిన్నో డ్రైవింగ్ నేర్చు కుంటూంది. శివ మంగల్ కూడా చెప్తున్నాడు ఈ విధంగా నేర్చు కుంటూ వున్నట్లయితే చాలా తొందర గానే ఆమెకు కారు నడపడం వచ్చేస్తుందని అన్నాడు".

సజ్జన్ కళ్లు పైకెత్తాడు. ఆ మాటలకు అతనిలో ఏ సంచలనమూ వచ్చి నట్లు లేదు. కన్య అయితే నవ్వుతూ అతని కళ్ళల్లోకి చూసింది. సజ్జన్ ప్రేరక మైన అభినందనలు ఇస్తాడో అన్నట్లు ఆ చిన్న గదిలోని మసక వెలుతుర్లో పరి సరాల్ని మరచి క్షణం సేపు ఇద్దరి కళ్లు పరస్పరం చూసుకున్నాయి. ఆ చూపు సజ్జన్‌లోని కలవరాన్ని దూరం చేసింది. అతను కొంచెం ఊరట కలిగినట్లు భావించాడు. కర్నల్ మహీపాల్ ఇద్దరూ ఇదంతా గమనిస్తూనే వున్నారు. పిల్ల హుషారైనదే. ఆ మూసు ముల్లా పద్ధాయంటే ఆమెలో దాగున్న కమ్యూనిస్టు తనంతట తానే పారిపోతాడు. అందుకే ఇప్పట్నుంచి డ్రైవింగ్ నేర్చుకొంటూంది అని అనుకున్నాడు మహీపాల్.

ఇంతలో కర్నల్ కేసు గురించి ప్రసక్తి తేగానే అందరి ధ్యానం భంగ మైంది. "బ్యారిస్టర్ ధావన్ ఇటు వంటి కేసుల్లో అమోఘంగా సలహా ఇస్తాడు. నేనో పర్యాయం ఆయన్ని కలుసుకుని వస్తాను. మనం ఒక్క సాలిగ్రాంని

ఢీకొంటే చాలదు. ఇప్పుడు ఎలక్షన్ల కోసం ఎంతో మంది అంగరంగ లున్నాయి అతనికి. వాళ్ళందరినీ ఢీకొనాల్సిన పరిస్థితి రావచ్చు. ఈ విమానాల యుక్తి నేను అనుకున్న దాని కంటే ఎన్నో రెట్లు ఎక్కువ మనకార్యం సాధించింది. ఇప్పుడు ఊళ్ళలో కన్య పేరు యింటింటా మారు మోగిపోతూ వుంది. ఈ పనిలో విజయం సాధించాలని దేవికి మొక్కాను. ఆమె మహిమ వల్లే నాకో అతి ముఖ్యమైన వాక్యమెంటు దొరికింది. ఇకమీదు వాళ్లను గంట కొట్టి గంట కదతాను" అని అతను తన గొప్పతనాన్ని చెప్పుకుంటూ మధ్యలో సజ్జన్ వైపు చూసి 'సరేలే సజ్జన్' మేము మీ ఒప్పందాన్ని ధృవపరిచాం. ఈ మూలంగా ప్రజల ముందు నిలబడి మన వాదం వినిపించ డానికి అవకాశం దొరుకుతుంది. ఈ వెధవ మనల్ని ప్రతి పేటలోనూ అల్లరిపాలు చేయాలని ప్లాను వేసాడు. మనమేం తక్కువ తిన్నామా. ఏనుగును నిలబెట్టేసి తోక తిప్పి పిరి చేద్దాం. ఇవ్వాళో రేపో సాలిగ్రాం గాడు ఎలాగైనా ఇక్కడికి వస్తాడు. రానీయ్. ఓయ్ సాలిగ్రాం! నువ్వొక ఆర్టిస్టు పెద్ద మనిషిని దాటుగా పెట్టుకుని నన్ను కించపర చాలని చూస్తున్నావా? సరేలే బిడ్డా! మేం కూడా చూపిస్తాం మా తడాఖా. సజ్జన్ అన్నట్లు మానవత్వం వున్నవాడు మంచి పనిలో శత్రువుతో ఐనా మనస్ఫూర్తిగా చేతులు కలపడానికి సందేహించడని నిరూపిస్తాం'' అని అన్నాడు.

కర్నల్ తన్ను సమర్థించే సరికి సజ్జన్ మనస్సు వికసించింది. ఏమిటిది చెప్మా అన్నట్లుకన్య విస్తుపోయింది. సజ్జన్‌ని కర్నల్ సమర్థించడం మహీపాల్‌కు కలుక్కుమంది. పొద్దున జరిగిన కాండకు పీఠిక రాస్తున్నట్లుగా మొదలెట్టాడు మహీపాల్ –"కన్యగారికి ఇంకా తెలీనట్లుంది. అదికాదు కన్యగారూ, పొద్దున్నే సాలిగ్రాం, ఈ వూళ్ళో వడ్డీలు గుంజటానికి పేరు మోసిన ఒక సేఠ్‌గార్ని వెంట పెట్టుకుని ఎలాగైనా సజ్జన్‌నిబుట్టలో వేసుకోవాలన్న వుద్దేశంతో అతని చిత్రాల ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేస్తామంటూ సజ్జన్ ఇంటికి దిగబడ్డారు. కళా కారుడు కదా. అతణ్ణి పైకి ఎత్తేస్తే మనవైపు తిప్పుకోవచ్చనుకొన్నాడు. మన వాడు వాళ్ళ ఎత్తుకు నిజంగానే బోల్తాకొట్టాడు''.

ఆ మాట వినీ వినగానే కన్య ముఖం మాడిపోయింది. సజ్జన్ మహీపాల్ మీద ధుమధుమలాడాడు. ఇది గ్రహించిన కర్నల్ మహీపాల్ చెప్పేపద్ధతిలోని

కటుత్వాన్ని తీసేస్తూ మహీపాల్‌ను పరోక్షంగా మందలించాడు-"న వ్యతప్పగా వ్యాఖ్యానం చేస్తున్నావ్ మహీ! సజ్జన్ సరిగ్గానే ఆలోచించాడు. మనమే కొంచెం చిన్న చూపుతో కాదంటున్నాం'' అర్థం కానట్టు చూస్తోన్న కన్యకు విడమర్చి చెప్తూ కర్నల్ అన్నాడు-"సజ్జన్ చెప్పినది పదహారణాల సరిగ్గా వుంది బిన్నో! సాలిగ్రాం అతని దగ్గరకు ఓ మంచి కార్యానికి అక్షింతలు వేయమని వచ్చాడు. రాజకీయ సంబంధమైన అభిప్రాయ బేధాలు ఎన్నివున్నా సిపనికి ఎలావూను కొన్నాడో అలాగే అతనూ ఓ మంచిపనిచేస్తోంటే ఎలా మూతి ముడుచుకూర్చో గలడు? పైగా దాన్లో తప్పేముందని?"

సజ్జన్ చేసిన పనికి అతణ్ణి సమర్థించాలా లేదా అన్న ద్వైదీభావం ఆమె కళ్లలో కనపడింది. సజ్జన్ తన చూపుల్తోనే ఆమెకు తన అంతరంగాన్ని తెల్పాలని అనుకుంటున్నాడు. ప్రేమపాట మరిచినపుడు మనస్సు నాలుక ద్వారా కన్న కళ్ళతోనే తన భావాల్ని ప్రకటించాలని తాపత్రయపడుతుంది. నిజం కూడ అంతే. నాలుగు కళ్ళు కలిసి మాట్లాడుకోగల్గిన భాష వెయ్యి నాల్కలు కలిసికూడా మాట్లాడుకోలేవు. తన దృష్టినుంచి తప్పుక తిరుగుతోన్న కన్య కళ్ళను సజ్జన్ తన కళ్ళతోనే మంత్రించి బంధించివేస్తూ ఇలా అన్నాడు- ''నా చిత్రాల ప్రదర్శనాన్ని ఏర్పాటు చేస్తామని వాళ్లే నా దగ్గర ప్రస్తావన తీసు కొచ్చారు. వాళ్ల వుద్దేశాన్ని నేను వెంటనే పసిగట్టేశాను. వాళ్ళ ప్రస్తావనను తారుమారుచేసి వాళ్ళకే ఎసరు పెట్టాను. ప్రదర్శనాన్ని మన బజారులోనే పెడతాం అని మీరు అంటున్నారు గనుక ఈ వీథిలోనే వుంటోన్న స్త్రీ లందరూ తాము నేర్చుకున్న కుట్టూ, అల్లికల పనులు, వంశపారంపర్యంగా వాళ్ళకేమేం చేతిపనులు వస్తాయో, వాటన్నిటిని తీసుకొచ్చి ప్రదర్శనంలో పెడితే ఎంతో రాణింపుగా వుంటుందని ఎదురు ప్రస్తావన చేశాను. వాటిలో ఏది మంచిదో వాళ్లే నిర్ణయిస్తారు. బహుమతులు ఇస్తారు. నేను కూడా మా అమ్మగారి తరఫున నూరు రూపాయలు బహుమతి ఇస్తానని ప్రకటించాను. ఆధునిక కాలంలో చిత్ర కళా రచన ఎన్నెన్ని కొత్త పుంతలు తొక్కింది, ఏ మార్పులూ చేర్పులూ వచ్చాయో ఇవన్నీ మనవాళ్ళు తెలుసుకొనేందుకు నగరంలో వున్న ఆర్టిస్టు

ందరి దగ్గిరకెళ్ళి వారి చిత్రాల్ని తెచ్చి ప్రదర్శించే పూచీనాది. మహా అయితే నలభై చిత్రాలుంటే చాలు. జానకీశరణ్ ఇంటికి ఎదురుగా రెండు పెద్ద గదులు వున్నాయి వాటిలో ప్రదర్శనాన్ని యేర్పాటుచేద్దాం అని చెప్పాను. నేనేం తప్పు చేశానో మీరే శెలవివ్వండి. నేను నమ్మించి మోసం చేసానంటున్నాడు మహీపాల్. నా చిత్తశుద్ధి మీద ఆయన కళంకాన్ని అంటకట్టాడు. ఇది పచ్చి అబద్ధం. నేను నా నిజాయితీని ఋజువుపర్చుకుని తీర్తాను".

"మీరు మీ పేరు ప్రతిష్ఠలకు తగినట్టుగానే ధైర్యాన్ని, చొరవనూ చూపెట్టారు. నేనంత పెద్ద వ్యక్తినికాదు. మీరు ఏ బాధ్యత అప్పగిస్తే దాన్ని తప్పక నిర్వహిస్తాను" అన్నది కన్య.

కన్య మాటలకు సజ్జన్ మొహం కళకళలాడింది. కాని సజ్జన్‌ను కన్యను ఇద్దర్నీ హెచ్చరిస్తోన్న ధోరణిలో మహీపాల్ "అర్టిస్టన్న ఉద్రేకంలో మీరు లోకం వేసే ఎత్తుగడల్ని మరచి పోతున్నారు. ఇవి ఎలక్షన్ రోజులని మరచి పోకండి" అంటూ హెచ్చరించాడు.

"ఎలక్షన్ రోజులైతే ఏం? పొడుస్తారా? ఇక్కడా తక్కువ తిన్నవా ళ్ళెవరూ లేరు. హేం. బాబూనగీన్‌చంద్ జైన్ వుర్ఫ్ కర్నల్ సాహెబ్" అంటూ నున్నగా గొరికించుకున్న మీసాలపై చెయ్యి మెలేసాడు కర్నల్. మళ్ళీ సజ్జన్‌ని ఉద్దేశించి "ఎగ్జిబిషన్ పెట్టుకోవయ్యా నిర్భయంగా. దైరీలో ఇవ్వాల్టి పేపర్లో రానివ్వండుకో పిల్ళు వేసే ప్రతి ఎత్తునూ చిత్తుచేసి మళ్ళీ వాళ్ళ మీదే దెబ్బతీస్తా. ఈ సాకుతో జనతా పార్టీ అని ఓ కొత్త పార్టీని పెట్టకపోతే చూడు. ఈసారి ఏ ఒక్క పార్టీని కాదు మనం సవాలు చేసేది, అన్ని పార్టీల్ని ఒకేదెబ్బతో కొట్టాలి. మనం ప్రజానీకంతోనే వుంటాం. ప్రజా హక్కులకోసం పోట్లాడతాం. ప్రభుత్వం కానీయ్ పెట్టుబడిదారీ వర్గం కానియ్యి. రాజకీయ పార్టీలు కానియ్యి; మనం మన హక్కుల్ని సాధించుకుంటాం. ఏం బిన్నో. నీవుద్దేశ్యం ఏమిటి?

కుర్చీలోంచి లేస్తూ మహీపాల్ వెటకారంగా అన్నాడు – "పాపం బిన్నో ఏమని చెపుతుంది. ఆమెది ఎప్పుడూ మధ్యేమార్గం. మేం చెపుతున్నాంగా విను.

పది శిరస్సులున్న రావణాసురునిలా మీరు విర్రవీగుతున్నారు. ఈ సాలిగ్రాం గాడు ఒక్కొక్కరికి ఒక్కో గాడిదను బహుమతి చేయకపోతే చూడు. పాపం. ఈ వనకన్య కేసు వ్యవహారం మధ్యలోనే ఆగిపోతుంది. చూస్తూ వుండండి ఈ బ్రాహ్మడి మాటలు వృథాపోవు."

మహీపాల్ వెటకారానికి సజ్జన్‌కు కోపం వచ్చింది. అతను కూడా కుర్చీ లోంచి దభాలున లేచి "అయితే, నా ఆఖరిమాటకూడా విను. నీ బ్రహ్మతత్వం వట్టి అబద్ధం అని సజ్జన్ కూడా నిరూపిస్తాడు. ఈ మాటల్ని నేను ఎవరి దగ్గర అంటున్నానంటే వాళ్ళతో అబద్ధంగా బతకడం కన్న చావటం ఎంతో మేలు అని అనుకొనే వాళ్ళదగ్గర" అంటూ తీవ్రంగా మహీపాల్ వైపు చూశాడు.

మహీపాల్ యేమీ జవాబు చెప్పకుండా బుసలు కొడుతో వెళ్ళిపోయాడు. మహీపాల్ మీద సజ్జన్‌కు బాగా కోపం వచ్చింది. తన విషయంలో కన్య మనస్సును విరచడానికి అతను ఎందుకు ప్రయత్నం చేసాడు చెప్మా అంటూ అతని మనస్సు కుతకుతలాడసాగింది. మహీపాల్ని ఉద్దేశించి "తనకు తాను అబద్ధపు బతుకు బతుకుతున్నాడు. ఎవరైనా రెచ్చగొడితే అందరూ నాలాగే వుంటారు అనుకొనేటంత మూర్ఖుడు. ఇడియట్!" అని బరబర అనేశాడు

"ఎవరి మీదోయ్ నువ్వు మండిపడుతున్నావ్. అతనేదో మానసికంగా బాధపడుతున్నాడు. ఆ గొడవతో మనస్సిమితం లేక నిన్ను వ్యతిరేకించడానికి బుద్ధికుదిరిందంటే నీ కంటే ముందు నీ పని నెరవేర్చేరకం. నిజం చెపుతున్నా విన్నా, మహీపాల్ చాలా భోళామనిషి. అతనికి నోరే దురుసు, హృదయం వెన్నలాంటిదనుకో" అని సర్దాడు.

"అలా చూస్తే ఎవరూ కడిగిన ముత్యంకాదు ఎన్నివున్నా మొత్తానికి మహీపాల్ గారంటే నాకు గౌరవభావం వుంది. మనస్సు మంచిది కాకపోతే అంత పెద్ద రచయిత అయ్యేవాడే కాదు" అని కన్య అంది.

సజ్జన్ కోపం కన్య, కర్నల్‌ల ఎదుటే, స్వయంగా అతని అంతరాత్మ ముందే పరాభవం పొందింది. ఆ కోపాన్ని తన హృదయకుహరంలో అదిమి

వుంచుకోవాలని ప్రయత్నిందాడు. ఒక విధంగా చూస్తే కన్య - తనవైపు ప్రేమగా చూసినా తర్వాతనే అతనిలో ఈ కోపం - ఇంత తీవ్రత వచ్చాయి. కన్య చూపులు అతని వ్యక్తిత్వాన్ని పూర్తిగా మరపింపచేసాయి. కన్య దగ్గర నుంచి అతను క్షణం క్రితం పొందిన స్నేహమే అతనిలో తప్పుడు అహంకారాన్ని రేపింది కన్యతో ఏకాంతంగా మాట్లాడ్డానికి కొంచెం వ్యవధి అయినా దొరికితే బావుండునని అనుకున్నాడు. తనతో షికారుకు వెళదామని క్రితంరోజు అతను అన్నప్పుడు ఆమె నిరాకరించింది. ధ్యానమందిరంలో బ్రహ్మచర్యవ్రతం పాటిస్తానన్న సంకల్పం ఏమైంది. అతని కళ్ళలో వేరే వస్తువు మెరవడం మొదలెట్టింది అతని ప్రాణాల్ని కన్య తన మాయాశక్తితో రెక్కలు విరిచి కట్టేసింది. ఇప్పుడు ఏం చేయడానికి తోచక అతను అటూ యిటూ కొట్టుకుంటున్నాడు. తన వ్యక్తిత్వాన్ని ఋజువుపర్చుకోలేకపోయేసరికి ప్రసంగాన్ని మారుస్తూ కన్యను అడిగాడు - "ఇంకా నవ్వుల వంట మొదలెట్టావా లేదా "

''అన్నగారైతే ఒద్దంటున్నారు. కాని ఈ విషయంలో వారి మాటవినను లెండి. ఒకటీ రెండు రోజుల్లో'' అంటూ నసిగింది కన్య.

"మరప్పటి వరకు నీ భోజనం?"

''అంటే జైనుల భోజనం అన్న మాట'' నవ్వుతూ మళ్ళీ-"జైనుల వెంట మరీ అంత ఎక్కువ తిరగడం మంచిది కాదు కన్యా. వీళ్ళంతా అహింసా పరమోధర్మః అంటూ నీకు కక్కా-ముక్కా లేకుండ చేసేస్తారు'' అన్నాడు, సజ్జన్.

గది అంతా ఒకటే నవ్వుల్తో ప్రతిధ్వనించింది. కర్నల్ వెంటనే "పోవోయ్! కక్కా-ముక్కా తినేవాళ్ళకు మా మతాలు ఏమి తెలుస్తాయ్" అంటూ లేచాడు కుర్చీలోంచి. "నేనిప్పుడే ధావన్‌గారికి ఫోను చేసొస్తా" అంటూ వెళ్ళిపోయాడు

గదిలో కన్య, సజ్జన్ ఒక్కరే మిగిలారు. ఒకరినొకరు చూసుకుంటూ కూర్చున్నారు. నిశ్శబ్దాన్ని సజ్జనే భంగం చేస్తూ -"మనస్ఫూర్తిగా నువ్వు నా ఒప్పందాన్ని సమర్థించావు కదూ."

''ఏ ఒప్పందాన్ని?''

"అదే సాలిగ్రాంతో చేసుకోలేదూ!''

"మీకెందుకీ సందేహం?"

సజ్జన్ కన్యకు దగ్గరగా వున్న కుర్చీలో కూర్చుంటూ ''నువ్వు శాశ్వతంగా నన్ను నీ దాసుడిగా చేసేసుకున్నావ్" అని అనేశాడు అమాంతంగా.

"సజ్జన్‌గారూ, దాస్యశృంఖలాల్ని విడగొట్టడంలో నమ్మకం గల వ్యక్తిని నేను".

''అయినా ఈ దాస్యశృంఖలాల్ని మానవుని మేధస్సు సృష్టించిన ఏ 'ఇజమ్' విరగ్గొట్టలేదులే మనస్సు ఏర్పర్చుకున్న బంధం చాలా గొప్పది. ఇది మానవత్వం. ప్రేమ కల్పించుకొన్న బంధంలో చిక్కుకున్న ఏ మనిషీ స్వేచ్ఛ పొందాలని కోరదు. దాని గొలుసులూ అతన్ని చుట్టుకుంటూ ఇంకా బిగుసుకోవాలనే కోరుకుంటారు".

తర్వాత కన్య ఏమీ మాట్లాడకుండా మౌనంగా కూర్చుండిపోయింది. తన మాటల ధోరణి ఆమె మీద ఎట్టి ప్రభావాన్ని కలిగించిందో వూహించుకో లేక పోయాడు సజ్జన్. అర్ధనిమిషంపాటు ఎవరూ నోరు విప్పలేదు. మౌనాన్ని భంగం చేస్తూ సజ్జన్ అన్నాడు - "నా దగ్గర వుంటానని నిన్న వాగ్దానం చేసావు"

"ఇది కూడా మీ యిల్లే అనుకుని వచ్చాను" అంది కన్య.

ఆ మాట సజ్జన్‌కు తృప్తి కలిగించింది. ఓక్షణం ఆలోచించి "ఈ మనస్సు కూడా చాలా విచిత్రమైంది సుమా. రాత్రింబవళ్ళు మనం ఏవ్యక్తిని గురించి ధ్యానం చేస్తూవుంటామో తీరా ఆ వ్యక్తే ఎదురుగా కనబడేసరికి ఏం చేయాలో తోచక వుండిపోతుంది."

కన్య జవాబివ్వలేదు ఆమె మౌనం గమనించి అతనికి ధైర్యం వచ్చింది. మోచెయ్యితో మెల్లిగా కొడుతూ "నీ కావిధంగా అనిపించడంలేదూ?" అని అడిగాడు సజ్జన్

నెమ్మదిగా తలఎత్తి కన్య ప్రశ్నార్థకంగా చూసింది అతనివైపు. మళ్ళీ మాటల్ని తూచి "ఇప్పుడు నా మనస్సంతా ఎలావుందంటే నా తలపుమీద నాకు నమ్మకం కుదరటంలేదు" అని తూచితూచి మాట్లాడినట్టుగా అంది.

ఒక్క క్షణం ఆగి మళ్ళీ ఒదిలేసిన మాటల చివరను పట్టుకొని లాగుతూ "నేనెవర్నీ ప్రేమించలేనని మాత్రం చెప్పలేను. కాని సర్వసాధారణంగా అటువంటి ఆలోచనకి ఇప్పటి వరకు దూరంగా వుంటూవచ్చాను. మామూలు కలని యింతవరకూ వాస్తవంకన్న మిన్నగా ఊహించుకొంటూ గడుపుకొస్తున్నాను. కాని మీరు దాని మధ్యలోనే నాటకాల్లో జరుగుతున్నట్లు చాలా తొందరగా నిజంగా చెయ్యాలని ఉవ్విళ్ళూరుతున్నారు. అందుకనే మిమ్మల్ని ఇంతవరకు సరిగా అర్థం చేసుకోలేకపోయాను. నన్ను నేనే అర్థం చేసుకోలేని పరిస్థితిలో పడ్డాను. ఆపదలో నన్ను ఆదుకున్నారు. నేను నా స్వార్థంలోపడి అవసరానికి మించి ఎక్కువ వుపయోగించుకుంటున్నానేమో అని భయపడుతుంటాను, అప్పుడప్పుడు" అంది కన్య.

"ఇందులో ఉపయోగించటం ఏముంది గనుక?" అని అడిగాడు సజ్జన్.

"మీరు అదుకోవచ్చు. కాని నా మనస్సు మాత్రం అలా అంటోంది మీరు నిజమే చెపుతూండవచ్చు. అలా నా మనస్సు అనుకోవటం సహజమే కదా!"

"మీకూ, నాకు గాఢ పరిచయం లేదు. బంధుత్వం అంతకన్నా లేదు"

"మన మధ్య పెంచుకుంటోన్న ఈ బంధం అన్నిటికన్న -"

"పెద్దసున్న, హుళక్కి" తొణక్కుండా అంది కన్య.

సజ్జన్ బిత్తరపోయాడు. "హుళక్కి-సరే ఈ పెద్ద సున్నా ఏమిటి?" అని అడిగాడు సజ్జన్. కొంచెం కొంచెం పెద్దదిగా చేసి కన్య వివరంగా చెప్పింది- "జీరో – సిఫర్ – అంత కన్న మంచి భాషలో దీన్ని నిర్వచించలేను"

కన్య ఇచ్చిన సమాధానం విని సజ్జన్ స్తబ్ధుడయ్యాడు. కన్య ఈ విధంగా మాట్లాడుతుందని అతను అనుకోలేదు.

వశ్శీ కన్యే అంది - "ప్రేమకోసం ప్రపంచం ప్రాణాలర్పించిందంటే అది మానసిక లోపమే అని నా వుద్దేశ్యం".

''ఎందుకో?'' సజ్జన్ కంఠం ఖంగుమన్నట్లుగా మోగింది.

కన్య చాలా శాపీగా జవాబిచ్చింది - ''లోపం కాకపోతే మరేముంది? లైలాకు మజ్నూ దొరకలేదు. లైలా లేకుండానే మజ్నూ వుండిపోయాడు. అందుకే ప్రపంచం వాళ్ళ ప్రేమను గీతాల్లో బంధించి పాడుతోంది. ఈ లైలా మజ్నూయే గనుక ఒకరి నొకరు పొందియుంటే కథ ఇంకోవిధంగా వుండేది. ప్రపంచం వాళ్ళ ప్రేమను గానం చేసేదికాదు, వాళ్ళ ప్రేమ ఈ విధంగా భూమి మీద శాశ్వతంగానూ వుండేదికాదు''

సజ్జన్ మొహం మీద గాంభీర్యాన్ని తెచ్చుకొని కొంచెం సేపు ఆలోచనలో పడ్డాడు. ఆ తర్వాత - "లేకపోవడం అనేది మానవ జీవితంలో చిన్న సంఘట నగా వుండబోదు. లోపాన్ని తెలుసుకొన్న తర్వాతనే దాన్ని సరిదిద్దుకోవడానికి లోపల్నుంచి శక్తి పుడుతుంది. పెరుగుతుంది. ఇక లైలా మజ్నూల సంగతి అంటావూ, వాళ్ళిద్దరూ పరస్పరంగా గాఢంగా ప్రేమించుకుని అనుక్షణం ఒకరి కోసం ఒకరు బలి అయ్యేవారు గనుక మనం ఈ నాటికీ వాళ్ళని స్మరించు కుంటూన్నాం. అట్టి త్యాగంలోనే మనత ఇమిడి వుంది'' అన్నాడు సజ్జన్.

మెల్లిగా దగ్గి కన్య మళ్ళీ వూరుకుంది. ఇటువంటి విషయాల్లో ఆమె కంత ఉత్సాహం లేనట్టుగా ముభావంగా కనిపించింది. సజ్జన్ కూడా మాట్లాడ కుండా ఆమెను చూస్తూ వున్నాడు. గభాలున కుర్చీలోంచి లేచి వెళ్ళిపోతూ ఆమె అంది- ''మన కవులు భావాలకూ, అనుభూతికీ ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. కాని అదంతా మోసం. చెప్పదలచుకుంది ముక్కుకు సూటిగా వుండాలి. స్త్రీకీ పురు షునికీ మధ్యవున్న సంబంధానికి పరిష్కారం చివరకు భార్యాభర్త అవడంతో దొరుకుతుంది. ఆ సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని మీకు దీటుగా నేను వున్నానో లేనో ఇంకా తేల్చుకోవల్సివుంది''.

సజ్జన్‌కు మళ్ళీ తీవ్రమైన బాధ కలిగింది.

తలుపు దాకా వెళ్ళి తల తిప్పుతూ వనకన్య "స్త్రీ పురుషులు జీవితంలో ఒకరి నొకరు ఒకసారే పొందేది. ఇది నా దృఢనమ్మకం. అలా జరిగేముందు ఇద్దరూ చూసుకోవాలి. మెరుగురాయి మీద తమ మనసుల్ని రుద్దుకోని. ఇది చాలా బాధ్యతలతో కూడుకున్న బంధం. శ్రీమంతులూ, కళాకారులూ, నిక్షే పరాయుళ్ళు ఆడుకునే వినోద క్రీడకాదు."

కన్య వెళ్ళిపోయింది. సజ్జన్ కట్టుకొన్న ఊహాసౌధం పునాది లేని కట్టడ మైంది. తన నిస్సహాయతపై అతనికి కోపం వచ్చింది. ఈ యువతి మనస్తత్వం రోజు రోజుకూ పొడుపు కథలా తయారౌతోంది. రోజా తన దగ్గరకొస్తుంది. కథను విప్పినట్టే విప్పుతుంది. తనకు అంతా అర్థమైనట్లే వుంటుంది. ఇంతలోనే అకస్మాత్తుగా తన్ను విదలించుకొని వెళ్ళిపోతుంది. రోజు కన్య మీద నుంచి తన మనస్సు కట్టేసుకుంటానని ప్రతిన చేస్తాడు. కాని అదేమో పచ్చిదారంలా వున్నట్లువుండి తునిగిపోతుంది.

ఎవరో నిండు బజార్లో నిలబెట్టి అతణ్ణి చెంపదెబ్బ కొట్టినట్లుగా కుమిలి పోయాడు ఇంతలో కర్నల్ గదిలోకి వచ్చి లైటు వేస్తూ అన్నాడు - "ఏం నాయనా, ప్రణయసల్లాపాలు అయిపోయాయా? మీ ఇద్దరూ మాట్లాడుకోవడానికి అవకాశం ఇద్దామని వెళ్ళాను బయటికి.

"పాపం నామీద చాలా దయతలిచావు కదూ? పోరా మూర్ఖుడా" అని బరువుగా వున్న హృదయాన్ని తేలిక పరచుకుంటూ అన్నాడు సజ్జన్.

# 19

కర్నల్ దగ్గర నుంచి బయల్దేరిన మహీపాల్ అమీనాబాద్ పార్క్ జన సమర్థంగల రోడ్లమీద పడిపోతున్నాడు. అతను చాలా విచారంగా వున్నాడు. వర్షంపడిన తర్వాత రోడ్డు మీద అణిగిపోయిన దుమ్ములా అతని మానసిక ఆందోళనా, కలవరం తగ్గిపోసాగాయి. తాను ఇప్పుడెక్కడికి పోవాలి? అతనికి

ఎక్కడా చోటులేదు. అతని మనస్సులోనే అతనికి చోటులేదు. అతనందరికీ భారం అయ్యాడు. అతని బ్రతుకు ఎవరికీ పనికిరానట్టిది. అతనిది ఇతరులకు వుపకరించని జీవితం. ఓడిపోతూండడం అతని తలరాత. సందు మొగలోవున్న ఎత్తైన బిల్డింగుమీద తాటికాయలంత అక్షరాల్లో కరెంటుతో వెలుగుతోన్న సిమ్ టూల్ వేస్టు ప్రకటనమీద అటువెళ్లే జనం కళ్ళు పడ్డట్టు ప్రపంచం యావత్తూ అతను ఓడిపోతూంటే తమాషాగా చూస్తోన్నట్లు కనపడింది. అతను ఎంత నిస్సహాయుడయ్యాడు?

మరీ ముక్కుకు సూటిగా వుంటే ప్రపంచంలో మనలేం అనుకున్నాడు మహీపాల్. నిజాయితీవుంటే మనిషి నేటి ప్రపంచంలో అడుగడుగునా నిస్స హాయంగా బలిఅవుతాడు. సేఠ్ రూప్‌రతన్, తన స్వంత తమ్ముడు గట్టూ జీవి తంలో అతణ్ణి మోసగించారని అంటే ఎవరూ విశ్వసించరు. కాని రూప్‌రతన్‌ని తానే మోసగించి డబ్బుగుంజుకున్నాడనో అన్నగారికి లేక డాక్టర్ జయపాల్ ఆర్థిక సహాయం చేస్తుంటాడనో అనడానికి ప్రతివ్యక్తి సిద్ధంగా వుంటాడు. నేను షీలాకు ఏమి ఇస్తుందీ, లేనిదీ ప్రపంచానికి తెలియదు. ఒకవేళ తెలిసినా పెద్ద రచయిత, సాహితీవేత్త అయిన మహీపాల్ శుక్లా తన భార్యా పిల్లల్ని నోళ్లుకొట్టి సంపాదనంతా విలాసాలకు ఖర్చుపెట్టేంత కర్కోటకుడు అని మాత్రమే అతణ్ణి అంటుంది. అటుపోయినా ఇటు పోయినా నాకే అపనింద తగలకమానదు. ఎందు కంటే నేను ఆర్థికంగా బాగా చితికిపోయిన వాణ్ణి, శ్రీమంతుణ్ణి కాదు నా చేతిలో ఏ అధికారమూ లేదు.

ఇంతలో క్రితంరాత్రి 'క్రిస్మస్ బాల్'కి వచ్చిన ఇద్దరు వ్యక్తులు ఎదురుగా భగత్‌జీ కిళ్ళీకొట్టు దగ్గర నిలబడి వుండటం చూశాడు మహీపాల్. దొంగని పోలీసులు చూసినట్టుగా వాళ్ళను తప్పించుకుని చటుక్కున చౌరస్తా దిగి పోయాడు. వాళ్లనుంచి తప్పించుకుంటూ చరచరా నడవసాగాడు. నజీరాబాదు రోడ్డు మీద వెళ్ళేక కాని తాను ఎంత నడిచిందీ తెలియలేదు. చౌరస్తా అవతలి వైపుకు వెళాదామని వేగంగా నడుస్తుంటే సిటీ బస్సు వేగంగా వచ్చింది, డ్రైవర్ వెంటనే బ్రేక్ వేసి ఆపి అతణ్ణి పరకాయిస్తూ చూశాడు. అతను డ్రైవర్ని చూసి

బంగారు పడిపోయాడు. వాళ్ళంటే అతనికెందుకు భయం? ఆ భయంవల్లనేనా అతను పారిపోతూంట. అతనిలో గూడు కట్టుకున్న భయమె అతన్ని తరుము తోంది. కాని ఇలాంటి వాదనలో పనిలేదు. గాభరాపడుతోన్న మనస్సుకు కళ్ళెం వేసి అపుతూ మహీపాల్ దాని చెవిలో చెప్పాడు–"ప్రజలంటే భయపడుతూ ఎన్నాళ్ళు పారిపోతావ్? తానేమంత అపరాధం చేసాడని? ప్రపంచంలో ఒకరి కంటే ఎక్కువ ఆడవాళ్ళతో సంబంధాలు పెట్టుకున్న వాళ్ళు చాలామంది వున్నారు ఎంతోమంది స్వయంగా ఆడవాళ్ళను అటువంటి పనులు చెయ్యమని ప్రోత్సహించేస్తూ దర్జాగా బతుకుతుంటారు. వాళ్ళందరికన్నా హీనుడా మహీపాల్? లేదు. నిశ్చయంగా తాను పాపాత్ముడుకాదు. తనకూ షీలాకు వున్న సంబంధం లోకం దృష్టిలో నీతిబాహ్యమైంది కావచ్చు. కాని తానేంపాపం చేయటంలేదు. తాను ఏకపత్నీవ్రతుడు కాదని ఎవరైనా అన్నా అప్పుడు కూడా పాపినికాదు నేను. మున్నయి నలభై సంవత్సరాల క్రితం వరకు ఎంతమందికి ఇద్దరిద్దరూ, ముగ్గురూ భార్యలులేరా? పరమశివుడూ, శ్రీకృష్ణుడూ, స్వయంగా శ్రీరామ చంద్రుని తండ్రి బహుపత్నీకులు కారా? బహుపత్నీకత్వాన్ని ఎంతోమంది ఋషులు అంగీకరించారు. షీలాను ఏడడుగులు వేసి వివాహం చేసుకుని వుండక పోవచ్చు, అందరిముందు మంగళసూత్రం కట్టి వుండక పోవచ్చు, అయినా ఆమె కూడా ఓ విధంగా తనకు భార్యే".

కడుపులో పాలు పోసుకుని పెరుగుతోన్న ధర్మభీతిని పోగొట్టుకోవ డానికి మహీపాల్ రకరకాల తర్కాలు వెతుకుతున్నాడు. తనలో తాను ఈ విషయంపై తర్జనభర్జన చేస్తూ ఎంతదూరం పోయాడంటే నిజానికి అతని భార్య షీలాయే అనీ, కళ్యాణితో అతనికి జరిగిన పెళ్ళి పూర్వీకుల ఇష్టప్రకారం జరి గిందనీ తీర్మానానికి వచ్చాడు. మరి పిల్లల సంగతి? వీళ్ళంతా షీలాకు చెందిన వారే.

పిల్లల తల్లిగా షీలాను మనసులో చిత్రించుకుంటుండగ మహీపాల్ బుద్ధి మాత్రం పెడతోవ పట్టింది....లేదు, షీలా అతని పిల్లల తల్లి కాలేదు. తల్లి కావాలన్న తలంపంటేనే షీలాకు అసహ్యం. మరి షీలాకు సంతానం వుండి

వుంటే? కళ్యాణి పిల్లలూ-షీలా పిల్లలూ అతని పిల్లలయ్యే వారు....అప్పుడు తన పితృప్రేమను తాను ఎలా పంచేవాడు? అనేక స్త్రీలవల్ల సంతానం కలిగివున్న పురుషుల మనస్సు ఎలావుంటుందో వాళ్ళ దృష్టిలో తేడా తప్పక వుంటుంది. అలా వుండడం సహజం. ఇటువంటి ఉదాహరణలు మన సమాజంలో కొల్లలుగా వున్నాయి. అక్కడిదాకా ఎందుకు? మన త్రేతాయుగం దశరథుడు లేడూ? అనేక స్త్రీల వల్ల అతనికి పిల్లలు పుట్టకపోయివుంటే ఆ యింట్లో పొరపొచ్చాలే వచ్చేవి కావు. బహుపత్నీకత్వంలో వున్న విషాదాంతానికి దశరథుడే చక్కని ఉదాహరణ. ముగ్గురు భార్యలవల్ల నలుగురు సంతానం వుండి కూడా ఎలాంటి చావు చచ్చాడు ఆయన!

మనస్సులో పరుగెత్తుతోన్న ఆలోచనల రథంతోటు అతనూ పరుగెత్తుతూ విక్టోరియా పార్క్ చేరుకున్నాడు మహీపాల్. మనస్సంతా ఆలోచనా మేఘాలతో కమ్ముకునివుంది. తనకు తెలీకుండానే అక్కడ కాస్సేపు కూర్చోవాలన్న కోరిక కలిగింది. విక్టోరియా మంటపం అరుగుమీద మెట్లపై ఆనుకుని కూలబడ్డాడు. చలికాలం—గాలి తెమ్మెరలు నిస్తబ్దంగావున్న పార్కు-అతనిప్పుడు అక్కడ ఎందుకూర్చోవాలన్న ఆలోచనా-ఏమీతట్టడంలేదు మహీపాల్‌కు జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు. దమ్ము పీల్చి వదులుతూ మళ్ళీ ఆలోచనలో మునిగిపోయాడు.

సుమారు గంటసేపు అక్కడే కూర్చున్నాడు. ఏవేవో వెర్రివెర్రి ఆలోచనలు అతన్ని అల్లుకుపోయాయి. చలి ఎక్కువవుతోంది. ఆలోచనలతో వేడెక్కిన అతని బుర్ర, చివరకు శరీరం సైతం వాతావరణం అతనిపై విసురుతోన్న చలికి ఉష్ణతను కోల్పోసాగాయి. ఆలోచనలతో అన్ని క్షణాలు గడపగలిగిన మహీపాల్ వణకడం మొదలెట్టాడు. కాని ఎక్కడికి వెళ్ళడం, ఎక్కడవుండేది తేల్చుకోలేకపోతున్నాడు.

తన ఇంటికి వెళ్ళడానికి మనస్కరించడంలేదు. తాను కళ్యాణికి ముఖం చూపించలేదు. పొద్దున్న భార్యా భర్తల పోట్లాటలో తమ తండ్రి చరిత్రహీనుడని

పిల్లలందరికీ తెలిసిపోయింది. ఇంతమంది పిల్లలకు తండ్రి అయికూడా వాళ్ళ తండ్రి మరో స్త్రీతో సంబంధం పెట్టుకున్నాడు.

తన పిల్లలు తన గురించి ఏమనుకుంటున్నారో! తండ్రి అయిన మహీపాల్ పిల్లలదగ్గరకు ఎలా పోగలడు? కళ్యాణి పల్లెటూరి గొడ్డు. ఈ వార్త విన్న తర్వాత కళ్యాణి క్షోభించడం సహజం. తాను కాదనలేదు. కాని తన కళత్రను భర్తకు తెలియజెయ్యడానికి ఇంతకన్న సున్నితమైన మార్గం లేదా కళ్యాణికి? మహీపాల్ మానసిక పరిస్థితి అధ్వాన్నంగావుంది.

గతించిన నాలుగు సంవత్సరాలు అతని కళ్ళల్లో సుడులు తిరిగాయి. కళ్యాణి పేగుల్లో పుండొచ్చింది. ఆమెకు చికిత్సచేయడానికి షీలాసింగ్ మహీపాల్ ఇంటికి వచ్చింది, కర్నల్‌ని వెంటపెట్టుకుని. ఆ సందర్భంలో ఆమెకూ మహీపాల్‌కు సంభాషణ జరిగింది. అప్పుడే మహీపాల్ ఆమెను తన ప్రతిభతో ఆకర్షించాడు. కర్నల్ కూడ తన మిత్రుని ప్రఖ్యాతి గురించి ఎంతో గర్వంగా వర్ణించాడు షీలాకు. షీలా ప్రభావితం అయింది. కళ అన్నా సాహిత్యం అన్నా షీలాకు అభిమానం. ప్రేమ్‌చంద్ రాసిన ఒకటి రెండు పుస్తకాలూ, శరత్ రాసిన రెండు నవలలకు హిందీ అనువాదాలు తప్పితే హిందీ సాహిత్యంతో ఆమెకు ఎక్కువ పరిచయం లేదు. ఉగ్రగారు రాసిన "చంద్ హసీనోంకీ ఖతూత్" ఈ నాటికి ఆమెకు కంఠస్థం. ఈ చిన్న పెట్టుబడితోనే వాళ్లిద్దరి మధ్య స్నేహం ప్రారంభం అయింది. తన దగ్గర డబ్బులేకపోతే కర్నల్‌ను అప్పు అడిగి తాను రాసిన పుస్తకాల సెట్‌కొని ఆమెకు బహుమతి చేసాడు మహీపాల్ కర్నల్ ద్వారా. తర్వాత ఆమె కళ్యాణిని చూడ్డానికి ఎప్పుడొచ్చినా ప్రైకం పుచ్చుకొనేది కాదు. కళ్యాణిరోగం నయం చెయ్యడానికి ఆమె ఎంతో కష్టపడింది. కళ్యాణితోనూ పిల్లలతోనూ బాగా కలిసిపోయింది. వ్యక్తిగానూ, రచయితగానూ మహీపాల్ ఆమెకు ఎంతో నచ్చాడు. తనలోని కళాప్రియత్వం, సౌజన్యబుద్ధి కలుపుగోలు తనంతో ఆమె కూడ మహీపాల్‌ని ఆకర్షించింది అప్పట్లో వాళ్ళిద్దరి మధ్యా స్నేహం ఇంతవరకే పరిమితమైవుంది. తరుచుగా కాఫీహౌస్‌లో వాళ్ళి

ద్దరూ కలుసుకుంటూ వుండేవారు. మహీపాల్‌తో పాటు సజ్జన్, కర్నల్‌తో కూడ ఆమెకు సాన్నిహిత్యం పెరగసాగింది. అలాగే నెలలు గడిచిపోయాయి.

ఓరోజు మహీపాల్ కాఫీ హౌస్‌లో కూర్చొని వున్నాడు. షీలా అక్కడికి వచ్చింది. ఆమె చాలా పరధ్యాన్నంగా కనిపించదా రోజు. అక్కడ కూర్చోవడం ఇష్టంలేక షికారు వెళ్ళదామా అని మహీపాల్‌ని అడిగింది. లామార్టినర్ కాలేజీ దాక ఇద్దరు కార్లో వెళ్ళారు. అక్కడ కారు వదిలేసి మాట్లాడుకుంటూ చాలా దూరం కాలినడకనే వెళ్ళారు. ఒకచోట ఏకాంత ప్రదేశంలో ఇద్దరూ ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటూ చాలా సేపు వున్నారు. మాటల ప్రవాహంలో హావభావాల్ని నింపుకుని షీలా మహీపాల్ కళ్ళల్లోకి చూసింది. ఆమె చూపుల్లోని భావాన్ని గ్రహించాడు. అతని జీవితంలో ఆరోజు నుంచే మరో అధ్యాయం ప్రారంభమైంది. ఈ సంఘటన జరిగిన కొద్ది రోజుల తర్వాత నుంచి మహీపాల్ ఏకపత్నీ వ్రతం భగ్నమైంది. షీలాను కలుసు కొన్నప్పుడల్లా మహీపాల్ నూతన స్ఫూర్తిని పొందుతాడు. తాను చేసేది పాపం అని తెలుసు. ఇది జరిగి నాలుగు సంవత్సరాలైనా షీలా ఈనాటికి అతనికి కొత్త ఉత్సాహం కల్పించే ప్రోత్సాహినిలా భావిస్తాడు మహీపాల్. మహీపాల్‌ను ఎలా సంతోష పెట్టాలో షీలాకు తెలుసు. వాళ్ళిద్దరి మధ్య అభిప్రాయ భేదాలు కల్గుతుంటాయి, కానీ ఇంత వరకు ఇద్దరి మధ్య తగాదా రాలేదు. మహీపాల్ ఉగ్రస్వభావం కలవాడు, తీవ్రవాది. అప్పుడప్పుడు అతని రౌద్రాకారం ఆమె ముందు సాక్షాత్కారం అవుతూంటూంది. కాని ఉపద్రవాల్ని కలిగించేటంతగా అతను బయటపడడు. అతన్ని ఎలా శాంతింప చేయాలో షీలాకు బాగా తెలుసు. ఇంత దగ్గరగా వుంటూ కూడా షీలా ఈనాడికి అతని ఆర్థిక పరిస్థితి తెలుసుకోవాలని ఒక్క రోజైనా ప్రయత్నం చెయ్యలేదు. తన స్వంత వ్యవహారాలు కానీ, ఇంటి వ్యవహారాలు కానీ వాళ్ళిద్దరి మధ్య ప్రసంగించనూ లేదు. అసలు రోజూ ఒకరి నొకరు కలుసుకొంటూ వుడడం జరగదు. ఎవరి పనుల్లో వాళ్ళు తమతమ సోషల్ సర్కిల్‌లో వుంటూ వుంటారు. కాని తరుచుగా కాకపోయినా త్వరత్వరగా కలుసుకుంటూ వుండాలన్న నియామాన్ని పెట్టుకున్నారు.

మధుర స్మృతుల్ని జ్ఞాపకం చేస్తూ. మహీపాల్ మనస్సులో షీలా మెరి లంది. అక్కడికే వెళ్ళి ఆ రాత్రి అక్కడే గడిపితే బావుండుననిపించింది అతనికి.

మహీపాల్ మెట్లమీద నుంచి లేచాడు. మళ్ళీ ఎందుకో సంకోచం కలిగింది. ఆలోచిస్తూ నిలబడ్డాడు. ఇట్టి పరిస్థితిలో షీలా ఇంటికి వెళ్ళడం మినహా అతనికి వేరే వుపాయం తోచడం లేదు. అతని జీవితంలో సజ్జన్ ఇంట్లో కూడా పదు కొన్న రోజులున్నాయి. కాని ఇప్పుడెందుకో అక్కడికి వెళ్ళాలని అనిపించడం లేదు. అతని దృష్టిలో సజ్జన్ వంచకుడు. కర్నల్ ఇల్లు సజ్జన్ ఇంటికి చాలా దగ్గర. తాను అక్కడికి వెళ్ళొచ్చు. కాని ఈ సమయంలో అక్కడికి వెళ్ళితే అతను వుపదేశాలు ఇవ్వడం మొదలెడతాడు. కనక షీలా ఇంటికి వెళ్ళడమే ఉత్తమం అని మహీపాల్ తీర్మానించుకున్నాడు.

ఆ తీర్మానాన్నే మొండి తనం తాడుకు బంధించుకొని పది అడుగులు వేశాడు. తాను ఎన్నాటికీ షీలా ఇంట్లో వుంటాడు తను అలా వుండ గలడా? మహీపాల్ కాళ్ళను ఎవరో కట్టేసినట్లయింది. అతనికి మళ్ళీ విషాదం కమ్ము కుంది అతని జీవితం నిరర్థకం. తను పారి పోతాడు. పారిపోయి సన్యాసం పుచ్చు కుంటాడు.

సన్యాసం పుచ్చుకునే ముందు షీలాను చివరి సారిగా కలుసు కుందామన్న సంకల్పం కలిగింది. ఆమె ఇంటికి వెళ్ళడానికి ఇదొక అస్త్రం అనుకున్నా ఫరవా లేదు.

షీలా బంగళాకు వెళ్లాడు. రోగుల్ని చూడ్డానికి వెళ్ళిన డాక్టర్ షీలా సింగ్ ఇంకా రాలేదని నౌకరు చెప్పాడు. అప్పుడు వావు తక్కువ పది గంటలు. కాఫీ పెట్టమని నౌకరును పురమాయించి ఆమె గదిలో కెళ్ళి సోఫా మీద పదు కున్నాడు. ఇరవై నిమిషాల తర్వాత షీలా కూడ వచ్చింది.

షీలా కొప్పులో పచ్చ గులాబీలు సన్నగా వాసన చల్లుతూంటే ఆమె చెవుల్లోని రవ్వలు ధగధగ మెరిసిపోతున్నాయి ఇవ్వాళ ఆమె చాలా హుషారుగా వుంది మహీపాల్‌ని చూడగానే ఆమె ఆనందానికి అంతేలేదు.

"యూ రాస్కెల్, వాట్ ఆర్ యు డూయింగ్ యట్ దిస్ టైమ్ ఆఫ్ ది నైట్? ఏం, శ్రీమతి గారేమైన దేశబహిష్కారం చేసిందా?"

నీరసంగా నవ్వుతూ ''ఊఁ" అన్నాడు మహీపాల్.

"నిజం చెప్పు. పోట్లాడి వచ్చావా ఏమి?"

నవ్వుతూ తాను మొదట అన్న దానిని తేలిగ్గా ఎగర గొట్టేసాడు. "నేనేదో వూరికేనే అన్నాను సుమా. ఈరోజు సాయంత్రం మా మూర్ఖద్వయం కలవ లేదు. ఏదో తిరగాలని పించింది, వైట్ విక్టోరియాలో చాలా సేపు తూల బడ్డాను. నీ దగ్గిరకు వద్దామనిపించింది. అంతే, వచ్చి వాలి పోయాను. భోజనం చేశావా?''

"అప్పుడే ఎక్కడ? నువ్వు కూడా తిననట్టున్నావ్"

"అందుకే అడుగు తున్నాను"

"అబ్దుల్!"

"జీ మిస్‌సాబ్" దూరంగా అబ్దుల్ సమాధానం ఇచ్చాడు.

మహీపాల్‌కు నవ్వొచ్చింది. "ఎందుకు నవ్వు తున్నావ్?'' అంటూ షీలా అడిగింది.

''వాడు మిస్ సాహబ్ అని పిలుస్తున్నాడు. వినలేదూ? అందుకూ నవ్వొచ్చింది"

షీలా ఒకక్షణం ఆలోచించి మళ్లీ అర్థమైందే తడవుగా విరగబడి నవ్వింది. దగ్గరనే వున్న దిండు చేతిలో తీసుకుని చిలిపిగా మహీపాల్ మీదకు విసిరింది. ఇంతలో అబ్దుల్ వచ్చాడు ఏం జరగ నట్టుగా సంబాళించు కుని షీలా ఈ రాత్రి మహీపాల్ ఇక్కడే భోజనం చేస్తారని చెప్పి, ఈరోజు వంటకాలు ఏమిటో అడిగింది.

"కోడి మాంసం వండా నండీ" అన్నాడు అబ్దుల్.

"సరే. వడ్డించు... ఇదిగో! కొంచెం ఆగు? మహీపాల్! డ్రింకేమైనా తీసు కుంటావా'' అని మహీపాల్‌ను చూస్తూ అడిగింది.

"తప్పకుండా" అన్నాడు మహీపాల్.

మరేమీ అడక్కుండానే అబ్దుల్ షీలాను అడిగి అలమారు తాళం చెవులు తీసుకొని వెళ్ళాడు. కొన్ని నిమిషాల్లోనే టేబిల్ మీద గ్లాసూ, విస్కీ బాటిల్ తెచ్చి పెట్టాడు.

"నీ నవల ఎంతవరకొచ్చింది?" టేబిల్ మీద కూర్చుంటూ షీలా అడిగింది.

"ఈ మధ్యన రాయడం మానేసా".

"అంటే?"

"అదే పదిహేను ఇరవై రోజుల్నుంచి".

"ఎన్ని పేజీలు వరకు వచ్చింది?"

"ఏదో 64 పేజీలు వరకనుకో".

"ఎందుకు మానేసావ్?"

"ఆc, ఏమీలేదు. మధ్యలో రేడియో వాళ్ళ పని తగిలింది. అదీకాక రోజూ జీవనభృతి వెతుక్కోవాల్సివుందిగా. దాంతోటే కాలయాపన జరుగుతోంది".

"దాన్ని పూర్తిచెయ్యి. ప్లాటు చాలా బావుంది"

వండిన కోడిపెట్టలోకి కత్తిపోటు స్తూ ఏ ఆసక్తి లేని వ్యక్తిలా ముఖాన్ని పెట్టి "అయినప్పుడే పూర్తవుతుందిలే. పట్టుపడితేమాత్రం లాభం ఏమిటి"

"నీ మోస్తరుగానే ప్రతి కళాకారుడూ ఈసడింపుగా మాట్లాడ్డం ప్రారంభిస్తే కొన్నాళ్ళకు ఈ భూమి మీద కళ అంటూ మిగలదు సుమా".

"ఇది చాలా రొటీన్ మాట - సినిమా వాళ్ళు కూడా సంభాషణల్లో ఇవే పాత మాటల్ని చొప్పిస్తున్నారు. చూడు షీలా, ఏరచయితనూ ఫలానప్పుడు నువ్వు రాయమని బలవంతం చెయ్యలేం. అక్కడిదాకా ఎందుకు? స్వయంగా రచయిత కూడా తన్ను తాను బలవంతం పెట్టలేడు. కొంచెం విశ్రాంతి దొరికిందంటే అతనిలోని ప్రతిభే కలం పట్టి రాయిస్తుంది".

"ఈ మధ్య మనసు బాగు లేదా?"

షీలా వేసినా ప్రశ్నకు మహీపాల్ [illegible] అందుకుంటూ "అంత పెద్ద విశేషం లేదనుకో. మేనకోడలు పెళ్ళి [illegible]. రోజూ ఎవరో ఒకర్ని వెతుక్కోవటం, వారి జాతకం తేవడం, వాళ్ళను కాకాపడుతూండడం, పడిగాపులు కాయడం - యివన్నీ మనస్సును పూరికే చికాకు పరుస్తున్నాయి" అని అన్నాడు.

"ఎక్కడైనా సంబంధం కుదిరిందా?"

"ముందు పెళ్ళికొడుకను గాలం వేసి పట్టాలి. మా చెల్లెలుండే చోట గట్టి అతణ్ణి కానేయాలి. మా ఊళ్ళలో ఇప్పుడు ఏమిటండీ అంతకుముందు [illegible] వస్తువు మీద మాకే పెత్తనం వుండదు. అంతంత కట్నాలు పోసి కొన్నాక్కూడా వియ్యాలవారు ఇంకా ఏవేవో సాకులు చెప్పి [illegible] వాళ్ళ చేత ఎత్తిపొడుపులు దిగమింగి కూర్చోవాల్సివస్తుంది"

"జాతి కులం అంటూ ఇంకా ఎందుకు పట్టుకు వేళ్ళాడుతారు? [illegible] వాటిని తుంచెయ్యలేవా? నీలాంటి వ్యక్తులే సమాజానికి దారి చూపకపోతే ఇక సమాజం ఎప్పుడు మారుతుంది, ఎలా మారుతుంది?"

"బావుంది...నేనా మారేది. ఆమె [illegible] - [illegible] కులంలో ఇచ్చి పెళ్ళిచేస్తే ఇంటి విషం తాగి చచ్చిపోతుందట. ఏం చేయ మంటావ్?"

అప్పుడు తన బాధ చెప్తున్నట్లే చేతులు తిప్పుతూ అభినయం చేస్తూ మహీపాల్ చెప్తోంటే ఒకవంక మహీపాల్ నిస్సహాయతకు జాలిపడి చూస్తూనే, అతని చేష్టలు చూసి షీలా నవ్వాపుకోలేకపోయింది.

"మీ ఆవిడను తరచు ఇమిటేట్ చేస్తున్నావే. నీ గురించి ఆమెకు చెప్తాను"

మహీపాల్ ఏమీ మాట్లాడకుండా కోవని తింటున్నాడు.

"అబ్దుల్!"

"ఏం [illegible]"

"ఇంకో [illegible]సు [illegible]ంపుతావా?"

"మంచి[illegible]"

"నీ మనోవ్యథ నాకు తెలుసు. పిల్లాడి తాలూకు వాళ్ళు బాగా కట్నం అడుగుతున్నట్లోంది" షీలా మళ్ళీ రెడీస్తూ అడిగింది.

"వాళ్ళ ఇష్టమొచ్చినట్లు అడగనీయ్ వెధవలు" అంటూ గ్లాసు నిండు తోంచే మనసు కొత్త మత్తుతో పూగిపోయింది. అంతలోకే మళ్ళీ - "నేనా విషయం ఆలోచించడాన్నే మానేసాను కళ్యాణికి కావాలంటే ఆమే తంటాలు పడుతుంది" అని అబ్దుల్ వైపు చూస్తూ "అరే, ఇంకొంచెం పోయరా" అని అన్నాడు.

గ్లాసులో రెండు పెగ్గులు పడగానే సోడా కార్క్‌ను తెరవ మొదలెట్టాడు మహీపాల్ అతని చేతిలోంచి సోడా తీసుకుని వెంటనే తీసి పెట్టాడు టేబిల్ మీద అబ్దుల్. ఇంకో రెండు పెగ్గులు తగిలించాడు. అతని వాలకం చూస్తూ షీలా అడిగింది - "ఎక్కువ అయినట్లుంది".

"నో ఐ [illegible]" అన్నాడు మహీపాల్. అబ్దుల్ విస్కీ బాటిల్‌కు మూత పెడూతుంటే అతణ్ణి వుద్దేశిస్తూ, "మీ మేడంకు ఇవ్వవూ" అని అడిగాడు.

"నేనెప్పుడు తాగను"

"కంపెనీ కోసమైనా?"

"వద్దు. రేపు పొద్దున్నే పేషంట్లను చూడాలి."

"ఒక్క పెగ్గే - [illegible] ఫర్ కంపెనీ [illegible]?"

అబ్దుల్ అక్కడే నిలబడి వుండటం చూసి, "అబ్దుల్, ఇక నువ్వెళ్ళు. సోడా ఓపెన్ చేసి అక్కడ పెట్టిపో" అంది షీలా.

అబ్దుల్ వెళ్ళిపోయాడు మహీపాల్ గ్లాసులోంచి ఒక పెగ్గు తను గ్లాసులో పోసుకుని సోడా కలిపింది షీలా 'టు యువర్ హెల్త్' అంటూ

గ్లాసుల్ని తాకించి ఇద్దరూ నోట్లో పోసుకున్నారు. భోజనం మొదలెడుతూ షీలా మహీపాల్‌ని పలకరించింది – "ఒక మాట చెప్పమంటావా?"

"ఏమిటి?"

"నా దగ్గర బ్లాక్ మనీ చాలా మూలుగుతోంది. దాన్ని వైట్ చెయ్యా లను కుంటున్నాను. సాయం చేస్తావా?"

"ఊ హుఁ"

"నేను చెప్పింది ముందు సరిగ్గా విను. నాకు ఓ మనిషి సహాయంకావాలి. అలాటి వాణ్ణి వెతికి పెడతావా. అదే నీ దగ్గర నుంచి నాకు కావలసిన సహాయం".

"దేనికి?"

"నేను పుస్తకాల్ని ప్రచురించాలని అనుకుంటున్నాను. ముందు నీ పుస్త కాలన్నిటి కాపీరైటు నాకిచ్చెయ్యి. వాటిని ఎవరెవరు పబ్లిషర్లు ఇంతకు ముందు ప్రచురించారో వాళ్ళ దగ్గరున్న స్టాకంతా కొనేస్తాను. అమ్ముడు పోయిన పుస్త కాలు తిరిగి ప్రింటు చేయిస్తాను. పుస్తకాల వ్యాపారం క్షుణ్ణంగా తెలిసిన ఒక్క వ్యక్తిని నాకు అప్పజెప్పితే చాలు. అతన్ని మేనేజర్‌గా వేసుకుంటాను. నాకు కావలసిందే ఇంతే"

షీలా చెపుతోంటే మహీపాల్ మౌనంగా వింటున్నాడు. ఆమె చెప్పడం పూర్తి అయిన తర్వాత కూడా అతను బదులుగా ఒక్క మాట కూడా అనలేదు. షీలా రెట్టిస్తూ అడిగింది – "నీకు సమ్మతమేనా?" అంటూ. "ఈ వ్యవహారం పూర్తిగా బిజినెస్ ఈజ్ బిజినెస్ అనుకో. వ్యాపారం మందంగా వున్న ఈ రోజుల్లో కూడా ప్రజలు పుస్తకాలంటే కొద్దో గొప్పకొంటారు. నువ్వు చూస్తూ వుండు నేనెలా కొత్త పక్కిలో పబ్లిసిటీ చేసి పుస్తకాల సేల్‌ని ఎలా పెంచు కుంటూ పోతానో;"

ఆమె మాటలు విని మహీపాల్ పిచ్చివాడిలా నవ్వాడు. షీలా అతణ్ణి చూస్తూ వుండిపోయింది కాస్సేపటికి మహీపాల్ కంఠంలో విరక్తిని తెచ్చు

కుంటూ "నిన్ను ఏమీ యాచించకుండా వుండేనే లోకం బహిరంగంగా నన్ను ఆడిపోసుకుంటూవుంది. ఇక నీ దబ్బుతో నా పుస్తకాలు అచ్చువడం మొదలిడితే లోకం గుసగుసలాడ్డం మానేసి చరిత్రలోనే శాశ్వతంగా నా పేరు ఎక్కిస్తుంది. అవునా?" అన్నాడు

"నీతో మాట్లాడడం కష్టం మహీపాల్ నీ గురించి నీవెప్పుడు ఆలోచించినా కొత్తిగా లౌకికం ఏమీ తెలియని వానిలా ప్రవర్తిస్తావు. జీవితంలో సగం భాగం అయిపోయింది. ఇంకా ఎన్నాళ్ళు ఇలా మూర్ఖునిలా వుంటూ బలి అవుతావ్? నా మాట నిజం. నమ్ము. ఎన్నాళ్ళ నుంచో ఈ ప్రసంగం ఎత్తాలను కుంటున్నా, అన్నీ ఆలోచించిన తర్వాతే నేను నిర్ణయానికి వచ్చాను. ఇందులో మన ఇద్దరికీ లాభం వుంది. పుస్తకాలు అమ్ముడుపోవాలన్నా, పుస్తకాల ప్రచారం చేయాలన్నా నేను ఎన్నో కొత్త వుపాయాలు కనిపెట్టాను........".

"నువ్వాలోచించి వుండొచ్చు. వాటితో నాకేమీ ప్రమేయంలేదు"

"నువ్వు చాలా అతిగా ప్రవర్తిస్తున్నావ్ మహీపాల్. క్షణంసేపు నువ్వు నా వాడివన్న విషయం మరచిపో. మనం ఇద్దరం కల్లాకపటంలేని ఇద్దరు స్నేహితు లనుకోరాదు? ఉన్నట్టిగా వ్యాపారం చేస్తే నీకేం నష్టం? ప్రపంచం ఏమనుకుంటుందో అని నీ అవస్థంతా. అది ఎప్పుడూ ఎవరిమీదనో ఏదో ఒకటి అవాకులూ చవాకులూ కూస్తూనే వుంటుంది. మనం అంతగా పట్టించుకో కూడదు".

"నాకు ప్రపంచం అంటే ఏ మాత్రం భయంలేదు నేను భయపడేదల్లా నా మనస్సులో దాక్కున్న ఒక్క మహీపాల్ తోనే".

"నీకు భయం లేదూ గియం లేదు. వున్నమాటంటే నీకు వులుకెక్కువ. కాని నువ్వు మూఢుడివి. నేను నవ్వులాటగా ఈ మాట అనడంలేదు. నిజంగానే నీవ్యక్తిత్వంలో ఎక్కడో ఓ చోట ఈ మూర్ఖత్వం దాగివుంది. అది నిన్ను ఎప్పుడూ విశ్రాంతి తీసుకోకుండా అడ్డం తగులుతుంటుంది. ఇతరుల సంగతి చర్చించటం అనవసరం."

మహీపాల్ ఏదో చెప్పబోయాడు. మధ్యలోనే మళ్ళీ షీలా అందుకుని అతనికి నచ్చజెప్పాలనే ధోరణిలో–"చూడు మహీపాల్! నేను ఎన్నో పథకాలు ఆలోచించాను. స్కూళ్ళు, కాలేజీలు, విశ్వవిద్యాలయాల్లో కూడ నువ్వు రాసిన పుస్తకాల గురించి బ్రహ్మాండంగా ప్రచారం చేయిస్తాను. నీ సాహిత్యం అంతా చదివి ఎవరైతే ఉత్తమ విమర్శ చేస్తారో వాళ్ళకు బహుమతులు కూడా యిచ్చే ఏర్పాటు చేస్తాను. నీ పుస్తకాలంటే ఎక్కువమంది ముందుకొచ్చి చదివేలా, తహతహలాడేలా చేయించే పూచీనాది" అంది.

షీలా మాటలు వింటోంటే ఎడారిలో నడుస్తూ దాహంతో తన్నుకులాడే వ్యక్తికి నీళ్ళు దొరికినట్లు అతనికి ఎంతో హాయి అనిపించింది. ఎన్నిరోజులనుంచో ప్రజలంతా తన పుస్తకాలు చదవాలనీ, వాటిని గురించి వాదవాదలా చర్చించాలనీ కోరిక ఎంతో గాఢంగా వుంది, మహీపాల్‌కు. కాని తనలోవున్న ఈ స్వార్థం సాధించుకోవడానికి అతను మర్యాదను ఎప్పుడూ కుదువబెట్టలేదు. మహీపాల్ షీలా ఉత్సాహాన్నంతా నీరు కారుస్తూ ''చూడు షీలా, ఈ పబ్లికేషన్స్ అనేది హోల్‌టైమ్‌జాబ్. నీకు అంత తీరిక వుండదు. దీనికోసం మనిషి పూర్తిగా లగ్నమయి పనిచెయ్యాలి''.

"నేను తీరిగ్గా యివన్నీ చూడలేనని నీకెలా తెలిసింది అప్పుడే. నువ్వు నాకు సాయం చెయ్యాల్సిందల్లా ఓ మంచి బిజినెస్ మేనేజర్ని చూడటం. చూడు పాల్, నా దగ్గర మూలుగుతోన్న ఈ డబ్బు పిల్లలు పెడుతుంది. నీకు క్రమం తప్పకుండా రాయల్టీ దొరుకుతుంది ఆర్థికమాంద్యం వున్న ఈ రోజుల్లో కూడా నీ పుస్తకాల అమ్మకాన్ని నేను పెంచకపోతే ఒట్టు."

''చాలా సేపటినుంచీ ఈ విషయం గురించే మాట్లాడుతున్నాం. మరో విషయం చెప్పు''

"నేను ఎంతో ముఖ్యమైన విషయాన్నే చెపుతున్నాను"

"నేను బతికివుండగా ఈవ్యాపారం సాగదులే. నేను మరణించినతర్వాత"

"మహీపాల్, నీ మాట నిజమే కాని ఎదుటివ్యక్తి చెప్పేది వినిపించుకోవు కదా!" అతని నోటి మీద చెయ్యి పెట్టి అంది షీలా.

గ్లాసు చేతిలోకి తీసుకుంటూ నీరసంగా నవ్వాడు మహీపాల్. ఒక గుక్క తాగి బల్ల మీద తిరిగి గ్లాసు కంఠంలో నిషా నింపుకుని- "ఇవ్వాల్టికి ఇవ్వాళే అయ్యేపని ఏదైనా వుంటే చెప్పు. అలాంటి ప్రతి పనీ చెయ్యడానికి నాకు అభ్యంతరం లేదు" అన్నాడు.

"అంటే నీ వుద్దేశ్యం"

"అంటే నేను నీ దగ్గర నుంచి చివరిసారిగా వీడ్కోలు తీసుకోవడానికి వచ్చాను"

ఆ మాటవిని షీలా రాతిప్రతిమలా కదలకుండా వుండిపోయింది. అతనేం చెపుతున్నదీ అర్థంచేసుకోలేకపోయింది. బిత్తరపోతూ అడిగింది- "నీ వుద్దేశ్యం ఏమిటో అర్థం అయేలా చెప్పు."

ఇద్దరూ మంచం మీద దగ్గిరదగ్గిరగా కూర్చున్నారు. షీలా ముఖం వాగా చిన్నబోయినట్టుంది. తన కారణంగా మహీపాల్ సమాజంలో అప్రతిష్ట పాలవుతున్నాడు. ఎత్తిపొడుపులకు గురిఅవుతున్నాడని అనుకున్నప్పుడల్లా ఎవరో సూదులతో హృదయాన్ని గుచ్చినట్లుగా వుంటుంది ఆమెకు. చాలాసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా వున్నారు. అకస్మాత్తుగా షీలా అతని మెడకు పెనవేసుకుని గుండెకు గట్టిగా అదుముకుంటూ "సమాజాన్ని దానిష్టంవచ్చినట్లు అనుకోనియ్, డార్లింగ్" అని అంటూంటే ఆమె కళ్ళకొనలు నీళ్ళు చెమ్మగిల్లాయి

"సమాజం అయితే నేను పట్టించుకునేవాణ్ణి కాదు. కాని వ్యవహారం చాలా దూరంపోయింది... కళ్యాణి పిల్లలకూడా తెలిసిపోయింది... వాళ్ళింతవరకూ నిన్ను వేరేభావంతో చూస్తున్నారు. ఇప్పుడలా చేయలేరనే నేను మనస్సులో మథనపడుతున్నాను. వాళ్ళనో, నిన్నో-ఇద్దరిలో ఎవరినో ఒకరిని శాశ్వతంగా మరచిపోయే సమయం వచ్చింది".

షీలా ఏమీ మాట్లాడకుండా అలాగే చూస్తూ రాతిబొమ్మలా వుంది.

"ఇల్లో ఏ మాట ఇప్పుడు రేగిన రభస కాలంతోపాటు అణగారిపోతుందని నాకు తెలుసు. ఈ వేడి ఎల్లకాలం వుండదు. వేడి చల్లారగానే మళ్ళీ మునుపటి

మోస్త రుగానే మనం కలుసుకుంటూవుంటాం. సమాజం గూడా దానంతటదే విసు గెత్తి వేలు చూపించడం మానేస్తుంది''.

షీలా మామూలుగా కూర్చుంటూ అంది—''చూడు మహిపాల్! మనం ఒకరినొకరు అర్థం చేసుకున్నాం. మనసుల్ని గారంగా పెనవేసుకుపోయేలా పెంచుకున్నాం. అలాంటప్పుడు ప్రపంచంముందు దాచడానికి ఎందుకు ప్రయత్నిం చాలి? మన ఈ నిజాయితీని ప్రపంచం అనుమానిస్తే, తప్పుగా ఎంచితే అలాగే కానియ్యి. అదీకాక ఇన్నాళ్ళూ మనం కలిసి తిరుగుతున్నా ఒక్కరోజు కూడా కళ్యాణి హక్కును నేనెప్పుడూ దోచుకోవడానికి ప్రయత్నించలేదు. ఆ తలపు అసలు నాకు లేదు. అటువంటప్పుడు మరి నువ్వు కళ్యాణి కోసం నా హక్కును వదులుకొమ్మనడం న్యాయంకాదు".

"నువ్వు కళ్యాణి హక్కును లాక్కున్నావు షీలా. ఇరవై సంవత్సరాలు మహిపాల్ హృదయంపై ఏకధాటిగా చేసిన కళ్యాణి అధికారాన్ని నువ్వు పంచు కోవడంలేదా?"

"కళ్యాణి నీ మనస్సును జయించిన మాటనిజమే. కాని ఆమె ఎంతవరకు చూరగొనగలిగిందో అంతమేరకు అప్పుడూ, ఇప్పుడూ కూడా నువ్వామె వాడివే. అది విడిచి మిగతాదంతా నేను నిన్ను జయించగలిగిందీ, నీ హృదయం చూర గొనగలిగిందీను. ఆమె వాటా నేనెప్పుడూ కాదని భుక్తం చేసుకోలేదే. నేను నా భాగదేయాన్ని వదల్లేను. ఇకముందు ఇలాంటి ప్రసంగం తేనని నువ్వు వాగ్దానం చెయ్యి. ఈ ప్రణయ త్రిభుజాన్ని చివరిదాకాలాగి ఆ సమస్యలు పరిష్కరిస్తూ కూచునే వయస్సు కూడా కాదు మనది. ఇప్పుడెలావుంటున్నామో ముందుకూడా అలానే వుందాం. నువ్వు మాట తప్పనని వాగ్దానం చెయ్యి.''

మహిపాల్ వేసిన అడుగుని వెనక్కులాగడం యిప్పటివరకు ఎరుగడు. అతని పౌరుషం అలాంటిది. "మన ఇద్దరిమధ్య ఇప్పుడున్న సంబంధం ఎప్పుడూ వుంటుందని నేను వాగ్దానం చేస్తున్నా" మత్తులో వున్నాడేమో ప్రతిజ్ఞచేస్తోంటే మహిపాల్ కంఠం ఉద్రేకపూరితంగా వుంది. అయినా అతను స్పృహతప్పలేదు.

వళ్ళు మైమరచిపోలేదు. మత్తులో కొంచెం అతిగా ప్రవర్తించినా స్వాభిమానాన్ని మర వలేదు. శీలాను కూడా ప్రతివాగ్దానం చెయ్యమన్నాడు– "ఇక ముందు భవిష్య త్తులో వ్యాపార విషయాలు నా దగ్గర మాట్లాడనని నువ్వుకూడా నాకు వాగ్దానం చెయ్యాలి. నువ్వు లక్షాధికారిని వనుకుంటున్నావ్ కదూ? నీ లక్షలంటే నాకు ఏ మాత్రం లక్ష్యంలేదు. మోజు అంతకన్నా లేదు".

"ఈ ప్రసంగాన్ని ఇక ఇంతటితో ఆపుచేద్దాం. మళ్ళీ ఈవిషయంనీదగ్గర ఎత్తితే ఒట్టు" తన అపరాధాన్ని మన్నించమని వేడుకుంటున్నట్లుగా తలను అతని గుండెలో దాచి అతని హృదయానికి విజ్ఞప్తి చేసింది. తెలివిగల ఆడదానికి మగాడిని ఎలా సంతోషపెట్టాలో తెలుసు.

శీలా ఇంట్లోంచి బయటపడ్డాడు మహీపాల్. సుమారు ఒంటిగంటన్నర అయింది. శీలా బతిమాలుతున్నా ఆమెకారులో వెళ్ళడానికి నిరాకరిస్తూ అన్నాడు "పట్టణాల్లో ఎప్పుడూ ఏ వస్తువు దొరక్కుండా పోవడంవుండదు. ఇక్కడ చౌరస్తాలో కానీ లేకపోతే దాలీగంజ్‌లో కానీ రిక్షాయో టాంగాయో ఏదో ఒకటి దొరుకుతుంది."

మహీపాల్ వెళుతుంటే తన శాలువ తీసి బలవంతంగా అతనికి కప్పింది. చలిగాలి కూడా ఎక్కువగావుందేమో కాదనలేక పోయాడు మహీపాల్. రోడ్డు మీదకు రాగానే ఎక్కడకు వెళ్ళాలా అని ఆలోచిస్తూ నిలబడిపోయాడు.

గోమతి మీదనుంచి చలి జోరుగా వీస్తోంటే జ్ఞానం అనే దుప్పటిని కప్పు కుని, రాత్రంతా మన సంస్కృతి అంటే ఏమిటి అని ఆలోచిస్తూ, తనలో తానే తర్కించుకుంటూ, స్నానాలఘట్టం దగ్గరున్న శివాలయంలో గడిపాడు మహీపాల్ మనసు ఎంత తరచి చూచినా తనలో బలహీనత వుందనీ, తాను దానికి దాసుడ నని అతను అంగీకరించలేకపోయాడు. అలాంటి మానసిక అవస్థలో మనిషివున్న పుడు అతని విచక్షణాశక్తి నిష్పక్షంగా పనిచెయ్యలేదు. అతను ఏ నిర్ణయానికి వచ్చినా దానికో పునాది అంటూ వుండదు సరికదా, అట్టి నిర్ణయం న్యాయ మైంది కాజాలదు. అతను బలహీనుడు, అన్యాయపరుడు. ఇల్లువిడిచి వెళదా మన్న అతని తలంపు అనుచితమైంది. పాపభూయిష్టమైంది.

అతని మనస్సు పూవిరాడనట్లుగా గింగిలమంటోంది. ఆకాశంలో మిల మిలమంటోన్న చుక్కలు ఒక్కొక్కటిగా ఆరిపోవడం ప్రారంభించాయి. రాత్రి ఎలాగో గడిచిపోయింది ఇక పగలంతా ఎలాగడిపేది? దారి తప్పిన ప్రయాణీ కుడు ఎంతసేపని తిరుగుతూ వుంటాడు? తప్పితిరగడమేనా అతని జీవిత లక్ష్యం? ఇది పిరికిపందలు చేసే ఆలోచనకాదా? అతనిజ్ఞానార్జనా, అతని ధ్యానం ఇదంతా కేవలం కాలక్షేపం కోసమేనా? కాలయాపన కోసం అతను సృష్టించు కున్న వ్యాపకాలేనా? వాటికి సాంఘిక విలువలేదూ? తండ్రిగా పిల్లలపట్ల అతనికి నైతిక బాధ్యతల్లేవూ? ముఖం దాచేసి తిరగడం ఎలాకుదురుతుంది? అలాంటి విపత్తును ధైర్యంగా ఎదుర్కోవాలి?

''ఇంటికి వెళ్ళిపోతాను. పరిస్థితి అంతా కళ్యాణికి వివరిస్తాను. ఆమె ఎలా నిర్ణయిస్తే అలాచేద్దాం." ఆలోచనలు అతన్ని అలాఅలా అతనిఇంటివరకు లాక్కు పోయాయి. ఇంటిదాకా వెళ్ళిన తర్వాత మళ్ళీ ఎందుకో జీవితంలో వెనకడుగు వేయడం ఎరుగని మహీపాల్ వెనక్కు అడుగు వేసాడు. తలుపు తట్టడానికి సాహసించలేకపోయాడు.

ఎప్పటి ఆచారం ప్రకారం కర్నల్ ఇంటికి వెళ్లాడు. తమ మిత్రుడు ఇల్లు వదలి కిందటి రోజునుంచి పరారులో వుంటాడని కర్నల్, సజ్జన్ వూహించలేక పోయారు.

# 20

"అది కాదయ్యా' ఆమె నిజమే చెపుతుండొచ్చు, ఈ రోజుల్లో బైరాగి చిట్కాలు ఏం పని చేస్తాయి చెప్పండి?"

చారస్తాకు కొంచెం ఆవతల టీ కొట్టు దగ్గర పెద్ద గుంపు గూడివుంది. జనం సగం రోడ్డును ఆక్రమించారు. కొంత మంది వాళ్ళ మధ్య దూరి ఆవింత ఏమిటా అని పైకి ఎగబడు తున్నారు. మరి కొంత మంది ఇంతకు ముందే లోపలికి

సందు చేసుకుని హుష్ ఇంతేనా అన్నట్లు పెదవి విరుస్తూ రకరకాల అభి ప్రాయాలు చెపుతున్నారు. అనేక రకాల వ్యాఖ్యలు చేస్తున్నారు. లోపల నుంచి ఎవరో ఒక ఆడ గొంతుక బిగ్గరగా అరుస్తోంది, పోట్లాడు తున్నట్లుగా వుంది. పది మంది చేరి తలా ఒకరకంగా మాట్లాడుతోంటే వాళ్ల మాటల సందున ఆమె గొంతు అప్పుడప్పుడు సరిగ్గా వినబడక వాళ్ళ గొంతుల్లో కలిసి పోతుంది. మొత్తానికి అంతా గందరగోళంగా వుంది.

సజ్జన్ ఎప్పటి చోటనే కారు ఆపాడు. కారు ఆపి కిటికీలోంచి చూడగానే ఆ గుంపువైపు అతని మనసు పోయింది. తలుపు తాళం వేసి కారు పక్కనే నిలబడి వాళ్ళను చూడ్డం మొదలెట్టాడు. ఇద్దరు వ్యక్తులు ఆ వింతకూ సంబం ధించి ఏవో మాట్లాడు కుంటూ అతని పక్కగా వెళ్లారు. వాళ్ల మాటలు యధా లాపంగా విన్నా అదేమిటి చెప్మా అనుకున్నాడు.

జనాన్ని తోసుకుంటూ లో పలి కి నడిచాడు. ఎదురుగా కుర్చీ మీద స్థిరుగారి పిచ్చి కోడలు కూర్చుని వుంది. ఆమె పెద్దగా అరుస్తూ ఏడుస్తోంది. ఆమెకు చాలా దగ్గరగా సాధువు వేషంలో వున్న లంగోటీ ధారి అయిన ఓ ముసలా యన ఆమెను చూస్తూ చిరునవ్వు నవ్వు తున్నాడు. ఆమెను సజ్జన్‌లోగడ చూశాడు. ఆమెను ఏదో హీరోయిన్‌గా భావిస్తూ అక్కడ జనం చేరి వింతగా ఆమె చేష్టలు చూస్తూ నిలబడి వుంటే అతను వాళ్ళతో ఏకం కాలేక పోయాడు. ఆమె దగ్గిరకు పోయి తలమీద చెయ్యి పెట్టి ఏమైందని సజ్జన్ అడిగాడు.

అతని పలకరింపు వినగానే వరదలో కొట్టుక పోతోన్న వాడికి గడ్డిపోచ దొరికినట్లయింది ఆమెకు. అతను మాట పూర్తి చెయ్యక ముందే "ఓవో! యు హేవ్ కమ్ జంటిల్‌మెన్! నన్ను వీడిబారి నుండి రక్షించండి. వీడు సాధువు కాదు గీధువు కాదు. ఒట్టి కసాయి వాడు, వీడికి ముండ కావాలట. చెప్పండి నేను ముండనా? మీరే చెప్పండి నేను ఎంత పెద్ద కుటుంబస్త్రీనో. నా రాజేష్‌కు ఈ విషయం చెప్పానంటే గుండేసి చంపుతాడు. మీరు నన్ను నా రాజేష్ దగ్గరకు తీసుకెళ్ళండి. మై రాజేష్ ఈజ్ కెప్టెన్! వారుగనక వచ్చి ఈ గుంపుల్ని చూసా

రంటే టక్ టక్ మంటూ అందరినీ కాల్చి పారేస్తారు. ఈ తాతగాడు, ఈ ముసలి పీనుగ"- అంటూ సంతోషంగా చెప్పుక పోతోంది.

పిడికిళ్ళు బిగించి ఆమె ముసలాయెనవైపుకు వెళ్లింది. వెంటనే సజ్జన్ రెండు చేతులు పట్టుకుని విదిలిస్తూ "మీ ఇంటికి వెళతారా?" అని అన్నాడు.

"ఆ ముసలాడి దగ్గరకా? అమ్మ బాబోయ్' నేను చచ్చినా వెళ్ళను. మీరు నా రాజేష్ దగ్గరకు చేర్చండి. ఇప్పుడే నన్ను తీసుకెళ్లండి. నేనింక ఎంత మాత్రం ఇక్కడ వుండను. పదండి, పదండి" అంటూ సజ్జన్ బ్రతిమాలు తోంది. అతని మీద పడి తోస్తోంది.

ఒక్క క్షణం సజ్జన్ ఆ ముసలి సాధువును చూశాడు. పళ్లూడిపోయి ముడుతలు పడ్డ అతని ముఖం మీద తప్ప వార్ధక్యం కనపడదమే లేదు. శరీరం యావత్తు పోతపోసిన వుక్కులావుంది దామనధాయ అయినా మంచి తేజస్సు గలది. సజ్జన్ ఆ సాధువును చూస్తుంటే ఆ పిచ్చామె- "మీరు అతన్నేమిటి ఎగా దిగా చూస్తున్నారు. ఇతను నన్నెంత మాత్రం ఆపలేడు" అని అంటూ పట్టుకున్న చేతుల్ని విడిపించుకోవ దానికి గింజు కుంటూ వుంది.

సాధువు సజ్జన్ వైపుగా చూస్తూ అన్నాడు- "ఇప్పుడూ చుట్టూ జనాన్ని చూసి ఈమెకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. మీరామె చేతులు వదలండి. దయ చేసి కొంచెం నావెంట వస్తారా?"

వెంటనే ఆమె చేతుల్ని ఒదిలేసి సజ్జన్ ఆ సాధువు వెనకాల జనం నుంచి బయట పడదానికి వస్తూండగా ఆ పిచ్చిది అతని జబ్బ గట్టిగా పట్టుకుని "ముస లాడి వెంబడి వెళ్ళకండి. మీకు కూడా ఆ మూలికా ఈ మూలికా తాగించి ఆస నాలు చేయిస్తాడు, కొట్టి కొట్టి మిమ్మలి కూడా పచ్చివాడిలా తయారు చేస్తాడు" అని హితవు చెప్పింది. వస్తూ వస్తూ ఆ సాధువు మాత్రం టీ కొట్టు కుర్రాడితో "ఈమెను చూస్తూ వుండు, ఇప్పుడేవస్తా" అని చెప్పి ముందు కెళ్ళాడు.

సాధువును పోలీస్ స్టేషన్ జైల్లో పెట్టించి వస్తానని సజ్జన్ ఆమెకు నచ్చ చెప్పాడు. ఆమాట విని ఆమెకు అంతులేని సంతోషం పుట్టు కొచ్చింది.

సాధువును తైలుకు పంపిన మరుక్షణమే, తనని విమానంలో కూర్చుంద పెట్టి రాజేష్ వద్దకు తీసు కెడతానని వాగ్దానం గూడ తీసుకుంది.

జనానికి పక్కగా జరిగి సజ్జన్, లంగోటీ కట్టుకున్న ఆ సాధువు మాట్లాడుతూ నిలబడ్డారు. వాళ్ళిద్దరిని చూసి జనంలోంచి ఐదారు మంది వాళ్ళ చుట్టూ చేరారు.

"రాండీ నేనీ అమ్మాయి పిచ్చికి వైద్యంచేస్తున్నా. మీరామెకు ఏమౌతారు" అని సాధువు సజ్జన్ని ప్రశ్నించాడు.

''అబ్బే ఏమీ గానండి. ఓరోజు ఇలాగా సందులోపడి పారి పోతూంటే నేనామెను పట్టుకుని వాళ్లింటికి 'తీసుకెళ్లాను' అప్పుడే ఆమె చరిత్ర అంతా నాకు తెలిసింది. ఆవిడ మామగారు...."

"ఆవిడ మామగారికి కూడా చెప్పామండి. ఆమె ఇలాగే ఆశ్రమం నుంచి పారిపోతే బాధపడొద్దని. పాపం ఆయన గౌరవ ప్రతిష్ఠలు ఎక్కడ మంట కలుస్తాయో అన్న భయంతో ఇంటిలోంచి బయటికి అడుగు పెట్టడానికి కూడా ఒప్పు కోలేదు. తాతగారూ, అవన్నీ మీరే చూసుకోండి అని చెప్పేసాడు. కాని ఇప్పుడు ఓ సమస్య వచ్చి పడిందండి. జనం చుట్టూ మూగారు. తలా ఓ మాట అంటూన్నారు. ఇప్పుడు నేను చెప్పినట్లు నడుచు కోదు. అంత మంది జనం వుండగా పిచ్చోళ్ళను, ముఖ్యంగా స్త్రీల మీద చెయ్యిచేసు కోవడం మా నీతికే వ్యతిరేకం. మీరేమను కోకపోతే మీకు కొంచెం శ్రమఇస్తాను. ఆమాట ఈమాట చెప్పి దయచేసి మీ కారులో తీసుకొచ్చి మా ఆశ్రమం వద్ద దిగబెట్టండి. చాలా ఉపకారం చేసిన వారౌతారు.

''నా దగ్గర కారు వుందిలెండి"

తొసినవ్వు నవ్వుతూ ఆ సాధువు ''అంతేచాలు, నాపని ముగించారు. మీ కార్లో కూర్చు పెట్టుకుని తీసుక రాండి. నేనిప్పుడే బయలుదేరి ఆశ్రమానికి వెళ్తాను. ఈతోట దాటగానే ఆ మూటు రోడ్డుంది చూసారా అక్కడే వుందండి మా ఆశ్రమం'' అన్నాడు.

"సరేలెండి. మీరు ఇంతదూరం నడచివెళ్ళ నక్కర్లేదు. నేనీమెను ఓ రౌండు తిప్పి మరీ వస్తాను, ఎంతా పది నిమిషాల్లో. నేనామెను తిప్పితే మీకే అభ్యంతరం వుండదుగా?"

సాధువు కిలకిలా నవ్వాడు. అతను నవ్వుతోంటే అతని బోసి నోరు పాలపండ్లు కూడా రాని పిల్లాడిలా వుంది. చిన్న చిన్న కళ్ళల్లో కదులుతున్న పాపల్లో అతని హృదయంలోని స్నేహం అంతా కేంద్రీకరింప బడినట్లు కనపడుతోంది. ఆ నవ్వు సజ్జన్ని ప్రభావితం చేసింది. 'రామ్‌జీ కార్యంలో అడ్డుపెట్ట డానికి మేం ఎవరయ్యా? వారెప్పుడూ మంచిపనే చేస్తారు. మంచిది. ఇక ఆశ్రమంలో కలుసు కుందాం' అంటూ సాధువు వెళ్ళి పోయాడు.

కార్లో కూర్చునే ముందు ఆమె కొంచెం సందేహించింది. కాని తీరా కూర్చున్న తర్వాత ఆమె మహా సంతోష పడిపోయింది. కార్లో కూర్చునే టప్పుడు సజ్జన్‌తో- నేనీ వేషంతో ఎలా పోతాను? కాళ్ళకు సేండిల్స్ లేవు. వంటిమీద మంచి చీరె కూడా లేదు. ఈ చినిగి పోయిన చీరె నాకొద్దు. నేను అలా పోను" అంది.

చెప్పులు, చీరె కొనిపెట్ట డానికే ఆమెను తాను తీసుకెళ్ల తున్నానని సజ్జన్ ఆమెకు నచ్చ చెప్పాడు. అప్పుడు కాని ఆమె కార్లో కుదురుగా కూర్చో లేదు? అన్న మాట ప్రకారం సజ్జన్ ఆమెకు ఆ రెండు వస్తువులూ కొనిపెట్టాడు.

చెప్పులు, చీరె చూడగానే కెప్టెన్ రాజేష్ భార్య ముఖం వికసించింది. ఆమె వాగుడు మొదలెట్టిందంటే ఎంత సేపటికీ తెగదు. ఆమె రాజేష్ ప్రేమ పొందడానికి ఎలా తపిస్తూవుందీ, వాళ్ళిద్దరి మధ్యా రహస్య శృంగార క్రీడలూ వాటన్నిటి గురించి ఆమె ఊహించు కుంటూ, ఎంతో వుల్లాస కరంగా చిత్రిస్తుంది. ఆమె బహిరంగంగా అవన్నీ చెప్తోంటే ఏమీ తోచక మహా ఇరుకులో పడ్డాడు సజ్జన్. స్త్రీ పురుషుల కామ క్రీడల్ని ఆమె తన తీరని కోరికల బలంతో సజీవంగా వర్ణిస్తోంటే అతనిలో శృంగారానుభూతి కలగ డానికి బదులుగా ఆమె మీద జాలి, బాధ కలుగు తున్నాయి. అతను తొణక్కుండా ఎంతో గంభీరంగా

వుండాలను కుంటున్నాడు – కాని అలా వుండడానికి ఎంతో శ్రమపడాల్సి వచ్చింది. అసంతృప్తి అనేది మనిషిని చుట్టుపక్కల పరిసరాల్ని, తరతమ భేధాల్ని ఎలా మరచేటట్లు చేస్తుందోనన్న భయం వేధిస్తోంది మనిషి తాను ఎంతో ప్రియమైనవీ, అమూల్యములనుకున్న రహస్యాల్ని ఏ బంకూ గొంకూ లేకుండా ఎంత అసహ్యంగా బయట పెడతాడు. పిచ్చి అనేది ఎవరికైనా రావచ్చు ఎప్పుడైనా రావచ్చు, అలాగే సజ్జన్ అనే ఈ పేరు ప్రతిష్ఠలూ, ఐశ్వర్యమూ వున్న వ్యక్తి, కళా కారుడూ, అందమైన స్ఫురద్రూపి తీరని కోరికలవల్ల ఎప్పుడైనా పిచ్చివాడైపోతే... హే భగవాన్ ఆ ఆలోచన రాగానే అతను కంపించి పోయాడు. అతని కారు మెడికల్ కాలేజి దాటి, పక్కా పుల్, పెద్ద ఇమాంబాడా మచ్చీ భవన్ మీదుగా వెళ్ళి నది ఒడ్డుకు చేరుకుంది.

ఘాట్ సందు చివర ఓ లాంపు పోస్టు దగ్గరగా దీపపు స్తంభంలా నిలబడి వున్నాడు లంగోటీధారి సాధువు. అతని ముందర కారు వెళ్ళి ఆగగానే ఆమె అరవడం మొదలెట్టింది. "నేను రాను. నేను చచ్చినా ఈ ముసలాడి దగ్గర వుండను" అంటూ.

కారు తలుపు తీసి ఆమెను బయటికి లాగి చెంపన ఒక్కటిచ్చాడు సాధువు. ఒక్కదెబ్బతో ఆమె చేతిలోని పెట్టె, చీరె ప్యాకెట్టూ జారికింద పడ్డాయి. చెంప దెబ్బను గూడలక్ష్య పెట్టకుండా ఆమె కింద పడిన వస్తువుల్ని ఏరుకుందా మనే ఆదుర్దాలో వుంది. మళ్ళీ సాధువు ఇంకొకటి వడ్డించాడు. ఆమె నోరు మూసింది. ఏదో తెలివి వచ్చినట్లుగా సాధువును విడిపించు కోవాలని గింజుకలాడడం మొదలెట్టింది. ఆమె ఆదుర్దాను కనిపెట్టి సాధువు "ఇవేమిటమ్మా" అని మెల్లిగా అడిగాడు.

సాధువు ఆమెను చేత్తో గట్టిగా పట్టుకున్నాడు. ఆమె విడిపించుకోవాలని భయపడుతూ చేతిని అటూ ఇటూ లాక్కోవడానికి ప్రయత్నిస్తూ "ఈ చీర నాది. నా రాజేష్ నాకోసం పంపాడు" అని అంది.

"రాజేష్ పంపాడా లేక మీరు కొనిపెట్టారా!" అని సాధువు మళ్ళీ ప్రశ్నించాడు. "ఛీ ఛీ, పరాయి మగాళ్ళను నేనెలా అడుగుతాను? మీరు నన్ను వదలి

పెట్టండి, ఈ జోళ్ల తొడుక్కొని చీరె కట్టుకొని రమ్మనమని నా రాజేష్ మరీమరీ చెప్పాడు"

''సరే. వదిలేస్తా" అంటూ సాధువు ఆమె చెయ్యి విడిచాడు. రోడ్డు మీద చెల్లా చెదరై వున్న పెట్టెనూ చీరె పేకెట్‌ను ఆమె తీసుకో దానికి వెళ్ళింది. ఆమె తీసుకునే లోపుగానే ఒక్క దూకులో అతను అక్కడకు చేరుకుని ఆ రెంటినీ తన చేతిలో చిక్కించు కున్నాడు.

చేతులు చాస్తూ ఆమె అతని చుట్టూ ఎగర సాగింది, వా టి ని అందుకో దానికి. మళ్ళీ సాధువు ఆమెను అడిగాడు నిలదీసి "ఇవి నిజంగా రా జే ష్ పంపాడా?"

"ఆఁ. అవును"

"ఏరు ఇప్పించ లేదా?"

"లేదు"

''అలాగైతే వీటిని గోమతీ నదిలో గిరాటేస్తాను" అని అన్నాడు సాధువు. చేతిని కిందకు లాగి వాటిని అందుకోవాలని విశ్వప్రయత్నం చేస్తూ వుందామె. సాధువు నవ్వుతూ ఆమెను ఏడిపిస్తున్నాడు. ఇంతలో స జ్జ న్ వై పు చూస్తూ "రాంజీ' చాలా ఉపకారం చేశారు. రాండి. ఆశ్రమం చూద్దురు కాని" అంటూ ఆహ్వానించాడు.

పిచ్చిది తన వస్తువుల్ని ఎలాగైనా అందుకో వాలని కిందకూ పైకీ ఎగురు తోంది. ఆమె వైపు ఒకసారి చూసి సజ్జన్ చేతులు జోడిస్తూ– ''మరో పర్యాయం వచ్చినపుడు చూస్తానులెండి. మీ దగ్గర పిచ్చివాళ్లు చాలా మంది వున్నట్టున్నారే?" అన్నాడు సాధువుతో.

"అవును రాంజీ, మీరు మమ్మల్ని పిచ్చి వాళ్లకు సేవకులుగా వుండేందుకు నియమించారు. అదే మాడ్యూటీ. సరే వస్తాను. రాజేష్ ఈమె గారికి ఇచ్చిన ఈ వస్తువుల్ని గోమతిలో పారేస్తాను. జయ్‌రాంజీకి'' అంటూ ప్యాకెట్లను చంకలో పెట్టుకుని ఆమెను ఏడిపిస్తూ రోడ్డుమీద పరుగు లంకించు కున్నాడు.

తన వస్తువుల్ని ఎక్కడ మునిలాడు పారేస్తాడో అన్న ఆదుర్దాతో ఆమె కూడా అతని వెంట పరుగెత్తడం మొదలెట్టింది.

సాధువూ, పిచ్చిది అలా రోడ్డుమీద పడి పరుగెత్తుతూంటే సజ్జన్ అక్కడే నిలబడిచూస్తూండిపోయాడు. కాస్సేపటికి వాళ్లు కనుమరుగుకాగానే సజన్ కారు స్టార్టు చేసి ఇంటికి బయలుదేరాడు.

గదికి రాగానే బాగా అలసిపున్నాడేమో మంచంమీద చేరబడ్డాడు సజ్జన్. ముఖమంతా వాడిపోయింది. ఒకవైపు కామవాంఛ, మరోవైపు వనకన్య ఈ రెంటికిమధ్య మానసికంగా ఘర్షణపడుతున్నాడు కొన్నిరోజుల్నుంచి. నిన్న సాయంత్రం వెళ్ళిపోతూ అతని కోరికలతో దోబూచులాడి మరీ వెళ్ళింది వన కన్య. రాత్రంతా మనసు అదోలావుంది. విస్కీ, సోడా తెప్పించాడు. గ్లాసును పెదిమలదాక తీసుకుపోయి ఎందుకో పక్కన పెట్టేసాడు. ప్రతిజ్ఞను భగ్నం చెయ్యమని మనస్సు మొండిగా పట్టుపడుతోంది. ఎటూ తేల్చుకోలేక వాటినన్నిం టిని తన ఎదుటి నుంచి తీసి వేయాల్సిందిగా నౌకర్లను ఆజ్ఞాపించాడు. ఇవ్వాళ హృదయం అంతా అతను పరాకుతోనే వున్నాడు. 'ధ్యానమందిరం' లోకి వెళ్లాడు కాని అక్కడ అతని మనస్సు కుదరలేదు. ఈసారి కన్య కం డ గా నే దూరాన్నుంచే ఆమెను చీవాట్లు పెట్టెయ్యాలి. ఆమెతో ఎలాంటి సంబంధం పెట్టు కోరాదు. ఏస్త్రీనీ తన దగ్గరకు రానీయకుండా వుండాలి. అవసరం అయితే తాను ఇంతవరకూ చూడకుండా ఎవ్వరో తెలుసుకోకుండా వున్న పెద్దమ్మ చెప్పిన అమ్మాయినే పెళ్ళిచేసుకోవాలి.

మంకుపట్టు, మనో నిగ్రహం—తర్జన భర్జనలు అనే అడవిలో దారితప్పి అతను కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. క్షణం కూడా అతనికి మానసిక శాంతి కరువైంది. పిచ్చిది ఇప్పుడతని మనస్తత్వంలోనే రూపం మలుచుకుని అతని మొండితనాన్నీ హఠాన్నీ చిత్తుచేసినట్లనిపించింది. ఏదో ఓరోజు తాను కూడా అలాగే పిచ్చివాడైపోతానన్న భయం పట్టుకుంది సజ్జన్‌కు మానసికంగా బాగా అలిసిసొలిసి సజ్జన్ నిద్ర పోయాడు.

ఇంతలో తపీమని తలుపు తోసుకుని ఇకిలించుకుంటూ విరహేష్ గదిలో అడుగుపెట్టాడు. సజ్జన్ బాగా నిద్రలో వుండడం చూశాడు. అతను వచ్చిన పనిమరింత సుళువైనట్టుగా భావించి చిన్నగా బాల్కనీమీదకు పోయాడు. నాలుగు వైపులా కలియచూసి పెద్దకోడలు కిటికీ బాగా కనపడేలా నిల్చున్నాడు. కిటికీ వైపు పదేపదే చూస్తూ సినిమా గీతాలు పాడడం ప్రారంభించాడు ప్రియురాల్ని ఉద్దేశిస్తూ. చాలా గీతాలు పాడాడు. అయినా కిటికీలోంచి ఎవరూ కనపడలేదు. విరహేష్ చాలా ఓర్పుగల మనిషి. ధైర్యం కోల్పోకుండా మళ్ళీ ఒకటీ రెండూ అంటూ పాడడం ప్రారంభించేరు. మెట్ల దగ్గిర తలుపుకు తలఆనించి గొంతుక మరికొంచెం బిగ్గరచేసి పాడుతున్నాడు. కిటికీదగ్గర మాత్రం ఎవరూ కనపడలేదు కాని బోర్ గారి సినిమా సంగీతం విని సజ్జన్‌కు నిద్రాభంగమైంది. బోర్‌ని అమాంతంగా మింగేద్దామన్నాంత కోపంతో 'అరే బోర్, యూ గెట్ అవుట్' అని అరిచాడు.

కర్నల్, మహిపాల్- పిల్లిద్దరు తన్ను హేళనగా మాట్లాడ్డం, తన పట్ల దురుసుగా వ్యవహరిస్తూ వుండడం బోర్‌కు బాగా అలవాటే. సజ్జన్ బిగ్గరగా బోర్ అని కేకవేసే సరికి కొత్తగా వుంది. కొంచెం బిత్తర గూడా పోయాడు. అయినా పని సాధించుకోవాలన్న నేర్పుతో సజ్జన్ నిద్రపోతోన్న విషయం తన కేమీ తెలియనట్లు నటిస్తూ "అరే సజ్జన్ భాయీ, మీరిక్కడ నిద్దరోతున్నారా? ఐ యాం సారీ....నేను గమనించలేదు" అంటూ క్షమాపణలు చెప్పుకున్నాడు.

గభాలున కోపంలో మాట అన్నాడే కాని వెంటనే సజ్జన్ నిగ్రహించుకున్నాడు. బహిరంగంగా ఏ వ్యక్తి నుద్దేశించి అసభ్యంగా మాట్లాడే స్వభావం కాదతనిది. బోర్ తన కవిత్వ ప్రతిభను వెళ్ళబోసుకుంటూ పురాణం మొదలెట్టాడు-"ఇదిగో సజ్జన్ భాయీ, నేనీమధ్య నా రెండోగీతాన్ని రాయడం మొదలెట్టాను కదూ...ఆ మూడ్‌లో మీరిక్కడ వున్నారన్న సంగతే మరిచాను.

ఇంతలో గదిలోకి వద్దామా పోదామా అని సందేహిస్తూ తలుపు దగ్గర వనకన్య నిలబడి వుండడాన్ని చూశాడు సజ్జన్. వెంటనే తలుపు దగ్గరకెళ్ళి

స్వాగతం ఇవ్వమని హృదయం చెప్పింది. కాని అతనిలో వున్న ఆత్మాభిమానం ఆపని చెయ్యడానికి అడ్డుకుంది.

సజ్జన్‌తో గప్పాలు కొడుతోన్న విరహేష్ దృష్టి ఇంతలో కన్యపై పడింది. పరిచయం అక్కర్లేకుండా పళ్లన్నీ బయటకు పెట్టి వికారంగా నవ్వుతూ చేతులు జోడించి "అహాఁ వనకన్యగారు మీరే అనుకుంటూ మీరు నాటకాల్లో కొన్ని పాత్రలు వేయగా చూశాననుకోండి. హి....హి... హి.... ఈ మధ్య మీ పేరు న భో ం త రా ళ ం వరకు వ్యాపిస్తోంది, హి....హి...హి..." అంటూ సజ్జన్ వైపు ఓ చూపు విసిరి "సజ్జన్ భాయి మిమ్మల్ని ఒక్క సారి ఆకాశానికి ఎత్తేసాడు". అని ఇంకా ఏదేదో దండకంలా చెప్పబోయి కన్య గంభీరంగా ముఖం పెట్టేసరికి వూరు కున్నాడు.

విరహేష్‌కు ఏమీ బదులు చెప్పకుండా కన్య లోపలికి వచ్చింది. సజ్జన్ దిగాలుపడి కూర్చునుండటం గమనించి చేతిలోవున్న బద్దుపొట్లం అతని ముందు బల్లపై పెడుతూ "ఏం అలా వున్నావు, ఆరోగ్యం బాగాలేదా" అని ప్రశ్నించింది.

కన్య సంబోధనలో శిష్టతకన్న ఆత్మీయత ఎక్కువగా కనపడింది సజ్జన్‌కు ఆమెపట్ల అంతకు ముందునుంచి మనస్సులో పాతుకుపోయిన తిరుగుబాటు ఆమె ఆ పరామర్శతో నీళ్ళలో వుప్పు మాదిరిగా కరిగిపోయింది. వుప్పుదనాన్నంతా విరహేష్‌కు అంటకడుతూ సజ్జన్ "విరహేష్, నాకు ఆరోగ్యం బాగాలేదు. నువ్వు దయచేసి వెళ్ళిపో. నాకు ఏకాంతం కావాలి" అని దిండుమీద తలపెట్టి కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

కన్య ఖంగారుగా సజ్జన్‌ని చూడసాగింది. ఇద్దర్నీ ఒకసారి చూశాడు విరహేష్. ఏదో మర్మాన్ని గ్రహించినట్టుగా చిరునవ్వు నవ్వుతూ సజ్జన్‌వైపు తిరిగి "భగవంతుడు మీకు శీఘ్రమే శుభం కలుగజేయుగాక. ఈ విరహేష్ తన సజ్జన్‌భాయీ గురించి ఎల్లప్పుడూ ఇదే కోరుకుంటాడు" అని బయటికి నడిచాడు. శని విరగడైంది అనుకున్నాడు. కాని గదిలోంచి కదిలిన శని

మళ్ళీ డాబామీద కెక్కి అక్కడే తారట్లాడుతుండే సరికి సజ్జన్‌కు చిరరింపుతో పాటు కోపం కూడా వచ్చింది. ఎదురుగా కన్య కూర్చున్న కారణంగా పళ్ళు పటపటకొరుకుతూ ఏమీ బయటికి అనలేకపోయాడు. సజ్జన్ వైపు ముఖంపెట్టి కూర్చుంటూ "ఇప్పుడు నీకు ఎలా వుంది" అని అడిగింది వనకన్య.

అలక ముఖంపెట్టి "చస్తున్నా నీ దయవల్ల" అని ముఖం తిప్పేసుకున్నాడు.

"నేను సంజీవిపుల్ల తెచ్చాను" అంది వనకన్య నవ్వుతూ.

ఎప్పుడూ గంభీరత్వాన్ని నింపుకుని సూటిగా మాట్లాడే కన్య ఇవ్వాళ ఛలోక్తితో మాట్లాడేసరికి బరువుగావున్న సజ్జన్ మనస్సు కొంచెం తేలిక పడ్డట్టయింది. పచ్చని వరిచేనులో గాలికి రెపరెపలాడుతోన్న పైరులా అతని శరీరం అంతా హాయి పొందినట్లు అనిపించింది. గతాన్ని మరిచి రసనిక్త కంఠంతో అతను చిన్ననాటి సంగతి జ్ఞప్తికి తెచ్చుకుంటూ "చిన్నతనంలో మా నానమ్మగారు ఓ కథ చెబుతుండేది. ఎవరో దేవకన్య ఓ రాజకుమారుణ్ణి ఎత్తుకపోయిందట. తన మంత్రదండం మహిమవల్ల పగలంతా అతణ్ణి శవంలా వుంచేదట. రాత్రి అవగానే అతనితో ఆడుకోవాలని సరదాపుట్టగానే తిరిగి అతణ్ణి బతికించేదట. ఆటలు ఆడి ఆడి ఆమె సరదా తీరిపోగానే తిరిగి మంత్ర దండంతో అతణ్ణి మరణించిన వానిలా చేసేదట" అన్నాడు సజ్జన్.

అతని కథ విని కన్య మనసారా నవ్వింది. ఇంతలో డాబా మీదనుంచి విరహేష్ పాట లంకించుకున్నాడు. ఇద్దరి పేనూయణం విరహేష్ గానంతో రసభంగమైంది. ఇద్దరికీ చెడ్డగా తోచింది. "ఏతెవరు?" అని మెల్లిగా అడిగింది కన్య.

"పిదొక పల్లెటూరి గొడ్డు పుర్యాణా మన్నునా తెలిని ఓ మొరటుమనిషి. త్రాష్టుడు. ఎంత వదిలించుకుందామన్నా జిడ్డులా కరుచుకుంటాడు. ఏడుపొకటే తక్కువ" అని తలపట్టుకున్నాడు సజ్జన్.

విరహేష్ గాత్రం పతాకస్థాయి అందుకుంటోంది.

కన్య లేచి తలుపు వారగా వేసి వచ్చింది. బల్లమీద నుంచి లడ్డులపొట్లం విప్పుతూ సజ్జన్‌తో అంది–''నాకు వుద్యోగం దొరికింది''

సజ్జన్‌కి ఆఘాతము తగిలినట్లయింది. ఈరోజు వరకూ కన్య వుద్యోగం కోసం అతను ప్రయత్నించి ఎరుగడు. అసలా తలంపే అతని బుర్రలోకి రాలేదు. ఇది కూడా కర్నల్ పుణ్యమే కావచ్చు. కర్నల్ జ్ఞప్తికి రాగానే మరింత చింతితుడయాడు.

లడ్డులపొట్లంలో విస్తరాకులో అంటించి తెచ్చిన గంగసిందూరాన్ని వేలికి తీసుకుని సజ్జన్‌కు బొట్టుపెడదామనే వుద్దేశ్యంతో కన్య అతనికి బాగా దగ్గరకొచ్చింది. ఆమె శరీరస్పర్శ తగలగానే తపిస్తోన్న సజ్జన్ నరనరాలు ఒక్కసారి చల్లబడ్డాయి. అతని కళ్ళలోకి చూస్తూ కన్య నవ్వుతోంది. ఆమె తెల్లని నుదుటిపై ఎర్రని సిందూరం చాలా అందంగా వుంది అకస్మాత్తుగా ఆమె చేతిని పట్టుకొని "కన్యా, నేను నిన్ను వివాహం చేసుకోవాలనుకుంటు న్నాను" అన్నాడు. కన్య ముఖాన్ని గంభీరంగా పెట్టింది. చేతిని విడిపించు కోవడానికి ప్రయత్నించకుండా "ఇంకా దానికి సమయం రాలేదు" అని ముక్త సరిగా సమాధానం ఇచ్చింది. మళ్ళీ చేతిని మెల్లిగా లాక్కుంటూ ప్రసంగాన్ని మారుస్తూ ''ఆంజనేయస్వామి ప్రసాదం తెచ్చాను'' అని అంది.

మధ్యలోని కన్య తెంచిన తన మాట చివరల్ని కలపాలని చూస్తున్నాడు సజ్జన్. లడ్డూలవైపు చూడకుండానే "మరైతే ఆలస్యం ఎందుకూ ? అని అన్నాడు.

"మనం ఇద్దరం ఇంకా ఒకరినొకరు బాగా అర్థమే చేసుకోలేదు" అంటూ ఏ మాత్రం తొట్రుపాటు లేకుండా అంది వనకన్య.

''ఇదంతా ఒట్టి భ్రమ. నిన్ను ప్రేమిస్తున్నానని నీకు తెలుసు. నువ్వు కూడా నన్ను.......అని నాకూ తెలుసు"

"అదంతా నీ ఊహ! ముందు ప్రసాదం తీసుకో. దైవప్రసాదం తీసు కోవడానిక్కూడా ఎందుకింత తాత్సారం?"

"నువ్వు కూడా నాకు ప్రసాదంలాగే దొరికావు. ఈ విషయంలో ఇంకా జాగుచెయ్యదలచుకోలేదు" అని సజ్జన్ అంటోంటే అతని కళ్ళల్లో అణచుకున్న కోరిక తొంగిచూసింది.

"ఏమంటోయ్ వదినగారూ, అన్నగారికి టీ పెడుతూంటే ఈ మరిది గార్ని మరిచేరు సుమా! వాడిక్కూడా మరోకప్పు పెట్టండి దయచేసి. భగవంతుడు మీకు పుణ్యం కలుగచేస్తాడు........" అంటూ విరహేష్ 'హే భగవాన్, ఎంతసేపటినుంచి పడిగాపులు గాస్తున్నాను' అని స్వగతం పలికి మళ్ళీ కూని రాగాలు తీయటం ప్రారంభించాడు.

విరహేష్ మోటు మాటలు సజ్జన్, కన్యా ఇద్దరికీ రుచించ లేదు వెంటనే తలుపు తోసుకుని బయటికి వచ్చింది కన్య. "ఏం మహాశయా! మీలాంటి మోటు మనిషిని నేనింతవరకు ఎక్కడ చూడలేదు. మీకు ఈ తప్పుడు సంబంధాలు కల్పించే అధికారం ఎవరిచ్చాడు?" అని [illegible]ంది.

"పోనీయ్ లే కన్యా, అతను అంతేలే. నువ్విలా వచ్చేయ్" అంటూ సజ్జన్ లోపల్నుంచి పిలిచాడు.

అప్పటికి పెద్దకోడలు కిటికీవద్ద వచ్చి నిలబడింది. చేటంత కళ్ళు చేసుకుని విరహేష్ అలాగే అటువైపు చూస్తున్నాడు. మంచి రసపట్టులో పడుతున్న అతని ప్రేమాయణంలో వనకన్య అకస్మాత్తుగా ప్రవేశించి అంతా పాడుచేస్తోందేసరికి "క్షమించండి దేవిగారూ. నేను నా రెండో అమరగీతాన్ని రాసే మూడ్ లో వెనకా ముందూ చూడక ఏదో అనేసాను. చూడండి నా గీతం కనుసన్నల్లో ఎలా మెలగుతుందో" అంటూ కాళ్ళా వేళ్ళాపడి బతిమాలుకోవటం మొదలెట్టాడు. ఒకవైపు కన్య ఎదుట చేతులు జోడిస్తూ మరోవైపు [illegible] రకరకాలుగా తంటాలు పడుతున్నాడు విరహేష్. కిటికీ చాటున నిలబడి తన ప్రియుణ్ణి ఎవరో అందమైన ఓ తెల్లని అమ్మాయి చివాట్లు పెడుతోంటే అర్థం కానట్టుగా బిత్తరపోయి చూస్తూ నిలబడింది పెద్దామె. విరహేష్ పిచ్చిచేష్టలు చూసి విసుగ్గా లోపలికి వచ్చేసింది కన్య. ఆమె వెళ్ళిందే తడవుగా మెట్ల దగ్గిర తలుపు తనవైపుకు తపీమని మూసుకున్నాడు విరహేష్.

ప్రియుడు ఏకాంతంగానే వున్నాడని కచ్చితంగా తెలీగానే మళ్ళీ కిటికీ దగ్గర నిలబడింది పెద్దకోడలు. విరహేష్ ముఖం వికసించింది ఆమెను చూడగానే. "అబ్బా. ఇక తాళలేం. ఇంక ఆగలేం జాగు చేయలేం. ఎలా కలుసుకుందాం? ఎక్కడ కలుసుకుందాం? మన ప్రేమ పరిమళించి ఫలించేది ఎన్నడో?" అంటూ తెలుపుకుంటూ ఏవేవో బాసలూ, చేతి సౌంజ్ఞలూ అన్నీ జరిగాయి. రెండువైపుల్నుంచీ చూపులనే తామర తూళ్ళను విసురుకున్నారు. కళ్ళతోనే అలకా, కినుకా అన్నీ చెప్పుకున్నారు. హృదయంలోని విరహాన్నంతా చేతుల్లోకి కళ్ళల్లోకి తెచ్చుకున్నారు ఇద్దరూ. జేబులోంచి ఓ వుత్తరం తీసి అదిస్తూ చూపించాడు విరహేష్. అతని సౌంజ్ఞకు జవాబుగా ఆమె కూడా వుత్తరాన్ని చూపింది కిటికీలోంచి. మళ్ళీ చెయ్యి వూపి ఆమె కిటికీలోంచి తప్పుకుంది, కొద్దిసేపటిలోనే తాడు సహాయంతో ప్రేమ లేఖ దిగింది. ఇద్దరి మధ్య రెండు మూడు పర్యాయాలు ఈ సంచి అటూ ఇటూ మారింది. ఆఖరిసారిగా సంచిని పంపుతోంటే విరహేష్ ఆగలేకపోయాడు. ప్రియురాలి సందేశాన్ని మోస్తున్న ఆ సంచిని పదేపదే ముద్దుపెట్టుకున్నాడు. గుండెకు హత్తుకున్నాడు. తాను రాసిన ఆఖరి లేఖలో ఆ సంచిమీద కూడా ఓ చిన్న పద్యం రాసిపారేసాడు.

పెద్దామె పంపిన ఆఖరి లేఖను అందుకుందామనే వుద్దేశంతో విరహేష్ మెట్లదగ్గర కొస్తూంటే అదే సమయంలో డాక్టర్ షీలాసింగూ ఆమె వెనకాల మిస్టర్ వర్మ సజ్జన్ గదివైపుకు రావడం తటస్థించింది. తీరా వుత్తరాన్ని అందుకుందామని చెయ్యి చాచుతుండేసరికి డాక్టర్ షీలా బాల్కనీమీదకొచ్చేసి అతని చేతిని పట్టుకుంది, విరహేష్ ఒక్కసారి అదిరిపడ్డాడు.

'ఇక్కడ ఏం చేస్తున్నావ్' అని గదుముతోన్న కంఠంతో అడిగింది షీలా సింగ్.

వర్మను చూడగానే పెద్దామె కిటికీ దగ్గర నుంచి పత్తాలేకుండా పోయింది. విరహేష్ మాత్రం దొంగతనం చేస్తూ పట్టుపడిపోయామే అని ఏం చేయడానికి పాలుపోక తెల్లమొఖం వేసాడు. అతనికి ముచ్చెమటలు పోసాయి. నోట తడిఆరిపోయింది.

విరహేష్‌ను షీలా చాలాసార్లు చూసింది గాని అతనెవరో ఏం చేస్తుంటాడో ఆమెకు తెలియదు. సంచిని చేతిలోకి లాక్కుని దానిలోంచి ఓ కాగితం బయటికి తీసింది. ఏమీచేయడానికి దిక్కుతోచక ఏడుస్తూ ఆమె కాళ్లమీద పడివేడు కున్నాడు, తన గౌరవాన్ని బజారు పాలు చెయ్యొద్దని.

డాబామీద ఏదో గోలగావుందని విని తలుపు తెరుచుకుని బయటికి వచ్చారు సజ్జన్. ఎదురుగా మిస్టర్ వర్మ కనిపించారు. హల్లో వర్మా అంటూ అతణ్ణి సంబో ధించారు. వర్మ చేతులు జోడిస్తూ నమస్కరించారు. తలవూపుతూ సజ్జన్ ప్రతి నమస్కారం చేసి అక్కడేవున్న విరహేష్‌ని చూస్తూ.

"ఏం జరిగింది?" అంటూ ప్రశ్నించారు.

"నా అమరగీతాన్ని నా కిప్పించండి" అంటూ యేడ్పు ముఖంపెట్టి అన్నాడు విరహేష్.

ఇంతలో డాక్టర్ షీలాసింగ్ సంచిలోంచి కాగితం తీసి చదవడం మొద లెట్టింది. రూళ్లనోటు బుక్కులోంచి నాలుగు పేజీలు చించి పెద్దామె ప్రేమలేఖను రాసింది విరహేష్‌కు. వుత్తరం చదువుతోంటే ఒక చోట ఆమె నవ్వాపుకోలేక పక్కున నవ్వేసింది, లేఖను సజ్జన్‌కు అందిస్తూ "వీరి అమర గీతాన్ని ఓసారి తిలకించండి'' అని షీలా అంది.

వనకన్య అంతలో గదిలోంచి బయటి కొచ్చింది. షీలా కన్యను చూసింది. మళ్ళీ సజ్జన్ మొహాన్ని చూసింది. వాళ్ళిద్దరి నుదుళ్ళపై సింధూరం బొట్టు చూడ గానే ఆమెకు అర్థమైంది. విరహేష్ ఆతని ప్రేమలేఖ విషయాన్ని పక్కకు నెట్టి "మీరు వనకన్యగారను కుంటాను అవునా?" అని కన్యవైపు చూస్తూ అడిగింది విరహేష్ తన లేఖను ఇమ్మనమని సజ్జన్‌ని బతిమాలు తున్నాడు. లేఖలోని ఒకటి రెండు పంక్తులు చదివి కళ్ళు ఎగరేస్తూ విరహేష్ బెదిరించారు. ''నువ్వేం చేస్తున్నావ్ ఇక్కడ? పెద్ద మనుషులుండే ఈ బస్తీలో నన్ను అప్రతిష్ఠ పాలు చేస్తావేం?''

మిస్టర్ వర్మ కూడా విరహేష్‌ని చూసి లోలోన అగ్గిమీద గుగ్గిలం అవు తున్నాడు' ఏమీ తోచక "సజ్జన్ భాయీ" అని విరహేష్ ఏదో సంజాయిషీ చెప్ప బోయాడు.

షటప్ అని బెదిరిస్తూ సజ్జన్ "ఇంకోసారి ఈ ధాయలకు వచ్చావంటే పోలీసుల్ని పిలిపించి లాకప్‌లో పెట్టిస్తాను. మర్యాదగా తక్షణం ఇక్కణ్ణుంచి వెళ్ళు".

"అలాగే వెళ్ళి పోతాను. ముందు నా లేఖను నా కిప్పించండి".

సజ్జన్ కోపంగా ఆ వృత్తాన్ని విరహేష్ ముఖంపై విసిరి కొట్టాడు. ఇంతలో మిస్టర్ వర్మ విరహేష్ చేతిలోంచి వృత్తాన్ని లాక్కొని చింపివేస్తూ "ఇతను పోతూపోతూ ఈ ఇన్స్టి ప్రతిష్ఠను మంట కలిపేస్తాడు. ఫో ఇక్కణ్ణుంచి" అని కసిరాడు.

కొన్ని రోజుల క్రితం వరకు విరహేష్ అంటే మిస్టర్ వర్మకు ఎంతో గౌరవం వుండేది. అతని భక్తుల్లో తాను కూడా ఒకనిగా తిరిగాడు. కాని అతనే ఇప్పుడు ఎదురు తిరిగాడు. నమిలి మింగేద్దామన్నట్టుగా చూసాడు విరహేష్.

ఈలోపల కన్య, షీలా ఉల్లాడుకుంటూ గదిలోకి వెళ్ళి పోయారు. వృత్తాన్ని రెండుగానైతే వర్మ చింపాడు కాని మళ్ళీ ఎవ్వరికీ తెలీనట్టుగా దాన్ని మడిచి జేబులో దాచేసాడు, ఏమీ చెయ్యలేక పోతూ విరహేష్ సామ్య వాదుల ధోరణిలో "బీదవాళ్లు శ్రేమించుకుంటూ వుంటే ఈ పెట్టు బడిదారీ వర్గం చూసి ఓర్వలేదు. వీళ్ళు మాత్రం తలుపులు మూసివేసుకుని ప్రియురాళ్లతో సరసాలాడుతుంటారు" అంటూ ఓ విసురు విసిరాడు.

విరహేష్ పిచ్చి ప్రలాపన విన్న సజ్జన్ ఇంక పోతావా పోవా అన్నట్టు అతణ్ణ వురిమి చూసాడు, మారు మాట్లాడకుండా విరహేష్ మెట్లుదిగి పోయాడు.

ఏదో రహస్యాన్ని ఛేదించి నట్టుగా మిస్టర్ వర్మ సజ్జన్‌తో "ఈయన శంకర్‌లాల్ ఇంట్లో ఎవరితోనో ప్రేమ కలాపం నడుపు తున్నాడు, ఈలేఖను

ఏ కిటికీలోంచి జార విడిదారో అది శంకర్‌లాల్ అన్నగారైన మనియా పరక గది... మీకు దాలో అపఖ్యాతి వచ్చేది" అని అన్నారు.

సజ్జన్ వర్మ మాటల్ని సీరియస్‌గా తీసుకుంటూ "అసలు వీరికి ఆవలి వాళ్ళకు ఎలా కుదిరిందో అర్థం కాకుండా వుంది" అని రిమార్కు చేసాడు.

గదిలోకి సజ్జన్ వచ్చి రావడంతోటే షీలా నవ్వుతూ సజ్జన్‌ని అంది "కళ అనే సాకుతో నువ్విక్కడ ప్రేమ దరాణం పెట్టినట్టుందే!" అని. ఆ మాటకు అందరూ విరగబడి నవ్వారు.

"అయితే నువ్వు కూడా ప్రేమ వంలో పరదాం అని వర్మావన్నమాట కావాలంటే రిహార్సల్ చేసి చూపించగలను" అని ఎదురు దెబ్బ తీసాడు సజ్జన్.

షీలా దానికి తగ్గ సమాధానం ఇచ్చేదే కాని వర్మ వాళ్ల మధ్య వుండడం వల్ల అంతకన్న మొరటుగా మాట్లాడ్డం ఇష్టంలేక సజ్జన్ భుజం మీద తట్టుతూ "ఇలా ఇక్కడ వీరి భార్య మాద్దామని వచ్చాను. మాటల సందర్భంలో వారు నీ గురించి చెప్పారు. పనిలోపని ఈ రోగిని కూడా చూసి వద్దాం అనుకున్నా. ఏం రోగమో విదారిద్దామని తీరా వస్తే ఇక్కడ స్వయంగా రోగమే నాకు ఇంత అందంగా తారసిల్లింది". అంటు అప్యాయంగా షీలా క న్యవైపు చూసింది అమె మాటలకు కన్యకు సిగ్గు తెరలు ముంచు కొచ్చాయి చెయ్యి అడ్డం పెట్టుకుని కన్య ముసిముసి నవ్వులు నవ్వింది. సజ్జన్ కూడా నవ్వాడు.

"ఇదిగో, లడ్డూలినండి. ఈమెగారు ఆంజనేయస్వామి ప్రసాదంతెచ్చింది". అంటూ వాళ్ళకు పొట్లాన్ని అందించాడు. దాన్లోనుంచి ఒక లడ్డూ తీసుకుంటూ షీలా అరగబోతుండగానే సజ్జన్ కల్పించుకుని "ఈమెగారికి ఉద్యోగం దొరికింది" అని అన్నాడు.

"వెరీ గుడ్! ఎక్కడా?"

"నవజీవన్ ఎడిటోరియల్ స్టాఫ్‌మెంబరుగా" అంటూ కన్య అవటిస్తూ "మనం అందరం టీ తాగితే బావుండును" అని అంది.

"నన్ను క్షమించండి" అన్నాడు మిస్టర్ వర్మ.

"ఎందుకు?" అని ప్రశ్నించాడు సజ్జన్.

"షాపుకెళ్ళాలండి. చాల ఆలస్యమైంది"

"మంచిది. మంచిది'' అంటూ షీలా "మీరు చాలా శ్రమ తీసుకున్నందుకు థ్యాంక్స్! ఇంకేమీ కంగారు పడనక్కర్లేదు. ఇంకా ఇరవై ఇరవై అయిదు రోజులవరకు ఏ భయమూలేదు. మగపిల్లవాడు పుట్టాలని మీరుకూడా ఆంజనేయ స్వామికి లడ్డూలు మొక్కుకోండి" అని అంది.

ఆ మాటకు నవ్వుతూ ''సమయం రానివ్వండి. మిఠాయి తీసుకుని మేమే తమరి బంగళాదగ్గర హాజరవుతాము" అని అన్నాడు వర్మ.

"థ్యాంక్యూ" అంటూ షీలా నమస్కరించింది అందరికి నమస్తే అని చెప్పి వర్మ వెళ్ళిపోయాడు. షీలాకు ఇప్పుడు కొంచెం స్వేచ్ఛావాయువులు పీల్చుకోవడానికి అవకాశం లభించింది. దిండు ఆసరాగా చేసుకొని వాలింది. స్టౌవ్‌ని వెలిగిస్తోన్న కన్యవైపు చూస్తూ "దుర్జన్, నీవు చాల అదృష్టవంతుడివి... మరో లడ్డు నా నోట్లో వెయ్యి...కాని వనకన్య కమ్యూనిస్టని మహీపాల్ నాతో చెప్పాడే'' అంది.

"అన్నట్లు నేను కూడా అడగడం మరిచాను. ఏం కన్యా, దేవుడూ ఇవన్నీ అంటే నీకు నమ్మకం వుందా?" అంటూ షీలా పక్కనే వేరే దిండు మీద మోచెయ్యి ఆన్చి కాళ్ళు బారచాపుతూ అడిగాడు సజ్జన్.

సీసాలోంచి పాలు గిన్నెలో పోసి స్టౌవ్‌మీద పెడుతూ సజ్జన్ అడిగిన దానికి వెంటనే బదులు చెప్పలేదు కన్య. ఓ క్షణం ఆగిన తర్వాత చెప్పింది. "భగవంతుడున్నాడా లేదా అన్న మీమాంస నేను ఇంతవరకు తెల్చుకోలేక పోయాను. అసలీ విషయం గురించి నేనింతవరకు గంభీరంగా ఆలోచించనే లేదు. అందరి మోస్తరుగానే నాకూ అన్నికాలాల్లో దైవబలంపై నమ్మకం వుంది" అంటూ జవాబు చెప్పింది కన్య.

"భగవంతుడు మీమాంసకు అందేవాడుకాడు'' అని, మళ్ళీ అంతలోకే "నా ఉద్దేశ్యంలో మనిషే తన యావజ్జీవితంలో చేసిన ఘనకార్యాలన్నిందిని

కుప్పగా పోసి భగవంతుణ్ణి సృష్టించుకొంటాడు" అని తన నిర్వచనం చెప్పింది షీలా.

"మహిపాల్ కూడా ఇదే మాట అంటాడు"

"అంటే నీవుద్దేశ్యం మహిపాలూ నేనూ వేరువేరుగా ఆలోచిస్తామనా?"

"శభాష్ దాన్నే ప్రేమ అని అంటారు" అంటూ కన్యకు వినపడేలా షీలాతో అన్నారు. అతని మాటలకు కన్య ముఖంపై ఏభావమూ కనపడలేదు.

మళ్లీ షీలా అంది– "భగవంతుడనే పదాన్ని భూప్రపంచంలోంచి ముఖ్యంగా మన దేశంలోంచి రూపుమాపడం అసాధ్యంగానే కనపడుతోంది."

"ఏదో ఓ రోజు విజ్ఞానం ఈ విషయాన్ని శోధించేస్తుంది. భగవంతుడు వున్నాడనేవిషయం గట్టిగానైనా ఋజువవుతుంది. లేకపోతే అది పూర్తిగా మానవ కల్పితం అని ఖండించేస్తుంది. డాక్టర్ మనం ఇప్పుడు అణుయుగంలో కాలు పెట్టాం. మనం భూమి నుంచి ఇతర గ్రహాలకు వెళ్లడం గురించి ఆలోచనలు చేస్తున్నాం. ఏదో ఒకరోజు భగవంతుడి ఉనికి గురించి ఖండితంగా తేల్చలేక పోతామా?" అంటూ పాలేమైనా పొంగుతాయేమో అని స్టౌవైపు చూసింది. పాలు ఇంకా కసులుతూనే వున్నాయి.

"అప్పటికి ప్రళయమే రావచ్చు" కన్యవైపు ప్రేమచూపుల్ని కురిపిస్తూ అన్నాడు సజ్జన్.

"ప్రళయమే వస్తే ఆరోజే అందరూ భగవంతుణ్ణి టిన్నగా చేరుతారు. దుర్జన్, అప్పుడు నేను నీకు వ్యతిరేకంగా సాక్ష్యం ఇస్తాను. ఈ మనిషి ఓ అందమైన అమాయకురాలైన ఓ పుత్తడిబొమ్మ హృదయాన్ని దొంగిలించాడని దేవుడితో ఫిర్యాదు చేస్తానులే" షీలా తమాషాగా అంది సజ్జన్‌ని చూస్తూ.

పాలు మరిగాయి. చీరె కొంగుతో గిన్నె పట్టుకుని కన్య పాలుదించింది. కెటిల్‌లో టీ డికాషన్ పెడదామని నీళ్లకూజా దగ్గరకు వెళ్ళింది. కూజా ఖాళీగా వుంది. అది గమనించిన సజ్జన్ "ఇలా తే. నేను తెస్తాను" అంటూలేచాడు.

"కుళాయి ఎక్కడుంది?"

"కిందిభాగంలో."

"నువ్వు కూర్చో. నేను వెళ్లి తెస్తాను"

"నువ్వెక్కడకి వెళ్లలేవు. వాళ్ళసలే కాందిశీకులు. నిన్ను చూశారంటే బిత్తరపోతారు"

నేను వెళతానంటే నేను వెళతాను అంటూ కూడా ఇద్దరూ లాక్కున్నారు, నీళ్ల తేవడానికి. వాళ్లిద్దరూ అలా పెనుగులాడుకుంటూంటే చూడ్డానికి ఎంతో ముచ్చటవేసింది. సజ్జన్ గలగలమంటూ తీవ్రంగా ప్రవహిస్తోన్న సెలయేరులా, అల్లరి చేస్తున్న కుర్రాడిలా వున్నాడు. వనకన్య సమతలంగా వున మైదానాల మీద మందగమనంతో ప్రవహిస్తోన్న జీవనదిలా సిగ్గును సింగారించుకుని పెళ్ళిపీటల మీద కూర్చునబోయే పెళ్ళికూతురిలా వుంది. కళ్ళకొనల్లోంచి చూస్తూ "నేనంత భయంకరంగా వున్నానా?" అని అంది వనకన్య.

"నాకు మాత్రం అలానేవుంది" అంటూ సజ్జనే కూజా తీసుకుని నీళ్ళు తేవడానికి కిందికి వెళ్ళాడు.

స్టాఫ్ ఆర్మీస్ షీలా దగ్గరకొచ్చి కూర్చుంది కన్య. కన్య చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకుని ముద్దాడుతూ "నువ్వు ఇంత ముద్దుగా వుంటావని నేను కలలో కూడ ఊహించలేదు. నిన్ను భార్యగా స్వీకరించబోతోన్న సజ్జన్ చాలా అదృష్టవంతుడు. నువ్వూ అదృష్టవంతురాలివే. ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్యక వివాహం చేసుకోండి. పెళ్ళి భోజనానికి నన్ను తప్పక పిలుస్తారుగా!" అంది షీలా.

"నేనింకా పెళ్ళి గురించి ఆలోచించలేదు"

"ఎందుకు?"

"రోగులకూ మీకూ మధ్య ఎలాటి సంబంధంవుంది? మీరే చెప్పండి. ఫీజు పుచ్చుకోవడం, వాళ్లను పరీక్ష చెయ్యడం వరకు। అంతేకదూ? కాని తన ఇంట్లోనే రోగులకు రాత్రింబవళ్లు సేవచేసే వాళ్ళుంటారు. మరి వారి సంబంధం ఎన్నోరెట్లు గాఢంగా వుంటుంది కదా!"

"అంటే వివాహాన్ని నువ్వింకా ఓ గంభీర సమస్యగానే భావిస్తున్నావన్న మాట. ప్రేమనుకూడా ఒక సిలబస్‌గా అనుకొని పరీక్ష మీద పరీక్ష పాసై సర్టిఫికెట్ తీసుకుని పెళ్లిచేసుకునేవాళ్ళలో నువ్వుకూడాకలిసిపోయినట్లుందే. అలాంటి యోచనలంటేనే నాకు నవ్వొస్తుంది. ముందు ఆత్మ విశ్వాసం వుంచుకో. ఇద్దరి మనసులు కలిశాయి. ఇద్దరూ మంచి కుటుంబీకులు, చదవూ సంధ్యలు వున్నవాళ్లు ఊహవచ్చినవాళ్ళు. జీవితాంతం మీ ప్రేమభగ్నంకాదని [illegible] విశ్వసించవూ?"

"మీ మాటలతో ఏకీభవించలేను. క్షమించండి. నాకు ఆశ్చర్యం కలుగుతోంది...తమరు-"

"నన్ను 'తమరు' అని పిలవకండి సజ్జన్‌కూ నాకూ వున్న పరిచయాన్ని ఆధారంగా నువ్వన్నా నాకు ప్రేమా, అప్యాయతా ఏర్పడింది. కాని ఇప్పుడు నిన్ను చూసిన తర్వాత ఎప్పటికీ నీదానినైపోయాను. మనసులు ఒకదాన్నొకటి ఆకర్షించుకొంటాయి అనే సిద్ధాంతంలో నాకు నమ్మకం వుంది"

అంతలో కూజా తీసుకుని సజ్జన్ గదిలోకొచ్చారు. అతని చేతిలోంచి కూజాతీసుకుని టీ పెట్టే ప్రయత్నంలో మునిగిపోయింది కన్య. ఆమెకు సాయం చెయ్యాలనే నెపంతో సజ్జన్ కన్య దగ్గరే తారట్లాడుతున్నారు.

గొంతు కొంచెం పెద్దది చేసుకుని షీలా "సజ్జన్, ఆడది మగవాడు వీళ్ళిద్దరి మధ్యవుండే సంబంధం గురించి జీవితం నాకో పాఠం నేర్పిందోయి. ప్రేమ కేవలం సిద్ధాంతమేకాదు, అది ఆచరణ కూడ. ఎంత ఎక్కువగా ప్రేమించాం అంటే సంబంధం అంత గాఢం అవుతుంది. అనుబంధం ఎంత పాతదైతే అంత కొత్తదనం దాన్లో వుంటుంది, అంత మజాగావుంటుంది. నువ్వేమంటావ్" అని అడిగింది.

"వరాల్లాంటి మాటలన్నావు. మీ ఉద్దేశాలతో ఏకీభవిస్తున్నాను" అంటూ కన్యకు చెబుతున్నట్లుగా షీలాతో అన్నారు." మళ్ళీ "లవ్ ఈజ్ నాట్ థియోరీ బట్ ప్రాక్టిస్" అని ఆమెకు వత్తాసు పలికారు.

షీలా ఆలోచనల్లో మునిగింది. మళ్ళీసజ్జన్‌తో మాట్లాడుతూ "నిన్నటివరకు ఏమాటను సత్యమని నమ్మానో అది ఇవ్వాళ అబద్ధం అని ఋజువయిపోయింది.

అరదైనా మగావాడైనా ఏదో ఒకరోజు పెళ్ళిచేసుకొని తీరాలి. పెళ్ళిచేసుకున్నందువల్ల తను కోరిన వస్తువును ఎప్పుడూ తన కళ్ళముందే మెదలుతూ వుండాలనీ, తన గుండెకే హత్తుకుని వుండాలని మనిషి కోరుకుంటాడు. ఈమె 'మీ ఆవిడ' చట్టరీత్యాకాదని ఎవ్వరూ వేలెత్తి చూపలేరుకదా!'' అని అంది, మనస్సులో కలతపెడుతోన్న వెలితిని వెళ్ళబోసుకుంటుండగా శీలా కళ్ళు చెమ్మగిల్లాయి. కన్యకు చేరువలో వున్న సజ్జన్ సుఖాలతో తులతూగుతోన్న గృహస్తునిలా కనిపించాడు. పొద్దుతిరుగుడు పువ్వులా స్టౌవ్ లోంచి వస్తున్న మంటను చూస్తూ అది మండుతోన్న ధ్వనిలో అంతర్లీనమై రాబోయేతన ఉజ్వల భవిష్యత్తు గురించి బంగారు కలలుకంటున్నాడు. కెటిల్ వైపు దృష్టి పెట్టి శీలామాటల్ని వింటూ ప్రశాంతంగా నిలబడివుంది వనకన్య.

శీలా కళ్ళు చెమ్మగిల్లడాన్ని దూరంగా వున్న సజ్జన్ చూడలేదు. ఆమె అన్న మాటకు కన్య ముఖంలో ఏ భావం కనిపిస్తోందో గమనించాలని సజ్జన్ కన్నార్పకుండా కన్యనే చూస్తున్నాడు. ఓయ్, ఇలా ఓసారి చూడు. ఆ మాటకు బదులు చెప్పు అన్నట్లుగా అతని స్వభావం మొండిగా అడుగుతోందన్నట్లుగా అతని చూపులు తెలియచేస్తున్నాయి.

"సరే సజ్జన్, మనం ఇప్పుడే ఒక రహస్యాన్ని ఛేదిందామే. ఆ కేసులో ఇరుక్కున్న ఇద్దరి ముద్దాయిలకు వివాహం అయిందా?" అని అకస్మాత్తుగా అడిగింది శీలా.

"విరహేష్‌కు భార్యా బిడ్డలు వున్నారు. మరి అతణ్ణి ప్రేమిస్తోన్న అవతలి అమ్మాయి...'' అంటూ తెలియనట్లు నసిగాడు సజ్జన్.

"ఆమె కూడా కనుకాయకాదని ఆమె వుత్తరమే చెబుతోంది. నేను అతని వుత్తరం చదవకుండా వుండాల్సింది. అప్పుడు నాకీ ఆలోచనే తట్టలేదు. అప్పుడు నాలో ఏ ఆవేశం పూనిందో కాని! మెట్లెక్కుతూ ఆడుతోన్న నాటకం అంతా చూశాను. గోడకాధారంగా ఆ సంచి దిగుతూవుండడం, ఆ పెద్దపెద్ద వుంగరాల జుట్టువ్యక్తి ముఖం ఆ సంచిని చూడగానే వికసించటం అతని

ఆనందం అంగారూ అన్నీ చూశాను. పైకి నవ్వుతున్నానే అనుకో. కాని అప్పుడు ఎందుకో నా మనస్సంతా ద్వేషంతో నిండిపోయింది. ఇది చెడ్డపని అన్నట్లు నా కెందుకో తట్టింది."

"నిజంగా చెడ్డపనే. అసలతణ్ణి నాలుగు దంచాల్సింది'' అని స్టౌవ్ఆర్పేస్తూ వనకన్య ముక్తసరిగా అంది.

"ఏం ఎందుకని?" అని అడిగింది షీలా. ఏమీ మాట్లాడకుండా సజ్జన్ కన్యవంక చూస్తున్నారు.

కప్పులు తీసుకుంటూ కన్య ''వీళ్ళసలు ప్రేమాయణం చెయ్యటంలేదు. ప్రేమనేదో అడ్డుసాకుగా పెట్టుకుని శరీరదాహాన్ని తీర్చుకోవాలని వాళ్ళసలి వుద్దేశ్యం'' అని కఠోరంగా అంది.

"అయితే దానిలో తప్పేమిటి?" షీలా అంటోంటే గుమ్మడికాయంత దొంగ ఎవరంటే భుజాలు తడుముకున్నట్లుగా ఆమె గొంతు తగ్గిపోయింది. కన్య చూపుల్ని తప్పించుకుంటూ టీ కప్పును చూస్తూవుంది.

"తప్పేముందంటారా? ఈ సైతాను దాహం స్వయంగా నా ఇంట్లో రెండు నిండు ప్రాణాలు తీయడాన్ని చూశాను. ఈ సరదాలకు మోజుపడి ఎంతమంది ఆడవాళ్ళు తమ జీవితాల్ని పాడుచేసుకోలేదంటారు'' అంటూ ఉద్రేక పూరితంగా కన్య అంది.

"నిజమే. కాని వాళ్ళ పతనానికికారణం మనసాంఘిక కట్టుబాట్లలోనే వుంది. దాహం అనేది మనిషి నైసర్గికఅవసరం. అదేచెడ్డదని నువ్వు ఎందుకుఅంటావు?" షీలా వేసినప్రశ్నకు కన్య సమాధానం చెప్పబోతుంటే షీలా మళ్ళీ విశదీకరిస్తూ, "ఆకలి అనేది సహజావసరంకదా? ఏదైనా తినాలని ఎవరికైనా వుంటే కాదన డానికి, దాని మంచిచెడూ నిర్ణయించే అధికారం నీకు ఎవరిచ్చారు?'' అని చివరి మాటల్ని నొక్కుతూ అంది.

"డాక్టరుగారూ, మీరీమాట నిజంగా హృదయపూర్వకంగా అంటున్నారా లేక నన్ను పరీక్షించాలనా?" అంటూ కన్య డాక్టర్ హృదయంలోతును

కొలుస్తున్నట్లుగా అడిగింది. ఆమె మాటల్లో ఉద్రేకం ఏ మాత్రం లేకపోయినా ఆమె తూచివేసిన ప్రతిపదం నివురుకప్పిన ఓ నిప్పురవ్వలా వుంది. అదవాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూంటే వింటూ టీ తాగుతున్నాడు సజ్జన్. మనిషికి నిజాయితీ అవసరం అంటూ కన్య వాదిస్తోంది. అతను కూడా ఇలాగే ఎప్పుడూ ఆలోచిస్తాడు. ఇలాగే మాట్లాడుతుంటాడు. అతని సిద్ధాంతానికి అనుగుణంగానే వుంది. ఆమె వాదన షీలా వాదించే పద్ధతితో అతను ఏకీభవించకపోయినా అతని మనస్సులో దాగివున్న పాపాత్ముణ్ణి ఆమె సమర్థిస్తున్నట్లుగానే వుంది. ఈ రెండింటి కొనల్ని చెరోవైపు పట్టుకుని లాగుతూంటే అతను ఎటువైపు మొగ్గాలి అనే సంధిగ్ధావస్థలో పడ్డాడు.

కన్య అడిగిన దానికి షీలా కాస్సేపు నిశ్చేష్టురాలైంది. మళ్ళీ నిగ్రహించుకుని పొడిగా నవ్వుతూ ఆమె ప్రశ్నకు సమాధానంగా మళ్ళీ ఎదురు ప్రశ్న వేస్తున్న దానిలా అంది– "నేను హృదయ పూర్వకంగానే చెప్తున్నానని అంటాననుకో. మరి అప్పుడు?"

"అప్పుడు నేను హృదయపూర్వకంగా మీపట్ల ఆత్మీయతను చూపలేను"

"అంత అసహ్యమా?"

"నా దగ్గర వున్న ఆస్తి అదే కదా!"

"ఎప్పుడూ పోగొట్టుకో లేదా?"

కన్య ఓ పర్యాయం సజ్జన్‌వైపు చూసి షీలాతో అంది– "ఈ ప్రశ్నకు మరోసారి సమాధానం ఇస్తాను".

"ఆ విషయం పోనీయ్. ఒక్కమాటచెప్పు. మనిషిలో ఎన్నో బలహీనతలు వుంటాయి. అవి వున్నంత మాత్రాన వాటి వెనుక దాగివున్న అతని నిజాయితీ మాసిపోయి వస్తేనా? ఆ వుంగరాల జుట్టాయన విషయమే తీసుకుందాం. అతనికి భార్యా బిడ్డలున్నారు. అయినా కూడా మరో స్త్రీతో సరసల్లాపాలు ఆడాలని ఇక్కడ కొచ్చాడంటే దీనికి కారణం అతని భార్య సతీసాధ్వి అయివుండి కూడా గయ్యాళిదై వుండచ్చు. పల్లెటూరి బైతైనా అయి వుండొచ్చు. ఆ కారణం వల్ల అతను ప్రేమ దాహం తీర్చుకోవడానికి–"

''అప్పుడు కూడా నేను సానుభూతి చూపించలేను. అతను తన ఆకలి తీర్చుకోవ డానికై మరో స్త్రీ జీవితంతో చెలగాటం ఆడుతున్నాడు ''

"నీ ఉద్దేశాన్ని నేను గ్రహించా . ఇటువంటి చీడ పురుగులు సాంఘిక వ్యవస్థను పాడు చేస్తున్నారనీ, ముఖ్యంగా స్త్రీ లోకానికి మహాపచారం చేస్తున్నా రనేగా నీ అభ్యంతరం? ఈ సాంఘిక వ్యవస్థనే మార్చివేస్తే–?"

"అప్పుడు కూడా వ్యభిచారం చెయ్యడానికి వీలు వుంటుంది.''

ఆ మాట విని షీలా ఏమీ మాట్లాడలేదు. టీ చివరిగుక్క తాగి కప్పును బల్లమీద పెట్టేసింది. వెచ్చగా అవడంతో కన్య టీ తాగడం మొదలెట్టింది టీ తాగేసి కాళీ కప్పును అలాగే చేతిలో వుంచుకుని వున్నాడు సజ్జన్. అతణ్ణి చూడ గానే 'మరి కొంచెం టీ కావాలా' అని అడిగింది కన్య.

మారు మాట్లాడ కుండా టీకప్పు ఆమెకు అందించాడు

''ఒక్కో పర్యాయం పరిస్థితులు ఇలాగా కూడా రావచ్చు. ఉదాహరణగా నాకు భర్తా పిల్లలూ వున్నారను కో. నా భర్త అంటే నాకు ప్రేమే అనుకో. అనుకోని పరిస్థితుల్లో ఈ సజ్జనే నా జీవితంలోకి వస్తాడు. అతనికీ వివాహం అయింది. భార్యా బిడ్డలు వున్నారనుకో. మేమిద్దరం ఒకరి కొకరికి దగ్గరగా వచ్చేస్తాం. ఎంతో గాఢ స్నేహితులౌతాం. అలాంటి పరిస్థితిలో మా ఇద్దరి శరీరాలు–".

"నేను మీ ఇద్దరినీ అసహ్యించు కుంటాను".

షీలా కన్య ముందు నిలబడలేక పోతోంది. అయినా వాదాన్ని ఒదులుకో లేక "నవ్వు పట్టుకున్న కుందేలుకు మూడే కాళ్ళంటున్నావు. మనిషిని మనిషి ద్వేషించు కోవడం గొప్పతనం అనిపించుకోదు. ఓ మనిషి పట్ల అప్యాయంగా వుండాలను కున్నప్పుడు మనం అతని చెడునూ మంచినీ కాదనలేం. మనం అతని వ్యక్తిత్వంలోని నలుపునూ తెలుపునూ ప్రేమించ కలిగి వుండాలి. మానవత్వం అనేది ఆడది కానియ్యి మగవాడు కానియ్యి– వాళ్ల నిష్కళంక శీలం కన్న గొప్ప సొత్తు".

''హియర్.... హియర్...'' అంటూ చప్పట్లుచరిచాడు సజ్జన్. కన్యవైపు శయాన్ని నటిస్తూ కుతూహలంగా చూస్తూ "నేను నీ వాదాన్ని వ్యతిరేకిస్తున్నానని అనుకోవద్దు సుమా షీలా మాటల్లో ఎంతో ఆవేదనా, ఆర్తి వున్నాయి. ఆమె భావాలు ఇవ్వాళ ఎంతో ఉన్నత శిఖరాల్ని స్పృశిస్తున్నాయని మాత్రమే ఆమెను ప్రశంసిస్తున్నాను" అని చెప్పి డాక్టర్ షీలా వైపు తిరిగి 'మీ ఆవేదనా తపనా నేను గౌరవిస్తాను. కాని ఒక్కమాట. ఆమె తండ్రి విషయమే తీసుకోండి మానవత్వం అనే మీరు చెప్తోన్న సిద్ధాంతం అలాంటి వ్యక్తిని కూడా గౌరవించమని చెపుతుందా'' అని అడిగాడు.

షీలా నాలుగు మూలల నుంచి చిక్కుకుంది. ఆమె అలసి పోయినట్లు ఆమె ముఖం చెపుతోంది. చూపుల్లో కారుణ్యాన్ని నింపుకుని సజ్జన్ వైపు తిరిగి షీలా అంది- 'పాపాన్ని నువ్వెంతైనా ద్వేషించు సజ్జన్. నేను కాదనను. కాని పాపం చేసిన వ్యక్తిని ద్వేషిస్తే అసహ్యించుకుంటే నేను ఒప్పుకోను. అతనిలో చెడువున్నా అతణ్ణి కనికరించు. ఆప్యాయతను చూపించు. నీ మంచి తనం అతణ్ణి ఏదో రోజు మార్చేయ వచ్చు. తన తప్పు తెలుసుకుని అతనే దిద్దుకో వచ్చు".

"మీ ఈ అసమర్ధుని అహింసావాద ధోరణిని హర్షించలేను. భూమి మీద నుంచి పాపాన్ని తుద ముట్టించాలంటే పాపాత్ముల తలలు తెగ నరకాల్సిందే" అని కర్కశంగా అంది వనకన్య.

కన్య కుంద బద్దలు కొట్టినట్టు మాట్లాడుతోంటే ఆమె మాటలు ఆమెకు ఎదురుగా కూర్చున్న ఇద్దరి పాపపంకిలమైన హృదయాల్ని కాల్చి వేశాయి. తన పాపాన్ని దాచు కుందామనే వుద్దేశ్యంతో షీలా నవ్వుతూ సజ్జన్‌తో ''దుర్జన్, పెళ్ళి కానిచ్చి చూడు. ఈ పసిది నిన్ను చిలుకలా పంజరంలో బంధించి వేస్తుంది. జ్ఞాపకం వుంచుకో'' అంది.

ఆ మాటకు ఆమెకూడా నవ్వుతూ ''అలాంటి పరిస్థితేగాని వస్తే నేను అసలు ఆయన్ని ఎందుకు పెళ్ళి చేసుకుంటాను?'' అని అంది కన్య.

"నువ్వను కొన్నట్లుగా సజ్జన్ అంత సజ్జనుడేమి కాదు. అన్నీ ఆలోచించే నేను అతణ్ణి దుర్జన్ అని పిలుస్తుంటాను''.

తన గురించి షీలా అలా మాట్లాడ్డం సజ్జన్‌కు రుచించలేదు. అయినా బదులు చెప్పలేదు.

కన్య మళ్ళీ అందు కుంది– ''మీరు నిన్నటి వరక అతని వ్యక్తిత్వాన్ని చూశారు. నేనీరోజు నుంచి చూస్తున్నాను. పీరి విప్పేసిన చొక్కాలకు ఎన్ని చిల్లు లున్నాయనేది నా కవసరం లేదు. కాని రాబోయే రేపులో అలాంటి చిల్లులే మళ్ళీ కనపడితే..." అని కన్య అంటోంటే ఆమె లోపల్నుంచిన వస్తోన్న ఆవేశాన్ని ఆపుకోలేక పోయింది. ఆ వేగానికి అంత చలి రాత్రిలో కూడా ఆమె నుదురు చెమటతో తడిసింది.

కన్య వాలకాన్ని చూసి సజ్జన్ గాభరా పడ్డాడు.

షీలా తల దించేసు కుంది. కన్య వ్యక్తిత్వం ధాటికి ఆమె వ్యక్తిత్వం తట్టుకో లేక పోయింది.

ఆరోజుకు ప్రసంగం అంతటితో ముగిసింది.

# 21

ఇవ్వాళ పగలంతా సజ్జన్ కన్యతో వుండాల్సివచ్చింది. అడుగడుగునా అతని మనస్సు ఆమె వ్యక్తిత్వంతో మర్దనపడుతూ వచ్చింది. కన్య అంటే అతను బెదిరిపోయాడు. నిరాఘాటంగా ఆమె అతణ్ణి ఏలుతోంటే అతను ఏమీ చేసేదీ లేకవూగిసలాడుతూ వున్నాడు. అతను దూరంగా వుండాలని ఎంత ప్రయత్నిస్తోంటే ఆమె మీద పాశం అంత దగ్గరగా పెనవేసుకుని పోతోంది. పగలు షీలా వెళ్ళిన తర్వాత అతను కన్యను ఓమాట నిష్కర్షగా అడిగాడు–"ఒకవేళ నాలో నీకు చెడ్డ కనిపడిందనుకో. అప్పుడేమి చేస్తావు?"

"వదినగారి మాదిరి నిప్పంటించుకుని ఆత్మ హత్య చేసుకుంటాను".

ఆమె ఇలా సమాధానం ఇస్తుందని వూహించలేదు సజ్జన్. తీరా ఇచ్చేసరికి అతను గాభరాపడిపోయాడు. వణుకుతోన్న కంఠంతో "నువ్వు వుత్త పిచ్చిదానివి కన్యా– తప్పకుండా నువ్వు పిచ్చిదానివే" అని అన్నాడు.

"మొగతా వ్యక్తుల్లో చెడ్డవుంటే దానితో సంఘర్షణ పడటం నాకంత కష్టమైన పనికాదు. తేలిగ్గా వాళ్ళకు దూరంగా వుండగలను. కాని నీలో కనపడిందంటే నాకు ఇంతకన్న వేరే మార్గంలేదు", అని ఘంటమీద దెబ్బకొట్టినట్లు తన మనసు లోని పొరను విరదీసి చెప్పింది కన్య.

"మనకు వివాహం కాదనుకో. ఒకవేళ మన ఈబంధం తెగిపోయిందనుకో మరి అప్పుడు?"

"వివాహం కాకపోతే పోనివ్వు కాని ఈ బంధం మాత్రం తెగదు" కన్య మాటలు అతనికి అర్థంకాలేదు. కళ్ళల్లోంచి తేనెసోనల్ని కురిపిస్తూ కన్య మళ్ళీ తన మాటతాత్పర్యాన్ని విడమర్చి చెపుతూ ఇలా అంది– "బంధాన్ని సృష్టించు కుంది నేను. దాని రూపురేఖలు నువ్వు దిద్దివుండొచ్చు చక్కదిద్దే భారం నాది. బంధం తెగకుండా కాపాడే బాధ్యత నాది. జీవితాంతం నిభాయించుకునేది నేను, నువ్వుకాదుగా"

ఈ సంఘటన తర్వాత పగలంతా కన్య అతని హృదయం మీద పెత్తనం చలాయిస్తూనేవుంది. ఆమె అనుకున్న వేళకి సజ్జన్‌ని తీసుకుని కర్నల్ దగ్గర కెళ్ళింది. మధురనుంచి వచ్చిన మహాశయుని తీసుకొని ప్లీడర్ దగ్గరకెళ్ళింది. అక్కణ్ణుంచి మేజిస్ట్రేటు కచేరికి వెళ్ళి చనిపోయిన తన వదినగారు రాసిన వుత్త రాన్ని దాఖలు చేసింది. ఆ వుత్తరాన్ని చూసి పరిశోధన చేయిస్తానని వాగ్దానం చేసారు మేజిస్ట్రేట్

కచేరి పని అయిపోగానే ఆమె వదినగారు తాలూకు ఆ వ్యక్తి ఏదో బజారు పని చెయ్యాలని చెప్పితే అతనితోపాటు వెళ్ళి సహాయపడడానికి కన్యను నియో గించాడు కర్నల్. అతనితో ఆమె బజారుకు వెళ్ళిపోయింది. పొద్దున్నుంచి తన మీద అధికారం చలాయిస్తోన్న కన్య అలా బజారుకెళ్ళగానే సజ్జన్‌కు కొంత

ఊరట కలిగింది. కన్య అతని జీవితంలో శాశ్వతంగా పీఠం వేసుకుందన్న నమ్మకం దృఢంగా ఏర్పడింది సజ్జన్‌కు. ఇక అంకుశాన్ని పొడుస్తూ తన ఇష్ట ప్రకారం అతణ్ణి నడిపిస్తుందన్న నమ్మకం కూడా అతనికి కలిగింది ఆ నమ్మకమే అతని కలవరపాటుకు కారణమైంది కూడాను. తెగిన గాలిపటంలా స్వేచ్ఛగా తిరుగుతున్న అతని జీవితానికి అకస్మాత్తుగా తెంపుపడిపోతుందని అతనికి ఆరాటం ఎక్కువైంది. అడవి మనిషిని పట్టుకుని తెచ్చి అమాంతంగా బంధించి వేస్తే స్వేచ్ఛకోసం గింజుకులాడుతాడు. సజ్జన్ పరిస్థితి ఇంచుమించుగా అలానే వుంది. అతని మనసులో తిరుగుబాటు తలంపుల మేఘాల్లా కమ్ముకుని వాటంతట అవే విడిపోతున్నాయి వాటిని చూస్తూ సజ్జన్ భయపడ్డాడు తననీడను చూసి తానే భయపడుతున్నాడు. ఆలోచిస్తూ పోతే ఏదో ఒకరోజు అతని కన్య కూడా వదిలిపెట్టి పోగలదు.

గోమతినది ఒడ్డున బాబా ఆశ్రమం ముందు ఆగింది సజ్జన్ కారు. బాబా గారి పిచ్చి ఆశ్రమం చాలా వింతగా వుంది చూడ్డానికి. వరండాలో పడపక్కెందు మంచాలు వేసివున్నాయి. ఎదురుగా గడ్డితో వేసిన ఓ పంచవుంది. ఆ పంచలో ఓ మూల ముగ్గురు వ్యక్తులు లంగోటీలు కట్టుకుని వంట చేస్తున్నారు. స్త్రీలు మినహా మిగతా రోగులంతా బాబాగారి మల్లే లంగోటీలు కట్టుకుని వున్నారు. అందరి తలలూ శుభ్రంగా నున్నగా గొరిగి వున్నాయి. ఒక మూల విసురురాయి ఆమర్చ బడివుంది. పంచకు ఆరుబయట ఎవరో సాధువు ఉన్ని స్వెటర్ వేసుకుని తలకు కంఠువాచుట్టుకొని ఎవరితోనో మాట్లాడుతున్నారు. వరాండాలో మధ్యగా కూర్చుని ఎవరో మార్వాడీ యువకుడు గీతా, పురాణ కాలక్షేపం చేస్తూ వాటిలోంచి కొన్ని శ్లోకాల్ని చదివి ప్రపంచమంతా సత్యని ప్రపచనంచేస్తున్నాడు. శ్రోతలైతే వేరు కాని అతను చదివేతీరు చూస్తే కనీసం ఒక వెయ్యిమంది భక్తులైనా చుట్టివున్నారా అని పిస్తోంది. వాళ్ళలో ఓ గిడసరి బెంగాలీ వున్నాడు. ఆఫీసరు తన్ను పొగడే స్తుంటే ఆ మాటల్ని ఏకరువుపెడుతూ తనకు తానే పొంగిపోతున్నాడు అక్కడే ఓ స్తంభానికి ఓ పహిల్వానును కట్టివేశారు గొలుసుతో. విడిపించుకోవాలని మాటి మాటికి కొడుతున్నాడు. దమ్ముంటే నాతో కుస్తీకి రమ్మనమని బాబాకు

సవాలు చేస్తున్నాడు. యాతుల వాన కురిపిస్తున్నాడు. వేరే స్తంభానికి కట్టేసి ఓ కంట్రాక్టరు వున్నాడు. ఇక్కడికి రాకముందు అడవిలో కలపను తరలించడానికి కంట్రాక్టును తీసుకునేవాడు. పహిల్వాన్ తిట్టిపోస్తుంటే అతను కూడా వంత పాడుతూ "ఏం చేస్తాం. ఇదంతా మన ఖర్మ" అంటూ ఓపిక పట్టమని సలహా ఇస్తున్నాడు. "బాబానాయాలుగారు పచ్చి గూఢచారి. పాకిస్తానీ ఏజెంటు. రోజూ రాత్రి వీడు ఆశ్రమానికి విమానంలో వస్తాడు. నాదగ్గర్నుంచి రెండున్నర లక్ష రూపాయలు కొట్టేసాడు. ఇవ్వాళ మనం వీడిని పొడిచేసి ఆ విమానంలో పారి పోదాం. ఇప్పుడు నువ్వేమీ మాట్లాడకు" అని ఆ పహిల్వానుకు పూరట కలి గిస్తున్నారు కంట్రాక్టర్. అతనికి పక్కగానే మంచం మీద చతికిలపడి ఓ సింధీ యువకుడున్నాడు. మంచినీళ్ళు నోట్లోపోసుకుని బుగ్గల్ని పెద్దవిగా చేసి యోగ సాధన చేస్తున్నట్లుగా కూర్చున్నాడు కళ్ళు మూసుకుని. ఇద్దరు ఆడవాళ్ళు బక్కె ట్లతో నీళ్ళు నింపుకుని గోమతి నుండి వస్తున్నారు. కెప్టెన్ రాజేష్ భార్య మంచం మీద నిద్దరపోతూంది. ఆమె తలవెంట్రుకల్ని కత్తిరించి క్రూరంగా గొరిగించి వేశారు.

అంతమంది పిచ్చివాళ్ళు రకరకాలుగా గొడవచేస్తున్నా ఏమీ లేనట్టుగా తన్ను చూడ్డానికి వచ్చినవాళ్ళతో మాట్లాడుతున్నారు బాబా. సజ్జన్ చూడగానే అతనికోసమే వేచివున్నట్టుగా లేచి "మిమ్మల్ని చూసిమాకు ఎంతో సంతోషంగా వుంది. మీరు మాకు పెన్నిధిలాంటివారు" అన్నారు. మళ్ళీ అక్కడున్న వ్యక్తుల వైపు చూసి సజ్జన్ గారిని చూపిస్తూ "వీరు మాకు ఇవ్వాళ ఎంత సహాయం చేశారనుకున్నారు. ఆ మంచంమీద పడుకొని నిద్దరపోతున్న ఆ పిచ్చిఅమ్మాయి ఆశ్రమానికి రానని మొండికేసి కూర్చుంది. ఆ మాట ఈ మాట చెప్పి ఆమెను తోల్తాకొట్టించేశారు. అంతే, పెంపుడు కుక్కలా తోకఆడించుకుంటూ వారివెనక వచ్చేసింది" అని సజ్జన్‌గారి గొప్పతనాన్ని చాటారు.

వాళ్ళలో వున్న ఓ పంతులుగారు "బాబాగారూ, ప్రపంచంలో ఉపకారాన్ని కట్టుకుని మోసే వ్యక్తులు ఇంకా కరువుగాలేదనుకోండి. ఇలాంటి మహాత్ములు వుండబట్టే ఈ భూమాత ఈమాత్రం అయినా భారాన్ని మోయగలుగుతూవుంది

ఆమె చెప్తోంది నిజం అనుకుంటాను అని ఇవ్వాళ్ళ బజార్లో ఎవరో అంటూంటే బాబాగారు ఆమె మీద బలప్రయోగం చెయ్యకుండానే.... ఈమెను నేను బాగా ఎరుగుదునని పీరు...ఇలాంటి మహాత్ములు ఇంకా ఈగడ్డమీద-"అంటూ మ్యా... మ్యా... అని ఆగిపోయాడు.

బాబాగారు అందుకున్నారు- "మేం నిమిత్తమాత్రులం నాయనా. సాధువులం కాము బైరాగులం కాదూ. మాగురువుగారు ఉపదేశంచేసి ఒదిలేసారు, గురుదక్షిణ కింద ఆయనకు రెండేరెండు మాటలు ఇచ్చాం ప్రపంచం అంతా మనమే అనిభావించి సేవచెయ్యి, చచ్చేముందు చివరి నిముషం వరకు ఏ తప్పు చెయ్య నని లంగోటి బిగించు. అంతేనండి, మేం చదువుకున్న శాస్త్రమంతా".

ఇంతలో మంచంమీద చలికిలపడ్డ సింధీ యువకుడు దబాలున లేచాడు. నోటికి చెయ్యి అడ్డంపెట్టుకుని నడవా బయటవున్న తూము దగ్గరకు వచ్చాడు. అతనికి వికారంగా వున్నట్లుంది. వాంతులు చేసుకోసాగాడు. మధ్యమధ్య "ఏక్.. ఏక్..." అని అంటూన్నాడు. కట్టుకున్న గుడ్డలమీద కూడా [illegible] వాంతి చేసుకున్నాడు. తూము దగ్గరకొస్తుండే నాపరాళ్ళమీద [illegible] కొద్దిగా చేసుకున్నాడు.

"హారి! పిడి దుంప తెగనూ" అంటూ బాబా వెంటనే[illegible]డు. బాబాగారి కార్యదీక్ష చూస్తూసజ్జన్ నిలబడ్డాడు. పిచ్చివాళ్ళతో నిండుకున్న ఆ ఆశ్రమం అతనికి చాలా విచిత్రంగా కనపడింది. వాళ్ళనూ అక్కడి పరిచారకుల్నీ చూస్తోంటే అతనిబుర్ర వేడెక్కిపోయింది. ఇంట్లో ఒక్కపిచ్చివాడు వుంటే వాణ్ణి పట్టుకోవడంకష్టం. ఇరవైనాలుగు గంటలూ అతణ్ణి ఎలా సంబాళించటమా అన్నవిచారంతో కుములుతారు ఇంట్లో వున్నవాళ్ళంతా. కాని ఇక్కడపిచ్చివాళ్లు మొత్తం పదీ పదిహేను మంది వున్నారు. ఇంతమంది వున్నా అందరిని అన్ని రకాలుగా బుజ్జగిస్తూ, నచ్చచెప్తుతూ, అదిలిస్తూ, బెదిరిస్తూ, అరిస్తూనో కరుస్తూనో అందరిని ఒకకంట కనిపెడుతూ అన్ని ఏర్పాట్లు చేసి కుర్చీమీద వచ్చి కూర్చున్నప్పుడూ వాటన్నిటినీ మరచిపోయి ఏమీ జరగనట్టుగనే వుంటాడు.

అన్ని చింతలూ అతన్ని వేధిస్తుంటున్నా ఏ చింతా లేనట్లుగా పుష్కలంగా నవ్వుతుంటాడు.

"రామ్‌జీ, తమకు ఏం కావాలో శలవివ్వండి– టీ, మంచి తీర్థం! భంగు తాగే అలవాటుంటే చెప్పండి. నిముషంలో తయారు చేసి ఇస్తాను".

"అబ్బే. అవేమీ వద్దండి. మీ దయవుంటే చాలు".

"అలవాటుంటే మొహమాటంలేకుండా చెప్పండి.తమరు మా ఆశ్రమానికి వచ్చి మాకు ఏ శ్రమా ఇవ్వకపోవడం–".

"శ్రమపడాల్సింది నే నండి"

"అది నిజమేననుకోండి రామ్‌జీ. ప్రతి మనిషీ తనకు తోచినట్టుగా సేవ చెయ్యాలి". అంటూ "ఆరే రమాశంకర్, అయ్యగారికి లవంగాలూ, ఏలకులూ బాగా మెత్తగాకొట్టి దాన్లోవెయ్యి" రమాశంకరుకు టీ చెయ్యమని పురమాయించాడు బాబా. మళ్ళీ సజ్జన్ వైపు తిరిగి "రామ్‌జీ, మనిషిలో సత్తువ దావనంత వరకు, అతనిలో సేవాభావం ఏకొద్దిగావున్నా యధోచితంగా అతను సేవ చేస్తూ మతి భ్రమ కలుగకుండా అపుతూ వుండాలి" అని అన్నాడు.

"మీరు ఏమి మాట్లాడుతున్నారో నాకు బోధపడడంలేదు".

"అదికాదు రాంజీ. నిజాయితీవున్న సేవకుడు ఎప్పుడూ హుషారుగా వుంటాడు. శాంత చిత్తుడుగా వుంటాడు. తప్పుచేసినా అతను తన జాగ్రత్తనూ నెమ్మదిగావుండే స్వభావాన్నీ వదలడు. అంతేనండి దాని తాత్పర్యం"

బాబా చెప్పిన మాట సజ్జన్‌కు నచ్చలేదు. "మీరు సేవకులై వుండి కూడా చాలా పట్టింపులున్నారు. ప్రతి మనిషి తనకు తాను యజమానిగా ఎందుకు కాకూడదు?" అని సజ్జన్ అడిగాడు.

సాధువుగారు నవ్వుతూ చెప్పడం మొదలెట్టారు– "రామ్‌జీ, ఆశ్రమానికి రాకముందు నేను యజమాని దగ్గర మోటరు మెకానిక్కుగా పనిచేసేవాణ్ణి. కొన్ని రోజుల తర్వాత ఆకొలువు వదిలి వింధ్యాచల పర్వతానికి వెళ్ళిపోయాను

ధ్యానసమాధిలోకి. త్రికూట ధ్యానం చేస్తూ ఆహారం, నీరూ ఏమీ లేకుండా ఉప వాసంచేశాను. ఇంకా ఎన్నో ఎన్నో ముద్రలూ దిగ్బంధనాలూ చేశాను. చివరికి ఓ మహాత్ముడు కనిపించాడు. 'నీ సేవాధర్మాన్ని మాని ఈ శుష్కయోగాన్ని ఎందుకు అభ్యసిస్తున్నావ్' అనిఅడిగాడు. 'ఇక్కణ్ణుంచి తక్షణం వెళ్ళిపో. వెంటనే కార్యరంగంలోకి దిగు' ఏంచెయ్యమంటారు రామ్‌జీ. గురువుగా ఎంచుకున్న తర్వాత వారి ఆదేశాలు పాలించాలి కదా. వారు చెప్పింది పాటించాలిగా. నేను చెప్పేది ఏమిటంటే, సేవాధర్మాన్ని విడిచి ఏవ్యక్తి తనకు తాను స్వామికాలేడు. కాని సందర్భంవేరు. తమకు సేవచెయ్యాలనే ఉబలాటంగావుంది నాకు- తమరు రాంజీ ఆయె".

సాధువు మాటలు ఇంకా చిక్కగానే తోచాయి సజ్జన్‌కి. అతని మాటలు ఎలావున్నా అతని వ్యక్తిత్వం మాత్రం అతన్ని ఆకర్షిస్తోంది. ఆ ఆకర్షణ వల్లనే అతను సాధువు చెప్పిన సిద్ధాంతంతో ఏకీభవించకపోయినా, అతని ఆదర్శాల్ని వ్యతిరేకించినా, సాధువు వ్యక్తిత్వ ఆకర్షణే అతని సేవాదీక్ష అని స జ్జ న్ ఒప్పుకోక తప్పలేదు. సజ్జన్ వర్మ అయిన నేను సాధువుల దగ్గిరకూ, సన్యా సుల దగ్గిరకూ ఎందుకు వెళ్ళాలి? ఏసుక్రీస్తు, వివేకానందుడు, మహాత్మాగాంధీ లాంటి మహనీయులవ్యక్తిత్వాలకన్న శ్రేష్టమైంది సేవ చేయడం. 'సేవ' అనగానే తన ఇంట్లో తనచుట్టూ పనిచేస్తోన్న డ్రైవర్లూ, నౌకర్లూ, పూజార్లూ, తోటమాలీ, వంటవాడూ, గుమాస్తా, చౌకీదార్లూ అందరూ అతని కళ్ళముందు కట్టారు. ఇంత మంది జనాన్నుంచి సేవల్ని అందుకోవడానికి జన్మతః అధికారం పొందినవ్యక్తి డబ్బులు కుమ్మరించి వారికి యజమానిగా అధికారం చలాయించగల వ్యక్తి, అయ్యగారూ, దొరగారూ, కామందులవారూ అని రకరకాలుగా పిలిపించుకోగల వాడూ, వారంతా తనకంటే హీనజన్ములని వాళ్ళమీద దర్పాన్ని వెంగపెడుతూ చిత్తంవచ్చినట్లు అదిరించి బెదిరించడానికి అలవాటు పడే వాడు సేవాధర్మం అనే ఆదర్శాన్ని అత్తరుమాదిరిగా కేవలం వాసనచూసి తన్మయుడు కాగలడేమో కాని దానిని పువ్వుగా భావించి చేతిలోకి తీసుకుని స్పృ శిం చ డం - దాని గుబాళింపును ఆఘ్రాణించడం- రెండుపనులూ చేయడం అతని శక్తికిమించినపని.

తన అశక్తతను చూసిసజ్జన్‌కు చిరాకు కలిగింది. కోపం వచ్చింది. అతనిలోని కాముకత్వం అతణ్ణి జయించింది. తాను వల్లించిన ఆదర్శాలను సైతం ఆచరణలో పెట్టే నైతిక బలం అతనికి లేదు. తాను ఎంతదిగజారిపోయాడు? అతనికిప్పుడు ముప్ఫయ్‌రెండు సంవత్సరాలు. ఈరోజు వరకు తన్ను తాను తెలుసుకోలేక పోయాడు. తన వ్యక్తిత్వంలోని వ్యతిక్రమాలన్నింటిని ఎంతో నిశ్చలంగా, ఎంతో రాజసంతో, ఎంతో ఆవేశకావేషాలతో ఒకే బుట్టలో తొక్కి ఏ ఎదురూ లేకుండా జీవితాన్ని నెట్టుకుంటూ వచ్చాడు. నచ్చిన పనల్లా చేసాడు. నచ్చిన ప్రతిమాట నిర్భయంగా చెప్పేవాడు. కాని ఇప్పుడు-అతని జాగరూకత అతణ్ణే చెంపమీద కొడుతూంది!.... తాను ఇంత చెడ్డవాడా? తానింతవరకు తప్పులే చేస్తూ వచ్చాడా?'

''తమరేమీ తప్పు చేయ్యలేదు రాంజీ. ప్రతివ్యక్తి మొదట్లో తప్పుచేసి తర్వాత అనుభవం గడిస్తాడు. మా తప్పులు చెప్తా వినండి-"

తన మనసులో సమాధానం వెతుకుతోన్న ప్రశ్నకు ఆకస్మాత్తుగా బయట సాధువు సమాధానం ఇచ్చేసరికి సజ్జన్ నిర్ఘాంతపోయాడు.

సాధువు తన వృత్తాంతం చెప్పుకుపోతున్నాడు- ''నేను మొట్టమొదట మోటరు కంపెనీలో మెకానిక్కు వుద్యోగంలో చేరాను. మనదేశంలో మోటరు పరిశ్రమ అప్పుడే కొత్తగా మొదలెట్టారు. పనిచేతనైన వాళ్ళు తక్కువ గా వుండటవల్ల వాళ్ళకు మంచి గిరాకీ వుండేది. తెల్లదొరలు మామూళ్ళు విపరీతంగా ఇచ్చేవాళ్ళు. అంతా కలుపుకుని మా నెలసరి ఆదాయం రెండువందల ఏభై రూపాయలదాకా వుండేది. మాలాంటి పల్లెటూరి కుర్రకారుకు అంత డబ్బు కళ్ళ చూడగానే పొగరెక్కిపోయింది. ఏభై సంవత్సరాలక్రితం రెండువందల యాభై రూపాయలు సంపాదించామంటే ఎంతో గొప్ప అనుకోండి. డబ్బుమదంతో మా ఇష్టంవచ్చినట్లు తిరగడం మొదలెట్టాం. కోటూ ఫేంటూ వేసుకోసాగాము. రెండు పూటలా వ్యాయామం, పాలు పెరుగూ, వెన్న, బదీ, బంగూ అన్నింటినీ సేవించడం మొదలెట్టాం. తిని తాగిన తర్వాత ఇంకా ఓ ముప్పాతిక మిగిలేది. అది ప్రతినెలా ఇంటికి పంపేవాణ్ణి. తెగతినిబలిసి కొవ్వెక్కింది. ఎంతపొగ

లేక్కినా డ్యూటీ విషయంలో మాత్రం నియమం తప్పేవాళ్ళంకాదు. డ్యూటీకి సరిగ్గా హాజరయ్యేవాళ్ళం. శరీరాన్ని పెంచాలనీ కండరాలన్నీ మెలితిరిగి మంచి బలిష్టంగా వుండాలనీవుండేది మాకు. నడిచేటప్పుడు కూడా విరగ్రీగుతూ, ఛాతీని విరుచుకుంటూ నడిచేవాళ్ళం. ఇలా వుంటూండగా ఓ సారి ఓ చిన్న సంఘటన జరిగింది. ఒకాయన మా సంపాదనతో జల్సాగా మేం ఖర్చుపెట్టడంచూసి ఓర్వ లేక మా మీద పుకారు లేవదీసాడు. యజమానికి వచ్చే ఆదాయంలో నేను కొంత భాగాన్ని కొట్టేస్తున్నానని అతను ఫిర్యాదు చేసాడు. అతని ఆరోపణ పచ్చి అబద్ధం. నాకు బాగా కోపం వచ్చింది ఆ వ్యక్తిమీద. ఒక రోజున ఓ ట్రక్కు రిపేరు చేస్తూ వున్నాను. దాన్ని టెస్టు చేయాలన్న నెపంతో మారూమ్ దగ్గరకి తీసుకొచ్చాం. ఆరోజు బంగు మామూలుకన్నా కొంచెం ఎక్కువగా బిగించాం. ట్రక్కు తీసుకుని బయలుదేరాం. మమ్మల్ని అల్లరి పెట్టిన మనిషి ఫుట్‌పాత్ పక్కనే మంచంవేసుకుని గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. రోడ్డుమీద నడుపుతోన్న ట్రక్కును ఫుట్‌పాత్‌మీదకు ఎక్కించాం. అంతే. మంచంతో సహా వాడు తుక్కుతుక్కయ్యాడు స్పీడులో వెళ్తున్న ట్రక్కు ఎదురుగావున్న గోడకు గుద్దుకుని ఆగింది. మళ్ళీబ్రేక్ చేసుకుని ఏమీ ఎరగనట్టుగా కార్ఖానాలో ట్రక్కును పెట్టేశాం. మా కార్ఖానా యజమాని ఓ తెల్లదొర. వెంటనే అతని దగ్గరకెళ్ళి జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పాను. నేను డ్యూటీ బాగా చేస్తుండేవాణ్ణి. నాపనితనం చూసి తెల్లదొర ఎంతోసంతోషిస్తుండేవాడు. నేను చేసిన ఘనకార్యం విని ఆలోచనలో పడ్డాడు ఏమిచెయ్యడం చెప్మా అంటూ. 'నువ్వు నిజంచెప్పావు. నిన్ను కాపాడ్డానికి ఏదైనా వుపాయం చూస్తాను. మిగతావాళ్ళను మాత్రం ఇంక ఏ మాత్రం ఉద్యోగంలో వుంచుకోలేను. సరే, నువెళ్ళు' అన్నాడు. రామ్‌జీ, నేను చెప్పేదేమంటే మనిషి అనేవాడు సహజంగా తప్పులు చేస్తుంటాడు. తప్పులు చేసిన తర్వాత కాని అనుభవం రాదు. తప్పులు తెలుసుకుని మెలకువగా మెలగడం మొదలుపెట్టాడంటే అతను ఆర్జించే అనుభవం మంచిదే అవుతుంది. మంచి గుణాలు సంపాదించుకోగల శక్తిసామర్థ్యాల్ని పెంచుకోగలుగుతాడు''.

సాధువు పూర్వవృత్తాంతం విన్న సజ్జన్‌కు అతనంటే ద్వేషభావం కలిగింది. సాధువు కథ అతని వ్యక్తిత్వంలో సంబంధంలేని రెండువేరువేరు పొరల్ని

బయటికి లాగి చూపింది. సాధువు కర్కోటకుడైన హంతకునిలా, సమాజానికి నిజాయితీగా సేవచేసే కార్యకర్తగా రెండు రూపాలతో కనపడ్డాడు. అతనిమీద మనస్సులో ప్రతిష్ఠించుకున్న శ్రద్ధాభావాన్ని సజ్జన్ ఒక్కసారిగా వదలనాడలేడు. అతనిమీదస్థిరంగా ఆ భావాన్ని వుంచనూలేడు. సాధువు వ్యక్తిత్వంలోని ద్వంద్వత్వం అతణ్ణి ఇరుకున పెట్టేసింది. ''చిక్కు అనేది మనం పెంచుకు పోతోంటే అలా పెరిగిపోతూనే వుంటుంది రామ్‌జీ. తగ్గించుకుని పోయా ంటే అదే విడిపోతుంది" అంటూ సాధువు సజ్జన్ ముఖంకేసి చూస్తూ అన్నాడు. అతని మాటలు విని సజ్జన్ మళ్ళీ నిర్ఘాంతపోయాడు.

"రామ్‌జీ, దీనిలో ఆశ్చర్యంలేదు. అన్ని పదార్థాలు ఈ జగత్తులోనే వున్నాయి. 'ఖర్మకాలిన మానవుడు దేనినీ పొందలేడు' అని గోస్వామిగారు ఏనాడో తెలవిచ్చారు" అంటూ సాధువు నవ్వాడు.

కూర్చుని కూర్చుని సజ్జన్‌కు మైకం వచ్చినట్లయింది. అతని మననశక్తి చెదిరిపోయింది. సాధువు కళ్ళల్లోని కనుపాపలు అతని మనసులోని ప్రతి పొరనూ ఎత్తిలోపల చూస్తున్నట్లుగా తోచింది సజ్జన్‌కు. అతని కళ్ళు సజ్జన్ మనస్సునంతా గాలించివేసాయి. ఇంక గోప్యం అంటూ ఏదీ మిగల్లేదు. 'తాను' అనేవాడు ఇకలేనట్లే అనిపించింది. స్నేహంతో తడిసిన అతని కళ్ళు మత్తు మందు నింపుకున్న సూదుల్లా అతని నరనరాల్లోకి వెళ్ళిపోయాయి. తాను అంతరిక్షంవైపుకు పారిపోతూంటే సాధువు చూపులు సూర్యకిరణాల్లా అతనికంటే వేగంగా అంతరిక్షాన్ని దాటుకుని ముందుకు దూసుకుపోతున్నాయి. సజ్జన్‌లో దాగివున్న 'అహింసా' సాధువు ముందు పూర్తిగా ఓడిపోయింది. అయినా ఓటమిని అంగీకరించడానికి అతని మనస్సు ఒప్పుకోవడంలేదు. ఒప్పుకోవడం అయితే లేదు కానీ దానికి కావలసిన సాక్ష్యం, బలం అతని దగ్గరలేదు. అతని ఆలోచనాశక్తిచెల్లాచెదరైపోయింది. కూర్చుని వుండగానే అతణ్ణి మైకం కమ్ముకో సాగింది. రెప్పలు బరువుగా వాలుతున్నాయి. వాటిని తెరవలేకపోతున్నాడు. సజ్జన్ చాలా వికలంగా వున్నాడు. అలాంటి సమయంలో మసాలా నూరి కలిపి తయారుచేసిన తేనీరు వచ్చింది.

# 22

బాబా రామ్‌జీ ఆశ్రమం నుంచి సజ్జన్ తిరిగి వస్తూంటే ఛతర్ మంజిల్ ప్రాంతంలో రోడ్డుమీద నడిచి పోతోన్న మహీపాల్ కన్పించాడు. అతన్ని చూడ గానే సజ్జన్ కారు ఆపి పిలిచాడు. వెతక బోతున్న తీగె కాలికి తగిలినట్లయింది మహీపాల్‌కు. అతని ముఖం బాగా వాడిపోయి కళా విహీనంగా వుంది. కార్లో కూర్చుంటూ "నువ్వు ఇక్కడ కనిపించి నా నెత్తిన పాలు పోసావ్. నన్ను షీలా ఇంటి దగ్గర దిగపెట్టి వెళ్లు" అన్నాడు మహీపాల్. దారిలో ఇద్దరూ మాట్లాడు కుంటున్నారు. సంభాషణలో షీలా ప్రసక్తి వచ్చింది. షీలాకు తనకూ మధ్య సంబంధాన్ని కన్యకూ సజ్జన్‌కూ మధ్యవుండే బంధంతో పోలుస్తూ మహీపాల్ మాట్లాడాడు. సజ్జన్‌కు కోపం వచ్చింది. మహీపాల్ అభిప్రాయాల్ని వ్యతిరేకిస్తూ సజ్జన్ షీలాకు వనకన్యకూ గల తేడాను ఖచ్చితంగా విడమర్చి చెప్పాడు-

"షీలాను నేను గౌరవిస్తాను. కాని కన్యతో సమానంచేస్తూ పోల్చడం నాకు సుతరామూ ఇష్టం కాలేదు. నేనింత వరకు ఎంతో మంది స్త్రీలను సన్నిహితంగా చూశాను. ఆకళింపు చేసు కున్నాను. కాని ఒక్క మా అమ్మగారు మినహా మిగతా వాళ్ళందరిలో కల్లా కన్య ఖచితంగా విశిష్టమైంది.

"నిష్ఠాపరంగా చూస్తే నాభార్య గూడ గొప్పదేనోయ్-"

"మరి అలాంటప్పుడు షీలాను-"

"షీలా నాకు నిషాలా అవసరం. పైకి కానవచ్చే ఈ నిషాలన్నీ నాకు కేవలం వ్యాపకాలు మాత్రమే. వీటికి నేనెప్పుడూ దాసుణ్ణి కాలేదు. అమ్ముడు పోలేదు. కాని షీలా మిగతా నిషాలాంటి చవుకబారు రకం కాదు. ఆమెకూ నాకూ వున్న బంధం కేవలం శారీరకమైనది కాదు. అంతకు మించినది. సజ్జన్। నీ ముందు నిజం దాచను. ఒక్కమాట చెబుతాను. ఎంతఅలసి సొలసి సొమ్మ సిల్లి జీవితంతో నేను రోజూ ఘర్షణపడు తూంటానో అది బహుశా కలలో కూడా నువ్వూహించలేవు. అలసిపోయి దెబ్బ తిన్న నా అహంకారం ఆమెను పొందగానే తిరిగి బలం పుంజు కుంటుంది. ఇకపోతే నాకు కర్నల్ ఒక్కడే ఎప్పు డూ

ఉత్సాహాన్ని ఇస్తుంటాడు. నిజం చెప్పాలంటే అతని ముందు నువ్వు నాకు బలం ఇచ్చే బదులు నా మానసిక భారాన్ని పెంచుతావు సుమా!"

"కావచ్చు. నాకూ కర్నల్‌కూ మధ్య కర్నల్‌ని శ్రేష్ఠంగా ఎంచు కుంటున్నావు కదా. మరి షీలాకూ నీభార్యకూ మధ్య నీ భార్యను నువ్విలాగే శ్రేష్ఠంగా భావిస్తున్నావా?" అన్నాడు సజ్జన్ ముభావంగా.

మహీపాల్ సమాధానం ఇవ్వలేదు. తిరిగి సజ్జన్ అన్నాడు- "నా మనస్సు ఎటువంటిదో ఇంత వరకూ సరిగా గుర్తించలేదు. ఇప్పుడు నేను రెంటి మధ్య ఊగిసలాడు తున్నాను. అదా ఇదా అని తేల్చుకోలేక పోతున్నాను. ఇంతటి మానసిక సంఘర్షణని నేనెప్పుడూ ఎదుర్కో లేదు. కన్యలాంటి ఆవేశంతోనూ భావా భినివేశంతోనూ నిండుకొన్న స్త్రీ జీవితాన్ని నా వృత్తియాసికి ముడివేసు కుంటే ఎంత వరకు కృత కృత్యుణ్ణి కాగలనా అని సందేహంగా వుంది. బహుశా మాఇద్దరి దాంపత్య జీవితం అనుకున్న మాదిరి సౌఖ్యంగా వుండక పోవచ్చునని అనుమానంగా వుంది"

"కళ్యాణి నాకు సమస్యగా తయారైనట్లు. అంతేనా?"

"కాని మళ్ళీ అనుకుంటూ వుంటాను. ఈ మేలిమి బంగారంలో నిష్ఠ అనే రత్నాన్ని నేను పొదగలేక పోయానంటే నా జీవితమే వ్యర్థం. కన్య నాలోవున్న బలహీనతల్ని సవాలు చేస్తూ నా జీవితంలో అడుగు పెట్టింది. ఈ రెంటి ప్రవృత్తుల మధ్య కాస్సేపు అటూ కాస్సేపు ఇటూ మొగ్గుతూ వున్నాననుకో. కాని నా "శీలంలోకి పాకిపోయిన రుగ్మత లక్ష సార్లు వద్దని వారించినా నన్ను నావైపే లాగేస్తోంది. చివరికి ఈరుగ్మత ఎప్పుడో ఒకప్పుడు కన్య నిష్ఠ ముందు ఓడిపోక తప్పదని నాకు తెలుసు. ఆనిష్ఠకు ముందు దాసోహం కాక తప్పదు"

కాని సజ్జన్ మాటలు విని మహీపాల్‌కు అతనలా చేయ లేదన్నట్లుగా తోచింది. తాను తాళి కట్టింది కళ్యాణికైనా షీలాను వదలలేదు.

సజ్జన్ దిగపెట్టి వెళ్ళిన అరగంట తర్వాత షీలా ఒళ్ళో తలపెట్టి మహీపాల్ షీలాతో అన్నాడు- "ఓ నా బలహీనతా! నువ్వు నన్నెప్పుడూ వదలి వెళ్ళిపోకు".

మహీపాల్ జుత్తులోకి చేతివేళ్ళని పోనిచ్చి అతణ్ణి నిమురుతూ "వదలి పెడదామన్న ఆలోచన అసలు నీకెందుకు కలుగుతుంది? కొంచెం అప్రతిష్ఠరాగానే అలా పిరికివాడై పోతున్నావేం?" అంది షీలా.

"అప్రతిష్ఠ అంటే నాకు ఏకోశానా భయంలేదు షీలా. కాని నా ఈ హృదయంలో ఏదో ఒక మహాశక్తి దాక్కుని "నువ్వు తప్పు చేస్తున్నావు, నువ్వు ఇతరుల అధికారాన్ని అపహరిస్తున్నావు" అని నాకు మాటి మాటికి జ్ఞాపకం చేస్తున్నది. అదీ నా భయానికి కారణం".

"ఏమో. నువ్వు చెప్పిన దానిని ఒప్పుకోలేను. నువ్వేదో ఎవరిదో అధికారాన్ని అపహరిస్తున్నావని అన్నావే దానికి నేనంత ప్రాధాన్యత ఇవ్వను. మన రెండు ఆత్మలూ ఒకరి అవసరాలు మరొకరు తీర్చు కుంటున్నాయి. అలా తీర్చుకోవడం ఈగడ్డ మీద పుట్టిన ప్రతి వ్యక్తికీ హక్కువుంది. ఆ మాటకొస్తే మన ఇద్దరి మధ్య ఈ బంధాన్ని నేను పాపంగా భావించడమే లేదు".

"నా నైతిక సంస్కారాలన్నింటినీ చిలక కొయ్యకు తగిలించి మన మేం పాపం చెయ్యటం లేదనే నేనూ అంటాను. అయినా కళ్యాణి జీవితాన్ని ఓ సారి పరికించి చూడు ఆమె నిష్ఠ ఎంత అసమాన్యమైనదో!"

"నిజమే ఆమె స్వభావానికి అలాంటి నిష్ఠ అచ్చు గుద్దినట్లుగా వుంటుంది. కాని చాలా మంది ఆలోచనా ప్రాలోచనా లేకుండా ఏవేవో బంధాల్ని కల్పించుకుంటారు. జీవితాంతం వాటిల్లోనే వుండిపోతారు కూడాను. అటువంటి మూగ భక్తురాళ్లలో నీ భార్య ఒకతె. కాని జీవితాన్ని మన ఆలోచనల ప్రకారం మలచుకోడానికి అలవాటు పడిన వాళ్లం మనం. మనమెందుకు చెడ్డ అవుతాం? నైతిక విలువలకు దాసులై పోయిన కారణంగా మొదటి నుంచీ నిష్ఠ అనే సంకెళ్లు తగిలించుకున్న వాళ్ళకంటే మనం ఎందుకు హీనులౌతాం?".

''ఏమని చెప్పమంటావు షీలా, ప్రపంచం ఆ బంధం చెడ్డది అని కోడై కూస్తోంది. బహుశా నేను కూడా అలవాటు ప్రకారం అలానే అంటానే అనుకో. ఏమి చెయ్యాలో తోచటం లేదు. ''ధర్మం ఏదో నాకు తెలుసు. కాని దానిమీద నాకు మోజులేదు. అధర్మం ఏదో నాకు తెలుసు. కాని దాన్నుంచి తరుణోపాయం వెతకలేక పోతున్నాను. దుర్యోధనునిలా నేను అటా ఇటా అని తేల్చలేక కుడితిలో పడ్డ ఎలకలా గిజగిజతన్ను కుంటున్నాను. నా మనసులో కూర్చున్న దేవత నన్నేపని చేయమని నియోగిస్తే అపనే చేస్తాను" అంటూ వేడి నిట్టూర్పు విడిచాడు మహీపాల్.

''నీ వేదాంతమే అన్నిటికన్న మంచిది. మనిషి తన ఆవేశాపరమైన అవసరాల్ని గుర్తించనిదే దాన్నుంచి విముక్తిపొందలేడు. నీభార్య నీఅవసరాల్ని తీర్చ గలిగివుంటే బహుశా నువ్వు కూడా ఆమె మోస్తరుగానే ఒకే నిష్ఠతో వుండే వాడివి. ఇన్ని సంవత్సరాలనుంచి నిన్ను తరచి తరచి చూశాను. ఏమోరలిస్టుకూ నువ్వు తీసిపోవు".

షీలా తనని పొగడుతూంటే ఆప్యాయంగా ఆమెను చూశాడు మహీపాల్. ఆమెను తన బాహువుల్లో బంధించి వేసాడు. అంతగాఢ కౌగిలిలో ఇద్దరు నలిగి పోతున్నా వాళ్ళ మనస్సులు శృంగారాన్ని పులుముకోకుండా ఒకరకమైన మానసిక సంతృప్తిని పొందు తున్నాయి.

కొన్ని క్షణాల్లో మహీపాల్ మళ్ళీ ఈ వాస్తవ జగత్తులోకి వచ్చాడు. పాత ధోరణిగో మళ్ళీ అన్నాడు- 'కాలాన్ని బట్టి చూసినా మనం నలభయ్యో పడిలో పడ్డాం కదా. యవ్వనావేశాన్ని వివేకం కట్టివేసే వయస్సు, భవిష్యత్తు మనిద్దరిని ఎటువైపు తీసుక పోతుందా అన్న ఆందోళనగా వుంది. ఇంత వరకు నా ఇంట్లో వాళ్ల కళ్లు తప్పి స్వైరవిహారం చేసిన రహస్యం ఇప్పుడు ఇంటిల్లి పాదికీ తెలిసిపోయింది కళ్యాణికివ్యతిరేకంగా తిరుగుబాటుచేసి నీతో సంబంధాన్ని పెంచుకోగలను. కాని నా సంతానం దృష్టిలో ఆ బంధాన్ని ఎలా నిలుపు కోవడం? వాళ్లు మన గురించి యేమని ఆలోచిస్తారు? నేను ఎవ్వరినైతే నా జీవి తానికి ప్రేరణా స్రోతస్సు అని అనుకుంటున్నానో వాళ్లు ఆమెను మా పచ్చని

సంసారంలో చిచ్చు పెట్టిని ఓ కపటిలా, కులటలా, నీచురాలిగా భావిస్తారని, అలాంటి భావాన్ని వాళ్లు ప్రకటిస్తే నేనెలా సహించగలను? పోనీ నా కుటుంబంతో నిజాయితీగా బ్రతుకుదామనుకున్నా నాకు నీతో ఈ బంధాన్ని తెంచుకోవడం తప్పనిసరి. నీ వల్లకూడా నిజాయితీగా వుండలేను. మన ఈ బంధాన్నే సత్యం అని భావించానా ఆ నా జీవితం అంతా అబద్ధం అని అనుకోవాల్సి వస్తుంది."

"ఎందుకు?"

"నువ్వులేనిదే నేను జీవించలేనని ఒప్పుకుంటాననుకో. అలాంటి పరిస్థితుల్లో నా ఇంట్లోంచి బయటికి రావడం వినా వేరే గత్యంతరం లేదు. ఇల్లుగడవడానికి కావలసినడబ్బు సమకూర్చడం వినా మరేసంబంధం పెట్టుకోననుకో. అలా చెయ్యడంలో కూడా ఇంకో పేచీవుంది. నీతో నీ ఇంట్లో నేను వుండలేనుకదా. నీ డబ్బుకోసం నేను నా భార్యా బిడ్డల్ని ఒదిలేసానని ప్రపంచం వేలెత్తి చూపుతుంది".

"నువ్వు ఇల్లు ఒదలాల్సినంత ఆపద ఏమొచ్చింది? చీటికి మాటికి ఇంటితో తెగతెంపులు చేసుకుంటానంటావ్. అసలీ ఆలోచనే నీ కెందుకు కలగాలి?"

"వేరే వుపాయం లేనప్పుడు ఏంచెయ్యాలి?"

"డోన్ట్ బి వర్రీ డార్లింగ్, అవసరానికి మించి అవేశాన్ని తెచ్చి పెట్టుకుంటున్నావు. రెండూ వాస్తవాలే. కళ్యాణి, పిల్లలు నీకు చాల అవసరం. వారిని వదలేసావంటే నీలో మానవత్వం అనేది కరుడుకట్టినట్లే. ఇక నీవూ—నేనూ కావాలనుకుంటే మనం ఇద్దరం ఎప్పటికీ విడిపోవచ్చు. కానీ అలా చేసినరోజు మన ఇద్దరి జీవన దీపాలు ఆరిపోతాయి. ఇప్పుడే అన్నావుగా, మనం సగం జీవితాన్ని దాటేసాం అని. ముదిరే వయస్సులో ప్రేమ అనేది శారీరక సుఖం కంటే ఆత్మల కలియిక మీదనే ఆధారపడుతుంది. పదిహేను ఇరవై సంవత్సరాల క్రితం-కనీసం ఎనిమిదీ పది సంవత్సరాల క్రితం నువ్వు నా జీవితంలోకి వచ్చి

వుంటే వర్షం జల్లులా వచ్చి వెళ్ళిపోయి వుండేవాడివి. నెలో రెండునెల్లో మహా అయితే ఐదారు నెలలు నీ వియోగాన్ని మోస్తూ పిచ్చిదాన్నయ్యేదాన్ని. మళ్ళీ క్రమక్రమంగా అంతా మరచిపోయేదాన్ని. కాని ఈ వయస్సులో అంత కఠోర దీక్ష పూనలేను"

"పూనడానికి ప్రయత్నించు షీలా-తప్పక ప్రయత్నించు. నీతో కలిసి వుండే నా జీవితం సుఖపూరితం అవుతుందేమోకాని నువ్వు మాత్రం ఏమీ పొముకోలేవు. మహీపాల్ ఇకలేడనుకో. లేకపోతే నిన్ను దగాచేసి వెళ్లాడనుకో. నీ మనస్సును ఏదో రకంగా సమాధానపరచుకో. హాయిగా నీకు అన్నివిధాలా నచ్చిన మరో వ్యక్తిని పెళ్ళిచేసుకుని సుఖించు. జీవితంలో శాశ్వతంగా మానవ సంఘానికి పెళ్ళి అనేది ఎంతో అవసరమైన రివాజు. ఒడుదుడుకుల్లేకుండా మానవుల మనుగడకు చాలా అవసరమైన మహోన్నత సిద్ధాంతం. ఇకనైనా నువ్వీ విషయాన్ని అంగీకరించాలి"

"ఒప్పుకున్నానలే కాని నాకు పెళ్లి అయిపోయింది. వివాహ ప్రస్తావన మళ్ళీ నా దగ్గర తీసుకరావద్దు."

"కర్నల్ సాహెబ్ గారు టెలిఫోను చేశారండి'' అంటూ పరదా వెనుక నిలబడి అన్నాడు, నౌకరు. ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని తెల్లబోయారు.

"ఎవరిని అడుగుతున్నట్లు?' అనిషీలా మహీపాల్‌వైపు చూస్తూ అడిగింది.

"తమరి గురించి అడిగారండి. వారినీ అడిగారండి"

"నువ్వెళ్ళి మాట్లాడు. నేనిక్కడవున్నట్లు కర్నల్‌కి తెలిసిపోయింది. ఒక వేళ నా గురించి అడిగితే నేను ఎవ్వరినీ కలియతలంచుకోలేదని చెప్పు"

షీలా లేచి టెలిఫోన్ దగ్గరకెళ్ళింది. కలత చెందిన మనస్సుతో మహీపాల్ మంచం మీద వాలాడు, "బహుశా ఇంటికి వెళ్ళి అడిగివుంటాడు. నిన్నటి నుంచి ఇంటి ముఖం చూడలేదుగా. పిల్లలూ, కళ్యాణి అంతా కంగారు పడుతుండొచ్చు. కంగారు పడనీయ్. చరిత్రను పోగొట్టుకున్న తండ్రి తన ముఖాన్ని

పిల్లలకు ఎలాచూపించగలదు? కళ్యాణి ఎంత మూర్ఖురాలు? వెనకాముందూ ఆలో చించకుండానే అందరి ముందు నా ఇల్లు పీకి పందిరివేసింది. ఎంతపాడాపని చేసింది? నేనింకా దాని ముఖాన్నే చూడను-ఎప్పటికీ చూడను''

అంతలో షీలా గదిలోకి వచ్చింది. "నిన్నంతా నువ్వెక్కడవున్నావు?" అని ప్రశ్నించింది.

కళ్ళు మూసుకొని అలానే పడివున్నాడు మహీపాల్, షీలా అడిగినదానికి జవాబు ఇవ్వకుండా. ప్రశ్నను మళ్ళీరెట్టిస్తూ అంది "నిన్నటినుంచి నువ్వు ఇంటికి వెళ్ళలేదు. ఎంత ఘోరం"

ఈసారి కూడా మహీపాల్ ఏమీ తొణకలేదు. అతనికి దగ్గర కూర్చుని అతని తలలోకి వేళ్ళను పోనిస్తూ షీలా "ముందు భోజనం చెయ్యి. తర్వాత నేనే దిగబెట్టి వస్తాను. లే భోజనానికి" అంది.

"నేను ఇంటికి వెళ్ళను. రాత్రంతా నిద్రలేదు. ఈపూట ఇంటికి వెళ్ళా నంటే రాత్రంతా మళ్ళీ కీచులాటలతోనే వెళ్ళబుచ్చాలి. నేనుచాలా అలసిపోయాను. ఎవరైనా ఏకొద్దిగా వ్యతిరేకించినా ఒప్పుకోలేని స్థితిలో వున్నాను....కర్పాల్‌కు ఫోనుచెయ్యి. ఇంటికి వెళ్ళి పిల్లలకు చెపుతాడు. నా గురించి కంగారు పడొద్దని. నేను సజ్జన్ ఇంటికెళ్ళి పడుకుంటాను"

రాత్రంతా మహీపాల్ శివాలయంలో మేల్కొని గడిపినట్టు మాటల సందర్భంలో షీలాకు తెలిసిపోయింది. రాత్రి అంతా గజగజవణుకుతూ గడిపాడని తెలియగానే మహీపాల్ పై షీలాకు జాలికలిగింది. అతణ్ణి వెళ్ళనివ్వలేదు. షీలాకూ తనకూ ఏర్పడిన నాలుగు సంవత్సరాల అనుబంధంలో మొదటి పర్యాయం మహీపాల్ రాత్రంతా ఆమె ఇంట్లోనే గడిపాడు.

# 23

మనసులో దొంగను దాచుకుని మానసచోరుని లీలా స్థలికి వచ్చాడు సజ్జన్. పశ్చాత్తాపం అనే అగ్నిలో అతని అహంకారం కాలికాలి ఆవేదనా వేడిమికి ఆర్ద్రమైంది. అతను బృందావనం వస్తోంటే వెంట వనకన్య కూడా అతణ్ణి పరీక్షిస్తున్నట్టుగా తోడు వచ్చింది. రెండు రోజులు ఇద్దరూ కలిసి మధురలో మకాం చేయడంతోటే అతని మనస్సు పరిపరి విధాల పోతూ నిగ్రహం తప్పడం ప్రారంభించింది. ఇది ఆచారంగా అతను పుట్టికి వచ్చుకున్న వైష్ణవ సంస్కారం, శ్రీకృష్ణుని వుపాసించే తల్లి సేవాపరాయణత్వం ఈ రెండూ కలిసి అతణ్ణి శ్రీకృష్ణుని పాదాలపై పడి వేడుకొనమని ప్రేరేపించాయి.

కన్య అతణ్ణి తన వైపు లాక్కుంటూ వుంది. కాని అతను మాత్రం ఆమె చెలిమి వదిలి కృష్ణపరమాత్ముని సేవకే అంకితమై పోవాలని తీర్మానించు కున్నాడు. మనస్సును నిగ్రహించుకుని బ్రహ్మచర్య పరిపాలన చెయ్యాలని నిశ్చయించు కున్నాడు. మధురా వచ్చినా స్వర్గసుఖాలైన కన్య వదినగారి విషయంలో నడుస్తోన్న కోర్టు వ్యవహారంలో అతను కొంచెం కూడా పాలు పంచుకోలేదు. మధురలో దిగీ దిగడంతో కన్యను ఆమె మానాన ఆమెను వదిలేసి వూరంతా తిరగడం మొదలెట్టాడు. విశ్రామ్‌ఘాట్, ద్వారకాధీశ్, కిశోరీ రమణ్ బిహారిణీ, రాధాకృష్ణ మొదలైన పేరుపడ్డ దేవాలయాలకు వెళ్లడం. అక్కడి దేవుళ్ళను దర్శించుకోవడంలో మునిగిపోయి, ఒంట్లో జీర్ణించుకుని పోయిన ఆంగ్ల సంస్కారాల్ని తుడిచివేసి వాటి స్థానే హిందూ వైష్ణవ సంస్కారాల్ని [illegible]వంతంగా వంట పట్టించుకునే ప్రయత్నంలో వున్నాడు. ఈ గడ్డమీద ఎంతో మంది సామాన్యుల్ని అసామాన్యులైన వ్యక్తులుగా మార్చగలిగిన భక్తి అనే ఆ విశాల జలపాతాన్ని తనలో కూడా సృష్టించుకోవాలని సజ్జన్ చూస్తున్నాడు. సూర్, మీరా ఇంకా ఎందరెందరో వ్యక్తుల హృదయాల్లో ప్రేమాగ్ని రగుల్కొలిపిన ఆ లీలామయుడు ఎవరు? అతను ఏమిటో.

తనలో వున్న ఈ భావం ఏ విగ్రహంలో కనపడుతుందా అని ప్రతి గుడినీ ప్రతి గోపురాన్నీ తొంగి చూశాడు మొదట్లో. కాని గోకులం గారాల

బిడ్డదు అతనికి ఎక్కడా కనిపించలేదు. అంతటా నిర్మలమైన, ప్రశాంతమైన నిష్కలుషమైన ఆచారాలూ, అలవాట్లూ, అలంకారాలు, ఆభరణాలూ తొడుక్కున్న ఆడంబరత్వమే అతనికి కనిపించింది.

మధురను సందర్శిస్తోన్న సజ్జన్‌ని జట్కావాలా శ్రీకృష్ణుడు పుట్టిన చోటుకు తీసుకు వచ్చాడు. ఇది అఖిలచరాచర జగత్తును సంకల్ప మాత్రంచే పుట్టించిన కృష్ణపరమాత్ముడు స్వయంగా పుట్టినచోటు సజ్జన్ మనసంతా ఓ విచిత్రమైన కుతూహలంతో నిండి పోయింది. పరమాత్ముడిగా మారి ఇంత విశాల దేశంలో ఇంటింటా పూజింప బడుతున్న కృష్ణుడు పుట్టినచోటు. భగవానుడు మానవుడిగా పుట్టాడు. ఈ భూమిపై పుట్టిన కంసుని చెరసాలలో పుట్టాడు.

శ్రీకృష్ణుడు జన్మించిన చెరసాల మొదలైనవన్నీ సజ్జన్ కళ్ళకు కట్టి నట్లయింది. భగవంతుడుపుట్టిన స్థలంలో మహమ్మదీయ మందిరం కట్టివుండడం చూశాడు. ఆదృశ్యాన్ని చూడగానే అతను నిశ్చేష్టుడయ్యాడు. అతనిలో హిందు మతాభిమానం దెబ్బతింది. ఔరంగజేబు ఈ ప్రదేశాన్నంతా తవ్వించి మసీదు కట్టించాడు" అంటూ టాంగావాలా గతించిన చరిత్ర చెప్పుక పోతున్నాడు.

సజ్జన్ మనసంతా మతాభినివేశంతో పొంగి పోయింది. ఆ ఉప్పెనలో కృష్ణపరమాత్ముని జన్మస్థలం మీద భగ్నశిథిలా వశేషాల బొద్దు మీద చలువ రాతితో నిర్మించిన మసీదులా వనకన్య కళా విహీనంగా నిలబడి వున్నట్లు తోచింది. కృష్ణుని జన్మస్థలం మీద మసీదు, కన్య- వీరిద్దరినీ మనసులోంచి తొలిగించుకుని శ్రీకృష్ణ కర్ణామృతంతో దాన్ని నింపాలను కున్నాడు. ఔరంగ జేబు– మసీదు- వనకన్య– ధ్యానముద్ర– ఆ రెంటిని తలుచు కుంటే అతనిలోని నమ్మకం సడలి పోతోంది. సడలి పోతున్న మనసును అతను చిక్కబట్టు కున్నాడు. దిగజారి పోతూన్న మనో నిబ్బరాన్ని శ్రీకృష్ణునివైపు మళ్ళించి తన అశాంతి స్థితినే రూపు మాపాలను కున్నాడు.

మసీదు కింద వున్న ఓ భగ్నావశేషంపై చెయ్యి వుంచి నిలబడి వున్న సజ్జన్ మనసు రెక్కలు ఆడించు కుంటూ శ్రీకృష్ణుని చెరసాలలో వాలింది.

మసీదు మీద దృష్టిపడింది. క్రోధంతో మండి పడ్డాడు. మ్లేచ్ఛుల శక్తికి ప్రతీకగా వున్న మసీదు సంస్కారాల ఇటుకలతో నిర్మించుకున్న అతని ఊహా సౌధం మీదకు పోవడానికి అడ్డం వస్తున్నట్లుగా భావించాడు. మసీదు ఇక్కడలేక పోతే ఎంత బావుండును అని అనుకున్నాడు.

అజంతా, ఎల్లోరా గుహలూ, ముసల్మానులు ధ్వంసం చేసిన సోమనాథ్ దేవాలయం, విశ్వనాథుని దేవాలయం, ఇంకా తెలిసీ తెలియని ఎన్నో దేవాలయాల విగ్రహఖండాల్ని చూసి అతని మనస్సు క్షోభించింది. ఇక్కడున్న కేశవుని దేవాలయాన్ని ధ్వంసం చేసి మసీదు కట్టినట్లే ఢిల్లీలో జుమా మసీదును పడగొట్టి దానిస్థానే కేశవ దేవాలయాన్ని నిర్మించి వుంటే ముసల్మానులకి ఎలా వుంటుందా అని ఆలోచించ సాగాడు.... కాని విచిత్రం ఏమిటంటే సజ్జన్ మిత్రమండలిలో ఎంతో మంది ముసల్మానులు వున్నారు, వాళ్ళలో చాలా మంది ఎంతో మంచివారు, ముసల్మానుల్లో ఎంతో మంది గొప్ప గొప్ప సూఫీసాధువు లయ్యారు. మసీదులో వాళ్ళు దర్శించుకొన్న ఖుదా, కబీరుదాస్ గుర్తించిన నిర్గుణ నిరాకార రాముడూ, చైతన్య మహా ప్రభు, రసఖాన్. మీరా మోహించిన కృష్ణుడు, సూరదాసు, తులసీదాసు భక్తితో సేవించి తరించిన భగవానుడు వేరు వేరు కాదు. ఈ ముసల్మానులూ, హరిజనుల ముందు కోటి సవర్ణ హిందువులు దిగదుడుపు అన్నాడు రాజర్షి భారతేందు.

మసీదుపై తనలో కలిగిన ప్రతీకారాగ్నికి సజ్జన్ చాలా సిగ్గుపడ్డాడు. ఈ మసీదును పడగొట్టడం కానీ జుమా మసీదును ధ్వంసం చేసి దాని మీద కేశవాలయాన్ని నిర్మించడం కాని అతనికి నీచంగా అసహ్యంగా తోచింది. అతనెంత మతసహనం కలవాడైనా కృష్ణపరమాత్ముడు పుట్టిన చోటులో మసీదు వుండ దాన్ని హర్షించ లేక పోయాడు, అతని మనస్సు దాన్ని గురించి క్షోభిస్తూనే వుంది. మిథ్యా డాంబికాన్ని ప్రదర్శించే ఈ మత దురహంకారాన్ని అతడు క్షమించలేడు. గతించిన దాన్ని తిరగ తోడుకుంటే ప్రయోజనం లేదు. భవిష్యత్తులో ఇలాటి అనర్థాలు రాకుండా నివారించాలి. వాటిని పోట్లాడి ఎదుర్కొవాలి. అటువంటి విభిన్న ప్రవృత్తులతో ఘర్షణ పడటం మానవుని కనీస ధర్మం.

"ఇంత వరకూ జరిగిందేదో జరిగిపోయింది. ఇకముందు వనకన్యతో ఎలాటి ప్రమేయం పెట్టుకోడు. ఆమెను అసహ్యించు.... అతను ఎవర్నీ అసహ్యించుకోలేడు. ఇలాంటిది కన్యను అసహ్యించు కోవడం కంటే వేరే ఘోర అన్యాయం మరిలేదు. కన్య చరిత్ర బలమే అతనికి జీవితంలో ఓ కొత్త పుంతను ప్రసాదించింది. నిజానికి అతనే కన్యపట్ల నీచంగా ప్రవర్తించాడు. కామ క్రోధ వాసన అనే మైకంలో పడి అతను వాస్తవాన్ని విస్మరించాడు. మొన్న ఆ సంఘటన జరిగి నప్పట్నుంచి అతను కన్యముందు తలెత్తుకోలేక పోతున్నాడు. కన్య గొప్పది. నేనే నీచుణ్ణి. లైంగిక వాంఛను వంటి నిండా పులుము కున్న పురుగును. నాకు ఆత్మాభిమానం లేదు. నేనుత్త గర్వ పోతును. గర్విష్ఠి ప్రపం చంలో ఏకార్యం సాధించలేడు. నేను దేన్ని చూసి గర్వపడాలి? వంశ పారం పర్యంగా దిగుమతి అవుతున్న ఐశ్వర్యాన్ని చూశా? ఈ జగత్తంతా మూలం ధనం అని అనుకొనే భావం ఎన్నాళ్ళు పూజిస్తారు జనం? మహా అయితే పది పదిహేనేళ్ళు. లేక గొప్ప చిత్రకారుణ్ణి అనా గర్వపడాలి? అంటే తీరిక ఘడి యల్లో కూడ నన్ను నేను మోసం చేసుకోనా?"

ఆత్మ క్షోభతో సజ్జన్ నీరు కారాడు. అంగ్ల సంస్కృతి, సతీత్వం, పది మందిలో మంచితనం, యోగ్యతా అనే చిన్న చిన్న శిఖరాలున్న హిమాలయం కరగడం మొదలెట్టగానే అవి మీద వుండలేక కొండ వాగులా వరవడి కలిగి. గుండెల్ని పండిస్తూ తీరా మైదాన ప్రాంతంలోకి వచ్చేసరికి విస్తృతమైన గంగ అయింది. కృష్ణుని లీలా భూమి సందర్శించు కోగానే అతని అనుభూతి పరిధిలోకి వచ్చిన విన్నపాలు ప్రార్థించడం మినహా మరో వేషాన్ని తగిలించు కోలేక పోయాయి.

నల్లని ఉన్ని పోగుల్లా ముడుచుకుంటూ రాత్రి తన నల్లకంబళిని భూమి మీద పరచివేసింది. ఆందోళనా దారాలు ఒకదానితో ఒకటి జత అల్లుకుంటూ కన్య మనస్సుమీద నల్లని చీకటిలా వ్యాపించాయి. "ఆయన ఎక్కడ దిగబడి పోయారో? ఆయనకేమైనా మతి చలించిందా?"

ఊరు చూద్దామని వూళ్లో అడుగు పెట్టగానే బయలుదేరిన సజ్జన్ ఎంతకూ ఇంటికి రాకపోయేటప్పటికి కన్య పడిన తంగారు. అంతా ఇంతాకాదు. వచ్చి పోయిన వదినగారి అవిటి స్నేహితురాలు సజ్జన్ గురించి ఇప్పటికి కనీసం పది సార్లైనా అడిగింది. ఆమె భర్త లాలామురళీ మనోహర్ కొట్టుదగ్గర నుంచి వచ్చి చాలా సార్లు సజ్జన్ రాలేదని అడిగి తెలుసుకున్నాడు. పగలు చేసిన వంటఅలాగే నీళ్ళు కారిపోయింది. రాత్రి భోజనానికని చేసిన కూరలు కూడా తినేవాడు లేక మొగుడు లేని ముత్తైదువలా రుచిహీనంగా వున్నాయి. సజ్జన్ శ్రీమంతుడు - ఈ ఇంటికి ఒకవిధంగా అల్లుడిపేరు పెట్టి పిలిపించుకున్న వ్యక్తి ఎక్కడికి వెళ్ళి నట్టు? ఎందుకు తిరిగిరానట్టు? పోలీస్ స్టేషన్లో రిపోర్టు ఇస్తే దావుండును.

ఇంటి అల్లుడు గారు కళాకారులని బలవంతంగా నవ్వుతెచ్చుకుంటూ వాళ్ళకు నచ్చచెప్పింది. ఆయనగారిలా చెప్పకుండా మాయంకావడం అప్పు డప్పుడు సహజమేనని దాన్ని గురించి చింతించాల్సిన అవసరం వద్దని చెప్పింది. గుళ్లను చూద్దామని బయల్దేరాడు. బృందావనానికి అటునుంచే వెళ్ళివుండొచ్చుఅని కూడా వాళ్ళకు చెప్పింది కన్య.

రాత్రి అయ్యేసరికి గదిలోకి వెళ్ళి ఒంటరిగా వెక్కి వెక్కి ఏడ్చింది.సజ్జన్ కొరత-ఆమెను ఇలా ఒదిలేసి వెళ్ళిపోవడం వా-నవతి అయిన కన్య సహించలేదు. క్రాంపతీని లక్నో వెళ్లిపోలేదుకదా. అలా అనుకోవడానికి ఏ విషయం గురించి తర్జన కూడ జరగలేదాయె. మొన్న హృదయం జరిగిన సంఘటన తర్వాత ఆయన మనోనిగ్రహం వహించలేకపోయారు. నేను నా వైపు నుండి మాట ఇవ్వడంలో ఏ మాత్రం లోటు రానివ్వలేదు. వారు తప్పుచెయ్యడానికి కారణం నేను. ఈ మాట వారికి చెప్పేసాను కూడ. ఇప్పుడు స్వయంగా అనుకుంటున్నాను. అను భవిస్తున్నాను.

కన్య మూర్తీభవించిన అహంకారం. ఆమెలో వున్న నైతికబలం ఆ అహంకారానికి కావలసిన ఎరువుగా పనిచేస్తూ రోజురోజుకూ ఒంగని మానులా పెంచి పోషిస్తోంది. ఇంటిలోవున్న పాపపంకిల వాతావరణానికి వ్యతిరేకంగా ఆమె, ఆమె అన్నగారూ ఆత్మతేజాన్ని గ్రహించి వాళ్ళ వ్యక్తిత్వాలను సంత

రించుకున్నారు. తన వివాహం విషాదాంతం అవడంతో జీవితంతో పోరాడి అన్న గారి మతిభ్రమించింది. అన్నగారి మానసిక రుగ్మత నుంచి ఆమె గుణపాఠం నేర్చుకుని తన నైతిక బలాన్ని మరింత దృఢంగా చేసుకుంది. అయితే ఈ సంఘటనవల్ల ఆమెలో తిరుగుబాటు చేసే మనః ప్రవృత్తి ఎక్కువ అవడానికి వీలు కలిగింది. తన ఇంట్లో జరుగుతున్న దుర్మార్గాల్ని వాళ్ళముందే నిర్భయంగా విమర్శించడం మొదలెట్టింది. ఆమెకి ఓ క్లాసుమేటు వుండేది. అభ్యుదయ భావాలు వున్నా స్నేహితురాలి సాంగత్యంలో ఇండియన్ పీపుల్స్ థియేటర్, కమ్యూనిస్టు పార్టీ వ్యక్తులూ, మార్క్సు సిద్ధాంతంతో ఆమెకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఆమెలో తిరుగుబాటు తనానికి ఈ సాంగత్యం మంచి ఊతను ఇచ్చింది. కాని గురువైన అన్నగారి నీడలో ఆమె పెరిగి పెద్దదయిందో ఏమో ఆమె అంతరాత్మ తిరుగుబాటుచేస్తున్నా ఆమెలోనాటుకున్న ఆస్తికచింతన నశించలేదు. అందుమూలాన మనస్సును సంతోషపెట్టేమేరకు ఆమె అభ్యుదయభావాలుకల వ్యక్తిగా మారగలిగింది. కాని అంతకు మించి ఎల్లల్ని దాటలేకపోయింది. ఆమె లోని బుద్ధి, భావనలు చిక్కుల్ని అల్లుతూ ఆమెలో మాటి మాటికి మానసిక సంఘర్షణకు దారితీస్తున్నాయి.

చుట్టూవున్న ముడులతోపాటు మరోముడి ఆమెను లోలోపలే ఎంతోకాలాన్నుంచి సతమతం చేస్తోంది ఇదామె వ్యక్తిగతానికి సంబంధించిందికావడంవల్ల బయటికి చెప్పుకోలేదు. అన్నగారిపట్ల గౌరవభావం చేత ఆయన ముందు చెప్పటానికి జంకుతూ వచ్చేది. బయటివాళ్ళకు చూదాయగానైనా చెప్పదాం అంటే ఆమె శీలాన్నే శంకించవచ్చు. ఇప్పుడామె వయస్సు ఇరవైనాలుగు సంవత్సరాలు, శారీరకంగా ఆమె ఈ రోజుకూ బ్రహ్మచారిణే. ఆమె వుంటున్న వాతావరణంలో ఆమె శీలం ఇంకా పవిత్రంగా వున్నదంటే దానిక్కారణం ఆమె ఆ వాతావరణంతో నిరంతరం ఘర్షణపడుతూ తన శీలంసంపత్తిని కాపాడుకోవడానికి అవసరమైన సంస్కారాల్ని పెంచుకుంటూపోవడమే. అయితే ఆమెలోని సంస్కారాలు ఆమె శీలాన్ని కాపాడగలిగాయేకాని పూర్తిగా ఆమెలోని లైంగిక వాంఛను అణిచి సన్యాసినిగా చేయలేకపోయాయి. పురుషుని సంపర్కంకోసం

ఆమెలో వ్యక్తమయ్యే తహతహను వయస్సు బంధించలేకపోయింది. ఒకవైపు తండ్రి చేసే వికృతచేష్టలు, పిన్నమ్మ చరిత్రహీనత, ఆమె అందమైన యవ్వనాన్ని గడగడతాగెయ్యాలని చూస్తోన్న మగపురుగుల చూపుల దాహం. రెండోవైపు కామవాంఛ వికారంలాంటిదని చెపూతూ దానిని జయించాలని మహాపురుషులు చేసే బోధనలూ ఆమె వ్యక్తిత్వంలోని రెండు పొరల్ని పైకెత్తి ఆమెను రాపాడుతోంటే వాటిమధ్య ఇరుక్కుని మధ్యమార్గం కనపడక అవస్థపడుతుండేది సమాజంద్వారా శాపగ్రస్తమయి మరణించిన ఆమె వదినగారు, ప్రవృత్తి రీత్యా శాపంలా తయారైన ఆమె అన్న భార్య ఈ రెండు నిదర్శనాలు పురుషులంటే ద్వేషించుకునేటట్టు చేసాయి ఆమెను. ఆమెలో కలిగిన సామాజిక చైతన్యం ముఖ్యంగా భారతీయ సమాజంలో స్త్రీలు ఇంత దుర్గతిపాలవడానికి పురుషుడే కారణం అన్న సిద్ధాంతాన్ని నమ్మడానికి ప్రోత్సాహం ఇచ్చింది. ఆ నమ్మకమే ఆమెలోని ఆత్మాభిమానాన్ని రేకెత్తించింది. పురుషుడు అంటే ఆమెలో తిరుగుబాటు ధోరణిలో మాట్లాడటానికి నాంది పలికింది. అయితే ఒకటి రెండు సంవత్సరాల నుంచి ఆమెలోని తీవ్రధోరణిలో కొంత సడలింపు కనపడసాగింది. ఆమెలోని ఉగ్రత్వం తగ్గి ప్రశాంతత, మనోనిగ్రహాన్ని సంతరించుకోసాగింది. దానిఫలితంగా ఆమెలాంటి సంస్కారాలూ,భావాలూ వున్న ఎవరైనావ్యక్తి ఆమె జీవితంలో భాగస్వామి అవడానికి ముందుకొస్తే అతన్ని వివాహంచేసుకోవడానికి తీర్మానించుకుంది.

తన వదినగారు ఆత్మహత్య చేసుకున్న సందర్భంలో పోలీసులు ఆమె ఇంటికి విచారణ చేయడానికి వచ్చారు. అలాంటి సమయంలో తనకు సజ్జన్ తారసిల్లాడు. చిత్రకారునిగా సజ్జన్‌కు వున్న ప్రసిద్ధి ఆమెకు తెలిసినదే. అభ్యుదయభావాలు కలవారు అతన్ని తమలో కలుపుకోకపోయినా అతని వున్నత ఆదర్శాల్ని మాత్రం పొగిడేవారు. అంతకుముందు జరిగిన ఒచిత్రప్రదర్శనంలో తాను సజ్జన్ చిత్రాల్ని చూసింది. దూరాన్నుంచి సజ్జన్‌ని స్వయంగా చూసిందికూడా. ఈవిధంగా సజ్జన్‌తో ఆమె కలయిక అతని పేరుప్రఖ్యాతులూ, ఆదర్శాలూ పతాకస్థాయిని అందుకున్న సమయంలో జరిగింది. అదీకాక తన

వదినగారి వ్యవహారంలో అతను ఆమెకు ఎంతో సహాయం చేశాడు. స్వతహాగా సజ్జన్ మంచిస్ఫురద్రూపి. ఆకర్షణీయమైన వ్యక్తిత్వం కలవాడు. ఇవన్నీ కలిసి ఆమెలో సజ్జన్‌పట్ల కృతజ్ఞతా భావాన్ని రేపాయి. తర్వాత ఆమెవైపు సజ్జన్ చాలా త్వరత్వరగా ఆకర్షింపబడటం, తనతో వివాహప్రస్తావన చెయ్యటం అన్నీ వేగంగా జరిగిపోయాయి.

జీవితంలో మొదటిసారిగా ఓ పురుషుని ఆకర్షణాపాశంలో చిక్కుకొన్నట్లు కన్య భావించింది. స్వభావసిద్ధంగా పురుషులంటే ఈసడించుకొనే మనస్తత్వం ఉన్న వనకన్య—పురుషులంటే హీనదృష్టిని అలవాటు చేసుకున్నా కన్యకు సజ్జన్‌తో ఏర్పడుతున్న ఈ చిత్రబంధాన్ని స్వీకరించాలంటే సంకోచం కలిగేది. బహుశా అదేకారణం కావచ్చు ఆమె తనవైపు ఆకర్షింపబడుతున్న సజ్జన్‌ని ఒకవైపు ప్రోత్సహిస్తూ మరొకవైపు అతణ్ణి నిరుత్సాహపరుస్తూ వుండేది.

ఇంట్లోంచి వెళ్ళగొట్టబడిన కన్య బోయీలబస్తీలో అద్దెఇల్లు తీసుకునివుండగా ఆమె తండ్రి నియోగించిన కిరాయి రౌడీ మూకలు ఆమెను చూసినపుడల్లా ఈలలు వేస్తుండేవారు. అసభ్యకరంగా సౌంజ్ఞలు చేసే వారు. వాళ్ళను చూసి ఆమె చాలా భయపడి పోయింది. సమాజంలో గౌరవంగా బతకాలను కున్న ప్రతిస్త్రీ ఎవరో ఒక పురుషుణ్ణి జీవిత భాగస్వామిగా చేసు కోవడం అవసరం అన్న నిర్ణయానికి వచ్చింది. సజ్జన్‌తో ఆమెకు వున్న పరిచయం మరింత గాఢంగా పెనవేసుకుంది. అతని కున్న అన్ని ఇళ్ళల్లో ఏఇంట్లో వుండమని సజ్జన్ బ్రతిమాలినా ఆమె అంగీకరించలేక పోయింది. అయితే కర్నల్ ఇంటిలో వుంటూ కూడా తాను సజ్జన్ పంచనే వుంటున్నట్లు భావించేది. మధురకు వెళ్లాలను కున్నపుడు ఒక్క సజ్జన్ మినహా ఎవరితోనైనా— అన్న సమానులైన కర్నల్ సాహెబ్‌తో కూడా వెళ్ళడానికి ఆమె సంకోచించింది.

మొన్న సజ్జన్ ఆమెపై విచిత్రంగా దెబ్బ తీశాడు. అతనిలా చేస్తాడని తను కలలో కూడ ఊహించలేదు. ఆమెలోని ఆత్మాభిమానం దెబ్బ తిన్నట్లయింది అయినా సజ్జన్ తన విషయంలో చేస్తోన్న ప్రయోగాలు చూసి ఒక్క లోలోన

పులకరించేది. ఆమె మనసుకు తెరవి కలిగేది. పైదృష్టికి అందకుండా లోలోనే అర్థం కాని వాదాల్ని సృష్టించుకుంటూ సజ్జన్ ఆమెపై విసిరిన వుచ్చును ఆమె మరింత గట్టిగా బిగించుకుంటూ పోయి ఆ తర్వాత తెలివి తేటలతో ఆమె ప్రవర్తిస్తూ సజ్జన్‌లో పశ్చాత్తాపాగ్నిని చల్లార్చడానికి తయారయింది. అతను చేసిన తప్పుకు తానే బాధ్యురాలిని నిర్ణయించుకుని సజ్జన్ ఈ పర్యాయం వివాహ ప్రస్తావన తీసుకొస్తే తాను వెంటనే అంగీకరించడానికి సంసిద్ధురాలైంది.

కాని ఇవ్వాళ జరిగిందేమిటి? సజ్జన్ ఆమెకు చెప్పాపెయ్యకుండా వెళ్ళాడు. ఆమెను ఒదిలెయ్యాలనే వుద్దేశం అతనికి వుండే పరాయి దేశంలో, పరాయి యింట్లో, తనకు ఏమీ చెప్పకుండా పెట్టకుండా అందరిలో నవ్వుల పాలు చేస్తూ వెళ్ళి పోవాల్సిన అగత్యం ఏమొచ్చింది? రమా వదినగారు ఏమను కుంటుందో? ఆమె, ఆమె భర్త ఇద్దరూ గదిలో కూర్చుని తన గురించీ, సజ్జన్ గురించీ మాట్లాడు తూవున్నారేమో! ఏమని అను కుంటున్నారో కదా! నన్ను పదిమందిలో తలెత్తుకోవడానికి వీల్లేకుండా చేసాడు సజ్జన్- పరువును బజారు పాలు చేశాడు.

నీటిలోంచి తీసి గట్టుమీద వేసిన- చేప పిల్లలా గిలగిలా తన్నుకుంది. అలా ఆమె ఎంత సేపు ఏడ్చిందో! ఏడ్చిఏడ్చి ఆమె కళ్ళు పొడికట్టాయి. బరువుగా వున్న గుండె తేలిక పడింది. మనస్సంతా ఒకేభావంతో నిండింది. ఆమె కళ్ళల్లో ఒకే రూపం నిలిచింది. అంత చదువూ, చురుకు దనం, ఆవేశానికి మారు పేరు పెట్టుకున్న వనకన్య కావ్యాల్లో వర్ణించిన జోగినిలా మతిభ్రమించి స్తంభించి పోయింది. కార్ల్ మార్క్స్, మహాత్మాగాంధీలు ప్రతిపాదించిన సిద్ధాంతాలు, చర్చలు- పరిచర్చలు, ఎలక్షన్, రాజకీయాలు, స్త్రీ స్వాతంత్ర్యం, సాహిత్యం, కళ, సంస్కృతి, జ్ఞానార్జనం, విజ్ఞానం అంటే విరుచుకపడే కన్య నిద్దరోతున్న దేవాలయంలా అన్నీ మరచి పోయింది. అయితే ఆమె నిద్ర, ఆ అపస్మారక జడత్వం కాదు. మానవుడు తన్ను తాను పోగొట్టు కొని ఆత్మ సాక్షాత్కారాన్ని పొందే మెలకువలా వుంది. ఇప్పుడు కన్య వనకన్యగా లేదు. ఆమె నరనరాన ఒకే ఆకారం, ఒకే పలవరింత, సజ్జన్. ఆమె శరీరంలోనూ, ఆత్మలోనూ అన్నింటా అతను వ్యాపించి పోయాడు.

బృందావనం అంతా తిరిగితిరిగి అలసి పోయిన సజ్జన్ అక్కడే ఓ ధర్మ శాలలో కూర్చుని రాసనృత్యం చూస్తున్నాడు. కృష్ణభక్తి పరాయణులైన కొంత మంది గుజరాతీ సేఠ్‌లు తమ కోసం అని ఈ ప్రదర్శనాన్ని ఏర్పాటు చేసు కున్నారు. బయటి వాళ్ళు కూడా ఓ పాతిక మంది రాస కార్యక్రమాన్ని చూద్దాని కని వచ్చారు. సజ్జన్ ఆధర్మ శాలలోనే ఒకగది తీసుకొని వున్నాడు. బృందా వనం రాకముందు సజ్జన్ ఎన్నో కలలు కన్నాడు. కాని ఇక్కడికి తీరా వచ్చి చూసిన తర్వాత అతనికి అన్ని చోట్లా నిరాశే ఎదురైంది. మన జానపద గీతాలూ, భారతీయ సాహిత్యాన్ని ఒకానొక కాలంలో ఉర్రూతలూపిన మన జానపద సాహిత్యం సంస్కృతి కృష్ణభక్తితో ప్రాణం పోసుకుంది. ఈనాటికీ షోడశ కళలతో ప్రకాశించే కృష్ణ చంద్రుని బాల్య క్రీడల్ని జ్ఞాపకంగా భద్రపరిచి పూజించే బృందావనంలో కృష్ణభగవానుడు అతనికి ఎక్కడా కనపడ లేదు. మధుర నుంచి ఇక్కడికి వచ్చే ముందు స్వప్నాలనే ఏవేవో జ్యోతుల్ని మనః మందిరంలో వెలిగించు కున్నాడు. కాని ఇక్కడ కంపు కొడూతున్న అధర్మం, మొగలు కాలం నాటి పటాటోపం చూసిన తర్వాత అతని స్వప్నాలన్నీ చెరిగి పోయాయి. అతను వెలిగించు కున్న జ్యోతులన్నీ ఆరిపో సాగాయి. బృందావన క్షేత్రం కేవలం డబ్బు గుంజుకోవడానికి స్వార్థపరులు పన్నిన పన్నాగం అను కున్నాడు. అయితే అంత దట్టమైన చీకటిలో కూడా, అక్కడక్కడ కనపడు తోన్న భక్తగణం, బ్రజభూమి మీద తిరుగాడు తున్న బలిష్ఠ శరీరాలూ, సరళ మనస్కులూ అయిన బృందావన నివాసుల్లో మాత్రం బృందావన్ శ్రీకృష్ణుని ప్రతిబింబం కనపడుతూ వుంది. ధర్మశాలకు మధ్యగా వున్న పెద్ద గదిలో బృంద సంగీతం వాయించడం ప్రారంభం కాగానే కాలక్షేపం చేద్దామనే వుద్దేశంతో సజ్జన్ తన గదిలోంచి బయటి కొచ్చి నిలుచున్నాడు.

ప్రార్థనా, హారతితో ప్రదర్శనా కార్యక్రమం మొదలెట్టారు. కృష్ణభగ వానుడు తన గొప్పతనం చాటుకుంటూ వేదాంతానికి సంబంధించి గూఢంగా ఏవేవో మాటలు చెప్పుక పోతున్నాడు. సజ్జన్‌కు వినుగు పుడుతోంది. ఈ రాస లీలా నృత్య మండలి మేనేజరూ, ఇక్కడున్న పాండేలూ పూజారులూ అక్రమం

గానూ అపరిమితంగానూ లాభాలు గడించడానికి కృష్ణ భగవానుడు ఓ పని ముట్టులా వుపయోగపడుతున్నాడా అనిపించింది. కృష్ణభక్తికి తలమానికంగా ఎంచబడే ఈ వైష్ణవ తీర్థంలో, ఇక్కడి గుళ్ళల్లో. స్వామివారి పవళింపు సేవ, స్వామివారి ఉయ్యాలసేవ, ఆనందకందుడూ, సచ్చిదానందుడు అంటూ ఏవేవో పేర్లతో అమ్ముడు పోయే సరుకునూ, తీర్థ ప్రసాదాల్నీ అమ్మడానికి ఇక్కడి వ్యాపారస్తులంతా శ్రీ కృష్ణపరమాత్ముణ్ణి విక్రయ ప్రతినిధిగా నియమించారా అనుకున్నాడు సజ్జన్. అతని మానసిక అలసట ఇంకా ఎక్కువైంది. ఇదేనా మన ధర్మం నిజస్వరూపం! భారత దేశంలో కోట్ల కొలది ప్రజలు శతాబ్దాల నుంచి హృదయాల్లో దీపాలు వెలిగించుకుని ఉపాసన చేస్తున్న ధర్మం ఇదేనా? ఇతడేనా ఆ కృష్ణ పరమాత్ముడు?

ఇంతలో సన్నగా యీనెపుల్లలా వున్న ఓ పొడుగాటి పురుషాకారం అంగుళం మందాన కోటా కొట్టుకున్న ముఖం మీదకి చీర ముసుగు సవరించు కుంటూ స్త్రీవేషంలో అక్కడికి వచ్చింది, వెదురుకర్ర చీలుస్తోందేవర్నో కరకరలా వుంది అతని కంఠస్వరం. వేషాన్ని బట్టి ఆతను యశోద పాత్రధారి అను కున్నాడు సజ్జన్.

యశోద అంటోంది- "కృష్ణా, కృష్ణా, పాలు కుడిచి పొద్దున్ననగా ఆడు కుంటానికని వెళ్లావు. చద్ది అన్నం కూడా తినలేదు. ఎక్కడికి వెళ్లావురా!"

కొడుకు రాక కోసం ఎదురు చూస్తూ నందుని భార్య విచారంతో అటూ ఇటూ పచార్లు చేస్తూవుంది. అంతలో నెమలి పింఛాన్ని ధరించి నోటికి వేణువు కరుచుకొని కృష్ణుడు రంగప్రవేశం చేసాడు. బాలకృష్ణుని చూడగానే యశోద అంటోంది.

యశోద: "నాయనా, నువ్వు వచ్చేసావా! నీకు తంద్రిగారాబం ఎక్కు వైందిరా. రాత్రనక పగలనక ఒకటే ఆటలు. బాబూ, నువ్వింక అలా అస్తమానం బయటికి వెళ్ళకురా. వూళ్ళోకి బూచాడు వచ్చాడంటరా."

కృష్ణుడు: (నవ్వుతూ) ఎవరినమ్మా నువ్వు భయపెట్టేది. నాలుగు వేదాలూ దొంగిలించి ఆనాడు సముద్రగర్భంలో శంఖాసురుడు దాక్కొని వుండే

నేనే కదటే చేప రూపంలో వెళ్ళి వాణ్ణి హతమార్చింది. అప్పుడు కూడా బాది రాలేదే అమ్మా! అక్కడ కూడా కానరాలేదే నీ బూచోడు."

యశో: (ఆశ్చర్యంతో) "బాబూ శంఖాసురుడనే రాక్షసుణ్ణి నువ్వంత్రా తంపేసింది. అయితే నువ్వేనా చేప రూపంలో సముద్రంలోకి వెళ్ళింది!

కృష్ణుడు "అవునే, నేనేనే వెళ్లింది."

యశోద: "హారి పిడుగా, నువ్వన్న మాట!"

కృష్ణుడు: (నవ్వులాటగా) లేదే, నేనుకాదే నాన్నగారే అలా చెయ్యమని చెప్పారు. అమ్మా నీకేం తెలుసునే నా తడాఖా! యమునానది ఒడ్డున చెట్ల కింద అలమందలు మేస్తొంటే నేనేకదే యమునలో దూకి పాతాళానికి వెళ్ళింది. నాగ రాజు పడగల మీద నాట్యం చేసి నేనేగదే వాడి పొగరు అణచింది. మరి అక్కడ కూడా నాకు బూచోడు కన్పించలేదే అమ్మా."

ఈ విధంగా బాలకృష్ణుడు తాబేలుగానూ, వరహంగానూ, నరసింహం గానూ వామనుడిగానూ ఎలా అవతారాలెత్తింది, ఏమేం ఘనకార్యాలు చేసింది పూసగుచ్చి నట్లు వర్ణించాడు. వామనావతారంలో తాను ఏమి చేసింది వర్ణిస్తూ ఇలా చెప్పారు

"అమ్మా. బలిచక్రవర్తిని ఎలా అణిచానో తెలుసా. బ్రాహ్మణుడి వేషం ధరించి బలిచక్రవర్తి దగ్గరకెళ్ళి మూడు అడుగులు దానం ఇమ్మని అడిగానే. అడిగిందే తడవుగా ఆ అమాయకుడు సరే అన్నాడు. అంతే మూడు లోకాల్ని ఆక్రమించు కున్నాను. ఒకపాదం సాచి స్వర్గాన్ని ఆక్రమించానే. మరో పాదంతో పాతాళాన్ని ఆక్రమించాను మూడో పాదానికి చోటు లేకపోతే నా నెత్తినపెట్ట మన్నాడే. అంతే అతని తల మీద కాలు పెట్టి పాతాళానికి తొక్కివేశాను. అక్కడా బూచోడు నాకు కనిపించలేదే."

యశోద: (ఆశ్చర్యంగా) "అయితే వామనుడి వేషం వేసింది నువ్వేనంటారా బాబూ. బలిచక్రవర్తిని మోసగించింది నువ్వేనన్న మాట."

కృష్ణుడు: అవునే. నేనేనే మోసగించింది."

యశోద: "మరైతే బాబూ, ఈ గంగతల్లి నీ పాదం నుంచేనా పుట్టింది?"

కృష్ణుడు: (నవ్వులాటగా) ''లేదే నాన్నగారు అలా చెప్పమని చెప్పారే."

యశోద: "అందుకనే నేను అప్పట్నుంచి మొత్తు కుంటోంది. నీకు ఆటల్లోనే తీరిక వుండదే. ఇన్ని పనులు ఎలా సాధించ గలిగావూ అని."

సజ్జన్ రాసలీలను చూస్తూ మధురానుభూతి పొందు తున్నాడు. లీలలకు ఏజెంటుగా ప్రసిద్ధికెక్కిన కృష్ణుడు ఈ బాలలీల రచయిత కలంలో మామూలు మనిషిలా ప్రాణం పోసుకున్నాడు. మనుష్యాకారంలో వున్న భగవానుడు అనాది కాలం నుంచి తన శక్తి సామర్థ్యాన్ని నిరూపించుకుంటూ చరిత్రను సృష్టిం దాడు. ఇన్ని యోగ్యతలు ఆర్జించినా అతని వినయసంపత్తి అపారం. అతను నెమ్మదిగా వికాసం పొందుతూ వచ్చాడు. అతని తల్లి అంటే ఈ భూమాత. ఈ మానవుణ్ణి ఇంకా కుర్రాడిగానే చూస్తూ వుంది. కడుపునిండా మమకారాన్ని పెంచుకున్న తల్లి కొడుకు ఎంతెంత ఘనకార్యాలు సాధించినా ఆమె నమ్మదు. కారణం తల్లికి కొడుకు ఎప్పుడూ కొడుకులా వుండాలన్న కోరిక వుంటుంది కదా!

తల్లి అనగానే సజ్జన్‌కు పరలోకంలో వున్న తన తల్లి జ్ఞప్తికి వచ్చింది. రెండు నీటి చుక్కలు కళ్ళల్లోంచి రాలాయి. అక్కడ కూర్చుని ప్రదర్శనాన్ని చూస్తున్న వాళ్ళంతా తనలాగే పరమానంద భరితులవు తున్నారని గమనించాడు. కృష్ణునిలోని ఈ మానవాంశాన్ని ప్రతి మనిషి గుర్తిస్తాడు. సర్వ శక్తి మంతుడైన భగవంతుడు తన భక్తుల భయాన్ని పోగొడు తున్నాడు. కొడుకు మీద వుండే ప్రేమకొద్దీ తల్లి బూచాడు అని భయపెట్టొచ్చు. కాని అతను కూడా స్వయంగా భయాన్ని పోగొట్టుకుని ఆనందమయు దయ్యాడు.

"సర్వశక్తి సంపన్నుడైన భగవంతుడు తను సృష్టించిన ఆటంబాంబు లంటే కంపించి పోతున్నాడు. మహా మారణాయుధాలంటే భయాన్ని వీడిన రోజు ఇలాగే మళ్ళీ బాల్య రూపాన్ని ధరించి నవసంస్కృతి నిర్మాణానికి పూనుకో గలుగుతాడు. కచ్ఛంగానూ, మత్స్యంగానూ, వరాహంగానూ, నరసింహంగానూ

ఇన్ని రూపాలల్లో అవతారాలెత్తి విఘ్నాలనే రాక్షసుల్ని తరిమిన భగవంతుడు, అటంకాలను అనే మహా రాక్షసిని సంహరించి, మమతల్ని పంచిపెట్టే భూమాత నిర్భయురాలై అతిస్వాభావికంగా వచ్చి నిలబడిన రోజు ఎంత శుభకరమైందో! అటువంటి సహజమైన రూపసంపత్తిని దర్శించి ఎవరు ముగ్ధులు కారు? అటు వంటి భగవంతునిపై నమ్మకం వుండాలని మనసు అంటోంది. భగవంతుడు మన ఆత్మ విశ్వాసానికి ప్రతీక" రకరకాలుగా సజ్జన్ ఆలోచించడం మొదలు పెట్టాడు.

అతనిలో కలిగిన ఈ ఆలోచనా పరంపర అతని అలసటనంతా క్షణంలో పోగొట్టింది. కొత్త ఉత్సాహం, సరికొత్త ఆలోచనలు అతనికి నూతన శక్తినీ, స్ఫూర్తినీ ఇచ్చాయి. అతనికి హాయిగా నిద్ర పట్టింది. ఆ రోజంతా అతనికి ఒక్కమారు కూడా వనకన్య జ్ఞప్తికి రాలేదు.

మర్నాడు వుదయానే ఓ గుడి బయట అరుగు మీద కూర్చుని "జ్ఞాన్ గుదడీ" స్కెచ్ గీస్తున్నాడు సజ్జన్. అతడ్ని వెతుకుతూ కన్య నిధి వనంలో తిరుగు తోంది. బృందావనం వెళ్ళి తీరు తానని కన్య పట్టు పట్టింది. బృందా వనం, లండన్, న్యూయార్క్, బొంబాయి, కలకత్తా, ఢిల్లీవంటి మహాపట్టణం కాకపోయినా సందులూ, గొందులూ ఇరుకుగా వుండే బస్తీలూ సుప్రసిద్ధమైన దేవాలయాలూ, ధర్మ సంస్థలతో నిండివుంటుదనీ, తెలియని వ్యక్తిని వెతకడం చాలా కష్టం అనీ ఎన్నో చెప్పారు లాలా మురళీ మనోహర్. కాని కన్య ఒక్కటీ వినలేదు.

నిధి వనంలో వెతికి వేసారి తప్పి పోయిన తన పెన్నిధిని మరెక్కడైనా వెతుకు దామన్న ఉద్దేశ్యంతో ఆశలు ఉడిగిన మనస్సుతో తిరిగి వచ్చేస్తోంది. సజ్జన్ ఆమెకు అక్కడ కనపడలేదనే కొరత తప్ప తాన్‌సేన్, బైజూలాంటి అమరగాయకులకు గురుతపోభూమి కావడం చేత అనాద యోగిపుణ్య స్థలాన్ని దర్శనం చేసుకుని ఆమె కొంతవరకు సంతుష్టురాలే అయింది. నిధివనం ఈనాటికీ ఒక యుగంలో కృష్ణుడు విహరించిన బృందా వనాన్ని మైమరపిస్తుంది. దట్టమైన పొదరిళ్లూ. ఎక్కడికక్కడే అల్లుకు పోయిన లతలూ, చెట్లతోనూ నిధివనం

చూడ్డానికి ఎంతో నిండుగా వుంటుంది. ఒక చోట శిథిలాలుంటే, మరో చోట మూడు నాలుగు చెట్లు ఒకదాని కొకటి దగ్గరగా పచ్చని పందిరి వేసినట్లుగా వుంటుంది. ఒక్కో చోట అజాగ్రత్తగా పోయే యాత్రికుని వస్త్రాల్ని చింపుతోంది కరీరం ముల్లు. పక్షుల కలకలలూ, చెట్ల మీదుగా కోతులు దూకుతుంటే ఆవుల గంగడలూ.. లేడి పిల్లలూ గెంతులూ అన్నీ చూస్తోంటే సజ్జన్ కనపడలేడన్న ఆందోళనగా వున్న వనకన్యకు మనశ్శాంతి లభించింది. కాని అది ఎంతోసేపు కాదు. సజ్జన్ కోసం ఇక వేటాడలేక ఆరోజుకి ఇంటికి మరలి పోతోంది కన్య. స్వామీ హరిదాసు సమాధి మీద కళ్ళద్దాలు తగిలించు కొని ఒంటి నిండా భస్మం పులుముకొని మీసాలూ, గడ్డాన్ని జుత్తునూ గొరిగించుకుని, లంగోటీలు బిగించి నిక్షేపరాయళ్ల మాదిరిగా ఓ సాధువుల బృందం తుత్రిపటి లేకుండా ఇష్టం వచ్చిన బాణీలో కన్నడ రాగంలో హరిదాసు రాసిన భజనను సంకీర్తనం చేస్తున్నారు.

మాయీరి సహజ్ జోరీ ప్రగట్ భయా జో రంగ్‌కి
గౌర్ శ్యామ్ ఘన్ దామిని జై సె
ప్రథమ్ హూఁ హుతీ అబ్ హూఁ ఆగే హూఁ
రహే హై న టరి హై తై సే
అంగ్ అంగ్ కీ ఉజరాయీ సుఘరాయీ
చతురాయీ సుందరతా ఐసే.

ఓ సఖీ, తెలుపు నలుపు శరీరచ్ఛాయల్లో ఈ కనిపిస్తోన్న జంట అచ్చంగా మేఘం, దాని మధ్య మెరిసే మెరుపులా వుంది. ఈ జంట చాల సనాతనమైంది. ప్రాచీన కాలంలోనూ వుంది (సత్యనారాయణుల రూపంలో) ఇప్పుడూ వుంది (రాధా కృష్ణుల రూపంలో) ఇక ముందు కూడా వుంటుంది. ఈ జంటకు వియోగం, వేర్పాటు అంటూ లేవు. చాతుర్యం, సౌందర్యం స్వయంగా మూర్తీ భవించినట్లుగా వీరి అంగాంగముల సౌష్ఠవం తెల్పుతోంది.

ఏదో అదృశ్య హస్తం ఈ భజన గీతాన్ని ఆశీస్సు రూపంలో ఆమెకు వినిపించినట్లు కన్యకు అనిపించింది. నిజంగా ఆమె సజ్జన్ జోడి- ఒక స్త్రీ, ఒక

పురుషుడూ కలిస్తే జోడీయేగా అయ్యేది దానికి దేశం కాలం అంటూ సరిహద్దులు లేవు. ఈ కలయిక అనేది ఈనాటిది కాదు. ఒక నాటిది కాదు. అనాది కాలం నుంచి వస్తోంది దానికి ఆద్యంతాలు అంటూ లేవు.

# 24

"భార్యా భర్తలు" స్త్రీ పురుషుడు కలిసిన దాంపత్యం దేశానికి కాలానికి అతీతమైనది. అది నిత్య సత్యం. దానికి అంతం అంటూ లేదు.

తనకూ డాక్టర్ షీలాకు మధ్య వున్న మానసిక బంధం వల్ల పట్నాల్లో చుట్టూ శ్రీచక్రంచేత బంధింప బడిన దేవతలా మహీపాల్ వున్నాడే కాని, సిద్ధాంత రీత్యానూ. న్యాయంగా చూసినా కళ్యాణికి తనకూ మధ్య పెన వేసు కున్న బంధాన్ని మహీపాల్ త్యజించలేదు. ఆ సత్యాన్ని తను బలవంతంగా నైనా ఒప్పుకోక తప్పదు. రెండు రోజులు ఇంటి నుంచి దూరంగా వున్నా చివరికి ఆ బలవంతమే మహీపాల్‌ని కర్నల్ కారు మీద కూర్చోపెట్టి అతణ్ణి అతని ఇంటికి తీసుకు పోతోంది.

బావ మరిది పెళ్లి సందర్భంలో సమారాధన రోజు అతనికీ షీలాకూ మధ్య వున్న బాదరాయణ సంబంధం పెద్ద గాథగా మారి అతనికి కళ్యాణికి మధ్య ఒక అఘాతాన్ని ఏర్పరిచింది. ఆ అఘాతంలో అతనీ రెండు రోజుల ప్రవాసంలో ఎన్నో మునకలు వేసాడు. షీలా + మహీపాల్ = కళ్యాణీ + మహీపాల్ ఈ సమీకరణం ఎప్పుడూ సమానం కాజాలదు. రెండు పొరల తన వ్యక్తిత్వాన్ని అతనింక ఎన్నాళ్లూ కాపాడు కోలేడు. ఈ ద్వంద్వాత్మక జీవితాన్ని అతను ఎక్కువ రోజులు గడపలేడు.

ఉదయం— అంటే గంటో గంటంబావు క్రితం అతణ్ణి తీసుకెళ్ల దానికి కర్నల్ షీలా ఇంటికి వచ్చాడు, కర్నల్‌ని చూడగానే అతని మనస్సు సముద్రపు పోటులా పొగింది. తర్వాత కొంత సేపటికి గాని సముద్రపు ఆటులా ఫర్లాంగుల

దూరం వెనక్కు తగ్గి సన్నని హోరుగా మారి కరుణారస క్రందనంగా మార లేదు. షీలా ఇల్లు విడిచి తన ఇంటికి పోవాల్సి వుంటుందని అతనికి తెలుసు. పుట్టింటిని వదలి మెట్టినింటికి వెళ్లే పడుతులా వుంది మహిపాల్ అనుభవం. తన ఇంటికి తాను వెళ్ళక తప్పదు. లేకపోతే మార్గాంతరం లేదు. భార్యా భర్తల దాంపత్యం ప్రపంచంలో వుంతనే వుంది. అది నిత్యమైనది. దానికి పరిసమాప్తి అంటూ లేదు. అటువంటి చిరసత్యాన్ని సంస్కార సంపన్నుడైన వున్నత భావాలున్న మహిపాల్ ఎలా త్రోసి రాజంటాడు?

ఇంటినుంచి పారిపోయి పోలీసుల చేతుల్లో పట్టుబడి తిరిగివస్తోన్న కుర్రాడిలా రెండు రోజులు ఇంటినీ ఇల్లాలినీ మరచి సర్వసంగ పరిత్యాగం విలాస వైభోగం అనే రెండు గొలుసులకు రెండు చివరలూ తగిలించి వేలాడ దీసిన వుయ్యాల మీద తిరుగు బాటు చేస్తోన్న మనస్సును బుజ్జగిస్తూ కర్నల్ కారులో మహిపాల్ ఇంటికి తిరిగి వెళ్తున్నాడు. షీలా ఇంటి నుంచి బయలుదేరే ముందు ఆమె యంత్రంలా చూస్తూ నిలబడింది. ఆమెకళ్ళను చూస్తోంటే కనపడ కుండా కొంత సొరంగంలో ప్రవహించే సెలయేరు అన్నట్టు అనిపించింది మహీపాల్‌కి. అతను తన మనస్సుని మౌనం అనే ఇనుప పెట్టెలో బంధించి వేశాడు. అలా చేస్తోంటే దానిలోంచి పుట్టిన ధ్వనే క్రమ క్రమంగా అతని సిద్ధాంతాలకు ఆఘాతంగా మారింది. ఎన్ని తరచిచూసినా అతను తన పాతసిద్ధాంతం దగ్గరకే వచ్చాడు భార్యా భర్తల అనుబంధం నిత్యమైనది. అనంతమైంది. అభేద్యమైనది.

కర్నల్ సాహెబ్ మందులషాపు వెనుక భాగంలో వసకన్య వుంటోన్న గదిలో చిన్న పిల్లాడైన తపోధన్‌తో కూర్చునివుంది కళ్యాణి. కర్నల్ ఆమెను అక్కడికి పిలిపించాడు. రెండు రోజుల తపస్సు ఆమెను ఎంతో ఆవేదనలో ముంచెత్తి ఆమె ఇప్పుడే స్నానం చేసివచ్చినట్లు నిత్య నూతనంగా వుంది. ఆమె ముఖం ప్రశాంతంగా కనపడుతున్నా తుఫాను వెలరేగిన తర్వాత పరిశుభ్రంగా కనపడే వీథిలా వుంది చిన్నవాడు తపోధన్ కుర్చీమీద కాళ్లాడిస్తూ కూర్చున్నాడు.

బిగుసుకు పోయిన ముఖ కవళికతో గదిలో అడుగుపెట్టాడు మహిపాల్. అతని వెనుక కర్నల్ వున్నాడు. కళ్యాణి మహిపాల్ ఇద్దరూ అప్రయత్నంగా

పరస్పరం చూసుకుని వెంటనే దృష్టి మరల్చు కున్నారు. ఇద్దరినీ విడదీయలేని బంధం అంటూ ఒకటుందని వాళ్ళిద్దరు నిమిష మాత్రంలో గ్రహించినా ఇద్దరి మనస్తత్వాల్లో వుండే వైరుధ్యం వాళ్ళను ఎడమొహం పెట్టేటట్టు చేసింది. కళ్యాణి తల దించుకుంది. పక్కకు తిరిగి తపోధన్‌ని చూస్తున్నాడు మహీపాల్.

తపోధన్ మూతి ముడుచుకుని తండ్రిని తెల్లపోయినట్టు చూడ సాగాడు. తండ్రి తనవైపు అదే పనిగా మెల్లిగా చూస్తోంటే ఎప్పుడు వాగే అతని నోరు మూత పడివుంది. సింహం ఎదురుగా వచ్చి నిలబడితే ఏమి చేయ్యాలో తోచని మనిషి అలాగే కళ్ళప్పగించి చూస్తాడు. తండ్రిని చూడగానే భయంచేత తపోధన్ కూడా ఏమి మాట్లాడితే ఏం ప్రమాదం వస్తుందోనని కన్నార్పకుండా మహీపాల్‌ని చూడ సాగాడు. చిన్నవాడి మీద వ్యామోహాన్ని తండ్రి ఆపుకోలేక పొయ్యాడు. అతని కళ్లల్లోంచి మమకారం వర్షించింది. విలాస పురుషుడైన తనను క్షమించలేని స్థితిలో వున్నట్టు గ్రహించి సంకోచంతో నిండి పోయాడు. ఈ పిల్లలంతా పరాయిస్త్రీతో నా సంబంధాన్ని చూసి ఏమనుకుంటారో!''

పాత ప్రశ్నే మళ్ళీ కొత్త ముసుగు వేసుకుని అతని అంతరంగాన్ని పొడిచింది. ఆ పరిస్థితిలో తపోధన్ అక్కడ వుండడం అతనికి ఎంతో సిగ్గుచేటుగా అనిపించింది. కోపం కూడా వచ్చింది. పిల్లాడి ఎండిపోయిన జుట్టులో వేళ్ళను పోనిస్తూ 'ఏరా' ఇవ్వాళ స్కూలుకు వెళ్ళలేదా' అని అడిగాడు.

"ఇప్పుడు వెళ్ళతానండి"

కొడుకు తలమీద నుంచి దృష్టిని కళ్యాణి మీదకు మళ్లిస్తూ "ఇవ్వాళ పిల్లలు ఆకలితో స్కూలుకు వెళ్తారా?" అని ప్రశ్నించాడు.

కళ్యాణి మాట్లాడకుండా వూరుకుంది. ఆమె ఏమీ సమాధానం చెప్పక పోయేటప్పటికి మహీపాల్‌కు కోపం వచ్చింది. కళ్లెర్రచేస్తూ అతనేదో మాట్లాడబోయాడు. ఇంతలో ఆమె కుడికాలి మట్టెలు సవరించుకుంటూ దించిన తల ఎత్తకుండానే సమాధానం చెప్పింది— "రజ్జో శకుంతలా ఇద్దరూ వంట చేస్తున్నారు. తపో, నువ్వింటికి వెళ్ళు. మేం ఇప్పుడే వచ్చేస్తాం"

"అవును బాబూ! నువ్వు ముందు పద. మేం నీ వెనుకనే వచ్చేస్తాం"

ఇంటికి వెళ్ళడానికి లేస్తూ తపోధన్ తండ్రిని తల్లినీ ఒకసారి పరకా యించి చూసాడు-"నాన్నగారూ. అమ్మను ఇలా బాధపెట్టకండి" అంటున్నట్లుగా వున్నాయి ఆ కుర్రాడి చూపులు

తపోధన్ గదిలోంచి బయటికి వెళ్ళిపోయాడు. కొన్ని క్షణాల వరకు నిశ్శబ్దం, కళ్యాణి మహీపాల్ ఇద్దరు తలలు దించుకున్నారు. ఎలా కలపాలి అనుకుంటూ ఏమీ తోచక కింద పెదిమని పై పళ్ళవరసతో వూరికే లాగుతున్నాడు కర్నల్.

"వీళ్ళు మధుర నుంచి ఎప్పుడొస్తారు?" అంటూ కర్నల్‌ని పలకరించాడు మహీపాల్.

"రేపో ఎల్లుండో వస్తారనుకుంటాను. బిన్నో నాలుగు రోజులే శలవు పెట్టింది"!

మళ్ళీ ఓ క్షణం నిశ్శబ్దం. ప్రసంగాన్ని ఎత్తుతూ కర్నల్ కళ్యాణి వైపు తిరిగి "వదినగారూ జరిగి పోయిందాన్ని మీరు మరిచిపోండి. ఈ కీచులాట ఇప్పుడు మీ ఇద్దరి మధ్య మాత్రమే లేదు. ఇంట్లో పెరిగి పెద్దవుతోన్న వయసు వచ్చిన పిల్లలున్నారు. వాళ్ళ సంగతి కాస్త ఆలోచించండి. వాళ్ళేమనుకుంటారు? ఇంట్లో వూహవచ్చిన సంతానం వుందని గ్రహించి కాస్త గుట్టుగా మసులుకోండి" అని అన్నాడు.

"అయ్యో, ఈమెగారా? అరవైఆరు జన్మలెత్తినా మారదు. మహా మొండిఘటం. ఆమె ఆలోచనా పద్ధతే అంత. వద్దన్నదాన్ని లక్షసార్లు వల్లిస్తుంది [illegible] విలువ తక్కువ కదూ! ఈమెగారంటే-"

"[illegible] మహీపాల్. నువ్వు మారుతుంటావా లేదా? ఇంత పెద్దవయినవు-"

"ఎప్పుడో చంకనాకి పోయాము. రచయితగారికి తన ఇంట్లోనే గౌరవం లేదు. బయటివాళ్ళ సంగతి వేరే అడగాలా? [illegible] గాజులు పగిలిపోయి కుంకుం

బొట్టు చెరిగి పోయిన రోజు ఈ రచయిత విలువ అప్పుడు కాని దీనికి తెలియదులే' అంటూ గదిలో పెద్దపెద్ద అంగలు వేస్తూ పచార్లు చెయ్య సాగారు మహీపాల్.

కళ్యాణి అలాగే తల దించుకుని వుంది.

ప్రసంగాన్ని మళ్ళీ లేవదీస్తూ కర్నల్ "మహీపాల్ మీపట్ల చాలా దూరుసుగా వ్యవహరించాడు. ఈ మాట అతని ముందే చెప్తున్నాను. కాని 'అయనకు మీరంటే ఎంతో గౌరవం వుందండి. ఆమాట కూడా నేను అతని సమక్షంలోనే అంటున్నాను" అన్నాడు కళ్యాణితో.

విలాసపురుషుడైన మహీపాల్‌కు కర్నల్ మాటల్లో న్యాయం కనిపించింది. "నువ్వే కాదు, బ్రహ్మాదులు దిగొచ్చి చెప్పినా ఈమెగారు ఒప్పుకుంటారనా! అప్పటికి కూడా నేనామెగారిని గౌరవిస్తానంటే ఆమెగారు ఒప్పుకోదు. అరే, ఒప్పుకునే విషయం అలా వుంచు. నేను గొంతుచించుకొని అరవడం పెడబొబ్బలు పెట్టడం ఈమెగారికి కనపడుతుంది కాని, నేను దానికి ఎంత విలువ ఇచ్చేదీ, చేయూత ఇచ్చేదీ గ్రహించదే. నా మాటను తుడిచి పారేస్తుంది. అయినా ఎందుకు ఒప్పుకోవాలి. నాలో అంతా చెడేతప్ప మంచి అన్నది రవ్వంతైనా లేదని ఈవిడ గారి నమ్మకం. నేనేదో ఈవిడగారికి శత్రువు అయినట్లు [illegible]..." అని అంటూ పళ్ళు పటపట కొరుకుతూ "చదువురాని మూర్ఖురాలు, తెలివితేటల్లేని గొడ్డు" అన్నాడు.

"మహీపాల్" అంటూ కర్నల్ బిగ్గరగా గద్దించాడు.

కర్నల్ వారిస్తున్నా మహీపాల్ ఆగలేదు- "ఈ ఆడది నా జీవితాన్ని నాశనం చేసింది. నేను చెప్పేది ఎప్పుడూ పట్టించుకోలేదు. 'ఈ మగరు అసలు ఏమి అంటున్నాడూ, ఏడికేం కావాలి' అని ఎప్పుడైనా ఆలోచించిందా?"

"సరేలేవోయ్. మేం చెబుతున్నాంగా-"

"కర్నల్, నాకు కోపంలేదు. నా మనసు అట్టుడికి పోతోంది. నా కడుపులోని ఉక్రోషాన్నంతా ఈమెముందు నువ్విక్కడ వుండగానే వెళ్ళకోసు కుంటాను. అప్పుడు నేను నలభయ్యోపడిలో పడ్డాను. నేనేం వయస్సులో వున్న

యువకుణ్ణి కాదు. కాసేపు కీచులాడుకుని వెంటనే మరిచి పోవడానికి. నేను జీవితంలో బాగా అలిసి పొయ్యానురా. నాకు తోడుకావాలి. మహా ఓపికవుంటే ఇంకో పదేళ్ళు రాయగలనేమో! జీవితం నాకేం ఇవ్వలేక పోయినా చింతలేదు. చింతా చీకూలేకుండే చాలు. నాకు కావలసింది మనశ్శాంతిరా. అదేరా ఈవిడ లేకుండా చేసేది".

"అయితే చెప్పండి అన్నగారూ, ఆయనగారికి మనశ్శాంతి దొరికే చోటుకే పొమ్మనమని" అని చటుక్కున అందుకుంది కళ్యాణి.

"చూశావా? చూశావా!! ఇదీ ఈవిడగారి తంతు. ఇదేవరుస"

"నేను సముదాయిస్తాను. నువ్వూరుకో మహీపాల్" అంటూ కర్నల్ అరిచాడు. మళ్ళీ గొంతు స్థాయిని దించి మామూలు ధోరణిలో కళ్యాణితో అన్నాడు- "ఒదినగారూ, నన్ను కొంచెం చెప్పనివ్వండి. విషయం అంత తేలిగ్గా తేలిపొయ్యేది కాదండి. చెప్పడంలో నావల్ల ఏదైనా పొరపాటు వుంటే నన్ను క్షమించండి. ముందే మిమ్మల్ని వేడు కుంటున్నాను. మహీపాల్‌కు మీరు నచ్చ చెప్పేపద్ధతి అంత బాగాలేదని నా అభిప్రాయం. మహీపాలేమీ కడిగిన ముత్యం అని నేను అనడంలేదు. అతనిలో లోపాలు వున్నాయి. కాని మహీపాల్ మాదిరి దాపరికం లేకుండా నిష్కాపట్యమాటంగా వుండే మనుషులు ప్రపంచం అంతా గాలించినా వేళ్ళమీద లెక్కపెట్టొచ్చు. నేను ఏమీ అబద్ధం చెప్పడంలేదు. మహీపాల్‌కి వత్తాసుగా చెప్పేమాటలు కావు. నేను వ్యాపారస్థుణ్ణి. లౌక్యం తెలిసిన వాణ్ణి. పదిరకాల మనుషులు నాదగ్గరకు రోజూ వచ్చి పోతుంటారు. మనవాడు కదా అని మనం అతనికి విలువ ఇవ్వక పోవచ్చు. కాని అతని గుణసంపత్తి యోగ్యతా చూసి పెద్దపెద్ద వాళ్లే తలవంచు కుంటారండీ, వదినగారూ".

కాలిపోయిన సిగరెట్టు వేళ్ళ మధ్య అదిమి తల వంచుకుని మహీపాల్ కుర్చీలో నిటారుగా కూర్చొని కర్నల్ తన్ను పొగడుతుంటే మైమరచి నట్టుగా వింటున్నారు. కర్నల్ అతణ్ణి పొగడ్తల్తో ముంచెత్తి ఒక విధంగా అతని శిరంకు శత్యాన్ని కట్టేసాడు. కర్నల్ మళ్ళీ అన్నాడు. "చూడండివదినగారూ, మహీపాల్

లాంటి రచయితల విలువ ఒక్క విదేశాల్లోనే తెలుస్తుంది. అటువంటి ప్రతిభా విశేషాలున్న వ్యక్తి ఇలాంటి కష్టాలు పడుతున్నాడు. ఇన్ని మంచి గుణాలున్న వ్యక్తిలో ఏదో ఒక చిన్న లోపంవుంటే మనం దాన్నే పట్టుకుని వేళ్లాడ కూడదు. ఆలోపాన్ని మనం అంతగా పట్టించుకో కూడదు".

తన వుపన్యాసం అంతటితో ఆపి కర్నల్‌మౌనం వహించారు. గది అంతా నిశ్శబ్దంగా వుంది. ముగ్గురూ ఆలోచనలో పడ్డారు. ఎడమ చేతి వేలు కున్న రవ్వల వుంగరాన్ని ఏమి తోచక అటూ ఇటూ కదిలిస్తూ కూర్చున్నాడు మహిపాల్. సన్నగా దగ్గి కర్నల్ మళ్ళీ ప్రారంభించారు- "మీరు మహిపాల్‌ని ఏమీ అనకూడదని నేను చెప్పడంలేదండి. కాని ఏమైనా అనదలచు కుంటే ముందు అతని మానసిక పరిస్థితి ఎలా వుందో కాస్త గమనించండి. ఇప్పుడు చూడండి. మీలో మీరు పోట్లాడు కుంటూ అసలు రహస్యాన్ని పిల్లల ముందు బయట పెట్టేసారు. కాలం ఎంత చెడ్డగా వుందో మీకు తెలుసు కదా! అందరూ ఎదిగిన కుర్రాళ్ళూ, ఆడపిల్లలూ ఏ కొద్దిగా కాలు జారినా-"

"అదేనండి అన్నగారూ, నేను ఆయనగారితో మొదట్నుంచి మొత్తుకునేది. మరే కారణంలేదు" ఇంతసేపటి నుంచి నోరు మెదప కుండా వింటోన్న కళ్యాణి కంఠంలో ఒక్కసారి సంచలనం వచ్చింది ఆమె మాటలు విన్న మహిపాల్ కనుబొమలు పైకి ఎగరేసి భార్యవైపు తిరిగి ఆమెను ఏదో మంత్రించేవానిలా కళ్ళు పెద్దవిగా చేసి చూస్తున్నాడు కళ్యాణి ఉద్రేకంలో వున్నా మర్యాదను పాటిస్తూ ప్రశాంతంగా "మేము ఏదైనా సహిస్తాం. ఇకచెడూ, అప్రతిష్ఠ అంటూ అంటున్నారే, అవి వారికే తిన్నగా చెప్పండి. మాకింత విషం ఇస్తేదాలు. మా ఇంట్లో ఎవరికి ఏ చెడ్డపేరు వచ్చినా సహించేది లేదు- ఆయనే కానీయండి పిల్లలైనా కానీయండి" అంది. ఆమె అలా మాట్లాడుతోంటే ఆమె ముఖం తేజస్సుతో కళకళ లాడింది.

ఆ తేజస్సే మహిపాల్‌కి ఆదర్శం. ఈ ఆదర్శాన్ని పొందాలని అతనెంతగా ప్రయత్నించినా వాస్తవిక జీవితంలో పొందలేక పోయాడు. దానికాకారణం

కళ్యాణి మంకు పట్టూ మొండి స్వభావమూను. "ఈమె నాసాహితీ వక్తిత్వానికి ఒక్క రోజు ప్రేరేపణ ఇచ్చిన పాపాన పోలేదు. ఎప్పుడూ నన్ను వ్యతిరేకిస్తూ వుండడమే ఈమెగారి పని. పాతివ్రత్యం, భక్తి, వినయం అన్నీ వున్నాయి-ఏమిలాభం. ఎదుటి వ్యక్తిని అర్థంచేసు కోలేని మహా మూర్ఖురాలు". మహీపాల్ నోట్లోంచి వరదనీటి ప్రవాహంలోని అల్లా పదాలు దొర్లాయి. వరద నీరు పోగా మిగిలి పోయిన కోపం అనే బురదలో అతని మేధస్సు ఇరుక్కు పోయింది. వూబిలోంచి పైకిరాలేక ఆ బురదనే కళ్యాణి మీదకు విసురుతూ మహీపాల్ పెద్ద పెద్దగా కేకలేస్తూ "నేను నీ అయ్యతొత్తును కాదు అణిగిపడి వుండడానికి. ఇప్పుడైనా తెలుసుకో. ఒక్కసారి కాదు. లక్షసార్లు ఇదే మాట అంటాను. నీకు కావాల్సి వుంటే నాతో కాపురం చెయ్యి. లేకపోతే వెళ్లిపో. నీఎత్తిపొడుపులు విని సహించిపడి వుండడానికి నేను ఇక్కడ సిద్ధంగాలేను. ఒట్టి స్వార్థపరురాలు, అహంకారి, నీచురాలు" అని అరిచాడు.

వెంటనే కర్నల్ లేచి మహీపాల్ నోటికి తన చెయ్యి అడ్డంగా పెట్టి గొంతును కాస్త తమాయించుకుంటూ "మహీపాల్" అని అన్నాడు. మహీపాల్ కర్నల్ చేతిని తోసిపారేసాడు. మహీపాల్ని మందలిస్తూ "నీకేమైనా మతి పోయిందేమిటి? పిచ్చోడిలా ప్రవరిస్తున్నావ్। ఇంక చాలించు నీ ప్రలాపన. అంతా నీదే పొరపాటని ఇప్పుడర్థమైంది" అని అన్నారు.

"ఎమిట్రా నువ్వు వాగేది?" అంటూ మహీపాల్ కర్నల్ మీద విరుచుక పడ్డాడు. కర్నల్ మనస్థితి విచిత్రంగా సమానంగా తూస్తోన్న ధర్మకాటాలా వుంది. అలాంటి పరిస్థితి ఎప్పుడొచ్చినా ఎవ్వరైనా ఏచిన్నమాట అన్నా వెంటనే తిప్పికొట్టేసే స్వభావం అతనిది. అలాంటి మనస్థితిలోకి వచ్చాడంటే రెండు వర్గాల మధ్య ఏదోరకంగా సయోధ్యత తప్పక రావాల్సిందే. అందులో ఎవరు కాదన్నా వాళ్ళు కర్నల్తో ఘర్షణ పడాల్సిన అవసరం ఏర్పడుతుంది. లాలా నగీన్చంద్ వురఫ్ కర్నల్ సాహెబు ఇలాంటి భార్యాభర్తల తగాదాలు తన బంధువర్గంలోనూ ఇతరత్రా ఎన్నో పరిష్కారం చేసాడు. మంటకలిసిపోతోన్న ఎన్నో కాపురాలు నిలబెట్టాడు. మహీపాల్ వైపు వేలు చూపిస్తూ గడసరితనంతో

"అరే. ఇలాచూడు. ఇక నీ ప్రతాపాన్ని ఆపుచెయ్యి నేను చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాను. ఇప్పుడు నీతరఫునగానీ ఒదినగారి తరఫునగానీ మాట్లాడ్డం లేదు. నాకు ఏది న్యాయం అని తోస్తే అలాగే తీర్పు చెప్తాను. తప్పంతా నీదిరా. నువ్వెంత ప్రతిభాశాలివైనా ఒదినగారి కాలిగోటికి కూడా తూగవురా" అని అన్నాడు కర్నల్.

తాను కూర్చున్న కుర్చీని అమాంతంగా కర్నల్ లాగినట్లయింది మహీపాల్‌కి. సజ్జన్ ముందు కర్నల్ ఇంతకన్న తీవ్రంగా మందలించినా అతనులక్ష్యపెట్టేవాడు కాదు. కాని తన భార్య కళ్యాణిముందు కర్నల్‌ఇలా తన్ను దించేస్తుంటే అతనికి అవమానకరంగా తోచింది. ఊగిసలాడుతోన్న మనోనిబ్బరాన్ని గట్టిగా అదిమిపట్టుకుని కర్నల్‌పై దెబ్బ తీసి తనభార్య దృష్టిలో తానే మగాణ్ణి అనిపించుకుందామన్న అహంభావంతో సిద్ధమౌతోంటే కర్నల్ అన్న ఒక్కమాట అతని ఆటనంతా ఒక్కసారిగా కట్టివేసింది. కర్నల్ మహీపాల్‌ని ఒకే ఎత్తిపొడుపు పొడిచి అతని నోరు కట్టేసాడు-"నీ రచనల్లో నువ్వుమానవత్వాన్ని ఏదో మహాగ్రహించినట్లు రాస్తావు. కాని మానవత్వం వున్నమనిషిని మాత్రం నువ్వు గుర్తించలేకపోయావు. ఒదినగారు మొండిదని మాటవరుసకు అనుకుందాం. నువ్వు మాత్రం మహామూర్ఖుడివికావా? అన్ని సంవత్సరాల్నుంచి ఆమెగారితో సంసారం చేస్తూ ఆమె వుద్దేశాన్నే అర్థం చేసుకోలేకపోయావు. చిటికెలో నేను అర్థంచేసుకున్నాను. అరేబాబూ, ఈమె ఆలోచనలు ఎంత పరిశుద్ధమైనవో అలాంటి ఆలోచనలు వున్న ఏవ్యక్తి అయినాసరే ఏమాత్రం అపరిశుభ్రతనూ సహించలేదురా. నువ్వు రచయితవు. నీభావాలు ఎగరగలిగినంతమేరకు ఏ మాత్రం అశ్లీలత్వం వచ్చినా నువ్వు సహించలేవు. ఎడబొబ్బలూ పెడబొబ్బలూ పెట్టవూ? వందలసార్లు నువ్వు అలా పెడబొబ్బలు పెడుతోంటే నేనే స్వయంగా చూశాను."

రోగిష్టివానికి ఒక్కోపర్యాయం మంచిగాలి కూడా చెడుచేస్తుందంటారు. అలాగే మహీపాల్‌కి కూడా కర్నల్ హితవు చెడచేసింది. అతనిలో దాగిన సత్యం, పైకి వచ్చింది కాని అది నిగ్రహం అనే వెచ్చని దుప్పటికప్పుకోక

గుండెమీద తిరుగుబాటు అనే నిప్పుల కుంపటి పెట్టుకొని వచ్చింది. తలఎత్తి తమకంలో అన్నాడు మహీపాల్-" ఆమె అచంచలమైన నిష్ఠాపరురాలని నాకు తెలుసు. పదిమందిలో కూడా అదేమాట అంటాను. నేను పద్దెనిమిది సంవత్సరాలు ఏకపత్నీవ్రతాన్ని కఠోరంగా గడిపినవాణ్ణే. ఈమెగారిని ఋగమొండి, మహా మూర్ఖురాలని ద్వేషించటం మినహా ఈ రోజుకు ఈమె అంటే నా హృదయంలో గౌరవభావం వుంది. నువ్వు ఏమైనా అనుకో కర్నల్ మీ అందరి సమక్షంలో నేను ఇవ్వాళ చెపుతున్నాను. షీలాకూ నాకూ మధ్య వున్న సంబంధం నాకేం చెడ్డగా అనిపించడంలేదు. నా షీలాను ఎవరైతే అసహ్యించుకుంటారో వాళ్ళని నేనూ అసహ్యించుకుంటాను."

"నా" అంటు మహీపాల్ నొక్కి పలికాడు. ఆ నొక్కు తాను అనుకున్న పని చేసింది. ఘోరమైన నిరాశతో ఆమె అంతరంగం కుప్పలా కూలిపోయింది. ఆమె అహంకారం కుదించుకు పోయి నిట్టూర్పులా బయటికి వచ్చింది. "నన్ను నడిసముద్రంలో ముంచేసారు. మీరు ఇలా అంటారని నేను కలలో కూడా అను కోలేదు" అన్నట్లుగా ఆమె కళ్ళు పక్కకు తిరిగి భర్తవైపు చూడ సాగాయి.

మహీపాల్ ఉద్రేకంలో మాటైతే అనేశాడు కాని తర్వాత భార్యవైపు దోషిలా చూశాడు. అప్పుడే కళ్యాణి కూడా భర్తను చూసింది. ఆమె చూపులో భర్త వెళ్ళబుచ్చిన అభిప్రాయానికి వ్యతిరేకంగా నిరసన భావం, తాను ఓడి పోయానన్న నైరాశ్యం, ఇంక మాటేంగితి అన్నట్టుగా జాలి తొంగి చూశాయి, ఇద్దరి చూపులూ ఢీకొన్నాయి. లోనుంచి ప్రతిధ్వనిస్తోన్న సత్యం మహీపాల్ చెవులు చిల్లులుపడేలా రోదన చేస్తోంది "భార్యా భర్తల అనుబంధం విడదీయ రానిది. నేను దాని విడగొట్టేస్తాను. స్త్రీ, పురుషుడు వాళ్ళు భార్యాభర్తలైనా కాక పోయినా వాళ్ళ ప్రేమపాశం చాలా గొప్పది. కళ్యాణి మహా ఇల్లాలు. అయితే కానియ్యి. మేము పతితులం అయినా గొప్పవాళ్ళమే. షీలా నన్ను ప్రేరేపిస్తుంది. నేను ఆమె నవనాడుల్లో ప్రవహిస్తాను. సంఘం దృష్టిలో ఆమె నీతి బాహ్యమైన పనే చేస్తుండ వచ్చు. మా అమర ప్రేమ ముందు వెధవ సంఘం గుర్తింపు ఎవడికి కావాలి?"

మహీపాల్ ఉగ్రంగాలేచి కర్నల్‌తో "కర్నల్, ఐ యామ్ గోఇంగ్. నా సంపాదనలో నా ఖర్చులకు గాను రెండొందలయిదు రూపాయలు మినహాయించు కుని మిగతాదంతా నీద్వారా వాళ్ళకు ప్రతినెలా పంపుతానని ఆవిడగారికి చెప్పు" అని అంటూ తలుపు దగ్గరకు వెళ్లాడు. కర్నల్, కళ్యాణి ఇద్దరూ అతని ప్రవర్తన చూసి విస్తుపోయారు.

"అయితే ఇక నుంచి షీలా దగ్గర మకాం పెడతావన్న మాట. అంతేనా?" అని అడిగాడు కర్నల్.

కర్నల్ మామూలు ధోరణిలోనే అడిగాడు. కాని మహీపాల్‌కి మాత్రం అదేదో ఎత్తిపొడుపులా అనిపించింది. కోపంతో "ఆడవాళ్ళ సంపాదన మీద బతికే కుక్క కాదు మహీపాల్" అని చటుక్కున అనేసాడు.

"నీ పగవాళ్లు కూడా అలాంటి నిందవెయ్యలేరు" మోహపాశాన్ని తెంచు కుని నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోతోన్న తన జీవిత సర్వస్వాన్ని కళ్యాణి మతి పోయినట్టు చూస్తోంది. లోలోన ఏదో సణుగు కుంటూ ముందుకు వెళ్ళింది. మళ్ళీ కర్నల్ అక్కడ వున్నాడన్న విషయం గుర్తుకురాగానే ఆగిపోయింది. కాని వచ్చని సంసారం క్షణంలో నాశనమై పోతోందన్న భయంతో ఆమె నిగ్రహించు కోలేక మహీపాల్‌ని చూస్తూ అంది. "నువ్విలా వెళ్ళిపోతున్నావు. పిల్లలకు ఏమని చెప్ప మంటావు? ప్రపంచానికి ఎలా ముఖం చూపించేది?"

"నువు సతీసాధ్వివి కదా! ప్రపంచం నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తుందిలే. మేం పాపాత్ములం అని మమ్మల్ని ఉమ్మేస్తుంది"

"ఇవ్వాళ మురాదాబాద్ నుండి శకుంతల్ని చూడ్డానికి వచ్చారు. దాని కోసం అన్నగారిని నీ దగ్గరకు పంపాలని వచ్చాను"

శకుంతల సంబంధం అన్నమాట వినగానే మహీపాల్ ఉద్రేకం, అతని సిద్ధాంతాలూ అతని మనోనిశ్చయం, అతని ప్లానులూ అన్నీ ఒక్క సారిగా దెబ్బ తిన్నాయి. భార్య, ప్రియురాలు. ప్రేమ యవ్వన కాలానికి సంబంధించిన ఈ సమస్యలు యవతరం ప్రసక్తి రాగానే ఇంటి యజమాని అకస్మాత్తుగా వచ్చే

టప్పటికి ఎక్కడ దాక్కుందామా అని ఖంగారు పడుతోన్న దొంగాడిలా సద్దుకో సాగాయి అయినా మహీపాల్ సడలి పోతోన్న తన మనోసంకల్పాన్ని గట్టిగా పట్టు కున్నాడు.

"ఇప్పుడు ఎవరొచ్చినా ఏముంది గనుక. నీకూ నాకూ ఏ సంబంధమూ లేనప్పుడు" అని అన్నాడు.

అదను జారవిడిస్తే మహీపాల్ చేతికి దక్కకుండా పోతాడని గ్రహించి అతని దగ్గరకు వెళ్ళి "నీకింకా కుర్రతనం చేష్టలు పోలేదు మహీపాల్. ఆమెతో నువ్వు పోట్లాడు, వద్దనను. కాని పిల్లలతో పోట్లాడి ఎక్కడికి వెళ్తావు! ఇప్పటికే చాలా గ్రంథం నడిచింది. ఇంటికి పద. రెండు రోజులు నువ్వు ఇంటికి వెళ్ళక పోతే ఇంటిల్లిపాదీ ఎలా తల్లడిల్లుతున్నారో స్వయంగా వెళ్ళిచూడు. నీకే తెలుస్తుంది" అన్నాడు కర్నల్

"ఈ రెండు రోజులూ నామనస్సు మీద ఎన్నిసార్లు కుంపటి వెలిగిందో నీకు తెలియదు కర్నల్. నేను తీర్మానించు కున్నాను. కళ్యాణికీ నాకూ పొత్తు కుదరదు!".

"ప్రయత్నించి చూడు"

"అదేం లాభంలేదు. ఇరవైనాలుగు సంవత్సరాలు ఈ ఆడదానితో వేగాను ఈ ఇరవైనాలుగు సంవత్సరాల కాలంలో ఒక్కరోజైనా నన్ను అర్థంచేసు కుంటానికి ప్రయత్నించి వుంటే ఆమెగారితో నేను ఇక ......"

"ఎక్కడో ఓ చోట వుండాలి కదా. షీలా దగ్గర వుండనంటున్నావు. నా దగ్గరకానీ సజ్జన్ దగ్గరకానీ వుండనంటున్నావు".

తాను మొన్నరాత్రి గడిపిన గోమతీ ఒడ్డున శివాలయం జ్ఞాపకం వచ్చింది, మహీపాల్‌కి. శివాలయం అతని ఆధ్యాత్మిక సంతృప్తికి ప్రతీకగా నిలవడమే కాక అతని లాంటి నిరాశ్రయుడికి ఆశ్రయం ఇచ్చే అందమైన చక్కని స్థలం. శివాలయం కళ్ళ ముందు వచ్చి నిలబడగానే షీలా, కళ్యాణీ ఇద్దరు అతని

మనసులోంచి తొలిగి పోయారు. అతనిలో ఓ కొత్తస్ఫూర్తి వచ్చింది. నా లోటి రచయితకు మేరలూ మిద్దెలూ అక్కర్లేదు. కట్టుకోవ డానికి మూడు మూరల పంచా. బతుకువెళ్ళ బుచ్చడానికి ఇంత ధర్మపిండం—''.

మహిపాల్‌కి నచ్చచెప్తోన్న ధోరణిలో కర్నల్ "అమాట నాకూ తెలుసు లేవోయ్. ఇప్పుడు నా మాటైనా వినవా. ముందింటికి వెళ్ళు. పిల్లదాన్ని చూడ్డానికి ఎవరో వచ్చారట నిన్నటి నుంచి పాపం ఒదిన తిప్పలు పడుతోంది. నావరకు నేను నిన్ను పిలవనంప డానికి ఒప్పుకో లేదు. ఆవేశంలో నిర్ణయం తీసు కున్నావు. నెమ్మదిగా యుక్తా యుక్తాలు తెలుసుకుని నువ్వే తిరిగి వస్తావని నాకు తెలుసు. కాని పాపం ఒదిన ఒకటే గాభరా పడుతోంది సరే ఈవంకతోనైనా ఒదినగార్ని దర్శించు కున్నట్లవు తుందని బయలుదేరి మీ ఇంటికివెళ్లాను" అంటూ కళ్యాణి వైపు చూసి ''ఏమండి ఒదినగారూ, ఈపర్యాయం మీ ఇంటికి వస్తే గుమ్మం చాటున దాక్కోరు కదా. ఇక మీరు నేను రాగానే తెరలోనో వంటింట్లోనో దాక్కోవాల్సిన ఖర్మ తప్పింది" అక్కడ వాతా వరణంలోని ఉద్రిక్తతను కొంచెం తగ్గించి సరసం చేద్దామన్న వుద్దేశ్యంతో కాస్త హాస్యాన్ని రంగరించి మాట్లాడాడు కర్నల్.

కర్నల్ మాటలకు కళ్యాణి సంతృప్తి చెందినట్లు కనపడింది

హాస్యరసం మోతాదు కాస్త ఎక్కిస్తూ కర్నల్ మళ్ళీ కళ్యాణి ఛాదస్తాన్ని విమర్శిస్తూ మహిపాల్ మెప్పు పొందుదామన్న వూహతో "సరే. ఒదినగారూ మా మ్లేచ్ఛుల ఇళ్ళల్లో మీరు టీ తాగుతారా లేదా? చెప్పండి. తాగకపోతే పరవా లేదనుకోండి. కాని టీపైనా కొద్దిగా మీరు ముట్టుకోకపోతే మిమ్మల్ని గడపదాట నివ్వనండోయ్. నేనిప్పుడే వస్తాను" అంటూ కర్నల్ యుద్ధరంగం నుంచి తప్పు కున్నాడు.

మహిపాల్, కళ్యాణికి ఏకాంతం దొరికింది. కళ్ళలో నీరు నింపుకుని ఆమె భర్త వైపు చూసింది మహిపాల్ ఆ చూపుకు తట్టుకోలేక పోయాడు ఇద్దరి మధ్య ఈరోజు నడిచిన ఘర్షణ వుండివుండి అతని మనసులో కలుక్కుమని

పొదవసాగింది. ఓడిపోయిన పురుషోత్తమ చక్రవర్తి అలెగ్జాండరు ముందు నిలబడి నట్లుగా మహీపాల్ కళ్యాణి ముందు ఒంటరిగా నిస్సహాయంగా చూస్తూ నిలబడి పోయాడు.

— —

ఇంటికి వెళుతోన్న మహీపాల్ మనస్సు పరిపరివిధాల పోతోంది. రెండు రోజులు ఇంటి ముఖం చూడక ఇవ్వాళ అక్కడికి వెళ్ళుతోంటే పిల్లలకు ఎలా ముఖం చూపించడమా అని ఆలోచిస్తూన్నాడు. అందరూ ఎదిగి, వయసు వచ్చిన వాళ్ళు. వాళ్ళ గురించి ఎంతగా ఆలోచిస్తోంటే కళ్యాణి మీద అతనికి అంతగా కోపం ఎక్కువౌతోంది. ఇంటికి వెళ్ళి కూడా ఇంట్లో కాలుపెట్టలేక పోయాడు. డ్రాయింగ్ రూమ్ తాళం చెవి నువ్వేతెచ్చి ఇమ్మని భార్యకు చెప్పి అప్పటి వరకు సందులోనే పచార్లు చేస్తున్నాడు. ఇంతలో ఓ పక్కింటాయన తారసిల్లాడు. నమస్కారం చేస్తూ "ఏం పంతులుగారూ, మీ ఓటు ఎవరికి వేస్తున్నారు" అని అడిగాడు.

"ఎలాగన్నా తగలడనియ్యి. నాకు ఓటింగ్ అంటే పరమ అసహ్యం" అన్నాడు మహీపాల్.

మహీపాల్ ఇచ్చిన సమాధానానికి ఆ వ్యక్తి తృప్తిపడినట్లులేదు. కర్నల్ అదోలా ముఖంపెట్టి "మీరనేది నిజమే అనుకోండి కానిమీరూ, కర్నల్‌గారునూ కమ్యూనిస్టు పార్టీని బలపరుస్తున్నారని ఒకటే పుకారుగావుంది. ఆరోజు విమానా ల్లోంచి కరపత్రాలు పంచిపెట్టి గొప్పగా ప్రచారం చేసేశారనుకోండి. మీ కర పత్రాన్ని చదివిన ప్రతివ్యక్తి నోటా మీ ఘనత గురించేవిన్నాం ఇదంతా మా పంతులుగారి మహిమ అని చెప్పుకున్నాం. మీ మాదిరిగా అంత పదునుగా రాయడం ఎవరితరం?" అంటూ వెకిలిగా నవ్వాడు.

మహీపాల్ విసుక్కున్నాడు. కాని వినాలి. తప్పదు. ఆ సమయంలోనే కళ్యాణి గుమ్మందగ్గిరికి వచ్చినట్లు కనపడింది. ఏదో సాకుచెప్పి అతనిపీడ ఒది లించుకున్నాడు మహీపాల్. "మీరుకూడా స్నానం పానంచేసి కూర్చోరాదూ" అంది కళ్యాణి.

ముందు పిల్లలకు భోజనం వడ్డించమన్నాడు మహిపాల్. అందరూ వెళ్ళిపోయారనీ, తపోధన్, రజ్జూ, శకుంతల తప్ప ఎవరూలేరని చెప్పింది కళ్యాణి.

"అలా ఎలా!"

"శకుంతల వెళుతూంటే ఆపుచేసాం. రజ్జో, నేనూ వున్నామాయె. మాకు తోడుగా వుంటుందని ఆపాం!"

మహీపాల్ ఏమీ మాట్లాడకుండా గదిలోకి వెళ్లాడు. లెటర్‌బాక్సులో రెండుత్తరాలూ, ఎక్కడిదో ఓ పత్రిక వచ్చివున్నాయి.

కళ్యాణి లోపలికి వెళ్ళిపోయింది. శకుంతల, రజ్జూ ఇంకా ఇంట్లో వున్న కారణంగా అతనికి లోపలికి వెళ్ళడానికి ధైర్యం చాలటంలేదు. పత్రిక తిరగేస్తున్నాడు. ఎక్కడిదో కొత్త ప్రచురణలావుంది. ప్రింటూ టైటిల్ అంతా ఎంతో చిక్కగా వున్నాయి. రెండు కవర్లలో ఒకదానిపై ఆకాశవాణి ముద్ర వుంది. రెండోది మరెక్కణ్ణుంచో వచ్చింది. పేజీలు తిరగేస్తున్నాడు మహీపాల్. పేజీలనిండా బొమ్మలే. చదవడానికి మేటరు చాలా తక్కువగావుంది. తర్వాత కవరు విప్పిచూసాడు. రేడియో కాంట్రాక్టుఫారం. ఫారం వరుసగా కొన్ని ప్రసంగాలు ఇవ్వడానికి సంబంధించినది. "నాల్గవ ప్రపంచ సంగ్రామం" అన్న శీర్షిక కింద మొదటిఉపన్యాసం— "స్త్రీ పురుషులు." చూసి నవ్వుకున్నాడు. ఆర్థిక అసమానత్వం భూమిమీద తొలగిపోయిన తర్వాత ఇక మిగిలే ముఖ్యమైన సమస్య స్త్రీ పురుషులకు సంబంధించిందే వుంటుంది. కనుక నాలుగోయుద్ధం అంటూ జరిగితే అది స్త్రీ పురుషులమధ్యే జరుగుతుంది. ఉపన్యాసం చాలా తమాషాగా వుంటుంది. అలాగే పరధ్యాన్నం రెండోకవరుకూడా చించి చూసాడు. "అఖండ సౌభాగ్యవతి చెల్లెలికి మీ అన్న ఆశీర్వాదములు చేసి వ్రాయునది యేమనగా....", కళ్యాణి వుత్తరం అది. పొరపాటున అదితెరచేసాడు. సర్వ సాధారణంగా ఇంటివాళ్ళ పేరవచ్చే వుత్తరాలు చదివే అలవాటులేదు మహీపాల్‌కి. కాని ఏస్థితిలో వున్నాడో మొదలు నుంచి చివరివరకు సాంతం చదివేసాడు.

వుత్తరం చదవగానే అతనిలో రక్తం ఉడికింది. కళ్యాణి కొంత పైకం పంపమని అన్నగారికి రాయగా ఇప్పుడు చేతిలో కసాటుగా వుందనీ, సాయం చెయ్యలేనని సమాధానం రాసాడు. ఇక మిగిలినవుత్తరం అంతా ఆయన ఏడ్పుపడిదాడు. తండ్రిగారిని అవమానించిన కారణంగా తమ్ముడిపెళ్ళికి ఒక్కో వెళ్ళలేదని మహిపాల్ బావమరిది రాసాడు. ఇక్కడి వియ్యాలవారూ, పెళ్ళివారూ అన్నీ ఎలా జరిగింది రాయమంటూ వుత్తరంలో రాసాడు. వుత్తరం చివర "మన రచయిత మహాశయుని గిరాకీ పడిపోయిందటగా!" అని కళ్యాణి అన్నగారు రాసాడు.

ఉత్తరం ముగించగానే పాదరసంలా అతనిలో కోపం పాకింది. పిచ్చివాడై పోయాడు. అసలే కళ్యాణి అంటే అగ్గిగుగ్గిలంలా అవుతోన్న మహిపాల్‌కు ఆమెమీద కసితీర్చుకోవడానికి బాగా నెపం దొరికింది. అతనిలో ప్రతీకారాగ్ని కార్చిచ్చులా రగుల్కొంది. డ్రాయింగ్‌రూమ్ తలుపులు మూయకుండానే గుమ్మం, నడవా అన్నీ దాటుకుంటూ పెద్దగదిలోకి వెళ్లాడు. అక్కడ చినిగిన గాలిపటానికి అతుకుపెట్టుకుంటూ తపోధన్ కనిపించాడు. తండ్రిగారి క్రోధావేశాన్ని చూసి వాడు హడలిపోయాడు. ఎదురుగావున్నా తపోధన్ తండ్రి గారికి ఎదురుపడలేదు. వంటపాత్రలు శుభ్రంచేసేచోట హడావుడిగా కనిపించింది. "తలుపువెనక నిలబడివుందు" అని ఏవేవో కళ్యాణి చెపుతూంది. శకుంతల మేనత్తగారికి ఎదురుగా పీటమీద కూర్చుని దానిమ్మపండు ఒలుస్తూవుంది. తల మీద ముసుగులేకుండా. రక్తో తల్లికిదగ్గరగా టీ సెట్టు కడిగి తుడుస్తోంది. మిఠాయి విప్పి ఒక్కో మిఠాయిలోంచి ఒక్కో ముక్క నగీషీ పని చేసిన వెండి పళ్ళాల్లో సర్దుతూ మేనకోడలికి ఏవేవో ఉత్తర్వు ఇస్తోంది కళ్యాణి. అను కోకుండా మహిపాల్ అక్కడికి వచ్చేసరికి హఠాత్తుగా వచ్చినట్లనిపించింది. మహిపాల్ ఆ క్రోధంలో కళ్యాణి మినహా ఎవ్వరూ కనబడటంలేదు. చేతిలో మడతలు విప్పిన వుత్తరం ముఖం కందగడ్డలావుంది. "నాతో వస్తావా" అంటూ కళ్యాణిని పిలిచి మహిపాల్ వెళ్ళిపోయాడు. భర్తముఖంవైపు చూడగానే కళ్యాణి ముఖంలో నెత్తురుచుక్క లేదు. చేతులు కడుక్కుని వెంటనే భర్తవెనకాలే వెళ్ళింది.

ఏమి జరిగిందోనని ఆమెగుండె దడదడమని కొట్టుకోసాగింది. అక్కడ ఓ గది వుంది. ఇంట్లో మరి సందడిగావుండే మహీపాల్ ఈ గదిలో కూర్చుని రాసుకుంటూ వుంటాడు. కళ్యాణిలోపలికి రాగానే అతను తలుపువేసాడు. కళ్యాణికి దగ్గరగావచ్చి బెదిరిపోతోన్న కళ్యాణి కళ్ళల్లోకి క్రూరంగా చూస్తూ అడిగాడు— "మీ అన్నగారిని రూపాయలు పంపమని రాశావా?"

ప్రశ్న వినగానే కళ్యాణి హడలిపోతూ అవుననీ, కాదనీ చెప్పలేక పోయింది.

మహీపాల్ రెట్టిస్తూ మళ్ళీఅదే ప్రశ్న వేసాడు.

"క్రిందటి నెలలో పుస్తకాల రాయల్టీ రావటానికి ఆలస్యం అవుతుందని మీరన్నారుగదా. పెళ్ళి చేసుకోవడానికి మా చిన్నతమ్ముడు పట్నంలోకి—"

"మీ చిన్నతమ్ముడు పెళ్ళిచేసుకోవడానికి వస్తే ఏం. అడవికిపోతే నీకేమి? నువ్వసలు పంపమని ఎందుకు రాసావు? అందరిలో నన్ను అవమానం చేయ్యాలనుకంటున్నావా?

"అన్నగారిని పంపమని అడగడంలో—"

"అన్నగాడుకానీ బావమ్మరిదికానీ, నాకుచెప్పకుండా ప్రైకం పంపమని ఎందుకురాసావు? నాకెందుకు చెప్పలేదు? బయటివాళ్ళ దృష్టిలో నన్ను ఎందుకు కించపరుస్తున్నావ్?"

"పొరపాటయిపోయింది. అన్న—"

"అదికాదు అన్నచెల్లెలా" అంటూ కళ్యాణి చెంప ఛెళ్ళుమంది. ఆరుగురు పిల్లలతల్లి, ముప్పైఎనిమిది సంవత్సరాల ఇల్లాలు చెంపఛెళ్ళుమనగానే అదిరి పోయింది". "దొంగముండా! నా పరువు గంగలో కలిపేశావు కదటే. పెద్ద సతీమతల్లి అని చెప్పుకుంటావు. ను....వ్వు...."

తలుపుబయట చెవులునిక్కబెట్టి రాజ్యశ్రీ నిలబడివుంది. తండ్రిగారివాలకం చూడగానే ఇవ్వాళేదో యుద్ధకాండ జరగబోతోందని వాళ్ళకు అప్పుడే సందేహం కలిగింది. డాక్టర్ షీలాతో తమ తండ్రికి సంబంధంవుందని ఇంట్లోవున్న పెద్ద

పిల్లలంతా మొదటే తెలుసుకున్నారు. ఏమిజరుగుతుందో అన్న కుతూహలం కొద్దీ రాజ్యశ్రీ తలుపు బయటే నక్కి వింటూవుంది. తల్లికెవ్వున కేకవేయడం "నోరు మూయ్. బయటికి అరిచావంటే ఖబడ్దార్" అంటూ తండ్రి బెదిరించడం, మళ్ళీ ఏడుస్తూ అమ్మఏదేదో వినపడీ వినపడనట్లుగా మాట్లాడటం, మళ్ళీ గొంతు తగ్గించి అరుపులూ, వెక్కి వెక్కి ఏడుస్తుండగా అర్థంకాకుండా తండ్రిగారు తిట్లు తిట్టడం, గుద్దులూ, లాగడం, మొట్టికాయలూ - అన్నీ వింటోన్న రాజ్యశ్రీ శిలాప్రతిమలా అయింది. తపించింది. మళ్ళీ ఉద్రేకంతో దబదబమంటూ తలుపు బాదుతూ "నాన్నగారూ, నాన్నగారూ, తలుపుతీయండి, తలుపుతీయండి అమ్మను కొట్టకండి. అమ్మను చంపకండి, నాన్నగారూ.... శకుంతలావదినా...." అంటూ కేకలువేసింది.

హిస్టీరియాతో బాధపడుతున్న రోగిలా కళ్ళనుంచి కారుతున్న కన్నీటితో ఉక్కిరిబిక్కిరైన హృదయాన్ని చీలుస్తున్నట్లుగా, ఎవరో గదిలో అరిచారు.

గబాలున తలుపు తెరుచుకుంది. గదిలోంచిబయటికి వాలోతూన్న తల్లిని రాజ్యశ్రీ అమాంతంగా కరుచుకుపోయింది. ఉం ప్రతీసేముందు ఏమీ జరగనట్టు వుండడానికి కళ్యాణి ఎంతగానో ప్రయత్నించింది. కాని కన్నకూతురు తల్లి ఒడిలో తలదాచుకోగానే కడుపులో దాచుకున్న దుఃఖ మేఘంలా ఒక్కసారిగా ఉబికికూతురిపై వర్షించింది. మహీపాల్ ముఖం పక్కకు తిప్పుకుని నిలబడి వున్నాడు. అతనిలో ఒకవైపు ఒళ్ళు తెలియని క్రోధం, మరోవైపు తన కిరాతకత్వంపై తనకేసిగ్గు. కన్న సంతానాన్ని చూడగానే క్రోధం కన్న అతనికి సిగ్గే ఎక్కువగా అనిపించింది.

అంతలో అనామికను ఎత్తుకుని శకుంతల కూడా అక్కడికొచ్చింది.

ఏడుపుతో బొంగురుపోయిన కంఠాన్ని సరిచేసుకుంటూ, కళ్ళుతుడుచుకుంటూ "ఇప్పుడే వస్తాను. వెళ్ళండి" అని పిల్లలతో కళ్యాణి అంది. పిల్లలు అక్కడ్నుంచి కదల్లేదు. మహీపాల్ గుమ్మందగ్గరకు వచ్చాడు. అకస్మాత్తుగా కళ్యాణిపాదాల్ని తాకుతూ "నన్ను క్షమించు" అంటూ పిల్లలవైపు తల ఎత్తలేక చరచరా నడిచి వెళ్ళిపోయాడు. అలాగే నడుస్తూ వెళ్ళుతున్నాడు-రోడ్లు,

కచేరీ కాంపౌండ్లూ ఇంకా ఎన్నో దాటుకుంటూ పురావస్తు ప్రదర్శనశాల భవనం దాకావచ్చి ద్వారమంటపం మెట్లమీద కూలబడ్డాడు.

లోపల వూపిరాడక ఓ వేడినిట్టూర్పు రెంఘుగా పీలి గుండెలోంచి బయటికి దూసుకు పోయింది. రాత్రిపూట నిర్జనంగా వున్న కూడలిలా అతని మనస్సంతా శూన్యంతో నిండింది. ఏది పాపం? ఏది పుణ్యం? ఏది ధర్మం? ఏది అధర్మం? అతను రెంటికీ చెందడు. మహీపాల్ దయాళువు. వివేకం కలవాడు. ఆలోచనా పరుడు, సిద్ధాంతవాది. కాదు. మహీపాల్ నిర్దయుడు. శుద్ధ అవివేకి. ఆలోచనా పాలోచనా లేనివాడు. అతనికో సిద్ధాంతం అంటూ లేదు. సత్యం– అసత్యం అనే కూడలిలో దారితెలియకుండా మారిపోయిన నిస్సారజీవి తాను ఎంతఅభాగ్యుడు. ఎక్కడికని వెళతాడు? ఏమి చేస్తాడు? కౌరవరాజైన దుర్యోధనునిలా వుంది తన పరిస్థితి. ధర్మ మార్గం తెలుసు. కాని అటువైపు వెళ్ళడానికి అతని మనః ప్రవృత్తి అంగీకరించదు. తాను చేస్తోంది అధర్మంఅని తెలుసు. కాని దాని మోహపాశం నుంచి తప్పించుకోలేడు. "నా హృదయంలో తిష్ఠవేసు కున్న యక్షుడు ఎటు స్టీరింగు తిప్పితే నా శరీరచక్రాలు అటువైపు తిరుగు తాయి." కాని ఇప్పుడా యక్షుని మెదడు కూడా పనిచెయ్యడం లేదు. అతని చేతులు కొంకర్లు పోయినట్టుంది.

శకుంతల వివాహం, పిల్లల చదువు సంజెలు, తండ్రిగా తాను వారి భవిష్యత్తు తీర్చి దిద్దేబాధ్యత, ఏకపత్నీ వ్రతం, ప్రియునిగా తన పాత్ర, రచయితగా దేశంపట్ల అతని విధి, సాహితీవేత్తగా శాశ్వతంగా నిలిచి పోవాలనే వాంఛ, ఒడుదుడుకులు లేకుండా సాఫీగా జీవితం వెళ్ళబుచ్చాలనే [illegible]న కోరికా, తపస్విలా వానప్రస్థం స్వీకరించి సాహిత్యానికి సేవ చేద్దామన్న స్వప్నం, నాలుగువైపులా అన్ని [illegible]గాల్లోనూ అతని ఓటమి, ఇన్ని అవరోధాలు వున్నా బతకాలన్న కోరిక అన్నీ తమతమ ఆకారాల్ని కుదించుని అంతర్ధానం అవుతున్నాయి. ఎంత ఆలోచించినా ఒక కొలిక్కి రాలేని యోచన. ఎంత దూరం నడిచినా గమ్యస్థానాన్ని చేరలేని ఒకటే నడక. విరిగిన రాతిబొమ్మల మధ్య విరిగిన మనస్సుతో కూర్చున్నాడు మహీపాల్. అతనిలోంచి వస్తోన్న ప్రతి

నిట్టూర్పు "హా....హా...హా....'' అంటోంది. ఆగిపోయిన యంత్రంలా కూర్చున్న మహిపాల్ శరీరంలో అది ఒక్కటే సంచలనం వున్నట్టనిపిస్తోంది.

# 25

భరత్‌పూర్ వైపుగా వున్న గోవర్ధనగిరి కొండవాలులో ప్రాచీనమైన విశాలం నీటి కొలను ఒకటి వుంది. దాని ఒడ్డునే విశాలంగా వున్న మూడు చెట్లు వున్నాయి. దట్టంగా వ్యాపించి వున్న ఆ చెట్ల నీడలో సజ్జన్, వనకన్య భోజనం చేసి తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. నెమళ్ళ కేకలతో కొండ అంతా ప్రతిధ్వనిస్తోంది. ఎక్కడో ఒక నెమలి కేకవేస్తే చాలు కొండ మీద వున్న నెమళ్ళన్నీ అనుసరిస్తాయి. అవి కూతలు వేయడం మానివేయగానే చెట్ల గుబుర్లలోంచి పక్షుల కలకలారావం వినపడుతుంది. కన్య టిఫిన్ కేరియర్ గిన్నెలు సర్దుతోంది. వాళ్ళున్న చోటికి కొంచెం దూరంలో నాలుగు కోతులు ఇంకా ఏమి పెడతారా అన్నట్లు నిక్కి నిక్కి చూస్తున్నాయి. ఆ కోతులు వాళ్ళ మీదకు ఎక్కడ ఎగబడి ఫలహారాలన్నీ లాక్కుపోతాయో అని వాళ్ళిద్దరు దిక్కులు చూసుకుంటూ బిక్కుబిక్కుమంటూ భోజనం చేసారు. గిన్నెల మీద తన శాలువ కప్పి దానికింద నుంచి సేండ్‌విచ్‌లు, పేడాలు నెమ్మది నెమ్మదిగా లాగి తినాల్సి వచ్చింది. దూరంగా వున్న కోతులు ఇకిలించినా వాళ్ళ దగ్గరున్న బెత్తం చూసి దగ్గరకు రావడానికి భయపడ్డాయి. వాటిని మరీ ఏడ్పించడం ఇష్టంలేక తాము తెచ్చుకున్న కొన్ని పళ్ళు, ఇతర భోజన పదార్థాలూ కోతులకు వేసారు. "కామ్రేడ్! పేడాలు మరికొన్ని వెయ్యరాదూ?" అన్నాడు సజ్జన్.

"ఇంకొద్దు. కింద టాక్సీ డ్రైవరున్నాడు''

"అతని కెందుకూ? అతని భోజనం యేర్పాటు అతనే చేసుకోలేడా ఏం?"

"నిజమే అనుకోండి. అయినా రోజూ పళ్ళు, పేడాలు అతనికి ఎవరిస్తారు?"

"మరి ఈ కోతులు ప్రతి రోజూ ఎలా-?"

"ఏమైనా జంతువులకంటే మనుష్యులకు నేను ప్రాధాన్యం ఇస్తాను".

"అది కాదు కామ్రేడ్. కనీసం గోవర్ధనం మీదైనా నీ అభ్యుదయ భావాల్ని మూట కట్టి ఓ మూల పెట్టరాదా? ఇక్కడ అంతా సమానమే కదా. అందరూ సమానం, అందరిదీ ఒకటే ప్రాణం, ఒదిలేయ్ అభిమానం. కామ్రేడ్! సిగరెట్ తాగాలనిపిస్తోంది"

"తాగు"

"వద్దులే. గోపాలుని ఈ పవిత్రమైన గడ్డమీద-"

"అంతా గోపాలునిదే"

"కన్యగారు. మీతో వాదించలేనండి. నేనే ఓడిపోయాను"

టిఫిన్ కేరియర్ సర్దుతూ నాలిగింటికి నాలుగు దూధ్ పేడాలు విసిరి వేసింది కన్య. మీది మూతను మూసేసి నవ్వుతూ అంది- "మీకు నమస్కారం చేస్తాను మహాత్మా. దయచేసి చీటికి మాటికి గెలుపు ఓటమిల ప్రస్తకి తీసుక రాకండి"

"ఎందుకని?"

"ఇవ్వాళ కొంపతీసి ఓడిపోయా వంటే రేపు గెలుపొందాలని అంగలారు స్తావు. మీ ఆర్టిస్టిక్ మూడ్స్ వున్నాయి చూశారూ, వాటిని దయచేసి మా దరిదాపు లకు రానివ్వకండి".

నేలమీద కోటు జేబులోంచి సిగరెట్ కేస్ చేతిలోకి తీసుకుంటూ ముఖాన్ని అదోలాగా పెట్టి "ఆర్టిస్టు జీవితస్వామిని కావాలంటున్నావు. ఆర్టిస్టిక్ మూడ్ నుంచి ఎలా తప్పుకుంటావ్?"

"అవును మిస్టర్. మీ ఆర్టిస్టులకు వచ్చి పోతోండే మూడ్స్‌కు సరిగ్గా కాపలా కాయాలంటే వేశ్యారత్నాలకే చెల్లుతుంది. గృహిణి ఎంతనేర్పు, ఓర్పు వున్నదైనా ఆమెవల్ల మాత్రం కాదు" అంది కన్య గంభీరంగా ముఖాన్ని పెట్టి.

సజ్జన్ కట్ట తెంచుకుంటోన్న మత్తు కన్య మాటలతో మళ్ళీ నిగ్రహం అనే నాలుగు గోడల మధ్య కుదించుకు పోయింది. నోట్లో సిగరెట్ పెట్టుకుని రావాలకి కొంచెం కష్టం వేస్తూ సజ్జన్ అన్నాడు- "నువ్వు అందరి ఆర్టిస్టులమీద నేరారోపణ చేసావు. నావుద్దేశంలో ఆర్టిస్టనే వ్యక్తి ముఖ్యంగా స్వభావసిద్ధంగానూ పవిత్రమైన మనస్సు కలవాడిగానూ వుంటాడు. నిత్య జీవితంలో ఎలాగోలా వుండొచ్చు అనుకో".

"నేను మాట్లాడేది నిత్య వ్యావహారిక జీవితం గురించే. ఇది నీ ఒక్క విషయం కానే కాదు. సాధారణంగా ఏ కళాకారుడైనా ఏరకంగానైనా గట్టి కొరత అనండి, లేమి అనండి, వున్నప్పుడే అతని హృదయం ఆవేదన పడుతుందని నా అభిప్రాయం. అమూల్యమైన ఆ మానసిక సంపత్తిని ఒక్క వేదాంతికే లేక కళాకారుడికే అంట గట్టినట్టుగా పొగడుతారు. కాని అతనిలో ఆవేదనానుభూతులు సమపాళ్లలో లేనప్పుడు ఆ కళాకారుడు ఆ లేమిగురించి దుఃఖిస్తూ ఎంతో కరుడు గట్టి పోతాడు. ఒక్కో పర్యాయం అతని మనస్సు జడత్వాన్ని పొందుతుంది. ఆ కరుడు కట్టిన తనంచేత తనవల్ల ఇతరులు ఎలాంటి బాధపడతారో అని కూడా అతను ఆలోచించలేడు.

"చెప్పదం అయి పోయిందా?"

"ఆహా" సజ్జన్ అడిగిన తీరు చూసి నవ్వుతూ అంది వనకన్య.

గట్టిగా ఓ సిగరెట్టు దమ్ములాగి దట్టంగా పొగవదులుతూ ఎదురుగా వున్న ప్రాచీన గౌడ మఠం కూలిపోయిన గోడల్ని పరికిస్తూ చాలా ప్రశాంతంగా ఏమాత్రం అరమరికలు లేకుండా మాట్లాడుతున్నట్లుగా సజ్జన్ అన్నాడు- "చూడు డార్లింగ్, ప్రస్తుతం నిన్ను ఈవిధంగానే పిలవటానికి ఆమోదించు-నేను ఇలా పిలిచే మూడ్‌లోనే వున్నాను. మనోభావాలు సంబంధించినంత వరకు కళాకారులం అంటూ మమ్మల్ని కానీ నన్ను కానీ ఇతర మనుష్యుల కంటె విచిత్రంగా జమకట్ట వద్దు సుమా' నీ స్వర్గీయురాలైన వదినా, నీ తండ్రి. ఈ కనపడే కోతులూ, కిలకిల మంటోన్న ఈ పక్షులూ ఇవన్నీ ఎలా జీవరాసులో, అలాగే

కళాకారులం అయివుండి కూడా మేమూ మానవ మాత్రులమే. ఆకలి, ఆదది ప్రతి మనిషికి ప్రాథమిక అవసరమైనట్టే నాకూ అవసరమే. ప్రతి సామాన్య వ్యక్తిలో వుండే అవేదనా, ఆర్తి నాలో కూడా వేర్లు నాటుక పోయాయి.

"క్లుప్తంగా చెప్పు"

"క్లుప్తంగా చెప్పాలంటే జీవితమే ఓ అనుభవం. టైమ్- అంటే....
"అదే కాలం"

"దేర్ యూఆర్! జీవితం నిరంతరం ప్రవహించే కాల ప్రవాహం లాంటిది. కాలాన్ని ఒక్క ప్రాణే అనుభవిస్తాడు. దాని ప్రాశస్త్యాన్ని అతనొక్కడే గుర్తిస్తాడు. అన్ని ప్రాణులకంటే మానవ ప్రాణికి ఎక్కువబుద్ధిబలం వుంది. అందువల్ల తన అనుభవాన్ని అనేకానేకరకాలుగా ప్రకటించగలడు. అనుభవం వల్లనే అతనిలో సృజనాత్మకశక్తి వికాసం చెందుతుంది. ప్రతివ్యక్తి జీవితంలో గడించిన అనుభవం అతని చరిత్రగా దిద్దుకుంటుంది ఆ వ్యక్తి నాలాంటి కళాకారుడూ కావచ్చు మరేదైనా కావచ్చు".

"కాని అనుభవం అనేది మూగవాడి మాటలాంటిదే కదా! తాను పొందిన అనుభవాన్ని మనిషి స్పష్టంగా ప్రకటించలేడు. ఉదాహరణకు నా విషయంలో నువ్వు ఏ అనుభవాన్ని గడించావో చెప్పగలవా? నేను కేవలం ఒకరూపాన్ని ఆకారాన్ని తొడుక్కునే నీకు కనిపిస్తున్నానా? నా ఈ సౌందర్యం కేవలం నా రూపం, రంగులోనేనా నీకు కనపడుతుంట?

"నా విషయంలో నీకు దురభిప్రాయం వున్నట్లుంది. నీ శరీర సౌందర్యమే నా జీవితానుభవంగా నేను అనుకోవడంలేదు. నిన్ను చూసి శారీరికంగా నిన్ను పొందాలనేకోరిక నాకు కలగడంలేదని నేను అనడంలేదు. ఆరోజు, అవకాశాన్ని వినియోగించుకొని నిన్ను శారీరికంగా అనుభవించాలనే నేను అనుకుంది."

"అవకాశాన్ని వినియోగించుకోవాలన్న యోచన అనుభూతి కాదామరి?"

"అవుతుంది. ఈ విషయం మరోసారి చర్చిస్తాను. నేను చెప్పేది ఏమంటే ఆరోజు నీకిలాంటి పెద్ద అనుభూతిని కలుగజేసి కూడా-"

"నేనా అనుభూతిని చెడ్డగా తీసుకోలేదనుకో, మరప్పుడు?"

"వుండొచ్చు. నాకు సంబంధించినంతవరకు నేను చెడ్డ అనుభూతినే కలగజేసాననుకుంటాను".

"చెడ్డగా భావించివుంటే బహుశాదాన్ని ప్రకటించే వుండకపోయేవాడివి"

"నువ్వు పైపైనే తారట్లాడుతున్నావు కన్యా. నేను అనుభూతిని గురించి మాట్లాడుతున్నాను. అది మంచిదీకాదు చెడ్డదీకాదు."

"మంచీచెడ్డా అన్న ప్రసక్తి నువ్వేగా తెచ్చింది?" అంటూ సజ్జన్‌మాట సజ్జన్‌కి అప్పజెప్పుతూ చిన్నగా నవ్వింది వనకన్య.

కన్య తన చిరునవ్వులో కనపరచిన సొగసు చూసి సజ్జన్‌లో అణిగి వున్న కామవాంఛ పులకరించింది. అతని అంతర్దృష్టి ఆ పులకరింతకు కొలిమిలో బాగా కాలుతోన్న లోహానికిమల్లే రంగుకల్పించింది. అనుభూతి ఇచ్చిన ఆ అంతఃస్పర్శ అతనికి పెద్ద విఘాతం కలిగించడమేగాక అతని మనోవేదన మరింత ఘాటుగా వుండేట్లు చేసింది. అతని మానసిక ఆకాశంలో ఎన్నో ఆలోచనలు ఉదయించి అస్తమించాయి. ఎన్నో వికారాలు పొద్దుపొడిచి, చూస్తుండగానే పొద్దుగుంకాయి. అయినా కన్య విసిరిననవ్వు అతని హృదయంలోకి లోతుగా చొచ్చుకుపోయి జలజల పారుతోన్న కొండవాగులా అతని నరనరంలో పాకిపోయింది. ఆమె ముఖకమలం మీద వికసించిన చిరునవ్వులో అతనికి సౌందర్య పిపాసకునికి కావలసిన రూపరసగంధస్పర్శ అన్నీ ఒక్కసారిగా ముందు సాక్షాత్కరించాయి. అతనికి సంపూర్ణత్వం, ఆనందం కలిగాయి. ఇవిపొందిన బాహ్య జగత్తంతా అతనిలోని క్రియాశీలతా ఒక్కసారిగా విశ్రమించాయి ఒక్కక్షణంలో అనేకమైన పొరల్లో అతని అనుభూతులన్నీ ఒకే సమయంలో పరుగెత్తుతున్నట్లనిపించింది. ఒక్కొక్క పొర మిగతా పొరల్తో అభేద్యంగా కలిసిమెలిసి పోతూన్నట్లుగా కనిపించిది. నాలుగు మూరల దూరంలో కూర్చున్న కన్య నాలుగు జానెల దూరంగా వున్నట్లు కూడా అనిపించలేదు. ఆమె తన అంతర్యంలోనే నిండుకున్నట్లయింది. ఆ నిండుకోవడం చేతనే తను సంపూర్ణత్వాన్ని పొందినట్లుగా అనుభవాన్ని కలుగజేస్తోంది. అత

నిలో వున్న లేమి అంతా కరిగిపోయింది. అతనిలో చెలరేగిన మనోవికారాలన్నీ శాంతించాయి. గోవర్ధనగిరి, కోనేరూ, చెట్ల సముదాయం, పశువులూ, గౌడమఠం ఎండలో తళతళమంటోన్న ఆకాశం-స్వయంగా తానూ తన ముందు ఓ కోమల ఆకారాన్ని తొడుక్కుని, వున్న కన్య-కనికట్టులా కళ్ళను కట్టివేసి తనవైపు ఆకర్షిస్తోన్న వనకన్యా-అందరూ అన్నీ రూపాలు వేరైనా వాటిలో ఏ అభేదమూ ఎలాంటి వైపరీత్యమూ కనపడడంలేదు. చుట్టూ పరిసరాలతో ఆమె తానూ వాళ్ళిద్దరూ-అణువణువునా కలిసిపోయినట్టుగావుంది.

అదో అద్భుతమైన క్షణం-అదో విచిత్రమైన అనుభూతి. ఆ అనుభూతి ఎంతో తీవ్రంగానూ వేడిగానూ వుంది. అయినా అందులో సహజత్వం వుంది. ఆ సహజత్వమే సౌందర్యం. ఆ సౌందర్యంతోనే నిండిపోయాడు సజ్జన్. ఆ నిండుదనానికి కారణం వనకన్య.

సజ్జన్ కళ్ళలోని తన్మయత్వాన్నీ ఆనందంలో కడిగి ఆరబెట్టిన ఆ ముఖ కవళికా ప్రభావం నుంచి కన్య కూడా తప్పించుకోలేకపోయింది. ఆ కడగి తుడిచిన స్వచ్ఛమైన ముఖం ఆమె ప్రాణప్రియుడిది. అమె సొంత ప్రియసఖుడిది. సజ్జన్‌ని చూసి ఆమె వుద్రిక్తంకాలేదు. ఆమె అణువు అణువులో సజ్జన్ నిండిపోయాడు. ముచ్చట వస్తోన్న ఆ అందాల అమాయకపు ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని ముద్దాడడమూ అనిపించింది. సంవత్సరాల తరబడి అణుచుకుంటూ వస్తోన్న కోరిక ఒక్కసారి బిడియాన్నంతా విడిచి బహిర్గతమైంది. తన ఆలోచనలు తననే సిగ్గిల్లజేస్తున్నాయి. ముఖం గులాబీరంగుని పులుముకుంది. కళ్ళని సైతం కిందకు వంచుకుంది. తన మనోభావాన్ని సజ్జన్ ఎక్కడ పసికడతాడో అన్న వుద్దేశ్యంతో సిగ్గుదొంతర్లను వయ్యారం అనే కొంగుతూ కప్పివేస్తూ సజ్జన్ వైపు చూస్తూ "కళాకారుడు ఏదో స్వప్నంలో తేలిపోతున్నట్లున్నాడు?" అంది.

కన్య పలకరించేటప్పటికి సజ్జన్ తను స్వప్నలోకంలో వున్నానని తెలుసుకుని సిగ్గుపడ్డాడు. "నీతో నేను ఓడిపోయాను. కాని ఆ ఓటమిలోనే నా గెలుపు వుంది" అన్నాడు నవ్వుతూ.

"మళ్ళీ గెలుపూ ఓటమి అంటూ పాతపాట పాడుతున్నావు. నువ్వేమైనా అనుకో సజన్. నువ్వు ఈమాదిరిగా ఆర్టిస్ట్ మూడ్‌లోకిరాకుండా ఏదో ఓ అంతరాయం కల్పిస్తుంటాను."

"వేణుగోపాలుని కోసం ఏమైనా చెస్తుందట కాని పెదిమలకు తాకించి అతను వూదిన వేణువును మాత్రం తన పెదాలకు తగిలించనని అన్నదట."

"సరేపద. వెళ్దాం"

"వుండవోయి. రసఖాన్ రాసిని ఆ 'కవిత్త' పంక్తులు కొంచెం జ్ఞాపకం తెచ్చుకోనీయ్"

"రసఖాన్ రాసింది కవిత్త్‌లో కాదండి మహాశయా! సవైయ్యాలో రాసారు."

"ఏదో ఓ ఛందస్సు కానీయి. ఏంరాసారు...ఉహూ...ఏమిటది కన్నా'"

"ఏదో రాసారు. నాకేం జ్ఞాపకం. నా బుర్రంతా గందరగోళంగా వుంది. కవిత్వం ఈ బుర్రలో ఇమడదు. ఇక వెళ్దాం పద."

"ఆఁ జ్ఞాపకం వచ్చింది—"తేరే కహే సబ్ స్వాంగ్ కరోంగీ....
మోర్‌పఖాసిర్ ఊపర్ రాఖియో గుంజ్ కి మాల్ గలే పహిరోంగి
ఓఢీ పీతంబర్ లై లకుటీ బన్ గోధన్ గ్వారిని సంగ్ ఫిరోంగి
భావతో వోహి మేరో రసఖాన్ సో తేరే కహే సబ్ స్వాంగ్ కరోంగి
యా మురళీ మురళీధర్‌కీ అధరాన్ ధరీ అధరాన ధరోంగీ

[నువ్వేం చెప్తే ఆరకంగా వేషం వేస్తాను. తలకు నెమలిపింఛాన్ని తగిలించుకుంటాను. మెడలో గురివిందలమాల వేసుకుంటాను. కృష్ణుని మాదిరిగా పట్టు పీతాంబరం ధరించి చేతికర్ర తీసుకుని ఆలమందల వెనక గొల్లదానిలా తిరుగుతాను. ఓ రసఖాన్ (మకుటం)!ఓ రసఖనీ! (శ్రీ కృష్ణుడు)! అతనికే ముద్రా భంగిమలు నచ్చితే అవన్నీ చేస్తాను. కాని మురళీ కృష్ణుడు తన పెదవులకు తాకించి వేణుగానంతో జగత్తును రసజగత్తులో ముంచెత్తే మురళిని మాత్రం నేను నా పెదవులకు తాకించలేను. అంత శక్తి నాలో లేదు].

"ఆహా! ఆహా! ఎంత చక్కగా చెప్పారు! కన్యా, జస్ట్ ఫర్ ఏ సెకండ్.... అలాగే నిలబడివుండు"- ప్లీజ్!

జేబులోంచి పెన్సిలూ స్కెచ్ బుక్కూ తీసాడు సజ్జన్. కన్య 'నీవు' అంటూ ఏదో నసగబోయింది.

"నువ్వేమీ మాట్లాడకుండా అలా నిలబడివుండు"

స్కెచ్ గీస్తున్నాడు సజ్జన్. కన్య రాధ వేషంలో తలపై నెమలి పింఛమూ గుంజమాల, పట్టు పీతాంబరం. ఎడమ చేతిలో చేతికర్ర చిత్రంలో కుడివైపు రెండు చేతులు- శ్రీ కృష్ణుడు తన రెండు చేతులలో వేణువు సమర్పిస్తున్నాడు. రాధ వేషంలో కన్య కళ్ళలో సిగ్గుపుటమరించింది. పెదిమంపై నవ్వు వచ్చి ఆగి పోయింది. చూపుల్లో రోషం, త్రిభంగి ముద్రలో నిలబడి వుంది. కుడిచేతి వేళ్లు వద్దు వద్దు అంటూ చిలిపిగా వారిస్తున్నాయి.

కన్యకు 'క్రీడ' బాగా నచ్చింది. తాను కళాకారునికి ప్రేరేపణ ఇచ్చే మహా శక్తిలా వుంది. ఈ కల్చరల్ తతంగం అంటే ఆమె స్వభావానికి పడదు. సజ్జన్ అనే ఓ పురుషునికి ఆమె మనసు అర్పించింది. అంత వరకే ఆమెకు తెలుసు. అయితే సజ్జన్ కళాకారుడనీ, శ్రీమంతుడన్న విషయాలు కూడా తప్పని సరిగా తెలుసు. అయితే సమాజంలో ప్రతిష్టగల వ్యక్తికి శ్రీమంతునికి తాను భార్య కాబోతున్నాననే యధార్థం ఆమె దృష్టిలో అంత ప్రత్యేకత సంతరించు కోలేదు. అన్నింటి కన్న ముఖ్యమైందీ, అందరికీ అర్థమయ్యేదీ ఒకటే మాట- తాను సజ్జన్ అనే ఓ పురుషుని తన జీవిత భాగస్వామిగా చేసుకుంటోంది తన జీవితంలో మొదటి సారిగా సజ్జన్ వియోగం ఆమెను ఎలా కలవర పెట్టగలదో నిరూపితం అయింది. మొన్నటి రోజున సజ్జన్ ఇంటికి తిరిగి రాకపోయే సరికి అతని వియోగంలో తన అంతర్యం గురించి ఆమె రెండు సత్యాలు తెలుసుకుంది. ఒకటి సజ్జన్ వ్యక్తిత్వం ముందు తన వ్యక్తిత్వం సమర్పణ చేసుకుంటోంది. రెండోది ఈ భావం కనబడ చకుండా ఆమె పైపైకి కపట నాటకం ఆడుతోంది. సజ్జన్ కళ్లు ప్రేమతో మెరిసిన రోజు నుంచే తను కూడా అతణ్ణి ప్రేమించాలి అంటూ లోపల్నుంచి పొంగివస్తోన్న కోరికను అణుచుకోలేక పోయింది. దాన్ని

ఎంతగా ఆపుకోవాలని ప్రయత్నించినా ఆమెకు సాధ్యం కాలేదు. సజ్జన్ మొండి కెత్తాడంటే ఆమె మెత్త పడుతుంది. స్త్రీ హక్కు, పురుషుల ఆధాయిత్యాలు, పురుషులంటే ఓ రకమైన ద్వేషం, స్త్రీత్వోత్కర్ష, చదువూ సంజెలు, తాత్విక చింతన మొదలైన విషయాల్లో ఆమెకున్న ప్రత్యేక అర్హతా యోగ్యతా అన్నీ సజ్జన్ పట్టుదల ముందు అవిరైపోతాయి. ఆమె కోరికకు పురుష రూపం పోసుకున్న వ్యక్తే సజ్జన్. ఏ పురుషుడూ తనను ఆదోరకంగా చూడ్డం సహించలేక పోయింది.. ఆమె జీవితంలో సజ్జన్ అడుగు పెట్టక ముందు ముగ్గురు వ్యక్తులు ఆమె ముందు ప్రస్తావనచేసినా ఆమె తృణీకరించింది. అటువంటి బింకం కల వనకన్య ఇవ్వాళ సజ్జన్‌కు దాసోహం అంది. మొన్న రాత్రి ప్రియుని రాకకై ఎదురు చూస్తూ కన్నీటిలో తడిసి స్నానం చేసిన తర్వాత ఈవిధంగా అతనికి సమర్పించు కోవడం ఆమె కిప్పుడు అవమానకరంగా లేదు. బృందావనం అంతా కాళ్ళకు బలపం కట్టుకొని తిరిగి తిరిగి వేసారి ఎండిపోయిన కన్నీటి చుక్క అయింది, ఆమెకు విస్తృతంతా అంధంలో పడి గుహాగానూ భయంకరంగానూ కనపడ సాగింది. మధుర. లక్నో లకుగాని మళ్ళి దకుగాని వెళ్ళ కూడదని నిశ్చయించు కుంది. బంధువర్గానికి గానీ, స్నేహితులకు గానీ తన ముఖం చూపించ కూడదని మనస్సు దిటవు చేసుకుంది. మనసంతా విషాదం నిస్పృహలని కాళ్ళు దారి కనరాక తడబడుతూ వున్న సమయంలో ఆమెకు అకస్మాత్తుగా ఆమె పెన్నిధి సజ్జన్ కానిపిస్తాడు. సేవాకుంజ్ మీద నుంచి ఆమె కాళ్ళీడ్చుకుంటూ నడుస్తోంటే పక్క సందులోంచి సజ్జన్ ఆమెను పేరు పెట్టి పిలిచాడు, అతని కంఠం వినగానే ఆమెకు అంతరాత్మ విస్మితమైయింది. సజ్జన్ గుమ్మం దగ్గర నిలబడ్డాడు. నోరు తెరుచు కుని అలాగే నిలబడి పోయింది. ఆ అనుకోని సంఘటనను వూహించుకుంటూ హృదయాన్ని రెండు చేతుల్తో పట్టుకుంది. సజ్జన్ తనకు పది అడుగుల దూరంలో వున్నా ఆమె ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేక పోయింది. ఆమెకు కాళ్ళాడలేదు. బలవంతిగా ప్రయత్నించబోతే భూమి మీద కాళ్ళను ఆన్చ లేక పోయింది. వెంటనే పరుగెత్తుకుని వచ్చి సజ్జన్ ఆమె జబ్బను పట్టుకొనక పోయిన పక్షంలో స్పృహ తప్పి వెంటనే కిందపడేది. మానసిక అవస్థ చూడగానే సజ్జన్‌లో వైరాగ్యం కర్పూరంలా కరిగి పోయింది. అతనిలో కరుడు గట్టిన

వ్యక్తిత్వం అంతా రాలి పెళ్ళల్లా విరిగి విరిగి అతని గుండెమీద పడసాగింది. అక్కడే ఓ బంగాలీ వైష్ణవ భక్తురాలి ఇంట భగవంతుని అవతారం చూసి ఆమెకో ఐదు రూపాయలు సమర్పించుకుని ఓ గంపెడు దీవెనలు పొంది సజ్జన్ అప్పుడే గుమ్మం దాటి బయటికి వస్తున్నాడు. అతను కన్యను ఆ ఇంట్లోకి తీసుకవెళ్లాడు. నేర్పరి అయిన ఆ వైష్ణవి ఇంకా బహుమతి అందుకో వచ్చున్న ఆశతో సపరి చర్యలు చేసింది. నడవాలో వున్న మంచాన్ని తెచ్చివేసింది. దానిపై చినిగిన బొంత వుంటే పరిచి అక్కడ విశ్రాంతి తీసుకోమని సలహా ఇస్తూ బావి నుంచి అప్పటికప్పుడు నీళ్ళు తెచ్చి వాళ్ళదాహం తీర్చింది. తర్వాత సజ్జన్ డబ్బుతో బజారుకెళ్ళి పాలు తెచ్చి టీ, పూరీ పంచభక్ష్య పరమాన్నాలు చేసింది. ఠాకూరుకు నైవేద్యం పెట్టి ఇద్దరికి సుష్టుగా భోజనం వడ్డించింది. ఎన్నో ఎన్నో తియ్యటి కబుర్లు చెప్పింది. కూర్చుంటూలేస్తూ ఆశీస్సులు పలుకుతూ పాపటిలో సిందూరం రాసుకోనందుకు కన్యని సూక్ష్మంగా మందలించింది. సజ్జన్, కన్య ఇద్దరు వెళ్ళ బోతూంటే రాధ విగ్రహంమాల సజ్జన్‌కి, మాధవుని దండ కన్యకు వేసిమళ్ళీ ఎన్నో కొత్త కొత్త దీవెనలు పల్కింది. ఎన్నో మంగళవచనాలు మాట్లాడింది. పర్సు కన్య చేతికిచ్చి ఆమెకు దక్షిణ ఇవ్వమన్నాడు సజ్జన్. వైష్ణవి కొంపలో పూర్తిగా నాలుగుగంటలు వున్నా నాలుగు నిమిషాలే మాట్లాడిన కన్య యోగ క్షేమాలు అడగడం మినహా మరేమీ మాట్లాడలేదు. మనస్సు విప్పి మాట్లాడు కోవడానికి వీలు చిక్కలేదు. అదీకాక మౌనంగానే ఇద్దరూ ఆవేదన పొందుతూ వున్నారు. సాయంకాలం ఇద్దరూ మధుర వెళ్ళిపోయారు. ఇంటికి వెళ్ళకుండా కన్యను తిన్నగా బజారుకి తీసుకెళ్ళాడు సజ్జన్. కన్యకోసం మొత్తం ఎనిమిది వందల రూపాయలు ఖర్చుపెట్టి చీరెలు కొన్నాడు. బంధువు కోసం ఓ మంచి చీరె తీసుకున్నాడు. కన్యకు కొత్త చెప్పులు కొన్నాడు ఓ ఖరీదైన వేనిటీ బేగ్ (చేతిసంచి), శాలువా కొన్నాడు. వద్దంటూ కన్య మెల్లిగా రెండు మూడు పర్యా యాలు వారించింది. కాని ఆమెమాటల్ని అతను పెడచెవిని పెట్టాడు. బజారులో పని చేసినా గంటా గంటన్నర సమయంలో సుమారు పన్నెండు వందల రూపా యలు ఖర్చుపెట్టి ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు. ఏ అరమరికలు లేకుండా ఆ రోజంతా సజ్జన్ కన్య విచ్చలవిడిగా మాట్లాడుకున్నారు. మంతనాలు చేసారు.

బంధువులకు తమ గురించిన అపోహలను నిరాధారం అని నిరూపించారు. కన్య వరుసకు వదినగారైన తన చనిపోయిన ఒదినగారి స్నేహితురాలి సందేహాలన్నీ తీర్చింది సజ్జన్ కోరిన ప్రకారం కొత్తచీరె సింగారించుకుని అతనివెంట సినిమాకు వెళ్ళింది. అపునస్సమాగమం తర్వాత ఇవ్వాళ ఇద్దరూ కలిసి గోవర్ధన గిరి పర్వతం చూడ్డానికని వచ్చారు.

రసఖాన్ వర్ణించిన ప్రకారం కన్యను చిత్రంలో దింపాడు సజ్జన్. రఫ్ స్కెచ్‌లో కూడా కన్య నెమలిపింఛం, గుంజమాల, పీతాంబరాన్ని ధరించి మోహినీ అవతారం ఎత్తినట్లుగా వుంది. మురళి గురించి వారిస్తున్న కన్య చాలా హృదయాహ్లాదకరంగా చిత్రించ బడింది. తన కళా కౌశలం చూసి మురిసి పోయాడు సజ్జన్. స్కెచ్‌ని ఆదేపనిగా కన్నార్పకుండా చూసి దాహం కొన్న కళ్ళతో కన్యవైపు చూసాడు.

బ్రహ్మచారిణి అయిన కన్య అంతశ్శృంగారాన్ని ఓర్చుకోలేక పోయింది! ఆమె చాలా పారవశ్యంతో సజ్జన్‌ని చూసింది. ఆచూపు అతణ్ణి ఆనందభరితుణ్ణి చేసింది. అతని పురుషార్థం వుల్లాసంలో తేలిఆడింది. అతని మనసు మీద అతనికి పట్టు తప్పింది. ఐదారు రోజుల క్రితం లక్నోలో తన ఇంట్లో కన్యను చూసి అతను ఇలాగే పారవశ్యం పొందాడు, కాని యీరెండు అనుభూతుల్లో తేడా వుంది. కన్య కళ్ళల్లోకి తన కళ్లలోని దిప్పికను పర్షిస్తూ లేచాడు. లేస్తూ లేస్తూ టిఫిన్ కేరియర్‌ను తన్నేసి తూలిపోబోతూ కన్య మెడకు తన చేతులు పెనవేసి ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. రెండు శరీరాలు పరస్పరం స్పృశించి విద్యుత్తు ప్రవహించింది. ప్రియుని మోహినీ మంత్రంచే బంధింపబడిన కన్యకళ్ళు నిశ్చలమయ్యాయి. ముఖం అంతా ఎర్రబడి గళరాలో ఆక్కడక్కడ తెల్ల పడుతూ అసలేతెల్లని శరీరఛాయకు ఎన్నో వన్నెలుతెచ్చింది. ఆమె కుడిచేయి అతని ఎడమ చేతితో కట్టివేయబడి అతని హృదయకంపనాల్ని వింటోంది. వస్త్రాలతో చుట్టబడి వున్న ఆమెదేహం పురుషదేహ స్పర్శతో వెచ్చదనం పొందుతూ మత్తు ఇస్తూవుంది. చెంపలకు చెంపలు తాకి ఇద్దరి శ్వాసలు ఒకేదారంలో గుచ్చ బడుతోన్న సందర్భంలో "ఓరేయ్ సూరాపంట్రా ఈ ఇసిత9ం ఇదేళాల రేపలు

దబ్బాలకు దబ్బాలునమిలి గిరిరాజాకొండమీద ముద్దులయాపారంనడిపిస్తోన్నావ్రా" అంటూ మఠం మొండిగోడపై నిలబడి ఎవరో గోసాయి లాంటి ముఖంతో నవ్వు తున్నాడు. ఆ మాటలు వినగానే కన్య సిగ్గుతో సిరుకారిపోయింది. తలతిప్ప కుండా కొండవాలుగా పరుగెత్తింది. సజ్జన్ కూడా కొద్దిగా సిగ్గుపడ్డాడు. గోడ వైపు చూడకుండా పెన్సిల్, స్కెచ్‌బుక్కూ కేన్వాస్‌సంచిలో పడేసి కెమెరా, థర్మాస్‌ని భుజానికి తగిలించుకొని, కోటు జబ్బంమీద వేసుకుని చేత్తో టిఫిన్ కేరియర్ పట్టుకొని, వేగంగా, నడిచాడు కన్య వెళ్ళిన దిక్కుగా. సేండల్స్ కాళ్ళకు లేవేమో కన్య ఎక్కువ దూరం పరుగెత్తలేకపోయింది. చెట్టుదాటి వాలు వైపుగా వెళ్ళుతూ ఇద్దరినీ విడదీస్తోన్న సిగ్గుతెరపై మరొక పర్దావేస్తూన్నట్టుగా వేళాకోళం చేసాడు. "ఏం ప్రియా అలా పరుగెత్తిపోతున్నావ్. కొంచెం ఆగు. నేను కూడా వస్తున్నా."

అతని మాటలు వినగానే కన్య నిలబడిపోయింది; వెనక్కు తిరక్కుండా. ఆమెకు దగ్గరగా వెళ్ళి సజ్జన్ మరో ఛలోక్తి విసిరాడు-"ఏయ్ దొంగ తెల్లదొర సానీ! దబ్బాలకు దబ్బాలు చేపలు తిని ఎక్కడికి పారిపోతున్నావ్?".

కన్యకు సిగ్గుతో పాటు చిరుకోపం కూడా వచ్చింది. అయినా నవ్వకుండా వుండలేకపోయింది. "వుండండి, మీరు చాలా పోకిరీ వాళ్ళు మరీను" అని అంది.

"పోకిరీ గీకిరీ అంటే పరువునష్టం దావా వేస్తానుసుమా. నేనేం పోకిరీపని చెయ్యలేదు. పూరికే నన్ను పోకిరీ అంటున్నావు. ఓహ్. ఇదేకాల చేపా-అయ్యాం సారీ-ఏమి మగువరా ఈమె. దబ్బాలకు దబ్బాలు నమిలి నేను యింత పెద్ద మని షిగా వ్యవహరిస్తోంటే నన్ను పోకిరీ అంటోంది.

సజ్జన్ నటిస్తూ ఆ మాటలు వల్లిస్తోంటే ఆమె చిరుకోపం, సిగ్గుతగ్గాయి. అతణ్ణిమాని కిలాకిలా నవ్వుతూ "నువు మహా తుంటరివి" అని అంది.

"థేంక్యూ ఫర్‌ది కాంప్లిమెంట్"

"నీకేం వేళాకోళంగా వుంది. నాకు గుండె దడ ఇంకా తగ్గలేదనుకో".

''గుండెదడదడ రసవత్తర జీవితానికి నిదర్శనం, నువ్వు కొద్దిగా కూడా స్పోర్టివ్‌గా వుండలేవు మరీను."

"పోనీలే" అంటూ కన్య మళ్ళీ గంభీరంగా–"ఇకనుంచి నీ మనస్సును కొంచెం అవివుంచు. నిన్ను చూడగానే నేను వశం తప్పుతున్నాను"అని అంటూ నువ్వెందుకు గ్రహించలేవన్నట్లుగా అతణ్ణి చూసింది.

"నువ్వు మరీ గోరంతను కొండంతగా చేస్తున్నావు". కన్య గంభీరంగా అనడం అతనికి అసందర్భంగా తోచింది. కొద్దిగా విసుగు కనపరుస్తూ "ఆ భూతంగాడు చూస్తే ఏమయింది? మహాసరదాగా వుంది."

''నీకు సరదాగా కనిపించిన ప్రతిక్షణం జీవితంలో నేను గడిచిన ఓ పవిత్రానుభూతి" "నువ్వు వెర్రిబాగుల్దానివి. ఓ స్త్రీ ఓ పురుషుని కలుసుకుంటేదానికి పవిత్రత- అపవిత్రత-అంటూ ఓ మోరల్ కోడ్‌ని పెట్టి వాళ్ళని బంధించేస్తున్నావు. అసలు నీకు నీఇల్లు నీకు నరకకూపంగా తయారైంది. అది చూసి ప్రతి విషయంలో అవసరం కంటె ఎక్కువ జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తావు. నాకు కాబోయే భార్య పవిత్రురాలని నాకు తెలుసు. నేనామెను ఎప్పటికీ మోసంచెయ్యను".

తల వంచుకుని కన్య అంతా విన్నది. సజ్జన్ మాట ముగించగానే క్రీగంటితో అతణ్ణి చూస్తూ పొడిగా నవ్వుతూ అంది - దుష్యంతుడిలా నన్ను మరచిపోతే?

"ఏమిటీ!"

గొంతుసరిచేసుకుని కన్యమళ్ళీ నవ్వుతూ అంది–ఎవరైనా ''శపించొచ్చు".

"శపించడమా ? అందులో ఈ యుగంలో?"

"నోటితో కాక పోవచ్చు. చూపుల్తో ఈ యుగంలో కూడా శపించవచ్చు కదా!" సజ్జన్ మెదలకుండ వింటున్నాడు. నిమిషం రెండు నిమిషాలు ఇద్దరూ ఏమీ మాట్లాడకుండా నడుస్తున్నారు. కన్యవైపు చూస్తూ సజ్జన్ అడిగాడు–''నా మీద నీకు విశ్వాసం లేదా?"

''జీవితానికి విశ్వాసమే మూలాధారం" చాలా సాఫీగా సమాధానం ఇచ్చింది కన్య.

తను వేసిన ప్రశ్నకు సమాధానం దొరికింది కాని దానితో అతనికి తృప్తి కలగలేదు. సర్వసాధారణంగా అనుకున్న మాట వ్యక్తుల పరంగా లోతువరకు పోయినట్లనిపించింది. సజ్జన్‌కు కోపం వచ్చింది. కొన్ని మానసిక కారణాల వల్ల తన మీదే తాను కోపగించుకుంటూ అన్నాడు-"గతించిన నా జీవితం సాఫీగా కానీ సవ్యంగా కాని వుందని నేను డప్పాలు కొట్టను. శ్రీమంతుల ఇంటపుట్టాను. ఒక్కడ్నే సంతానం. చిన్నతనంలోనే తండ్రినీడ పోగొట్టుకున్న నేను, నేనేకాదు- ఎవరైనా చెడిపోవచ్చు. నాలోవున్న బలహీనతల కారణంగా నీ మనస్సును, నీ లోని విశ్వాసాన్ని నొప్పించవచ్చు. కాని ఎప్పుడూ నేను చెడ్డవాణ్ణికాదు".

"చెడ్డవాళ్ళంటే భయపడాల్సిన పనిలేదు. చెడ్డవాళ్ళను ఇట్టే పనిగట్టయొచ్చు. వారితో ఘర్షణపడడం ఏమంత కష్టంకాదు. కాకుంటే వాళ్ళకు దూరంగా తొలగిపోవచ్చు. భయం అనేది చెడ్డతనంవల్లనే పడాలి మంచివాళ్ళమనే చెప్పుకునేవాళ్ళ మానసిక పొరల్లో ఎక్కడో అడుగుభాగాన దాక్కుని అకస్మాత్తుగా పైకి వచ్చి ఇతరుల్ని తమ గుప్పిట్లో పెట్టుకునే చెడ్డతనం అంటే భయపడాలి''.

ఈ క్షణంలో కన్య ధర్మోపదేశం సజ్జన్‌కు బాగా అనిపించలేదు. అతనిప్పుడు చాలా హుషారులో వూగిపోతున్నాడు. రాధాకృష్ణుల ప్రేమ, వారి మధుర భక్తి సంబంధించి సరససంభాషణ అతనికి ఎంతో మత్తునుకలిగిస్తోంటే మధువును తాగుతోన్న వ్యక్తిగ్లాసులో ఎవరో హఠాత్తుగా గంగాజలాన్ని కుమ్మరించినట్లయింది. అతని మనస్సులో తిరుగుబాటు రేగింది-సారాయి ఎందుకు చెడ్డది? గంగాజలం ఎందుకు మంచిదంటారు? పోనీ మంచీ చెడ్డా వుందానుకుందాం. అలాంటప్పుడు కూడా మరి మద్దు అనేది చెడ్డది ఎందుకవుతుంది? స్త్రీ పురుషుడు ఒకరినొకర్ని ఆకర్షించుకోవడం సహజమే కదా! మరి రెండు శరీరాలు కలిస్తే చెడ్డ ఎలా అయింది? నేను ఇంతవరకు చెడ్డగా అనుకోని చెడ్డతనాన్ని గురించి ఈ కన్య ఎందుకు శ్రీరంగనీతులు నేర్పుతోంది? తిరుగుబాటు తనకిచ్చిన బలాన్ని

ఆసరాగా తీసుకుంటూ కన్యతో అన్నాడు సజ్జన్-"నవ్వు అనవసరంగా నేను చెప్పిన దానికి వక్రభాష్యం చేస్తున్నావు కన్యా. వేళ్ళవరకు నాలో ఏ చెడ్డతనం పాతుకుని పోలేదు. కొంచెం ఆగు-ముందు నేను చెప్పేది విను-నువ్వు దేన్నైతే చెడ్డతనం అని అంటున్నావో అది మూర్ఖ సంస్కరణ కర్తల ఊహాస్వప్నం. నైతికధర్మం అంటూ చెడ్డతనం అని ఏవేవో అంటూ వున్నావో వాటివల్లనే మానవుడు తన నైసర్గిక వికాసాన్ని పొందడానికి అవన్నీ అంతరాయం కల్పిస్తూ వచ్చాయి. కళ్ళద్దాలు పెట్టుకుని ఆలోచించడం మొదలిడితే ఆడదానికన్న నిజమైన వస్తువు ప్రపంచంలో మరి ఒకటిలేదు. ఇతర నీతికోవిదుల మాటలు అలావుంచు. గౌతమబుద్ధుడూ, శంకరాచార్యులవంటి విజ్ఞాన ఘనులు కూడా ఆడదానిని వ్యతిరేకించారు. నారీ అనేది నరకానికి ద్వారం అన్ని చెడ్డంకూ ఆమెయే మూలం. ఇప్పుడు నువ్వేమంటావో చెప్పు''.

స్త్రీజాతి మీద సజ్జన్ విసిరిన విసురుకు కన్యకు కోపం వచ్చింది. ''శంకరాచార్యుడూ, బుద్ధుడూ ఆడవాళ్ళే అయివుంటే పురుషుడే సాక్షాత్తు నరకమనీ ఆడది ఆ నరకానికి అడ్డుగోడగా నిలిచి ప్రకృతిలోని మిగిలిన సృష్టి అంతా ఆ మురికి కూపంలో పడకుండా అడ్డుకుంటుందనీ చెప్పేవారు"అంటూని సజ్జన్‌నుఎత్తిపొడచింది.

కన్యమాటలు విన్న సజ్జన్ వ్యంగ్యంగా నవ్వాడు. అతను నవ్వుతోంటే ఆమె మరింత రెచ్చిపోయింది. "ప్రాచీనకాలంలో పురుషులు స్త్రీల అడుగులకు మడుగులు ఒత్తేవారట. ఆకాలమే నిజానికి ఎంతో మంచిది " అంటూ పురుషుల ఆభిజాత్యంపై తన అక్కసు వెళ్లబోసింది.

సజ్జన్ జాగ్రత్తగా ఆమె ముఖాన్ని పరికిస్తున్నాడు కోపంతో ఎర్రబారిన ఆమె తెల్లని ముఖం చూడ్డానికి ఎంతో ముచ్చటగా వుంది ఆ ముచ్చట ముందే తాను సంతోషపూర్వకంగా ఓడిపోయాడు. కర్రవున్న కుడిచేతిని ఆమె భుజంపై వుంచి ఇలా అన్నాడు-"ప్రియురాలా, అంతకోపం పనికిరాదు. సర్వత్రా స్వాతంత్రాన్ని చాటే ఈ ఆధునిక యుగంలో ఈ పౌరుడు మాత్రం రాణిగారికి

దాసుడిగానే వుండి ఆ ప్రాచీన యుగాన్ని మళ్లీ ఈ భూతలం మీద ప్రతిష్ఠ చేస్తాడు"

సజ్జన్ ఛలోక్తితో ఆమెలోని ఆవేశం దెబ్బతింది. అతని చెయ్యి ఆమె భుజాన్ని స్పృశించగానే ఆమెకు సంకోచమూ కలిగింది. కాని ఆమె పంజరంలో బంధించిన సింగంలా వుంది. పంజా విసరలేక ఆవులా సాధువైంది ఆమె భుజాన్ని చేతి కర్రతో మెల్లిగా కొడుతూ అన్నాడు- "సరే విదుషీమణిగారూ, మనం ఇద్దరం ఇప్పుడు అన్ని చిక్కుల్లోంచి బయటపడి ఓదశకు చేరుకున్నాం. ఏదో రైలు ప్రయాణీకుల మల్లే ఓక్షణానికి కలిసి విడిపోతూన్న లెక్కలేనంత మంది మామూలు స్త్రీ పురుషుల్లా మనం కలవలేదు విడిపోవ డానికి. పురోహితులు గారొచ్చి నాలుగు మంత్రాలు చదవడం లేదా రిజిస్ట్రార్ ఆఫీసులో కెళ్ళి కాంగ్ల మీద సంతకాలు పెట్టడం అదంతా ఓ తతంగం మాత్రమే. లక్నో చేరగానే ఆ తంతూ పూర్తిచేస్తాం. నిన్నటి నుంచి నాలో ఎంత మార్పు వచ్చిందో నీకు తెలియదు. చీకట్లో వుక్కిరి బిక్కిరి అవుతున్నా మెలికలుగా తిరిగివున్న మెట్లు ఎక్కుతూ వున్నాం నిన్నంతా. ఆ చీకటి మెట్లు ఎక్కి వెలుతురు విసురుతోన్న డాబా మీదకు వచ్చినట్టుగా నిన్న బృందావనంలో నాకు అనిపించింది. మరి నీకు అలానే అనిపించిందో లేదో?"

కన్య ముఖం మీద ఆమె మనస్సు ప్రతిబింబించింది. ఓ చిన్న చిరునవ్వుగా అది మారి ఆమెను సన్నని మైకంలో ముంచింది.

ఆమె భుజంపై చెయ్యి వుంచుతూ సజ్జన్ "నేను విలాసపురుషుణ్ణి నాలో ఈ బలహీనత వుంది నా ఈ బలహీనతతో ఘర్షణపడే అధికారం నీకు వుంది. కాని పంతుళ్ళ మాదిరిగా, గురుపత్నిలా నాకు ధర్మ పన్నాలు చెప్పడానికి ప్రయత్నించకు. మనం ఇద్దరం నిష్కల్మషంగా వుంటే చాలు. భార్యాభర్తలు తమ గతాన్ని తవ్వుకోడాన్ని తప్పుకోలేను నేను. ఈమాట సామాన్య మనుషులకు వర్తిస్తుంది కాని బాగా చదువుకుని లోతుగా ఆలోచించే మనలాటి వాళ్ళకు వర్తించదు".

కన్య మీద వున్న ఒక్కొక్క మైకం పొర తొలగిపోతోంది. మిగిలిన మత్తును కంఠంలో నింపుతూ మధురంగా అంది. "ప్రయోజనంలేని పురాణాలు వింటే నాకేమి ఒరుగుతుంది. నాక్కావలసిన సత్యాన్ని తెలుసుకున్నాను. కాని సజ్జన్ ఒక్కమాట, గతించిన చరిత్ర మాత్రమే మనతో రాదు. నడుస్తోన్న చరిత్ర కూడా మనల్ని గురించి సాక్ష్యంగా నిలుస్తుంది. నిన్నటి వరకు నువ్వు ఎంతో విలాసంగా జీవితాన్ని గడిపి వుండొచ్చు. కాని ఇవ్వాళ కూడా అలాగే వుండి తీరాలన్న నిర్బంధంలేదు. ఇవ్వాళనుంచి నీజీవితం కొత్త మలుపుతో ప్రారంభం అయితే నీ చరిత్ర కూడా ఇవాల్టి నుంచి కొత్త చిగుళ్లను తొడుక్కుంటుంది".

"మనిషి అలవాట్లు ఇంత తొందరగా మారిపోతాయని నువ్వను కుంటున్నావా?"

"తప్పక. ఇప్పుడే అన్నావుగా. సాధారణ వ్యక్తి కంటే ఎక్కువ చైతన్యం బాధ్యతా కలవాణ్ణి అయిన పక్షంలో స్త్రీలేక లోటువల్ల విలాస జీవితం గడపాల్సిన అవసరం రాదని" నువ్వు నావాడివి అయినప్పుడు నా వాడిగానే వుంటావని ఇప్పుడేగా నువ్వు అంది.

సజ్జన్ చెయ్యి ఆమె భుజాన్ని రాసుకుంటూ వుంది. అతడు మౌనంగా వున్నాడు. ఎదురుగా రెండు అంతస్తుల్లో నిర్మించిన తెల్లటి ఛత్రం, దానికి కొంచెం అవతల తెల్లగా వున్న భవనానికి ఎదురుగా వున్న టాక్సీ కనపడుతోంది. టాక్సీ కనపడగానే సజ్జన్ బరువులన్నీ అతనొక్కడే మోస్తున్నాడన్న విషయం జ్ఞాపకం వచ్చింది. సామాను విశేషంగా లేకపోయినా కెమెరా, కోటూ, కేన్వాను సంచి తాను తీసుకో వచ్చుగా అనిపించింది కన్యకు. ఆమె వెంటనే ఆ మూడు చేతుల్లోకి తీసుకుంది. మౌనంలో మునిగిన సజ్జన్ ఆమె స్పర్శకు మేల్కొని ఆమె వైపు చూశాడు. కన్య కళ్ళు అధికారం చలాయించే నెపంతో "నన్ను నేను నీకు సమర్పించుకుంటున్నాను" అన్నట్లుగా అతని కళ్ళలోకి చూసాయి. మొదటి సారిగా ఆమె కళ్లు మౌనంగా అతణ్ణి ఆహ్వానిస్తున్నట్లుగా తోచింది.

# 26

నందో పిలిస్తే వచ్చిన ఠోర్ మహాకవి బిభూతీ సునార్ ఇంటికి ఎదురుగ- చీకటి సందులో పొద్దున్నుంచి తిరుగుతూ పడిగాపులు కాస్తున్నాడు మధ్యమధ్య పొడిగా దగ్గుతూ ఎవరికో ఏవో సంజ్ఞలు చేస్తున్నాడు.

గుమ్మం దగ్గర ఎవరివో పాదాల అలికిడి అయింది. బిభూతీ ఇంటితలుపు గొళ్ళెం తీసారు. తలుపు వెనక నుంచి నందో పొడిగా దగ్గింది. తలుపు గడియ తెరుచుకుంది. అంతే మహాకవి ఠోర్ చటుక్కున గడపలో అడుగుపెట్టి లోపల దూరేసాడు. వెంటనే తలుపు మూసుకుంది.

బయటి గదిలో దీపం వెలిగించి, అక్కడికి ఠోర్‌ని పిలిచింది నందో. ఠోర్ లోపలికి వస్తోంటే నందో ప్రయత్నపూర్వకంగా తన రొమ్మును అతని చేతికి తగిలిస్తూ బయటికి వచ్చింది. లోపలితలుపు గొళ్ళెంపెట్టి నిశ్చింతంగా ఆమె గదిలోకి మళ్ళీవచ్చింది. బయటి గదివిశాలంగావుంది. గోడ కిందనుంచి నాలుగో భాగం వరకు పెంకులతో ప్లాస్టర్ చేసారు. ఇంగ్లీషువాళ్ళ నమునాలో పొయ్యి పెట్టడానికి గద్దెలావుంది. పొయ్యివున్న స్థలాన్ని ఇనుపతీగెలో ఒలి అడ్డుగా వుంచారు. ఆ తీగెలమీద అక్కడక్కడా ద్రాక్షగుత్తులూ, ... ముక్కులతో కొరుకుతోన్న చిలుకలు వున్నాయి. ప్లాస్టర్ చేసిన పెంకులమీద 'ఓం' అనే అక్షరం, రాధాకృష్ణ, సమాధిలో మునిగిన పరమ శివుడి బొమ్మలూ వున్నాయి. ఒక సోఫాసెట్, రెండు కుర్చీలు, మధ్యగా ఓ బల్ల అగడి అందాన్ని బాగా ఇనుమడిస్తున్నాయి. నందో బల్ల దగ్గరకు వచ్చి నిలబడింది. ఏష్ట్రేలో సిగరెట్టు నుసిని రాలుస్తూ కుర్చీలో కులాబడదాం అనుకుంటోన్న ఠోర్ నందోను చూసి నవ్వుతూ "నందో టిటి దేష్ కొట్టి నాగుంచెను చీల్చేసావు. మరికట్టు కూడా త్వరగా కట్టు" అన్నాడు.

"ఇష్, వుండవయ్యా"

"నా మీద ఒట్టు. నవ్వుకూడా మంచి సరసురాలివే" అంటూ విరహేష్ నందో వైపుకి వెళ్ళాడు. నందో గభాలున వెనక్కు తగ్గి పమిటకొంగు మెలిపెట్టి

కళ్ళెర్రచేసినట్లు నటిస్తూ "ఆ(... ఆ(... ముట్టకు. నేనిప్పుడే గోమతిలో స్నానంచెయ్యాలి" అంటూ వగలు పలికింది.

"నువ్వు గోమతికి వెళుతుంటే మరి తొందరగా నా ప్రాణసఖిని తీసుకురా. అసలే జనవరినెల. తెల్లవారు జామున నాలిగింటికి బయలుదేరాను ఇంట్లోంచి గుండె వేడిని కాపాలంటోంది"

"ఇదేమైనా లంజలకొంప అనుకున్నావా ఏమిటి? ప్రియసఖీ, ప్రాణసఖీ అంటూ ఇంట్లోకిదూరావు. మేమేమైనా దళారి వృత్తి చేస్తున్నామనుకున్నావా?" అంది నందో.

మహాకవి టాగోర్ నందో బీబీలాంటి ఆడవాళ్లను ఎంతోమందిని కాచి వడపోసినరకం "తప్పే అలాంటి దేమీకాదు" అని అంటూ నీళ్ళు నములుతున్నట్టు అన్నాడు.

"మీ ఇద్దరూ ప్రేమించుకున్నారని తెలిసింది. పాపం మా ఒదిన అస్తమానం ఏదో మరిచిపోయినట్లుగా వుంటోంది. ఆమె అవస్థ చూడగానే నాకు జాలివేసింది.''

"అది నిజమే నందో బీబీ నువ్వు దేవతాసమానురాలివి."

"నీ చిరునామా ఎలా పట్టేశానని అడగవేం?"

"నువ్వు పెద్ద మంత్రగత్తెవు నందో-"

"నీకేం. కన్ను కలిపి వెళ్ళిపోయావు సీమటుకు నువ్వు. ఇక చూడు మా ఒదిన అవస్థ అంతా ఇంతా కాదు. నేనామె తపన చూడలేకపోయాననుకో"

"ఇక్కడి నా అవస్థ అంతకన్నా పదిరెట్లు ఎక్కువగావుంది బీబీ. నీ ఒదిన నా మనస్సును దొంగలించడమే కాక నా హృదయాన్ని, నా ప్రాణాన్ని, నా నిద్రాహారాల్ని సైతం-"

"పందరూపాయలు తెచ్చావా?"

"నందో బీబీ, నువ్వుకావాలంటే ప్రాణమే ఇస్తాను. బాబూగంజ్ నుంచి కాలినడకనే వచ్చాను. కాలం ఎంతచెడ్డగా వుందీ నీకు చెప్పనక్కర్లేదు. రూపాయలు దగ్గిరుంటే ప్రాణాలు దక్కనిరోజులు వందరూపాయలు జేబులో పెట్టుకుని ఈ చీకట్లో - ఇంత ఘోరనిశ్శబ్దంలో ఎలారావడం? నువ్వేచెప్పు. నువ్వు సాయంత్రం ఎక్కడికి తెచ్చిఇమ్మంటే అక్కడికే నీ సొమ్ము నీకు తెచ్చిస్తాను"

"చాలా తెలివిగల వాడివిలావున్నావు. మజాగావాలి కానీ-"

"నీ యవ్వనం మీద ఒట్టు, నీ అందం మీద ఒట్టు. నీ ఒదినమీద ఒట్టేసి చెబుతున్నాను నిన్ను దగాచెయ్యాలని నాకు ఏకోశానాలేదు. ఒక్కరోజుతో ముగిసే వ్యవహారంకాదుగా. సరే ముందీ పాతిక రూపాయలు నీదగ్గర వుంచు. నీకు సాయంత్ర ఇస్తానన్న వందరూపాయల్లో వీటిని మినహాయించుకోనులే. నా మాటనమ్ము".

నోట్లు చూడగానే ఆకలికొన్న సింహంముందు ఈగవచ్చి నిలబడినట్లయింది నందోకు. ముక్కు పుటాలు ఎగిరాయి. పెదిమలు విరిచింది. మూతి అదోలాపెట్టి నందో అంది- నీ దగ్గిరే వుంచుకో ఈ పాతిక రూపాయిలూ. నాతండ్రి గారింట్లో లక్షలకొద్ది లక్ష్మిమూలుగుతోంది. నా అన్నకుబోలెడంత సంపాదన. కావాలంటే ఓ సినిమానే కొనివేయగల తాహతుంది."

మహాకవి బోర్‌గారి చిరునామా నందో చాలా విచిత్రంగా కనుక్కుంది. "బహార్ ఆయీరే" సినిమాకు పాటలు రాసిన కవిగారి అడ్రసు కావాలంటూ కైలాసూ కోడలన్న వరో తార్పుడు గత్తెను అడిగింది నందో. కైలాసూ కోడలు మరో దళారిని అడిగింది. ఈ మూడో దళారికి సినిమా హాలు గేటు దగ్గర పనిచేసే ఓమింగ గాడున్నాడు. వాడే మహాకవి బోర్‌ని కైలాసూ కోడలి ఇంటికాడనందోతో పరిచయంచేసింది. నాకెంతోమంది సినిమాతారలూ,ముక్కలూ తెలుసనీ, ఎవేవో చాలా పెద్ద పెద్ద డప్పాలు కొట్టాడు బోర్. కైలాసూ కోడలు నుంచి నందోదాక అందరినీ సినిమా తెర మీదకు ఎక్కిస్తానని వాగ్దానం చేసాడు ఇద్దరిని కలపడానికి గాను వంద రూపాయలు లంచం ఇమ్మని అడిగింది నందో.

సరేనన్నాడు బోర్. అదీగాక నందోముందు ప్రగల్భాలు కొడుతూ తన గొప్ప తనాన్ని నిరూపించుకోవ డానికి సారాయి, సిగరెట్లూ ఇంకా ఎవేవో తెప్పించి ఓ యాభై రూపాయల దాకా తగలేసు కున్నాడు బోర్. బోర్ అంత సంపన్నుడు కాదని గేట్ కీపర్ ముందే సూచన ఇచ్చాడు నందోకు. అయినా నందో నమ్మ లేక పోయిందారోజు. బహుశా కొత్త కాతాను తన గుప్పిట్లో వుంచుకోవ డానికి అబద్ధం చెప్పుతున్నాడను కుంది. తీరా ఇవ్వాళ బోర్ పాతిక రూపాయలే బయట పెట్టే సరికి ఆడబుద్ధి వాడి అయింది.

"ఇవ్వాళ ఆమె రాదు. మా అన్న కలకత్తా నుంచి రాత్రే వచ్చేసాడు," అని అర్థం వేసింది.

"మరి నువ్వు అలా చెప్పావేం"

"నాకేం తెలుసు మనియా రాత్రే ఊడిపడతాడని. ఇంకా రావడానికి పది రోజులు పడుతుందని అంతకు ముందు వుత్తరం రాశాడాయె. మా అమ్మ, సకరాత్ గంగా స్నానానికని అలహాబాదు వెళ్ళారాయె. మనియా అకస్మాత్తుగా వస్తే నేనేం చేయ్య గలను"

ఒక్క దూకులో నందో కాళ్ళ మీద పడి వేడుకోవడం మొదలెట్టాడు. "ఏదో నువ్వే సాయపడాలి. మోహినీని ఒక్కసారి చూపించు" అంతలోకే మళ్ళీ లేచి ఈ ప్రపంచంలోనే లేనట్టుగా- "దూరంగా చూసిచూసి నేను తాళలేక పోతున్నాను. మోహినీని దగ్గరగాతీసుకొని నా బాహుపాశంలో బంధించాలి. ఆమె వేడి వేడి నిట్టూర్పులు నా హృదయ పటలంపై ప్రేమ అనే రంగును పులుము కొని-"

"ఏమిటి నువ్వు చేస్తోంది, ఒదిలిపెట్టు'' అంటూ కోపంగా అంది నందో. మోహినీని ఎప్పుడు కౌగలించు కుందామా అన్న ఆవేశంలో బోర్ నందోను గట్టిగా వాటేసు కున్నాడు. ఆమె ఒదిలించు కోవడానికి అతణ్ణి చేతుల్తో తోస్తోంది. మహా కవి తన పట్టు విడవకుండా ఆమెను తన కబంధ హస్తాల్లో అలాగే నొక్కుతున్నాడు. "నా ప్రాణేశ్వరితో నన్ను ఒక్కసారి కలుపు. చాలు. నా

నందో రాణివి కదూ! నా మనస్సులో మూగ పోయిన రెండో అమరగీతం, మేల్కొడానికి ఒకే తపన పడుతోంది" అంటూ నందోను తన ఆలింగనంలో మరింత బిగించాడు.

"నువ్వూ, నీగీతం ఏట్లో దూకి చావండి. ఇటువంటి దగాకోర్లను ఎంతో మందిని చూసాను. ముందు నాకు యివ్వాల్సిన పైకం తీసుకరా".

"సాయంకాలం తెచ్చి ఇస్తానన్నాగా. నువ్వు అడిగింది వందకదా. నేను రెండు వందలు ఇస్తాను, సమ్మతమేనా? నిన్ను చూస్తోంటే నా నరం నరం లాగుతోంది నందో''

"నాకీ కల్లబొల్లి కబుర్లు గిట్టవు. నా ఠాకూరు ఏమిటో, నా పూజా పునస్కారం ఏమిటో అంతేగాని ఈ ప్రేమా గిమా అంటే నాకుపడదు."

"నీ కలాంటి భక్తినే దేవుడు ప్రసాదించుగాక. అబ్బ! ఎంత జాలిగుండె నీది! మళ్ళీ నీకాళ్లు పట్టు కుంటున్నాను", అంటూ మహా కవి బోర్ ఒంగాడు. అతను వేసుకున్న చెస్టర్ కోటు చేతులు అతను ఒంగగానే పైకి పోయాయి. అంతే. మణికట్టు మీద తళతళ మంటూ మెరుస్తోన్న బంగారం గడియారంపై నందో కళ్ళు పడ్డాయి. "ఛీ వద్దు" అంటూ తన కాళ్ళను తాకుతోన్న చేతులు పట్టుకునే నెపంతో నందో రెండు చేతులూ అతని రెండు మణికట్లు పట్టు కున్నాయి. ఆమె కుడిచెయ్యి అతని ఎడమ మణికట్టు మీద కట్టుకున్న బంగారం గడియారం మీద వుంది.

"నువ్వింతగా ప్రాధేయ పడుతున్నావు. ఎంతో ప్రమాదం వచ్చే పని. మా మనియాగాడు పచ్చిరక్తం తాగుతాడు" అంటూ సానుభూతి కనపరచింది, నందో. అంతే అతని ఎడమ మణికట్టు మీద నుంచి ఆమె తన కుడిచెయ్యి తీసి వేసింది. మళ్ళీ తెగిన మాటకొన కలుపుతూ "సరే లేవయ్యా, నీకోసం నేను ప్రమాదంలో పడ్డానికి సిద్ధమే. నేను చెయ్యాల్సింది నేను చేస్తాను. ఆ మీద భగవంతుని దయ" అంది.

టోర్ మణికట్టులోంచి నందో చేతిలోకి వచ్చేసింది బంగారపు గడియారం. ఆమె చేతిలో గడియారాన్ని చూడగానే మహాకవి ముఖం పాలి పోయింది. అతనేదో చెప్పబోతాం అనుకుంటూ వుండగానే నందో గదిలోంచి రివ్వున ఎగిరి పోయింది.

చేతి గడియారం పోయినందుకు టోర్‌కి దిగులుగా వుంది. ఎదువు తెచ్చిన సౌత్రాయె!

తాను గోమతీ స్నానానికి వెళ్ళు తున్నాననీ తలుపు గడియవేసు కుంటానికి రమ్మనమనే వంకతో కిందవున్న పెద్ద కోడలిని పిలుచు కొచ్చింది నందో. మనియా గుర్రుపెట్టి నిద్దరోతున్నాడు. పెద్దావిడ కూతురు పైన నిద్దరోతుంటే ఎత్తుకుని కింద తన టిక్కీలో పండబెట్టింది నందో. అయితే విరహేష్, పెద్ద కోడలు ఎక్కువసేపు కలిసి వుండడానికి వీలు కల్పించలేదు. మనియా మేల్కొన్నాడు. వాళ్ళిద్దరిని భయపెట్టడానికి ఈ ఒక్క అస్త్రం బాబు ఆమెకు. కాని విరహేష్ చక్కా ముక్కలు తిన్నరకం కావడం చేత నందో ఎత్తు పారలేదు. పెద్ద కోడలైన మోహినీ చెయ్యి పట్టుకుని "నందో పూటికనే మనల్ని బెదిరించడానికి సాకు చెపుతోంది. నందో ఏమీ, బంగారు పతకు. నీ వంద రూపాయలు ఇవ్వాళే ముట్ట చెప్తానుగా" అని పెద్దామెతోనూ, నందోతోనూ అన్నాడు.

"రూపాయలేమిటి?" అని తెలియనట్లు అడిగింది మోహిని.

మత్తునిండిన కళ్లతో మోహిని చూస్తూ నవ్వుతూ విరహేష్ అన్నాడు— "కోహినూర్ నక్షత్రానికి ఖరీదు యివ్వాల్సి వుంటుందిలే మోహినీ. ఈ నా చేతి గడియారం గుంజుకుంది"

"ఎందుకు?"

"ఆ సంగతి పోనీలే చేతి గడియారం తిరిగి యిచ్చేస్తే మంచిదే అనుకో. సాయంకాలానికల్లా రూపాయలు ఆమె ముఖాన కొడతాను"

"ఒదినగారూ" అంటూ ప్రాధేయపడుతూ "మీ కాళ్ళ మీద పడతాను. నా మాట వినండి నీరు పెద్ద కవులు. మీకు యివ్వాల్సిన డబ్బు తప్పక తెచ్చి ఇస్తారులెండి" అని అంది.

నందో సరే అని విరహేష్ చేతి గడియారాన్ని తిరిగి యిచ్చేసి వాళ్ళిద్దరిని ఒంటరిగా ఒదిలేసి వెళ్ళి పోయింది.

అనుకున్న ప్రకారం విరహేష్ వంద రూపాయలు తేలేక పొయ్యాడు పెద్దామె విరహేష్ రాకకై మహా అదుర్దాతో ఎదురు చూసింది. రెండో రోజు అదే సమయానికి మళ్ళీ టోర్ పూడిపడ్డాడు. ఇవ్వాళ పెద్ద కోడలు అతను ఎప్పుడు వస్తాడా అని నందోతో పాటు బయటి గదిలో కూర్చుంది. టోర్ వచ్చాడు. ఏభై రూపాయలు నందోకు ఇస్తూ ఏవేవో సాకులూ, కారణాలూ చెప్పాడు. మరునాడు ఇంకా ఎక్కువ మొత్తం తెచ్చి ఇస్తానని వాగ్దానం చేసాడు. నందోను ఎంతగానో ప్రాధేయ పడ్డాడు. పెద్దామె కూడా వదినను బతిమాలుకుంది. కాని నందో ఆవగింజంత కూడా మెత్త పడలేదు. "పోతావా లేదా, నలుగురిలో అల్లరి పెట్టమంటవా" అంటూ గొంతు కొంచెం పెద్దదిచేసి మోహినీని "నువ్వు ముందు మీదకు వెళ్ళు" అని గద్దించింది.

పెద్దామె నందోను తిరస్కరించడానికి జంకింది. ఏమి చేసేది లేక టోర్ వచ్చిన దారినే ఇంటికి మరలి వెళ్ళాడు. తలుపు గడియపడింది.

నందో అంటే మోహినికి లోలోపలే మంటరేగడం ప్రారంభించింది. వెళ్ళి పోతూ విరహేష్ చూసిన ఆకలిచూపులు, నైరాశ్యంతో నిండిన ముఖకవళిక గురించి ఆమె పూహించుతూంటే నందోమీద ఆమె లోలోన అగ్గిమీద గుగ్గిలం అయ్యింది. ఆమె మీదకని ఎక్కువైంది. కాని ఆమె నందోను పల్లెత్తుమాట అనలేదు. తలుపు గొళ్ళెం పెడుతూ "వదినా, వీడుత్త సన్యాసిలాగున్నాడు. నువ్వుచూస్తూ వుండు, నిన్ను ఎటువంటి జాగాలో తిప్పి నీ ఒళ్ళంతా బంగారంతో నింపేస్తాను. వ్రతం చెడినా ఫలితం దక్కాలి" అంది నందో.

"నాకు నగలంటే మోజులేదు. మనిషికి కావలసింది ప్రేమ నగలను ప్రేమించేది నీచులు" అంటూ మోహిని లోనికి వెళ్ళిపోయింది. నందో గదిలో నిద్దర పోతున్న తనపాపను చంకనెత్తుకుని మేడమీదకు వెళ్ళి పడుకుంది. మంచం చప్పుడు కాగానే మనియాకు నిద్రాభంగం అయింది "ఏమిటది?" అని అన్నాడు

"ఏమీలేదు తలుపు వేద్దామని కిందకు వెళ్ళాను అంతే."

మగత కన్నులతో మనియా పెద్దామెను తన బాహుపంజరంలో బంధించి నిద్రపోయాడు. విరహంలో కాలుతున్న మోహినీమనస్సు మనియా ఆలింగనంతో సంతృప్తి పడలేదు. నందో అల్లిన వుచ్చులో ఆమె ఇరుక్కుపోయింది. నందో ఊం అంటేగాని ఆమె విరహేష్‌ని కలుసుకోలేదు. నందో ఆడవాళ్ళకు తార్పుడంలో అందెవేసిన చెయ్యి.

మనియాకు తనమీద చాడీలు చెప్పి తన పుట్టిముంచుతుందా అన్న భయం వేసింది నందోకు. అసలే నందో అంటే మనియాకు పడ్డం లేదు. ఈ మధ్యనుంచి మోహినిని చుట్టుకొని తిరుగుతున్నాడు, మనియా. లోకి తన్ను దగాచేసాడన్న కోపంతో నందో మోహినిపై కసితీర్చుకోవాలని సంకల్పించింది . నందో ఈ రోజు కూడా స్నానం చెయ్యడానికి గోమతికి వెళ్ళలేదు. ఇంట్లోనే స్నానంచేసి ఆలో చిస్తూకూర్చుంది - "మనియాను తనవైపు తిప్పుకోవడం ఎలా?"

ఈ సంఘటన జరిగిన ఓ గంటా గంటన్నర తర్వాత పెద్దామె స్నానం చేద్దామని కిందకు వెళ్ళింది మనియా అప్పుడే లేచి దిండులో తలపెట్టి సిగరెట్టు దమ్ము లాగుతున్నాడు. ఆ టైముకి నందో తయారైంది.

"ఏం కావాలి" అంటూ సంబంధంలేనట్టుగా అడిగాడు. నందో వినయ విధేయతలను ప్రకటిస్తూ వున్నచోటే మోకాళ్ళమీద కూర్చుంది.

"ఏమిటో చెప్పి చావరాదూ?" అంటూ తనకేమి నందోతో సంబంధం లేనట్టుగా మనియా అడిగాడు. చాలా రోజులనుంచి నందో విషయంలో అతని వైఖరి ఇలానే వుంటూవుంది ఎంత చిన్న పనైనా సరే నందో విషయంలో

మనియా దానికేదో చిక్కు తెచ్చి పెట్టుతాడు. నందో ఎంతో అమాయకంగా మనియా మంచం దగ్గరకు వచ్చి మోకాళ్ళమీద కూర్చుంది. మనియా కిమ్మన కుండా వున్నాడు. నందోయే మొదలెట్టింది - ''నువ్వు ఎప్పుడు ఏమి చెప్పినా దాన్ని నెత్తిని పెట్టుకుని పూజించుతాను. పొద్దున్నపూట గోమతీ నుంచి స్నానం చేసి వస్తున్నాను. అమ్మ మాటైతేనేనంత పట్టించుకునే దాన్ని కాదు. నీ విషయ మాయె. ఎలా వూరుకోగలను?''...

నందో చెప్పుకపోతుంది - "సంతోగాడి పెళ్ళాం నన్ను ఎన్ని సార్లు పిలిచిందో? నీ గురించి ఎన్నోసార్లు ఏడ్చి ఏడ్చి మొత్తుకుంది. నువ్వు వద్ద న్నావు. అంతే. అటు ముఖం చూపించడమే మానేసాను. మా అన్న గీచిన గీత నేను దాటను. ఆయన ఓసారి వద్దన్నాడంటే అంతే. మా అన్న గౌరవం. ప్రతిష్ఠ ఏమైపోవాలి?"....

పిడికిలి బిగించి సిగరెట్టునుసి కాళ్ళకట్టువైపుగా విదిలించాడు మనియా. ముఖం మీద బలవంతంగా నువ్వు తెచ్చుకుంటూ నందో అంది - ''కలకత్తా నుంచి నాకేం తెచ్చావు? ఇవ్వాళ నీతో ఓ మాట చెప్పాలని వచ్చాను. నిన్ననే వచ్చావు కదా అడిగితే బావుండదని వూరుకున్నాను. అన్నగారికి వూళ్ళో వాళ్ళంటే ఎంతో ప్రేమ. చెల్లెలు కూడా జ్ఞాపకం రాదు. తల్లీ, చెల్లెలు ఎన్ని పొరపొచ్చాలొచ్చినా చివరకు తల్లీ చెల్లెలే కదా?''

మనియా కొంచెం మెత్తపడ్డాడు. నవ్వుతూ "నీ కేమి కావాలి?" అని అడిగాడు,

''నాకేమి కావాలి. నీ సంసారం పదికాలాలపాటు పచ్చగావుంటే అదే చాలు. పొద్దున్నే అనుకుంటాను" అంటూ మంచం తలకట్టువైపు ఆమె దృష్టి వెళ్ళింది. ఆమె అదోలా అటు చూడసాగింది. మనియా అలా చూస్తూ డదం గమనించి వంగుతూ ''ఏమిటి సంగతి'' అని అడిగాడు.

"నల్లదారంలో కాగితం అనుకుంటాను. ఏమిటో, చూద్దాం.... అయ్యో బాబోయ్, ఇదేదో గండా, తాయిజులా వుంది. దీన్ని తాకకు. నా మీద ఒట్టు,

హరిరామా!" అంటూ నందో చేతిలోకి తీసుకుంది. మనియా తీక్షణంగా చూస్తూ "నీపనే అయివుంటుంది. నువ్వు మంత్రగత్తెవు కదటే" అని అన్నాడు.

"నువ్వేమైనా అనుకో. ఇది మాత్రం నా పని కాదు. అమ్మా నాన్న మీద ఒట్టుపెట్టి చెబుతున్నాను" అంటూ గండాదారం పూడదీస్తూ "హరి దేవుడా, ఇది పంజ విర్ల గండలా వుంది!" అని వాపోయింది నందో.

మనియా కూడా వంగిచూసాడు. సింహంలాంటి ఓ కొమ్ముల జంతువును ఒకే కొమ్ముతోక వున్న రాక్షసి చంపుతోంది. గండాలో గీసిన ఈ బొమ్మ చూసి మనియా తెల్లబోయాడు. ఇది నందోయే తెచ్చి వుంటుంది. ఇలాంటి వెధవపనులు చెయ్యడం దానికి వెన్నతో పెట్టిన విద్య. ఈ గండా తానే తెచ్చి ఎవరికో తంపులు పెట్టాలని చూస్తోంది. కోపంతో ఒంటి మీదున్న దుప్పటి తీసేసి పటపట పళ్ళు కొరుకుతూ "ఒసేయ్, నందో, నిజంగా చెప్పు, లేకపోతే నీ ప్రాణం తీసేస్తాను" అని బెదిరించాడు.

అన్న బెదిరింపులకు నందో ఏమీ హడలిపోలేదు. ముందుగా వేసుకున్న పథకం ప్రకారం ఏమాత్రం తొణకకుండా అంది - "నువ్వేమైనా అను. నాకెందుకు భయం. బయట నేను ఎన్నో వెధవపనులు చేసి ఉండొచ్చు. కాని ఇంట్లో మాత్రం అలాంటివి ఎప్పుడూ చెయ్యను. నాకు మా అన్నా, అమ్మా, నాన్నా అంటే పంచ ప్రాణాలు. మొగుణ్ణి మోసగించి పరాయి మగాడితో కులికే లంజలే అలాంటి నీచం పనులు చేస్తారు"...

నందో ఏమి చెప్పుతుందో దాని నోటనే కక్కించాలన్న పట్టుదలతో మరింత కోపంగా "నిజం చెప్పు. అసలేం జరిగింది" అంటూ మనియా నందోను నిలదీసాడు.

"పరాయి వాళ్ళ వ్యవహారం అయితే నేను మెదలకుండా వూరుకునే దాన్ని. కాని నా స్వంత అన్నకు ముప్పువచ్చి పడుతోంటే నేను సహించలేను. ఇది నీ పట్టపు రాణీగారి పనే అయి వుంటుంది. ఆమె గారి ముద్దు చెల్లించడం కోసమేగా నువ్వు స్వంత చెల్లెలిని ఇలా వేధించుకు తింటున్నావ్. ఈ మధ్య

పట్టపురాణీగారికి పరాయి మగాళ్ళు కావలసి వచ్చారు. ప్రేమాయణం జరుపు తోంది. ఇక్కడ కిటికీలో కూర్చొని పెద్దమ్మ ఇంట్లో ఎవరో అద్దెకువుంటున్నారుగా వాళ్ళతో రాయబారాలు నడుపుతోంది. ఓ రోజు ప్రేమలేఖలు రాసిపంపు తూంటే నాకళ్ళపడ్డది."

"నిజం చెప్తున్నావటే నందో" అంటూ మెల్లిగా అన్నాడు మనియా. ఆమాట వినేసరికి మనియా ముఖం కాంతి హీనమైంది. అతని పెదిమలూ, బుగ్గలూ అదురుతున్నాయ్.

"నాకేమంత అవసరం దాడీలు చెప్పడానికి. నా ఈ కళ్ళతో స్వయంగా చూసింది చెబుతున్నాను. ఆ ఇంట్లో ఎవడో పొడుగాటి జులపాలోడు ఒకడు న్నాడు, ఏవేవో కాగితాల మీద రాసి వదిన ఓ సంచిలో పెట్టి తాడుగట్టి కిందకు వదులుతూ వుందేమో వాడు కూడా ఏవేవో కాగితాల మీద రాసి పంపుతున్నా డేమో! అయినా నాకెందుకు ఎవరేగంగలో దూకితే" అంటూ వేదాంతిలా అయి పోయింది నందో.

''ఎక్కడున్నాయి ఆ కాగితాలు?'' అని మనియా గద్దించి అడిగాడు.

''ఇక్కడే ఎక్కడో.... ఆ పెట్టెలో వున్నవేమో చూడు. నాకేం వచ్చింది వాళ్ళ మీద వీళ్ళమీద కుతంత్రాలు పన్నడానికి. ఈ గండా ఇప్పుడు కనపడింది గనక సరిపోయింది''.

నందో ఏమి మాట్లాడుతోందో మనియా పట్టించుకోవడం లేదు. ఆ మాటలు అతని చెవిలో దూరటం లేదు. రంకు మగడు పెళ్ళానికి ఏం రాసాడా చూడాలి అన్న క్రోధంతో అతని ఒంట్లో రక్తం వుడికిపోతోంది వెంటనే పెట్టె దగ్గరికి చేరుకున్నాడు, తాను వచ్చిన పని అయినట్టుగా నందో అక్కణ్ణుంచి మెల్లగా జారుకుంది.

మనియా త్వరత్వరగా గదిలో వున్న పెట్టెలన్నీ తెరచి బట్టలన్నీ తీసి మడతలు విప్పి చూసాడు. వాటిలో తనకుకావలసిన కాగితాలు కనపడలేదు. ఇక పెద్దపెట్టె ఒకటి మిగిలిపోయింది. దానికి తాళం వేసి వుంది. సుత్తితీసుకుని

బలంగా ఓ దెబ్బ కొట్టగానే గొళ్ళెం వూడి వచ్చింది. దానిలో వున్న చీరెలన్నీ మడతలు విప్పుతూ చిందరవందరగా నేలమీద విసిరేస్తూంటే భార్య మోహిని వ్రాసిన ఒక్కొక్క వుత్తరం చదువుకుపోతున్నాడు మనియా. కోపంతో అతని కళ్ళలో ఎర్రటి జీరలు కనబడ్డాయి. నరాలన్నీ రక్తంతో పొంగాయి. అతనిలో వున్న యింగితం నశించింది. "ఎక్కడుందా దొంగలంజ" అంటూ ఒక్క గావుకేక వేసాడు.

భార్యకోసం ఇల్లంతా గాలిస్తున్నాడు మనియా. స్నానాల గదిలో ఉందని అందించింది నందో. ఒళ్ళు తెలియని కోపంతో ఒక్క తన్ను తన్నాడు తలుపును.

మనియా కోపంతో తలుపు తన్ని పిలుస్తోంటే స్నానం చేస్తోన్న మోహిని గాభరాగా శరీరానికి చీరె చుట్టుకుని మధ్యలోనే తలుపు తెరచింది. "రంకుముండా, లంజా" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని బరబరా లాక్కుంటూ ముంగిట్లోకి తీసుకు పోయ్యాడు. పెళ్ళాన్ని తన్నుతూ నేలమీదికి తోసివేస్తూ పిడిగుద్దులు గుద్దాడు, అనరాని మాటలు అన్నాడు. చెంపలు ఛెళ్ళుమనిపించాడు. వీపు బద్దలు కొట్టాడు. నానా బూతులు తిడుతూ, కాళ్ళతో తన్నుతూ అలసి పోయినట్టు ఊపిరి పీలుస్తున్నాడు. భర్త దెబ్బలకు ఓర్వలేక పోయింది మోహిని "చచ్చాను మొర్రో" అంటూ పెడబొబ్బలు పెట్టడం మొదలెట్టింది. ఇల్లంతా గందరగోళం అల్లుకుంది. ఆ గోల విని శంకర్, అతని భార్య గది లోంచి బయటికి వచ్చారు. మనియా కేకలూ, మోహిని పెడబొబ్బలూ విని చుట్టుప్రక్కల యిళ్ళవాళ్ళంతా మూగారు.

ఆ సందడిలో నందో ఏమీ తెలీనట్టు ఎప్పటిలా ఊరకుంది. పూజామందిరం లోకి వెళ్ళి దేవుడికి జలాలాడిస్తూ ప్రపంచంతో తనకేమీ సంబంధం లేనట్టుగా నటిస్తూంది. తమ్ముడు శంకర్ ఆ దృశ్యాన్ని చూడలేక పోయ్యాడు. అన్నగారిని ఆపు చేద్దామని ముందుకొచ్చాడు. మనియా ఏదో భూతం ఆవేశించినట్టుగా భయంకరంగా వున్నాడు.

"మీ వెధవలవల్లనే అది ఇంతవరకు బరితెగించింది. పుండాకోరు వెధవల్ని అందరిని మీరేగా పిలిచింది. ఇవ్వాళ ఒక్కొక్కడి గొంతు పిసికిపారేస్తా. ఈ లంజ ముండ లక్షలకు విలువగల నా గౌరవాన్ని మంట కలిపేసింది. ఈ ముండని ఇప్పుడే వువ్వు పాతరేసి పాతేస్తాను. ఏమే రంకుదానా, ముద్దులు కావాలా, ప్రేమ కావాలంటే నీకు, ఇదిగో మద్దిస్తున్నా...."

అంటూ ఆమె చెంప మీద కాలితో బలంగా తన్నాడు. ఒక చేత్తో ఆమె జుట్టు పట్టుకుని ముంగిలి అంతా బరబరా ఈడుస్తూ ఆమె ఒళ్ళంతా హూనం చేసాడు. అసలే స్నానం చేస్తూచేస్తూ తుడుచుకోకుండా మధ్యలోనే ఆదరాబాదరాగా చీరె చుట్టుకుని వచ్చిందేమో చీర అంత తడిసి పోయింది. ఇష్టం వచ్చినట్లు మనియా ఆమెను కిందపడేసి కొప్పుపట్టి పైకిలాగి తన్నుతోంటే శరీరాన్ని ఆ చీర సరిగా దాయలేకపోతోంది. బయట చేరిన చుట్టుపక్కల వాళ్ళలో కొంత మంది ధైర్యవంతులు ఇంట్లోకి వచ్చి వారించడానికి ప్రయత్నించారు. "అలా కొట్టి చంపకయ్యా, పాపం ఎలా అయిపోయిందో చూడండి" అంటూ నలుగురూ అంటున్నారు. అక్కడ చేరిన పేరంటాళ్ళలో ఇద్దరిని చేయివూపి లోపలికి పిలిచింది నందో.

"ఎంతపని చేసింది." అంటూ నోరు నొక్కుకొని అంది అందులో గున్నో అనే ఓ పేరంటాలు. ఇంసోలాలాకు ఏమీ అర్థంకాక గుమ్మం మీద కూర్చున్న గున్నో మీదికి వంగి "ఏం జరిగిందేమిటి" అంటూ అడిగాడు.

దుఃఖాన్ని దిగమింగుకుంటూ కళ్ళను కొంగుతో అద్దుకుంటూ గున్నో అంది "ఏం చెప్పను అన్నా. అంతా కలియుగ మహాత్మ్యం. దానికేం కొరవ చెప్పు. రాజకుమారుడిలా వున్నాడు మగడు. ఎంత సంపాదనా పరుడు అందంలో చందంలో మా మనియా ఏమి తీసిపొయ్యాడంటూ దీనికీ అపర బుద్ధి పుట్టింది. రామరామ! పరువు వున్న ఏ కొంపలోనూ ఇటువంటి కోడలు ముండ రాకూడదు. పంది గుణం ఎక్కడికి పోతుంది. రాజాగారి దివాణంలో పెరిగినా పెంట తినే స్వభావం ఎక్కడికి పోతుంది? నిజంగా కలియుగం వచ్చిందిరా నాయనా! అయ్యో ఎంత అప్రతిష్ట!"

"అంతా తెల్లదొరలై పొయ్యారే. స్వాతంత్ర్యం వచ్చిందిగా. ఎవరికి వాళ్ళు బరితెగించి పోతున్నారు. ఆడోళ్ళకూ వోట్లు ఇచ్చారుగా. వాళ్ళ ఇష్టా రాజ్యం అయిపోయింది. ఇక పాతకాలపోళ్ళం నువ్వూ నేనూ వున్నామే, పెద్దల పరువూ గిరువూ అంతా చిలక కొయ్యకు తగిలించి ముసుగుదన్ని పడు కోవాల్సిందే. రేపు చూడు. ఏదో ఓ పార్టీ వాళ్ళు దీని గురించి కూడా ఓ కాగి తం ముక్క మీద అచ్చు వేయించి విమానాల్లోంచి విసిరేస్తారు. అసలే ముక్కు తెగి ఏడుస్తోంచే ఈ లోకం అంతా ఘుమఘుమ లాడుతూ మధ్యలో తయారవు తుంది".

"అరే, చూడవయ్యా, ఒక్కొక్కడికి నా తడాఖా చూపిస్తాను. అందరినీ ఖూనీ చేసి పారేస్తాను" అంటూ గర్జించాడు మనియా.

"ఇదేరో పెద్దవాళ్ళు బందారంరా...."

గోడల మీది నుంచి దిగుతూ రోడ్డుమీదికి వంద వచ్చే సరికి బల్రూటి సునార్ ఇంటి ముందు జనం బాగా పోగయ్యారు. ఇటు మిస్టర్ వర్మ ఇంటి దాకానూ అటు రెండు ఇళ్ళ ఆవతలి వరకు జనం మూగారు. సందులో నడవ డమే కష్టమైపోయింది. గుంపు క్రమక్రమంగా పెద్దదవుతోంది. కోపంవచ్చినప్పుడు మధ్య మధ్య భార్యకు నాలుగు వడ్డిస్తూ నిలబడ్డాడు మనియా. మధ్య మధ్య 'ఇంకేం కొడతావు లేవయ్యా' అని కొంతమంది అంటున్నారు. రకరకాలుగా వ్యాఖ్యానాలు చేస్తున్నారు. మోహిని మోసంతో ప్రారంభమైన మాటలు ఆ సందులో ప్రేమించి పెళ్ళి చేసుకున్న సంసారం చేస్తోన్న తారావర్మలా, చివ రికి ప్రేమ కలాపాలకు సజ్జన్ గది ఏ విధంగా అడ్డా అయిందన్న వరకూ వెళ్ళింది. నందో గదిలో చేరిన పేరంటాళ్ళు అసలు జరిగిన కథంతా చెప్తుతూ అక్కడి ప్రజావాక్యాన్ని మలుస్తున్నారు. అవన్నీ వింటోన్న మనియా పట్ట పగ్గాలు లేకుండా కోపాన్ని పెంచుకుపోతున్నాడు "నువ్వు నా ఇంట్లో వద్దు. పో నీ రంకు మొగుడి దగ్గరకు, పోవే లంజా" అని అంటున్నాడు.

మనియా మోహినిని బర బర ఈడ్చుకుంటూ నడవా అవతలికి తీసుక పోయాడు. అప్పటికి అతని క్రోధం తగ్గలేదు. గడపమీద నుంచి ఆమెను

కొప్పు పట్టి లాగుతూ ఆ సజీవశవాన్ని వీధిలో పడేసి లోపలికి రివ్వున వెళ్ళి పోయాడు. అతను వెళ్ళిపోగానే మోహిని వెంటనే ఒంటి మీద చీరె సర్దుకుని దుమ్ము కొట్టుకున్న ముఖాన్ని మోకాళ్ళ మధ్య దాచుకుని మామగారి గుమ్మం ముందే అలాగే కూర్చుని వుంది.

జనం ఎక్కువవుతున్నారు. రోజూ ఓ కొత్త విశేషాన్ని వెతికి దానితో కాలక్షేపం చేసే నిక్షేపరాయుళ్ళకు మోహిని సరికొత్త మసాలా సమకూర్చింది. ఈమెతో ప్రేమయాణం నడిపిన వ్యక్తి ఎవరో ఓ కవి అంట. ఈ సందులోనే చిత్రకారుడైన ఓ శ్రీమంతుని బిడ్డ వున్నాడు. అతని దాబా మీద నుంచి ఈ గ్రంథం అంతా నడిచిందట అంటూ చర్చ మొదలెట్టారు. ఆ సందర్భంలోనే కన్య సజ్జన్ ప్రేమ వ్యవహారం, విమానాల మీద నుంచి కరపత్రాలు పంచి పెట్టటం మొదలైన విషయాల గురించి తీవ్రంగా చర్చలు జరుపుకుంటున్నారు, అక్కడి వాళ్ళంతా. ధనిక వర్గం పట్ల బడుగు వర్గాల మనస్సుల్లో సహజంగా వుండే వ్యతిరేకతాభావం సజ్జన్ వ్యక్తిత్వాన్ని ఆవిధంగా చిత్రించడానికి తోడ్ప డిందంటే అందులో ఆశ్చర్యపడాల్సింది ఏమీలేదు. మొత్తానికి అక్కడవాతా వరణం అంతా సజ్జన్‌కే వ్యతిరేకంగా కనపడింది. ఇదేమంచి అవకాశం అంటూ మరికొంత మంది గిట్టని వ్యక్తులు శంకర్ అతని భార్య, తారా, వర్మలు వీళ్ళు నలుగురూ మన ప్రాచీన సంప్రదాయాలకు విరుద్ధంగా ఫేషన్లు నేర్పి వీధిలోని యువతరాన్ని తప్పుదోవ పట్టిస్తున్నారని మిథ్యా ప్రచారం చెయ్యడం మొద లెట్టారు.

శరీరం ముఖం దాచుకుంటూ బురదలో తడిసి, మోకాళ్ళ సందులో దైన్యంతో ముడుచుక కూర్చున్న పెద్దకోడలు అక్కడ చేరిన జనానికి అనేక రకాలుగా అనేక మందిని ఆక్షేపించడానికి ప్రేరేపిస్తున్నట్లుగా వుంది. వయస్సు మళ్ళిన వాళ్ళు, వయస్సు ఉడిగిన కొన్ని ముసలి నక్కలు కాలం గురించి మూఢంగా కొన్ని అసందర్భమైన ప్రేలాపనలు వేలుతుంటే అక్కడే వున్న కొంతమంది యువకులకు చెడ్డగా తోచింది.. వాళ్ళు ఆ పాతతరం వాళ్ళతో వాగ్వాదానికి కూడా దిగారు. అన్ని వాగ్వాదాలూ, మీమాంసలు జరిగిన తర్వాత

తేలిన విషయం యేమిటంటే అన్ని కాలాల్లోనూ, అన్ని యుగాల్లోనూ మంచీ చెడ్డ అనేవి వరుసగా వేకలా వెంటవెంటవున్నాయనీ దీన్ని గురించి ఏ ఒక్క తరాన్నీ, ఏ ఒక్క కాలాన్నీ నిందించి ప్రయోజనం లేదనీను, ఈ సంఘటనను పురస్కరించుకుని వ్యభిచారాన్ని నిర్మూలించడానికి గట్టిగా ప్రయత్నం చెయ్యాలని కూడా తీర్మానించ బడింది. ఈవిధంగా అక్కడ చేరిన ప్రజానీకం ఎన్నో నైతిక, సాంఘిక సమస్యలపై తమ దృష్టిని కేంద్రీకరించాలని గంభీరంగా విచారణ చేసింది. వాటిని పరిష్కరించడానికి ఎలాంటి సిద్ధాంతాల్ని మనం ప్రాతిపదికం రూపంలోస్వీకరించాలా అని తేల్చి వున్న వాళ్ళు మెల్లగా జారుకుంటున్నారు. కొత్తజనం పోగవుతున్నారు. పాతజనం వెళ్ళిపోతున్నారు.

పెద్దకోడలు మాత్రం అందరికీ వింతగా తయారై అలాగే తలదించుకుని గుమ్మం దగ్గిర కూర్చునివుంది.

# 27

ఒకినగారి విషయంలో తాను జోక్యం చేసుకుంటే అర్థం వల్చినోళ్ళందరినీ నరికి పారేస్తానని మనియా బెదిరించడంతో ఆ విచ్చి కోపంతో అన్నగారు తన పరువు కూడా నిలబెట్టరన్న భయంతో శంకర్‌లాల్ రంగం నుంచి మొదట్లోనే నిష్క్రమించాడు. మేడమీద నిర్ఘాంతపోయి కూర్చుంది అతని భార్య. సరూప్ భయం చేత ఆమె ముఖం పాలిపోయింది. శంకరుకైతే నోట మాటలు కూడారావడం లేదు. దాటుచేసుకుని ఇద్దరూ పై నుంచి కింద జరుగుతోన్న తమాషా చూస్తూ నిలబడ్డారు.

బహూలీ సునార్ ఇంట్లో ఏం జరుగుతుందా అని తెలుసుకోవడానికి రాధ, వర్మలు ఉవ్విళ్ళూరుతున్నారు. రాధైతే డాబామీదకు ఎక్కవద్దని వారించాడు వర్మ. తీరా రాణీ ఆరడ్డీ మనిషి రమ్మంటే సరేనంటూ సునార్ డాబామీద నుంచి కిందికి దిగాడు. [illegible] అయితే, మూడో అంతస్తులో నిలబడి కటకటాల్లోంచి అంతా గమనిస్తున్నాడు. ఇంతలో ఎందుకో చిన్న కోడలు పైకి చూసింది

వర్మ కనిపించారు. ఆయన్ను చూడగానే శంకర్ భుజం తట్టి కళ్ళతో సైగ చేసింది. ఇద్దరిని చూస్తూ పైకి రమ్మనమంటూ సౌజ్ఞచేసాడు వర్మ. వాళ్ళు రాగానే ఓ వేడి నిట్టూర్పు విడుస్తూ "ఇకనైనా పోలీసులకు తెలియచెయ్యండి ఈ వీధిలో వాళ్ళు పరమనీచులు. వీళ్ళంతా ఆ మనియాను ఉసికొల్పి చివరికి ఆమెను చంపేదాకా వూరుకోరు" అంది.

"అవునండి. దయచేసి వెంటనే ఆ పని చెయ్యండి. లేకపోతే బావగారు ఆమెను ప్రాణాలతో -" అంటూ కళ్ళలో నీళ్ళు నింపుకుంటూ అంది.

"నాకే అభ్యంతరం లేదు. పోలీసు వాళ్ళను పిలిస్తే వాళ్ళ విచారణలో సజ్జన్ వర్మగారు అనవసరంగా ఇరుక్కుంటారేమో అని ఆలోచిస్తున్నాను. మీరు చూస్తూనే వున్నారుగా వాళ్ళంతా మనల్ని ఎలా ఆడిపోసుకుంటున్నారో" అంటూ శంకర్ జవాబిచ్చాడు.

"మరైతే ఇప్పుడేం చెయ్యాలి. పోనీ ఆమె పుట్టింటివాళ్ళను పిలిపిస్తే"

"పుట్టింట్లో ఎవరున్నారు గనక! సవతి తమ్ముడు వున్నాడు. ఈ పరిస్థితిలో అతను వచ్చి మోహినిని ఏం తీసుక వెళతాడో! ఏ వుద్దేశ్యం ఏమిటి సరూప్" అని తార అంది.

"ఊహూఁ" అంటూ తల ఆడించింది సరూప్ ఆవేం అర్థం లేదన్నట్లుగా.

"అందుకే పురుషుడు నియంత అంటారు. వాళ్ళెన్ని చేసినా ఎవరూ తప్పుపట్టరు. అదే ఆడది ఓ సారి చేసిందంటే -"

తార పూర్తి చేయకముందే మధ్యలోనే అందుకుని శంకర్ వైపు చూస్తూ వర్మ అన్నాడు - "అయితే సజ్జన్ వర్మగారికే తెలియ పర్చండి".

"వారిప్పుడు వూళ్ళోలేరండి"

"అలాంటప్పుడు విరహేష్‌కే తెలియపరచండి. ఎంతచెడ్డా మోహిని ప్రియుడు అతనేగా-"

అంతే. అంతే. అతనికే తెలియ చెయ్యాలి" అంటూ భర్త చేసిన సూచనని సమర్థించింది భార్య తార. మళ్ళీ, "సరూప్, చిట్టికి బాగా ఆకలై వుందమ్మా. ఎలా ఏడుస్తోందో చూడు".

"ఇవ్వాళ మాయింటికి పాలు రాలేదు. ఒక వేళ కింద వచ్చినా-"

"మా ఇంటికి పద", అంటూ తార శంకర్ వైపు చూస్తూ అంది- "మిస్టర్ లాల్, మీరు ఎలాగైనా ముందు విరహేష్‌ని కలుసుకుని తెలియపరచండి సుమా"

"ఏమి చెప్పమంటారు విరహేష్ ఇల్లు నాకు తెలియదాయే... ఆ! వుండండి. మహీపాలు గారింటికి వెళ్ళతాను. వారు రచయిత కదా బహుశా—"

"దూ ప్లీజ్. త్వరగా వెళ్ళండి" అన్నారు వర్మ.

"మీతోనే వస్తాను. పదండి. అటు నుంచే బయటికి వెళతాను. మీ దగ్గర సైకిలు వుందిగా"

"ఆఁ ఆఁ పదండి"

"అవును. మీ ఇంటి గుమ్మంలోంచి వెళ్ళడం అంత మంచిదికాదు".

"నిజమే రండి".

వర్మ ఇంటికి వెళ్ళడానికి గాను అందరు డాబా మీదకు ఎక్కారు. సరూప్ బిడ్డను భర్త చేతికి అందిస్తూ "మీరు వెళుతూండండి. నేను గదికి తాళం వేసి మీ వెనకనే వస్తాను" అని అంది.

శంకర్‌లాల్ వర్మ ఇంటి నుంచి బయలుదేరిన గంటన్నరలో మహీపాల్, కర్నల్‌సాహెబ్ ఇద్దరూ అక్కడికి చేరుకున్నారు. అప్పటికి జనం పల్చబడ్డారు. అయినా కొంత మంది స్త్రీలూ, పురుషులూ అక్కడే మూగివున్నారు. తమలో తాము వ్యాఖ్యానాలు చేసుకుంటున్నారు. మరియా డ్రాయింగ్ రూమ్‌లో సిగరెట్టు కాలుస్తూ గంభీరంగా కూర్చున్నారు. అతన్ని చుట్టి నలుగురైదుగురు శ్రేయోభిలాషులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఇక నందో తన టిక్కీ వదిలిపెట్టి నడవాలో దర్బారుపెట్టి కూర్చుని వుంది. అక్కగారి చంటిదాన్ని

ఎత్తుకుని సరూప్ తార ఇంట్లోనే వుంది. భర్త ఎప్పుడొస్తాడా అని ఎదురు చూస్తూవుంది. తార, వర్మ కూడా శంకర్‌లాల్ రాకకై వేచియున్నారు. వర్మ గారు దుకాణానికి ఇంకా వెళ్ళలేదు.

కర్నల్ సాహెబ్, మహిపాల్ సందులో అడుగు పెడుతుండగం తలుపు లోంచి చూసాడు వర్మ. వాళ్ళు కారులో వచ్చారు. వాళ్ళడ్రైవరు కూడా కర్నల్ వెంట వచ్చారు. శంకర్‌లాల్ మాత్రం వాళ్ళ వెంటలేదు.

జనాన్ని తోసుకుంటూ మహిపాల్ పెద్దకోడలి దగ్గరకు వెళ్ళారు. కర్నల్ వెనకనే వున్నారు. సమాధిలోకి వెళ్ళిన యోగిలా అలాగే తలవంచుకుని కూర్చుంది పెద్దకోడలు. బురదగో తడిసిన ఆమె వస్త్రాలు ఎండకు ఎండినట్టుగా కనబడుతున్నాయి.

ముందుకు వెళ్ళి ఆమె తలపై చెయ్యి నిమురుతూ ఆప్యాయంగా "లే చెల్లీ, వెళ్దాంపద" అంటూ మహిపాల్ అన్నారు.

ఆ శోకమూర్తి తల ఎత్తలేదు. చుట్టూమూగిన జనాన్ని చూస్తూ కర్నల్ బెదిరిస్తూ అన్నారు "మీరంతా ఇక్కడెందుకు చేరారు? ఇక్కడేమైనా తమాషా చూస్తున్నారా?"

ఏదో కొత్త గొంతుక వినిపించగానే మనియా బయటికి వచ్చారు.

వాళ్ళలో ఎవరో ఓ కొంటెవాడు "అవును లాలాజీ! లైలామజ్నూ నాట కాన్ని—" అంటూ ఆగిపోయాడు.

"మీకు సిగ్గులేదూ?" కర్నల్, మహిపాల్ ఇద్దరూ ఒకే పర్యాయం అన్నారు. మహిపాల్ మాట్లాడుతుండే కర్నల్ ఆగిపోయారు. "మీకు వేళా కోళంగా వుందా? పాపం అసలే ఆమె నలిగి చస్తోంటే సానుభూతి చూపించా ల్సింది పోయి హుషారుగా చూస్తున్నారా? అవునా? మీలో ఎవరైనా మనసా, వాచా, కర్మణాపవిత్రులైనవాడు ఒక్కడున్నాడా? అయితే వచ్చి ఆమెను విమ ర్శించండి. ఆమె చాలా తప్పుపనే చేసిందనుకోండి. కాని మీలో ఎంతమంది పుణ్యాత్ములు వున్నారు? అంత మొగాడుంటే ఛాతి విరుచుకుంటూ ఇలారాండి" అని మహిపాల్ చాలా ఆవేశంతో మాటాడాడు.

క్షణంపాటు అందరూ చూస్తూ నిలబడ్డారు. గడప మీద రొమ్ము విరుచు కుంటూ "మీరెవ్వరయ్యా అడగటానికి" అంటూ మనియా మహీపాల్‌ని ప్రశ్నించాడు.

తన్నెవరో అవమానించినట్లయింది మహీపాల్‌కి. అతను కూడ కళ్లెగ రేస్తూ "నువ్వెవరు?" అని ఎదురు ప్రశ్న వేసాడు.

"నేనీమె మొగుణ్ణి"

"అయితే ఆలస్యం చేయక వెంటనే ఆమెను ఇంట్లోకి తీసుకెళ్ళండి"

"మీరు"- అంటూ మనియా మాట్లాడకముందే కోపంతో కర్నల్ తగులు కున్నారు- మీరు... మీరు అంటావేమిటయ్యా? నీ భార్య అయితే కావచ్చు. కాని ఆమెను కొట్టడానికి నీకు అధికారం ఎవరిచ్చారు? ఆమె చరిత్రహీనురాలైతే కోర్టులో దావా వెయ్యి. అంతేకాని చట్టాన్ని చేతుల్లోకి తీసుకుని నీ ఇష్టానుసారం-"

"మీరు కూడా ఈమెకు విటులా-" అంటూ మనియా మాటలు వెళు క్కుంటూండగానే మహీపాల్ అతని చెయ్యి గుంజి గుమ్మం మీద నుంచి మని యాను లాగాడు. మనియా ఆ లాగుడుకు తట్టుకోలేక పోయాడు. ఇంచు మించుగా అతను తూలిపడబోయినంత పని అయింది. తలుపుకు పక్కగా కట్టిన అరుగు అకస్మాత్తుగా మహీపాల్ గుంజడంలో మనియాకు పొడుముకుంది. మహీపాల్ చెయ్యి మనియా చెంపమీద ఛెళ్లుమనేటప్పటికి చెంపా, చెవీ ఇంచు మించుగా దాట్ అయిపోయాయి. మనియాకు దిమ్మ తిరిగినట్లయింది. మనియా కళ్ళు రక్తంతో ఎర్రబారాయి. మహీపాల్ అతని ఎడమచేతిని అదిమిపట్టుకున్నాడు. మహీపాల్‌ని కొడదామని మనియా కుడిచెయ్యి ఎత్తాడు. మహీపాల్ అతని కుడి చేతి మణికట్టు కదలకుండా పట్టేశాడు. ఇద్దరూ కుస్తీపట్టటం మొదలెట్టారు.

జనంవైపు చూస్తూ కర్నల్ "డ్రైవర్ డ్రైవర్" అంటూ శివమంగల్‌ని పిలిచాడు.

పెద్దగా అరుస్తూ కర్నల్ "లాలా జానకీశరణ్ ఇంటికి వెళ్ళి పోలీసు స్టేషన్‌కి ఫోను చెయ్యి. నా పేరు చెప్పి ఇనస్పెక్టరు శుక్లాను వెంటనే ఇక్కడికి

నేను రమ్మన్నానని చెప్పు" అన్నాడు. అక్కడ చేరిన జనంలో కొంతమంది మధ్యవర్తిత్వం చెయ్యడానికి వచ్చినవారూ, కొంతమంది తిరుగుబాటు తత్వం వాళ్ళూ మరికొంతమంది ఏదైనా వస్తువు దొరికితే చాలు ఉడాయిద్దమని వచ్చిన వాళ్ళూ వున్నారు. ఆఖరివర్గం వారు పోలీసు పేరు వినగానే మనకెందుకులేఅంటూ జారుకున్నారు. మధ్యస్తం వర్గంవారు "అవును, అవును" అంటూ రణరంగం లోకి దూకి ఇద్దరినీ విడదీయడానికి ప్రయత్నించసాగారు. తిరుగుబాటు వర్గంలో ఓ వ్యక్తి "అవునవును పోలీసుల్ని పిలిపించండి. పెట్టుబడిదారీ పరిపాలనకదూ. ఏభుల్లో దూరి ఆడోళ్ళందరినీ చెరబి ఆత్మరక్షణకోసం పోలీసుల్ని పిలిపిస్తూ వుండండి", అంటూ సామ్యవాద ధోరణిలో వుక్రోషం వెళ్ళగక్కాడు.

"రానివ్వండిరా పోలీసుల్ని. నాయాళ్ళను ఇక్కడే పాతేద్దాం" అంటూ ఆ వర్గంలోని రెండో వ్యక్తి తగులుకున్నాడు.

మహిపాల్ నుంచి బలవంతంగా విడిపోయి రొప్పుతున్న మనియా అదే కంఠంతో అన్నాడు—"ఇది నా పెళ్ళాం. కొట్టుకుంటా, చంపుకుంటా, ఎవరైనా అడ్డంవస్తే వాడి రక్తం కూడా తాగుతాను".

"పోనియ్. పోనియ్."

"దొంగనాయాళ్ళు. పెద్దపోటుగాళ్ళలా వచ్చారు! నా లక్షల విలువచేసే పరువు ఏమికాను. ఈ లంజెను....దాని మిండగాళ్ళముందే-" అంటూ మధ్య వర్గం వాళ్ళచేతుల నుంచి విడిపించుకుని భార్యను ఎగిరి ఓ తన్ను తన్నాడు. ఆ దెబ్బకు పాపం ఆమెగోడకు కరుచుకుపోయింది. అయినా తల ఎత్తలేదు. మహీ పాల్‌కు వెఱ్ఱికోపం హెచ్చింది. ముందుకొచ్చారు. అక్కడున్న వాళ్ళు ఇద్దరినీ పట్టుకున్నారు. "పోనీలెండి బాబుగారు! అరే మనియా, చెప్పినా వినిపించుకోవే మిరా! ఎంత తన్నినా ఏం లాభం! నీకిష్టంలేకపోతే దానిఖర్మకు దాన్ని ఒదిలేయ్ ఆమె పుట్టింట్లో వదిలిపెట్టిరా"

"ఎక్కడికైనా పొమ్మను....ఏట్లో దూకి చావమను" అని మనియా కూతలు కూస్తొంటే ఇంకా అతనక్కడ వుంటే పెద్ద రభస అవుతుందని అతడ్ని ఇంట్లోకి తీసుకొని వెళ్ళారు. మనియా కన్న మహిపాల్ బలిష్టుడు. మని

యాను ఎత్తెత్తి నాలుగుదంటాడు. అందరి ముందు దెబ్బలుతిని అవమానంపాలై నందుకు మనియాకు లోలోపల కోపం బాగా రగులుతోంది. అతను మరింత రెచ్చిపోతున్నాడు.

పోలీస్ ఇనస్పెక్టర్ శుక్లా మరిఇద్దరి జవాన్లను వెంట పెట్టుకుని లాలా జానకీశరణ్ వున్నచోటికి వచ్చారు. వాళ్ళను చూడగానే గోల సద్దుమణిగింది. కాసేపు నచ్చచెప్పిన తర్వాత తనకూ తన భార్యకూ ఎలాంటి పొత్తుకుదరదని చెప్పడానికి మనియా అంగీకరించాడు ఎవరికైనా కావాలంటే వాళ్ళతో ఆమె వెళ్ళవచ్చునని చెప్పేసాడు.

మనియాను చుట్టుతూ జనం అతణ్ణి డ్రాయింగ్ రూంలోకి తీసుకొచ్చారు. లాలా జానకీశరణ్, కర్నల్ మరి నలుగురు మనుష్యులు అక్కడ చేరివున్న జనాన్ని పంపివేయసాగారు. శంకర్‌లాల్ ఒదినగారిని బ్రతిమాలుతూ లేవ తీసాడు.

రెండూ రెండున్నర గంటలతర్వాత పెద్దామె దించిన తలఎత్తింది. ఆమె ముఖం ఎలాంటి భావంలేకుండా రాతిప్రతిమలావుంది.

మహిపాల్ ఇంతలో అక్కడ జనం వున్నారనే విషయాన్ని కూడా మరచి ఏదోధ్యాసలో మునిగిపోయాడు. వర్మ ఇల్లు చేరుకోగానే చిన్నకోడలు, తార ఆమెతో కదుపుకుని పోయారు. ఏదోబొమ్మను సెంటెట్టినట్టుగా ఆగిపోయిన యంత్రంలావుంది, పెద్దామె. శరీరం నిండా గాట్లూ, దెబ్బలు తన్నులూ తిని ఒళ్లంతా కమిలిపోయింది.

ఇప్పుడేమి చెయ్యాలన్నట్టుగా వర్మ శంకర్‌లాల్ ఆలోచనలో పడ్డారు. లాలాజానకీశరణ్ వెళ్ళిపోతూ కర్నల్ వాళ్ళ ఇంటిముందు ఆగిచెప్పి వెళ్ళారు– "ఆమెకు బాగా దెబ్బలుతగిలాయి. నేను ఇప్పుడే డాక్టర్ సింగును ఫోనుచేసి పిలిపిస్తాను. ఏమైనా సీరియస్‌గా ఎక్కడైనా దెబ్బతగిలి వుండొచ్చు. ఇప్పుడు రియాక్షన్ మొదలవుతుంది. ఆమెకు పాలూ, బ్రాంది తాగించండి".

వ్యవహారం గురించి పోలీసు రికార్డులో ఎక్కించకూడదని లాలాజానకీ శరణ్ ఇంట్లో నిశ్చయించారు. వీధిలో వ్యవహారం కచేరీదాకా ఎందుకన్నారు.

బిభూతీ సునార్ మంచి బలసిన ఆసామాయె. పోలీసులకు ఘనంగా డబ్బు ముట్టుతుంది. అక్కడికే శంకర్‌లాల్‌నూ పిలిపించారు. లాలాగారు అతణ్ణివిడిగా తీసుకెళ్ళి మాట్లాడారు. వ్యవహారం తేల్చి నిర్దోషిత్వాన్ని స్థిరపరిచేందుకు ఐదు వందల రూపాయలు ఇవ్వమన్నారు. శంకర్‌లాల్ కిమ్మనకుండా ఐదువందలకు చెక్కురాసి ఇచ్చాడు. లాలా జానకీశరణ్ రెండోకంటికి తెలియకుండా ఐదు పచ్చకాగితాలు ఇనస్పెక్టరు శుక్లాగారి జేబులో కుక్కాడు. పెద్దకోడలు అక్కడ వుండడానికి వీల్లేదన్నారు. ఆమెను ఆమె ప్రియుడైన విరహేష్‌కు అప్పచెప్పాలని తీర్మానించారు.

కర్నల్ ఫోనుచేస్తోన్నపుడు సింగ్ ఏదో అర్జంటుగా ఆపరేషన్ చేస్తోంది. రోగిని తనదగ్గరకే తీసుకరమ్మనమని అక్కడే ఆమెను చూస్తానని చెప్పింది. రోగిని తీసుకుని మహిపాల్ ఇప్పుడే వస్తాడని చెప్పారు కర్నల్.

"నేను చోర్‌గాణ్ణి వెతికివస్తాను" అని మహిపాల్ అన్నాడు.

"చోర్‌గాడికి నీ కంటే నేను బాగా నచ్చచెప్పగలను మహిపాల్. వాడు నాకు బాకీకూడా. ఇప్పుడే స్టేషన్‌కి పిలిపించి ఆ వెధవని గోవింద కుమ్ములు కుమ్మిస్తాను" అని అన్నాడు కర్నల్.

"చోర్‌గాడింటికి నేనే వెళతాను. వాడి ఇల్లు కనిపెట్టాలంటే నీకు కష్టం" అని పట్టుపట్టాడు మహిపాల్. అసలు కారణం డా. షీలా దగ్గరకు వెళ్ళడానికి మహిపాల్‌కి ఇష్టంలేదు. షీలా ముందు పెద్దకోడలూ-చోర్‌గాడి ప్రణయకలాపం ప్రసక్తి ఎలాగూ వస్తుంది. అప్పుడు తన పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంటుంది. మహిపాల్ కూడా భార్యను ఏడిపిస్తాడు. చోర్‌గాడికిమల్లే పిల్లలు వుండి కూడా అతను షీలాతో వ్యవహారం నడుపుతున్నాడు. అతని ప్రేమనిజమైందే. అలాంటప్పుడు పెద్దకోడలూ విరహేష్ ప్రేమించుకుంటే తప్పు ఎలా అవుతుంది? అందుకే షీలా అంటే తప్పుకొని తిరగాలనుకుంటున్నాడు మహిపాల్ తన నుంచే తాను తప్పుకుని తిరుగుతున్నాడు - అతని వ్యక్తిత్వానికి రెండు పొరలు - ఒకటి తాను ఓ స్త్రీకి భర్త. రెండు తాను తన పిల్లలకు తండ్రి.

గృహస్థుగా అతనికి కొన్ని బాధ్యతలు వున్నాయి. వాటిని తను నిర్వహించాలి. వాళ్ళను మినహా మరియే ఆలోచన అతను పెట్టుకోకూడదు. "అదే మహీపాల్ గతాన్ని చితిగా పేర్చి నిప్పంటించు. గతించినజీవితాన్ని మరచిపో...మరచిపో" అంటూ అంతర్వాణి మహీపాల్‌తో అంటున్నది.

జరిగిపోయిన జీవితం మరచిపో. ఇప్పుడు కొత్త జీవితాన్ని ఆరంభించు అంటూ డాక్టర్ షీలా సింగ్ నచ్చచెప్పుతోందిమోహినికి.

కొంత సేపయిన తర్వాత మహీపాల్ విరహేష్‌ని తీసుకుని షీలా ఇంటికి వచ్చాడు. అతణ్ణి వదిలిపెట్టి బయటినుంచే వెళ్ళిపోయాడు. కర్నల్, షీలా, సరూప్, శంకర్‌లాల్, విరహేష్ ముందు చతుర్విధ ఉపాయాలు ప్రయోగించారు. ఆమెను సంరక్షిస్తానని మాట ఇచ్చాడు విరహేష్.

మోహిని విరహేష్‌తో వెళ్ళిపోతూంటే సరూప్ వుండబట్టలేకపోయింది. ఆమాంతంగా అక్కగారిని కావలించుకుని ఏడ్చింది. శంకర్‌లాల్ కళ్ళనుంచి అశ్రుధారలు రాలాయి. కర్నల్ కళ్లు కూడా చెమ్మగిల్లాయి. మోహిని ఏమీ మాట్లాడకుండా రాతి బొమ్మలా నిర్జీవంగా వుంది.

తన హృదయేశ్వరి చెయ్యి పట్టుకుని విరహేష్ బయటికి నడిచాడు. ఇప్పుడే పెళ్లై అత్తగారింటికి వెళుతున్నట్లు మోహిని తల వంచుకుని అతనివెంట వెళుతోంది. గుమ్మందగ్గిర ఆగింది. వెనక్కు తిరిగి పదిక్షణాలు శంకర్‌నూ, శంకర్ భార్యనూ కళ్ళు పెద్దవిగా చేసి చూసింది. జీరపోయిన కంఠంతో "బాబును అత్తగార్ని చూడమని చెప్పు నా ముద్దుల బిడ్డ జాగ్రత్త. నాది .... ట్టి..." అంటూ ఆమెకు కళ్ళు తిరిగాయి. మూర్ఛవచ్చి నేలమీదకు ఒరిగింది.

---

ఆదేరోజు రాత్రి ఎనిమిదిన్నర గంటలకు సజ్జన్ గదికి ముట్టడి ప్రారంభమైంది. మోహిని–శోర్ ప్రేమాయణానికి కారకుడు సజ్జనే అని ఆ వీధిలోని వాళ్ళంతా తీర్మానించి అతనిమీదే కసితీర్చుకోవాలనుకున్నారు. సజ్జన్ ఈవీధిలో

అద్దెకు గది తీసుకున్నపుడు ఈ గది శ్రీమంతుల విలాస జీవితానికి అటపట్టు కాబోతున్నదని సజ్జన్‌కు వ్యతిరేకంగా కాందిశీకులు పేపర్లో ప్రకటించిన జోస్యం నిజమైందని అంటూ అందరూ పాత కథను పునశ్చరణ చేసుకున్నారు. ఇటు వంటి అనర్థం జరుగుతుందని తాము ఎప్పుడో చెప్పామని చాలామంది తమ బుద్ధికౌశాల్యాన్ని తామే నిరూపించుకున్నారు. మనియా మిత్రబృందానికి అసలే మంటగావుంది. ఇదే అదను అనుకుని బాబు సాలిగ్రాం, లాలా జానకీ శరణ్ వాళ్ళందరినీ మరీ రెచ్చగొట్టారు. ఎలక్షన్ అల్లరి ఏ ప్రయత్నం చేయకుం డానే ఒక్కుమ్మడిగా సజ్జన్ గదిపై దాడి చేసింది. ఆగ్రహావేశులైన జనం అతని గది తాళాన్ని బద్దలు కొట్టారు. సజ్జన్ గీసిన బొమ్మలు చించిపారేసారు. రంగుల్ని గదినిండా విరజిమ్మి కాళ్ళ కింద తొక్కేసారు. ఆ చిన్న గదిలో కనీసం ఇరువై మంది దూరి నానా భీభత్సం చేసారు గోడకు తగిలించి వున్న మూడు చిత్రాలు కూడా వాళ్ళ అగ్రహానికి గురి అయ్యాయి ఒకదానిమీదకు స్టౌవ్ విసిరేసారు. రెండో చిత్రాన్ని టీ కప్పులు విసిరి చింపేశారు. మూడో దానిమీద ఎవరో స్టూలు విసిరారు. దుప్పటిని ముక్కలు ముక్కలుగా చించారు. స్టౌవ్‌లోని కిరసనాయిల్ పరుపుమీదా దిండ్లమీదా పల్లి వాటికి నిప్పంటించారు. గది అంతా గాజుముక్కలూ, విరిగిపోయిన కప్పులూ సాసర్లు చిరిగిపోయిన చిత్రాలూ, దుప్పటి ముక్కలతో నిండిపోయింది.

ప్రజలు ఉన్మాదంతో స్వైరవిహారంచేస్తోంటే చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళంతా డాబాలూ. గోడలూ ఎక్కి ఆ దృశ్యాన్ని చూస్తూ నిలబడ్డారు. ఎక్కడ చూసినా బూతుల పంచాంగం. ఎగతాళి. జరిగినదానిని గురించి చర్చలూ–అన్నిటితో గది అంతా ప్రతిధ్వనించింది. వాతావరణం చాలా భయంకరంగా తయారైంది. తమాషా చూడ్డానికి వచ్చిన జనం పట్టక గోశాల గేటు తోసుకొని లోపలికి దూరి పోయ్యారు. దారిన వెళ్ళే వాళ్లు కూడా ఈ వింత చూడ్డానికని అక్కడ చేరి పోయారు. ఎక్కడచూసినా జనంతో కిటకిటలాడిపోతున్న సమయంలో పెద్దమ్మ తలుపు దభాలున తెరుచుకుంది. ఒకచేతిలో జోలెనిండా సిందూరం పోసుకుని. కళ్ళెర్రచేస్తూ, నల్లని దుంపల్లా వున్న పళ్ళు బిగిస్తూ నానా తిట్లు తిడుతూ, మంత్రాలు చదువుతూ పెద్దమ్మ రంగంలో ప్రవేశించింది.

పెద్దమ్మ జోలెలోంచి సిందూరం గుప్పిట్లో తీసుకుని జనంమీద చల్లు కుంటూ పోతూవుంది. ఓమ్, నమో నారాయణా, శంకర్ జతి, కామరూకమద్బా సతీకి దుహాయీ, కాలీమా కి దుహాయీ, పాంచోం పీర్ కీ దుహాయీ, సంభిసీ, దంభిసీ అప్, దుస్మన్ కాఖాల్..." అంటూ ఏవేవో మంత్రాలు చదువుతూ సిందూరాన్ని వాళ్ళమీద చల్లుతోంది. మంత్రతంత్రాలకు పూరంతా పేరెన్నిక గన్న పెద్దమ్మ అలా సిందూరం చల్లుతూంటే జనాలకు వణికిపట్టుకోసాగింది. కొంతమంది పెద్దమ్మను ఏడిపించడానికి పెద్దగా అరవడం మొదలెట్టారు గాని పెద్దమ్మ చల్లుతోన్న సింధూరం ధూళి ప్రతి ఒక్కరి మీద పడసాగింది. సింధూరం తమపై ఎక్కడ పడుతుందోనని జనం పారిపోదామనే కంగారుతో తొక్కిసలాట మొదలెట్టారు మెట్లమీదికి పోతోన్న పెద్దమ్మ జనంలో ఇరుక్కు పోయింది. తొక్కిడిలో ఆమె ఇటూ అటూ నలిగిపోతూంది. ఆగ్రహంతో ఆమె ఓ ముసలాడి నోటిని సిందూరం పూసుకున్న గోళ్ళతో రక్కి పారేసింది. అసలే మంత్రాలబూచి అందులో గోళ్ళతో నొక్కగానే ఆ ముసలాయన కెవ్వుమని కేక వేసాడు. ఎవరి రక్తమో తాగుతోందని జనంలో పుకారు బయలుదేరింది.

కిందనుంచి పై మెట్టువరకు ఎక్కుతూ దిగుతూన్న జనాన్ని తోసు కుంటూ చీల్చుకుంటూ పెద్దమ్మ పైకి చేరింది. మెట్లమీదకు వస్తోన్న ఓ వ్యక్తి భయం, గాభరాలో సింధూరంతో వున్న ఆమె జోలెను పట్టుకోబోయి దాన్ని ఆమె మీదే కుమ్మరించాడు. సిందూరం అంతా పెద్దమ్మ ఒంటిపై పడేసరికి మరింత కూ్రరంగానూ, భయంకరంగానూ కనపడసాగింది.

ఎలాగైతేనేం, కొంచెం సేపటికి అక్కడి జన సమూహాన్ని పెద్దమ్మ జయించేసింది రామలక్ష్మణులు. ఇద్దరూ ఖరదూషణాదుల సేనను చీల్చి చెండా డిన తర్వాత బహుశా పెద్దమ్మ గెలిచిందే గొప్పదేమో। సజ్జన్ రూమ్ నుంచి వెళ్ళిపోతూన్న జనం వర్మ ఇంటిదగ్గిర ఆగి నానారకాలు అన్నారు. మరికొ కూతలు కూసారు. తలుపులు బాదారు మనియాఇల్లు ఆ యింటికి దగ్గరగానే వున్న కారణంగా మనియా మీద వాళ్ళసానుభూతి ఎక్కువై వర్మమీద ఆగ్ర హంగా మారింది. సమూహంలో పెరిగిపోతోన్న ఉద్రిక్తతనాన్ని ఎదిరస్తున్నది.

ఈ వరమే. తలుపులు ఎక్కడ పగిలిపూడిపోతాయో అని హడలిపోయారు తార, వర్మాను. సరూప్ శంకర్ బిక్కుబిక్కుమంటూ గదిలో మొద్దుపారి నట్లయిపోయారు. మనియా తప్పతాగి నిషాలో పడివున్నాడు.

ఆ రాత్రి చాలా సేపటి వరకు పెద్దమ్మ కన్నోమల్ మనుమని రూమ్‌లో చిందరవందరగా వున్న సామాను సర్దుతూనే వుంది.

# 28

సజ్జన్ గది సర్దేటప్పటికి రాత్రి చాలా పొద్దుపోయింది. అందరిని తిట్టి పోస్తూనే ఠాకూర్ మందిరంలో దీపారాధన చేసింది. గిన్నెలో పాలు పోసి పిల్లి కూనల్ని పిలిచింది. లలితా, విసాఖా రెండు పరుగెత్తు కుంటూ వచ్చాయి. కిస్నా మాత్రం ఎక్కడా కనపడలేదు, పెద్దమ్మ ఇల్లంతా గాలించింది కిస్నా కోసం, ఎక్కడా కనపడక పోయేసరికి విసుగుతో ఓ వందతిట్లు తిట్టిపోసింది. పిల్లి కూనలు ఇప్పుడు పెద్దవయ్యాయి. ఇంట్లో వుండవు. ఆ వీధిలోని పిట్ట గోడలన్నీ వాటివే. వాటిని సంభాళించడం పెద్దమ్మకు కష్టంగా వుంది. వాటికి పాలు తాగిస్తే గాని ఆమెకు భోజనం దిగదు. కిస్నా రాని కారణంగా ఈ రోజు కూడా ఆమె ఇంకా భోజనం చెయ్యలేదు. తనలోతాను గొణుక్కుంటోంది. సణుక్కుంటోంది. వెధవపిల్లి తన ఇంట్లో కనిపారేసి పోయిందన్న కసితో దానితల్లిని తిట్టిపోసింది.

పెద్దమ్మ మనస్సు బాగాలేదు. కిస్నా పాలు తాగడానికి రాలేదు. కన్నో మల్ మనుమని సామానంతా వీధిలో వాళ్ళు విరగ్గొట్టారు. రేపు ఆమె సవతి కొడుకుని పెళ్ళికొడుకు చేస్తారు. విందుచేస్తారు. పల్లకాడులో పాతిపెట్టి రమ్మన మంటూ నందోకు తాను రెండు యంత్రాలిచ్చింది. ఆమె పాతిపెట్టిందీ లేనిదీ ఇంతవరకు వచ్చి చెప్పలేదు. ఒకవైపు వీధిలో కెళ్ళితే పూళ్ళో వాళ్ళ పోరు. ఇంట్లోవుంటే ఈ ఆలోచనలన్నీ ఆమెను వేధించుకు తింటున్నాయి. ఇన్ని సమ స్యలతో ఆమె సతమత మౌతోంది. సజ్జన్ గది మీద రౌడీ మూకలు దాడిచేసి అక్కడ వాళ్ళు చేసిన భీభత్సం ఆమె మెదడులో లుకలుకమంటోంది. అదృశ్యం

తలమొకంటూంటే ఆమెలో హింస రేగి తాను వాళ్ళమీద ఇంకా సింధూరాన్ని చల్లుతూ వాళ్ళను శపిస్తున్నట్టుగా వుంది.

ఒంటి గంట అయింది. లలితా, విసాఖా రెండూ పొంచి ఎక్కడో ఎలుకని పట్టి చంపేసాయి. పెద్దమ్మ కంటబడింది. ఆమె వైష్ణవ సంస్కారం మన్నులో కలసి పోతోంది. అవి అంటే ఆమెకు ఎంతో ప్రేమ కాని అవి ఇప్పుడు పెద్దవైన తర్వాత ఎలుకల్ని పట్టి తింటోంటే ఆమె నిస్సహాయురాలై వుంది. పిల్లి దుంపతెగ. పుట్టుకతో వచ్చిన బుద్ధి ఎలా మారుతుంది?

తెల్లవారిన తర్వాత అవి రెండూ పోట్లాడుకుంటోన్న చప్పుడు అయింది. అందులో ఒకటి చంపిన ఎలుకను తన కాలికింద నొక్కి పెట్టివుంది. రెండోది తనకూ కావాలంటూ పోట్లాడుతోంది. ఎత్తువేస్తోంది. అలా కాసేపు రెండూ అరిచి అరిచి ఒక దాని మీద ఒకటి దూకి కొట్లాటకు సాగాయి. పెద్దమ్మ ఇల్లు ఓ చిన్న కురుక్షేత్రంలా తయారైయింది. లలితా, విసాఖా రెండూ ఒకదాని వెనుక ఒకటి ఇల్లంతా తిరుగుతూ కలియపడుతూ పెద్దపెద్దగా పోట్లాడుకొంటున్నాయి.

"కట్టకట్టుకుని పిల్లోదూకి చావండి. వెధవముండల్లారా!" అని తిట్టుకుంటూ వుంది పెద్దమ్మ. మంచం మీద నుంచి లేచి ఓ సారి వాటిని వారిద్దామా అనుకున్నది. కాని ఇవ్వాళ ఆమె చేతులకు తోలెకంత పని తగలడంతో ఒళ్ళంతా ముక్కముక్కలైంది. కీళ్ళన్నీ నొప్పిపెడుతున్నాయి. తాను ఇంత మంది జనం మధ్య ఎప్పుడూ ఇరుకున పడలేదు. వాళ్ళ తొక్కిసలాటలో పెద్దమ్మ ఈ మాదిరిగా ఎప్పుడూ నలిగిపోలేదు. మంత్రించిన సింధూరం ఆమె ఆ మూకల మీద చల్లుతుంటే వాళ్ళంతా నవ్వుకుంటూ తమ గుడ్డలు ఎక్కడ పాడవుతాయో అని అటూ ఇటూ పరుగెత్తడం మొదలెట్టారు. పెద్దమ్మ అంటే వాళ్ళకు అసలే మంట. ఈ సాకు దొరికింది గదా అని తలా ఓ తోపు తోసారు. చాలాసార్లు ఆమె కింద పడిపోయింది. ఆమె కింద వుందని లక్ష్యపెట్టక కొంతమందైతే చెప్పులతో తొక్కినే ఆమెను తొక్కుకుంటూ నడిచారు. చివరకి గెలుపు పెద్దమ్మదే అయినా ఆమె ఒంట్లో ఎముకలు విప్పివిప్పి అయినట్టయ్యాయి.

అలాంటి పరిస్థితిలో ఎక్కణ్ణుంచో ఎవరో స్త్రీ దిగ్గరగా మూలుగుతోన్న ధ్వని వినిపించింది మనసులో మేఘాల్లా అలుముకుంటోన్న ఆలోచనల్ని కట్టి పెట్టి చెవులు నిక్క పెట్టి వినడానికి ప్రయత్నించింది. ధ్వని అస్పష్టంగా విన బడుతోంది. ముఖం మీద నుండి రజాయి తొలగించి పెద్దమ్మ వినసాగింది. ఎవరో పురుడు నొప్పులుపడుతున్నట్టుగా ఆమెకు అనుమానం వేసింది. ఈ అర్ధరాత్రి వేళ ఎవరై వుంటారు చెప్మా అంటూ ఆమె లేచి కూర్చుంది. ఇంతలో ఎక్కణ్ణుంచో కిస్నా వచ్చి ఒక గెంతులో ఆమె ఒళ్ళోకి చేరాడు. ఆమె ధ్యాస అంతా వేరే చోట వున్న కారణంగా కిస్నా వచ్చాడన్న విషయం ఆమె గమ నించలేక పోయింది. ఎటు వైపు నుంది మూల్గు వినపడుతుందీ అని ఆమె చెవులు నిక్కబొడుచుకుని వింటోంది. బహుశా తన ఇంట్లో అద్దెకుంటోన్న తార నొప్పులు పడుతోందని ఆమె ఇట్టే పసిగట్టేసింది.

పెద్దమ్మ కడుపులో వున్న ఉక్రోశం అంతా ఒక్కసారిగా ఉడికింది. "ముండ కనలేక ఛస్తే బావుంటుంది. మగపిల్లాడనకుంటూ అందుకే ఇంతగా నొప్పులు పడుతోంది."

తార ఆర్తనాదం పెద్దమ్మలో ఎన్నో తలపుల్ని రేపింది. రేపు ఆమె సవతి మనుమడిని పెళ్ళి కొడుకు చేస్తారు. నాట్యప్రదర్శనం వుంటుంది. మేళ వాణీ వుంటుంది. ఇంకా ఎన్నో వేడుకలు చేస్తారు. పట్నంలోని పేరంటాళ్ళంతా వస్తారు. అందరిమధ్య సవతి మహారాణిలా దేవిగా కూర్చుంటుంది. ఆమె కోడలు కూడా అందలం ఎక్కినట్టుగా గాలిలో తేలిపోతూ వుంటుంది. నాలుగు రోజుల్లో సవతి మనుమడికి పెళ్ళి అవుతుంది. తర్వాత వాడికి పిల్లలు పుడతారు ఆమె సవతి మునినాయనమ్మ అవుతుంది. స్వర్గానికి నిచ్చెన వేసుకుని వెళ్ళే అర్హత సంపాదించుకుంటుంది-ఇంతలో ఆమెభర్త రాజసాహెబు జ్ఞప్తికి వచ్చాడు. అసహ్యంతో ఆమె మనసు నిండిపోయింది. ఆవేశంతో ఒళ్ళు మరచిపోయింది. కిస్నా తన ఒళ్ళోనే పండమన్నాడన్న విషయం కూడా మరచిపోయింది ఒక్క వూపుతో కప్పుకున్న దుప్పటి విదిలించింది. ఒక్క విదిలింపుతో కిస్నా ఆమె ఒళ్ళోంచి కిందపడ్డాడు ఆమె లేవలేదు. పిల్లికూన వుందన్న సంగతే ఆమెకు

గానే ఆ మూడు కూనల్ని చూడగానే పెద్దమ్మకు అభిమానం పుట్టుకొచ్చింది. "దొంగముండా కొడుకులు! ఎంతముద్దుగా వున్నారు. ఆ ఎలుక ముండను చంపినప్పుడు ఈ అమాయకత్వం, ఈ అందం....చందం....అన్నీ ఎక్కడికి పోయినట్లో!".

తమలపాకులు కడుక్కుందామని పెద్దమ్మ ఓ గిన్నెలో నీళ్ళు తెచ్చిపెట్టుకుంది. చూస్తుండగానే విసాఖా దానిలో మూతి పెట్టింది పెద్దమ్మ భగ్గుమంది. పిల్లికూనలు ఇంట్లోకి వచ్చినప్పటినుంచి పెద్దమ్మ ఆచారం, మడి అంతా మంట కలసిపోతూంది. రోజుకు పదిసార్లు స్నానం చెయ్యాల్సొస్తోంది. అవి రోజూ ఇల్లంతా పాడుచేస్తాయి. తిట్టుకుంటూ రోజూ వందసార్లు శుద్ధి చెయ్యాల్సివస్తుంది వంటింట్లోనూ పూజామందిరంలోనూ ఎక్కడచూసినా అవే. ఎక్కడో ఎలుకను చంపి తిని నోటిని నాలుకతో నాకుతూ దర్జాలున ఆమె ఒళ్ళోకి జొరపడతాయి. వైష్ణవచారస్త్రాన్ని జీర్ణించుకున్న పెద్దమ్మ వాటిని చూడగానే జుగుప్సతో నించి పోయి "పొండి...పొండి" అంటూ వాటిని విదిలిస్తుంది. ఆమె కసురుతుంటే అవి మీదిమీదికి వస్తుంటాయి. మొండికెత్తి మారిపాన్ని పుట్టించడం పిల్లికి వృగ్గుపాలతో నేర్పినవిద్య. పెద్దమ్మ విసుగెత్తి చివరికి తన ఒళ్లోనే వాటికి చోటు ఇస్తుంది ఎలుకల్ని చంపుకుతినే పిల్లికూనలు లలితా, విసాఖ, కిస్నా అంటూ ముద్దుగా పేర్లు తగిలించుకుని పెద్దమ్మ చేతులమీద ముద్దుల్ని నాకుతాయి. తరుచుగా ఆమె ముఖాన్ని కూడా నాకుతుంటాయి. ఇల్లంతా తిరుగుతూ ఠాకూర్ ఆసనం మీద కూడా ఉరుకుతూండడం కూడా కద్దు. అవి పూజామందిరంలో దూరినా యంటే అక్కడవున్న రాతివి, ఇత్తడివి, రాగివి అన్ని విగ్రహాలు చెల్లాచెదరై పోయినట్లే. అన్నీ చూసి సహిస్తుంది పెద్దమ్మ. వున్నట్టుండి [illegible] మూతిపెట్టడంతో వేరేనీళ్లు తెద్దామని పెద్దమ్మ లేచింది. తార అంగే. గట్టిగా మూలుగుతోంటే తాను జీవితంలో మొదటిసారిగా చివరిసారిగా పడిన అవస్థ ఆమె కళ్ళముందు కట్టింది. ఆకులకు సున్నం రాస్తూ పెద్దమ్మ తార నొప్పులు వింటోంది. ఓ చిటికెవేసి కృష్ణార్పణం అంటూ నోట్లో పెట్టుకుంది. కాసింత పొగాకు పొడుం జైశ్రీ అంటూ నోట్లో వేసుకుంది. చేతులు గిన్నెలో కడుక్కుని

నిదానంగా లేచింది. లాంతరు తీసుకుని గదిలోకి వెళ్ళింది. వంటసామాను గది లోంచి తాళాల గుత్తి తీసింది.

తార వుంటోన్న గదివైపు తలుపు సంవత్సరాల తర్వాత తెరవడానికి పెద్దమ్మ వెళ్ళింది.

——

నొప్పులు ఎక్కువయ్యాయి. వర్మ భార్య ప్రసవించడానికి కావలసిన ఏర్పాట్లు చెయ్యలేకపోయాడు. తన అసమర్థత తనకే చిరాకు కలిగిస్తోంది. తార తల్లి తండ్రులూ తన తల్లి తండ్రులూ ఈ పట్నంలోనే వున్నారు. అయినా వాళ్ళను కాదని బయటికి వచ్చేయడంవల్ల వాళ్ళ సహాయం తీసుకోలేదు. వాళ్ల ప్రేమదాంపత్యం గురించి వీధిలో వాళ్ళకు అంతమంచి అభిప్రాయంలేదు. తమ ప్రేమాయణం గురించి వాళ్ళకున్న దురభిప్రాయం అతనిలో రోషం కలిగిస్తోంది. తమ ప్రేమ పండి బిడ్డగా ఫలించే తార నొప్పులు చూస్తోంటే అతనికి రోషం మరింత ఎక్కువైంది. తారను ఎలాగైనా రక్షించాలని అతను గంగవెర్రులెత్తిపోయాడు. తన్ను విడిచి ఎక్కడికి వెళ్ళవద్దని తార ఎంత మొర పెట్టుకుంటున్నా వినక ఎవరినైనా మంత్రసానిని తెద్దామన్న ఉద్దేశ్యంతో బట్టలు మార్చుకొని బయల్దేరాడు వర్మ. అతను నడవాలోకి రాగానే వంటింటికి పక్కనే వున్న సందులో ఏదో వెలుతురు చూసి ఆగిపోయాడు. ఏదో ఆకారం వంటింటి నడవాదాటుకుంటూ వస్తోన్నట్లు కనపడింది. అర్థంకాక పరీక్షగా చూడసాగాడు వర్మ. ఎవరిదో స్త్రీ ఆకారం. లాంతరు మసక వెలుతుర్లో తెల్లగుడ్డలు వేసుకుని ఏదో దెయ్యంలా వుంది అతని కళ్ళకు. ఆ ఇంట్లో దెయ్యాలుంటాయని అందరూ అంటారు. పగటిపూట కూడా భయమే. రాత్రికి అసలే భయం. దీనికి తోడు అర్థరాత్రి అనుకోకుండా పెద్దమ్మ అటు వచ్చేప్పటికి ఆమెను పోల్చుకోలేకపోయాడు. అతనికి కాళ్ళూ చేతులూ వణికాయి. అతని కంఠం నుంచి మాట పెకలడంలేదు. కంఠం బొంగురుపోయి ఎంతో కష్టంమీద ఒక్కకేకవేసాడు. విరిగిన చెట్టులా అక్కడే మూర్ఛపోయాడు వర్మ.

అసలే నొప్పులతో బాధపడుతున్న తారకు భర్త అరుపు వినగానే గోరు మీద రోకటిపోటులా అయింది. నూతిలో ఆమెను బలవంతాన తోసినట్లయింది. పక్కమీంచి లేవలేని స్థితిలో భర్త అరవడానికి కారణం ఏమైవుంటుందా అని తెలుసుకోలేకపోయింది. భర్త అరవగానే ఆమెలో భయం మరింత హెచ్చింది. ఆమె గుండె దడదడమని కొట్టుకుంది. కడుపులో పిండం కదిలినట్లయింది. ఆమె హృదయం కొట్టుకోవడం తగ్గిపోసాగింది. నోటిమాటలేక, నిస్సహాయంగా తనకు తాను యమరాజు చేతుల్లోకి పోతున్నట్టుగా అనిపించింది. ఆమెకు గుండె ఆగినట్లయింది. తెలివి తప్పింది.

ముంగిలిదాటుకుంటూ త్వరత్వరగా పెద్దమ్మ నడవాలోకి వచ్చింది. సోఫా దగ్గర వర్మ తెలివి తప్పపడివున్నాడు. ఓ క్షణం అతన్ని చూసి మళ్ళీగదిలోకి వెళ్ళింది. తార పరిస్థితి చూడగానే ఆమెలో విద్యుత్ ప్రవహించింది. పరిస్థితిని ఒక్క క్షణంలో సాకల్యంగా అర్థంచేసుకుని కార్యరంగంలోకి దూకింది. ఒంటరిప్రాణి, అందులో ఉడిగిన వయస్సు-అయినా లెఖ్ఖచేయక పెద్దమ్మ సాహసించి ప్రపంచాన్నే జయించింది.

వర్మకు కాస్సేపటి తర్వాత తెలివివచ్చింది. గదిలోకి వెళ్ళి తారను చూసాడు. తార పక్కనే పెద్దమ్మ నిలబడి మంత్రసాని పని చేస్తోంది. పెద్దమ్మ కేకలు వేసి అతడ్ని బయటికి పంపివేసింది. తారను రక్షించడానికి దేవత సమానంగా పెద్దమ్మ ఇక్కడికి రావడాన్ని అతను నమ్మలేకున్నాడు. అతనికిప్పుడు ధైర్యంవచ్చింది. లోపలినుంచే వేడినీళ్ళు పెట్టమనీ, కత్తితెచ్చి ఇమ్మనమని పెద్దమ్మ ఆజ్ఞాపించింది. కిమ్మనకుండా ఆమె చెప్పిన ప్రకారం చేస్తున్నాడువర్మ వంటింట్లోని స్టౌవ్ వెలిగిస్తోంటే తన ఇంట్లోకి ఓ కొత్త ప్రాణి ప్రవేశిస్తున్నట్టుగా "కువ్వాఁ...కువ్వాఁ" అంటూ ఓ పసిబిడ్డ కంఠం వినిపించింది. అతని మనస్సు పులకరించింది. తార ఎలావుందోనన్న భయం కూడా వర్మను ఆవరించింది. స్టౌవ్ వెలిగిస్తున్న వాడల్లా మానేసి గదిదాక వచ్చాడు. కాని లోపల అడుగు పెడితే పెద్దమ్మ తిడుతుందన్న భయంతో ఆగిపోయాడు. ఎలాగో ధైర్యంచేసి నిలబడే అడిగాడు "పెద్దమ్మా. ఏం బిడ్డ!" అంటూ.

పెద్దగా చిరాకు పడింది పెద్దమ్మ-"ముందు వేన్నీళ్లు పెట్టావా లేదా? తం|్రి అయ్యాడు సన్యాసి!".

వర్మకు మరేమీ అడగడానికి ధైర్యం చాలలేదు. గొణుక్కుంటూ వంటింటివైపు వెళ్ళాడు.

ఇవ్వాళ తాను ఎన్నడూ వూహించలేని రూపాన్ని దర్శించాడు పెద్దమ్మలో. రకరకాలుగా చిల్లంగిలు పెట్టే పెద్దమ్మ, ఎందరెందరి మీదనో యంత్రాలు వేసి వేధించుకు తిన్న పెద్దమ్మ. అసహ్యానికే అపరరూపం అయిన పెద్దమ్మ తాను ఏ దిక్కూ తోచని ఆపదలో వుంటే అడగకుండానే తనంతట తానే వచ్చి అతన్ని కష్టాల్నుంచి గట్టెక్కించిందా అని నమ్మలేక పోతున్నాడు వర్మ. ఇతరులంటే ఈ ప్రేమ, ఈ ఆదరణ, ఈ సేవా శుశ్రూషలు ఆమెలో ఎక్కణ్ణుంచి వచ్చాయి. అతనికి అర్థంకాకుండావుంది. అసహ్యించుకునే పెద్దమ్మ ఇప్పుడు సాక్షాత్తు కరుణించిన దేవతలా తోచింది వర్మకు.

# 29

కన్య, సజ్జన్ మధుర నుంచి ఇవ్వాళే తిరిగి వచ్చారు. తనతో ఇంటికి వచ్చెయ్యమని సజ్జన్ కన్యతో ఎంతోసేపు స్టేషన్లో బలవంతం చేశాడు. కాని కర్నల్‌గారు ఏమైనా అనుకోగలరని వంక చెప్పి అతనితో వెళ్లడానికి ఒప్పుకోలేదు కన్య. కన్యను మరింత బలవంతం పెట్టడం న్యాయం కాదని భావించాడు సజ్జన్. నాలుగు రోజులు కన్య వెంట నీడగా వుంటోన్న సజ్జన్ ఆమె ఇష్టం లేనిది ఏ విషయంలోనూ కన్యను ఒప్పించడం కష్టమన్న సత్యాన్ని తెలుసుకోగలిగాడు. ఇతర ఆధునికస్త్రీల కన్న కన్యలో ప్రత్యేకత వుంది. సర్గిగా అతని తల్లి మాదిరిగానే కన్య కూడా మంచి పట్టుదల గలది. ఆమెతో వున్న ఈ నాలుగు రోజుల్లో ఆమెను పొందాలని ఎంతో తపించాడు. కాని రెండువైపులా కన్య పట్టుదల ముందు అతను ఓడిపోయాడు. బహుశా తన ఈ ఓటమిని గెలుపు కింద మార్చడానికి కాబోలు మనసులోని ఆవేశాన్ని

చంపుకుని ఆమె ముందు ఎంతో సభ్యతతోనూ, సంస్కృతీ సంపన్నతతోనూ ప్రవర్తించడానికి తెగ తాపత్రయపడ్డాడు. కన్య తనలో పనిగట్టిన దుర్బలత్వాన్ని శాశ్వతంగా రూపుమాపాలనుకున్నాడు. అతను ఆమె హృదయంపై రాజ్యం చెయ్యాలి. ఆమె శరీరంపై రాజ్యం చేయాడానికి గాను ఆమె హృదయయాన్ని ముందు జయించాలి. సౌందర్యాన్ని నష్టపరిచే దుర్బుద్ధిల్ని అతను నిన్న నిందించగానే కన్య అతనివైపు అర్థపూరితమైన చూపుతో చూస్తూ అంది – "మీ ఈ మాటల్ని ఎప్పుడూ మరిచిపోకండి." అని తనలో తాను ఓడిపోయిన సజ్జన్ కన్యవిసిరిన వ్యంగంలో అంతరార్థాన్ని మరిచి పోకుండా వుండాలని ప్రయత్నిస్తున్నాడు. ఆ సంఘటన తర్వాత ఆమెను ఏడ్పించలేదు సరికదా మామూలుగా వినిరే ఛలోక్తులు కూడా విసరలేదు. రైలు ప్రయాణంలో కూడ అజంతా, ఎల్లోరా, ఖజురాహో, చిదంబరం, మధురై మొదలైన దేవాలయాల, గుహాలయాల శిల్పకళాసౌందర్యం గురించే ఉపన్యాసం ఇచ్చాడు. అదృష్టవశాత్తు రెండేబెర్తులు గల ఓ చిన్న కంపార్ట్‌మెంటు దొరికినా అతను ఆమె వ్యవహారంలో చాలా నిగ్రహంగా ప్రవర్తించాడు. ఎంతో మర్యాదతో సౌందర్యం గురించి చర్చించాడు. అతను కన్య పట్ల ఎంత హుందాగా ప్రవర్తించాడంటే నిద్రపోవడానికి పైబెర్తుమీదికి వెళ్ళేటప్పటికి పూర్తిగా అలసిపోయి పండుకోగానే నిద్రపోయాడు.

ఆవాళ ఉదయం స్టేషన్లో తనతోపాటు ఇంటికి రమ్మనమని బలవంతం చెయ్యగా ఆమె ఒప్పుకోనప్పుడు మనస్సులో ఎంతక్షోభించినా బయటికి మాత్రం "నీ యిష్టం" అని కళాకారుని మర్యాద నిలబెట్టుకోవడానికి నటించాడు.

మధుర నుంచి అతను టెలిగ్రాం ఇచ్చాడు ఫలానా ట్రెయినుకు వస్తున్నామని, వాళ్ళు స్టేషనులో దిగేటప్పటికి కారు తీసుకుని సిద్ధంగా వున్నాడు డ్రైవరు. కన్యను దిగబెట్టడానికి సజ్జన్ కర్నల్ మందులషాపుకు వెళ్ళాడు. అతను కన్యతో అక్కడికి వెళ్ళేసరికి మందులషాపుకు వెనుక వున్న గదిలో లాలాజానకి శరణ్‌తో కర్నల్ సాహెబ్ మాట్లాడుతూ కూర్చున్నాడు. సజ్జన్ గదిపైన క్రితం రాత్రి దాడిచేసిన విషయం విని అతను చాలా బాధపడ్డాడు. ఆ

విషయంతోపాటు అదే బజారులో ఏర్పాటు చెయ్యబోయే చిత్రకళా ప్రదర్శనం గురించి మాట్లాడుదామని లాలా జానకీశరణ్ అక్కడికి వచ్చివున్నారు. కర్నల్ మంచి చాకచక్యంగా అతనికి ఇవ్వాల్సిన రీతిలో సమాధానం ఇచ్చాడు. లాలా జానకీశరణ్ వెళుతుండగా సజ్జన్ కన్యను వెంట పెట్టుకుని కర్నల్ మందులషాపు వెనకభాగంలో వున్న గదికి ఊడిపడ్డాడు.

ఇద్దరిని చూడగానే కర్నల్ ముఖం వికసించింది. కాని వాళ్ల జోడీని చూడగానే లాలా జానకీశరణ్ కళ్లల్లో మాత్రం ఏదో అర్థవంతమైన మెరుపు మెరిసింది.

కర్నల్ తన నౌకరుని పిలిచి కార్లోంచి టిన్నో సామాను దించి మేడకి చేరవేయమని ఆజ్ఞాపించాడు. లాలా జానకీశరణ్ వెంటనే అందుకని సజ్జన్‌తో "ఎక్కడికి మాయమయ్యావు గోపాలయ్యా? మీ ప్రదర్శనకు ఇంక రెండు రోజులు మాత్రమే వ్యవధి వుందని గుర్తుందా? ఈ ఎగ్జిబిషన్ గురించి మేము ఎంత ప్రచారం చేస్తామంటే వాడవాడా నీపేరే మోగుతోంది" అన్నారు.

జానకీశరణ్ మాటల తీరు సజ్జన్‌కు నచ్చలేదు. మనస్సులోని భావాన్ని ఆపుకోవాలని ఎంత ప్రయత్నించినా ఆగలేదు, వెంటనే వెళ్లగక్కేసాడు - "ఆపునండి. మీ ప్రచారం మధుర వరకు పాకిపోయిందనుకోండి. మధుర అంతటా, అక్కణ్ణుంచి వస్తోంటే దారి పొడవునా లాలాజీగారు మీ పేరు బాగా మోగించారంటూ ప్రతి నోటా మీగురించి ఒకటే పొగడ్తలంటే నమ్మండి".

లాలా జానకీశరణ్ చిన్న బుచ్చుకున్నాడు. ముభావం ప్రకటిస్తూ "సరే నయ్యా, ఏమో నీ ఇష్టం. మాకు చేతనైనంత వరకు - ప్రచారం చేశాం, నిన్న రాత్రి సాలిగ్రాంగారు సందులో జారిపడ్డాడు. కాలి ఎముక విరిగింది?

"చ...చ్.... అంటూ సానుభూతి కనపరుస్తూ సజ్జన్ "అయ్యో పాపం ఎలాపడ్డారండీ?" అని అడిగాడు "ఏమో నాయనా, మీ ఇంటి యజమానురాలు ఏదో మంత్రమో తంత్రమో చేసిందంటున్నారు" అంటూ చిరునవ్వు నవ్వుతూ సమాధానం చెప్పాడు జానకీశరణ్.

ఆమాటకు నవ్వుతూ సజ్జన్-"ఎందుకో. సాలిగ్రాం గారేమైనా ఆమెతో" అంటూ అర్థోక్తిగా ఓ చిరునవ్వునవ్వాడు.

"ఇప్పుడే వచ్చావు. కాసేపు ప్రయాణం బడలిక తీర్చుకో. నెమ్మదిగా కర్నల్‌గారే అన్నీ సవిస్తారంగా చెబుతారు. సరేనయ్యా, నేను వెడతాను. రాజా సాహేబ్ గారింటికూడా వెళ్ళాలి" అంటూ ఆయన లేచారు లేచుకున్నారు.

"ఏం! అందరూ క్షేమమే కదా!"

"అదేమిటయ్యా, ఇవ్వాళ వాళ్ళ మనుమణ్ణి పెళ్ళికొడుకును చేస్తున్నారుగా ఎందుకు వెళ్ళొద్దూ!"

"ఆఁఆఁ. అవును. నేను మరచిపోయాను" అంటూ సజ్జన్ అన్నాడు.

"ఏమోనయ్యా ఈమధ్య ఆలోచనల్లోపడి నిన్ను నువ్వే మరిచిపోతున్నావు. సరే కర్నల్...నేను వెళ్తాను. జైరామ్‌జీకి" అంటూ బయటికి వెళ్ళుతూండే సజ్జన్ జానకీశరణ్‌తో "నేను ఇప్పుడే వస్తున్నానని రాజావారికి చెప్పండి'' అని అన్నాడు.

లాలా జానకీశరణ్ వెళ్ళగానే లోకాభిరామాయణం మాట్లాడుకున్నారు వాళ్ళు ముగ్గురూ. మాటల సందర్భంలో కర్నల్ కన్యకు చెప్పారు- "నువ్వు వెళ్ళిన తర్వాత ఒక ముఖ్యమైన పని చేసాను. ఇవ్వాళే మీ నాన్నగారిని అరెస్టు చేయిస్తాను. ఒరేయ్! సాలిగ్రాం! కర్నల్‌తో పోటీపడితే నీదప్పు మోయించి మోయించి పగులగొడతా అని నిరూపిస్తాను" అని.

సాలిగ్రాం ప్రసక్తి రాగానే అతని కాలు ఎలా విరిగింది, పెద్దమ్మ ఎలా ఎలా ప్రయోగాలు చేసింది చర్చకు వచ్చాయి, క్రితం రాత్రి సజ్జన్ గది పీద వీధిలో అల్లరి మూకలు ఎలా దాడిచేసి అన్నీ ధ్వంసం చేసింది అంకెలతో సహా కర్నల్‌కు వివరాలు ఇవ్వక తప్పలేదు. ఆ కాండ విని సజ్జన్, కన్య ఇద్దరి ముఖాలు ఎర్రబారాయి. ఇంటికి వెళ్ళే ముందు గదికి ఓసారి వెళ్ళి తన కళ్ళతో చూడడానికి నిశ్చయించుకున్నాడు సజ్జన్.

చిత్రకళా రంగంలో తను ప్రయోగాలు చేద్దామని ఎంతో ఉత్సాహంతో తాను నిర్మించుకున్న చిత్రశాల ఈవిధంగా నామరూపాలు లేకుండా పోవడం చూసి సజ్జన్ కోపోద్రిక్తుడయ్యాడు. అతని గది అంతా ఎవరో ఓ వ్యక్తిని ఖూనీ చేసి శవాన్ని పడేసినట్లుగా వుంది. తాను గీసిన చిత్రాలు వాట్ని చించి ముక్కలు ముక్కలుగా అక్కడే పడేశారు. ఒకచోట సగం కాలిపోయిన చిన్న బిల్ల తన వెనుకకాళ్ళ బలంతో నిలబడ్డ జంతువులా కనిపిస్తోంది. పెద్దమ్మపోగుచేసి ఓమూల పెట్టిన కూజా, గాజుముక్కలు అతని శరీరాన్ని సూదులతో గుచ్చుతున్నట్లుగా వున్నాయి. పరుపులో దూది పేగుల్లా బయటికివచ్చి చిందర వందరగా పడివుంది. గదిలో ప్రతిఒక్క దృశ్యాన్ని సజ్జన్, కర్నల్, కన్య ముగ్గురూ కొంచెం సేపు చూస్తూ నిలబడ్డారు. సజ్జన్ రెండు కళ్ళు రెండు నిప్పుకళ్ళుగా వున్నాయ్. వాటిల్లోంచి నిప్పురవ్వలు బయటికి వస్తున్నట్లు భయంకరంగా వున్నాయి.

సజ్జన్ మౌనం చూసి కన్య భయపడింది. సజ్జన్‌ని శాంతింపచెయ్యడానికి ఆమె ఏమైనా మాటలు దొరుకుతాయేమోనని వెతుకుతోంది. కాని ఆమెకు మాటలే కరువయ్యాయి. నిజానికి ఈ చిన్నగదే ఆమె నూతన ప్రపంచంలో ప్రవేశించడానికి మొదటి మెట్టు. ఇక్కడే ఆమె సజ్జన్ హృదయానికి చాలా దగ్గరగా వచ్చింది. ఆమెకు ఆరోజు జ్ఞాపకం వచ్చింది. 'నవజీవన్' పత్రికలో ఆమెకు వుద్యోగం దొరకగానే హనుమాన్ గుడికివెళ్ళి ఆమె ప్రసాదం తెచ్చింది. సజ్జన్ నుదుటిపై బొట్టు దిద్ది అతనికి ప్రసాదం ఇచ్చింది. 'నువ్వు' అని మొదటి సారిగా అతణ్ణి సంబోధించింది. సంకోచంగా చూడ్డం మానేసి మనసు ద్వారాల్ని స్వేచ్ఛగా తెరచి ఆమె సజ్జన్‌కి సన్నిహితురాలైంది. ఆమెకు బాగా జ్ఞాపకం. ఇక్కడే స్టాండ్‌మీద సత్యనారాయణ వ్రతానికి సంబంధించిన చిత్రం వుంది. బయట టోర్ మహాకవి దాబా మీద కూర్చున్నాడు. డాక్టర్ షీలాసింగ్ అనాడే గదికి వచ్చింది. అంతా కలిసి టీ తాగారు. ఆరోజు తన జీవితంలో ఎంత సుదినం? అప్పుడు గది ఎంత అందంగా ఎంత నిండుగా వుంది. అటు వంటి సౌందర్యం అంతా ధ్వంసం కావడం చూసి ఆమెకు చాలా బాధ కలిగింది.

క్రితం రోజు అతను అన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి. కన్య సజ్జన్‌తో అంది-
"నువ్వన్నది ముమ్మాటికీ నిజం"

మెల్లిగా ఆమెవైపు మెడ తిప్పాడు సజ్జన్. కర్నల్ కూడా ఆమె వైపు చూడసాగాడు. వాళ్ళిద్దరినీ చూస్తూ "ప్రపంచంలో ఎప్పుడూ సౌందర్యం అంటే నిజంగా ప్రభావితులయ్యేవాళ్ళకు కరువులేదు. కాని వాళ్ళు దానిపట్ల శ్రద్ధాసక్తులు కనపరచకుండా దాన్ని నష్టం చెయ్యడంలోనే పరమానందభరితులౌతారు. ఇంత అందమైన ఈ చిత్రాలు ధ్వంసం చేసారంటే వాళ్ళు మధురను నాశనం చేసి చరిత్రలో బందిపోట్లగా శాశ్వతంగా నిలిచిపోయిన విదేశీయులకంటే ఏవి ధంగానూ తక్కువ కిరాతకులు కారు" అని అంది కన్య.

కర్నల్ అందుకున్నాడు- "నేను మొదటే మొత్తుకున్నాను. ఈయన గారితో. వీధులూ వాడలూ ఇప్పుడు ఏమాత్రం పెద్దమనుషులు ఉండదానికి వీలుగా లేవని. అక్కడంతా నిరక్షరాస్యులూ, మూఢులూ నివాసం వుండేచోటు. వీళ్ళలో నిద్రిస్తోన్న మానసిక సౌందర్యాన్ని తట్టి లేపుతానని ఈ పెద్దమనిషి ఎంత చెప్పినా వినకుండా వచ్చాడు. మరిప్పుడు చూశావుగా వాళ్ళ సౌందర్యా రాధనను"

మాటల్లో వేడి నింపుతూ సజ్జన్ అన్నాడు- ''నేను వీళ్ళకు జడిసి ఈ గది వదిలివెళ్ళతానని ఇక్కడివాళ్ళు అనుకుంటే అదంతా ఒట్టి భ్రమ. నేనిక్కడే వుండి వాళ్ళ కిరాతకత్వాన్ని సవాలు చేస్తాను. వీళ్ళా అజంతా ఎల్లోరా గుహలు చెక్కిన దేశవాసులు. నాగరికత గంధం పూసుకున్న ఈ వెధవ ముఖాలమీద ఆసిడ్ చల్లి వికృతం చెయ్యాలనిపిస్తోంది"

"కుర్రాడిలా మాట్లాడుతున్నావు? నిజంగా అలా చెయ్యగలవా? అంత సంకుచితమైన హృదయం వుందా నీకు?" అంది కన్య. కన్య అన్న మాటవిని ఏం చేసేది లేక ఓ సుదీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు సజ్జన్.

ఇంతలో కర్నల్ సజ్జన్ వైపు చూస్తూ అన్నాడు- "నా వుద్దేశంలో, ఇట్టి పరిస్థితుల్లో చిత్రప్రదర్శన నువ్వు రద్దుచేసుకుంటే మంచిది. ఈ వాడలో

వాళ్ళంతా నీమీద కారాలు మిరియాలు నూరుతున్నారు. ఊరుకోకుండా ఏదైనా ప్రమాదం జరిగిందంటే అది బాగుండదు. హర్ ఎక్సిలెన్సీ వస్తున్నారు. ఆమె గారిముందు నీకేదైనా అవమానం జరిగిందంటే-''

"లేదన్నగారూ, ఎగ్జిబిషన్ తప్పక జరగాలి. దీనికంతా కారణం మనిషి లోని దోషంకాదు అతని సాధారణ మానసిక స్థాయిని మాత్రమే తెల్పుతోంది. ఎగ్జిబిషన్ ఇక్కడవాళ్ళకు శిక్షణ గరిపే సాధనం అవ్వాలి. అప్పుడే సజ్జన్ ఈ వాడలో కాలుపెట్టిన వుద్దేశం నెరవేరుతుంది'' అంది కన్య.

సజ్జన్ కూడా పట్టుదల చూపిస్తూ-"నేనిక్కడ స్థిరపడితీరాను. వాళ్ళమధ్యనే వుండి వాళ్ల గుండెలమీద కుంపటి పెడతాను. ఈ ప్రతిఘటనా శక్తుల్ని చూసి పారిపోవడం సజ్జన్ ఇంతవరకు ఎరుగడు" అన్నాడు దృఢంగా.

ఇంతలో డాబామీద నుంచి చేతిలో పొట్లం తీసుకుని వస్తోన్న పెద్దమ్మ కనిపించింది. వనకన్య ఆమెకు చేతులు జోడించి నమస్కారం చేసింది. పెద్దమ్మ మారుమాట్లాడకుండా ఆమెవైపు పరకాయిస్తూ చూసింది. సజ్జన్ చేతికి పొట్లాన్ని అందిస్తూ "కన్నోమల్ మనవడా, ఇవన్నీ నీ బొమ్మలనుకుంటాను. ఇవ్వాళ మైదా ఉడకబెడతాను. అప్పుడన్నీ అతికించుకుందువుగాని'' అని అంది.

ఆ మాటలు వినగానే అతనిలోని కోపమంతా మనస్సనే సముద్రపు ఒడ్డుకు కొట్టుకొని వెనక్కు తగ్గిన కెరటంలా చప్పబడిపోయింది. పెద్దమ్మ అన్న మాటలు వినగానే అతనిలో హాస్యతంత్రులు స్పందించాయి. మహా ప్రళయం నుంచి మనువును రక్షించిన నావలా అజ్ఞానంతో నిండిన పెద్దమ్మ మాటలు అతని క్రోధాగ్నిని చల్లార్చాయి. సజ్జన్ పొట్లాం అందుకున్నాడు. అతని రూమ్‌లోకి జొరపడి సామానంతా పాడుచేసిన వాళ్లను తిట్టిపోస్తూ పెద్దమ్మ - "నిన్ను నష్టపరిచినోళ్లంతా ఎనిమిదిరోజుల్లో పురుగులు పడి ఛస్తారు ఇక నుంచి నీ సామాను ఈ గదిలో వుంచకు నా ఇంట్లో పెట్టుకో" అని కర్నల్, వన కన్యలవైపు గుడ్లప్పగించి చూస్తూ "మీరు వెళ్లండి" అని కొంచెం కసిరింది.

కన్య వెంటనే బయటికి వెళ్ళిపోయింది. కర్నల్‌కు కొంచెం బాధకలిగింది. అతను పెద్దమ్మకు ఎదురు చెప్పబోయాడు. కాని సజ్జన్ అతని చెయ్యినొక్కే సరికి మెదలకుండా గది బయటికి వెళ్లాడు. సజ్జన్‌కు చాలా దగ్గిరగా వచ్చి "నువ్వు వెంటనే పెళ్ళి చేసుకో. నీ పెళ్లానికి వంద తులాల బంగారం తొడుగు తాను. ఇప్పుడు నీతోవున్న ఆముండ ఎవరేమిటి? లొత్తిగా సిగ్గూ ఎగ్గూలేదు. తలమీద పవిట కప్పుకోకుండా మగాళ్లతో తిరుగుతోంది" అంది పెద్దమ్మ.

ఇంతకుముందు కన్య గురించి సజ్జన్ అబద్ధం చెప్పేసాడు. కాని ఈ సారి మళ్లీ బొంకడానికి అతని మనస్సు అంగీకరించలేదు. ఈ వేళాకోళం ఇంతటితో ఆగిపోవాలన్న వుద్దేశంతో "పెద్దమ్మ, ఈమె చాల మంచిది, నేను మీ యింట్లో వుండాలనుకుంటే ఈమె నా దగ్గరకు రాక తప్పదు" అని సజ్జన్ అన్నాడు. దానికి సూటిగా పెద్దమ్మ సమాధానం చెప్పకుండా "అంతా కలియుగ మహత్యం. ఈమె కూడా వస్తుందట. రానీయ్ ముండను. దాని మొగుడితో అది వస్తే మధ్య నా కేమి? నా గది తలుపులు నేను వేసేసుకుంటాను" అంటూ అక్కడ ఏ మాత్రం ఆగకుండా వచ్చినదారినే వెళ్ళిపోయింది.

# 30

రాజాసాహెబ్ గారి మనుమడ్ని పెళ్ళికొడుకుగా చేసిన సందర్భాన్ని పురస్కరించుకుని చాలా ఘనంగా విందు ఏర్పాటు చేసారు. రెండు రాష్ట్రాల గవర్నర్లు, ముగ్గురు కేంద్రమంత్రులూ, రాష్ట్ర మంత్రివర్గం యావత్తూ మాజీ తాలూకాదార్లూ, కాన్పూర్, కలకత్తాల నుంచి నలుగురైదుగురు కోటీశ్వరులూ చాలామంది విందుకు వచ్చారు. అంతా రాజుల సమావేశంలా వుంది. విందులో మధ్య మధ్య మహీపాల్ వ్యంగ్యోక్తులు విసిరి కొంత రసభంగం చేస్తాడు. భోజ నాలు అయిన తర్వాత తోటలోకి రాగానే మహీపాల్‌ని ఉద్దేశిస్తూ "మహీపాల్" నువ్వు మానసికంగా చాలా అలసిపోయావు. కొద్దిరోజులపాటు ఎక్కడికైనా వెళ్లి విశ్రాంతి తీసుకోరాదూ!" అన్నాడు సజ్జన్. మహీపాల్‌కు కూడా కొన్ని రోజు

ట్నుంచి అలాగే అనిపిస్తోంది. మిత్రుడు మనసులోని మాట బయటపెట్టగానే తనూ అతనితో ఏకీభవిస్తూ— "అవును సజ్జన్. నిజంగా అలిసిపోయ్యాను. ఆ చిరాకులో ఏదేదో మాట్లాడేస్తాను. నామాటలకు నామీద చిరాకు కలుగుతుంటుంది నువ్వు చెప్పింది బాగుంది. దీనికితోడు మా చిన్నమ్మ కొడుక్కూడా వుత్తరం రాసాడు. ఈసారికి బంధాల్ని మరిచి కొన్నాళ్ళు వూరికెళ్ళి విశ్రాంతి తీసుకో వాలనుకుంటున్నాను. ఎలాగైనా వెళ్ళాలి" అన్నాడు మహీపాల్.

తన నిశ్చయాన్ని తెలియచేసి మహీపాల్ అతని దగ్గర శలవు తీసుకున్నాడు. ఒంటరితనంతో ఈ రోజు ఎలాగ గడపడమా అనుకుంటూ ఇంటికి బయల్దేరే వేళకు అతని జీవితంలో ఇంతకుముందు ప్రవేశించి మరుగుపడి పోయిన పాత ప్రియురాలు అక్కడ కనిపించింది. ఆ పాత ప్రేయసి చిత్రారాజ దన్ కార్లో తనకు లిఫ్టు ఇచ్చేవారు ఎవరు దొరుకుతారా అని వెతుకుతూ నిలబడి వుంది. చిత్ర అవివాహిత. అయినా చాలామందికి వుంపుడుకత్తెగా వుంది. ఆమె అంగసౌష్టవం వయసుకన్నా తొందరగా కరిగిపోతున్నా చాలా ఆకర్షణీయంగా వుంటుంది. ఇటు నాల్గు రోజులు కన్య అతనితో వుండి కూడా లేనట్టుగానే వుండడంతో సజ్జన్‌లోని అభిజాత్యం, కళాకారులకుండే చంచలత్వం అతనిలో అణిగివున్న కామవాంఛను రేపింది. అంతే ఇద్దరూ కలిసిపోయారు.

తన నుంచి దూరదూరంగా జరిగి మత్తులోకి తోస్తోన్న అభిమానవతి కన్యకు శాస్తి చేయాలన్న దృఢ సంకల్పంతో సజ్జన్ ఇక తాను చిత్రానే వివాహం ఆడి పతితోద్ధరణకు కంకణం కట్టుకొంటానని సారామైకంలో ఆరోజు ప్రతిజ్ఞ చేసాడు

మరుసటి రోజు రాజాసాహెబ్ గారి పెద్దబ్బాయి స్వయంగా వచ్చి అతణ్ణి తీసుకుని వెళ్లాడు. వాళ్ల బంగళాకు వెళ్ళేసరికి అక్కడ రాజాసాహెబ్, లాలా జానకీశరణ్, సాలిగ్రాం ముగ్గురూ కాళ్ళమీద దెబ్బలకు పలాస్త్రీ కట్టుకుని కూర్చుని వున్నారు. రాజాసాహెబు తన పలుకుబడినంతా ఉపయోగించి సజ్జన్‌ని తనవైపు తిప్పుకున్నాడు. సాలిగ్రాం, జానకీశరణ్‌లు అతన్ని చుట్టేసినంత పని చేసారు. వాళ్ల ముగ్గురి మాటల్ని మొహమాటం వల్ల కాదనలేక

పోయ్యారు. కన్య కేసు వ్యవహారంలో తను ఏరంగా వాళ్లకు సహాయం యివ్వనని మాట ఇచ్చివేసారు. ఆ కారణంగా రెండు రోజుల్నుంచి కన్య, కర్నల్ ఇద్దరిని తప్పించుకుని తిరిగారు. చిత్రారాజదన్ తన ఇంట్లోనే వుంది. కర్నల్, కన్యా ఇద్దరూ కలసి కేస్ని చాలావరకు నడిపిస్తోందరం గురించి పేపర్లో చదివి సజ్జన్ మరింత ఉడికిపోయ్యారు. మూడు పగళ్ళు మూడు రాత్రిళ్ల వాళ్ళను తప్పించుకు తిరిగిన తర్వాత నాలుగవరోజు దీవాన్ని పిలిచి తన ఇంట్లోని కొంత ఫర్నిచరు, అలంకరణ వస్తువులు, పనికివచ్చే మరికొన్ని సామాన్లూ తీసుకెళ్ళి పెద్దమ్మ ఇంటికి చేర్చమని ఆజ్ఞాపించారు సజ్జన్. ఆరోజు మధ్యాహ్నం రానే స్వయంగా వెళ్లారు పెద్దమ్మ ఇంటికి. లలితా, విశాఖా, కిషన్నా ఈ మూడు కూనల్నీ పట్టుకుని స్తంభానికి కట్టలేక సతమతమౌతోంది పెద్దమ్మ. సజ్జనని చూడగానే ఆ మూటినీ పట్టుకొని తెమ్మనమంది. సజన్ మూడు కూనల్ని పట్టి తెచ్చి స్తంభానికి కట్టివేసారు.

''పెద్దమ్మా, నా సామానంతా వచ్చేసింది''

''అవునురా, నేను సామానంతా సర్దిందాను. నువ్వు కూర్చొని పని చేసుకోవడానికి మామగారి గదిలో ఏర్పాటు చేసాను. అన్నట్టు కన్నోమల్ మనవడా, నిన్న విందుకు వెళ్లావంట్రా''

''వెళ్లాను పెద్దమ్మా''

''ఎలా జరిగిందిరా. చాలామంది వచ్చారేమిటి''

''ఎక్కువమంది లేరు. మహా అయితే ఐదారు వందలమంది వుండొచ్చు'' కావాలని అబద్ధం ఆడేసారు సజ్జన్.

''ఎన్నిరకాల మిఠాయీలు చేసారు?''

ఎన్నిరకాలు చేసారో సజ్జన్కు గుర్తులేదు. అదీగాక ఈ అనవసర ప్రశ్నలకు ఎవరు జవాబులిస్తూ కూర్చుంటారని అతని వుద్దేశం. అయినా పెద్దమ్మను సంతోషపెట్టాలనే వుద్దేశంతో ''చూడ్డానికి చాలా రకాలు వున్నట్టు కనిపించాయి. కాని నిజంగా అంత ఎక్కువేం లేవు'' అని సరిపుచ్చారు.

కొంచెసేపు ఆగి పెద్దమ్మ మళ్లీ అంది – "కన్నోమల్ మనవడా, నువ్వు వెంటనే పెళ్లిచేసుకో. నేను నీకోసం చేసే విందు చూసి వాళ్లందరూ మండిమండి చావాలి. ఊఁ అను. రేపే నిశ్చయం చేస్తాను. పిల్లను నీకు చూపిస్తా. చాలా మంచి అమ్మాయి".

ఈ ప్రసంగం నుంచి తన్ను ఎలా తప్పించుకోవాలని చూస్తోన్న సజ్జన్ ఓ చిన్న అబద్ధం అడేసాడు. "రెండు సంవత్సరాల వరకు పెళ్లిచేసుకన్నానంటే నేను చచ్చిపోతానని నా జాతకంలో రాసివుంది పెద్దమ్మా ఎలా ఒప్పుకోను?".

ఆ మాట విని పెద్దమ్మ నోటమాటరాలేదు. అయినా ఓర్మితో మళ్లీ అంది – "నీ జాతకం ఎవరితో కలిస్తే వాళ్లనే చేసుకుందువుగాని" అంటూ గొంతు తగ్గించిఅతనికి ఏదో రహస్యం చెబుతున్నట్లుగా "కన్నోమల్ మనవడా. ఎవరిదైనా శుభకార్యం నా చేతుల్తో చెయ్యాలని మా చెద్దకోరిగ్గావుంది నా సవతి మహా మిడిసిపడుతోందనుకో. దానికే కొడుకులూ, మనమళ్ళు వున్నారని పొగరు. దానికేనా ముద్దూ మురిపెం, అచ్చటా ముచ్చటా దాని బాబుసొత్తేనేంటి? నేను కూడా ఈ చంటోడికి ఇప్పుడే పురిటి స్నానం కారసాల చేయిస్తాను. తర్వాత నీకు–"

ఇంతలో తన ఇంటి తలుపును ఎవరో కొడ్తూంటే అటు లేచివెళ్లిపోయింది పెద్దమ్మ. సజ్జన్ గుమ్మంలోంచి బయట సందులోకి వచ్చాడు. వరండాలో కూర్చుని లాలా జానకీశరణ్ పళ్లు బేరం ఆడుతున్నాడు. సజ్జన్‌ని చూడగానే పెద్దమ్మ ఒళ్లో కూర్చున్నట్టుందే" అంటూ పరామర్శించాడు.

జానకీశరణ్‌తో పరిహాసం చేసే మూడ్‌లో లేడు సజ్జన్. అతణ్ణి చూసి కొంచెం వెనక్కి తగ్గాడు. "రావయ్యా, రెండు నిమిషాలు ఇలారా. కూర్చో" అంటూ లాలా జానకీసరణ్ ఆహ్వానించాడు.

విధిలేక అరుగుమీద కూర్చోవలసివచ్చింది సజ్జన్‌కు. అతణ్ణి వుద్దేశిస్తూ లాలా "కుర్రాళ్ళు పెద్దాళ్లని ఇట్టే మరచిపోతారు. కాని ఎంతచెడినా పెద్దవాళ్ల

పెద్దవాళ్లేకదా. అన్నట్లు ఇవ్వాళ పేపరు చూసిన తర్వాత రాజాసాహెబు చాల నొచ్చుకున్నారు పొద్దున ఆయన టెలిఫోను కూడా చేసారు" అన్నారు.

జానకీశరణ్ మళ్ళీ మాట్లాడకముందే సజ్జన్ కల్పించుకుంటూ "దీనిలో నా ప్రమేయం ఏమీలేదండి. ఈ వ్యవహారంతో నేనెప్పుడో చేతులు కడిగేసుకున్నాను" అని చెప్పాడు.

"అయితే మరి కర్నల్-'

"ఈ వ్యవహారంలో కర్నల్ నా సలహా ఏమీ తీసుకోలేదు"

"అహ్హాహ్హా! అదా సంగతి!"

లాలా జానకీశరణ్ పగలబడి నవ్వేసరికి సజ్జన్‌కు చిరాకెత్తింది. కాని తానే నేరం చేసినట్టుగా అనుకుంటోన్న సజ్జన్ నోరెత్తలేదు. జానకీశరణ్ మళ్లీ ప్రసక్తి తెస్తూ అన్నాడు - "బాబూ, ఇప్పుడు నా వయస్సు అరవై అయిదేళ్లు. నంబై నాలుగులో పుట్టాను. నీ తండ్రి వయసులో నాకంటె చిన్న. మా గురించి నీతో ఏమని చెప్పను? భగవంతుని దయవల్ల ఏదో ఇంతపేరూ ప్రతిష్ఠలు సంపాదిచినావు. అన్నీ తెలిసినవాడవు. సూచన ప్రాయంగా నీకు చెప్పడం నావిధి. నువ్వెంతగానైనా మజాచేసుకో. కాని నిన్ను నిన్ను నువ్వు స్వాధీనంలో మాత్రం వుంచుకో. నగీన్‌చంద్‌కి కూడా నా తరపున ఇదే సలహా ఇవ్వు. కన్న తండ్రికే కాని కూతురు మరెవ్వరికి కూతురౌతుంది?"

సజ్జన్ మాట్లాడలేదు. కన్య విషయంలో లాలాగారు వెళ్లగక్కిన అభిప్రాయాలు నిజంకావని తనికి తెలిసినా అతనికి వ్యతిరేకంగా తిరుగుబాటు చెయ్యాలనే ధోరణిలో తానిప్పుడులేడు అ తర్వాత ఎగ్జిబిషన్ గురించి మాట్లాడుకున్నారు లాలా జానకీశరణ్ తన రెండు గదులూ చూపించాడు. చిత్రప్రదర్శనానికి అనువుగా లేవు అవి గదుల్లో వెలుతురు లేదు ఎలక్ట్రిసిటీ మనిషిని పిలిపించమని జానకీశరణ్‌కు చెప్పాడు సజ్జన్. మర్నాడు వుదయం ఎనిమిది గంటలకల్లా అక్కడికి వస్తానని చెప్పి సజ్జన్ పెద్దమ్మ ఇంటికి వెళ్లాడు. గదిలో అడుగు పెట్టగానే కూర్చునివున్న వనకన్య కనిపించింది. ఆమెను చూడ

గానే అతను బిగుసుకుపోయ్యాడు. ఆమెను ఏమీ పలకరించకుండా ఈజీచేరులో కూలబడి వేరేవైపుగా ముఖం తిప్పుకున్నాడు.

"కోపంగా వున్నావా?" అంటూ కన్య అడిగింది.

"................"

"కోపగించుకోవడానికి ఏం కారణంలెదే?"

"కోపగించుకునేంత తాహతు నాకు ఎక్కడుంది?"

"నువ్వు అన్యాయాన్ని సమర్థిస్తావని నేను కలలో కూడా వూహించలేదు"

సజ్జన్ చిరాకుతో అన్నాడు-"న్యాయాన్ని సమర్థిస్తున్నందుకే నన్ను ఆడి పోసుకుంటున్నారు".

"అందే!"

"ఈ విషయంలో నువ్వే అన్యాయం చేస్తున్నావని నా అభిప్రాయం"

''ఏమిటా అన్యాయం?"

దానికి ఎంత వెతికినా సజ్జన్‌కు సమాధానం దొరకలేదు. కన్యే అంది- "నేను నా తండ్రిగారికి అన్యాయం చేస్తున్నానా? అంటే ఆడది ఎప్పుడు అణిగి పీడింపబడుతూండడం నీకు న్యాయంగా కనిపిస్తోందా?"

సజ్జన్ నిగ్రహం తప్పాడు. ఆగ్రహంతో-'అబ్బే లేదండి. ఆడదాన్ని ఎవరు పీడించగలిగేది. నలిగిపోయ్యేది పురుషులేగా-" అన్నాడు,

"సజ్జన్, యుక్తియుక్తంగా మాట్లాడాలి. నీకు ఎందుకు కోపం రావాలి? నిన్నేమైనా మోసగించానా? నేను నీ దగ్గరకి వచ్చిన మొదటిరోజునే అంతా స్పష్టంగా చెప్పానుగా".

"దాన్ని గురించి నాకేం లేదు. నేను నిన్ను అంతగా బలవంతం చేశాను. నాలుగురోజులు వుండలేవా?"

"సజ్జన్ పెద్ద పెద్దవాళ్ళు నీకు సిఫారసు చేసారు. మా తండ్రిని బ్రతికించ మని కాదు. ఈ సాలిగ్రాం పరువుకాపాడమంటూ. నేనెందుకు ఒప్పుకోవాలి ?

దీనిలో సాలిగ్రాం పరువు పోనీయ్ కాంగ్రెసు పార్టీవాళ్ళు అప్రతిష్టపాలు కానీయ్ దానికి నేను ఎలా బాధ్యుణ్ణవాల్ని?"

"మిస్ వనకన్యా, నీ రాజకీయ ఎత్తుగడ నేను బాగా గ్రహించాను. ఇప్పటి వరకు"

"జరిగిన యధార్థం నీకు తెలుసు నేనింక వాదించతలచుకోలేదు"

"నేను కూడా వాదించతలచుకోలేదు" అంటూ సజ్జన్ ముఖం తిప్పేసుకున్నాడు. బల్లమీద కూర్చున్న కన్య లేచి సజ్జన్ దగ్గిరకు వచ్చింది. అతని తలపై చెయ్యి వుంచి "ఇక మాట్లాడవూ?" అని అడిగింది.

"ఊహూఁ"

"ఎప్పటి వరకు?"

"సరే మాటాడొద్దు. నేనే మాట్లాడుతాను".

తన తలపై వనకన్య చల్లని చెయ్యి వుంచగానే అతనిలో వేడి పుట్టుకొచ్చింది. ఒడి అతను ఇంకా విసుక్కోవడానికి కారణభూతం అయింది. వనకన్య చేతి స్పర్శ ఎంతో హాయిగానూ చల్లగానూ వుంది. తన అంతర్యంలోని పవిత్రతనంతా అతనికే అర్పిస్తున్నట్లుంది ఆ స్పర్శ. ఆ అర్పణకు సజ్జన్‌లోని "అపవిత్రత" సిగ్గుపడ్డట్లయ్యింది. తన ఆలోచనల్లో జరుగుతోన్న ఈ రెంటి మధ్య ఘర్షణ అతనికి బాగా కనబడుతోంది. తన అపవిత్రతను పవిత్రతగా, వనకన్యలోని పవిత్రతను అపవిత్రతగా ప్రకటించాలని అతను మహా మొండిగా పట్టు పడుతున్నాడు. అకస్మాత్తుగా సజ్జన్ లేస్తూ ఆమెతో-"ఈ మాట నువ్వు నాతో కాదు, నా డబ్బుతో, నా గౌరవంతో, నా ప్రజాభిమానంతో మాట్లాడుతున్నావు" అన్నాడు.

"ఈ మాట రెండో పర్యాయం వింటున్నాను"

"ఇలాగే ఎన్నో పర్యాయాలు వింటావు సిగ్గులేకుండా"

వనకన్య ముఖం ఎర్రబారింది. ఎందుకో మళ్ళీ తమాయించుకుని అంది ''నువ్వు ఇదేనని నమ్ముతున్నావని నాకు నమ్మకం కలిగిన రోజు నీకు నా ముఖాన్ని చూపించను" అని అంటూ తప్పించుకుంది కన్య.

"కన్నమ్మల్ మనమడా?"

"ఆఁ, ఏం పెద్దమ్మా"

"ఇలా చూడు. ఈమె వుందే...నీకేదో అవుతుందనుకుంటా. తార కొడుక్కి మేనత్తగా ఛటీదేవిని వూహించాలని ఆమెకు చెప్పు. అటు తారకూ కులం గోత్రం లేదు. ఇటు యీమెకూ సరిపోతుంది. వాడికి ఎక్కణ్ణుంచి తేను మేనత్తను"

"తప్పకుండా అవుతానండి. కాని పెద్దమ్మగారూ, నేను ధర్మ భ్రష్టు రాలిని మాత్రం కాను" అంది కన్య అక్షరాల్ని పట్టిపట్టి ఉచ్చరిస్తూ.

వాళ్ళు మాట్లాడుతోన్న సమయంలో వీధిలోంచి ఓ కుక్క ఇంటిలోకి వచ్చింది. తలుపు దగ్గర నిలబడి వున్న పెద్దమ్మ కళ్ళు దానిమీద పడ్డాయి ''పో...పో ..." అంటూ ఆమె కసిరింది. ఆమె చేస్తోన్న హడావుడికి అది కంగారుగా బయటికి పోయే బదులు నడవా వైపు పరుగెత్తింది. "ఓసి ముండా అటు ఎక్కడికి పోతున్నావే? అరే పట్టుకోండి...కొంపతీసి నా ఇంట్లో దూరిం దంటే....నా లలితా...విసాఖా....'' అంటూ పెద్దమ్మ పెద్దగా అరుస్తోంది.

సజ్జన్ నడవాలోకి పరుగెత్తి దాన్ని తరిమేసాడు. ముంగిలిని దాటుకుంటూ అది గేటువైపుకు పరుగెత్తింది. దాని వెనకనే వెళ్ళి గేటు మూసి వచ్చాడు సజ్జన్. పాతకాలంనాటి బాగా నగిషీ చేయబడిన గేటు తలుపులు మూస్తోంటే సందులోంచి వెళుతోన్న బాబా రామ్‌జీ కనిపించాడు.

"ఏమండీ ఎలా వున్నారు" అంటూ ఆ ముసలాయన బోసినోరు విప్పి నవ్వాడు. ఆయన నవ్వుతోంటే కళ్ళు స్నేహంతో మెరిసాయి. దొంగతనం చేస్తోంటే పట్టుబడ్డవాడిలా సజ్జన్ గాభరాపడ్డాడు బాబా గేటు వైపుగావచ్చాడు. అతని వెనకనే అతని శిష్యుడు ఒక చేత్తో దుడ్డుకర్ర, రెండోచేత్తో భిక్షాపాత్ర

తీసుకుని వచ్చాడు. శిష్యుడికి కూడా గుండువుంది. లంగోటీ కట్టుకున్నాడు. వాళ్ళిద్దరు లోనికి రాగానే గేటువేసి సజ్జన్ వాళ్ళ వెనుకనే లోపలికి వచ్చాడు. సాధువేషంలో వున్న ఆ వ్యక్తిని చూడగానే పెద్దమ్మ తలవంచి దణ్ణం పెట్టింది.

"సుఖినోభవంతు. సుమతి ప్రాప్తిరస్తు. శాంతిప్రాప్తిరస్తు!"

"మహాత్ములు ఎక్కణ్ణుంచి విచ్చేసారో!"

"రాముని ఇంటి నుంచి వస్తున్నాను. భక్తురాలా, నువ్వు కూడా అక్కడ నుండే కదా వచ్చింది?"

"అది అందరికి తెలుసు మహాత్మా, నేను అడిగేది-"

బాబా ఆమె ముఖంలోకి చూశాడు. "తమరు పిచ్చివాళ్ళకు చికిత్స చేస్తారనుకుంటాను".

'అవును తల్లీ, నేను పిచ్చివాళ్ళకు వైద్యం చేస్తాను. పిచ్చివాళ్ళు వున్న చోటికి చేరి నేను వాళ్ళకు సేవచేస్తుంటాను. అంతేకదూ రామ్‌జీ?"

ఈ మాట తనని ఉద్దేశించి అన్నట్టుగా తోచింది సజ్జన్‌కు ఎంచుకుని ఏమీ మాట్లాడలేదు.

"ఓహో! తమరన్నమాట. తమ గురించి హాస్యోక్తుల ద్వారా ముందే విన్నాను. కన్నోమల్ మనమడికి ముందే మీతో పరిచయం వున్నదన్నమాట"

"అరే. వీరు రామ్‌జీ వీరిని ఎవరు ఎరుగరూ! వీరికి తెలియదంటూ ఏమీలేదు నిత్యసత్య సందర్శకులు"

సజ్జన్ అలాగే తలవంచుకుని వున్నాడు. ఓ సారి కన్యవైపు చూసాడు బాబా మళ్ళీ పెద్దమ్మవైపు చూస్తూ "ఓ భక్తురాలా ఈమె నీకేమౌతుంది?" అని అడిగాడు.

"ఎత్తి కుదేస్తే రెండౌతుంది. దానికీ నాకూ ఏమి సంబంధం?" అంది పెద్దమ్మ.

"నీ కూతురేగా భక్తురాలా" అంటూ సజ్జన్ వైపు తిరిగి అందుకే వంద తులాల బంగారం పెట్టుకు కూర్చున్నావు. అందుకే నువ్వు తిట్లు తిట్టడం?'

''నేను ఎవరిదీ ఎర్రని ఏగాణీ అయినా ముట్టను. ఆ(. వందతులాల బంగారం ఇస్తానంది నిజమే" అంటూ సజ్జన్ వైపు తిరిగి "నేను చూపించిన పిల్లను పెళ్ళిచేసుకుంటే అప్పుడు అతని పెళ్ళానికి ఇస్తాను."

"భక్తురాలా, పెళ్ళి చెయ్యకుండానే ఇచ్చేయి"

"లేదు బాబాగారు"

"పరోపకారం అవుతుంది భక్తురాలా, దొంగలు ఎత్తుకపోయారనుకో, అప్పుడేం చేసేదానివి ?"

"నా ఇంట్లో దొంగలు పడ్డారని మీకెలా తెలిసింది మహాత్మా ?"

''అయితే భక్తురాలా, నీ ఇంట్లో నిజంగానే దొంగలు పడ్డారన్నమాట. నేనేదో మాట వరుసకు అంటున్నాను. అంతే. ఉదాహరణగా చెప్తున్నాను" అంటూ బాబా నవ్వాడు. మళ్ళీ" సరే. దొంగతనం అయినప్పటి నుంచి ఎవరికైనా బంగారం ఇచ్చివేద్దామన్న తలంపు నీకు కలిగింది కదూ ?" అని అడిగాడు బాబా.

"అవును బాబాజీ. అంతే" అని అంటోంటే తనికి ఆటపట్టైన పెద్దమ్మ ముఖం, మెరుస్తోన్న కళ్ళు, నల్లటి దుంపల్లా వున్న ఆమె పళ్ళు వికసించాయి. పెద్దమ్మ మళ్ళీ అందుకుంది-''నాకు ఎవరైనా కొడుకున్నాడా ? చచ్చేటప్పుడు ఏమి కట్టుకుపోతాను. చచ్చిన తర్వాతనైనా పోసి నాగు క్రింద బతకడానికి తోడు ఎవరున్నారు గనక" అంది. అంతలోనే మళ్ళీ ''నేను చచ్చిపోతే తిన్నగా వైకుంఠం నుంచి విమానం వస్తుంది మహాత్మా, నన్ను తీసుకెళ్ళడానికి. చూస్తూవుండండి" అంటూ సగర్వంగా పలికింది పెద్దమ్మ.

"తప్పకుండా వస్తుంది. కృష్ణభగవానుడు నీకోసం ప్రత్యేకం విమానాన్ని పంపిస్తారు. భక్తురాలా నువ్వంటే ఆయన కెంతో ప్రీతి. పెద్దమ్మ వైకుంఠానికి

ఎప్పుడొస్తుంది. ఆమె దుడ్డుకర్ర తీసుకుని ఎప్పుడు పారిపోదాం అంటూ ఎదురు చూస్తున్నారనుకో''' అంటూ బాబా పకపక నవ్వాడు. పెద్దమ్మ వైకుంఠానికి వెళ్లడం గురించి బాబా మాట్లాడిన చమత్కారానికి అందరు పొట్టచెక్కలయ్యే టట్టు నవ్వారు. పెద్దమ్మ కూడా తప్పుగా భావించలేదు. ఆమె మెదలకుండ వింటోంది.

మాట్లాడుతోన్న బాబా తలతిప్పి సజ్జన్ వైపు చూశాడు. దిగులుగా కూర్చున్నాడు సజ్జన్. బాబాను అతను సూటిగా చూడలేకపోతున్నాడు. "మీకు విజయం సిద్ధించిన రోజు కూడా ఎందుకయ్యా మౌనవ్రతం చేస్తున్నావు" అని అడిగాడు బాబా.

''బాబాగారూ, ఇలారండి, అంటూ పెద్దమ్మ అయన్ని కొంచెం దూరంగా తీసుకవెళ్ళింది. ''మంత్రతంత్రాలూ, సిద్ధులూ కూడావచ్చా" అని అడిగింది పెద్దమ్మ.

"భక్తురాలా. అన్నీ వచ్చు, శంఖినీ, ఢాకినీ ఎవరిని కావాలో చెప్పు".

"బాబాగారూ, నా సవతి మనవడికి లగ్నం పెట్టుకున్నారు. సరిగ్గా ముహూర్తం సమయానికి వాణ్ణి చంపగలవా ?''

"దాని వల్ల నీకేమి ఫలం భక్తురాలా ?''

"సవతి ముంద వంశవృక్షం పెరిగిపోతుందని నా గుండెల్లో మంట. నా కూతురేగనక బ్రతికివుంటే దాని వంశం కూడా అడవిమల్లెతీగెలా పాకిపోయేది. భగవంతుడు నాకుయేదీ కొరతెయ్యలేదు. మీరు గనుక నేను చెప్పిన ప్రకారం చేసారంటే, స్వామివారి పాదాలమీద ఒట్టు, నా దగ్గరవున్న దబ్బూదస్కం అంతా మీకు దానం చేస్తాన. ఒక్క వందతులాలు బంగారం మాత్రం కన్నోమల్ మనవడికోసం-"

"నేను ఒక మాట చెప్పనా భక్తురాలా ! నువ్వేదైనా పెద్ద ఉత్సవం జరిపించు. ఇదుగో రాముడున్నాడు. అదగో సీతమ్మనారు-''.

"కడుపులో కుళ్ళు పెట్టుకుని బయటికి మంచిగా మాట్లాడే స్వభావం కాదు నాది. నిజం చెప్పాలంటే వీళ్ళిద్దరి సాహసం నాకు గిట్టడంలేదు. ఒకజాతి కాదు, ఒక కులం కాదు. ఈ మధ్యే ఇలాంటిదే ఓ ముండనా కొంపలో కాపురం పెట్టింది. వేరేకులంలో వాడిని తెల్లోళ్ళలో మాదిరి పెళ్ళిచేసుకుని నా కొంపలో ప్రసవించడానికి వచ్చింది. ఇంగిలిపీసు చదువుకుందంట. ఓ మర్యాదతేదూ. ఓ మన్ననా లేదు. నేను చస్తున్నాను. నేనే గనుక వేళకు దాని దగ్గరకు వెళ్ళకపోయివుంటే పురిటిస్నానం కూడా జరిగేదికాదు".

జోరుగా మాట్లాడుతోంది పెద్దమ్మ. గదిలో సజ్జన్, కన్యవున్నారు. బాబాగారి శిష్యుడు సొరకాయ బుర్ర, కర్ర చేతిలో పట్టుకుని గొంతుకూర్చుని చొంగకారుస్తూ వున్నాడు. పెద్దమ్మ ఆవేశంలో ఏమేమో చెప్పుకపోతోంది - "నాకు ఎవరన్నా భయంలేదు. ఈ కన్నోమురీ మనుమడు కూడా నాకో ఉపకారం చేసాడు అందుకే వాడంటే నాకు ఆప్యాయత. వీడితాత, నాయనమ్మ వీడి అమ్మా అందరినీ ఎరుగుదును మామగారి కాలం నుంచి వాళ్ళకూ మాకూ రాకపోకలున్నాయి. అందుకనే వాడితో నువ్వీ గొడవలన్నీ మాని నేను చూపించిన పిల్లను లక్షణంగా పెళ్ళిచేసుకో, పెళ్ళి ఖర్చంతా నేనే భరిస్తాను అని కూడా అన్నాను. నాకు కూడా మనుమలు వుంటే ఒకడికి వెంట్రుకలు తీయించేదాన్ని, ఇంకొకడికి జందెం వేసేదాన్ని. నా ఇంట్లో కూడా పెళ్ళికొడుకుని చేసేదాన్ని, నా కోరిక అలాగే వుండిపోతోంది...."

ఏన్నో సంవత్సరాల తర్వాత పెద్దమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి. బాబాగారు శరీరాన్ని నిటారుగా చేసి నిలబడ్డారు. అతని ముఖం క్షణంలో గంభీరమైంది. తన చిన్న చిన్న కళ్ళలో ఆమెను చూస్తూ ఏదో నిశ్చయానికి వచ్చిన వాని మాదిరిగా "భక్తురాలా, నువ్వు సీతారాముల పెళ్ళి చేసెయ్. నా రాముడికి నీ సీతకూ బ్యాండు వాయిద్యాలూ, మేళతాళాలతో పెద్ద ఊరేగింపు తీద్దాం. నీ మనసులోని కోరిక ఈ విధంగా తీర్చుకో. సీతకన్న మించిన సుశీలవతి అయిన కన్య నీకు ఎక్కడా దొరకదు'' అన్నారు బాబాగారు.

పెద్దమ్మ గంభీరంగా వింటోంది ఆమె ముఖం చూస్తే బాబాగారి మాటలు ఆమెకు నచ్చినట్టుగానే కనిపించింది. కాని అంతలోనే ఆమె తెల్లపోతూ మీరు ఈ పిల్లను సీత అంటూ నాకూతుర్ని చేస్తున్నారా !" అని అడిగింది.

"లేదు, భక్తురాలా. మంచి విగ్రహాలు తెచ్చి ప్రతిష్ఠచేద్దాం. తర్వాత మేము మీ అబ్బాయిని తీసుకుపోతాం. తర్వాత నువ్వు మాతో వియ్యం అందుకోవడానికి నా దగ్గరకురా !

"నేను సీతారాముల కళ్యాణం చెయ్యను"

"ఎందుకని భక్తురాలా ?"

"ఇది యిష్టాయిష్టాలతో కూడుకున్న పని. నేను రాధాకృష్ణుల పెళ్ళి చేస్తాను"

"మరి రాధ చిరంజీవి కుమారి కదా !"

"ఏమో, ఈ పెళ్ళిచేస్తాను. మీరు సరిగ్గా సమయానికి వచ్చారు. మంచిదైంది"

"మేమేం పూరికనే మా అబ్బాయి వివాహానికి ఒప్పుకుంటాం అను కున్నావా భక్తురాలా ! మా రాముడికి కట్నం కానుకలూ కావాలి ముందు నువ్వు కన్యా పాతళాల స్థాపించాలి. మళ్ళీ మా పిచ్చి ఆశ్రమానికి గాను ఓ గది కట్టించి వుచితంగా ఇవ్వాలి".

"సరే మహాత్మా, నాకు మీ షరతులు సమ్మతమే." అంటూ పెద్దమ్మ బాబాగారి పాదాలు తాకి "నేను వెళతాను. గోకులద్వారాకు వెళ్ళేవేళ అయింది" అని అంటూ కన్యవైపు చూసి "నువ్వు శ్రద్ధగా విను. పిల్లాడికి ఆరోరోజు వచ్చి పూజ చెయ్యాలి. మేనత్తగా నీకు యివ్వాల్సిన కట్నం ఇస్తాము" అని అంది. మళ్ళీ బాబాగారివైపు తిరిగి "మీరుకూడా తప్పక దయచెయ్యాలి, మహాత్మా. ఆ రోజు భోజనాలు కూడా పెడతాను. నా మామగారి మేడలో ఎన్నేళ్ళ తర్వాత చంటాడికి బొద్దుకోసారు !" అంది పెద్దమ్మ.

త్వరగా అడుగులు వేసుకుంటూ నడవాలోంచి తన ఇంటివైపు వెళ్ళిపోయింది అక్కడే వున్న బాబా సజ్జన్, కన్య, శిష్యుడూ ముగ్గురివైపు ఓసారి చూసాడు. ఆయన మందబుద్ధి శిష్యుడు ఓ చేతిలో సొరకాయ బుర్రా మరో చేతిలో పెద్దలావుపాటి కర్ర పట్టుకుని చొల్లుకారుస్తున్నాడు. శిష్యునివైపు తిరిగి ''ఏరా రామభక్తు" అంటూ పలకరించాడు. ఆ మాటకు భక్తుడు పిచ్చినవ్వు నవ్వి చొంగ కారుస్తూ "అవును బాబాజీ" అంటూ సమాధానం ఇచ్చాడు.

"అమ్మా, కొంచెం దాహం తీసుకరా" అన్నారు బాబాగారు కన్యవైపు చూస్తూ. గది అంతా పరకాయించి చూడసాగింది కన్య. సజ్జన్ లేచినట్లే లేచి మళ్ళీ అలాగే కూర్చుండిపోయ్యాడు. గదికి రెండోచివర కుడుదు మీద వున్న ఓ కుండ కనపడింది. ఆమె నీళ్ళు తేవడానికి వెళ్ళింది. సజ్జన్ వైపు చూస్తూ బాబా "మీరేదో రాముడు అనుకున్నాను. కాని మీరు నిజంగా సజ్జనే'' అంటూ వెటకారంగా నవ్వాడు.

ఆ మాటతో దిమ్మతిరిగింది సజ్జన్‌కు. ఎవరో కడవలతో అతని నెత్తిమీద నీళ్ళు కుమ్మరించినట్లయింది.

# 31

రాత్రి ఎనిమిదిన్నర గంటలకు దుకాణం కట్టేసి ఇంటికి వెళ్ళేముందు కన్యను ఓసారి చూసిపోదామని ఆమె గదికి వచ్చాడు కర్నల్. తలుపులు వేసి వున్నాయి. గదిలోంచి వెలుతురు గడియ సందులోంచి బయటికి వస్తోంది. తలుపు తట్టాడు.

''ఎవరూ?" అంటూ జీరపోయిన కంఠంతో కన్య పలికింది. కర్నల్ ఆమె గొంతులోని జీరను పసిగట్టి పరిస్థితి అంతా గ్రహించాడు. 'బిన్నో! తలుపు తియ్'' అంటూ పిలిచాడు.

లోపల కుర్చీ కదిలినట్లు శబ్దం అయింది. ఓ క్షణం మౌనం. మళ్ళీ కాళ్ళ అలికిడి. కన్య తలుపు తీసింది. వెలుతురు ఆమె వెనుక భాగంలో వుందేమో ఆమె ముఖం సరిగా కనబడడం లేదు. మసగ్గావున్నా ఆమె అంతర్యాన్ని ముఖం పైనే చదివాడు కర్నల్. గడియతీసి మళ్ళీ తన కుర్చీ దగ్గరకెళ్ళింది కన్య. ఎదురుగా వున్న కుర్చీమీద కర్నల్ కూర్చున్నాడు. అతని కళ్ళు నేలను చూస్తు న్నాయి. మనస్సంతా ఆలోచనతో నిండివుంది. ఎదురుగా వున్న కుర్చీ దగ్గర మెదలకుండా నిలబడి వుంది కన్య.

"కూర్చో బిన్నో" అన్నాడు కర్నల్.

కన్య కుర్చీలో కూర్చుంది.

"సజ్జన్ కలిశాడా" అని అడిగాడు కర్నల్.

"కలిశాడు"

"పెద్దమ్మ ఇంట్లోకి అతని సామానంతా చేరినట్టేనా?"

"ఆ. చేరినట్టే"

మళ్లీ ఇద్దరూ మౌనం అయ్యారు.

భూమిక అయిపోయిన తర్వాత అసలు ప్రసంగాన్ని ఎత్తుతూ "చాలా కోపంగా వున్నాడా?" అని కన్యను కదిలించాడు కర్నల్.

కన్య ఏమీ మాట్లాడలేదు. లోపల నుంచి వెక్కిళ్లు వస్తున్నా ఆమె నిగ్ర హించుకొని అలాగే కూర్చుంది.

తన మిత్రుని తరపున వాదిస్తున్నట్టుగా కర్నల్ మొదలెట్టాడు "అసలు రాజా సాహెబు అతనికి చెప్పాడు. అందుకని అతనికి చెడ్డగా తోచింది...కాని మొహమాటం అన్ని వేళల్లోనూ అన్నిచోట్లా చెల్లదుగా. మనిషి అన్న తరువాత అతని మాటకు విలువవుండాలి....సరేకాని, బిన్నో, నువ్వేమీ కలవరం పెట్టు కోకు. రెండురోజుల తర్వాత అతని బుర్రలోని వేడి దిగిపోయిందంటే అతనే వస్తాడు. కర్నల్, నువ్వు మంచి పనిచేసావు అని అతనే స్వయంగా అంటాడు.

నాకు వాడి స్వభావం బాగా తెలుసు." అంటూ ఓ నవ్వు నవ్వి అక్కడి గంభీరత్వాన్ని కొంచెం తేలిక చేయడానికి ప్రయత్నించాడు. కాని వాతావరణం ఇంకా తేలికపడలేదు.

ఈ సంభాషణ జరిగిన తర్వాత మళ్లీగదిలో నిశ్శబ్దం ఆవరించింది. ఈసారి ఎక్కువసేపే నిశ్శబ్దం రాజ్యంచేసింది. ఆ నిశ్శబ్దాన్ని చివరకు చెదర గొడుతూ "నువ్వు భోజనం చేసినట్టులేదే బిన్నో" అని అడిగారు కర్నల్.

కన్య మాట్లాడలేదు.

"నీ ఆరోగ్యం సరిగాలేకపోతే వండించి పంపిస్తాను"

"ఒద్దులే అన్నయ్యగారూ."

"నువ్వేమీ దిగులుపడి ప్రయోజనంలేదు బిన్నో. అంతా అదే కుదుట పడుతుంది. నామాటనమ్ము చెల్లీ. జీవితంలో ఇటువంటి చేదు అనుభవాలు అప్పు డప్పుడు వస్తూనేవుంటాయి." అంటూ ఆగి "ఓ మాట అడగమంటావా?" అని అన్నాడు.

"అడగండి"

"మీరిద్దరూ పరస్పరం ఏమైనా అనుకున్నారా?"

"........."

"చూడు బిన్నో. ప్రపంచం చాలా పెద్దది. నేనూ మొహం మీదే మాట్లాడు తున్నాను. అడదాని వ్యవహారం ఆరిటాకులాంటిది. నువ్వెంత స్వతంత్రురాలి వైనా...సజ్జన్‌తో వివాహం చేసుకోవాలని అనుకుంటున్నావా ! ఎలాంటి దాపరికం లేకుండా నాకు చెప్పు"

తలవంచుకుని కుడిపాదం బొటనవ్రేలితో నేల రాస్తూ వుంది కన్య. కర్నల్ మళ్ళీ అదే ప్రశ్న వేస్తూ— "మీ ఇద్దరూ ఈ విషయం గురించి ఏమైనా మాట్లాడుకున్నారా? చెప్పు, అని అన్నాడు"

"అవును"

"పెళ్ళి విషయమేనా?"

"అవును"

"ఎప్పుడు ? ఈ మధ్యేనా ?"

అవునంటూ తల వూపింది కన్య.

"నీతో ఏమన్నారు ? నా దగ్గర సంకోచించకు. పెళ్లి ఎప్పుడు చేసుకునేది ఏమైనా చెప్పారా ?"

"ఇక్కడికి రాగానే త్వరలో చేసుకుందాం అని మధురలో నిశ్చయించు కున్నాం"

"అయితే మరి పెళ్లి యేర్పాట్లు చెయ్యమంటావా ? అసలు విషయం ఏమిటంటే, నేనీ వ్యవహారాల్ని ఇంకా పొడిగించదలచుకోలేదు. సజ్జన్ ముక్కుకు ఒక్కసారి తాడు వేయగలిగాం అంటే అంతా దానంతట అదే చక్కదిద్దు కుంటుంది".

"నేను ఎవరికీ భారంగా వుండదలచుకోలేదు అన్నగారూ."

"ఇందులో ఇంకొకరికి భారం అయ్యే ప్రసక్తి లేదు. ఇన్నాళ్లు అతనితో సావాసం చేసావు. అతను కడిగిన ముత్యం కాకపోయినా చెడ్డవాడు మాత్రం కాడు. ఇది నువ్వు ఈ పాటికి గ్రహించే వుంటావనుకుంటాను".

కర్నల్ వెళ్లిపోయాడు. అతను వెళ్లగానే తలుపు గడియవేసుకుని మంచం మీద వాలిపోయింది. మానసికంగా ఎంతో అలసట చెందిన వనకన్య తాను ఓడిపోయినట్టుగా అనిపించింది. రెండో రోజు ఉదయం పెందరాళే సజ్జన్ దగ్గిరకు వెళ్లాడు కర్నల్. గదిలో చిత్ర కనిపించింది. అతని మనస్సును ఎవరో సమ్మెటతో కొట్టినట్టయింది. సజ్జన్ కూడా దొంగతనం చేస్తోండగా పట్టబడినట్లయ్యాడు. వాళ్లిద్దరూ డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చారు. కాసేపు ఎవరూ మాట్లాడలేదు. ఇంతలో టీ వచ్చింది. సంభాషణ కర్నలే ప్రారంభించాడు. "చూడు సజ్జన్, మూర్ఖత్వం చెయ్యడానికి కూడా వయసు

అంటూ వుంది. నీ ఈ ఆర్టిస్టు కళలు నేనింక ఎన్నటికీ సహించలేను. తెలిసిందా ?"

సజ్జన్‌కు రోషం వచ్చింది. కర్నల్ తనమీద కేకలు వేయడం అతనికి నచ్చలేదు "నేనిప్పుడు కుర్రాడ్నికాదుగా" అని అన్నాడు.

"నువ్వు కుర్రాడికన్నా హీనంగా ప్రవర్తిస్తున్నావు. నీవు జంతువ్వు! సాక్షాత్తు జంతువ్వు! పైకి ఆర్టిస్టుగా చలామణి అవుతున్నావ్-పెద్దబుద్ధిశాలివిగా కనిపిస్తావు."

"కర్నల్, నేను ఇప్పుడు చాలా గంభీరంగా వున్నాను."

"నేకూడా చాలా గంభీరంగానే వున్నాను. ఒకవైపు పేపర్లలో చాలా గొప్పవాడిగా చలామణి అవుతున్నావ్. మరోవైపు నీకు నీమీదే హద్దులేదు"

సజ్జన్ మాట్లాడలేదు. కోపంలో అతని కనుబొమ్మలు ముడుచుకున్నాయి. ఇంతలో సుక్రూ ఓ ప్లేటులో దూదియా తెచ్చి బల్లమీద పెట్టబోయాడు. "తీసుకపో. ఇప్పుడు నాకేం అక్కర్లేదు" అన్నాడు, కర్నల్ కాస్త గట్టిగానే. వెంటనే పళ్లాన్ని తీసుకుపోయాడు సుక్రూ. "ఒకవైపు మర్యాదస్తురాలైన ఓ పిల్లతో ప్రేమ నాటకం జరుపుతూ ఆమెను పెళ్ళి చేసుంకుటానని మాటఇచ్చి, సమాజంలో స్త్రీకి హక్కు కావాలంటూ గొంతుచించుకుని అరిచి యిలా ఇంకోపక్క ఇంట్లో వేశ్యను పెట్టుకుంటావా ? నీకు సిగ్గులేదూ ?"

సజ్జన్ కళ్ళెర్రి కర్నల్ వైపు చూసాడు. ఇద్దరి కళ్లూ కలిసాయి. సజ్జన్ కళ్ళు అప్రయత్నంగా కిందికి ఒంగుతోంచే వాటిని ప్రయత్నపూర్వకంగా పైకి ఎత్తి మొండిగా కర్నల్‌ని చూస్తున్నాడు. కర్నల్ మళ్ళీ అందుకున్నాడు— "పొరపాటునైనా కన్య కళ్ళపడితే ఏమై వుండేది ఆమెగతి?"

"నేను ఏపని చేసినా దాపరికం లేకుండా చేస్తాను."

"అబ్బ, ఎంత పవిత్రుడివి! పవిత్రత అంటే అర్థం తెలుసా? నీకెలా తెలుస్తుందిలే? ప్రపంచానికి గొప్పతనాన్ని చాటుకుంటూ ఇంట్లోమాత్రం—"

"కర్నల్, నేను చిత్రను వివాహం చేసుకుంటాను" అన్నాడు తొణక్కుండా సజ్జన్.

కొండ శిఖరం మీద నుంచి ఎవరో తోసినట్టయింది కర్నల్‌కు. ఒకక్షణం సజ్జన్‌ని నిదానించి చూసి "నువ్వు బిన్నోకు వాగ్దానం చేసావుకదా'' అని అడిగాడు.

"ఆ ఆలోచనను మార్చుకున్నా."

''ఎందుకని"

"ఎందుకన్న ప్రసక్తిలేదు."

"ప్రసక్తి ఎందుకు లేదయ్యా? ఓ పిల్లకు మాట ఇచ్చి తప్పుతున్నావు. అది ఘోరంకాదూ?"

''మాటైతే ఇచ్చింది నిజం. కాని నేను ఆమె శీలానికి....దూరంగానే వున్నాను."

''దూరంగా వున్నాడట, ఏదో ఈయనగారి వంశంలో వున్నట్టు. ఈ వేశ్యలు వున్నారే ఒళ్ళంతా కంపుకొడుతూన్న ఈ శరీరాలేగా నీజీవితంలో ఇంత వరకు లభించింది. ఓ శీలవతి శీలాన్ని ఆమె ఇష్టం లేకుండా నువ్వెలా చెరచ గలవు? చెవులుపెట్టి సరిగ్గావిను, సజ్జన్! బిన్నోతోనే అనుబంధం తెగిపోయిందంటే ఒక్కటికాదు తెగేది. ఒకేసారి రెండు బంధాల్ని తెంపుకోవాల్సివస్తుంది. ఇచ్చినమాట తప్పే అలవాటు నీకుందేమో! కాని నేను పెద్దమనిషిని. ఒకసారి బాంధవ్యాన్ని కలుపుకున్నానంటే దాన్ని మళ్ళీ ఎప్పటికీ తెంచుకోలేను. మళ్ళీ ఈ జన్మలో నీముఖం చూడను'' అంటూ కర్నల్ లేచి సుక్రూని పిలిచాడు. ''సుక్రూ'' అంటూ సజ్జన్‌వైపు తిరిగి ''ఏంపేరు? సజ్జన్ కాస్త గంటకొట్టు'' అని అన్నాడు.

గంట మోగగానే ఇద్దరు నౌకర్లు చేతులు కట్టుకుని వచ్చి నిలబడ్డారు. ''సుక్రూ, టెలిఫోన్ ఇక్కడికి తీసుకురా. ఆ సోహన్‌హల్వా కూడా తీసుకరా. నాలుగు టోస్టులు కూడా వేయించు" అంటూ పురమాయించాడు కర్నల్.

నౌకర్లు వెళ్ళిపోయ్యారు సజ్జన్‌తో మళ్ళీ తెగిన సంభాషణను కలుపుతూ అన్నాడు కర్నల్— "ఇవ్వాళ దాన్ని ఇంట్లోంచి తరమేసి మరీ వెడతాను"

"కర్నల్! ఇది నా సొంత వ్యవహారం"

"సజ్జన్! ఇదీ నా సొంత వ్యవహారమే"

"నాకు ఆలోచించుకోవడానికి వ్యవధి కావాలి"

"నా దగ్గర అంత వ్యవధిలేదు''

"ఆరోజు రాజసాహేబు దగ్గిర జానకీశరణ్, సాలిగ్రాం ఎదుట——"

"బిన్నోను ఒప్పిస్తానని నేనేమీమాట ఇవ్వలేదే. రాజాసాహెబుగారితో మొహమాటం వల్ల అలా అనాల్సి వచ్చింది. అంతే."

"అయితే రాజాగారి మొహమాటం ఇప్పుడు లేదన్నమాట. రాజాసాహెబ్ నా దృష్టిలో కన్యకంటే ఎక్కువ ప్రాధాన్యం కలవారు. సరే. టీ తాగు. చల్లగా అయినట్లుంది, వుండు. వేరే తెప్పిస్తాను" అంటూ టేబిల్ కింద స్విచ్ నొక్కాడు సజ్జన్.

"అసలు రాజాసాహెబ్‌కి తెలుసా అపిల్ల ఎటువంటిదో? తెలిసే ఆయన అలా అంటే అన్యాయం వైపువున్నారన్నమాట. రాజాసాహెబును ధాలు కింద వుప యోగించుకుని సాలిగ్రాం నామీద దెబ్బతియ్యాలని చూస్తే నేను సహించను. బిన్నోతో నీకు వివాహం అయితీరుతుంది ఇప్పటికైనా తెలుసుకో" అన్నాడు కర్నల్ ఆ చివరి మాటలు అంటోటే అతని కంఠంలో దృఢత్వం తొంగిచూసింది.

నౌకరు వచ్చాడు. టీ తెమ్మనమని సజ్జన్ ఆర్డరు ఇచ్చాడు కెటిల్ తీసుకుని నౌకరు వెళ్ళిపోయాడు. రెండో నౌకరు గూఢియా, సోహన్ హల్వా తీసుకుని వచ్చాడు. ఆ సమయంలో సజ్జన్‌కు ఆలోచించుకోవడానికి వ్యవధి దొరికింది. "వివాహం అంటే జీవితాంతం ముడివేసుకున్న సమస్య'' అన్నాడు సజ్జన్.

''అన్నీ ముందే ఆలోచించి ఈ రంగంలోకి దిగాల్సింది సజ్జన్। ప్రపంచం అంటే ఏమిటో నేను బాగా తరచి చూసాను. మంచిదేదో చెడ్డదేదో గుర్తించగలను. ఈ పదేళ్ళ మన స్నేహంలో ఎంతో మంది సీతాకోక చిలుకలు నీ దగ్గరకు వస్తోండడం చూశాను. కాని ఏ ఒక్కరిని కూడా చెల్లీ అని పిలవడానికి నాకు మనస్కరించలేదు. కాని ఈ అమ్మాయి వేరు. మొదటి చూపులోనే ఆమె ఎలాంటి స్వభావం కలదో పసికట్టాను సుమా। ఇప్పుడంటావా, ఉరవైనాలుగు మడియలూ నా ముందే మసులుతూ వుంటోంది".

టోస్ట్లు వచ్చాయి, టీ కెటిల్ వచ్చింది. సజ్జన్ ఒక టోస్టు తీసుకుని టీ కలపమని చెప్పారు నౌకరుకు. జడివానలా కర్నల్ నోట్లోంచి అతనిమీద కురుస్తోన్న మాటలు తప్పించుకోవడానికి అతనికి వంకదొరికింది. అసలు విషయం సజ్జన్ తన నుంచి తాను తప్పించుకోవడానికే సాకు వెతుకుతున్నాడు. ఆలోచనల నుంచే తప్పించుకోవాలని చూస్తున్నాడు. తన్ను తాను ఇంతవరకు తెలుసుకోలేకపోయ్యాడు. అతనిలా అకారణంగా మొండికెత్తడాన్ని బాబారామ్జీ, కర్నల్, వనకన్య నిరసిస్తున్నారు. చిట్టచివరకు తనను తానే నిరసిస్తున్నాడు రాజాసాహెబుగారింట్లో మేజువాణిలో చిత్ర అనుకోకుండా రావడం, ఆమెను చూడగానే అతనిలో నిద్రపోతోన్న లైంగికవాంఛని రేపింది. మధురలోనూ, బృందావనంలో నాలుగురోజులూ కన్యతో వుంటూ నిగ్రహించుకున్న కోరిక చిత్రను చూడగానే ఒక్కసారిగా లేచింది. కన్యపట్ల అతనికి ఏదైనా ఫిర్యాదు వుంటే అది అతనికోరికముందు కన్య తలవంచలేదనే

రెండు కప్పుల్లో టీ వంచి వాళ్ళముందు సుక్రూ చేతులు కట్టుకుని నిలబడ్డాడు. అతణ్ణి చూస్తూ వెళ్ళిపొమ్మన్నాడు కర్నల్. సుక్రూ వెళ్ళగానే కర్నల్ తిరిగి ప్రారంభించాడు – ''ఆమెలో నీకు ఏ దుర్గుణం కనిపించిందని నీవు మనస్సు మార్చుకున్నావు"

"ఆమె జగమొండి."

"నువ్వూ పూలరంగడివి."

సజ్జన్ బదులు ఇవ్వలేదు. కర్నల్ మళ్ళీ అందుకున్నాడు – "గురివింద గింజ తన ముడ్డి కింద వున్న నలుపు మాట మరిచి ప్రపంచం అంతా నలుపు అని అన్నదట!"

గదిలో నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. ఇద్దరూ టీ తాగుతున్నారు. ఫలహారం అయింది. తేనీరు సేవించడం పూర్తి అయింది. నౌకరు వచ్చి కప్పులూ, ప్లేట్లూ తీసుకపోయాడు. ఏడున్నర గంటలయింది. "లే, వెళ్దాం గుడ్డలు మార్చుకుంటావా ఇలాగే వస్తావా ?"

"ఇలాగే వస్తాను" అంటూ సజ్జన్ లేచాడు.

కూర్చునే కర్నల్ అన్నాడు – "వీళ్ళంతా మనల్ని అప్రతిష్ఠపాలు చెయ్యడానికి ఎదో వల పన్నడం ఖాయం, నువ్వు జారిపోకు సజ్జన్. ఇవ్వాళ దిన్నోను కూడా నేను కట్టుదిట్టంలో వుంచే ఏర్పాటు చేస్తాను. మగసిరివున్న వాడిలా వ్యవహరించు. ఆమెకు ఎలాంటి ఆపదా రాకూడదు".

"కర్నల్, నాకు వ్యవధికావాలి"

"ఎందుక్కావాలయ్యా నీకు వ్యవధి? రోట్లో తల దూర్చి రోకలిపోటుకు భయపడితే ఎలా చెప్పు? నీ ముఖం చూసి చెప్పటం లేదు సజ్జన్, కొన్ని సందర్భాల్లో మహిపాల్ కంటే నీ మీదే నాకు నమ్మకం ఎక్కువ"

తలవంచుకుని మారుమాట్లాడకుండా నిలబడ్డాడు సజ్జన్.

కర్నల్ స్విచ్ నొక్కాడు. సుక్రూ వచ్చాడు – "సుక్రూ, ఆ దొరసాని గారు లేవగానే టీ ఇచ్చి ఇవ్వాళ సాబ్‌గార్కి కలవటం కుదరదని చెప్పేయ్, అయ్యగారు మాయింట్లోనే భోజనం చేస్తారు. చూడు ఆవిడ ఇంట్లో వస్తువుల్ని ఏదైనా తీసుకెళ్తుందో ఏమో! ఓ కంట కనిపెట్టివుండు" అని చెప్పాడు కర్నల్. అతని వైపు మళ్ళీ తిరిగి "సుక్రూ, జోసెఫ్‌ని కారు తీసుకరమ్మన మను" అని అన్నాడు. తర్వాత సజ్జన్ మెల్లిగా అర్థక్షిద్దాడు నౌకర్లకు, అతని మొండి వైఖరి సడలిపోతోంది. సజ్జన్ తన అంతరాత్మతో ఓడిపోయాడు.

కర్నల్ వెనకనే తలవంచుకుని బయటికి వస్తోంటే పోలీసుల చేతికి చిక్కి నిరాయుధుడైన తిరుగుబాటుదారుడు బేడీలు పడ్డ చేతులతో వాళ్ళ వెనుకనే నడుస్తున్నట్లు అవుపిస్తోంది.

# 32

ఆవ్వాళ సజ్జన్ జాతకం బాగాలేదు. సాలిగ్రాం వేసిన ఎత్తుపారి కూర్చుంది. ఎగ్జిబిషన్‌ని వార్డు కమిటీ వారు ఏర్పాటు చేస్తున్నారనీ, 'హర్ ఎక్సెలెన్సీ' ఎగ్జిబిషన్ ప్రారంభోత్సవం చేస్తారనీ, ఈ ప్రదర్శనానికి నగరం లోని కళాకారులంతా సహకారం ఇస్తామని వాగ్దానం చేసారని పేపర్లో ఓవార్త ప్రచురింపచేసాడు సాలిగ్రాం. నగరంలో శ్రీమంతుల్లో ఒకరైన లాలా జానకీ శరణ్ గారింట్లో ఈ ప్రదర్శనం ఏర్పాటు చెయ్యబడుతోందనీ, మధ్యతరగతి ప్రజల జీవితాన్ని సాంస్కృతికంగా మెరుగుపరచాలన్న పవిత్ర ఆశయంతో ఈ కార్యక్రమాన్ని యేర్పాటు చేస్తున్నామనీ ఈ కార్యక్రమం ఏర్పాటు చేస్తున్న ప్రఖ్యాత ప్రజానాయకుడు సాలిగ్రాం జయస్వాల్‌గారు ఎంతైనా అభినందనీయులనీ పెద్దపెద్ద అక్షరాంలో వార్త ప్రకటించాడు జయిస్వాల్ పేపరు చదివి మండిపడుతున్నాడు సజ్జన్. పొద్దున్న కర్నల్ అతణ్ణి అవమానించాడు ఇప్పుడు సాలిగ్రాం ప్రఖ్యాతి అంతా తనదేనని చాటుకున్నాడు.

అందరి కళాకారుల చిత్రాల్ని తీసుకుని మధ్యాహ్నానికి లాలా జానకీ శరణ్ భవనానికి చేరుకున్నాడు సజ్జన్. కర్నల్, కన్యా అక్కడి కనిపించలేదు. సజ్జన్‌ని చూడగానే ఎంతో ఆప్యాయతను కనబరుస్తూ జానకీశరణ్ అతణ్ణి ఆహ్వానించాడు. "చాలా సేపటి నుంచి నీరాకకోసం ఎదురు చూస్తున్నాం" అంటూ తన ఆదుర్దా వెళ్లబోసాడు జానకీశరణ్.

సజ్జన్ ఏమీ మాట్లాడలేదు. కూలీల తలలపై వున్న చిత్రాల్ని దించడానికి కంగారు పడసాగాడు జానకీశరణ్. తన నౌకరుని పిలిచి వాడిని

వెంటనే దించమని ఆర్డరిచ్చారు. నౌకరు వాటిని దింపడంలో పటాలు కాస్త జారి కిందపడబోతోంటే సజ్జన్ వచ్చి వెంటనే వాటిని అందుకున్నాడు. లేకపోతే కొన్ని పగిలిపోయేవి. ఈ సంఘటన జరిగిన తర్వాత తానే స్వయంగా అక్కడవుండి అన్ని చిత్రాలు దింపించాడు. కూలీలంతా వెళ్ళిపోయిన తర్వాత కట్టుడు పళ్లను బయటికి పెట్టి ఇకిలిస్తూ జానకీశరణ్ అన్నాడు సజ్జన్‌తో-"చాలా అలిసిపోయి నట్టున్నావు. ఎంతో శ్రమ ఇచ్చాం నీకు. ఈ సాలిగ్రాంగారు చేసిన నీచపుపనికి నీకెలా ముఖం చూపించాలో అర్థం కావడంలేదు".

ముఖం వేలాడేసుకుని కూర్చున్నాడు లాలా. సాలిగ్రాంకి వ్యతిరేకంగా లాలాగారు ఫిర్యాదు చెయ్యడం విచిత్రంగా కనిపించింది సజ్జన్‌కి. తనేదో మాట్లాడుదామని నోరు విప్పేసరికి లాలా జానకీశరణ్ మళ్ళీ అందుకున్నాడు- "నేను రాజాగారితో ఫోనులో ఈ విషయం మాట్లాడి వారి సలహా తీసు కున్నాను. ప్రస్తుతం నువ్వంటే వారు అదోలా....అంటే నా వుద్దేశ్యం....నీకు తెలిసే వుంటుంది. ఒకవేళ ఆయన నీ మీద కోప్పడినా మీ తాతగారు నిన్ను కోపగించుకున్నట్టు అనుకో. సాలిగ్రాం మీద చాలా మండిపడ్డారు రాజా సాహెబ్. చాలా వెధవ పని చేసాడని అన్నారు. ఈ సమయంలో కొంచెం ఊరవిల్లి ఉండటం మంచిదని నీకు చెప్పమన్నారు. ముందు ఎగ్జిబిషన్ కానీ యండి. తర్వాత వాడి పని పడదాం అన్నారు. "హిజ్ ఎక్సెలెన్సీ"గారు వస్తున్నారు గనుక తిరిగ్గా ఆ వ్యవహారం ఆలోచించవచ్చన్నారు"

ఆగ్రహావేశంతో సజ్జన్ అన్నాడు - "ఈ చిత్రాలన్నీ తిరిగి తీసుక వెళ్ళానంటే నాకి అసలు [illegible] [illegible]తుంది [illegible] ఏ కళాకారుడు చిత్రాలిస్తాడో అప్పుడు తెలుస్తుంది".

"అవునన్నుకు బాబూ, నువ్వన్నది నిజం"

"[illegible] ప్రచారం, [illegible] అక్కర్లేదనుకోండి. భగవంతుని దయవల్ల నేను కావలసినంత పేరూ ప్రతిష్ఠా సంపాదించుకున్నాను. సాలిగ్రామ్ అసలు రంగు ఈ నగరంలో[illegible] వాళ్ళకి తెలియనిదికాదు. సజ్జన్ వర్మ ప్రశస్తి ఒక్క

భారతదేశంలోనే కాదు. విదేశీ పత్రికల్లోకూడా అతణ్ణి గురించి పొగడ్తలు వస్తుంటాయి."

"సజ్జన్ బాబూ, నా కన్నీ తెలుసునయ్యా. నువ్వు మా పెద్ద జమిందారు గారి లాంటివాడివి. నిన్నెవరైనా పొగడుతోంటే నా ఛాతీ గజం వెడల్పు అవుతుంది. ఏమి చెప్పమంటావ్, నీ ఘనతను చూసి మురిసిపోవడానికి ఇంట్లో ఒక్క పెద్దదిక్కైనా లేదు" అంటూ లాలా జానకీశరణ్ ధోవతి కొంగుతో కళ్లు తుడుచుకుని మళ్ళీ అన్నారు- "చిరంజీవిలావుండు నాయనా, భగవంతుడు నీ హోదాను మరింత పెద్దది చేయుగాక, నీ మూలాన "హర్ ఎక్సిలెన్సీ" వంటి ఎందరెందరో పెద్దల పాదధూళి నా ఇంటికి సోకుతుంది. బతికినంతకాలం నీ పేరు స్మరించుకుంటూ వుంటాను".

సజ్జన్ మీద ఆప్యాయతను ఒలికించిన తర్వాత ఓ క్షణంపాటు లాలాజానకీశరణ్ మౌనం వహించారు. మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా హఠాత్తుగా అడిగారు-"పొద్దున్నుంచి నువ్వు కొంచెంకూడా ఏమీ తీసుకున్నట్లు లేదు. మా యింట్లో భోంచేద్దువుగానిరా".

"లేదండి. ఇవ్వాళ కర్నల్ ఇంట్లో భోజనం. ఆలసింకా రాలేదు."

"రాక పోవడమేమిటి ఖర్మం. వచ్చి వెళ్ళిపోతేను. కర్నల్ నా మీద మహా కోపంగా వున్నారు. అతని వెంట ఆ పిల్ల- పేరు మరిదాను- కూడా వచ్చింది. ఆమె గురించే కదా నువ్వంటే రాజాసాహేబు పెదమెహం పెట్టారు. నగీన్‌చంద్ మర్యాద లేకుండా ప్రవర్తించాడు. నువ్వేమీ అనుకోవద్దు నీకు స్నేహితుడు కావచ్చు. నాకు కూడా పరిచయస్తుడే. వాళ్ల నాయన లాలామోతీచందుతో నాకు లావాదేవీలు వున్నాయి. కాని గంగాజలం చేతిలో తీసుకుని ఒట్టు పెట్టుకొని చెప్తున్నాను. శీలంలోనూ, వంశ మర్యాదలోనూ, స్వభావంలోనూ, మొహ మాటంలోనూ నగీన్‌చంద్ కాదు కదా మహీపాల్ కూడా నీకు పోలదు. మా చెల్లెలు భర్త రూప్‌రతన్‌తో కలిసి పేపరు నడిపినప్పటి నుంచి మహీపాల్‌ని ఎరుగుదును. అసలు రహస్యం ఏమిటంటే వంశ పారంపర్యంగా వచ్చే శ్రీమంతుల తరహాయే వేరు. నగీన్‌చంద్ తండ్రి కాలంలోకదా నాలుగు రాళ్ళు

సంపాదించు కున్నారు వాళ్లు. రాజా సాహెబ్‌లాగో మనిద్దరి మాదిరిగానో తర తరాల్నుంచి ఐశ్వర్యవంతులు కారు. సరేలే, ముందు నువ్వు కాస్త ఎంగిలిపడు"

"లేదండి, ముందు కర్నల్ని చూడాలి. ఎక్కడికి వెళ్ళాడో మీకేమైనా చెప్పి వెళ్ళాడా!"

గంభీరంగా ముఖాన్ని పెట్టి లాలా జానికీశరణ్ కాస్సేపు మౌనంగా వుండి అన్నాడు– "ఎగ్జిబిషన్ నా ఇంట్లో జరగదని చెప్పి పోయాడు. ఏదో పేరు చెప్పారబ్బా. పెద్దమ్మ ఇంట్లో ఏర్పాటు చేస్తున్నానని చెప్పాడు''

ఆ మాట వినగానే సజ్జన్ నిశ్చేష్టుడయ్యాడు. దృఢసంకల్పంతో కర్నల్ చేసిన ఈ సాహసానికి మానసికంగా కొంత సంతోషం పొందినా అతనీవిధంగా వూహించలేని విధంగా తీసుకున్న చర్యకు చకితుడయ్యాడు. వెంటనే అక్కడ నుంచి కదిలి "ఇప్పుడే వస్తాను" అని అన్నాడు.

"చూడు నాయనా!"

"లేదండి. ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ ఒక్క క్షణం కూడా ఆగకుండా పెద్దమ్మ మేడవైపుగా వెళ్ళాడు.

కన్య, కర్నల్! అతని ముగ్గురు నౌకర్లూ, బాబారామ్‌జీ, అతని నలుగురు శిష్యులు కలసి బిందాలు అటికిస్తున్నారు పెద్దమ్మ నందో దగ్గరే వుండి అంతా చూస్తూ నిలబడ్డారు. పెద్దమ్మ బాబారామ్‌జీ మధ్య మధ్య మాట్లాడు తున్నారు. సజ్జన్ ఒకసారి అక్కడికి చేరేసరికి వాళ్ళ మధ్య ఏదో ప్రలోక్తి వినిపిస్తుంది. అందుకు అందరూ ఏకాగ్రంగా వీక్షించి వున్నారు.

"రండి రామ్‌జీగారూ! ఇక్కడ శుభకార్యం అవబోతూంది" అని సజ్జన్‌ని బాబాగారు ఆహ్వానించారు.

సజ్జన్ రాగానే కన్య ముఖం గంభీరమైంది. ఆమె తల వంచుకుని బిం దాలు కదిలిస్తోంది. అతణ్ణి చూసి పెద్దమ్మ అంది– "కన్యామల్ మనుమడా. వింటించకు, జానికీశరణ్‌గాడి వంశనాశనం చేసేస్తాను చూస్తోండు''.

"పోవే పెద్దమ్మా, మాటలు కోటలు దాటిస్తూంటావ్. నీవల్ల ఏమీ కాదులే" అంది నందో,

"ఏమిటే ముండా నువ్వు కూస్తోంది. నీవల్ల ఏపని చేయించినా అది తలకిందులవుతుంది పాపాల పుట్ట".

"మరి నువ్వో-" పెద్దమ్మ తనని తిట్టిందన్న కోపంతో తన త డా ఖా అందరి ముందూ చూపించాలను కుంది నందో. పెద్దమ్మ ఉగ్ర వే డె క్కి పోయింది. నందోను తగులుకుంది- "నువ్వు నన్నేం అనగలవే. ఇంత వరకు వేలెత్తి చూపలేదు ఏమొనగాడూ, నువ్వు దొంగముండవి. నువ్వు చెడింది కాకుండా లోకాన్ని కూడా చెరచడానికి-"అని ఏదో అనబోతుండగానే బాబాగారు కల్పించు కొని "పోనీలే భక్తురాలా! శుభకార్యంలో ఈ కూతలన్నీ ఎందుకులే" అంటూ సజ్జన్ వైపు తిరిగి ''నువ్వు వెళ్ళిన పని అయిందా" అని ప్రశ్నించాడు.

"ఆఁ అయింది. చిత్రాలు తీసు కొచ్చాను''

"నిన్నెవరో వాళ్ళు అవమానించారని విన్నాను. రామ్‌జీ, విచారించకు. ఇది ప్రపంచంకదా''- అంటోండగానే నందో, పెద్దమ్మ మళ్ళీ ఎందుకో కీచులాడు కుంటున్నారు. నందో నెమ్మదిగా ఏదో సణుక్కుంటూ వుంటే పెద్దమ్మ మళ్ళీ లేచింది ఆమె మీదకు- "ఒసే వెధవా, అలా ఎందుకే గొణుక్కుని చస్తావు. నాతో పెట్టు కున్నావంటే నాలుగు రోజుల్లో అధోగతి పాలు చేసి బురదలో పొర్లాడేలా చేసేస్తానే. ఈ బాబాగారు కూడా నిన్ను బాగు చేయ్యలేరు. ఏమను కున్నావో"

"ఇదిగో అమ్మాయ్! ఆ ముసలావిడతో తగువు పెట్టుకొని నువ్వేం జయించ గలవు. నోరు మూసుకుని పూరుకో'' అన్నాడు బాబా శాస్త్రి కర్త్రారజేసి

వాళ్ళ కీచులాట విని ఆనందించే ఓపికలేదు సజ్జన్‌కి. కర్నల్ ఎక్కడున్నాడో అతనికి కావాలి. ఎవరిని అడగడం? ఉండడాని కయితే అక్కడ కర్నల్ నౌకర్లే వున్నారు. కాని వాళ్ళిప్పుడు కనపడడం లేదు. కన్యను అడగా

అని అనుకున్నాడు- లాలాగారి ముందు తన నైర్మల్యాన్ని ... వు చేసే వుద్దేశ్యంతో కన్యపట్ల తన అనురాగాన్ని ప్రకటించాలని అను కుంటున్నాడు. కాని ఎలా అనురాగం చూపించాలి? ఏమని అడగాలి? అందుకే ఎవరిని అడగాలి అన్నది తేల్చుకోలేక పోతున్నాడు. లోపల నుంచి వుబుకుతోన్న కోరికను అణచు కోలేక స్వభావ సిద్దంగానే "కర్నల్ ఎక్కడ?" అని కన్యను అడిగాడు.

''భోజనానికి ఏర్పాటు చేస్తున్నారు"

''ఎవరికి?

"వీరికి, వారికి, నాకు, అందరికి" అంది కన్య.

''నువ్వింకా భోజనం చెయ్యలేదా, మనమడా? మరెందుకు చెప్పలేదు? నాలుగు పూరీలు వేయించి యిచ్చేదాన్ని క్షణంలో" అంది పెద్దమ్మ అందుకుని.

"లేదు పెద్దమ్మ. భోజనం వసూనే వుండొచ్చు"

అంతలో కర్నల్ వచ్చారు. ఇద్దరూ అక్కడ జరిగిన విశేషాలు చెప్పు కున్నారు. కర్నల్‌కు జానకీశరణ్‌కూ మధ్య పెద్ద తగాదా అయింది. "నేను స్పష్టంగా చెప్పేసాను. రాజాసాహెబ్‌కానీ, వైస్‌రాయ్‌కానీ, ఈ ఎగ్జిబిషన్ లాలా జానకీశరణ్ ఇంట్లో జరగదు. ఒకవేళ ఆయన ఏదైన ఎత్తు వేసాడామో కూడా దానికి పై ఎత్తు వేయడానికి సిద్ధంగా వున్నాం. నేను ఏమీ పొరపాటుగా మాట్లాడలేదుగా" అంటూ సజ్జన్ అభిప్రాయం తెలుసు కుందాం అన్నట్లుగా కర్నల్ అతని వైపు చూశాడు.

''లేదు. బాగానే వుంది"

నువ్విప్పుడే వెళ్ళి అచిత్రాలన్నీ తెచ్చెయ్యి. ఈ బాగా అంతకన్నా ఎన్నో రెట్లు మెరుగు''.

లాలాగారి వద్దకు చిత్రాల్ని తెచ్చేందుకు సజ్జన్ వెళ్ళగానే లాలా పూర్తిగా మారాడు. ఇంతకు ముందు సజ్జన్‌తో మాట్లాడిన తీపి, సౌమ్యతా మాయమైంది. చిత్రాల్ని వాపసు ఇవ్వమంటే మొండిచెయ్యి చూపించాడు లాలా ''హర్

"ఎక్సిలెన్సీ" ప్రారంభోత్సవం చేసిన తర్వాత కాని ఏ విషయమూ చెప్పలేను అని నిర్మొహమాటంగా అన్నాడు లాలా.

వంశ పారంపర్యంగా మర్యాదా మన్ననకు ప్రసిద్ధికెక్కిన లాలా జానకీ శరణ్ అదే శీలం అదే సంస్కారం అనూచానంగా సంతరించు కున్న సజ్జన్ చేత అవాకులూ చవాకులూ తినాల్సి వచ్చేప్పటికి అతనికి బాధ కలిగింది. సజ్జన్ చాలా ఉద్రిక్తంగా ఆగ్రహంతో వున్నాడు. అతన్ని వూరడిస్తూ "ఇప్పుడు రాకపోతే పోనీలే. సాయంత్రం కావడం ఎంతసేపు. ఆమెగారు ప్రారంభోత్సవం చేస్తోందగానే ఆమెగారి ముందే జానకీశరణ్, సాలిగ్రాం గాళ్ళ పరువు తీయక పోతే నాపేరు కర్నల్ కాదు. నువ్వు చూస్తూవుండు. కథంతా నేను నడిపిస్తాను" అన్నాడు కర్నల్.

కర్నల్ పెద్దమ్మ మేడ ముందు జండాలు తగిలించి చక్కగా అలంక రించాడు. అక్కడ లాలా జానకీశరణ్ బంతిపూలు తెప్పించి తన ఇంటిలోని ప్రతి స్తంభానికి వాటి దండలు చుట్టి అలంకరించాడు చౌరాస్తాలో నీటి కొళాయి వున్న దగ్గర ఒకటి, తన మేడకు ఎదురుగా మరోటి- మొత్తం రెండు ద్వారాలు పెట్టించి మేడ ద్వారాన్ని విద్యుద్దీపాలతో అలంకరించాడు. తన ఇంటి నుండి చౌకు వరకు రెండు ఫర్లాంగుల దూరం జెండాలు అతికించాడు.

కోపంతో సజ్జన్ అగ్గిగుగ్గి పోతున్నాడు. కర్నల్ కుర్చీమీద వాలితూగు తున్నాడు. బాబా రామ్‌జీ తన శిష్యుల్ని తీసుకుని వెళ్ళి పోయాడు. కర్నల్ నౌకర్లు ముంగిట్లో కూర్చుని వున్నారు. కన్య పెద్దమ్మ వెంట దార ఇంటికి వెళ్ళి పోయింది.

మూడున్నర పావుతక్కువ నాలుగింటికి లాలా జానకీశరణ్ నౌకరు వచ్చాడు. "రాజాగారు వచ్చారు. తమర్ని పిలుస్తున్నారు" అంటూ సజ్జన్‌కి చెప్పాడు.

"వెళ్ల నవుసరంలేదు" కళ్ళు మూసుకునే అన్నాడు కర్నల్. సజ్జన్ ఎదురు చెప్పలేక పొయ్యాడు. నౌకరు ఓ క్షణం సజ్జన్ చూస్తూ నిలబడ్డాడు. మళ్ళీ "అయితే ఏమని చెప్ప మంటారు?" అని అడిగాడు.

"నీకు చెప్పానుగా. వెళ్ళక్కర్లేదని" అన్నాడు కర్నల్ కాస్త చిరాకుగా. నౌకరు వెళ్ళబోతూండే కర్నల్‌తో "వెళ్ళరానా. రాజాసాహెబ్-" అంటూ నీళ్ళు నమిలాడు సజ్జన్. "రాజాసాహెబ్ కానీ ఏ సాహెబైనా కానీ. నీవు వెళ్ళాల్సిన అవసరం కనిపించడంలేదు, నాకు. పెద్ద మనుషులైతే పెద్ద మనిషి తనంతోనే వ్యవహరించాలి" అన్నాడు కర్నల్.

"నేనో పర్యాయం వెళ్ళి వస్తాను" అంటూ సజ్జన్ లేచాడు.

నువ్వు వెళ్ళొద్దని చెప్పానుగా।"

సజ్జన్ మళ్ళీ కుర్చీలో కూర్చుండి పొయ్యాడు.

ఐదు నిమిషాల్లో రాజాసాహెబుగారి రెండో అబ్బాయి వచ్చాడు. నాన్న గారు పిలుస్తున్నారని వర్తమానం తెచ్చాడు.

ధర్మ సంకటంలో పడ్డాడు సజ్జన్. వాలుగా సజ్జన్ చూసాడు కర్నల్. విచిత్రమైన పరిస్థితిలో ఇరుక్కున్నాడు. అతనికి ఎదురుగా త్రిభువన్‌దాస్ నిలబడి వుండడం వల్ల సజ్జన్‌కి సైగ కూడా చెయ్యలేదు. అయినా మౌనంగా వుండలేక "చూడండి త్రిభువన్‌గారూ, ఏక పక్షంగా వుండడం అన్యాయం. సాలిగ్రాం గారైతే నా చూపుకు అనలేదను కోండి. కాని మా వ్యవహారంలో లాలాజానకీ శరణ్...." అంటూ ఆగిపోయాడు కర్నల్.

"అది సరే కర్నల్. ఇప్పుడు వారి పరువుకు సంబంధించిన సమస్య అయింది"

"మా పరువు కూడా సంబంధించినదేనండి''

''సజ్జన్! నువ్వు పద" అంటూ సజ్జన్ జబ్బ పట్టుకుని లేపాడు త్రిభువన్.

అతనలా బలవంతం చేస్తోండే సజ్జన్ కాదనలేక పొయ్యాడు. కర్నల్ ఆపలేక పొయ్యాడు సజ్జన్ వెళ్ళి పోయాడు.

హర్ ఎక్సలెన్సీగారి కారు వచ్చి రోడ్డు మీద ఆగింది. రాజాసాహెబ్‌గారి నాయకత్వంలో కొంత మంది శ్రీమంతులూ, సమాజంలో పెద్ద మనుషులుగా

చలామణి అవుతోన్న పది పన్నెండు మంది ఘరానా వ్యక్తులూ గుడ్డగూళ్లా ముఖాలు పెట్టి పళ్ళు ఇకిలిస్తూ నిలబడ్డారు. వాళ్ళ మధ్య వాళ్ళగౌరవ ప్రతిష్ఠలకు బలి అవుతోన్న యజ్ఞ పశువులా సజ్జన్ నిలబడ్డాడు. సందులో జానకీశరణ్ మేడ వరకు రెండు ఫర్లాంగుల దూరం హరెక్సిలెన్సీగారికి రెడ్ కార్పెట్ స్వాగతం ఇవ్వడానికి నాసిరకం ఎర్రగుడ్డ తాన్లకు తాన్లు తెచ్చి పరిచారు, దారి పొడవునా వున్న ప్రతి ఇంటికీ ముందే ఓ గంప పూలు సప్లయి చేసారేమో ఆమెగారు నడుస్తోంటే రెండు వైపుల నుండి పుష్ప వర్షం కురిసింది. చౌ రా స్తా ద్వారాన్ని దాటి హరెక్సిలెన్సీగారు సందులోకి ప్రవేశించారు. సందు మొగలో ప్రవేశించగానే అంతకు ముందే కొయ్య పాత్రల్లో మూనివుంచి లా పా వు ది నూలుతో కట్టి వుంచిన రెండు పూల దండలు తాడు లాగేటప్పటికి వాటి మెడలో పడి కంఠ సీమను అలంకరించాయి. జానకీశరణ్ మేడ దగ్గర ఇవ్వాళ అంతా పెద్ద పెద్ద వాళ్ళే కనిపించారు- పేరు మోసిన డాక్టర్లూ, ధనవంతులూ, ప్రభుత్వాధికారులూ, ఆ వీధిలో మోతుబర్లూ, నగరంలోని పేరు ప్రఖ్యాతికల కళా కారులూ అంతా అక్కడే పోగయ్యారు. కొత్తా పాతా రెండు తరాలకు చెందిన చిత్రకారులూ శిల్పులూ అమ్మగారికి స్వాగతం పలికే నిమిత్తం శ్రీమంతుల గుంపుకు కొంచెం దూరంగా జరిగి మిణుగురు పురుగుల్లో మెరుస్తున్న చుక్కల్లా నిలబడి వున్నారు. భూదేవి ఆరోజు తనకు తాను ధన్యురాలైంది. ఇంత మంది గొప్ప వ్యక్తుల పాద ధూళి సోకిన ఆ సందు ఆరోజు తనలో తాను పొంగి పోయింది. పోలీసులు గట్టి బందోబస్తు చేసారు. కర్నల్, కన్యా కలిసి కార్యక్రమాన్ని భగ్నం చెయ్యడానికి ఏదైనా ఎత్తుగడపన్ను తారేమోనని సాలిగ్రాంమ్‌కూ, జానకీశరణ్‌కూ ఇద్దరికీ సందేహంగా వుంది.

ఎగ్జిబిషన్ ప్రారంభోత్సవం జరిగింది. హరెక్సిలెన్సీగారి గుణగణాల్ని ప్రశంసిస్తూ రాజాసాహెబ్‌గారు చిన్న ఉపన్యాసం ఇచ్చారు. అక్కడి సజ్జను అంతా ఎప్పుడూ గొప్ప రాజభక్తులు గానూ, దేశభక్తులు గానూ ప్రాశస్త్యంపొందిన వారేనని రాజా వారు తమ వుపన్యాసంలో పేర్కొన్నారు. సాలిగ్రాంగారి నాయకత్వాన్ని కొనియాడుతూ సందర్భాను సారంగా సజ్జన్ గురించి కూడా రాజా వారు రెండు వాక్యాలు పలికారు.

కాలికి కట్టువున్న కారణంగా సాలిగ్రాం మైకు ముందు నిలబడలేక కూర్చునే తన సహజధోరణిలో వుపన్యాసం ఇచ్చాడు. ఆయన సజ్జన్ గురించి ప్రత్యేకంగా ఎక్కడా ఉటంకించకుండా ఈ జాతీయ సంస్థకు కళా కారులు దేశ వ్యాపితంగా అందజేస్తోన్న సహకారానికి జోహారులు అర్పించారు. ఈ సందర్భంలో ప్రారంభోపన్యాసం ఇస్తూ హర్ఎక్సెలెన్సీగారు కళా ప్రాశస్త్యాన్ని గురించి సంక్షిప్తంగా నాలుగు ముక్కలు చెప్పి, అంతర్జాతీయ ప్రఖ్యాతి గడించు కున్న ఆ నగరంలోని కొంత మంది వృద్ధ కళా కారుల్ని గురించి తన వుపన్యా సంలో చాలా ఘనంగా పేర్కొన్నారు. ఈ కార్యక్రమాన్ని యేర్పాటు చేసినం దుకు గాను రాజా సాహెబ్‌గారిని అభినందించారు. అందరూ కరతాళ ధ్వనులు చేసారు. ఎగ్జిబిషన్ హాల్లో ప్రవేశించారు. హాల్లో అడుగు పెట్టగానే సజ్జన్ ముఖాన నెత్తురు చుక్కలేదు. నగరంలోని లబ్ధప్రతిష్ఠులైన వ్యక్తుల ఎదుట, తోటి కళా కారుల ఎదుట ముఖం చూపించడానికి వీల్లేనంత అసహజంగా ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశారు. ఒకే గోడ మీద ఏభై చిత్రాల్ని ఒకదాని పక్కనే ఒకటి వరుసగా తగిలించారు. ఇకపోతే శిల్పాల గురించి షావుకార్లకు బొత్తిగా తెలి యదు కాబోలు ఓ మేజాబల్ల తెప్పించి వాటిమీద అవన్నీ నిర్లక్ష్యంగా వుంచారు. హాల్లో వున్న అన్ని వస్తువుల్లోనూ ఒకటే అందరి మనస్సును ఆకర్షిస్తోంది. అది కరెంటు బల్బుల్తో అలకంరింపబడిన భారత మాత, ఆమె చుట్టూ తిరుగు తోన్న సుదర్శన చక్రం. తమ చిత్రాలు అధోగతి పాలు కావడం చూసి కళా కారులంతా నిర్విణ్ణులై పోయ్యారు. సజ్జన్ అయితే మోహం దాచేసి ఊరు కున్నాడు. హర్ఎక్సెలెన్సీ, ఇద్దరు ముగ్గురు పెద్ద హోదాగల అధికార్లు మినహా యించి రాజాసాహెబ్, లాలాజానకీశరణ్ గార్లకు మరే విషయం పట్టడంలేదు. కర్నల్, కన్యా ఎప్పుడొచ్చారో ఏమో ఓ మూల నిలబడి వున్నారు. హర్ ఎక్సెలెన్సీగారు ఠీవిగా అడుగులేస్తూ వీలైనన్ని తక్కువ చిత్రాలు తిలకించారు. ముందు హర్ఎక్సెలెన్సీగారు, వారి పక్కనే రాజాసాహెబ్, వాళ్ళ వెనక బాగా బలిసి కండలు వేళ్లాడుతూ వున్న ఇద్దరు షావుకార్లూ, ఆఫీసర్లూ అలా ఓ క్రమంలో చిత్రాల్ని చూస్తూ ముందుకు నడవ సాగారు. సీనియర్ కళా కార్లు మాత్రం తమ

చిత్రాలు ప్రదర్శించిన తీరు చూసి బాధపడినా వెంటనే అక్కణ్ణుంచి మౌనంగా జారు కున్నారు.

ఇంక అక్కడ మిగిలి పోయిన వారు సజ్జన్ తరానికి చెందిన యువ చిత్రకారులు. వాళ్ళే ఈ విషయం చర్చించు కుంటున్నారు. ఆ ప్రదర్శనంతా చూస్తోంటే కరెంటు బల్బులతో వెలుగుతోన్న మూడు రంగుల జెండాను చూపించ డానికి ఇంత మంది కళాకారుల చిత్రాల్ని తక్కువచేసి ఇక్కడ చూపించి నట్టుగా వుంది. త్రివర్ణ పతాకం, భారత మాత శిఖండిలా వున్నారు. ఈవంక పెట్టుకుని నలుగురు ధన వంతులు చిత్రకళను తమకు వూడిగం చేయ డానికి వుపయోగిస్తు నట్టుగా వుంది. ఈ శ్రీమంతు లందరికీ తాళం వాయిస్తూ వారికి యేజంటుగా ప్రవర్తిస్తూ కళా కారులందరినీ దాసోహం అని పించాలని సజ్జన్ ఎత్తు వేస్తున్నాడన్న పుకారు బయలు దేరింది.

అది విన్న కన్య ఎంతగానో బాధపడింది. కర్నల్ కూడా వున్నట్టుండి ఎక్కడికో మాయమయ్యాడు గాలరీ మీద వరుసగా తగిలించిన చిత్రాల్ని వీధి లోని జనం చూస్తూ పోతున్నారు. ఒక్క ముక్కలో చెప్పాలంటే చిత్రాలన్నీ ప్రేక్షకులకు ఏమాత్రం అర్థమైనట్టులేదు. కళా ప్రదర్శనం ఎవరో కొంత మందికి రాంబిక ప్రదర్శనంగా వుపకరించింది.

ఒక యువ చిత్రకారుడైతే అక్కడ దేరిన జనాన్ని వుద్దేశిస్తూ ఈ చిత్ర ప్రదర్శనాన్ని నిరసిస్తూ ఓ చిన్న వుపన్యాసం కూడా దంచేసాడు. ఎందుకురా నాన్న, గొంతుతడి ఆరిపోయేలా అరుస్తావ్. నీకు ఓ కప్పు టీగానీ ఫలహారం కానీ దొరకదురా, నీకంతశోషేగాని. ఎవర్రా ఇవన్నీ పట్టించుకునేది అంటూ జనంలోంచి ఎవరో మహానుభావుడన్నాడు. మనం పేరూ ప్రతిష్ఠలు కలవాళ్ళం కాకపోతే మరి ఈ వెధవాయిలేనా తెగపొడిచేసింది అంటూ ఇంకోవ్యక్తి అందు కున్నాడు. ప్రభుత్వమే వాళ్ళని వి.ఐ.పి.లుగా గుర్తించింది. ప్రభుత్వం వారి తరపున జరిగే ఏ కార్యక్రమంలోనైనా ఈ ముఠావాళ్ళ పేర్లే కనబడుతాయి. నిన్నూ నన్నూ ఎవరోయ్ అడిగేది. అందుకే వాళ్ళు పొడిచేసినవాళ్ళని అంటున్నారు అని మొదటివ్యక్తి సమర్థించుకున్నాడు. మనం అంటే వీళ్ళకు మర్యాద

లేనప్పుడు మనమేం లేకివాళ్ళం కాదుకదా వీళ్ళు చెప్పులకింద తొత్తుల్లా నలిగిపడి వుండడానికి. ఏదిరా సజ్జన్, ముందు వాడి భరతం పడదాం అన్నారు అంతా.

వాళ్ళ ఆగ్రహావేశాల్ని పసిగట్టి కన్య వాళ్ళముందు వచ్చి నిలబడింది. యువ చిత్రకారుల్ని వుద్దేశిస్తూ "సోదరులారా, శాంతించండి. అసలీ రభసకు మీ తోటి చిత్రకారుడైన సజ్జన్ వర్మగారు ఏమాత్రం బాధ్యులు కారు. చిత్రాలు సేకరించేవరకు వారిని కాకా పట్టారీ పెద్దలంతా. తీరా సేకరించి వాళ్ళ చేతుల్లో పెట్టగానే పాపం సజ్జన్‌గారిని చివరి నిమిషం వరకు ఈ హాల్లో అడుగు పెట్టనిస్తే ఒట్టు. అసలీ చిత్రకళా ప్రదర్శనం సాకుతో పెద్దపెద్ద వాళ్ళను ఇక్కడికి పిలిపించి తమ సొంత దబ్బా కొట్టుకోవాలని వీళ్ళ ఆకాంక్ష. ఈ రహస్యం మీరంతా ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది"

ఇంతలో ఎవరో అన్నారు-"ప్రచారం చేయించుకోవడం వీళ్ళ గుత్త వ్యాపారమైపోయింది. సాహితీవేత్తలు, కళాకారులూ, శాస్త్రవేత్తలూ అంటూ పెద్దపెద్ద సమావేశాలు ఏర్పాటు చేస్తారు. వాటిలో ఏ ఏ నాయకులూ, ఉప నాయకులూ, వాళ్ళ వందిమాగధులూ పాల్గొంది అందరిపేర్లూ, ఇంటిపేర్లతో సహా పేపర్లో మర్నాడు వస్తాయి. కాని అసలు నిజంగా సరుకున్న సాహితీవేత్తల పేర్లూ, కళాకారుల పేర్లూ మచ్చుకైనా కనపడవు".

"మీరెందుకు సహకరిస్తారు? మీరు కూడా అటువంటి మరానా వారిని వుపేక్షించండి పెద్దవాళ్ళమని చెప్పుకుంటున్నారే, ఈ నాయకుల్ని, వినాయకుల్ని మీరు కూడా బహిష్కరించండి. మానవుడిగా పుట్టి మానవత్వం లేని ప్రతివ్యక్తినీ బహిష్కరించండి".

"ఈ వాడలోని జనసామాన్యం కళ అంటే ఏమిటో తెలిసుకోవాలని తహతహలాడుతున్నారనీ, ఈ ప్రదర్శన ద్వారా వాళ్ళకు విజ్ఞానం అందించడానికి వీలు కలుగుతుందని సజ్జన్ మాకు చెప్పారు. ఒక్కొక్క చిత్రం ఏ ఏ భావాన్ని ఏ ఏ ఆదర్శాన్ని కల్గివుందీ తెలుపుతూ ప్రతిచిత్రానికీ ఓ కార్డు తగిలిస్తాం అని చెప్పారు".

"అవును. మా అసలు వుద్దేశ్యం అదే. కానీ మాకా అవకాశమే ఇవ్వలేదీ నాయకులు. చిత్రాలు రానంతవరకు ప్రాధేయపడి తీరా చిత్రాలు వచ్చిన తర్వాత ఈవిధంగా—"

ఇంతలో అక్కడికి ఓ పెద్దమనిషి వచ్చి "మీరంతా ఇక్కడ ఇలాంటి మాటలు అనకండి. పక్కనే గదిలో పెద్దపెద్దవాళ్ళంతా–" అంటూ ననిగాడు.

"ఎవర్రా పెద్దమనుషులు? ఎక్కడరా సజ్జన్? ఆయన్ను పిలవండి! వాళ్ళ స్వార్థంకోసం మన చిత్రకళ పరువునే కుదువబెట్టారు!"

ఇదే అదనుగా భావించి కన్య అందుకుంది—"చిత్రకళా ప్రదర్శనం కోసం మేమంతా వేరేచోటు ఎంపిక చేసాం. ఈ ఇంటికి చాల దగ్గరలోనే. వాళ్ళ ఈవిధంగా చిత్రాల్ని స్వాధీనం చేసుకోకపోతే అసలు అక్కడే చిత్ర ప్రదర్శనాన్ని ఏర్పాటు చేసివుండేవాళ్ళం. ఆ ప్రదర్శనకు ప్రారంభోత్సవం కోసం 'హర్ఎక్సలెన్సీ' గారికి బదులు చికన్ అల్లుకునే ఏ సామాన్య కళాకారిణినో పిలిచేవాళ్ళం. మీరంతా అంగీకరిస్తే ఈ చిత్రాలన్నింటినీ ఇప్పుడే దించి–"

"చిత్రాలన్నీ దించండి!" అంటూ అందరూ అన్నారు. ఆవేశంలో కళాకారులంతా తమ చిత్రాలన్నీ దించడం ప్రారంభించారు. చూడ్డానికి వచ్చిన జనంలో కొంతమంది కూడా వాళ్ళకు సాయం చేస్తున్నారు.

అదే సమయంలో ఇద్దరు పోలీసుల్ని వెంటబెట్టుకుని లాలా జానకీశరణ్ కొడుకు రంగంలో ప్రవేశించాడు. "ఖబడ్దార్! ఎవరైనా చిత్రాల్ని ముట్టుకున్నారో జాగ్రత్త!" అంటూ గద్దించాడు. సింహాలమధ్య నక్క కూతలా వుంది ఆయన బెదిరింపు. ఆ బెదిరింపుకు కళాకారులు ఏమాత్రం అదరలేదు సరికదా ఇంకా ఆగ్రహావేశులయ్యారు. వాళ్ళని చూసి మరికొంతమంది యువకులు కూడా నడుం బిగించారు. హాల్లో ఉద్రిక్తత ఏర్పడింది.

పక్క హాల్లో టీపార్టీ ఇంచుమించుగా అయిపోతోన్న సమయంలో ఈ గోల జరిగింది. రాజాసాహెబ్ గారికి కోపం వచ్చింది. సాలిగ్రాం, జానకీశరణ్ వాళ్ళు ముఖాలు చిట్లించారు. ఆఫీసెతుల్లో గుసగుసలు బయల్దేరాయి.

ఎగ్జిబిషన్ హాల్లో నిలబడి ప్రజావాణిగా మారిపోయింది వనకన్య. కళాకారులందరూ కన్యను సమర్థిస్తున్నారు. వాళ్ళవాళ్ళ చిత్రాలు దించుకుని తీసుకెళ్ళడానికి అనుమతించకపోతే నగరంలోని ఆర్టిస్టులంతా ఏకమై ఓ సమావేశం పెట్టి ఈ అన్యాయాన్ని గర్హిస్తూ తీర్మానం చెయ్యాలని మాటిమాటికి హాల్లో ప్రకటిస్తున్నారు. పత్రికల ద్వారా కరపత్రాల ద్వారానూ వాళ్ళ బండారం బయటపెడతామని అంటున్నారు.

"ఎవరినైనా పిలవండి. పోలీసుల్ని పిలవండి. ఈ చిత్రాల్ని మేము ఇక్కణ్ణుంచి తీసుకెళ్ళితీరతాం. లేకపోతే ఇక్కణ్ణుంచి మా శవాలే వెళ్ళుతాయి." అంటూ ఉద్రేకంగా కన్య ఉపన్యసిస్తోన్న సమయంలో యిద్దరు నౌకర్లు నిచ్చెన మోస్తూ హాల్లోకి వచ్చారు. వాళ్ళవెంట మునిమునినవ్వులు వెదజల్లుతూ కర్నల్ వచ్చాడు. అప్పుడే వెళ్ళిపోవడానికి హర్ఎక్సలెంసీ బయటికి వచ్చింది. వారి వెంట వందిమాగధులూ బయటికి వచ్చారు. హర్ఎక్సలెన్సీ వెనుక వెళ్తోన్న లాలాజానకీశరణ్‌ని పిలుస్తూ కర్నల్ అన్నాడు—"లాలాగారూ, వాళ్ళ చిత్రాల్ని వాళ్ళు తీసుకెళ్ళనివ్వండి. ఈ పోలీసుల్ని బయటికి పంపించండి. లేకపోతే రసభంగం జరుగుతుంది. ఎలక్షన్ గెలిచినట్లే".

కర్నల్‌ని విషనాగుల్లా చూస్తూ రాజా సర్ ద్వారకాదాస్, లాలాజానకీశరణ్ మొహం తిప్పుకుని ముందుకు వెళ్ళారు. కర్నల్ వాళ్ళ పాలిట విభీషణుడిలా తయారయ్యాడు. ప్రేక్షకుల్లో వచ్చిన అలజడిని సంబాళిస్తూ దానికో నిర్మాణాత్మకమైన రూపం యిచ్చే ప్రయత్నంలో మునిగిపోయింది కన్య. గోడమీద నుంచి తీసిన ఏ ఒక్క చిత్రమూ పాడవకుండా ఎలా పెద్దమ్మ ఇంటికి చేర్చాలి అన్నట్లుగా ఆమె ధ్యాసంతా ఆచిత్రాలపైనే వుంది.

అన్ని చిత్రాలు దించేసారు. పోలీసులు కానీ జానకీశరణ్ మనుషులు కానీ ఎవరూ ఆక్షేపం చేసుకోలేదు. స్వయంగా కళాకారులే కూలీలుగా మారి స్వాభిమానంతో అన్ని చిత్రాలు దించి భుజాలమీద పెట్టుకుని మోసుకపోయారు. జానకీశరణ్ హాల్లోనుంచి బయటికి వెళ్ళుతూ కర్నల్ ఓ ప్రకటన చేసాడు—

"సోదరులారా, రేపు సాయంత్రం పెద్దమ్మ మేడలో ఈ చిత్రకళా ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేయడానికి ఏర్పాటు చేసాం. దయచేసి మీరంతా తప్పక వచ్చి మా కార్యక్రమాన్ని విజయవంతం చెయ్యాలని ప్రార్థిస్తున్నాం" అంటూ.

# 33

ప్రదర్శన విఫలమైనందుకు సిగ్గుతో అణిగిపోయిన అహంకారాన్ని చేత్తో పుచ్చుకుని ఎవరికీ తెలీకుండ జారుకున్నారు సజ్జన్.

ప్రదర్శనను విజయవంతం చేయడానికి సన్నాహాలు జరుగు తున్నాయి. ఆ సందర్భంలోనే కన్య కూడా కర్నల్ యింటి వద్దనే వుంది. ఈ కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేసేందుకు చికన్ కుట్టుకునే ఎవరైనా అనాధ బీద కళాకారిణిని పిలవాలని ఆ సాయంత్రమే చిత్రకారులంతా సమావేశమై తీర్మానించు కున్నారు. యువ చిత్రకారుడైన మదన్ ఈ ప్రస్తావన చేసాడు. క్రితం సంవత్సరం నా చిత్ర ప్రదర్శనకు ప్రారంభోత్సవం చెయ్యడానికి ఏ వైస్రాయినో ఏ గవర్నరునో, ఏ మంత్రిగారినో పిలవకుండా ఆట బొమ్మలు చేసే రేవతి రాముణ్ణి పిలిచానని తన అనుభవం చెప్పారు. రాధాకమల్ ముఖర్జీగారు ప్రారంభోత్సవ ఉపన్యాసం ఇచ్చారు. మరి ఈ ప్రదర్శనాన్ని కూడా అలాగే ఎందుకు ఏర్పాటు చెయ్య కూడదని ప్రశ్న వేసారు మదన్. అందరూ సరే నన్నారు. ప్రత్యేకంగా కర్నల్‌కూ, కన్యకూ ఈ ప్రస్తావన బాగా నచ్చింది. ఆ ప్రకారం కార్యక్రమాన్ని రూపొందించు కున్నారు. ఇవ్వాళ జరిగిన అవమానానికి రేపు ఎలాగైనా జానకీశరణ్, సాలిగ్రాంలు కక్ష తీర్చుకుంటారని కర్నల్ వూహించాడు. అందుకే యూనివర్శిటీ ప్రొఫెసర్లూ, సాహితీ వేత్తలూ, పత్రికా సంపాదకులూ మొదలైన మేధావంతుల వర్గాన్ని పిలవాలని నిశ్చయించు కున్నారు.

రాత్రి మూడు గంటల వరకూ ఈ విషయాలే చర్చించు కుంటూ కూర్చు న్నారు కర్నల్, కన్యను. కన్య మనస్సు ఏ విషయం మీదా స్థిరంగా నిలవటం

లేదు. మాటి మాటికి ఆమె ధ్యాస సజ్జన్ మీదకు వెళ్ళుతోంది. ఒకటి రెండు పర్యాయాలు కర్నల్ ఇది గమనించి కూడా అతనికి తీరిక లేనందువల్ల మెదలకుండా వూరుకున్నాడు. ఒక విషయం తర్వాత మరో విషయం ఎన్నో ఆలోచిస్తున్నారు లౌడుస్పీకర్లు తగిలించాలి. ఒకటి మేడలోపలా, మరోటి గేటు దగ్గరా. ప్రొఫెసర్లూ, సాహితీ వేత్తలూ, పేరు మోసిన లాయర్లూ, జడ్జీలూ, డాక్టర్లు మొదలైన వారి చేత వుపన్యాసాలు యిప్పించాలి. వారంతా ఈ ప్రదర్శన ఎలా వుందో తమ తమ అభిప్రాయాల్ని వెల్లడిస్తూ వుపన్యాసాలు యిస్తారు. అప్పుడు ప్రజల మనస్సుల్లో హత్తుకు పోతుంది. మధ్య మధ్య భజనల రికార్డులు వేయాలి, అంటూ ఆలోచిస్తోన్న కర్నల్ మనసులో చటుక్కున ఓ ఆలోచన మెరుపులా మెరిసింది. "బిన్నో. లక్షం విలువచేసే ఆలోచన తట్టింది. ఎగ్జిబిషన్ మూడు రోజులు జరుపుదాం. మూడు రోజులూ పిల్లలకు మిఠాయి పంచిపెడదాం. మహా అయితే రోజూ ఓ వెయ్యి ప్యాకెట్లు. ఐదారు వందలు ఖర్చవుతాయి. పెద్ద మనుషులంటూ గుట్టు చప్పుడుగా నలుగురికి తినిపిస్తే ఎవ్వరు చూశారు? పిల్లలకు పంచామంటే మన పేరు చెప్పుకుంటూ వూరంతా తిరుగుతారు. ఏమాలోచిస్తున్నావ్" అని కన్యను పిలిచి ఆమె అభిప్రాయం అడిగాడు కర్నల్.

"ఏమీలేదు. మీరు చెపుతోంటే నేను వింటున్నాను. మంచి ఆలోచనే. అయిదారు వేల మంది పిల్లలికి పంచిపెట్టాలి అనుకుంటాను. కాని మరి అంత ఖర్చు-"

"చూడు బిన్నో. సజ్జన్ గురించి విచారించాల్సిన పనిలేదు. అలాంటి పనేవుంటే నేను నీకు నమ్ముతూ చెప్పుంటాగా? అతని మానసిక పరిస్థితిని నీకు కళ్ళకు కట్టేటట్టు చెపుతాను. నేను ముఖం చూసుకొని అయ్యగారు లోలోపలే రుసరుసలాడుతూ వుంటాడు. మనస్థిమితం లేకుండా ఒక్కొక్క రోడ్డు మీద బాధ్యతారహితంగా కారు నడిపి ఇంటికి వెళ్తువుంటాడు. ఇంట్లో నౌకర్లందరినీ ఏదో ఓ వంక పెట్టుకుని కూకలు వేస్తువుంటాడు. బాగా తప్పతాగి.... అప్పుడప్పుడు తాగే దురలవాటుంకి సజ్జన్‌కి— ఇదో దుర్గుణం వుంది అతనిలో. అసలు విషయం యేమిటంటే బిన్నో, యుక్త వయస్సు వచ్చిన తర్వాత చాలా

సంవత్సరాలు బ్రహ్మచారిగా వున్నందు వల్ల ఇటువంటి వ్యసనాలు అబ్బుతుంటాయి. అలాగే సజ్జన్‌లో కూడా అటువంటి లోపాలు వచ్చాయి. లోపాలు ఎవరిలో లేవు. వాటిని గురించి నువ్వు బాధపడకూడదు"

"అబ్బే లేదండి. అలాంటి దేమీలేదు. అం మీరే మంటున్నారు. ఐదారు వేల మంది పిల్లలకు మిఠాయి–"

ఆమె మాటలకు పక్కున నవ్వుతూ కర్నల్ అన్నాడు– "ఐదారు వేల మందికి మిఠాయి తప్పకుండా పంచిపెడతానని ఇప్పుడు కాదు. సీముహూర్తం లోఆన. ఇప్పుడయితే వెయ్యి ప్యాకెట్లే పంచేది".

వాళ్ళిద్దరు మాట్లాడు కుంటూండంగానే టెలిఫోన్ వచ్చింది. జగత్‌చంద్ హరబ్‌చంద్ దగ్గర నుంచి ఫోను వచ్చింది. ఫోనులో తెలిసిందేమిటంటే– రాజా సాహెబుగారు కర్నలూ సజ్జన్‌లపై కోపంగా వున్నారు, ఇప్పుడే కొద్దిసేపటి క్రితం కొంత మంది ముఖ్యులతో ఓ సమావేశం జరిగింది. జానకీశరణ్ సాలిగ్రాం కూడా ఆ సమావేశానికి హాజరయ్యారు. మీ ప్రవర్తన బాగాలేదని ఎవరో ఆడ కమ్యూనిస్టు కార్యకర్తతో మీకు సంబంధం వుందని మీపై ఆ సమావేశం ఆరోపించింది. మీరు కమ్యూనిస్టు పార్టీతో చేతులు కలుపు తున్నారు అందు వల్ల రేపు మీరు ఎక్జిబిషన్‌కు ప్రారంభోత్సవం చేసే వేళకు లాలా జానకీశరణ్ ఇంటి అరుగు మీద లౌడ్‌స్పీకరు పెట్టి, పేరున్న నలుగురు వ్యక్తుల్ని పిలిపించి మీటింగు పెట్టి మీ ప్రవర్తన పచారం చెయ్యడానికి తీర్మానించు కున్నారు. కొన్ని రోజుల క్రితం సజ్జన్ డాబా మీద నుంచి నడిచిన ప్రేమాయణం గురించి సజ్జన్‌ని సంజాయిషీ అడగాలని తీర్మానించ బడిందని కర్నల్‌కు చెప్ప మన్నారు. సమావేశంలో పాసయిన తీర్మానానికి రాజాసాహెబ్‌గారి మద్దతువుంది కాన దీనికి చాలా ప్రాధాన్యం వుంటుంది. రేపు జరగబోయే మీటింగుకు రాజాసాహెబ్‌గారైతే స్వయంగారారు కాని మీటింగుకు రావలసిందిగా చాలా మంది షరాబులకు ఫోన్‌చేసారు రాజాసాహెబ్" అంటూ ఫోన్‌లో అవతలి వ్యక్తి తెలియ జేశాడు.

ప్రశాంతంగా అన్నీ విన్నాడు కర్నల్. చివర కర్నల్ ఖండితంగా జగత్ చంద్‌కి ఫోనులోనే చెప్పేశాడు– "చూడండి మా మనస్సులో ఏముందో ఆ

సర్వేశ్వరునికి తెలుసు. ఆ అమ్మాయి గురించి నా మనస్సులో ఏ దుర్మార్గపు ఆలోచన వున్నా గురువుగారి పాదాల మీద ఒట్టు. కర్నల్‌కు చెడ్డంటే భయం. చెడ్డ పేరంటే భయంలేదు సుమా" అంటూ పోసు పెట్టేసాడు.

వాతావరణం చాలా ఉద్రిక్తంగా వుంది. కన్యకు విషయం అంతా కర్నల్ చెప్పక పోయినా ఆమె పరిస్థితిని అవగాహన చేసుకుంది. ఒకచెంప క్రోధంతోనూ మరో చెంప సిగ్గుతోనూ కందగడ్డలా అయింది కన్య ముఖం. కర్నల్ నవ్వుతూ "భగవంతుడు ఏపని చేసినా మంచి కోసమే చేస్తాడు. రాజా గారి జాతకంలో కూడా పరువు పోయేటట్టు రాసివుంటే ఎవరు తప్పించ గలరు. ఇంత వరకు సాలిగ్రాంతోనే మర్దనపడడానికి నిర్ణయించుకున్నాను. ఇప్పుడు కోటీశ్వరునితో కూడా కయ్యం అందుకోవాలని వుంటే తప్పక అందుకుంటాను. విన్నో. ఈ కర్నల్ ముక్కుకు సూటిగా పోతాడు. ఎత్తుకు పైఎత్తులు వేస్తాడు. సూటిగానే గెలుపు పొందుతాడు. సూది దూరని చోట కలగపార దూర్చాలని చూస్తారు. వీళ్ళు నేనింత వరకు ఆ మార్గంలో పడలేదు. ఎదుటి వ్యక్తి యొక్క హోదాలు బట్టి ఎత్తు వేస్తాను. చిత్తు చేస్తాను. రోగి దుస్థితనుపట్టి డాక్టరు మందు రాసినట్లు. వీళ్ళ ఎత్తు గడకు విరుగుడు రేపే వేయపోతు న్నాను. ఏమిటో తెలుసా? రేపు విన్నూ, నీ ఒడినగాలిని పెద్ద పెద్ద వాళ్ల ఇళ్ళకు ఆహ్వా నించే నిమిత్తం పంపుతున్నాను. ఏమి చెప్పను? సమయానికి ఈ సజ్జన్‌గారు పెండిలా తయారయ్యారు. ఇవ్వాళే, చెలిగ్రాం కొట్టి మహిపాల్‌ని పిలిపిస్తాను. విన్నో, నా ... ఓ వ్యాసం తయారు చేసి ప్రచురించు. ఏమిరాయాలో స్థూలంగా నీకు చెబుతాను...."

కన్య ధ్యానముద్ర వహించింది. మళ్ళీ రాళ్ళతో ఢీ కొనడానికి ఆమె జీవితం సన్నాహం అవుతోంది. తానిప్పుడు సజ్జన్‌ని పోగొట్టు కున్నట్లు ఆమె మనసు చెబుతోంది. సజ్జన్ ఆమె జీవితంలోకి రావడం ఒక శాపంగా పరిణ మించింది. నిరాధారాన్ని ఆధారంగా ఎంచి ఆమె గర్వపడుతూ వచ్చింది. ఎంత మోసం జరిగింది.

ఎగ్జిబిషన్‌తో పాటు మహిళం సమ్మేళనం విజయవంతం కావడంతో రాజాసాహెబ్, లాలా జానకీశరణ్, సాలిగ్రాం జైస్వాల్ తెలివి తక్కువాళ్లలా తేలిపోయారు. జనసంఘ్, ప్రజా సోషలిస్ట్, కమ్యూనిస్టు మొదలైన అన్ని ప్రతి పక్షాలకు లౌడ్‌స్పీకర్ల ద్వారా కాంగ్రెసుకు వ్యతిరేకంగా సరికొత్త పద్ధతిలో ప్రచండంగా ప్రచారం చెయ్యడానికి అపూర్వ అవకాశం దొరికింది. వనకన్య తండ్రి అరెస్టు కావడం, వనకన్య, సజ్జన్ మధురవెళ్ళి సాక్షాధారాన్ని సేకరించడం అద్భుతంగా, ఆసక్తికరంగా, గగుర్పాటు కలిగించే విధంగా కథగా అల్లి ప్రతి పక్షాల వాళ్ళు ప్రచారం చెయ్యడం మొదలెట్టారు. సజ్జన్‌- వనకన్య ఈ జంట పుకార్లలోనూ ఎలక్షన్ వాతావరణంలోనూ ఆధునిక లైలామజ్నూల్లా చిత్రించ బడసాగారు. ఈ పార్టీల లౌడ్‌స్పీకర్ల హడావుడి మధ్య కర్నల్ లౌడ్‌స్పీకర్ కూడా రాజకీయాలతో తనకేమీ ప్రమేయం లేదని మాటి మాటికి వినేవాళ్ళ చెవులు చిల్లులు పడేలా అరుస్తోంది. "స్త్రీజాతి మీద జరుగుతున్న అత్యాచారాలనే మేము ఖండిస్తున్నాం. ఈ ఎలక్షన్ సందర్భంలో కూడా తెలివిని కోల్పో వద్దనీ ఇంగిత జ్ఞానాన్ని వుంచుకోమని మనవి చేస్తున్నాం. ఎలక్షన్లు జరిపే ప్రయోజ నాన్ని సిద్ధింప చెయ్యమని మేము ప్రజలను యాచిస్తున్నాం" అంటూ ప్రక టిస్తోంది.

మూడో రోజు సాలిగ్రాం ప్రచారం పద్ధతియే మారి పోయింది. ప్రచారం కోసం వార్డులోకి ఇద్దరు మంత్రి వర్యులు వచ్చారు. వాళ్ళ కార్లను చుట్టుముట్టి తిట్టిపోయసాగారు ప్రజానీకం. వాతావరణంలో రోజు రోజుకు వేడి ఎక్కు వవుతూ వచ్చింది.

కర్నల్-సజ్జన్, సాలిగ్రాం-లాలా జానకీశరణ్ ఈ నలుగురి మధ్య సఖ్యత కుదిర్చే నిమిత్తం సేఠ్‌రూప్ రతన్. ఒక మంత్రిగారు కలిసి టీకి పిలిచారు. సజ్జన్ చాలా డీలాగా వున్నాడు. చిత్రప్రదర్శనం మహిళల మేలాగా మారడంతో అతనిటువైపు రావడమే లేదు తెగిన గాలి పటంలా అయ్యాడు చిత్రను ఆయుధంగా గ్రహించి తనలో వున్న సత్యం మీద ఎన్ని దెబ్బలు కొట్టు కున్నాడో కాని అతనిలో చైతన్యమే కుంటిదై పోయింది. అంతర్యంలోని

విషాదం అతన్ని చలనంలేని రాయిలా మార్చేసింది. రెండు రోజులుగా ఎన్నాళ్ళ నుంచో పనిచేస్తోన్న అతని దగ్గర చనువుగా తిరిగే నౌకర్లు కూడా సజ్జన్ గది లోకి వెళ్ళడానికి జంకుతున్నారు. తటపటా యిస్తున్నారు. వాళ్ళ యజమాని కోపగించుకున్నా వాళ్లు సహించేవాళ్ళే, అతను వాళ్ళను ఆజ్ఞా పించడం మానే సాడు. ఆఖరికి మత్తుగూడా సేవించడం లేదు. సిగరెట్టయినా తాగడంలేదు. టీ కాఫీలు కూడా మామూలుకన్నా ఎన్నో రెట్లు తక్కువ. బెల్లం కొట్టిన రాయిలా ఎప్పుడూ కూర్చుని వుంటాడు. అప్పుడప్పుడు పెదిమలు ఆడిస్తాడు. పెద్ద దీవాన్‌జీ కర్నల్ షాపుకు వెళ్ళి వృత్తాంతం అంతా సవిస్తారంగా మనవి చేసాడు. ప్రదర్శన హడావుడిలో తిరుగుతున్న కారణంగా కర్నల్‌ని కలవడం కుదరలేదు. ఎలాగైతేనేం కర్నల్ కలిస్తే, "నేను తిరిగ్గా వచ్చి అన్నీ చక్క దిద్దుతానులే" అంటూ అభయం ఇచ్చాడు.

"మరేం లేదను కోండి. వారి మేజా బల్ల డ్రాయరులో...." అంటూ ఆగి పోయాడు దీవాన్.

"మీరు అతని గదిని వేయి కళ్ళతో కనిపెట్టి వుండండి"

"అది సరే అనుకోండి అయినా..."

"మీరు నిశ్చింతగా వెళ్ళండి. అలా జరగ కూడదని నేను టో స్వం చెప్పలేక పోయినా సజ్జన్ స్వభావాన్ని నేను బాగా ఎరుగుదును. అతనటువంటి అఘాయిత్యానికి పాల్పడడు!".

కర్నల్ కారు పగలు పది గంటలకు సజ్జన్ ఇంటి దగ్గర వనకన్యను దిగబెట్టింది.

కన్య అతని గదిలో అడుగు పెట్టేసరికి సిగరెట్టు తాగుతోన్న సజ్జన్ కనిపించాడు. దగ్గిరగా వేసిన తలుపులు తెరుచు కోగానే అతను కన్యను చూసి నిర్ఘాంత పోయాడు. సరిగ్గా లైటు వెయ్యగానే దొంగ తనం చేస్తోన్న వ్యక్తి పట్టు బడిన వాడిలా అతను నిర్ఘాంత పోయాడు. గాభరాలో కాలుతున్న సిగరెట్టును అరచేతిలోకి ముడిచాడు. ఏదో పాపం చేసిన మనిషిలా తొందరలో అతని అరచేతికి

చురక అంటుకుంది. అప్పుడు కాని అతను ఈ లోకంలోకి రాలేదు. ఏమీ జరగనట్టుగా అతి మామూలుగా చిరునవ్వు నవ్వుతూ కన్య అతనివైపు చూస్తోంది. దగ్గిరగా వచ్చి తన కోటు అతని ఒళ్లోవేస్తూ "ఆర్టిస్టుగారు ఏదో మూడ్ లో వున్నట్టున్నారు" అని చమత్కారం విసిరింది. తన ఐదువేళ్ళు ఎండిపోయిన అతని తలలో దూర్చి అతని కళ్ళల్లోకి చూస్తూ "చూడండి, ఇంక మీరు ఈ ఆర్టిస్టు మూడ్ లకి స్వస్తి చెప్పాలి అటువంటి వాటిని దరిదాపులకు రానివ్వను సుమా. నాగురించి మీరు కొన్ని ఒదిలెయ్యాలి మీ గురించి నేను కొన్ని ఒదిలేస్తాను. ఒప్పందం ఇష్టమేనా?" అంది.

మొదట ఎంతో తడబడుతూ ఆమె కళ్ళల్లోకి చూడ గలిగారు సజ్జన్. ఆ రెండుకళ్ళు అనే థర్మా మీటరులో తన ఉష్ణత కొలుచు కున్నారు. వూగిస లాడుతోన్న సజ్జన్ హృదయం కన్య కళ్ళలో తన స్థిరత్వాన్ని పరీక్షించు కుంటూవుంది అలాగే కన్య కళ్ళు కూడా భయం, పట్టుదలా, సరళత్వాన్ని నిండుకున్న సజ్జన్ చూపుల్లో తాము ఎంత వరకు నిలవ గలిగిందీ చూచుకో సాగాయి. కొంచెం దూరంగా జరిగిన కన్య అంది- "నువ్వు నమ్ము, ఈ నాలుగు రోజులూ పని మూలంగా రాలేక పోయాను. నువ్వు జ్ఞాపకంరాని క్షణం అంటూ లేదు. నీ మూడ్ నన్ను మొదలే షాకు తినిపించింది. తర్వాత ఈ ప్రదర్శన, సాంఘిక పోటీ మనస్తత్వం అనేది నాలో కొత్త ప్రాణం పోసింది. మేము ఇంతటి సంఘర్షణ ఒక ప్రయోజనం కోసం చెయ్యాల్సి వచ్చింది".

విషాదచ్ఛాయలు అలుముకున్న సజ్జన్ మనస్సులో కన్య తన మాటల ద్వారా అకస్మాత్తుగా సంచలనం రేపింది. కన్య మంచి హుషారుగా వుంది. రెండు మూడు రోజుల నుంచి వుక్కిరి బిక్కిరై వేడెక్కి పోయిన అతని హృదయాన్ని ఆమె ఒక్కొక్క పలుకూ గులాబీపూల మీద నుంచి వీస్తోన్న ఒక్కొక్క గాలి తెరలా గుబాళిస్తోంది. ఆమె ఏ సంఘటన గురించి చెబుతోందో దాని కథానాయకుల్లో సజ్జన్ కూడా ఒకడు. ఏమీచేయలేని సజ్జన్ మనస్సు స్ఫూర్తి పొందసాగి వుండి కూడా తనకూ సజ్జన్ కూ మధ్యవున్న ఇంకో తెరను ఎత్తి దగ్గిరకు వచ్చింది.

"ఇవ్వాళ రెండు గంటలు విశ్రాంతి తీసుకోవడానికి వచ్చాను. ముందే దైనా ఫలహారం చేయించు. గంటా గంటన్నర తర్వాత భోజనం చేసి వెళ్ళి పోతాను" అంది కన్య.

"కావలసింది తెప్పించుకో"

"ఆరోజు నుంచి నీ నౌకర్లకు ఆజ్ఞలు ఇవ్వ కూడదని శపథం చేసాను"

సజ్జన్ లేలాడు. కింద వున్న స్విచ్ నొక్కాడు. కన్యవైపు చూస్తూ, "నేను అతని కొరకు-"

తలుపు తెరిచి నౌకర్ సంచిత్‌సింగ్ భుజాన తువ్వాలు వేసుకుని వాళ్ళ ముందు హాజరయ్యాడు.

"ఠాకూర్. ఇవ్వాళ్టినుంచి ఇల్లు వీరిది. నాది కాదు- మరెవ్వరిదీ కాదు. అర్థం అయిందా?" ఈ మాటలు చెప్తోంచే సజ్జన్ కంఠరాలూ, వెన్నూ పూసా అదిరాయి. తాగా నిషాలో వున్న వానిలా అతని శరీరం కదులుతోంది. సజ్జన్ నిగ్రహించు కున్నాడు. అయినా మైమరపులో అతని వేలు స్విచ్‌మీదే వుండి పోయింది. బయట అలాగంట మోగుతూనే వుంది. సంచిత్‌సింగు తెలిసివుండి కూడా ఏమీ చెయ్యలేని స్థితిలో వున్నాడు. కాని అతని చేష్టల్ని బట్టి కన్య దృష్టి సజ్జన్ చేతివైపు వెళ్ళి ఆమె పకపక నవ్వుతూ అంది- "గంటను కొంచెం కనికరించండి",

అంతలో ఆరుగురు నౌకర్లు పరుగెత్తుకుంటూ వచ్చారు అక్కడికి. సజ్జన్ తన పరధ్యానానికి నవ్వు కున్నాడు. నౌకర్లకేమీ చెయ్యాలో బోధపడలేదు. ఎలాగైనా వాళ్ళ యజమాని మళ్ళీ మామూలు మనిషి అయ్యాడనీ ఇప్పటికి అసలైన ఆ యింటి కోడలు వచ్చిందని సంతోషించారు. నవ్వుతూ నౌకర్లతో సజ్జన్ అన్నాడు- "మీరు ఎలాగైనా వచ్చేసారు గనుక మీకు యీనాం ఇస్తాను, అందరికీ ఒక్క నెల అదనంగా జీతం. ఇకనుంచి వారి ఆజ్ఞపాటిస్తూ వుండండి".

కామ్రేడ్ మనస్తత్వం కల కన్య మనస్సుకు ఇది నచ్చలేదు. అంతలో కన్యవైపు చూస్తూ సజ్జన్ అన్నాడు– "ఇప్పుడు ఆజ్ఞా పించండి"

జీవితంలో అలవాటు పడని వాతావరణంలో అలవాటు లేని పెత్తనం చలాయించడానికి కన్యకు సిగ్గు అడ్డం వచ్చింది. ఆమె చెంపలు ఎర్రబారాయి. "ఏమిటీ తమాషాచేస్తున్నావ్. చెప్పు వాళ్ళకు" అని అంది.

అందరి ముందు మొండిగా తలవూపుతూ అన్నాడు సజ్జన్– "ఊహూఁ. నువ్వే చెప్పు" అని. ఎంతో కష్టంతో నౌకర్లను చూస్తూ చూడకుండా కన్య చెప్పింది– "ఏదో ఒకటి ఫలహారం చెయ్యడానికి తీసుకురండి. భోజనం.... గంటన్నర తర్వాత".

"ఏమి 'మెనూ' చెపుతారు?"

కన్య ధర్మసందేహంలో పడ్డది– "ఇవ్వాళ మీ యిష్టమొచ్చింది చేసి తీసుకురండి. నేనిక్కణ్నుంచి ఒంటిగంటన్నరకు వెళ్ళిపోతానని జ్ఞాపకం వుంచుకోండి"

నౌకర్లంతా వెళ్ళిపోయారు. ఇద్దరూ పరస్పరం సరికొత్త చూపులతో చూచుకున్నారు. సజ్జన్ పూర్తిగా సంబాళించుకోలేదు. అయినా కన్యతో తన కున్న అనుబంధాన్ని ప్రకటిస్తోంటే, కొత్తజీవితంలో అడుగు పెడుతుంటే అతను మళ్ళీ కాలు నిలదొక్కుకుంటున్నాడనిపించింది. చిత్రలోకలిసి అతను మొండిగా వ్యవహరించిన దానికి ప్రతిఫలంగా అతని అంతరంగిక చైతన్యం మీద జడత్వం అనే మందమైన పొర వ్యాపించిపోయింది. అది యిప్పుడు తొలగిపోతోంది. మంచుగడ్డలా గడ్డకట్టుకపోయిన అతని మనస్సు కన్య మాటలనే సూర్యరశ్మి తగలేసరికి కరిగిపోతూ తృప్తిగావుంది, జాగ్రత్తగావుంది. రుగ్మతను పోగొట్టుకుని స్వస్థతను తిరిగి పొందుతోంది.

సాలిగ్రాం. లాలాజానకీశరణ్‌లతో సఖ్యత కలపడానికి కర్నల్, సజ్జన్‌లను ఆరోజు రాత్రికే పిలిచాడు సేఠ్ రూప్‌రతన్. ఆ సందర్భంలో ఓ మంత్రిగారు కూడా వస్తే రావచ్చని తెలిసింది. ఈ సమావేశానికి వనకన్య రావడం అవసరం

అని ఆమె అభిప్రాయం తీసుకోవడం చాలా ముఖ్యమని కర్నల్ పట్టుపట్టాడు. సరే అనక తప్పిందికాదు సేత్ రూప్‌రతన్‌కి.

పగలంతా సజ్జన్‌కి హుషారుగా గడిచింది. గతించిన నాలుగురోజుల తన అనుభవాలు సజ్జన్‌కి చెప్పింది కన్య. ఎగ్జిబిషన్‌కి రమ్మనమని తాను ఎవరెవరికి ఇళ్లకు వెళ్ళి ఆహ్వానించింది, వాళ్ల వాళ్ల యిళ్లల్లో ఆమె ఏమేమి చూసిందీ అన్నీ చెప్పింది. ప్రదర్శనలో స్త్రీల సంభాషణలూ, వాళ్ళ నడవడికా వాటి గురించి తనకు ఎలాంటి అనుభవాలు కలిగిందీ ఇవన్నీ ఆమె పూసగుచ్చినట్టు చెబుతోంటే సజ్జన్ తన్మయత్వంలో తాను చేసిన పాపానికి పశ్చాత్తాపం చెంద డానికి కూడా వ్యవధి దొరకలేదు. కన్య ఎంతో ఉత్సాహంగా కనిపించింది. మాట్లాడుతోంటే ఆమె పారవశ్యం చెందుతోంది. ఏదో కలను పంచుకుంటున్న ట్లుగా వుంది. అతనిపై చెరగని ముద్రవేసింది కన్య. వెళ్ళేటప్పుడు ఆమె చేతి వేలి మీది రత్నాలు పొదిగిన వుంగరం ఎంతో అందంగా కనపడింది. కన్య వెళ్ళిపోయిన తర్వాత పగలంతా ఏదో పోగొట్టుకున్నవానిలా వున్నాడు సజ్జన్. బాబారామ్‌జీ గుర్తుకొచ్చారు. అతని ఆశ్రమానికి ఓసారి వెళ్ళి చూసి వద్దామని నిశ్చయించుకున్నాడు.

అపరాహ్నం ఎండ గోమతి ఒడ్డుపై పాకుతోంది. బాబాగారి ఆశ్రమం లోని పిచ్చివాళ్ళు పరుగుతీస్తున్నారు. బాబాజీ ఎంతలో నిలబడి వాళ్లు పరుగు తీస్తోంటే చూస్తున్నారు.

స్నానాల రేవుదగ్గరకు చేరుకున్నాడు సజ్జన్. బాబాగారిని కలుసుకోవ డానికి అతను ఎందుకోసం నిరీక్షిస్తున్నాడు. అయినా మనసు దిక్కపట్టుకుని ముందుకు వెళ్లాడు. బాబా సజ్జన్‌ని చూడగానే లోసినోటితో కిలకిలమంటూ నవ్వుతూ తన రెండు చేతులూ సాచాడు. బాబాకు నమస్కరిద్దామని ఒంగు తోంటే అతని భుజాలు పట్టుకుని లేపి గట్టిగా కౌగలించుకుంటూ మిమ్మల్ని చూస్తే కోటి రూపాయల ఖజానా దొరికినట్టుంది రామ్‌జీ. మీరు చాలా జాగు చేసారు ఇక్కడికి రావడానికి" అన్నాడు.

పిచ్చివాళ్లందరిచేత నియమానుసారంగా వ్యాయామం, దైవ ప్రార్థన చేయించి సర్పగంధి మూలికను తొలగించిన తర్వాత నిశ్చింతగా బాబా సజ్జన్ దగ్గరకొచ్చి మాటా మంతీ మాట్లాడాడు చాలా సేపటి వరకు. పశ్చాత్తాపానికి మించినది ప్రపంచంలో మరేమీలేదు. ఇదోరకంగా అనుభవమే అయిందని ఎందుకు అనుకోకూడదు? ఇప్పుడా అనుభవం వల్ల లాభం పొందండి. ఎందుకు విచారించడం? గతించినదాన్ని మరిచిపోండి. గతించబోయే రేపు గురించి ఆలోచించండి" అని సలహా ఇచ్చారు బాబారామ్‌జీ

బాబాదగ్గర శలవు తీసుకుంటూంటే "ఎవరి అభిప్రాయం ఎలావున్నా ఈ ప్రపంచం గురించి నాకొక నిశ్చితాభిప్రాయం వుంది రామ్‌జీ. నావరకు నేను జగన్మిధ్య అనుకోను. భగవంతుడు సత్యమైతే అతను సృష్టించిన ఈ చరాచర జగత్తు కూడా సత్యమే. అది సత్యమైనప్పుడు దాన్ని నిస్సంకోచంగా అనుభవించాలి. అసత్యం ఎక్కడున్నా సరే దానితో దృఢంగా పోట్లాడు'' అంటూ బాబా అతనికి ప్రబోధం చేసాడు.

అలాగేనంటూ సజ్జన్ బాబాగారి పాదాలు స్పృశించాడు. అతని మనస్సు బాగా తేలికపడింది. తన మనోవికారాల్ని బాబా ముందు వెళ్ళబోసి పరిశుభ్రం చేసుకున్నాడు. అతనికి ఊరట కలిగింది. చిత్ర గురించి బాబా ఓ అమూల్యమైన సలహా ఇచ్చాడు- "ఎక్కడైనా మంచి వరుణ్ణి చూసి ఆమెకు వివాహం చేసెయ్యి. ఆమె ఏదైనా పని చెయ్యతలచుకుంటే ఆమె నాపనిలో ప్రవేశపెట్టు. భరణానికి ఏదైనా ఇయ్యి. నిరుద్యోగిగా వుండతలచుకుంటె ఏమీ ఇవ్వొద్దు. పనికిమాలినవారి పట్ల జాలిచూపడం మానవత్వం అనిపించుకోదు''.

సాయంత్రం సజ్జన్ పెద్దమ్మ మేడకు వెళ్లాడు. మేడలో మహిళల మేలా జరుగుతోన్న కారణంగా వర్మ ఇంటిగుమ్మంలోనే కుర్చీ వేసుకుని కర్నల్ కూర్చుంటున్నాడు. సజ్జన్ కూడా అక్కడే కూర్చుండిపొయ్యాడు, సందంతా ఆడవాళ్లతోనూ గోలచేస్తోన్న కుర్రకారుతోనూ నిండిపోయింది. మేలా చాలా విజయవంతంగా నడుస్తోందని సజ్జన్‌కి చెప్పాడు కర్నల్. కార్యక్రమం యావత్తూ కన్యే చక్కగా నిర్వహిస్తోంది. కుట్టుపని చేసిన చాలా దుప్పట్లు,

దిండ్లూ, గలీబులూ, రుమాళ్లూ ఎగ్జిబిషన్‌లో చాలా అమ్ముడుపోయ్యాయి. ఆడ వాళ్ళు, టీ, కిళ్ళీ, కారంబజ్జీలు, శనక్కాయల దుకాణాలు పెట్టారు. కన్య యువ తులకు నాయికగా తయారైంది. ఎంగిలాకులు తీసి ఎప్పటికప్పుడు పారవేయ డానికోసం పదిమంది పిల్లలు ఎప్పుడూ సిద్ధంగా వుంటారు. వాళ్ళ నేర్పూ, ఓర్పూ వల్లనే అంత చిన్న జాగాలో అంత పెద్ద మేలా ఏర్పాటు చేసినా పరి శుభ్రతకి కొరతలేకుండా కాపాడకలుగుతున్నారు. పిల్లల నృత్యం, గానం, చిన్న చిన్న నాటక కార్యక్రమాలు బాగా సాగుతున్నాయి. అమ్మకం కూడా ప్రోత్సా హకరంగావుంది. ఇలాంటి ఎగ్జిబిషన్నే అమీనాబాద్‌లో యేర్పాటు చేయబోతు న్నానని మాటల సందర్భంలో కర్నల్ చెప్పారు. గోడల మధ్య నరకకూపాల్లో నలిగిపోతూన్న ఏంతోమంది స్త్రీలకు ఇలాంటి ప్రదర్శన ఎంతో సంతోషాన్నీ, పూరటనూ కలిగించింది. వాళ్లలో ఓ కొత్త వుత్సాహం వెల్లివిరిసింది. కర్నల్ హుషారుగా చెప్పుకపోతోంటే శ్రద్ధగా ఆలకిస్తున్నాడు సజ్జన్.

ఈ సందర్భంలోనే కన్యతో వివాహం చేసుకునే ప్రసక్తి కూడా తెచ్చారు కర్నల్. విశ్వనాథ్‌శాస్త్రి పండితులు గారిని సంప్రదించి ఈ సంవత్సరమే ఏదైనా మంచి ముహూర్తం చూసి కన్య వివాహం చేస్తానని కూడా చెప్పారు.

ఎనిమిది గంటలకు మేడలో కెళ్లారు కర్నల్, సజ్జనూ. కన్య కనిపించింది. అందరి జీవితాలు గతించిన ఒడుదుడుకుల్ని మరిచి కొత్త పుంతలొక్కాయి. రాత్రి సేఠ్ రూప్ రతన్ ఇంటికి కర్నల్, సజ్జన్, సాలిగ్రాం, ఓ మంత్రిగారు వచ్చారు. ఈసారి ఎలక్షన్లో సేఠ్‌రూప్‌రతన్ నిలబడలేదు. ఈ సంవత్సరం అమెరికా వెళ్ళి వ్యాపారాభి వృద్ధికోసం కొన్ని కొత్త మిషన్లు తేవాలను కున్నాడు అందువల్ల తాను ఏ వ్యక్తికీ సన్నిహితంగా కనబడదలచు కోలేదు.

"కర్నల్ సాహెబ్, మీరిలా చేస్తారని ఆశించలేక పోయాను" అన్నారు మంత్రిగారు.

"ఎలక్షన్లు ఇంకా నాలుగు రోజులే వున్నాయి. కనీసం అయిన వాళ్ళతో మొహమాటం కోసం అయినా- "అంటూ నమిలాడు సేఠ్‌రూప్ రతన్.

"మా అంతట మేమేం మాక్కుగిరలేదు. కాని ఎవరైనా పూరిక నే మాతో గిల్లి కజ్జా పెట్టుకుంటే మాత్రం-"

"మీరేగా ముందు గిల్లింది. విమానాల్లోంచి కరపత్రాలు విసిరేసింది ముందు మీరేగా!" అంటూ జైస్వాల్ అక్కసు వెళ్ళబోశాడు.

"మేము అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడాం"

"మేమంతా ఇక్కడ వున్నాంగా. నువ్వో, మహీపాలో, సజ్జన్- మీలో ఏ ఒక్కరూ వచ్చి ఫలానా సంగతి అని చెప్తే అంతా నేను చక్కదిద్దే వాణ్ణి కాదా!" అంటూ సేఠ్ రూప్ రతన్ తన తటస్థవైఖరి ప్రదర్శించాడు.

"ఇవన్నీ పైపై మాటలండి. సాలిగ్రాం ఎలక్షన్లో గెలవడం కోసం ఓ స్త్రీ ప్రాణాల్ని బలి తీసుకున్నారు".

"అలాగా, రేపు ఈ మాట కూడా అంటావు" అంటూ ఏదో అనబోయి మళ్ళీ తమాయించుకుని పలాస్త్రీ వున్న కాలుమీద చెయ్యినిమురుకుంటూ "అలా చేసినందువల్ల నాకు ఒరిగేది ఏముంది గనక! పోలీసులే-" అంటూ ఆగి పోయ్యాడు సాలిగ్రాం.

"నాయకులు గారూ, ఈ రామాయణాలన్నీ నాకు నేర్పడానికి ప్రయత్నించకండి. ఈ దొంక తిరుగుడు మాటల్ని నేను బాగా కాచివడపోసినవాణ్ణే లెండి" అన్నాడు కర్నల్.

"సరే ఇప్పుడవన్నీ తవ్వుకున్నందువల్లకలిసివచ్చేదేమిలేదు. గతజల సేతు బంధనం అన్నారు పెద్దలు. జరిగింది మర్చిపోవడం ఉభయులకూ శ్రేయస్కరం" బీడిప్పులు కొరుక్కుని తింటోన్న మంత్రివర్యుల మధ్యవర్తిత్వం చేసారు. "మీరంతా ఒక్క విషయం గమనించాలి. కాంగ్రెసు సంస్థ మంచిదో చెడ్డదో కాని దేశంలోని ఏకైక జాతీయ రాజకీయ సంస్థ కాంగ్రెసు ఒక్కటే సుమా! ఇప్పుడు కాంగ్రెసు సంస్థకు హాని చేసామంటే దేశద్రోహం చేసినట్లే".

"అలాగే నేనూ అంటానండీ. స్త్రీలపై అఘాయిత్యాలు చెయ్యడం మానవత్వానికే గొడ్డలిపెట్టు" అంటూ కన్య కూడా మంత్రిగారి మీద ఓ విసురు విసిరింది.

"ఐహూలా మీరు కమ్యూనిస్టు పార్టీ--"

"ప్రతి విషయాన్నీ పార్టీ దృక్పథంతో చూస్తున్నారు. నా ఒదిన ఏ పార్టీకి చెందిన వ్యక్తి కాదు. నా తండ్రిగారు కాంగ్రెసును ఎప్పుడూ సమర్థించి వుండలేదు. నా ఇంట్లో 'ఇప్టా' రిహార్సల్స్ అయివుండకపోతే ఈ వ్యవహారంలో అసలు మీ కింత ఆసక్తే వుండేదికాదు--"

"సరే పోనీయ్. ఇప్పుడామాటలు ఎందుకు?"

"ఎందుకవసరం లేదు. అన్నిటికి మూలకారణం అదేగా?"

"నువ్వూ పక్కా కమ్యూనిస్టయ్యావు కర్నల్!"

"అదేరో ఠిట్టులా మీరు మాట్లాడుతున్నారే" అంటూ సజ్జన్ సేఠ్ రూప్ రతన్ని ఖండించారు.

"సరే చెప్పయ్యా" అంటూ మంత్రిగారు నవ్వుతూ - "మా సజ్జన్ అందరి చిత్రాలు గీస్తూ గీస్తూ ఎవరికో చిత్రం అయిపోయ్యాడని అనుకున్నాం" అంటూ చమత్కరించారు. మంత్రిగారి చమత్కారానికి సేఠ్ రూప్‌రతన్, సాలిగ్రాం అక్కడచేరిన మిగతా వాళ్ళు ముసిముసినవ్వులు నవ్వారు. ఆ నవ్వును కలుపుతూ మంత్రిగారు మరోమాట కన్యతో చెప్పారు. "వనకన్యగారూ, నేను మిమ్మల్ని మీ పార్టీ వారినీ అభినందిస్తున్నాను. మా పాత స్నేహితుల్లో మీరు చీలిక తీసుకరాగలిగారు".

వెంటనే అందుకుంది కన్య - "మీ మనుష్యుల్ని చీల్చడానికి మీరంతా అవకాశం ఇచ్చినందుకు మిమ్మల్నే అభినందించాలి. అయినా ఓ సత్యాన్ని మీ ముందు దాచదలచుకోలేదు. నేను కమ్యూనిస్టు పార్టీ మెంబర్నికాదు, వాళ్ళేమీ నన్నూ గూఢచారిణిగా మీ దగ్గరకు పంపనూ లేదు". ఆ మాటలు అంటోంటే కన్య ముఖం రోషంతో ఎర్రబారింది.

మంత్రిగారు కొంచెం గంభీరం అయ్యారు. మిగతా వాళ్ళంతా మంత్రి గారి ముఖం కేసి చూడసాగారు. కర్నల్ నవ్వుతూ ''ఇంకేమైనా వింటారా?" అని అడిగారు.

"నేనెవరికీ వినిపించాలనీ, ఎవర్నీ కించపరచాలన్న ఉద్దేశంతో ఈ మాట అనలేదు" అంటూ "నాకు మాత్రం నిజంగా చెడ్డగా తోచింది''అని అంది కన్య.

కన్య మాటలకు వంతపాడుతూ సజ్జన్ ఆమె వైపు చూస్తూ ''ఇంకా మాటుగా వినిపించు. మినిస్టరుగారైతే ఏం? పాత స్నేహితుడేగా" అన్నారు.

"అహ్హహా'' అంటూ మినిస్టరు గారు సజ్జన్ మాటను సమర్థిస్తున్నట్టుగా విరగబడి నవ్వారు.

''చేతికి వచ్చిన ఈ అవకాశాన్ని జారవిడవదలచుకోలేదు సేఠ్‌రూప్ రతన్. అతను కూడా ఉల్లాసంగా సకిలిస్తూ నాలుగు చెణుకులు విసిరాడు - "వీరికి మాకు పరిచయం ఈనాటిదా! మహీపాల్‌కూ నాకూ స్నేహం మొదలైనప్పటి నుంచి వీరితో మాకు పరిచయం".

మినిస్టర్ గారి స్నేహితుణ్ణి తన కొడుగ్గా కలుపుకోవడంతో లాలాజానకి శరణ్ కూడా జాగుచెయ్యలేదు. కాంగ్రెసుపార్టీ చరిత్రనే వర్ణిస్తూ వారిపొగడ్తలకు మరింత రంగుపూసాడు సాలిగ్రాం. మంత్రిగారు నవ్వుతూ, వెళ్ళడానికి లేచారు. వారిని సాగనంపడానికి మిగతా వారంతా కుర్చీల్లోంచి లేచారు. కుంటుతోన్న సాలిగ్రాం కూడాలేచి నిలబడుతోన్నట్టుగా శరీరాన్ని కుర్చీలోంచి లేపి మళ్ళీ కూలబడ్డాడు. సాలిగ్రాం వీపు తట్టి ''ఇంక ఈ వ్యవహారం ఇంతటితో ముగిసినట్టే" అంటూ మంత్రిగారు కర్నల్‌వైపు తిరిగి "మీ మీనా బజారులో కూడా మా పార్టీ గురించి కొంతైనా ప్రచారం చేస్తే బావుంటుంది. ఇవ్వాళ సాయంత్రమే కొన్ని పోస్టర్లు నీ దగ్గరకు పంపించే యేర్పాటు చేస్తాను'' అని అన్నారు.

"చూడండి. నేను సిద్ధాంతం గురించి మాట్లాడాను. కాని మీరు దాన్ని పార్టీ దృక్పథంతో తీసుకుని- "అంటూ ఆగిపోయింది కన్య.

"నువ్వు చెప్పేవదానితో నేను ఏకీభవిస్తున్నాను, ఈ సాంస్కృతిక మేళాను పార్టీ ప్రచారానికి మంచిగా వుపయోగించ డానికి వీల్లేదు" అంటూ మంత్రిగారు సజ్జన్ కన్యా ఇద్దరివైపు ఓసారి చూసి" మీరిద్దరూ ఒకరిలో వున్న లోటును మరి ఒకరు పూర్తి చేస్తోన్నట్లుగా కనపడు తున్నారు. మరి వివాహం ఎప్పుడు చేసు కుంటున్నారు?" అని ప్రశ్నించాడు.

మంత్రిగారి ప్రశ్నవిని సేఠ్‌రూప్ రతన్, లాలా జానకీశరణ్ ఇద్దరూ నవ్వారు. మంత్రిగారేదో ఛలోక్తి విసిరినట్టుగా వాళ్లు భావించి నట్టుంది. వాళ్ల నవ్వగానే తన ఛలోక్తిలోని అర్థం మంత్రిగారి స్ఫురణకొచ్చినట్టు వచ్చింది. ఆయనా ఓ చిరునవ్వు నవ్వారు.

"ఎంతో ఆలస్యం లేదులెండి. చాల త్వరలోనే నగీన్‌చంద్ దగ్గర నుంచి తమకు ఆహ్వాన పత్రిక రాబోతోంది" అన్నాడు కర్నల్.

"శుభం. మీ ఇద్దరినీ అభినందిస్తున్నాను" అంటూ మంత్రిగారు సజ్జన్‌తో కరస్పర్శచేసి వెళ్ళి పోయారు. ఇన్నిరోజుల నుంచి వాతావరణంలో వ్యాపించి వున ఉద్రిక్తత ఒక్క రాత్రిలో సడలి పోయింది.

# 34

వర్మ యింటి ముందు గుమ్మానికి దగ్గరగా ఓ పెద్ద బెంచీ, రెండు కుర్చీల మీద వర్మ, శంకర్‌లాల్, సజ్జన్, కర్నల్, మహీపాల్ కూర్చుని వున్నారు. ఇవాళ ఉదయమే స్వగ్రామం నుంచి తిరిగి వచ్చాడు మహీపాల్. వర్మకు మగపిల్లవాడు పుట్టిన సందర్భంలో ఇవాళ ఆగవరోజు పూజకు సజ్జన్ మిత్రుడిగా వచ్చాడు మహీపాల్. పూజా తతంగం అయిన తర్వాత అందరూ భోజనం చేసారు. మగవాళ్ల భోజనాలు అయ్యాయి. ఆడవాళ్ళ పంక్తి కూర్చుంది. లోపల ఢోలు మీద ఎవరో పాడుతున్నారు వాళ్ళు పాడే జానపద గీతాల్ని దిండుమీద మోచెయి ఆన్చి అజంతా రేడియో ఇంజనీరింగ్ వర్క్స్

లెటర్ ప్యాడ్ మీద నెమ్మదిగా రాస్తున్నాడు మహీపాల్. అది చూసి నవ్వుతూ అన్నాడు కర్నల్—"ఓరేయ్ నాన్నా, నీవు సాహిత్యం రాయడం మానేసి పాట లన్నా రాస్తూ వుండరా. బాగా గిరాకైనా వుంటుంది". మహీపాల్ జవాబు ఇవ్వకుండా తన పని తాను చేసుకుంటున్నాడు. సజ్జన్ కూడా కర్నల్ వైపు చూస్తూ తమషాగా అన్నాడు—"చూడు కర్నల్, నువ్వన్న దానికి బదులు కూడా ఇవ్వకుండా ఎలా వున్నాడో!"

"ఏమని బదులు ఇస్తాడు? వాడి అలవాటు అంతే. ఆరోజు చూడరాదూ, రూపాయిన్నర ఖర్చులేని టెలిగ్రాం కొట్టాం. వీళ్ళందరినీ చూసి హడలి పోయ్యాను. ఏమైనా కరపత్రలు గట్టా రాయాల్సివస్తే మహీపాల్ వస్తే బావుం టుందని టెలిగ్రాం ఇస్తే మహా ప్రభువులు సమాధానం కూడా రాయలేదు.

"ఆరేపోరా, పుట్టింట్లో మృష్టాన్నం తిని కూర్చుంటోంటే అవన్నీ ఒదులుకుని నీ కరపత్రాలు రాయడానికి వస్తాననుకున్నావా?"

"మరి ఇప్పుండెదుకు దయచేసినట్లో?"

"పెద్దమ్మ విందు భోజనం చెయ్యడానికి"

"పెద్దమ్మ నీకేమైనా కుంకం పెట్టి పిలిచిందట్రా? నేనేదో తమాషాగా అంటే పళ్ళగెత్తుకుంటూ వచ్చావు".

"అరే పిచ్చోడా, బ్రాహ్మణులు ఎవరైనా పిలుస్తేనే వచ్చేది... అహా! పాట ఎంత బావుంది! అద్భుతంగా వుంది!"

అంతలో లోపల నుంచి మరో జానపద గేయం అక్కడ కూర్చున్న వాళ్ళందరి మనస్సుల్ని ఆ కట్టుకుంది.

ఆచరణం రాసుకుంటూ ఆపుకోలేక 'వహ్వా వహ్వా' అంటూ పెద్దగా అరి చాడు మహీపాల్. మహీపాల్ హుషారుకు నవ్వుతూ కోపాన్ని నటిస్తూ కర్నల్ "ఆఁ చాలబావుంది లేవయ్యా, ఇక బడాయికోరుతనాన్ని కాస్త తగ్గించు, పనిలేని మంగలి పిల్లి తల..." అంటూ మహీపాల్ చేతిలోంచి కాగితం లాక్కు-

సాగాడు. "అరరే, ఏం చేస్తావేంటిరా. దాంతో నాకు పనుంది" గాభరాగా అన్నాడు మహిపాల్.

వెంటనే సజ్జన్ అందుకున్నాడు- "సర్వేశ్వరా అను. పెద్దమ్మ వుంది చూసావూ. చాలా వింత కేరక్టరనుకో!"

"ఆమె గురించి అడగనేవద్దు. ఈ పిల్లాడు పుట్టినప్పటి నుంచి మమ్మల్ని వేధించుకు తింటోందనుకోండి. ఆమె చేసిన పేచీలు కక్కలేకుండానూ మింగలేకుండానూ వున్నాము" అన్నాడు వర్మ.

"ఏం ఎందుకు? ఏం జరిగిందేమిటి?" అంటూ ఆశ్చర్యంగా అడిగాడు కర్నల్. దానికి నవ్వుతూ వర్మ చెప్పాడు- "ప్రతిరోజూ మేం కులం లేనోళ్ళం అనీ, మతం లేనోళ్ళం అని ఏమేమో అంటుంది. మమ్మల్ని ఆమె సేవకులుగా ఖరారు చేసిందనుకోండి. పిల్లాడంటే ఆమెకు పంచప్రాణాలు. వాడి పోషణా, పెంపకం అన్నిటికీ పూర్తి బాధ్యత ఆమె స్వీకరించింది. రకరకాల పాలు, పిండివంటల్తో, బాదంపప్పు, నెయ్యితో ముంచెత్తేస్తోంది మా అత్తి. పిల్లాడికి బాగా పాటు ఇస్తాయని నోట్లో కుక్కేస్తుంది."

వర్మ మాటలకు అందరూ నవ్వసాగారు. లోపల నుంచి ఇంతలో ఎవరో పురిటిస్నానం పాట అందుకున్నారు.

పెద్దమ్మ మేడంతా ఇవ్వాళ కళకళలాడిపోతోంది జనంతో. తార అద్దెకున్న భాగంలోని వంటింట్లో గాడిపొయ్యి తవ్వారు. హల్వా తయారు చేస్తున్నారు వంటవాళ్ళు. రెండో నడవాలో ఢంగు ఢంగుమని డోలు మోగుతోంది. పెద్దమ్మ ఇంట్లో ఆడవాళ్ళు ఒకటే సందడి. గోకులద్వారా ధర్మకర్త, పూజారి కూడా వచ్చి కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. కొంతమంది ఆడవాళ్ళు పళ్ళాల్లో తినుబండారాలు తీసుకుని పై అంతస్తులోని గదిలోకి వెళుతూ వస్తున్నారు. బ్రాహ్మణుల సంతర్పణకు, సత్సంగ మండలికి భోజనానికి ఆహ్వానం వెళ్ళింది. పెద్దమ్మ మొత్తం నూట ఒక్క బ్రాహ్మణులకు భోజనం చేయించింది. చుట్టపక్కాలూ, పొరుగింటి వాళ్ళూ, చుట్టుపక్కలవారందరినీ భోజనాలకు

పిలిచింది. తన సవతి ఇంటికి కూడా భోజనానికి ఆహ్వానం పంపింది ఇప్పుడు
ఆడవాళ్ళు పంక్తిభోజనానికి కూర్చుంది. ఎటుచూసినా పెద్దమ్మ "ఛటీ భోజనం"
గురించే చర్చించుకుంటున్నారు. ఆమె మనస్సులో ఆకస్మాత్తుగా వచ్చిన ఈ
ఈ మార్పుకు అందరూ ఆశ్చర్యపడుతున్నారు. నందో అయితే కుళ్ళిపోయింది.
టీ. మూల ఒదిగి కూలబడింది. ప్రక్కనే పనిచేసుకుంటోన్న ఆడవాళ్లతో
పెద్దమ్మ మీద దాడీలు చెబుతోంది.

చిన్నకోడలు సరూప్, కన్య తార ఇంట్లో కూర్చుని మాట్లాడుతున్నారు.
తారతో ఇంత తీరిగ్గా కూర్చుని మాట్లాడేందుకు మొదటి సారి అవకాశం లభిం
చిందికన్యకు. చిన్నకోడల్ని అయితే ఆమె ఇదే ప్రథమంగా చూడ్డం. పెద్దకోడలే
ఈసందర్భంలో ఇక్కడ వుంటే ఎంత ఆనందించేదో! పెద్దామె పురాణం ఇవ్వాళే
తెలిసింది. కన్యకు. తన భర్త శంకర్‌లాల్ పెద్దామెను చూడ్డానికి ఇవ్వాళే విర
హేశ్ ఇంటికి వెళ్లాడని చెప్పింది చిన్నకోడలు. 'ఆమె చాల విచారంగా వుందట.
విరహేశ్ ఇంటికి రెండు నిముషాలకన్న ఎక్కువసేపు ఆమెతో మాట్లాడనివ్వ
లేదట. ఇంతకుముందు మనమంతా స్నేహితులం అని కోడలుకోని ఇప్పుడేమో
అతణ్ణి చూడగానే మొహం చిట్లించుకున్నాడట. ఇకముందు ఆమెను చూడ్డానికి
రావద్దని హెచ్చరిక కూడా చేసాడట విరహేష్ ఇంటి వాతావరణం చాలా
నరకప్రాయంగా వుందని శంకర్‌లాల్ చెప్పారట, అతనికి ఒకటే గది. పెద్దదే
కాని కూలిపోయేలా వుందట. ఆ గదికి మధ్య ఓ చినిగిన తెరకట్టి రెండుగా
చేసారట.శంకర్‌లాల్ అతని యింటికి వెళ్లినప్పుడు ఇద్దరిముగ్గురు లుచ్చాగాళ్లతో
కూర్చుని కలిసి తాగుతూ మరికి కూతలు వాగుతున్నారట. ఆమె కథంతా విని
క్షోభపడింది. కన్య. నేటి సాంఘిక వ్యవస్థలో స్త్రీగా పుట్టడం శాపం, పెద్దకోడలు
జీవితం చివరికి ఎలా అంతం అయ్యేది ఆమె కళ్లు స్పష్టంగా చూస్తున్నాయి. కుళ్లి
కుళ్లి, కృషించి, ఎండి, కరడు గట్టి ఆమె జీవితం భూమి అనే ఈ పూతోటలో
ఎప్పుడో రాలిపోతుంది. తన చనిపోయిన వదినిగారు జ్ఞాపకం వచ్చి పెద్దామెవున్న
పరిస్థితిని పోల్చుకుంటూ విషాదంలో మునిగిపోయింది కన్య. సర్వసాధార
ణంగా స్త్రీ, పురుషుడూ పరస్పరం గౌరవించుకోరు. ఆర్థికంగా ఆడది మగాడిపె

ఆధారపడివుంది. ఆమెకు స్వతంత్రమైన వ్యక్తిత్వం అంటూ ప్రత్యేకంగాలేదు. ఈ దేశంలోని స్త్రీ సమాజం దుఃఖం అనే ఈ కొండను ప్రాచీన కాలం నుంచి మోస్తూవుంది. సీత తప్పించుకోలేకపోయింది, ద్రౌపది తప్పించుకోలేకపోయింది.

ముగ్గురు నలుగురు స్త్రీలు దోలుమీద తన్మయత్వంతో పాడుతున్నారు. కాని వాళ్ల కంఠాలకు పొంతన కుదరడంలేదు. ఎదుటి నాలుగు పళ్లు వూడిపోయి మిగిలిన పళ్లన్నీ కాసు నమిలి నమిలి గారపట్టి అరిగిపోగా వాటి మధ్య నుంచి వస్తోన్న స్వరం తొస్సులోయి సన్నాయికి పక్కన బాకావూదుతున్నట్లుగా పాడుతున్నారు. ఏభై అయిదేండ్ల ప్రాయం వున్న నుర్మిలీ, రంగీలి, కల్లోకట్ట్, సుందర్ అయితే స్వరాలాపన మీద స్వరాలాపన చేస్తోంది విసుగూ విరామం లేకుండా. ఇవాళ రెండు చుక్కలు ఎక్కువపట్టించినట్లుంది కాటోలు షరబతీ కన్న నాలుగు ఆకులు ఎక్కువగానే లాగిలాగి పాడుతోంది. ఇప్పుడు పేరంతా షర్బతీదే. షర్బతీ నగలు వేయించుకునే ఓ దబ్బుగల ఆసామీ ఏడవసారి వివాహం చేసుకొన్న బజారు వేశ్య. మొగుణ్ణి ఎప్పుడూ నెత్తిమీద మొట్టుతుంది. పట్టపగలే దాని రంకుమగళ్ళు విచ్చలవిడిగా వస్తూరు పోతారు. దాని వళ్లంతా సొమ్ములే పాటన్నా ధోలక్ వాయించడమన్నా చెవి కోసుకుంటుంది. పెద్ద పెద్ద వాళ్ళ ఇళ్లల్లో పాడుతుంటుంది. అందుకే పాతకాలం సుందర్‌కి అది అంటే తగని ఈర్ష్య. ఇక మంజీరా వాయించేది కిసన్‌సింగ్‌గాడి పెళ్లాం. దాని బుగ్గలు అంజీరా కాయలకన్నా పెద్దగా ఉబ్బుగా వుండి పక్కలకు వేలాడుతూవుంటాయి. ఓ పెద్ద అరుగులా కూర్చుంది. సుందర్, షర్బతీలు పోటీపడి పాడుతోంటే ముసి ముసి నవ్వులు నవ్వుతోంది. కిషన్‌సింగ్‌గాడి పెళ్ళాం, నారదమహర్షిలా తంపులు పెట్టడంలో అందెవేసిన చెయ్యి ఆమెదని ఆ వాడంతా తెలుసు. అందరినీ పోట్లాడిస్తుంది కాని మనస్సులు విరగ్గొట్టదు. ముప్ఫై నలభై సంవత్సరాల నుంచి ఇక్కడే వుంటూవుంది. బహుశా అప్పటి నుంచీ ఆమె విధవరాలు కూడాను. ఎవరో పేరూ ప్రతిష్ఠవున్న పండితులగారితో ఆమెకు బాదరాయణ సంబంధం వుందని ఆనోటా ఆనోటా వినికిడి. పడమటి క్షత్రియులూ, అగర్వాలాల ఇళ్లలోని ఆచారాలూ, రివాజులూ అన్నీ దానికి కంఠతా. దిగదుడుపూ, మందు మాకూ పెట్టడం, మంత్రాలు వేయడం దానికి బాగా వచ్చు. ఎక్కడికి

వెళ్ళినా ఆమెకు ఆదరణవుంది. ఎవరికైనా సలహా ఇవ్వడంలో ఎంతో నిజాయితీ. ఎంతో మధురభాషిత. పెద్ద పెద్ద వాళ్ళతో కూడా ఛలోక్తులు మాట్లాడంలో ఎంతో చురుకైనది. గోకుల్ ద్వారాలో పనిచేసే పూజారికూడా అక్కడే కూర్చున్నాడు. పొదవుపాటి గడ్డాన్ని, వుబ్బివచ్చిన కంఠరాల్ని నిమురుకుంటూ వాళ్ళు పాడుతున్న తీరు చూసి వుండబట్టలేక పోయ్యాడు అమ్మలక్కల్లా చేతులు సాచి యిద్దరు గాయకమణుల్ని విమర్శించాడు- "దావండి ముండల్లారా, మీకు పాడడమే చాతకాదు. నేనూ కుర్రతనంలో పాడాను. రాసమండలిలో శ్రీకృష్ణుడి వేషం వేసేవాణ్ణి".

"అయితే మరి ఈ వేషం వేసుకుని మాముందుకెలా తయారయ్యావ్? పది బారల గడ్డం వుంచుకుని నా పాటలో తప్పులు పడుతున్నావా?" షర్బతీ కోపంగా పల్చని కంఠంతో తీక్షణంగా అంది.

షర్బతీ యౌవనాన్ని చూసి కరిగిపోయేరకం కాదు పూజారి. మళ్ళీ చెయ్యి చాపి అన్నాడు- "వెధవముండలో తప్పులు వెతకరాదా ఏం? నీది కంఠమా? రైలు కూతలావుంటేను."

ఆ మాటలకు పక్కన వున్న స్త్రీ సమాజం ఫక్కున నవ్వింది. దాంతో షర్బతీకి వేడి అందుకుంది. కిసన్‌సింగు పెళ్ళాం ఇదే సందు దొరికిందని తోటి గాయకీమణుల మీద విసుర్లు విసరుతూ "అంత దౌర్జన్యం చెయ్యకండి. ఆమెను కోరి పిలిపించుకునే వాళ్ళకు మళ్ళీ తెలిసిపోయిందంటే-" అంది పూజారితో.

"ఇదంటే నాకు భయంలేదు. దీని భక్తులంటే అంతకన్నా లేదు. దీనికి మంచి పాటలూరావు. పాడేవిధానమూ తెలియదు" అన్నాడు.

"బాగుంది మీ వరస. ప్రపంచం అంతా షర్బతీ గాయక శిఖామణి అని కోరై కూస్తోంటే ఈమెకు పాడడమే చేతకాదని పూజారి అంటున్నారు" అంటూ కిసన్ సింగు పెళ్ళాం అర్థగర్భంగా వ్యాఖ్యానించింది.

షర్బతీని విమర్శిస్తోంటే సుందర్‌కు మహదానందంగా వుంది. 'ఈ పూజారి గోకులద్వారాలో పాడగా విన్నాను, కంఠం బావుంటుంది" అంది సుందర్.

"అరే, అక్కడయితే వృత్త భజన్లేగా పాడేది. ఆ ఢోలక్ ఇలా ఇవ్వు" అంటూ ఢోలక్‌లా వున్న తన కండల్ని వూపుకుంటూ పూజారి లేచాడు. షర్బతీ చేతిలోంచి ఢోలక్ లాక్కుని కళ్ళుమిటకరిస్తూ 'ఇలానేనా ఢోలక్ పట్టుకుని వాయించేది. పాటపాడేదెవరు ఇదా సుందర్, పద, ఏదీ ఆ చరణం ప్రారంభించు" అన్నాడు.

పూజారి చెయ్యి నిజంగా కళాకౌశలాన్ని పుణికిపుచ్చుకుందే, ఢోలక్ కొట్టాడు. ఏమాత్రం మార్దవం లేకుండా సుందర్ కళం ఎత్తింది పాట పాడ దానికి. పూజారికి ఎలాపాడాలి ఆ నొక్కులన్నీ కొద్దో గొప్పొతెలుసు. పనికిరాని స్వరవిస్తరణలు చేసి సభను రంజింప చెయ్యాలని ఆరోహణ అవరోహణ క్రమంలో రాగా లాపనచేసి సాహిత్యాన్ని అందుకుని సాగదీయడం మొదలు పెట్టాడు.

ప్రపంచంలో పుట్టాం సుఖదుఃఖాలు పంచుకోవడానికి
నాలో కోరిక కల్లుగు తోటల్లో షికారు చేయాలని
ఓనా ప్రియుడా ! నన్ను షికారుకు తీసుక వెళ్ళు
నాలో కోరిక చెరువుల షికారు చెయ్యాలని
ఓనా ప్రియుడా ! నన్ను గుడ్డలు వుతకడానికి తీసుకెళ్ళు.

బయట కూర్చున్న మహిపాల్ అస్వాభావికంగా ఒక్కసారి పెద్దగా అట్టహాసం చేసాడు ఆ నవ్వుకు గదిలోని వాళ్ళంతా విస్తుపోయారు. శంకర్ లాల్ వర్మ కోరికపై సజ్జన్ తన మధుబృందావనం యాత్రా విశేషాలు వాళ్ళకు చెబుతున్నాడు. అలాంటి సందర్భంలో అనాలోచితంగా మహిపాల్ నవ్వడం అర్థంలేనట్టుగా తోచింది.

"మళ్ళీ ఏ గొంగళి పురుగు దూరిందోయ్" అంటూ గట్టిగా అన్నాడు కర్నల్. సజ్జన్ రసవత్తరంగా యాత్రానుభవాల్ని వర్ణిస్తోందే తాను కూడా లీనమై వింటున్నాడు. అరికాలిమీద చెయ్యి నిమురుతూ మహిపాల్ కర్నల్ ఎత్తిపొడుపుని పట్టించుకోకుండా తన వూహా కల్పనను బయటపెట్టాడు- "ఈ

పదం నిజంగా ఏ గృహిణో రాసివుండాలి. గాలి వెలుతురూ లేని చీకటి కొట్టుల్లో ఇంటి పనుల్లో సతమతమౌతూ జీవితానందాన్ని చవిచూడటానికి నోచుకోని ఏ నాయికో చెరువులకు షికార్లకు తీసుకెళ్లమని మగణ్ణి కోరుతోంది. పాపం హనీమూన్‌లో కూడా గుడ్డలు వుతుక్కోడంలాంటి ఇంటిపనులే జ్ఞాపకం వస్తున్నాయి, ఆమెగారికి. మన సమాజంలో ఆడజాని హృదయం విప్పి విరబోసుకునేది ఇటువంటి జానపద గీతాల్లోనే కదా!"

"కొంచెం ఇలా వస్తారూ" అంటూ వనకన్య తలుపుదగ్గర నిలబడింది. ఎవరా పిలుస్తూందన్నట్లు అందరి కళ్లూ తలుపువైపుగా తిరిగాయి. సజ్జన్ ముఖంలో కొత్త వెలుగు వచ్చింది. వెంటనే లేచి వెళ్ళాడు.

"ఏం చిన్నో మామూలు ముట్టిందా?" అని నవ్వుతూ అడిగాడు కర్నల్

"అప్పుడే ఎక్కడ అన్నగారూ, సాయంత్రం కదా పూజ జరిగేది" అంటూ సజ్జన్‌తో మెల్లిగా, "పీళ్ల చంటివాడికి ఏదైనా బహుమతి ఇవ్వాల్సి వుంటుంది. మేనత్త అయ్యానుగా".

"ఇవ్వాళే యివ్వాలా?"

"ఇవ్వాళే కావాలి మరి. నాకివ్వడానికి తార ఖరీదైన బెనారస్ పట్టు చీర తీసుకుంది"

"ఏం కర్నల్, వివాహానికి ముందే భార్యా భర్తలు ఇలా సీక్రెట్‌గా మాట్లాడుకోవచ్చా" అంటూ మహిపాల్ ఓ చెణుకు విసిరేసరికి అందరూ పక్కున నవ్వారు. కన్య ముఖం సిగ్గుతో గులాబీరంగైంది. సజ్జన్ నవ్వుతూ సమాధానం చెప్పాడు- "భార్యా భర్తలు ఏకమైపోతే పౌరోహితులవారేంచేస్తారు!"

ముంగిలి అంతా మరోసారి నవ్వుతో ప్రతిధ్వనించింది కాబోయే భర్తతో సాధికారంగా ఇప్పుడు మాట్లాడగలుగుతున్నానన్న పారవశ్యంలో కన్య సజ్జన్‌వైపు సగర్వంగా చూసింది. భర్త పాత్రను పోషిస్తూ సజ్జన్ కాబోయే అర్ధాంగితో వ్యవహారం చర్చిస్తున్నానన్న అనుభూతి అతనికి కొత్త స్ఫూర్తిని తెచ్చింది అమాయకత్వం కూడా ఒక్కొక్కప్పుడు ముచ్చటగా వుంటుంది.

భర్తగారిని పురమాయించడానికి వచ్చి కూడా సంకోచాన్ని కన్య పూర్తిగా విడనాడలేకపోయింది. పిల్లవాడికోసం ఓ తులం బంగారం గొలుసూ, మువ్వలూ తెచ్చింది. శంకర్‌లాల్ భార్య సరూప్. సరూప్, తార మాట్లాడుతో మధ్య మధ్య "మా వారు....మా ఆయన" అంటూ ప్రయోగిస్తూంటే ఆమెలో తనకు కాబోయే భర్తను కూడా అలాంటి సంబోధనలు చేస్తూ పురమాయిద్దామన్న ఉత్సాహాన్ని రేకెత్తించి తలుపుదాకా తీసుకొచ్చింది. తీరా ఇక్కడికి వచ్చిన తర్వాత వాళ్ళు తెచ్చిన దానికన్న విలువైన వస్తువు మనం తేవాల్సి వుంటుంది అని చెప్పడానికి సిగ్గూ సంకోచం అడ్డం వస్తున్నాయి. కన్య ఇప్పుడు ఓ ఉన్నతాధికారికి వాగ్దత్త. ఈ విషయాన్ని ప్రపంచం అంతా చాటాడు సజ్జన్. సజ్జన్‌ని తను ఎలాగైనా ముక్కుకు తాడేసి కట్టివేయాలని నిశ్చయించుకుంది. మధ్యతరగతి కుటుంబంలో పుట్టి అదే వాతావరణంలో పెరిగిన అభ్యుదయ భావాలు కలిగివున్న వనకన్య కొంగ్రొత్త వుల్లాసంతో హుందాతనాన్ని ప్రదర్శించడంలో పోటీపడాలన్న వుత్సాహంలో ఉరకలు వేస్తోంది. మనసులోని మాట మనసులోనే దాచుకోలేకపోతోంది. చెప్పనూలేకపోతోంది. సజ్జన్ ఏమి తెమ్మంటావని అడిగీ అడగడంతో అనుభవలేమితో తడబడుతూ ''ఏమి చెప్పమంటావ్ ! వాళ్ళేమో నా కోసం ఖరీదైన చీరె తీసుకొచ్చారాయె సరూపేమో బంగారం మువ్వలపట్టెడ తెచ్చిందాయె నువ్వే యోచించు. నీకూ తోచకపోతే అన్నగారున్నారుగా, వారిని సంప్రదించండి'' అని పాఠం పప్పచెప్పినట్లు పప్పచెప్పేసి అక్కణ్ణుంచి తుర్రుమంది.

ఇంట్లో ఢోలక్ మోగుతూవుంది. కన్యకు జీవిత భాగస్వామి కాబోతోన్న సందర్భంలో లౌక్యవ్యవహారాన్ని తెలుసుకుంటున్నాడు సజ్జన్. కన్య, సజ్జన్ ఇందాక పరస్పరం సంప్రదించుకుంటూంటే "ఛఠీ" అంటే ఏమిటని వర్మ మహీపాల్‌ని అడిగాడు. దానికి సమాధానం చెబుతూ మహీపాల్ "నేనీ విషయంపై ఎక్కువ శ్రద్ధగా ఆలోచించలేదండి. సంతానం పుట్టిన ఆరో రోజుకు, పన్నెండవరోజుకు ప్రాధాన్యం వుంది. తాంత్రిక మార్గీయుల ప్రభావం చేత ఇటువంటి ఆచారం ఏర్పడిందని నా అభిప్రాయం. హిందువుల నమ్మకం ప్రకారం ఆరో రోజు షష్ఠీదేవిని పూజిస్తారు. మన ధర్మశాస్త్రంలో మొత్తం

పదహారు మాతృకలు వున్నాయి. షష్టీవాటిలో ఒక మాతృక అనుకోండి"....
అంటూ తనకు తెలిసినది ఏకరువు పెడుతున్నాడు.

ఏమి తేవాలా అని ఆలోచిస్తున్నాడు సజ్జన్. పరిస్థితుల ప్రభావం వల్ల వర్మలాంటి మధ్యతరహా కుటుంబీకునితో బాంధవ్యం నెరపాల్సివచ్చింది. అతని మనసుకు ఇది అంతబాగాలేదు. ఎదురుగా మర్యాదగా మాట్లాడ్డం, శిష్టత కోసం ఓహో అంటే ఓహో అనడం వేరు. లోతుకు వెళ్ళి చుట్టరికాన్ని కలుపుకోవడం వేరు. శ్రీమంతుని భార్య అనుకుని వాళ్ళు కన్య కోసం కీమతైన చీరె తెచ్చారు. కన్య ఇచ్చే బహుమతి కూడా ఆమెకు కాబోయే భర్త దర్జాకు తగినట్టుగా వుండాలి మరీ అంత ఎక్కువ కీమతైనదిగా వుండకూడదు. అలా ఓ సారి ఇచ్చామంటే ఎప్పటికీ ఈ ముఖాలు నోరు తెరుచుకుని చూస్తుంటాయి.

మహిపాల్ చెప్పుకుంటూ పోతున్నాడు- "ఆరో రోజునే బిడ్డ ప్రారబ్ధం నిర్ణయిస్తారంటారు సృష్టికర్త. ఆరోజునే బ్రహ్మ ఆగర్భ శ్రీమంతునిగానో పుట్టు దరిద్రుడిగానో అతని నొసట ఖర్మరాసేస్తాడు. ఒకడు పరమ సాత్వికుడైతే మరొకడు చిత్తశుద్ది 'దొక్కశుద్ది'లేనివాడవుతాడు. ఒక్కొక్కడు సాత్విక సంస్కారాలు వుండి కూడా ఖర్మ కాళ్ళ కింద నలిగి దుర్మార్గుడిగ మారతాడు.

"తర్వాత?"

"నిజం తలరాతను ఎవరూ మార్చలేరుకదా?" అన్నాడు కర్నల్.

"నువ్వు ప్రారబ్ధాన్ని అంగీకరిస్తావా మహిపాల్?"

"అంగీకరించకపోయినా ఖండించను"

"మరి అటువంటప్పుడు ఈ ధనికులు, పేదలు, ఈ విజ్ఞానం - అజ్ఞానం మొదలైన తారతమ్యాలు-"

"వీటన్నిటికీ కారకులు జమిందార్లూ, పెట్టుబడిదారి వర్గం అని అంటున్నాననా నీ వుద్దేశం"

"అవును"

"సజ్జన్! కొత్త చైతన్యం అనేది అనుభవంలోగాని రాదు. అనుభవాన్ని సిద్ధింపచేసుకోవాలంటే వ్యక్తిగానీ, వ్యక్తులు కలిసిన పూర్తి సమూహంకానీ ఏమేం చేస్తోందో, సహిస్తుందో అదే వాళ్ల ఖర్మ – అదేవారి వాటాకొచ్చిన సాంఘిక బాధ్యత...." చెపుతున్న మహీపాల్ కంఠం గంభీరమైంది. తన అభిప్రాయాన్ని మరింత స్పష్టంచేస్తూ మహీపాల్ - "ఆ జన్మలో చేసింది ఈ జన్మలో అనుభవిస్తున్నాను. ఈ జన్మలో చేస్తోందీ, చేసింది.... దాని ఫలితం ఈ జన్మలోనో వచ్చే జన్మలోనో అనుభవించాలి. నేను దాని ప్రభావం నుంచి తప్పించుకోలేను. ఎప్పటికీ తప్పుకోలేను...." అంటూ చటుక్కున ఆగిపోయి అక్కడ తను తప్పించి మరెవ్వరూ లేనట్లుగా పరిసరాలనే మరిచిపోయి స్వగతంలా చెప్పుకుపోయాడు.

గతించిన రెండు రోజులూ విషాదచ్ఛాయల్లో స్వయంగా తిరుగాడిన సజ్జన్ మహీపాల్ అతను చేసిన పనికి ఎందుకో పరితాపం చెందుతున్నారని గ్రహించడానికి ఎంతో సమయం పట్టలేదు. అతని పశ్చాత్తాపానికి కారణం ఏమిటా అని అడగాలనుకున్నాడు. శంకర్‌లాల్, వర్మ అక్కడే వుండటం గమనించి వూరుకున్నాడు అయినా అతణ్ణి అడగాలని నోటిదాకా వచ్చింది. ఏదో పెద్ద తప్పు అయిపోయినట్టుగానూ అతనిలో మిగిలివున్న ఆశాస్త్రా సంవేదనా శీలత కూడా దాంతో తుడిచి పెట్టుకుపోయినట్టుగానూ అతని ముఖం కనిపించింది. తోటి కళాకారుడు రహస్యంగా ఏదో మానసిక యాతన అనుభవిస్తోందే అతనికి తెలియరాని అసంతృప్తి కలిగింది. మహీపాల్ వాగ్ధాటికి కట్టవేస్తూ "ఏం మహాపాపం చేశావని అలా పరితపిస్తున్నావు?" అన్నాడు సజ్జన్ నవ్వుతూ.

అకస్మాత్తుగా అతణ్ణి ఎవరో కుదేసినట్టుగా మహీపాల్ ఉలిక్కిపడ్డాడు. మళ్లీ వెంటనే నిగ్రహించుకుని మామూలు ధోరణిలో మాట్లాడ్డానికి ప్రయత్నిస్తున్నట్లు కనబడ్డాడు. సమాధానానికి ఆధ్యాత్మిక పూతపూస్తూ మహీపాల్ అన్యాపదేశంగా అన్నాడు - "నాలాంటి కుటిలుడూ, ఖలుడూ, కాముకుడూ మరొకరెవరున్నారు? నేను ఏ పాపం చెయ్యలేదని చెప్పమంటావ్?"

అతని సమాధానం విని సజ్జన్ మనస్సు చివుక్కుమంది. ఎందుకడిగానా అనుకున్నారు. తనేమి తక్కువతిన్నాడని పాపాలు చేయడంలో? ఎవరైనా తమాషాగా తనను అదే ప్రశ్న వేస్తే? సజ్జన్ కూడా మహిపాల్‌లా వున్నది వున్నట్టుగా మాట్లాడుతూ "నేను కూడా నీలాంటి పాపాత్ముణ్నే. నీ సిద్ధాంతం ప్రకారం వచ్చే జన్మలో నాకూ ఎలాంటి శిక్ష అనుభవించాల్సి వస్తుందో కదా!" అన్నాడు.

"హోండి. అందరూ పాపులే. ఎవరి ఖర్మం ప్రకారం వాళ్ళు అనుభవిస్తారు" అంటూ నవ్వుతూ లోకవ్యవహారాన్ని ఒక్క ముక్కలో తేల్చిచెప్పి వాతావరణంలోని బరువును కొంచెం తగ్గించాడు కర్నల్.

"హల్లో" అని నాజూగ్గా అంటూ డాక్టర్ షీలాసింగ్ కన్య వెంట అడుగు పెట్టింది గుమ్మంలో. మహిపాల్ కనిపించగానే గొంతులోనే కోమలత్వం మాయమైంది. ఆమెను అక్కడ చూడగానే మహిపాల్ నిర్ఘాంతపోయి రాతి బొమ్మలా అయిపోయాడు. స్వింగ్‌లోనికి రాగానే అతను మినహా అందరూ వెంటనే లేచి నిలబడ్డారు. తర్వాత కాని మహిపాల్ లేచి నిలబడలేదు.

చిరుకోపం నటిస్తూ సజ్జన్‌తో "ఇంతవరకు వెళ్లలేదూ?" అని అంది వనకన్య.

"ఇదిగో. ఇప్పుడే వెళుతున్నాను" అంటూ తడబడుతూ చెప్పారు సజ్జన్.

క్రీగంటితో మహిపాల్‌ని చూస్తూ మళ్ళీ నాజూగ్గా కన్యతో అంది డాక్టర్ షీలాసింగ్-" అలా అనాలి. ఈ దుర్జనుడితో అలాగే మాట్లాడాలి. అతను దానికి అన్ని విధాల అర్హుడే".

"చెప్పులు విసిరించండి. ఇప్పటి ప్రపంచం అంతా పిచ్చిగా" అంటూ సజ్జన్ నవ్వాడు.

"విసరడానికి మాకేమీ అభ్యంతరంలేదు. ఒక్కటే భయం. మేం విసిరే చెప్పులక్కూడా జాలికల హృదయం వుంది. మాకేనష్టం. పోనీ విసిరే చెప్పులు విరుగుతాయేకాని ఈ సిగ్గులేని మగాళ్ళ బుర్రి మాత్రం పగలదు".

ఆమాటకు అందరు బిగ్గరగా నవ్వారు.

కుర్చీలోంచి వర్మ లేచి డాక్టర్ గారిని ఆహ్వానించాడు.

గుమ్మం దగ్గర వున్న రెండు కుర్చీల్లోనూ ఇద్దరూ, బెంచిమీద నలుగురూ కూర్చున్నారు. ఇద్దరు ఆడవాళ్ళు రాగానే కూర్చోవడానికి కొరత ఏర్పడింది. "ఏమని చెప్పమంటారు, ప్రస్తుతం ఇల్లంతా ఆడవాళ్ళ మయం అనుకోండి" అంటూ సమర్థించుకున్నాడు వర్మ.

"నేను వెళుతున్నాను" అంటూ కళ్ళు కిందికి దించుకుని అన్నాడు మహీపాల్.

"ఏం కూర్చోరాదూ" అంటూ డాక్టర్ షీలా అంది. ఆమె కళ్ళు అతణ్ణి ఇంకాస్సేపు అక్కడే కూర్చోమని బ్రతిమాలుతున్నట్లుగా చూసాయి. కర్నల్ షీలా ఇంటికి వెళ్లి మహీపాల్‌ని వెంటబెట్టుకుని వచ్చిన తర్వాత ప్రథమంగా ఇద్దరూ ఒకచోట కలవడం జరిగింది.

మహీపాల్ కళ్లెత్తి దాలాదీనంగానూ, నిస్సహాయుడిగానూ ఆమెను చూసాడు. మళ్ళీ వంకపెట్టుకుంటూ "అదేంకాదు. నాకు వెళ్లాల్సినపనివుంది" అని అన్నాడు.

"ఉండు. నేను కూడా వస్తాను. కర్నల్, ఓమాట" అంటూ సజ్జన్ చూసాడు.

"నేను రాగానే అందరూ వెళుతున్నారా" అంది షీలా. ఆమె ముఖంలో ఏదో ఆశాభంగం పొందిన భావం కనిపించింది.

"అబ్బే. నేను ఇప్పుడే వచ్చేస్తాను. అందాకా కర్నల్‌ని నీకు కాపలా వుంచి వెళ్లుతున్నాగా. మునుపటి మాదిరిగా స్వతంత్రుణ్ణి కాదాయే" అంటూ సజ్జన్ కన్య ముఖంలోకి చూశాడు ప్రేమగా.

"ఈ మగవాళ్లు - అయితే ఆడవాళ్ల మీద పెత్తనం చెలాయిస్తారు లేకపోతే కాంతాదాసులై పోతారు. సమానంగా మాత్రం ఎప్పటికీ చూడరు" అని అంటూ కన్య మగణాలిమీద మృదువుగా దెబ్బతీసింది.

కన్య ప్రేమ చాలా నిశ్చలమైనది. చాల స్వచ్ఛమైందన్న పాత అనుభ వాన్ని మరోపర్యాయం పునశ్చరణ చేసుకున్నాడు సజ్జన్. ప్రయత్నించి కూడా అలాంటి నైర్మల్యాన్ని అంతటి స్వచ్ఛతనూ తాను కూడా ఎందుకు అనుభవించ లేదు. తను అందరికి దూరంగా వుండి, విడిగా ఎందుకు భావిస్తాడు. తన ప్రేమలోని కాలుష్యం కన్య ప్రేమ వాహినిలో కలిసినప్పుడు నిర్మలత్వాన్ని ఎందుకు పొందలేదు?

మహీపాల్, సజ్జన్ కలిసి వెళుతున్నారు. ఇద్దరూ మాట్లాడకుండా సందులు గొందుల్లోంచి వెళుతున్నారు. ఇద్దరి మనసుల్నీ తుఫాను చిలుకుతోంది.

"నేను ఎంతో నీచుణ్ని!.... కన్యలాంటి శీలవతికి నేను యోగ్యుణ్ని కాను.... నాతో నేను ఘర్షణ పడతాను! సజ్జనుణ్ని అవుతాను" కన్యలో వున్న నిర్మలత్వాన్ని తలపోసుకుంటూ సజ్జన్ కూడా నిర్మలత్వంలో ఓ మునక వేసాడు.

"నేను చాలా తుచ్ఛున్ని, నా జీవితమే ఓ రోత! ఓరోత!.... హే పరమేశ్వరా!" అంటూ పరమేశ్వరున్ని తలచుకొని మహీపాల్ ఇంకా తుచ్ఛత్వం, రోతతో నిండిపోయాడు.

సందులంతా ఎలక్షన్ హడావుడితో జుయ్ మంటున్నాయి కాంగ్రెస్‌కి ఓట్లు బాగాపడ్డాయి అని ఒకరంటోంటే లేదు జనసంఘకే జోరుగా వుంది అని మరొకరంటున్నారు. మధ్యాహ్నం అయిన తరువాత కిసాన్-మజ్‌దూర్ ప్రజా పార్టీ అభ్యర్థి ముఖం పాలిపోయిందన్న పుకారు బయలుదేరింది. గుర్రం రౌతు, సూర్యోదయం, పడవ, పుష్పం, ఇంజను, కొడవలి గుర్తులుగల పార్టీ అభ్యర్థుల్ని గురించైతే ఎవరూ అనుకోవడమే లేదు.

# 35

సందులూ గొందులు దాటి ఇద్దరూ చౌకులోని చౌరస్తాలోకి వచ్చారు. గోల్ తలుపు చౌరస్తా వచ్చేపోయే జనంతోనూ, అక్కడే నిలబడిపోయి వున్న

జనంతోనూ కిటకిటలాడిపోతూంది. లౌడుస్పీకర్ల నుంచి వచ్చే రణగొణధ్వనులు ఒక దానితో ఒకటి ఢీ కొంటూ గాలిలో కలిసి ప్రకృతిలో అంతర్భాగం అయిపోతున్నాయి. విక్టోరియా పార్క్ రెండు వైపులా టీకొట్లు వున్నాయి. వాటి ముందు వేసిన కుర్చీలన్నీ నిండిపోయాయి. విక్టోరియా పార్క్‌లో ఇవ్వాళ పోలింగు జరుగుతోంది. చౌరస్తాలో మూగిన జనంలో మధ్యమధ్య పోలీసులు. చంకన ఫైళ్ళు పెట్టుకుని వెళ్ళే అధికారులూ, కార్లూ, దోలీలూ, పల్లకీలూ నిలబడిన జనాన్ని ఆకర్షిస్తున్నాయి.

సజ్జన్ తనవెంట డ్రైవర్ని తీసుకొచ్చాడు. ఇవ్వాళ బాగా జనసమ్మర్దం వుంటుందని ఏదైనా అలజడి జరిగితే తన కారునేమైనా పాడుచేస్తారన్న భయంతో ముందే జాగ్రత్తపడి డ్రైవర్ని వెంటబెట్టుకుని వచ్చాడు. కాని అక్కడ వాతావరణంలో ముచ్చట్లు తప్పితే ఉద్రిక్తత ఎక్కడా కనబడలేదు. బందోబస్తు గూడా గట్టిగాచేశారు. సజ్జన్, మహీపాల్ అలా తిరిగి వచ్చేసరికి కారు డ్రైవరు లేడు. సజ్జన్‌కి కోపంవచ్చింది. "పోనివ్వోయ్. మేలారోజు, ఎంత సేపని కారో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటాడు? అతను వచ్చేనదాకా ఆ కిళ్ళీ కొట్టు కెళదాంపద. చాలా సేపటి నుంచి నుంచి ఆకులి దొరకలేదనుకో నమల దానికి" అంటూ మహీపాల్ సర్ది చెప్పాడు.

సజ్జన్ ధ్యాసంతా డ్రైవర్‌మీద వుంది. కన్య అతనికోసం ఎదురు చూస్తుంటుంది. మళ్ళీ నాలుగు గంటలయ్యిందంటే పెద్దమ్మ మేడలో మహిళా మేలా ప్రారంభం అవుతుంది. కన్యను పిలవడం కూడా కష్టమైపోతుంది. ఎందుకో నిన్నటినుంచి కన్య అంటే సజ్జన్‌కి చెప్పలేని అనురాగం, మమతా పుట్టుకొచ్చాయి. రాత్రి రూప్‌రతన్ ఇంట్లో తాను చిత్రను చూసాడు. ఆమెను చూడగానే అతనికి ఎక్కడలేని పిరికితనం వచ్చింది. చిత్ర అంటే అతనికి అపరిమితమైన ఆనందం, ఆమె అతన్ని ప్రభావితం చేసింద కూడా. అయినా నిన్న రూప్‌రతన్ ఇంట్లో చూడడం తటస్థించినా ఆమె అతని గౌరవాన్ని కాపాడింది. ఎలాగైనా చిత్ర కన్య కాజాలదు. చిత్ర అతని అందని బతక వచ్చేమోకాని అర్ధాంగి మాత్రంకాలేదు. అతనికి అర్ధాంగి కావాలి. ఇంతవరకూ

కారూ కొంగరం లేకుండా తాను గడిపిన జీవితంపై అతనికిరోత పుట్టింది. ఇప్పటి భార్య అనే బాధ్యతలేని జీవితం గడిపి భార్య అంటే దూరంగా పోతూ వచ్చారు. వలలో చిక్కిన ఏనుగు తప్పించుకోవడానికి గిలగిల తన్నుకొన్నట్లు అతను తిరుగుబాటు చేస్తూ వచ్చాడు. బృందావనంలో కన్యతో కలిసి తానుచేసిన విహారంలో ఆమెను తన ప్రేమ పాశంలో బంధించి ఆ మిషతో ఆమె శరీరాన్ని అనుభవించి ఆమె నైతిక స్థాయిని దిగజార్చాటానికి అతను పన్నిన పన్నాగం ఫలించక పోవడంతో అతనిలో ఓ రకమైన విసుగుదల ఏర్పడింది. రాజా సాహెబ్ ఏర్పాటు చేసిన మేజు వాణిలో చిత్ర తారసిల్లగానే ఆ విసుగుదలే అతనిలో అణగివున్న లైంగిక వాంఛ రూపు ధరించి చెలరేగింది. చిత్రను కలవడం మూలాన్నే అతనిలో కామేచ్ఛరేగిండనుకోవడం తప్పిదమే అవుతుంది. ఆమె స్థానే మరే వనితవున్నా అతనారోజు కాలుజారేవాడే. కాని ఈ పర్యాయం చిత్రతో నైతికంగా సాహసంచేయడం తాను సహించలేక పోతున్నాడు. తన మనస్సు ఎంతపాతాళానికి దిగిపోయిందో తెలుసుకున్నాడు తనపై తనకు అసహ్యం వేసింది. అటువంటి తరుణంలో కన్య అతనిలో మిగిలిన సుసంస్కారాల వర్తికలా వచ్చింది. అహంకారంలేని తన స్నేహాన్ని అతనికి అర్పించింది. నిన్నటి నుంచి కన్య సంపూర్ణంగా అతని స్వామిని, గృహస్వామిని, ఆమె జ్ఞాపకం, చేసుకుంటే చాలు. ఆమెను ఓసారి చూస్తే చాలు ఆమెనోసారి స్పృశిస్తేచాలు అతనిలో వికారాలన్నీ పటాపంచలైపోతాయి. అతనిలో దిగజారి పోయిన ఆదర్శాలను పైకిలెమ్మనమని ప్రేరేపణ ఇస్తాయి. అందుకే డ్రైవరు లేకపోవడం అతన్ని ఇబ్బంది పెట్టింది. కారు తాళంచెవి తనదగ్గరవుంటే అతనికింత ఆందోళన వుండేదికాదు. మహిపాల్ చెప్పింది నిజం. మేలా రోజు. పాపం వాడూ మనిషే. ఎంతసేపని ఒంటరిగా కార్లో కూర్చుంటాడు. అందుకే అతనికి డ్రైవరుమీద అంతగా కోపం రావడంలేదు.

మానవత్వం, కన్య ఇచ్చిన ఆదేశం రెండిటిమధ్యా వూగిపోతున్నాడు సజ్జన్. మహిపాల్ అతని జబ్బ పట్టుకొని లాగుతూ "రావోయి. ఇప్పటి నుంచే కాంత దాసుడివికాకు. అయినా భార్య మంచిదైతే దాసుడుగా వుండడం మనలోటి చంచలవ్యక్తులకు శ్రేయస్కరమే అనుకో!" అన్నాడు.

జమునా కిళ్లీ కొట్టు దగ్గర నిలబడి, పక్కనేవున్న లాల్‌మహారాజ్ టీ కొట్టువద్ద కూర్చుని గప్పాలుకొడుతున్న వాళ్ళ మాటలు వింటున్నారు. ఎలక్షన్ వార్తలు వాళ్లు చెప్పుకుంటున్నారు. అవి వింటోంటే తమాషాగావుంది ఇద్దరికీ ఆకలు తీసుకొని వెళదాం పద" అన్నాడు సజ్జన్. మహీపాల్ ఓ క్షణం ఆలోచించాడు. మళ్ళీ రెండోసారి సజ్జన్ పిలవగానే "నువ్వు వెళ్ళరా. నేను ఇక్కడే కాస్సేపు తిరుగుతాను. బాగా సరదాగా వుంది" అని అన్నాడు మహీపాల్.

"నువ్వేదో పనుందని లేచి వచ్చేశావుగా!"

"ఆఁ ఏమీలేదు. వూరికనే అలా లేచేసాను. నువ్వు వెళ్ళు.... అన్నట్లు నువ్వు వెళ్ళేది ఎలా? నీ డ్రైవర్-"

ఆ మాటకు సజ్జన్ అతని ముఖంలోకి పట్టిపట్టి చూస్తూ "రాకపోతే బస్సులో వెళ్ళిపోతాను" అన్నాడు.

సజ్జన్ వెళ్ళిపోయాడు. మహీపాల్ పార్క్ వైపు వెళ్ళాడు. రకరకాల మనుష్యులు. గుంపులు గుంపులుగా ఎక్కడ పడితే అక్కడ గుమిగూడి వున్నారు ఎక్కడచూసినా, విన్నా ఎలక్షన్ గురించి కబుర్లే. ఎలక్షన్ గురించి ముచ్చట్లే. ఓట్లు వేసేవాళ్ళలో ముసలాళ్లూ, రోగిష్టులూ, వికలాంగులూ అందరూ వున్నారు. స్త్రీలు ఎంతవుత్సాహంగా వున్నారో చెప్పనక్కర్లేదు. గణరాజ్య పరంపరను ప్రాచీన కాలం నుంచి పాటిస్తోన్న భారత నారీమణులకు భారతదేశ చరిత్రలో మొదటిసారి ఓటు వేయడానికి అధికారం లభించింది. చాలామంది స్త్రీలు తమ భర్తల ఇష్టానుసారం అభ్యర్థులకు ఓట్లువేసారు. స్వతంత్రభావాలు వున్న కొంతమంది మాత్రం ఎవరు ఏం చెప్పినా వినక తమకు ఇష్టం వచ్చిన వారికే ఓటు వేశారు. ఒక మహాశయుడైతే జనసంఘంవారి దీపాన్నే వెలిగించమని భార్యకు పదేపదే హెచ్చరిస్తోంటే పాపం అతని భార్య జోడెద్దులకే మేత వేస్తానంటూ మొండికెత్తింది ఇద్దరికీ ఘర్షణ జరిగింది. కోపంతో అగ్గిగుగ్గిలం అయిందా భార్య పార్కులో వున్నామన్న సంగతి కూడా మరిచింది. ఇంట్లో

మాదిరిగా భర్త మీద లేస్తూ "అదిగో చూడు, జీవితంలో మొదటి సారిగా వోటు వేయడానికి వచ్చాను నా ఇష్టం వచ్చిన వ్యక్తికి వేస్తాను. నువ్వు మాటి మాటికి అడ్డుపుల్ల వేశావంటే నీ మర్యాద దక్కదు" అంది.

జోడెద్దులూ – దీపం గురించి సంభాషణ జరుగుతోంటే దారిన వెళుతున్న ఓ పోలీసు జవాను వచ్చి భర్తగారి జబ్బను పట్టుకున్నాడు. పోలింగు జరిగే ప్రాంతంలో కేన్వాస్ చెయ్యడం నేరం అన్న సంగతి పాపం ఆ భర్తగారు మరిచినట్టుంది.

చౌకులో పోలింగ్‌కు వచ్చిన కొంతమంది భోగంవాళ్ళు స్వాతంత్ర్యం అంటూ గుడ్డిగా పూజించే వాళ్ళకు ఓ మంచి గుణపాఠం నేర్పారు. "నీ తండ్రి ఎవరు?" అని ప్రశ్నించగానే "దళ్బు" అని చటుక్కుని ఏమాత్రం తడుము కోకుండా సమాధానం ఇచ్చారు వాళ్ళు.

''మరి భర్త పేరు'' అని రెండో ప్రశ్న.

"దళ్బు" అంటూ మళ్ళీ సమాధానం వచ్చింది. వచ్చినవాళ్ళలో ఇరవై రెండూ ఇరవై మూడేళ్ళ వయసువున్న ఓ వారకాంత కూడా వుంది. ''లేవండి. మమ్మల్ని చుట్టుముట్టి వోటు వేయించడం కోసం తెచ్చారే వీరేనండి నాభర్త'' అంటూ అక్కడున్న ఓ వ్యక్తిని చూపించింది.

ఎలక్షన్ దృశ్యాలు చూడడంలో మునిగిపోయాడు మహిపాల్. అదంతా ఒక పెద్ద ప్రహసనంలా వుంది అతనికి. ఒకవైపు మన ప్రజాస్వామ్యవ్యవస్థ ప్రతి వయోజనుడికి ఓటింగు అధికారం ఇచ్చి, మొత్తం సమాజానికి వాళ్ల ఇష్టంవున్న ప్రభుత్వం ఏర్పరచుకోవడానికి స్వాతంత్ర్యం ఇచ్చింది. ప్రాచీన భారతదేశంలో కూడా గణతంత్ర రాజ్యాలున్నాయి. కాని స్త్రీలకూ, వృత్తి పనులవారికీ, వ్యాపారస్తులకూ, గులాములకు ఓటింగ్ అధికారంలేదు. ప్రజల మీద పెత్తనంచేసే హక్కు కేవలం క్షత్రియులకే వుండేది. ఈ దృష్ట్యా చూస్తే మనం ప్రాచీనుల కంటే ఎంతో ప్రగతిని సాధించినా నేటి ప్రజాస్వామ్యం పూర్తిగా అర్థహీనంగాతయారైంది. గోల, రభస, గందరగోళాన్ని సృష్టించి

"అయ్యో బాబోయ్ ఎవరో గిట్టని ముండాకొడుకులు మమ్మల్ని చంపాలని ఇవన్నీ పెట్టారర్రా" అని గుండె బాదుకుంటూ "ఓసే కోడళ్ళూ రాండే'' అని గట్టిగాపిలిచింది.

''ఎవరే అక్కడ పిలుస్తూంట'' అంటూ వణుకుతూన్న ఓ ముసలి కంఠం దగ్గు తెరను సంబాళించుకుంటూ పలికింది.

''ఇక్కడకురా. కొంప మునిగింది'' అంటూ పెదబొబ్బలుపెడుతూలాలే భార్య నాలుగు మణుగుల నాజూకు దేహంలో పైకి వులుకుతున్న ఎగశ్వాసల్ని ఇముడ్చుకోవడానికి ప్రయత్నిస్తూ, మధ్య మధ్యలో మాటల్ని గొంతులోనే సగానికి దిగమింగుతూ. తడబడ్తోన్న కంఠంతో దేవుళ్ళను, స్మరించుకుంది—" "ఓ సత్యనారాయణ స్వామీ నీ కాళ్ళు మొక్కుతాను. నీ వ్రతం చేసుకొంటా నయ్యా. ఆంజనేయస్వామీ! నీ పేరున రేపు శనివారం ఆకుపూజ చేయిస్తా. ఓ పోలేరమ్మ తల్లీ, మమ్మల్ని ఈ ఆపద నుంచి కాపాడమ్మా నీ మేలు ఎప్పుడూ మరవను.''

ఏమయిందీ అంటూ పక్కవాటాలో వుంటున్న ముసలామె వచ్చింది శీతాకాలం చలికి ఆమె గజ గజ వణికిపోతోంది.

"చూడవ్వా! అలా చూడు. ఎవరో గొర్రాలు ముండ మన గుమ్మం కాడ అవేవో బొమ్మలు పెట్టిందే. ఎవరు పెట్టారో వాళ్ళకే తగలాలి. ఇదంతా ఆ నందో ముండ పనేనే,అదే ఆ పెద్దమ్మతో ఇదంతా ప్రయోగం చేయించిందే'' లాలే భార్య రొప్పుతూ ఆయాసపడుతూ కడుపుకోనిదంతా బయట పెట్టేసింది.

"ఆ రాక్షసి ముండ యింటిమీదపిడుగు పడిరావ!దాని బ్రతుకంతా ఇలాటి పాడుపనుల్లోనే తెల్లారేట్టుంది" అని తలుపుకు కరుచుకుని, చెంగు ముక్కుకు అడ్డంగా పెట్టుకుంటూ ముసలామె కోపాన్ని వెళ్ళగక్కింది.

"అవ్వా కాస్త దాన్ని తీసేసి ఏడైనా వీధిలో వేసిరావే. గోమతి కెళ్ళ డానికి నా కాలస్యం అవుతోంది".

నీతి బాహ్యంగానూ, సంఘవ్యతిరేకమైనవిగాను గుర్తించినా అవి అన్నీ తను జరపాలి. ఇంత పెద్ద సంఘాన్ని ఒక్కవ్యక్తి ఎలాసంస్కరించగలడు? ఇలాంటి ఆచారాల్ని ప్రపంచం మాననంత వరకు ఒక్క మహిపాల్ ఏమి చెయ్యగలడు? కళ్యాణి మనస్సును ఎంతకాలం ఆజగతొక్కుతుండగలడు? శకుంతల వివాహం ఎంతో వైభవంగా చెయ్యాలని ఆమె కోరిక. ఆమె మనస్సు విశాలం కనుక ఆడబిడ్డ కూతురైనా ఆ అమ్మాయి గురించి స్వంత పిల్లకన్నా ఎక్కువ ఆరాటపడుతోంది. ఇంక ఒకనెల లోపలే సుక్కుకు తగిన వరుణ్ణి వెతుకుతాను, ఇటు నిశ్చయం అయిందంటే వెంటనే ముహూర్తం పెట్టి పెళ్లిచేసేస్తా. తర్వాత మున్ముందు తనకూ పుట్టెడు సంసారం బాధ్యతలూ అంటూ వున్నాయి. నా పిల్లలు నాకు బిపికాదా, సోదరునికోసం, సోదరికోసం నా ప్రాణాల్నే తోదేసిన నేను నా పిల్లల అభ్యుదయం కోసం ఎందుకు శ్రమించనూ!.... కాని .... దొంగలు, స్వార్థపరులు, జాతికే కళంకం ....

మహిపాల్‌లో వున్న రెండో మనసు ఈ ఆలోచనం పైకప్పుకూడా పొడుచుకుని అతని మరణించిన తండ్రిగారి మాదిరిగా ధిక్కరించడానికి పైకి వచ్చేసింది. తీవ్రంగా ఆలోచించకపోయినా కూడా తనలోని బలహీనతల గురించి అతను ఆలోచిస్తున్నాడు. సాంఘిక బలహీనతలు మనిషిలో ఎలా పెనవేసు కొంటాయో ఆలోచిస్తున్నాడు. వ్యక్తి, సంఘం రెండు దోష భూయిష్టాలే. ఒకని నడకపై రెండోవాని ప్రభావం పడుతుంది. సంఘ నిర్మాణం అవుతున్నంతవరకూ సంఘం వ్యక్తిని పోషిస్తున్నంత వరకూ ఈ లక్షణం తప్పదు. వ్యక్తి, సమాజం మధ్య కలయిక కుదరాలంటే ఇదే మూలాధారం దీని ద్వారానే కుటుంబనిర్మాణం జరుగుతుంది. నేటి వ్యక్తి నేటి సమాజం రెండు ఈ గలాభాలోనే పోటీపడిమనుగుతున్నాయి. నేటివ్యక్తి ఎటువంటి నిస్సహాయతలో వున్నారంటే అతను అత్యున్నతమైన నైతిక ప్రమాణాల్ని పొరపాటున ఒకవేళ ఉల్లంఘించినా కూడా మనం అతణ్ణి క్షమించాల్సివుంటుంది.

రెండో మనసు రెండో పర్యాయం అతణ్ణి ధిక్కరిస్తోంది. అప్రయత్నంగా మహిపాల్ మూలిగాడు. అతనిలో చైతన్యం వికసించినది కావడంచేత అతని

అంతర్ దృష్టిని పాదుచేసుకోనివ్వడంలేదు. స్వయంగా అతని తెలివే అతనికి లాభకారిగా కనిపించలేదు. గాభరాతో మహిపాల్ కళ్లు ఒప్పచెప్పి నాలుగు దిక్కులూ చూడ సాగాడు. రోడ్డుకు మధ్యగా వచ్చి నిలబడి పోయాడు. రోడ్డుమీద ఓకారు పోతోంటే చెయ్యి వూపాడు ... కారు ఆగింది.

"ఓయ్! నువ్వటోయ్!" అంటూ రూప్‌రతన్ పలకరించి నాతో వస్తావా? నీతో కొంచెం పనివుంది" అన్నాడు.

"పద, ఎలక్షన్లో నాకూ పెద్ద ఆసక్తిలేదు. ఏదో పొద్దుపోక వచ్చాను హడావుడి చూద్దామని".

"ఈ పర్యాయం నువ్వు ఎందుకు నిలబడలేదు?" అంటూ మహిపాల్ కార్లోపోతూ రూప్‌రతన్‌ని ప్రశ్నించాడు.

'నిజం చెప్పాలంటే, షావుకారు కొడుకు ముందు తన వ్యాపారం చూసుకుంటాడు. ఆ తర్వాతే మిగతా వన్నీను"

'ఒకప్పుడు వీడే తన దగ్గఱ సమాజవాదం అంటూ కోతలు కోసేవాడు. పత్రికాకళ్యాణం గురించి మాటల్ని కోటలు దాటించేవాడు. వీడేనా రూప్‌రతన్!' ఇంతలో రూప్‌రతన్ మహిపాల్ భుజంమీద చెయ్యి అనిస్తూ అన్నాడు — "నాకు మంత్రి పదవి దొరికే అవకాశం లేదు. నాకన్న కొమ్ములు తిరిగిన వాళ్లు ఇందులో అభ్యర్థులుగా నిలబడ్డారు. ఈసారి ఉపమంత్రి పదవులు కూడా సృష్టిస్తున్నారని వినికిడి. ఇదంతా నాకు ఇష్టంలేదు. అదీకాక ఎక్కువకాలాన్ని వ్యాపారానికి వినియోగించకపోతే .... నీకు తెలిసేవుంది ప్రపంచం ఎలా త్వరగా మారిపోతోందో!".

సిద్ధాంత లక్ష్యాలకు పడగలెత్తి నోళ్లు కాలం కాలం అంటూ అఘోరిస్తే భేషే బాగు బాగు'' అంటూ నవ్వాడు మహిపాల్.

"కాల చక్రం నడిపించే వాళ్లు కూడా ఆ చక్రం కింద నలిగిపోతారు. ప్రతి అడుగూ ఆలోచించి వెయ్యాలి" అంటూ లేని గంభీరం తెచ్చుకున్నాడు సేఠ్ రూప్‌రతన్.

"నువ్వు రాజకీయాల సుడిగుండంలోంచి బయటపడి మంచి పనిచేసావు."

"ఒదర్లేదనకో అది సరేకాని, నేనొక వ్యాపారప్రస్తావన చేస్తాను. నీ కొత్త పుస్తకాలన్నీ నాకిచ్చేయి. నీ పాతపుస్తకాల కాపీరైటు నీకిచ్చేవేస్తాను. కొత్త వాటికి రాయల్టీ ఇస్తుంటాను. షరతు నచ్చిందా?"

'వీడు మళ్లీ కొత్తగా ఈ రంగంలో నిలదొక్కు కోవాలంటున్నాడు. అందాకే నాకు ఎరవెడుతున్నాడు .... ఈ అవకాశం వున్నప్పుడే పని చేయించుకోవాలి అనుకున్నాడు మహిపాల్. "సేఠ్ రూప్ రతన్ అన్నివిధాల నాకే లాభం మంది. జాగ్రత్త —"

"పాత విషయాలు మరిచిపో మిత్రమా! అప్పుడు నువ్వు నీ సిద్ధాంతాల్ని ఎప్పుడుపండించుకుందామన్న ఉరవడిలో వున్నావు. లేకపోతే నీ గురించి నాకు చెడ్డ అభిప్రాయం ఎప్పుడూలేదు. అదే ఆత్మీయతా, అదే గౌరవభావం—"

"చెప్పనక్కర్లేదు. ఆచరణద్వారా తెలుసుకున్నాను. సర్లే, నా పుస్తకాలకు అడ్వాన్సు ఎంతయిస్తావో చెప్పు"

"ఎన్ని పుస్తకాలు వుంటాయి?"

"నా మూడు పుస్తకాలకు ద్వితీయ ముద్రణ ఇంకా అవలేదు. వాటిని ప్రచురించిన ప్రకాశకుల దగ్గర డబ్బులు లేవు. అది సరేకాని. ఈ మధ్య ఓ కొత్త విషయం పట్టాను-"

"మూడువేలూ నాలుగు వేలూ - నువ్వెంత అడిగితే అంత ఇస్తాను"

"మరి నా పాత పుస్తకాలకు?"

"చూస్తాను లేవోయ్, పూర్వం కన్నా బాగా లౌక్యం నేర్చుకొవు"

"అనుభవాలే అన్నీ నేర్పుతాయి"

"సరే. ఇక మన ఇద్దరికీ ఇప్పుడు పొత్తుబాగా కుదురుతుందిలే. నీకొక్కా వలసినంత తీసుకో"

"ఏం? మళ్ళీ ఏదైనా వారపత్రిక పెట్టాలని వుద్దేశమా?"

'ఆహా! పెట్టగలను కూడా. నీ మాటలు వింటోంటే పత్రిక ప్రారంభిం చాలన్న వుత్సాహం కలుగుతోంది. ఈసారి ప్రచురణల మీదే ఎక్కువ శ్రద్ధ చూపా లనుకుంటున్నాను ఈ పర్యాయం ఓ కొత్త ప్రయోగం చెయ్యతలచుకున్నాను. పెంగ్విన్ సీరీస్‌లా భారతీయ భాషల్లోని ఉత్తమ నవలల ధారావాహికలు ప్రారంభిస్తే బావుంటుదనుకుంటున్నాను. అమెరికన్ పద్ధతిలో ప్రచారం చేస్తాను. హిందూ దేశంలోని ప్రతి పెద్ద పట్టణంలో మహీపాల్ నవలల గురించి అంటే నా వుద్దేశం నేను ఎవరెవరి నవలలు ప్రచురిస్తానో వాళ్ళగురించి సాహితీ గోష్ఠుల్ని యేర్పాటు చేసి పత్రికలు చదివే యేర్పాటు కూడా చేస్తాను. ప్రతి స్కూల్లో, కాలేజీలో యూనివర్సిటీలో, పెద్ద పెద్ద రెస్టారెంట్లలో, హోటళ్ళలో, ప్లాట్ ఫారాల పై, వార్తాపత్రికల్లో - అన్ని చోట్లా నీ ప్రచారం చేయిస్తాను. ఇంత వరకు హిందీ పుస్తకాల్ని విక్రయం చెయ్యడానికి ఇంత పెద్ద ఎత్తున, ఈ కొత్త పంథాలో ఏ ప్రచురణ కర్తా చేసి వుండనిరీతిలో-"

ఆ మాటలు వింటోంటే మహీపాల్ లోలోన పొంగిపోతున్నాడు. అంతలో నేస్‌రతన్ కారు అతని బంగాళా ముందు ఆగింది. ఇంతకు ముందు అతని మాన సిక ఆకాశంలో కమ్ముకున్న విషాద మేఘాలు పొంగిపోయాయి. తనకు మంచి రోజులు వస్తున్నాయని అనుకున్నాడు మహీపాల్.

ఈ పథకం గురించి ఆలోచిస్తూండగానే రూప్‌రతన్ ఇంట్లో పుస్తకాం గదిలో గంటలు గడిచిపోయ్యాయి. "నాకో పని చేసిపెడతావా?" అని అడిగాడు మహీపాల్.

"చెప్పవయ్యా ఏంకావాలి?"

"నేనొక హారాన్ని అమ్మాలి"

"బంగారందా?"

"కాదు. నవరత్నాలు పొదిగిన హారం"

"ఎవరిచ్చారు?"

"మా అమ్మగారిది. చాలా విలువకలది"

"ఎందుకు అమ్ముతున్నావు?"

''మేనకోడలి వివాహం చేయ్యాలి''

"ఎంత ఖర్చవుతుంది?"

''పదిహేను వేలు''

"చాలా ఎక్కువ. ఇంకా ముందు ముందు నీకు పెద్ద బాధ్యతలు వున్నాయి.... పుట్టింటివైపు నుంచి సహాయం-"

"గట్టానూ, నా భార్యనూతీసుకునిఅక్కణ్ణుంచి వచ్చేసిన నాటినుండి ఒక్కపైసా తీసుకోలేదు. ఇప్పుడయితే వాళ్ళే ఇరకాటాల్లో పడ్డారు. తాలూకా దారిపోయింది. మొన్నీమధ్య వాళ్ళింట్లో పెద్ద దొంగతనం కూడా జరిగింది."

"అలానా?"

"అవును. నేను అక్కడే వున్నానప్పుడు. నా చేతులతో ఒక దొంగాణ్ణి కూడా చంపాననుకో"

''అలాగా?"

"ఆ విషయమే అడక్కు. దొంగతనాల గురించి విన్నాను. కాని ఆరోజు ప్రత్యక్షంగా చూశాను."

"మీ పుట్టింటివారిలో ఎవరికైనా అపాయం-"

"అవును. ఒక నౌకరు చచ్చిపోయాడు. మరో నౌకరు పరిస్థితి ప్రమాద కరంగా వుంది. ఈపాటికి వాడూ చచ్చిపోయి వుంటాడు. మరిద్దరికి మామూలుగా గాయాలు తగిలాయి."

"ఎంత సొమ్ము పోయింది''

''లక్షన్నర రూపాయల విలువైన నగలు దొంగిలించబడ్డాయి. చాలా నష్టం కలిగింది"

"ఆఁ, అయ్యేవుంటుంది"

"అందుకనే నాకు విచారంగా వుంది"

"ఎందుకు?"

"సరేకాని. ఆహారం గురించి—"

"ఆ( ఆ(. తీసుకరా చూస్తాను. ఈ దొంగల సంస్థకూడా ప్రాచీన కాలంలో సార్వజనీన సమాజవాదంలాటి వాద్యమే. వున్నవాళ్ళను దోచుకుని లేని వాళ్ళకు పెట్టడం."

"రాజరికపు వ్యవస్థ పుట్టడానికి ఇక్కడే పునాది పడింది. ఈ దొంగలే ఎక్కువ బలశాలురై రాజులయ్యారు. ప్రజల్ని పీడించుకుతింటున్న ఈ వడ్డీ వ్యాపారస్తుల సంకెళ్ళలోంచి వాళ్ళను విడిపించి-"

"ఏమిటి? నాకు అర్థం కాలేదు'

"మొహెంజోదరో, హరప్పా వంటి నగరరాజ్యాల్ని నాశనం చేసి భూమి మీద పాకిపోయి దున్నేవాడిదే భూమి అంటూ ప్రచారం చేశారు. సంరక్షకుని గానూ వ్యవస్థాపకునిగానూ పనిచేసిందానికి సామంతరాజు పంటలో ఆరోభాగం తీసుకునేవాడు మిగతా పంట అంతా రైతుదే. దీనిఫలితంగా నేర్లకు కూలీగా, పాలేరుగా పనిచేస్తోన్న రైతు స్వతంత్ర కర్షకుడయ్యాడు. స్వతంత్రుడుగా వుండి ధనవంతుడయ్యాడు. ఆ రోజుల్లో ఈ మార్పు అభ్యుదయాన్నే ఒరకంగా సూచిస్తుంది"

"నువ్వు చరిత్రను తిరగతోడి రాస్తున్నట్లుంది"

"అలాకాదు, భారతదేశ చరిత్ర ఇప్పుడే అసలైన రూపురేఖలు దిద్దు కుంటోంది. మొహెంజోదారో, హరప్పా నాగరికత కేవలం కళ్ళప్పగించి చూడ్డానికే కాదు. మన పురాణాలు, ఇతిహాసాల్లో వున్న నిరర్థకమైన కథల్ని సార్థకం చేస్తుంది. మనవికాసం అనే పెద్ద గొలుసులో తెగిన బంధాన్ని కలపడానికి వుపయోగపడుతోంది. ఉదాహరణకు 'పురందరుడు' అనే పదాన్నే తీసుకుందాం నగరాల్ని తగులబెట్టే ఇంద్రుడు నిజంగా సామంత వ్యవస్థకు ప్రతీక. నగర

రాజ్యాల పాలకులు సామంతులకు శత్రువులు. ఎందుకంటే వాళ్ళు వ్యాపారస్తులు వ్యవసాయం వారి ముఖ్య జీవనవృత్తికాదు. కావలసినంత భుక్తిమేరకే వ్యవసాయం చేయించేవారు. ఆర్య సామంత రాజులు ఉత్పత్తిని మార్చేశారు. ప్రజలకు వ్యవసాయంపై మోజు ఎక్కువయింది. ఉదరపోషణార్థం ఈ వ్యాపారస్తుల్ని అంటిపెట్టుకుని వున్న వివిధ వృత్తులవాళ్ళూ వ్యవసాయాన్ని చేపట్టి స్వతంత్రులయ్యారు. "ఉత్తమమైంది వ్యవసాయం మధ్యమమైంది వాణిజ్యం" అన్న ఆర్యోక్తి ప్రసిద్ధిలోకి వచ్చింది. దాని ప్రభావం చేత సాంఘిక వ్యవస్థలో ఆమూలాగ్రం క్రాంతి వచ్చింది.

"ఇది బాగుంది....నువ్వేమైనా కొంచెం పుచ్చుకుంటావా?" అంటూ సేఠ్ రూప్‌రతన్ అడిగాడు.

"వద్దు నేను ఇంటికి వెళ్ళాలి"

"తాగి భార్య దగ్గరకు వెళ్ళడానికి భయం. అయితే ఇక్కడే వుండిపో పాత అలవాటేగా శ్రీమతి గారికి తెలిసిందే కదా! నేను చెప్పి పంపిస్తాను"

"ఓసారి యింటికి తప్పక వెళ్లాలి. ఆహారం కూడా తెస్తాను. ఖరీదైన వస్తువు భద్రంగా-"

"భద్రంగా ఎందుకు వుండదు? నీ భార్య దగ్గిరవుంటుందిలే"

"ఆఁ అవుననుకో. ఆమె దగ్గిరే వుందనుకో. అయినా దొంగతనం జరిగినప్పటి నుంచి-"

"నువ్వు కూడా వెర్రి బ్రాహ్మణుడిలా వున్నావు. దొంగలు నీ ఇంటికి రారులే! విడియపడుతూ నవ్వాడు మహీపాల్- "అది కాదు. ఒక్కసారి వెళ్లొస్తాను. సరేలే. ఇవ్వాళ రాత్రి నీ ఇంట్లోనే వుండిపోతాను. ఇంట్లో చెప్పివస్తాను"

రూప్‌రతన్ స్విచ్ నొక్కాడు. నౌకరు వచ్చాడు.

"డ్రైవర్ని బండి తీసుకురమ్మనమని చెప్పు. పండితులుగారిని దిగబెట్టి రావాలి"

# 36

హోలీ ముందురోజు సాయంత్రం వెనుక వరండాలో కూర్చుని టీ త్రాగు తున్నాడు సజ్జన్. అంతలో అతని చౌకీదారొచ్చి "అయ్యగారూ, తమరి అత్త గారటండీ. బయట వేచివున్నారు. వారివెంట తమ బావమరిదిగారు మరో ఆడ పడుచు కూడా వున్నారండీ'' అంటూ కబురుతెచ్చాడు. అతని నోట ఈ కొత్త చుట్టరికాలు వినగానే సజ్జన్ త్రుళ్ళిపడ్డాడు. తనకో అత్తా, మరిదీ వున్నారని సజ్జన్‌కు మునుపే తెలుసు వివాహం చేసుకున్న తర్వాత అత్తగారి తరపున ఎవరో ఒకరు వుంటారుకదా? కాని వాళ్ళు అకస్మాత్తుగా?—

స్వర్గీయులు రాయబహదూర్‌లాల్ కనోమల్ మనుమడూ గొప్ప కళా కారుడూ, తనకల్లుడూ అయిన సజ్జన్ డ్రాయింగు రూమ్‌ని నాలుగు వైపులా కలియజూస్తూ తన కూతురికి అకస్మాత్తుగా అబ్బిన సిరిసంపదల్ని తలుచుకుంటు మాస్టర్ జగదంబా సహాయ్ అర్ధాంగి కూర్చుని వుంది. ఆమెకు చేరువలోనే హతభాగ్యురాలైన ఆమె కోడలు కూర్చుంది. రెండో సోఫామీద బాచిపట్లు వేసు కుని నెత్తిమీదా చెంపలమీదా పెద్ద పెద్ద గంగసింధూరం చుక్కలు పెట్టుకుని కళ్ళు మూసుకుని ధ్యానముద్రలో చతికిలబడి కూర్చునివున్నాడు బావమరిది.

ఠీవిగా డ్రాయింగ్ రూమ్‌లోకి ప్రవేశించాడు సజ్జన్. అతను గదిలోకి రాగానే మర్యాదగా అత్తా, కోడలూ లేచి నిలుచున్నారు. అత్తగారు ఒడ పొడుగూ వున్న మనిషి. యౌవనంలో అందంగానే వుండివుంటుందనుకున్నాడు సజ్జన్. తమలపాకులూ పొగాకుపొడుం నమిలి నమిలి పెదిమలు నల్లబడ్డాయి, కళ్ళన్నీ పుసికట్టాయి. చూడ్డానికి ఎన్నో రోజులు నుంచిస్నానం చేయనట్టుగా వుంది. రెండో ఆవిడ బక్కపలచగా వుంది. తలమీద ముసుగైతే లేదుకాని వున్నట్టు గానే ఒదిగి కూర్చుంది. దామనఛాయగల ఆమె ముఖం పాలిపోయి కడుపులో ఏదో దిగులుతో వున్నట్టుగా కళావిహీనంగావుంది. బావమరిది మాత్రం మొదటి చూపులోనే తమాషాగా కనిపించాడు. అతని వాలకం చూస్తోంటే సజ్జన్ లోలోన నవ్వుకున్నాడు. సజ్జన్‌ని చూసి కూడా బావమరిది మర్యాదసూచకంగా లేవ

లేదు. మెరతిప్పి పరమేశ్వరుడు క్రోధంతో మన్మధుణ్ణి చూసినట్టుగా గొరగొరా చూసి 'బజ్‌రంగ్....బజ్‌రంగ్' అంటూ ఒక్క అరుపు అరిచి మోకాళ్ళుఆడిస్తూ ఎప్పటిలా కూర్చున్నాడు. సజ్జన్ చేతులు జోడించి అత్తగారికి నమస్కరించాడు....అత్తగారు దీవించింది.

''మా చిన్నదాని ఎన్ని జన్మల పుణ్యఫలమో దానికి మీలాంటి భర్తా, ఇలాంటి ఇల్లూ లభించాయి. నిజంగా చూస్తే నాయనా, మీ నౌకర్లతో కూడా వియ్యం అందే తాహతు మాకు లేదు. మీలాంటి అల్లుడుగారిని పొందినందుకు మేమెంతో అదృష్టవంతులం'' అంటూ, బొడ్డున గుచ్చిన ఓ రుమాలు బయటికి తీసి దాని ముడి విప్పుతూ సజ్జన్‌కు మరింత దగ్గరగావచ్చింది.

"ఇది"

"ఏమిటండీ ఇది?"

''ఇది నువ్వు స్వీకరించాలి. మామూలుగా వివాహం అయితే అన్ని తతంగాలు జరిగేవి నిశ్చితార్థం, పెళ్ళికొడుకుని చేయడం, ద్వారపూజ, అత్తగారింటికి పంపటం అన్నీ ఆచారాలూ నియమానుసారంగా జరిగేవి. ఇచ్చిపుచ్చుకోవడం వుండేది. నువ్వయితే ఒక యాగానీ కూడా మాకు ఖర్చులేకుండా చేశావు" అంటూ కళ్ళల్లో ఆప్యాయత నింపుకొని అతని కుడిచేతి రవ్వల వుంగరం వున్న పక్కవేలుకు ఓ సన్నని సాదా వుంగరం తొడిగింది. మళ్ళీ మరోసారి అతనికి ఆశీస్సులు పలికింది. అత్తగారు తనపట్ల ఆప్యాయంగా ప్రవర్తించినా ఆమె తీరుతెన్నులు కొంచెం చవుకబారుగానూ, అసహజంగానూ కనిపించాయి సజ్జన్‌కి.

''హరి ఓం తత్సత్!" అంటూ బాపురివి మళ్ళీ ఓసారి కళ్ళు తెరిచి కన్నార్పకుండా గుడ్లు పెద్దవిగా చేసి సజ్జన్‌ని చూశాడు. అతణ్ణి చూస్తోంటే సజ్జన్‌కి కొంచెం ఆందోళనా, బెరుకూ పట్టుకున్నాయి. బలహీనంగా, బక్క చిక్కిపోయిన అతని భార్య ముడుచుకుని కూర్చుంది.

"చిన్నా, బావగారికి తీసి తినిపించు నాయనా, అలా ఏమిటీ చూస్తున్నావ్" అంటూ అత్తగారు సజ్జన్ వైపు చూసి "పీడికి చెల్లెలంటే పంచప్రాణాలు చిన్నప్పట్నుంచి చిన్నికి కూడా పీడంటే ఎంతో ప్రేమ, ఏమి చెయ్యను బాబూ, అదృష్టం, పరువూ రెండూ పోగొట్టుకున్నదాన్ని-"

అంతలో బయట పోర్టికోలో కారు వచ్చి ఆగిన శబ్దం అయింది. గాభరా పడుతోన్న సజ్జన్ మనసుకు ఏదో చల్లగాలి విసురు తగిలినట్టయింది. అతని ముఖం వికసించింది. కళ్ళు గుమ్మంవైపు తిరిగాయి. ఈ చుట్టాల మధ్య ఇందాక నుంచి సజ్జన్ అవస్థ పడుతున్నాడు. హాల్లో అడుగుపెట్టగానే లోపలికి వస్తోన్న కన్య కనిపించింది. చికన్ చీరె, ఊదారంగు పువ్వుల రవిక లేత కాఫీ రంగు శాలువా, సన్నని కాళ్ళతో కనిపించే తెల్లని చెప్పులూ - ఆవేషంలో కన్య చాల అందంగా కనపడింది.

మాస్టర్ జగదంబా సహాయ్ భార్య తన కూతుర్ని చూసి కొన్ని నెలలు అయింది. చిన్నది ఇప్పుడు పెద్దదైపోయింది. ముఖంలో గాంభీర్యం వచ్చింది. నడవడికా, తీరూ అన్నింటిలో మునుపటికీ ఇప్పటికీ తేడా కనిపించింది. కాని అమ్మను అన్ననూ చూడగానే కన్య ముఖం చేటంత అయేసరికి తన కూతురే నన్న పాత భావం కలిగింది ఆమె తల్లికి తల్లి అంత దురాశాపరురాలైనా కూతురు ఏమీ మారలేదు. తల్లీ కూతుళ్ళ కలయిక దృశ్యాన్ని కళ్లారా చూసిన సజ్జన్‌కి మరో చిత్రానికి వస్తువు దొరికింది. కన్యను చూడగానే ఆమె తల్లి కన్న ఒడిన పాలిపోయిన ముఖం ఎక్కువగా కళకళలాడింది. ఆమె ముఖం అంతా కన్నులుచేసుకొని కన్యను ఆప్యాయంగా చూస్తోంటే ఆ దృశ్యం సజ్జన్‌పై చెరగని ముద్రవేసింది. మమకారం - అనుబంధం తెంచుకోవడానికి ఎంతకష్టతరమైంది? ఈ అనుబంధం ఎంత సహజమైంది? ఆ ముడిని ఎంత బిగించితే అంత మధురంగానూ గట్టిగానూ వుంటుంది. కన్య పెద్ద అన్నగారు అలాగే సోఫామీద చతికిలబడి కూర్చుని వున్నాడు. తల్లీ కూతుళ్ళను ఓసారి కళ్ళు తెరిచి చూశాడు. మళ్ళీ ఇదంతా మాయామోహం అనుకుని పక్కకు తిప్పుకున్నాడు.

కన్య తన ఒదినగారిని కౌగిలించుకుంది. నవ్వుతూ, నవ్వులు చెరుగుతూ అమ్మతో మాట్లాడింది. తర్వాత అన్నగారి దగ్గరకు వచ్చి అతని కాళ్ళుతాకింది. యోగసమాధిలో అలాగే వున్నాడు. ధ్యానముద్రలో వున్న ఎవరో కార్టూనిస్టు గీసిన పెద్ద సున్నాలా వున్నాడు అతను. ఈ బావమరిదిని నిజంగా ఎక్కణ్ణుంచో పట్టుకొని వచ్చినట్టు అనిపించింది సజ్జన్‌కు.

సజ్జన్ అత్తగారు కూతురి మెడలో పూసలదండ వేసింది. ఆమె ముఖంలో ఎలాటి ప్రత్యేకతా కనిపించలేదు.

"హరి ఓమ్. బజ్‌రంగ్, బజ్‌రంగ్" అంటూ బావమరిది సమాధిలోంచి బయటికి వచ్చాడు. మిరమిట్లు కొలిపే కళ్ళతో అందరినీ చూశాడు.

"అరే చిన్నా, చెల్లెని చూద్దామని వచ్చావుకదరా, ఏం చేస్తున్నావు" అంటూ పలకరించింది అతని తల్లి.

"మిస్టర్ సజ్జన్ వర్మగారూ, మీ మేడలో టీకి తాగవచ్చా" అని అడిగాడు బావమరిది.

"అదేమిటన్నయ్యా అలా అడుగుతున్నావు. మరీ నీకు తాగాలనిపిస్తే తాగు" అంటూ వనకన్య కంఠంలో కొంచెం తీవ్రతని రంగరించి ఇక్కడ ఎలా వుండాలో సూచనప్రాయంగా తెలియపరిచింది.

తన నైట్‌గౌన్‌లోంచి సిగరెట్ కేసూ, లైటరూ తీసి అతనికి ఇవ్వబోయాడు. సజ్జన్.

"ఇక్కడి వస్తువు ఏదీ స్వీకరించలేను" అని అన్నాడు బావమరిది సాలార్‌జంగ్ లాగా.

సరే అన్నట్లుగా సజ్జన్ సిగరెట్ కేస్ జేబులో పెట్టేసుకున్నాడు. "నేను వస్తాను డార్లింగ్ నాకు కొంచెం పనివుంది. నువ్వు అమ్మగారికే-" అని ఆ సన్నివేశంలోంచి తప్పించుకోవడానికి ఎత్తువేసాడు సజ్జన్.

"నాయనా, నీతో ఓ చిన్న పనుంది" అంది అత్తగారు సజ్జన్ ఆగిపోయాడు. భర్త ముఖంలోకి చూసింది వనకన్య. అతని మనస్థితి ఏమీ చెడి

నట్టుగా కనిపించలేదు. గంభీరత్వం అనే పైనున్న లావుపాటి పొరకింద సన్నగా అణిగి అణిగి నవ్వడాన్ని ఆమె గమనించింది. అల్లుణ్ణి తనకు దగ్గరగా కూర్చోమని బలవంతం చేసింది అత్తగారు. నాకిలావుండదమే అలవాటు అంటూ సజ్జన్ అలాగే నిలబడ్డాడు. మాస్టర్ జగదంబా సహాయ్ అర్ధాంగి ఉపోద్ఘాతం మొదలు పెడదామని నోరు తెరిచేసరికి బావమరిది "చిన్నీ" అంటూ అరిచాడు.

"ఏం అన్నయ్యా"

"నేనిక్కడకు ఎలా వచ్చానో నీకు తెలుసా? నిన్నరాత్రి శంకరునితో ఈ విషయమై తీవ్రంగా చర్చించాను కుమారా, నువ్వు చిన్నయింటికి వెళ్ళి తీరాలి అని అన్నారు. ఎట్టి పరిస్థితుల్లోనూ నేను అక్కడికి వెళ్ళనని చెప్పాను. శంకరులు వెళ్ళితీరాలని పట్టుపట్టారు. వెళ్ళనంటూ నేను మొండికేశాను. ఇంతలో ఆలేగంట్‌లో వున్న హనుమంతులవారు మధ్యస్తం చేశారు."

అందరూ చిన్ని వైపుచూస్తూ వుండిపోయారు. ఏమీ మాట్లాడలేదు. అత్తగారు తాను ఎందుకొచ్చిందీ చెప్పాలని ఆదుర్దాగా వుంది. ఆమెను మాట్లాడనీయకుండా చిన్న పిచ్చిధోరణిలో మాట్లాడుకపోతున్నాడు– "చిన్నీ అప్పుడు నేను చాలా సిద్ధులు సంపాదించాను. నేను కావాలనుకున్నానంటే నీ ఇంట్లో సామాను యావతూ పూచికపుల్లతో సహా ఒక్కక్షణంలో నా ఇంటికి చేర్పించేయగలను సుమా. కాని ఆ పనిచెయ్యను. ఈ మాయా మోహంలో పడదలుచుకోలేదు. నేనింకా పెద్ద పెద్ద సిద్ధులు సంపాదించుకొన్న తర్వాత అడుగు. నీకు కావాలంటే రోజూ నీదిండు కిందికి లక్షరూపాయల నోట్ల కట్ట రమ్మంటే వచ్చేస్తుంది. నా స్థానంలో అమ్మే గనుక వున్నట్టయితే మాయమోహంలో పడి కూరుకుపోయేది. కాని మా గురువుగారున్నాడే బజ్‌రంగ్ బలీ, చెవిలో మెల్లిగా చెప్పి పోయాడు– బిషనూ సహాయ్, ఈ టక్కరి మాయాజాలంలో పడకుసుమీ. నేను నీకు భగవద్దర్శనం చేయిస్తాను – అని''

"ఒరే చిన్నా! ఏమిటీ అర్థంలేని మాటలు. ఎక్కడ వున్నామో కొంచెం తెలుసుకొని ప్రవర్తించు" అంటూ కన్య తల్లి బ్రతిమాలుతోన్నట్టుగా అంది.

"నీకు ఇవి అర్థంలేని మాటలా! మంత్రశక్తిమీద నీకు నమ్మకం లేదా!" అంటూ సజ్జన్ బావమరిది తల్లిని గద్దించాడు.

భయంతో చిన్న భార్య ముఖం తెల్లపోయింది. ఆమె మెల్లిగా అత్తగారితో చెప్పండత్తగారూ, విశ్వాసం వుందిలే అని అంది.

పళ్ళు పటపట కొరుకుతూ కళ్లెర్రగా చేసి చిన్న తల్లి మీదికి వచ్చాడు. అతని జబ్బను గట్టిగా పట్టుకుని విదిలిస్తూ "మెదలకుండా అక్కడ కూర్చోండి" అని అన్నాడు సజ్జన్.

బావమరిది నిర్ఘాంతపోయ్యాడు. సణగడం మొదలెట్టాడు- "నన్ను బీడి తాగనివ్వరు. శంకర్‌కి అంతా చెప్పి మీ పని పట్టిస్తాను. మైగురూ విల్‌సీ యూ" అంటూ క్రోధం నిండిన కళ్ళతో పళ్ళు కొరికాడు. మళ్లీ ఆగి ఓ వేడి నిట్టూర్పు విడిచాడు.

కన్యను చూస్తూ తల్లి "ఆరోజు నుంచి పీడ వరస ఇలా తయారైంది. క్షణం క్షణం గండంగా రోజులు వెళ్ళబుస్తున్నాం. ఇంటిలో పరిస్థితి ఎలావుందో నీకేమని చెప్పనూ!..." అంటూ సజ్జన్ వైపు తిరిగి- "ఈ వూళ్లో ఇన్ని కొంపలున్నాయి. ప్రతి ఇంట్లోను ఏదో ఓ గొడవా, రభసా వుండనేవుంది. పరువుగా బ్రతుకుతున్నానని మీసాలు మెలేస్తూ తిరిగేవాళ్ళ కొంపల్లో పరీక్షగా వెతికితే ఏదో ఒక కంట కనపడి తీరుతుంది. కన్నంలేని కొంపెక్కడుంది బాబూ. మా ఒక్క యిల్లేనా పాపాన్ని మూటకట్టుకుంది. మీరే న్యాయం చెప్పండి". అని తన కడుపులోని వేదనను బయటపెట్టింది.

'ఆ మాటలన్నీ ఇప్పుడిలా వుంచులే' తల్లివైపు చూడకుండానే మనస్సులో పెరుగుతోన్న కలవరాన్ని ముఖంమీద కనపడనీయకుండా అంది వనకన్య.

అంతలో చిన్నా లేచి గుంద్రని బల్లమీద మిఠాయిల్ని తియ్యబోతోంటే తల్లి చూసి "అరే చిన్నా నీకు మతిపోయిందిరా. లేకపోతే నీ చెల్లెలి యింట్లో-" అంటూ బెదిరించింది.

"అంతామాయ, అంతా మిథ్య, అరవకు" అంటూ మిఠాయి ముక్కల్ని నోట్లో వేసుకున్నాడు చిన్నాడు.

కొడుకు తన మాట వినకుండా వద్దన్నపనిచేసేసరికి జాలిగా చూసింది, అల్లుడూ కూతురు వైపు. వాళ్ళతో మెల్లిగా అంది- "ఇదీ వీడి పరిస్థితి వీడికి భయపడి ఇప్పుడు ఇంట్లో నిద్దరపోవడం కూడా మానేసాం. ఏపనీ చెయ్యలేక పోతున్నా. వంటింట్లోకి దూరి అక్కడవున్న కూరలూ, అన్నం అంతా విసిరి పారేస్తాడు. లేకపోతే కుక్కలకు పెట్టేస్తాడు.... వీడిని పట్టుకోలేక చస్తున్నాం. ప్రాణాలు మిగిలివున్నాయి. అంతే. నువ్వేమో తండ్రిని జైలుకు పంపించావు. వీడిని కూడా పిచ్చాసుపత్రికి పంపించవే. మా ఇద్దరికీ కొంచెం కొంచెం విషం-" అంటూన్న ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

కన్య భుజం మీద చెయ్యి పెట్టి సజ్జన్ "మీ అన్నను బాబాగారి ఆశ్రమంలో అప్పజెప్పమంటావా!" అని అడిగాడు.

తన మనోవ్యథ, దైన్యభావాన్ని భర్త కళ్ళల్లోకి పోసి "అమ్మను అడగండి" అని అంది.

వాళ్ళమాట విని కన్య తల్లి వెంటనే సర్దుతూ "ఇంట్లో మగదిక్కు ఎవరూ లేకపోయేసరికి సింహంపిల్ల అయ్యాడు" అని అమాంతంగా అల్లుడి కాళ్ళమీద పడింది. సజ్జన్‌కి ఏమి చెయ్యాలో తోచక ఇరకాటంలో పడ్డాడు. ఆమె చేతులు పట్టుకుని లేపుతూ అన్నాడు- "అబ్బె లేవండి. ఏమిటి మీరు చేస్తోంది?"

"నాయనా. చేయెత్తి నిన్ను అడుగుతున్నాను. నా పసుపుకుంకుమ నిలబెట్టు. భగవంతుడు నీకింక రెండింతలు ఐశ్వర్యం ఇస్తాడు. ఆయన ఎలాంటి వాడైనా నా జీవితానికి పట్టుకొమ్మ కదా! మగడని ఎన్నెన్నో బాధలు దిగమింగాను బాబూ" అంటూ సజ్జన్‌ని ప్రాధేయపడింది.

"అమ్మా! నాన్నగారు న్యాయాధిపతి అధీనంలో వున్నారు. మేమేం చెయ్యలేం".

"నేను నిన్ను అడగడం లేదు. ఎవరి అండచూసుకుని నువ్వు నీనాన్నను జైలుకు పంపించావో, ఆ అండతో నాకు అప్పుడు ఎలాంటి చుట్టరికమూలేదు. కాని అతను ఇప్పుడు నా కొడుకులాంటివాడు అయ్యాడు. అతణ్ణి అడిగే హక్కు నాకూ వుంది".

కోపంతో కన్యముఖం ఎర్రబారింది. అత్తగారు అధికారం చలాయింటా అనుకున్న ధోరణి చూసి సజ్జన్ గాభరాపడ్డాడు. కాని కన్య కోపాన్ని చూసి తమాయించుకున్నాడు. చాకచక్యంగా తియ్యగా మాట్లాడుతూ అత్తగారితో "మీకు పూర్తిగా హక్కువుంది. నేను దాన్ని కాదనను. కాని ఈ విషయంలో మాత్రం మీరు నాకు ఏమీ చెప్పకుండా వుంటేనే శ్రేయస్కరం. నిజంగా నా చేతిలో ఏమీలేదు. ప్రభుత్వం వారే ఆయన మీద కేసు పెట్టారు".

"నువ్వు జామీను వుంటే ఆయన బయటికొస్తారని అందరంటున్నారు. నిన్ను ఎరుగని వాళ్ళు ఎవరున్నారు చెప్పు".

వెంటనే భర్తవైపు తీక్షణంగా చూచి తల్లితో అంది కన్య- "అమ్మా, నీ చేతులు పట్టుకొని చెబుతున్నాను. ఏ ఉపకారం అయినా నువ్వు వీరితో చేయించుకో. కాని ఈ తప్పుడు పనిమాత్రం-"

"తప్పులు ఎవరు చెయ్యడం లేదు!"

"నాన్నగారు చేసింది తప్పుకాదు. మహానేరం-"

"నేరమే చేసారనుకో" అని అంటూంటే ఆమె గొంతుస్థాయి హెచ్చింది. మరింత తీక్షణంగా ఆమె కూతుర్ని జాడించిపారేసింది- "అసలీ తంటాలన్నీ పెట్టింది నీ పిన్నమ్మ కదటే. దాన్నెందుకు పట్టించవూ? ఆ లంజముండ నా గుండెలో చిచ్చుపెట్టి నా కొంపకు నిప్పుపెట్టింది. దానికి కూడా అలాంటి శాస్తి జరుగుతుందిలే. దాని కొంపతగులబడే రోజు వస్తుంది. దాని వంట్లో పురుగులు పడి-"

"మంచినీళ్ళు!" అంటూ అరపు. మిఠాయి గొంతుల్లో ఇరుక్కుపోయింది. ఒకచేయి మిఠాయి గిన్నెలో వుంది. మరో చెయ్యి గొంతును సాఫుచేసుకుంటూ

నిస్సహాయ స్థితిలో వున్నాడు సాలార్‌జంగ్ మహాశయుడు. ముందుకొచ్చి సజ్జన్ బటన్ నొక్కాడు. వెంటనే నౌకరు హాజరయ్యాడు. "సీళ్ళుతే" అంటూ సజ్జన్ ఆర్డరు చేసి, కాని ఇంతసేపటి నుంచి తన నౌకర్లు పర్దా వెనుక నిలబడి ఈ వింత సన్నివేశాన్ని చూస్తున్నారేమో అన్న సందేహం కలిగింది సజ్జన్‌కు. అన్నీ విని తమలో తాము మాట్లాడు కుంటారు. తన అత్తగారి ముఠా గురించి ఎగతాళి చేసుకుంటారు. తన విచిత్రమైన బావమరిది, ఈ తమాషా చూపిస్తోన్న కంపుకొట్టే అత్తగారూ జ్ఞాపకం వచ్చారు. వీళ్ళు తనకు బంధువులు. తన భార్యకు తల్లీ! అన్నగారునూ. వాళ్ళను చుట్టాలని పిలవాలి ఎంతసిగ్గుచేటు! ఈ ఇంట్లో అడుగుపెట్టి కన్య హోదా, గౌరవం సంపాదించుకుంది. ఆమె ఏపని చేసినా హుందాగా వుండేది. తన హోదాకు తక్కువగా ప్రవర్తించలేదు. లేక పోతేనా. శ్రీమంతుల యిళ్ళల్లో పనిచేసే నౌకర్లు లోట్లు కనిపెట్టడంలో యజమానుల్ని మించిపోతారు, తన అత్తా, బావమరిదీ వచ్చి కన్య మీద నౌకర్లకున్న అభిప్రాయాన్ని పూర్తిగా మార్చేసారు''

మంచినీళ్ళు వచ్చాయి. చిన్నా కుడిచేతిని గిన్నెలోంచి తీయకుండానే ఎడమచేత్తో సీళ్ళు అందుకుని గడగడ తాగేసాడు ఒక్కసారి బ్రీవ్‌మంటూ త్రేనుపు తీసి "హరి ఓమ్, బజ్‌రంగ్" అంటూ అరిచాడు. దగ్గరే నిలబడ వున్న సజ్జన్‌ని పలకరిస్తూ అడిగాడు-" ఏం మిస్టర్ సజ్జన్‌వర్మా మరి మీరు కూడా సాధన చేస్తారా?" అని అంటూ.

సజ్జన్ ప్రశ్న వినగానే త్రుళ్ళిపడ్డాడు నౌకరు నిలబడివున్నాడు. ఏమైనా మాట్లాడితే పరువు దక్కదని వూరుకున్నాడు. కన్యను పక్కగా తీసుకపోయి మెల్లిగా ఆమెతో అన్నాడు–'ఎలాగైనా వీళ్ళను ఇక్కడ్నుంచి తొందరగా తరిమేసే వుపాయం చూడు, అవసరం అయితే ఒక ఏభయ్యో వందో సాయం చేసెయ్-''

అంతలో బయట పోర్టికోలో కారు ఆగిన చప్పుడైంది. సజ్జన్ గుండె దడదడ కొట్టుకోంటోంది ఎవరైనా బయటి వారు వచ్చివుంటే తన బావమరిది వాలకాన్ని చూసి ఏమనుకుంటారు? నౌకరు వచ్చి చెప్పాడు - "డాక్టరమ్మ

గారు వచ్చారండి". "డా. షీలా వచ్చిందట. నువ్వామెను-" అంటూ కన్య వైపు చూశాడు సజ్జన్.

"మీరే ఆమెను లోపలికి తీసుకురండి వీళ్ళను ఇప్పుడే పంపించేస్తాను" అంది కన్య.

వరండాలోకి వచ్చిరావడంతో "హల్లో" అంటూ డా. షీలకు స్వాగతం పలికారు సజ్జన్ షీలా "హలో" అని సమాధానం ఇచ్చింది. ఆమె కంఠం లోనూ చిరునవ్వులోనూ అలసట తొంగిచూసింది.

"రోగుల్ని వదిలి ఇలాంటివేళ దయచేశారే" అని సజ్జన్ పరామర్శించారు.

"శాంప్లింగ్ రోడ్డులో ఓరోగిని చూచిపోదామని వచ్చాను. ఒక నిమిషం తమర్ని కూడా కలుసుకుందామని-"

"పైకి వెళ్ళి మాట్లాడుకుందాం పద"

"లేదు. నీతో మాట్లాడాలి. బయటికి రా"

పోర్టికో బయట పూలమడుల పక్కపక్కగా ఇద్దరూ వడుస్తున్నారు లాన్‌లోకి వెళ్ళడానికి వెదురు బద్దలతో కట్టి పైకి తీగెలు అల్లుకొన్న గుమ్మం దాటాలి. గుమ్మం దగ్గరకు రాగానే డాక్టర్ షీలాసింగ్ "దుర్జన్" అంటూ ఆగిపోయింది. చాల జాలికలిగించే కళ్లతో సజ్జన్‌ని చూస్తూ ఆవేదనను ఒలక పోస్తూ "ఇంక మీ స్నేహితుడు నన్ను చూడ్డానికి రాడా ఏమిటి?" అని అడిగింది.

ఆమె అన్న మాట అతని హృదయంలో వేదన రేకెత్తించింది. "నీ దగ్గరకు రావడం మానేసాడన్న సంగతి నాకు తెలియదే."

"ఎన్నో నెలలైంది. ఆదే చౌకులో విందులో చూశాను చివరిసారిగా, బహుశా జనవరి ఇరవై అయిదో తారీఖు అనుకుంటా"

"ఏమైనా ఘర్షణ జరిగిందా?"

"ఏమి చెప్పమంటావ్. అతని భార్య అంటే నాకేమీ వైరభావంలేదు. మహీపాల్‌లాంటి ప్రజ్ఞావంతుణ్ణి ఆమె అర్థం చేసుకోలేకపోవడం అన్నది నిజం. దాం చిక్కిపోయాడు. నిన్న అమీనాబాదు వెడుతూంటే రోడ్డు దాటుతూ కనిపించాడు. నేనింక సహించలేదు". అని షీలా అంటోంటే ఆమె కంఠం పీరపోయింది. ఆమె తన వేనిటీబ్యాగ్‌లోంచి జేబురూమాలు తీసింది.

షీలా భుజం మీద చెయ్యి వేసి ఆమెను పూరడిస్తూ "డోన్టు బీ ఫూలిష్ షీలా. నువ్వంటే అతనికెలాంటి భావం వుందో నాకు తెలుసు. అతను నిన్ను విడిచి వుండలేడు". అన్నాడు సజ్జన్.

"నేను మిసెస్ శుక్లానుంచి ఆమె భర్తను వేరు చెయ్యను. కాని ఎందుకో మహీపాల్ మీద నాకు గూడా అధికారం వుందని భావిస్తున్నాను".

సజ్జన్ తీవ్రాలోచనలో పడ్డాడు. ఒకామె ప్రణయిని. మరొకావిడ పరిణీత. ఎవరిహక్కు అవుననాలి. ఎవరిహక్కును కాదనాలి. ప్రేమ అనేది ఎవరైనా శాస్త్రనియమాలకు కట్టుపడి చెయ్యరుకదా. ఎవరి మనసైనా ఎవరి మీదైనా మళ్ళితే దాన్ని ఎలా ఆపుచేయడం? కొంచెం సేపటికి ముందు అతని అత్తగారు తన మగడికీ పిన్నమ్మకూ నడిచిన ప్రేమాయణాన్ని తిట్టిపోసింది. కాని ఆ విషయం వేరు. ఇది వేరు అనుకున్నాడు.

"నువ్వతనికి తప్పక చెప్పాలి"

"రేపు ఉదయమే అతనింటికి వెళతాను. నీ దగ్గరకు తప్పక పంపిస్తానుగా"

"ఈ విషయం గురించి మరెవ్వరి దగ్గర ఎత్తకు. నీ భార్యతోనైనా-"

"అలాంటిది జరగదు. విశ్వసించు. నువ్వుకూడా విచారించకు"

"సరే [illegible]"

సజ్జన్ [illegible]లో పడ్డాడు. లోపల వుందని చెప్పాడంటే ఆమెను చూడ్డానికి అన [illegible] వస్తుంది. అక్కడ తన అత్తగారూ, వెట్టి వెంగళప్ప [illegible] వున్నారు"

సూటిగా సమాధానం చెప్పకుండా ఆ మాటను ఒదిలేసి "నువ్వేమీ విచారించకు డాక్టర్ షీలా. మహీపాల్ గొప్ప రచయిత అయినా చంచల చిత్తుడని నీకు తెలుసు. ఏవిధంగానైనా సరే అతన్నీ నిన్నూ కలిపే యేర్పాటు చేస్తానుగా" అని అన్నాడు సజ్జన్.

"అతని బావమరిది వివాహంలో ఎవరో మా ఇద్దరి గురించి ఏవేవో సూటిపోటి మాటలు అన్నారట. అతని భార్య కూడ ఈ విషయం గురించి అతనితో తగాదా పెట్టుకుంది. ఆ సమయంలో మహీపాల్ రెండు రోజులు నా ఇంట్లోనే వున్నాడు"

"అలాగా. నా కిదంతా తెలియదు"

"అప్పుడు నువ్వు మధుర కెళ్ళివున్నావు. నువ్వతన్ని లౌక్యంగా వ్యవహరిస్తావన్న వుద్దేశంతో ఇవన్నీ నీకు చెబుతున్నాను. అయితే నేను వస్తాను" అంటూ రెండడుగులు ముందుకు వేసి మళ్ళీ ఆగి నేలవైపు చూస్తూ అంది- "మహీపాల్ వ్యక్తిత్వంలో ఆకర్షణ అంతా అతని అమాయకత్వంలో వుంది. ఆ అమాయకత్వాన్ని ఆయన చంపుకుని కొత్త తరహా మనస్తత్వాన్ని అలవాటు చేసుకుంటున్నాడు. అతని స్వభావాన్ని నేను బాగు ఎరుగుదును. తనకు తానై బలవంతంగా అలవరచుకుంటున్న ఈ కొత్త తరహా మనస్తత్వాన్ని అతను చంపుకుంటూ ఎక్కువ రోజులు మోయలేడు. అయనకేమైనా అవుతుందేమోనని నాకు బెంగగావుంది.

పోర్టికో వైపు నడుస్తూ డాక్టర్ షీలాకు ధైర్యం చెబుతూ సజ్జన్ అన్నాడు - "షీలా, నువ్వు నమ్ము. మహీపాల్ పూర్వం మహీపాలే. నిన్న పొద్దున్నే ఇక్కడికి వచ్చాడు. నువ్వు నమ్ముతావో నమ్మవో కాని రాత్రి పదిన్నర వరకు ఆమాటా ఈమాటా మాట్లాడుతూ కూర్చున్నాం. స్త్రీ పురుషుల సంబంధం, జాతులూ, ఆర్యులూ ఆనార్యుల సంస్కృతి ఎన్నో మాట్లాడాం అతను అమాయకుడు కాకపోతే ఇంత జ్ఞానం సంపాదించాలనే తహతహ వుండేదే కాదు అతనికి. చాలా భాగం అతనే మాట్లాడాడు. ఎక్కడా ఒక్క మాటపొల్లు కూయలేదు. పిచ్చివాగుడూ లేదు".

"ఏమైనా రాస్తున్నారా!"

ఆ మాటకు సజ్జన్ ఆగాడు. "లేదు. అతనికి ఖాళీసమయం దొరకటం లేదనుకుంటాను. నీ వుద్దేశాన్ని బాగా అర్థం చేసుకున్నాను షీలా. అతని ఉపన్యాసం వింటోంటే అతనిలో ఇంకా ఎంతో కాలం రాయడానికి చేవవున్నట్టు కనిపించింది. ఆ లెక్కను వస్తే ఇంకా నేనే నెలలు గడిచినా ఒక్క చిత్రాన్ని కూడా పూర్తిచేయలేక పోతున్నా."

"ఆఁ ఆఁ. సరే నేను వెళతాను"

ఆగమని సజ్జన్ బలవంతం చెయ్యలేదు. ఆమెను పంపించిన తర్వాత డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాడు సజ్జన్. అనుకున్నంత పని జరిగింది. మిఠాయి మట్టిపాత్ర విరిగి తివాసీ మీద చిందరవందరగా ముక్కలు పడ్డాయి. కన్య చెంపల నుంచి రక్తం కారుతోంటే తన కొంగుతో తుడుస్తూ నిలబడింది ఆమె వదినగారు కొన్ని క్షణాల క్రితమే ఈ సంఘటన జరిగినట్లు కనబడింది సజ్జన్‌కి. కన్య తల్లి నిలబడి చూస్తోంది. బావమరిది మళ్ళీ సమాధి ముద్రలో మునిగి పోయాడు.

కన్యకు గాయం తగలడం చూడగానే సజ్జన్ బుర్ర వేడెక్కిపోయింది, ఆ ప్లేటు ముక్కలు ఇరానుదేశపు తివాసీ మీద చెల్లాచెదురుగా పడి మట్టిబెడ్డల్లా వున్నాయి "చూడు నాయనా, నా అదృష్టం ఎలా పంటలు పండించు కుంటోందో! నువ్వీతణ్ణి నిజంగా పిచ్చి ఆసుపత్రికి పంపెయ్యి. ఒక పుణ్యం ఎలాగైనా కట్టుకున్నావు, ఇది కూడా నీ చేతిమీదే చేస్తే మాకు మహోపకారం చేసిన వాడివౌతావు" అంది అత్తగారు.

బావమరిదిని వెళ్ళగొట్టాలనుకున్నాడు సజ్జన్. విరిగిన పెంకులతో మృత్యువు కున్న సంబంధం అతని మనసులో మెదిలింది. అది తలచుకున్నప్పుడంతా అతని మనసు వణికిపోయేది. అత్తగారికి సమాధానం చెప్పకుండా తన భార్యను చూస్తూ — "కన్యా, ఇంక మాట్లాడకు. అయిందిగా. లోపలికెళ్ళు" అన్నాడు.

"అయితే నాయనా, మా మొర్గ్ అలకించనట్టేనా" అని అడిగింది అత్తగారు.

"లేదండి. పెద్దపనికి నేను మద్దతు యివ్వలేను. కన్యా, నువ్వు ముందు పద"

''ఒకిన్ని నా దగ్గిర వుంచుకొని తర్వాత పంపుతాలేమ్మా.''

''ఏమక్కర్లేదు, మాలాంటి పాపాత్ములు మీ ఇంట్లో వుంటే మీకు కూడా ఆ పాపం అంటుకుంటుంది." అంటూ కొడుకువైపు చూస్తూ ''ఒరే చిన్నా, ఇంకలే. ఇంటికివెళ్దాం. అయినవాళ్లే తుడిచేసుకుంటోంటే పరాయివాళ్లు ఒకలెఖ్ఖా! కన్న తండ్రినే వూరంతా ప్రచారం చేసి వేసి అప్రతిష్ట పాలు చేసిన కూతురు దగ్గిర సహాయం ఆశించడం నాదేశుద్ధ తప్పు. కాని ఒక్కమాట ప్రతి మనిషికీ సమయం అంటూ వస్తుంది. నరమంత్రపు సిరి వచ్చిందని విర్రవీగినంత మాత్రాన ఎవరికేమీ చెడు జరుగదు. కాలం ఒక్కరీతిగానేవుండదు. పూలమ్మిన చోట కట్టెలమ్ముకునే రోజులు కూడా రావచ్చు, రేపు నీ మొగుడూ ఇటువంటి పనే చేసారనుకో-"

మొగుడి ప్రస్తావన తెచ్చేసరికి కన్య వుండబట్టలేకపోయింది. ఆమె ముఖం క్రోధంతో కందగడ్డలా అయింది. కంఠం కొంచెం పెద్దదిచేసి, ''ఇటువంటి వ్యక్తులు పొరపాటు చేసినా దానివల్ల ఇతరులకు ప్రయోజనమే కలుగుతుంది కానీ కీడు మాత్రం కాదు. ఇలాంటి వారు ఎవరికీ హాని తలపెట్టలేరు. అసలు యిలాటి వ్యక్తులు ఎంతమంది వున్నారు ప్రపంచంలో!" అంది చాలా తీక్షణంగా.

"ఇక చాలించు. నువ్వు ముందు లోపలికి వెళతావా లేదా ?" అంటూ సజ్జన్ భార్యను మందలించాడు. బటన్ నొక్కాడు. నౌకరు వచ్చాడు "రామ్ గులామ్, తల్లిగారికి ఓ టాంగా మాట్లాడుకునిరా. చూడు, ముందు ఈ చెత్తనంతా శుభ్రం చేయించు" అంటూ సజ్జన్ పురమాయించాడు.

సజ్జన్ మనసుసరిగా లేదు. ప్రజాసామాన్యం పట్ల కారుణ్యాన్ని మరిచి పెట్టుబడిదారుగా మారిపోయాడు. కన్య చెయ్యి పట్టుకుని లాగుతూ "నువెళ్లు"

అంటూ ఆమెను అక్కడ ఏమాత్రం ఆగనివ్వక లోపలికి తీసుకెళ్లారు. వెళుతూ వెళుతూ రామ్‌గులామ్‌ని ప్రస్తుతానికి అక్కడే వుండమని చెప్పి వెళ్లారు.

లోపల గేలరీలోకి వెళ్ళిన వర్మాళ తన వెర్రి బాగుల బావమరిది మరే అఘాయిత్యం చేస్తాడో కనిపెట్టి వుండమని మరో నౌకర్ని డ్రాయింగురూమ్‌లోకి పంపారు.

కన్య బాగా అలిసిపోయింది. అంతా జమిందారీ ఫక్కీలో ఆమెకు శైత్యోపచారాలు చెయ్యాలనుకున్నారు సజ్జన్. కాని కన్య వద్దని వారించింది. దాంపత్య సౌఖ్యంతో పొంగిపోతోన్న కన్య యీ జరిగిన సంఘటన నుంచి భర్త ధ్యాస మరల్చడానికి చాలా ప్రయత్నం చేసింది. కాని ఆమె ప్రయత్నం ఫలించలేదు. తాను స్కూల్లో చదువుకున్న రోజుల గురించీ, చుట్టూ ఆల్లికల గురించీ, ఆ వీధిలోని ఆడపడుచులు తన దగ్గర కొచ్చి ఏమేమి వివరాలు అడిగి తెలును కున్నదీ మొదలైన ఇంకా ఏవేవో విషయాల్ని చర్చించింది. కాని ఏ విషయాన్ని మొదలెట్టినా అది చివరికి సాయంకాలం జరిగిన సంఘటనతో సంబంధం కలుపు కుంటూ ముగుస్తుంది. ఆ ప్రసక్తి రాగానే పుట్టింటి వాళ్ళగురించి ఆమె నోటిని ఎవరో బలవంతాన నొక్కేసినట్లయింది.

బయటికి ఎన్ని ముచ్చట్లు చేసినా పుట్టిల్లు మాటిమాటికి ఆమె మనసులో మెదలుతూ పొడుస్తోంది. తండ్రిని జైలుకు పంపడం న్యాయమా అన్యాయమా? పాపమా, పుణ్యమా? ఈ ప్రశ్నకు ఎంతవెతికినా ఆమెకు సమాధానం దొరకలేదు. సంఘసేవకు సంబంధించి ఆమెతో సంప్రదించడానికి వచ్చే మహిళా కార్యకర్తలు ముఖావంగానో, స్పష్టంగానో నువ్వు చేసింది అన్యాయం అని వాళ్ల అభిప్రాయాలు తెలిపారు. ఇవ్వాళ ఆమె కన్నతల్లే ఆమె ముఖాన అంది. షీలాతో కలిసి సజ్జన్ బయటికి వెళ్ళగానే ఆమె తల్లి మగవాళ్ళ చిత్తప్రవృత్తుల్ని వర్ణిస్తూ పెద్దవాళ్ళను నమ్మడానికి వీల్లేదు, ఇవ్వాళ పెళ్ళిచేసుకుని రేపు విడాకులిచ్చేస్తారని ఏవేవోలేనిపోని మాటలు చెప్పి ఆమెను భయపెట్టాలని చూసింది. ఒకే కులంలోనే చేసుకునే సంబంధాలు పుటుక్కున తెగిపోతూంటే

తాడూ బొంగరంలేని ఈ కాపురం మూనాళ్ళ ముచ్చటేలేఅంటూ తన అక్కసు వెళ్ళగక్కింది. ఏదో కన్నతల్లి అంటే అందిలే అని కన్య పట్టించుకోలేదు. కాని తీరా తన భర్తనే అడ్డం పెట్టుకుని అంటోంటే ఆమెకు అరికాలి మంట నెత్తి కెక్కింది. "నా పసుపు కుంకమ చూసి అమ్మ కళ్ళల్లో నిప్పులు పోసుకుంటూంది. నా ఐశ్వర్యం చూసి అసూయ పడుతోంది" అన్న భావన ఆమెలో గాఢంగా నాటుకుంది. తల్లిమీద చెప్పలేనంత కోపం వచ్చింది. తండ్రిని చెర నుంచి విడిపించటానికి కన్య నిర్మొహమాటంగా నిరాకరించగానే కోపంలో భాశీ చేసిన ప్లేటును కన్యమీదకు విసిరేశాడు పిచ్చి అన్న. కన్య చెంపను రాసుకుంటూ ఆమె భుజం మీదుగా వెళ్ళికిందపడింది. అదృష్టవశాత్తు ఆమె ముఖం మీద తగలేదు. చెంపకురాసుకోవడంలో కోసుకుని రక్తం కారడం మొదలెట్టింది.తల్లీ, తండ్రి, పిన్నమ్మ చేతుల్లో ఆమె చాలాసార్లు దెబ్బలు తింది కాని జీవితంలో అన్నగారిచేతిలో దెబ్బతినడం ఇదే ప్రథమం. విధవరాలైన పిన్నమ్మ తన తండ్రి మద్దతువున్న గర్వంలో క్రితం సంవత్సరందాకా చెయ్యిచేసుకుంటూ వచ్చేది. ఓసారి ఆమె ఇలాగే తనమీద చెయ్యిచేసుకుంది. ఇంట్లో యుద్ధకాండ కూడ జరిగింది. అమ్మ తనవైపు మాట్లాడుతోంటే తన కన్న తండ్రే పిన్నమ్మ తరపున వకాల్తాపుచ్చుకుని అందరిని దావబాదాడు. అసలు ఆ యింట్లో ఆడ పడుచులు దెబ్బలు తినడం అనేది ఆచారంగా ఎన్నాళ్ళనుంచో వస్తోంది. అమ్మ గ్రహరాశి బాగున్నప్పుడు పిన్నమ్మకు ఒడితెపూజ జరగడం, చిన్నమ్మ గ్రహ రాశి బాగావుంటే అమ్మ ఒళ్ళంతా హూనం కావడం మామూలే. చిన్న భార్య కేవలం భర్త చేతిలోనే దెబ్బలు తింది. చచ్చిపోయిన ఒదినగారైతే క్రితం సంవత్సరం దాకా అత్తమామల చేతుల్లోనూ, చిన్నత్త చేతిలోనూ ముగ్గురి చేతుల్లో ఎముకలు పొడి చేయించుకునేది. మిస్టర్ సజ్జన్ వర్మ అర్ధాంగి అయిన వన కన్యకు అన్నగారు మట్టిపాత్ర విసిరిన ఫలితంగా దెబ్బఅయితే చెప్పకో తగి నంతగా తగల్లేదు కానీ కలహాలకు తగాదాలకూ పుట్టిలైన తన పుట్టిల్లు చరిత్ర పుటలు ఆమె కళ్ళముందు గిరగిరా తిరిగాయి.

చైనా పనితనంతో మంత్రముగ్ధుల్ని చేసే పందిరి మంచంపై దన్లప్ పరుపు మీద తలను భుజం మీద ఆనించి పడుకుని ఇంత పెద్ద బంగాళాకూ

మహా రాణిలా, ఎక్కడ చూసినా కనిపించే నౌకర్లకూ యేలికగా, ప్రియుని ప్రాణానికి ప్రాణంగా మసులుకుంటోన్న వన కన్య గతించిన జీవిత సన్నివేశాల్ని తలచుకుంటూ వాపోతూవుంది. పాకుడుపట్టిన ఆ జీవితంలోని కాలుష్యాన్ని ఎలాకడిగివేయడం? ఒకప్పుడు ఈ ప్రశ్న తన భర్తనే వేధించేది. ఇప్పుడు తనను గూడా వేధించడం మొదలెట్టింది. తన పుట్టింటివాళ్ళను తన వాళ్ళుగా చెప్పుకోవడానికి ఆమెకు సిగ్గేస్తూంది. అలా సిగ్గుపడ్డం కూడా ఆమెకు అవమానకరంగా వుంది. ఎంతచెడినా రక్తపాశాన్ని తెంచుకోవడం అంత సులభంకాదు.

సాయంకాలం సంఘటన గురించి మాట్లాడాలని వుక్కిరిబిక్కిరవుతూన్న ఆమె మనసు చివరికి పొరలు పొరలుగా విప్పుకుని బయటపడకుండా వుండలేక పోయింది- "పాశం అన్నది చాలా విచిత్రమైంది. కలుషితుండే కాని తెగ్గొట్టడం దానికి చాతకాదు" అని అంది సజ్జన్‌తో.

"నిజమే కాని భావావేశంలో వుండేవాళ్ళకూ, చిత్తశుద్ధి కలవారికి మాత్రమే" అని అంటూ కుర్చీమీద విశ్రాంతిగా బాగా ఆనుకుని కాళ్ళు మంచం మీద పెట్టుకున్నాడు సజ్జన్.

"ఏమైనా అనండి. రక్తపాశాన్ని తెంచుకోవడం అంత సులభంకాదు. కొన్నాళ్ళ తర్వాత మీకే నామీద మోహం మొత్తి నామీద చూపిస్తోన్న మోజే మరొకళ్ళమీద చూపించడం మొదలుపెట్టారనుకోండి-"

"అనూ. ఇంకా అనూ. నువ్వు వాడిగానూ, వేడిగానూ ప్రయోగించిన ఈ నర్మోక్తిని సహించడానికి సిద్ధంగా వున్నాను".

కన్య నవ్వుతూ అంది- "నేను మాట వరుసకు అంటున్నాను" అలా ప్రపంచంలో జరగడంలేదూ? ఇవ్వాళ కలుస్తారు. రేపు పెళ్ళి అవుతుంది.ఎల్లుండి విడాకులూ, మళ్ళీ రెండు రోజుల తర్వాత మళ్ళీ కొత్త ముఖాలూ, కొత్తకలయికలూ, కొత్త పెళ్ళిళ్ళూ కొత్తగా విడాకులూ. నాకో సందేహం. అలా విడాకులిచ్చుకున్న భార్యాభర్తలు ఎప్పుడైనా కలుసుకున్నారనుకోండి. వాళ్ళ మనసు

ల్లోని భావాలు ఎలావుంటాయి? పాత దాంపత్యపు రోజుల్నీ, ఆ అనుబంధాన్నీ మరిచిపోగలరా?"

"లేదు. బైరన్ అనే ఓ ఆంగ్ల మహాకవి వున్నాడు. అతనికీ అతని భార్యకూ విడాకులు పుచ్చుకున్న తర్వాత ప్రేమ రెట్టింపయిందంట-కాని వీటితో నాకు సామ్యం ఏమిటి?"

"నేనేదో తమాషాకు మాట్లాడుతోంటే సీరియస్‌గా తీసుకుంటున్నావు గుమ్మడికాయలదొంగ ఎవరా అంటే నువ్వెందుకు భుజాలు తడుముకుంటావ్"?

"ఈ ప్రశ్న నేనే నీకు వేస్తానని వెనకటికి హాలింతాయి అన్నారట. అభినయం చేస్తూ సజ్జన్ అన్నాడు.

కన్య చిరునవ్వు నవ్వుతూ అంది- "నా ఈ నిర్లక్ష్య భావంతో అన్న ఛలోక్తిలోనూ నా ఈ అంతరాంతరంలో ఎవరో దొంగపొంచి వున్నాడనేగా- అంతేనా?"

"అవునండి. యిఫ్ యూ డోన్ట్ మైండ్"

"ఆఁ పోండి. మీరు మరీనూ. ఈ ఛలోక్తికి కారణం చెప్ప మంటారా?"

"ఊఁ తప్పక శెలవివ్వండి"

"నువ్వు డాక్టర్ షీలా బయటికి వెళ్లావు. అప్పుడే మా అమ్మ నన్ను ఈ మాటలు చెప్పి భయపెట్టింది. ఎంత ఆపు కుందామన్నా నవ్వాపులేక పోయాను" అంటూ కిలకిల మని నవ్వేసింది వనకన్య.

ఒకచూపుతో అవగాహన చేసుకున్నాడు సజ్జన్. నవ్వూ, బుద్ధికుశలతను అర్థంగా పెట్టుకుని గీతలా గీస్తోన్న అగరు బత్తిలాంటి ఆమె భయం చూసి ఆమెపై సానుభూతి కలిగింది సజ్జన్‌కి. అందంగానూ, అమాయకంగానూ, నేర్పూ ఓర్పుతో ప్రకాశిస్తోన్న తన భార్య మీద అతనికి ప్రేమ ఇనుమడించింది. మాటల్లో తీపిని నింపుకుని ప్రశాంత కంఠంతో సజ్జన్ అన్నాడు- "ఒక్క సత్యాన్ని జీవిత మంతా జ్ఞాపకం వుంచుకో. కావాలంటే ప్రయోగించి కూడా

చూడు. నీ ఈ జీవిత భాగస్వామిలో లక్ష దుర్గుణాలు వుండొచ్చు. ఉన్నాయి కూడ. కాని అతనిలో ఓ సుగుణం కూడా వుంది. నేను నిశ్చయానికి వచ్చే వరకు పరిస్థితి వేరు. కాని నా బుర్రలో ఏదైనా అభిప్రాయం నిలదొక్కుకుందంటే అది ఇంక అంతే, రాతిలా కదలదు, పర్వతమై కూర్చుంటుంది. నీవు కావాలంటే ఎప్పుడైనా పరీక్షించి చూసుకో"

అతనలా దృఢంగా మాట్లాడుతోంటే భర్తచేసిన పొగడ్తలకు మెరుస్తూన్న ఆమె కనుపాపలు నువ్వంటే నమ్మకం వుందని చెప్తున్నట్లుగా అతని ముఖం నిండా వ్యాపించాయి.

# 37

హోలీ రెండవ రోజు బాబారామ్‌జీని, అతని శిష్య బృందాన్నీ విందుకు పిలిచాడు సజ్జన్. వాళ్ళ కోసం ఓ టూరిస్ట్ బస్సును ఏర్పాటుచేసి వాళ్ళను దాన్లో రప్పించాడు ఇంటికి. చుట్టూ వందిమాగధులతో సజ్జన్ బంగాళాలో అడుగు పెడ్తోన్న బాబా అచ్చంగా పరమ శివునిలా వున్నాడు. తన తల్లి పూజా మందిరంలో అందరికీ కూర్చోడానికి సజ్జన్ ఏర్పాటు చేసాడు. కన్య వంటింట్లో ఇవ్వాళ చెయ్యాల్సిన వంటకాలు పురమాయించడంలో సజ్జన్ ఈ రోజు అమితోత్సాహంగా వున్నాడు తల్లి పోయిన తర్వాత మొదటి సారిగా అతని ఇంట్లో ఇంత హుందాగా హోలీ వేడుక జరుగుతోంది. ఇప్పుడేమో బాబారామ్‌జీ అతని శిష్య బృందానికి విందు. సాయం కాలం కర్నల్, మహీపాల్ వాళ్ళని సపరివారంగా విందుకు ఆహ్వానించాడు. నౌకర్లందరికీ హోలీ సందర్భంగా విందీ వంటలూ, ఒక్కో రూపాయి పండుగ మామూలు, ఒక చొక్కా, ధోవతీ ఎర్ర తలపాగా ఇస్తారు.

ఇవ్వాళ పొద్దున్నుండే కన్యకు ఒక క్షణం కూడా తీరిక లేకుండావుంది. ఊపిరి పీల్చుకోవడానికి కూడా నౌకర్లకు వ్యవధి దొరకడం లేదు. రేపు అందరికీ శలవు ఇప్పిస్తానని కన్య వాళ్ళకు హామీ ఇచ్చింది.

మందిరాన్ని ఇవ్వాళ పూలతో బ్రహ్మాండంగా అలంకరించాడు సజ్జన్. తామూరుకు రంగు చల్లిన వస్త్రాలు తొడిగాడు పెద్ద వెండిగిన్నెలో రంగు కలిపి రెండు బంగారు పిచ్చికారీల్ని చెరొక వైపు దేవుడికి ఎదురుగా వుంచాడు. తల్లి గారి తైలవర్ణ చిత్రాన్ని ఓ పెద్ద గులాబీల హారం అలంకరించింది. సజ్జన్ అపరిమితమైన ఆనందంలో తిరుగాడు తూందరం చూసి బాబా "ఏం రామ్‌జీ, ఇంత ఆనందం మీకు ఎప్పుడైనా కలిగిందా" అన్నాడు.

"లేదు బాబాగారూ"

"గృహస్థాశ్రమమన్న మించిన ఆశ్రమం లేదు రామ్‌జీ"

"ఆదెలాగండీ? సన్యాసుల కంటె ప్రపంచలో సుఖంగా నిర్వికారంగా వుండే వాళ్ళు ఎవరున్నారు చెప్పండి"

"నువ్వు చెప్పేది ఓరకంగా నిజమే. బైరాగులూ, సన్యాసుల కన్న సుఖంగా జీవించే వాళ్లు లేరు. కాని దేశకాల పరిస్థితుల్ని బట్టి మా సిద్ధాంతం ఏమిటంటే పరమ తత్వాన్ని ఒంటరిగా పొందరాదని. కర్మయోగంలోనే వాస్తవమైన ఆనందం వుంది. కర్మయోగానికి గీటురాయి గృహస్థాశ్రమం".

"కాని దుఃఖానికి మూలం గృహస్థాశ్రమమేకదా గురుదేవా, గృహాన్ని నిలబెట్టుకోవడానికే కదా ఒకడు మరొకడి మీద కత్తినూరుతుంది, రకరకాల పాపాలు చెయ్యడం"

"మరి గృహస్థునిగా వుండి కూడా పుణ్యం ఆర్జించ వచ్చు. ఆర్జిస్తారు కూడాను. గృహస్థాశ్రమమే లేకపోతే సృష్టిఎలా నడుస్తుంది? అంతా మాకు మల్లే లంగోటీ బిగించి తిరిగితే సృష్టి ఆగి పోతుందిగా".

"ఆగి పోయినా ఏమీ ఫరవా లేదులే బాబాగారు. నడిచి కూడా ఏం చేస్తున్నది? ఇప్పటికి పరమాణు ఆయుధం తయారు చేశారు. రేపటికి ఉదజని బాంబు,కూడా తయారు చేస్తారని వినికిడి. ఇక రానురాను ఎలాటి మారణాయుధాల్ని చేస్తారో వూహించ డానికి శక్యం కాలాదం లేదు. మరి అలాంటి సృష్టివల్ల ఏమిటీ ప్రయోజనం"

ఆ మాటకు బాబా నవ్వుతూ అడిగారు- "భగవంతుడంటే నమ్మకం వుందా" అని.

ఈ ప్రశ్నకు కొంచెం తడబడ్డారు సజ్జన్. మళ్ళీ సంబాళించుకుని చెప్పారు "వున్నా ఉన్నట్టు నమ్మకం కలగడం లేదు. లేదన్న అపనమ్మకమూ కలగడం లేదు. కొద్ది రోజుల క్రితమే మధుర వెళ్లాను. కృష్ణ భగవానుడు పుట్టిన చోటు కదా భగవంతుడు అంటే బహుశా మానవ మాత్రుడే కదా అని సందర్శించాను మన దగ్గరకు వచ్చిన అవతారాలన్నీ- రాముడూ, కృష్ణుడూ అందరూ మానవ రూపంలోనే కదా భూమి మీదకు వచ్చింది".

"యధార్థం చెప్పారు రామ్‌జీ. నా అభిప్రాయం కూడా అంతే. భగవంతుడు అనేవాడు కేవలం మనిషిలోనే కాదు ప్రతి జీవిలోనూ వున్నాడు. అయితే మనిషిలో చైతన్య శక్తి ఎక్కువగా వుంది కనుక మనిషి కన్న మిన్న మరెవ్వరూ లేరని వ్యాసుల వారు చెప్పడానికి ఇదే కారణం. అంత గొప్ప మానవజాతి ఆత్మహత్య చేసు కుంటుందా" అని ఆలోచించడం కూడా అసాధ్యం రాముడు అన్ని జీవుల్లోనూ, అందరి ఆత్మల్లోనూ వ్యాపించి వున్నాడు. విశ్వాసం వుంచండి."

సజ్జన్‌కు మరో విషయం తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలిగింది. కాని ప్రశ్న వేద్దామా వద్దా అని తటపటాయిక చాలు నోటిదాకా వచ్చి వూరుకున్నాడు. మెరుస్తోన్న తన చిన్న చిన్న కళ్ళతో నవ్వుతూ బాబా- "అభ్యాసం రూపంలో భగవద్దర్శనం అందరిలో చేశాను. కాని అతని పరమ స్వరూపాన్ని నేనూ ఇంత వరకు దర్శించే భాగ్యం పొందలేదు, అనుభవం మీద అతని పరమ స్వరూపాన్ని అన్ని జీవుల్లో చూడొచ్చు అని చూసిన వాళ్ల చెప్తారు. వాళ్ళ మాటల్ని నమ్ముతాను రామ్‌జీ. మిగిలిన సత్యం అనేది అనుభవైక వైద్యం. అందుకే ప్రయత్నం చేస్తారు. వుంటే కనిపిస్తాడు. లేకపోతే పోనీయ్. మాకు అయితే నిష్కామ సేవ లోనే పరమ సౌఖ్యం కలుగుతోంది. ఈ భువిమీద భగవంతుడు తిరుగు తున్నాడనే సంతృప్తే చాలు".

"అది సరేకాని బాబాజీ. మిమ్మల్ని ఒక విషయం అడుగుతాను. చెప్తారా? కూర్చునే మీరు ఎదుటి వ్యక్తి మనోభావాన్ని చదివేస్తారు. రాబోయే దాని గురించి వర్ణిస్తారు. అది–"

బాబా పకపకా నవ్వాడు సజ్జన్ మాటకి. "ఇందులో రహస్యం ఏమీలేదు రామ్‌జీ. అనుభవం మీదే అన్ని శక్తులూ సమీకరించగలం. నిరంతర సాధనవల్ల అనుభవం సిద్ధిస్తుంది. తులసీదాసుగారు చెప్పినట్టు అన్ని పదార్థాలూ ఈ ప్రపంచంలోనే వున్నాయి. కర్మ చెయ్యని మానవునికి ఏ పదార్థమూ దొరకదు".

సజ్జన్ ఆలోచనలో పడ్డాడు. ఈ ప్రపంచం – ఇంతవరకు మార్మిక లోకంగా కనబడుతోన్న యీ ప్రపంచం – ప్రపంచమంతటా మార్మికత్వాన్ని పుణికిపుచ్చుకున్న దేశంగా ప్రసిద్ధికెక్కిన భారతదేశం – బాబాగారు చెప్పిన ప్రకారం చూస్తే ఎంతో సరళమైనదీ, సులభమైనదీ, సాధనాద్వారా పొందగలిగేదిన్నీ. మరి ఆ సాధన ఎలాంటిది? ఆ సాధన తాను చేయ గలడా?

"ఎందుకు చెయ్యలేవు రామ్‌జీ? మనిషికి అసాధ్యమైంది ఏదీ లేదు. అతనికి కోరికా సంకల్పం కలగడమే తరువాయి"

"సంకల్పం కలగడమే తరువాయి! సంకల్పం కలగడమే తరువాయి!" ఒక్క క్షణంలో గాలిలో తేలిపోయి అన్ని సిద్ధులూ సంపాదించినట్లయింది సజ్జన్‌కు. ఆ ఉద్రేకంలో అతనిలో ఎక్కడలేని స్ఫూర్తి, ఆనందం, తన్మయత్వం వచ్చాయి

"ఆసిద్ధింప చేసుకున్న తర్వాత ప్రతిదీ క్షణంలో అవుతుంది. కాని సిద్ధి పొందడంలోనే ఆలస్యం అవుతుంది. శక్తిని ఖర్చు చెయ్యాల్సి వస్తుంది. నిగ్రహం, ధైర్యం లేని మనుష్యుడు సాధకుడుకాలేడు".

"నేను చెయ్య గలనన్న నమ్మకం వుంది"

"అయితే సరే. మీ నమ్మకాన్ని కర్మ అనే మెరుగు రాయి మీద సాన తీయండి"

"నేనేమి చెయ్యాలి?"

"సేవ"

"ఎవరికి?"

"రాముడికి. ప్రతి జీవియందు వ్యాపించిన రాముడికి. సీస్వామికి–"

"బాబాగారూ! ఓ చిన్న సందేహం. క్షమించండి. నేను భగవంతుడికి దాసుణ్ణి ఎందుకు కావాలి?"

"కావద్దు. వాత్సల్యంతో పూజించు. సఖ్యభావంతో భజించు. ఆత్మభావంతో ధ్యానించు, నువ్వేభావంతో ఆరాధించినా సేవకుడివి కావాల్సి వుంటుంది. తల్లి సంతానానికి సేవ చేస్తుంది. స్నేహితుడు స్నేహితుడికి సేవ చేస్తాడు. మనిషి తనకు తానే సేవ కూడా చేసుకుంటాడు. రామ్‌జీ, సేవ అంటేహీనంగా చూస్తున్నారు. మీకు జ్ఞాపకం వుందా, ఇదే ప్రశ్న మీరు ఇంతకు ముందు కూడా ఓ సారి అడిగారు"

సజ్జన్ సిగ్గుపడ్డాడు– "నాలో వున్న ఈ గొప్పతనం అనేభావన నాతర్క బుద్ధిని కూడా తప్పుదారి పట్టిస్తూంటుంది."

"గొప్పతనం అనే భావన చెడ్డది కాదనుకోండి. రాముడు ప్రతి ఆత్మలో వున్నాడు. అందువల్ల ఆ గొప్పతనం పట్ల మీరు కూడా భావాన్ని ప్రకటించుకోవాలి. మేం ఏమీ చదువు సందెలేని వాళ్ళం. అనుభవం ద్వారా కలిగిన యోచనల్ని గుణించుకొని మధించుకొని పదును పెట్టుకుంటాం. మీరు దేశంలో చాలా చోట్ల తిరిగారు. చాలా చాలా పుస్తకాలు చదివారు. విద్వాంసుల సత్సంగం చేశారు ఎటువంటి విశాలమైన దేవాలయాలూ, భవనాలూ, విగ్రహాలూ, విజ్ఞాన జగత్తు సృష్టించిన చమత్కారాలూ మీరు సందర్శించి వుంటారు. వాటినే కొలవండి– వాటిలోనే అంతర్లీనమైపోండి".

"చాలా కష్టమైన పని"

"అవును. మాకు కూడా కష్టంగానే కనపడుతుంది. రామ్‌జీ. మీరెన్నో సుందరమైన చిత్రాలు గీస్తారు. మేము అలా గీయలేం. మాకు చాలా కష్టంగా కనపడుతుంది. మరి మాకు అంత కష్టంగా కనపడే పని మీరు ఎలా చేయగలుగుతున్నారు రామ్‌జీ?"

భక్తి ప్రపత్తితో బాబా పాదాల ముందు శిరసు వంచాడు సజ్జన్. బాబా గారు అప్యాయత కనబరుస్తూ అతణ్ణి లేవదీసి ఇలా అన్నారు— "అభ్యాసం వల్ల యోగం వస్తుందన్నాడు గీతా భగవానుడు. మరి యోగం అంటే కర్మ నైపుణ్యం అన్నమాట. మనసావాచా కర్మణా నువ్వు పనిలో ఎంతలీనమైపోతే అంత నైపుణ్యం అర్జించుకుంటావ్".

"చాలా కష్టమండి. మాయా, మోహం అనే అప్సరసలు మనిషిని కట్టి వేస్తాయి. ప్రపంచంలో వుంటూ గార్హస్థ్య బంధాల్లో వుంటూ—"

"అది అజ్ఞాని అభిప్రాయం. విజ్ఞాని అలాంటి అభిప్రాయం ఎన్నడూ ప్రకటించరు. నేనొక మాట అడుగుతాను చెప్పండి. ఆటంకాలు చేసేవాళ్లంతా అడవుల్లోనూ, గుహల్లోనూ వుంటారా చెప్పండి. సాధనవల్లనే కదా వాళ్ళింతవరి పూర్ణతా, సిద్ధి పొందగలిగారు".

"ఆహా! సర్వనాశనాన్ని తెచ్చి పెట్టారు."

"నిజమే. మరి నువ్వు నాశనాన్ని కాకుండా నిర్మాణాత్మకమైన ప్రయోజనాన్ని సాధించు. చైతన్యం కవాటాలు ఎంత విశాలమైతే అతనికి విజయం కూడా అంతసుకరంగానూ నిర్ణయాత్మకంగానూ సిద్ధిస్తుంది. పోటీ, ఘర్షణా అనేవి వున్నప్పుడే రహస్యం మీద వున్న నాచు తొలగిపోయి అది ప్రకాశిస్తుంది. వికాసం జరిగేది ఎలా? యోగం అనేది గృహస్థాశ్రమం కోసం అని నేను అంటాను."

అంతలో కన్య అక్కడికి వచ్చింది. ఆమెను చూడగానే "ఏం భక్తురాలా, లక్ష్మీ వైభోగం అనుభవిస్తున్నావా?" అని బాబా అడిగారు.

ఆ మాటకు కన్య సిగ్గుపడింది కళ్ళు కిందికి దించి నవ్వుతూ "అవును బాబాగారూ. కాని నాకు సాధ్యమైన మేరకే" అని అంది నమ్రతగా.

"ఎందుకని? ఇలాచూడు ఎంత విశాలమైనదో ఈ బంగళా. ఎంత మంది నౌకర్లో. నీకు ఏమి కొరతగా వుంది? దర్జాగా పట్టె మంచం మీద కూర్చుని పెత్తనం చలాయించు"

బాబాగారు చెప్పేతీరూ, చమత్కారం చేస్తూ మెరుస్తోన్న అతని కళ్లూ వాళ్ళను ఇంచు మించుగా ఏడ్పించేలా చేసాయి. బాబాగారివైపు చెయ్యిసాచి సజ్జన్ అన్నాడు- "అసలైన లక్ష్మి శరీరం అనే మేడలోనే వుంది. ఆ ఆనం దాన్ని మేమెలా అనుభవించ గలం?"

"సుఖ దుఃఖాలనేవి మన మనోభావంలోనే వున్నాయి. ఎందులో సుఖం వుంటే అదే లక్ష్మి అనుకో. శ్రీ అంటే మరేమీ కాదు. ప్రాతః కాలాన సూర్య నారాయణుడు తూర్పున సముద్రంలోంచి వచ్చే సమయంలో అతని తేజస్సు ఆకాశం అంతా పాకుతుందే అలాగే ఈ తేజస్సు కూడా అంతరంగిక భావ ప్రకటనే అనుకోండి".

లక్ష్మి గురించి బాబా చెప్పిన కొత్త నిర్వచనం విని సజ్జన్ చకితు డయ్యాడు.

బాబాగారు చెప్పుతు పోయారు- "బెంగాల్లో రామకృష్ణ పరమహంస వుండేవారు. ఒకచేత్తో బంగారం రెండో చేత్తో మట్టిబెడ్డ పట్టుకుని సమభావనతో చూసేవారు. ఎందువల్ల? అనంతలక్ష్మి అతణ్ణి వరించింది గనుక. జనకమహా రాజున్నారు. నౌకర్లూ, సైనికులూ, మహామేడలూ ఎన్నో ఎన్నో, ఏం కొదువ? భగవంతునికి మామగారు, జగజ్జననికి తండ్రి. గృహస్థు, రాజు. అయినా ఏవస్తువూ అతణ్ణి మోహింపచేయలేక పోయింది. కారణం అంతులేని లక్ష్మి అతణ్ణి వరించింది."

"వినటానికి బావుంది కాని అర్థం మాత్రం కావటం లేదు" అంది క్రిస్టీ. "మనం వుండే వాతావరణ ప్రభావం మనిషి తప్పక పడుతుంది. ఇన్ని సంవత్సరాలు లక్ష్మి పుత్రుల [illegible] నేను ఈ రోజు ఆ వాతా వరణంలోకి వచ్చి మీనితో వుంటే చైతన్య [illegible] మాని ఆనందించ కుండా వుండలేక పోతున్నాను. ఈ రంగరంగ వైభవం [illegible] నిగ్రహం కల మనిషిని కూడ తనవైపు లాగేసు కుంటుంది. వాస్తవానికి ఆదర్శాలు నాకు ఎంత అందగా నిలిచినా వాటి గుణాలింపు ఎటువంటి వాటినైనా మైమరపించేస్తుంది"

"అవునమ్మా. ఈ నీతినియమాలూ, ఆచారవ్యవహారాలూ, ఈ తలంపులే నిజమైన సిరిసంపద. నీ దగ్గర కొద్దిగానే పెట్టుబడివుంది గనుక పెద్ద మొత్తాన్ని చూసి దాని వల్ల ప్రభావితం అవుతున్నావు. దరిద్రుడు లక్షాధికారితో లక్షాధికారి కోటీశ్వరునితోనూ, ప్రభావితం అవుతాడు. నీకో దృష్టాంతం చెపుతాను. జనక మహారాజుని విదేహుడంటారు. మనమంతా ఇన్ని సంవత్సరాలు అడవుల్లో కందమూలాలు భుజించి తపస్సు చేస్తున్నాం. మనం చూస్తుండగానే జనకుడు మన పదవిని సంపాదించాడు అని ఋషులూ, మునులూ అనుకున్నారట. అంతే వాళ్ళలో ఒక మహాత్ముడు వెంటనే జనకుని దర్బారుకు వెళ్ళి జనకుని అడిగేశాట్ట. "నువ్వు అన్ని రాజభోగాలు అనుభవిస్తూ విదేహి ఎలా కాగలిగావుఅంటూ. భగవంతుని మీద నువ్వెలా ధ్యాస నిలుప గలుగుతున్నావని. మీరి రహస్యం నాకు చెప్పండి. లేకపోతే మీ బండారాన్ని బయట పెట్టుతాం" అనిఅతనుబెదిరించాడట.

"మహాత్మా ముందు మీరు కాసేపు విశ్రమించి భోజనం చేయండి. తర్వాత తాపీగా అని ఆలోచిద్దాం" అన్నాడట జనక మహారాజు. అంతే. ఋషిగారిని సాదరంగా సత్కరించి రాజ మర్యాదలన్నీ చేశారు. స్నానం, సంధ్య, పూజా పునస్కారం అంతా అయిన తర్వాత ఆతణ్ణి వంటింట్లోకి తీసుక వెళ్ళాడట మహారాజు. అక్కడ బంగారపు పీట, బంగారంతో చేసిన కంచం, అనేక రకాల పిండి వంటలూ అన్నీ కంటబడి నాయట. ఒక ఏర్పాటు మాత్రం మహారాజు ప్రత్యేకంగా చేయించాడు. ఏ పీటమీద కూర్చుని ఋషివరుడు భోజనం చెయ్యాలో అక్కడే తలకు సూటిగా పైన ఓ కత్తిని వేలాడ గట్టించాడు. మహాముని భోజనానికి కూర్చున్నాడు. ఎదురుగా పళ్ళెంలో షడ్రసోపేతమైన వంటకాలు వున్నాయి. కాని అతని ధ్యాసంతా నెత్తిమీద వేలాడుతున్న కత్తిమీద వుంది. [illegible] ఎలా వున్నాయనీ, హల్వా ఎలా వుందనీ మహారాజు అడుగుతోంటే ఊఁ, ఆఁ అనడం తప్ప మరేమీ చెప్పడం లేదట ముని శ్రేష్ఠుడు. ఆయన భోజనం ముగించుకుని ఇవతలికి వచ్చిన తర్వాత కూడా జనకుడు మళ్ళీ అదే ప్రశ్న వేసాడట. నా ధ్యాసంతా తలమీద వేలాడుతోన్న కత్తి మీదే వుందని నిజం చెప్పాడట. ఆ ఋషీశ్వరుడు. "అదేనండి రహస్యం. ధ్యాస ఎక్కడుంచితే అక్కడే అది వుంటుంది" అని జనకుడు ఆ మునిగారి సందేహాన్ని తీర్చాడట.

సజ్జన్‌ని రెండు అయస్కాంతాలు ఆకర్షిస్తోంచి ఆరెంటి పట్ల సమభావాన్ని చూపిస్తూ సతమతమవుతున్నాడు. అయితే అతని స్థితలో జడత్వంలేదు. ఆలోచనలు అనే దీపికలు విద్యుదాకర్షణతో అతని నరనరాల్ని తాకుతున్నాయి. బాబాగారిని భోజనం వడ్డించే నిమిత్తం లోపలికి తీసుకునివెళ్లింది కన్య. వాళ్ళను మెల్లిగా అనుసరించాడు సజ్జన్.

బాబాగారి కోరిక ప్రకారం ఆయన భోజనానికి అతని శిష్యుల పక్కనే యేర్పాటు చేసారు. హోళీ పండుగ కావడం మూలాన కారం మసాలాలేని కూరలతో పాటు పాయసం కూడా ఆరగించడానికి శిష్య బృందానికి అనుజ్ఞ ఇచ్చారు బాబా. కన్య పండ్లు ఎక్కువగా వడ్డించింది. పీటమీద కూర్చుంటూ భార్యా భర్తలవైపు చూస్తూ బాబా అన్నారు- బ్రాహ్మణులకూ, సాధువులకూ భోజనం పెట్టేముందు దక్షిణ యివ్వడం ఆచారం. మరి నాకేమి దక్షిణ ఇస్తారో చెప్పు తల్లీ!, చెప్పు రాంజీ".

భావోద్రేకం అలగా అతని శరీరంలో పరవళ్ళు తీసింది. అయినా నిగ్రహించుకుని "మీరే ఆజ్ఞాపించండి" అని అన్నాడు సజ్జన్.

"మీ ఈ యావత్తు వైభవాన్ని దక్షిణగా పెట్టగలవా" అని ప్రశ్నించాడు బాబా. కన్య సజ్జన్ ముఖంలోకి చూసింది. గంభీరంగా ఆలోచిస్తున్నాడు.

"ఇంత కన్న తక్కువగా ఏదిచ్చినా నాకు తృప్తి వుండదు" అన్నాడు బాబా.

సజ్జను పలికాడు- "ఉత్సాహం అయితే వుంది. కాని ఈమాట మీద నిలబడగానా లేదా అనేది చెప్పలేను. ఆలోచించుకోవడానికికొన్ని రోజులు వ్యవధి యివ్వండి".

"అయితే అప్పటి వరకు ఈ కంచం ముందుకూర్చొని వుండమంటావా? రామ్‌జీ"

కన్య మళ్ళీ భర్తవైపు చూడ సాగింది. సజ్జన్ అంతః సంఘర్షణ అతని ముఖంలో స్పష్టంగా కనబడుతోంది.

బాబాగారు మళ్ళీ అన్నాడు- "నువ్వు దేన్నైతే ఒప్పుకుంటావో దాని మీద నిలబడి వుండు. అలా కాదంటావా? ప్రపంచం అంతా ఏ యిరుసు పట్టుకుని చక్రాకారంలో తిరుగుతుందో నువ్వూ అలాగే తిరుగుతూ వుండు. ఎప్పటి వరకు ఆలోచన చేస్తూ కూర్చుంటావు? కేవలం ఆలోచన అనేది త్రిశంకు స్వర్గం లాంటిది సుమా!"

"మీరందరినీ ఇదే దక్షిణగా అడుగుతారా" అని ప్రశ్నించాడు సజ్జన్.

"అది తెలుసు కున్నందు వల్ల నీకేమి ఒనగూరుతుంది? ఇదే మొదటి సారిగానీ వైభవం చూసిన తర్వాత నాకు కూడా లక్ష్మి అంటే దురాశ కలిగిం దనుకో రాదూ."

సజ్జన్ కన్యవైపు చూసాడు. అతని మనోభావాన్ని గ్రహించి నట్టుగా కన్య "నేను ఎప్పుడూ లేమిలో పెరిగిన దానను. కలిమి లేనందువల్ల నాకు అంత బాధగా వుండదు" అంది.

"అయితే నాకు కూడాలేదు. సరే బాబాజీ మీ ఆజ్ఞ మాకు శిరోధార్యమే. ఈ సుఖాన్ని చాలా వరకు అనుభవించాను. నాకు ఇప్పుడు కావలసింది అంతర్యంలో వుండే లక్ష్మియే. తమరు నిశ్చింతగా భోజనం చెయ్యండి. ఎల్లుండి కచేరీ తెరవగానే పత్రాలు రాసిఇస్తాను"

"ఏ కచేరీలో?" అంటూ బాబా పకపకా నవ్వాడు, మనం ఇప్పుడే పత్రాలు రాసేసుకున్నాం రామ్‌జీ. ఇక ఈ ఐశ్వర్యం నీది కాదు నువ్వు మాకోశాధ్యక్షుడివి మాత్రమే నీకు జీతం దొరుకుతుంది".

"సరే. అలాగే జరుగుతుంది. ఈ డబ్బుకు నేను ఇప్పుడు యజమానిని కాదు"

"దీని మూలంగా నువ్వు ధ్యాసస్థిరంగా వుంచుకోవాలి. అనుక్షణం చింతన, సాధన చేస్తోంటే అవే నిన్ను స్వామిని చేస్తాయి. నీవు స్వామిత్వాన్ని సంపాదించాలను కుంటున్నావు కదూ- కమ్మ"

రంగులు పూసుకుని, మత్తుగా తాగి, కొత్త కొత్తగా సింగారం చేసుకున్న హోళీ ఆలోచనలో పడింది. లోపల నుంచి లేస్తోన్న తలపులనే సముద్రంతో అతను కొట్టుక పోతున్నాడు. ప్రతి ఆలోచన ఎలాంటిది అన్న మీమాంసలేదు. అది అసంభవం. అసాధ్యం కూడ. తావ సముద్రం అట్టడుగున అతను కూర్చున్నాడు. అతనికి చుట్టు పక్కలా, పైదా ఆ సముద్రపు నీటిలో వుండేజీవజంతువులు- అందమైనవి, అనాకారిగా వున్నవి, తీవ్రంగా పరుగెత్తేవి, శనిశ్చరములు- అనే ఆలోచనలు అతణ్ణి చుట్టుముట్టి వున్నాయి.

# 38

బాబా భోజనం చేసి వెళ్ళిపోయి రెండు గంటలైంది. ఆశ్రమాన్నుంచి వాళ్ళను తీసుకొచ్చిన బస్సులోనే వాళ్ళను సాగనంపి కిందగ్యాలరీ దాకా సజ్జన్ మిసెస్ సజ్జన్ కలిసి వచ్చారు. సజ్జన్ పై అంతస్తులోకి వెళ్ళి పోయాడు. నౌకర్లకు ఇంకా భోజనం పెట్టడం, వంటింటి సామాను గదికి తాళం వేయడం మొదలైన పనులు మిగిలి పోయిన కారణంగా కన్య కిందనే వుండి పోయింది.

కన్యకు ఏదో పని సరిపోతోనే వుంది. నౌకర్ల భోజనాలయిన తర్వాత రెండు గంటల తర్వాత రమ్మనమని వాళ్ళను పంపించి వేసింది. ఠాకూర్ ద్వారాలో పూజా వస్తువులు తోమి శుభ్రపరిచింది. తన అత్తగారి తైలవర్ణపు చిత్రం ఎదుట కాసేపు అలాగే కన్నార్పకుండా చూస్తూ నిలబడింది. ఠాకూరు దగ్గర పెట్టిన దీపం స్తంభంలో నెయ్యి పోసి వత్తిసరి చేసింది. గది పై కప్పు మీదా, గోడల మీదా పురాతన పక్కీలో గీసిన చిత్రాల్ని పోగొట్టుకున్న చూపులతో చూసింది. మళ్ళీ ఏమనుకుందో పూజా మందిరం తలుపులు వేసి బయట అరుగు మీదకి వచ్చింది, లాన్ మీదగా రెండోవైపు వంటిల్లువున్న వసారాలోంచి మెల్లిగా నడుస్తూ అటు పైకి వెళ్ళేమెట్ల దగ్గరకు వచ్చి మెట్లెక్కి వెళ్ళి పోయింది.

ఈ బంగళాలో పెద్ద గదులన్నీ విలువగల సామాన్లతో నిండి వున్నాయి. సజ్జన్ కూర్చున్న స్టూడియో వుండే గది మినహాయించి మిగతా వన్నీ యించు మించు తిరిగి నట్టుగా కాసేపు ఓ చోట నిలబడి మరి కాసేపు మరో చోట

కూర్చుంటూ అక్కడ ఏదైనా ప్రాచీన శిల్పం కనపడితే వస్త్రం తీసుకుని దాన్ని బాగా తుడుస్తూ తన అంతర్యాన్ని తడుము కుంటూ తారట్లాడుతోంది కన్య. ఈ ఇల్లు- ఈ ఇంటిలోని ప్రతి వస్తువూ తనది. తాను గృహ స్వామిని. ఐదారు నెలల క్రితం ఆమె ఇలా జరుగు తుందని వూహించనైనా వూహించలేదు. పుట్టిల్లు మురికి కూపంలో అన్నీ కొరతలే కనపడుతోన్న వాతావరణంలో పుట్టి పెరిగి బయటికి ఎంత నిగ్రహించుకున్నా కుప్పలు కుప్పలుగా పోగవుతున్న కొదువలతో లోలోపల విసుగు చెందుతూ, తనవి కావని అనుకున్న మహత్ కాంక్షల్ని మనసులో పెంచుకుని కొన్నాళ్ళు సాహితీ అర్చనా, కొన్నాళ్ళు నాటకాలూ, మరి కొన్నాళ్ళు రాజకీయ రంగంవైపు మొగ్గుతూ గడిపింది. సామంత రాజులూ, జమీందార్ల ఇండ్లలోని వైభవం గురించి చదువు కుందే కాని వాటిని కడుపు నిండేలా చవిచూచే అవకాశం ఆమెకు ఎప్పుడూ దొరక లేదు. స్వదేశీ సంస్థానాలంటే ఆమె ఈసడించు కునేది, శ్రీమంతులంటే వాళ్ళను తన వ్యంగ్యబాణాలతో తూట్లు పడేలా చేసేది. కాని తీరా ఆ జమిందారీ వ్యవస్థకు ప్రతీక అయిన సజ్జనే ఆమె ముందు భిక్షా పాత్ర తీసుకుని ప్రేమ యాచించగానే ఆమె అతని వైపు మొగ్గింది. అప్పటి నుంచి సజ్జన్‌తో పాటు అతని జమిందారీ వైభవం పట్ల ఆమె మోజును ఎక్కువగా పెంచుకో సాగింది. వివాహం అవగానే ఎస్టేటు వ్యవహారాల బాధ్యత అతను కన్యకు అప్పగించాడు. ఒకరోజు సంగతి. సజ్జన్ తన తల్లిగారివీ, నాయనమ్మగారివీ, ముది నాయనమ్మగారివీ ఆభరణాలు తీసి ఆమెకు అలంకరించి "కోడలు"గా ఆమె చిత్రం గీసాడు. సుమారు ఓ లక్ష రూపాయల నగలు తన ఒంటి మీద వుండడం చూసి కన్యకు ఆ రోజంతా అదోలా వుంది. కాని పోను పోను వీటన్నిటికీ ఆమె అలవాటు పడిపోయింది. అవన్నీ ఒంటి మీద పెట్టుకున్నా అవి కొత్తగా అనిపించడంలేదు. అలా ఆమె సహజంగా జమీందారీ వాతా వరణాన్ని జీర్ణించుకున్న తరుణంలో త్యాగం అనేకత్తి ఆమె కోరికలనే పనస పండును తొనలు తొనలుగా చీల్చి వేసింది. బౌద్ధికంగా చూస్తే కన్య ఈ త్యాగాన్ని వ్యతిరేకించేది కాదు అయినా కూడా ఆ మాట ప్రసక్తి వచ్చే సరికి ఆమె మనస్సు ఎందుకో దిగులు పడుతుంది. వుండి వుండి తీపు పెడుతూ వుంది. ఈ ఐశ్వర్యాన్ని బాబారామ్‌జీ తన వెంట తీసుకుపోక పోయినా వాటన్నిం

టిపై తన కింకేమీ అధికారం లేనట్టు అనిపిస్తోంది. కాని విచిత్రం ఏమిటంటే కొత్తగా వివాహం చేసుకున్న రోజులు వైభవోపేతంగా గడపడానికి బదులు ఆమెకు ఆ సంఘటన జరిగిన తర్వాత నుంచి దిగులునే కల్పించాయి. ఆధ్యాత్మిక దృష్ట్యా చూస్తే త్యాగబుద్ధి చాల వుత్తమమైందే. దీన్ని పాలించే గృహస్థుకు క్షేమ కరంగా వుంటాడు. అంటే దాని అర్థం మనం గృహస్తులం కాదని కాదు. ఇది నా కాపురం. నేనీ యింటికి ఇల్లాల్ని! అదృష్టవంతురాలిని. నా ఈ కాపురాన్ని సుఖ సౌఖ్యాలతో అనుభవిస్తాను అనుకుంది.

మనసు కొంత తేలిక పడగానే భర్త జ్ఞాపకం వచ్చాడు. లేచి శయన మందిరానికి వెళ్ళింది. సజ్జన్ అక్కడ లేడు. అద్దంలో తన ముఖం చూచుకుంది కన్య. కొంచెం వాడినట్టుగా అనిపించింది. ఈ ముఖంతో తాను సజ్జన్ ముందు వెళ్ళి నిలబడితే అతను సందేహిస్తాడు. అలాంటి సందేహం సజ్జన్‌కి రాకూడదు. వెంటనే స్నానాల గదికి వెళ్ళి సబ్బుతో ముఖం కడుక్కొని క్రీమ్ రాసుకుంది. బొట్టు పెట్టుకుని తలను కొద్దిగా దువ్వుకుంది, అంతలో ఆమెలో అకస్మాత్తుగా ఏదో కోరిక కలిగింది. పక్క గదిలో కెళ్ళి బీరువా తెరిచి నీలం బెంగుళూరు పట్టుచీరె, చెవుల రవ్వలజత తీసింది. ముక్కుకు బేసరి, కంఠహారం, కుడి చేతికి నాలుగు గాజులూ, ఎడమ చేతికి హీరో చేతి గడియారం. చెవుల జత ఈ మధ్యనే సజ్జన్ ఆమె కోసం కొన్నాడు. ఒంటిమీద వజ్రాలు మెరుస్తోంటే ఆమె మనసు కూడా దర్పంతో మెరయ సాగింది. అద్దం ముందు నిలబడగానే ఆమె అలంకారాలే ఆమెకు మత్తు కలిగించేలా కనిపించాయి.

చిత్రాన్ని గీస్తూ సజ్జన్ స్టూడియోలో కనిపించాడు. కన్యను చూడగానే అతని ముఖం సంతోషంతో ఆశ్చర్యంతో వికసించింది". "హల్లో" అంటూ ఆమెను ఆపాదమస్తకం పరిశీలించాడు.

"దిష్టితగిలేలా చూస్తున్నారు".

"దిష్టి ఎప్పుడో తగిలింది. ఇప్పుడు నిన్ను చూస్తూ నేత్రానందం పొందు తుంటాను"

"మీరేమైనా అంటారేమో అను కున్నాను. అంత విలువగల వస్తువులు నాకు కొని ఇచ్చారాయె" అంటూ కన్య ఆగి మళ్ళీ ముఖం మీద గంభీరత్వాన్ని తెచ్చు కుంటూ "త్యాగం చేసే ముందు ఒకసారి వేసుకోవాలనిపించింది" అంది.

ప్రేమగా ఆమె బుగ్గల్ని తట్టుతూ "ఇంత సేపటి నుంచీ నేను అదే తీవ్రంగా ఆలోచిస్తూ ఒక నిర్ణయానికి వచ్చాను" అన్నారు సజ్జన్.

ప్రశ్నార్థకంగా అతని వైపు చూసింది కన్య,

"చూడు కన్యా. లేమి అనేది మనిషికి బలం అయినా ఇస్తుంది లేదా అతణ్ణి చంపనైనా చంపుతుంది. మన ఇద్దరికి సంబధించినంత వరకు లేమి వల్ల మనకు బలమే వస్తుందని ఆశిద్దాం. కాని దీనికి సంబంధించిన మరో విషయం వుంది. నామనస్సులో ఇంకా కొన్ని తీరని కోరికలు వున్నాయి. ఉదాహరణకు నాకు ఇప్పుడిప్పుడే వివాహం అయింది. నిన్ను తీసుకుని ఎక్కడెక్కడికో తిరగాలనీ ఇద్దరంకలిసి ప్రపంచాన్ని చూడాలనీ వుంది. ఈ కోరికను కావాలంటే అణుచుకో గలను కాని అంత మాత్రాన నాకు మనశ్శాంతి లభించదు". చెపుతూ చెపుతూ సజ్జన్ ఆగి పోయాడు. ఆలోచించ సాగాడు. అతనికి దగ్గరగా కుర్చీ లాక్కుని కన్య కూర్చుంది. కొత్తగా పసుపు కుంకుమతో మెరిసి పోతోన్న ముత్తైదువలా ఏకైక నిష్ఠతో ఆమె సజ్జన్ని చూడ సాగింది. ఆ చూపులో నిష్ఠతోపాటు శృంగారం. మత్తు కూడా వుంది. అయితే అది వడగాడ్పులా వేడిగా లేక వేకువనే వీచే పిల్ల వాయువులా, మలయ మారుతంలా చల్లగా వుంది,

''తిరగాలన్న కోరిక నాకూ వుంది"

"అదే కన్యా! నేనింక తప్పక కొన్ని నియమాలు పాటించదలచు కున్నాను. నాకోసం సౌఖ్యాన్నిచ్చే సాధనాల్ని ఎక్కువగా సేకరించక సాధ్యమైనంత తక్కువలో పని వెళ్ళబుచ్చ డానికి ప్రయత్నిస్తాను. అయితే కొన్నింటిని నేనప్పుడే త్యజించదలచు కోలేదు. నన్ను నేను మోసగించు కుంటున్నానని దీని అర్థం కాదు. నా హద్దుల్ని నెమ్మది నెమ్మదిగా పొడిగించు కుంటూ పోవాలని మాత్రమే చూస్తున్నాను. భవిష్యత్తులో నాకు పుట్టబోయే సంతానం వంకగా

పెట్టుకుని పూర్వీకులు సంపాదించి పెట్టిన ఈ ఐశ్వర్యాన్ని దిగమింగ కుండా ఉచితా నుచితాల్ని బట్టి నిర్ణయాలు తీసుకుని వాటికి కట్టుబడి వుంటాను. స్థూలంగా, లెఖ్ఖకు ప్రస్తుతం నా దగ్గిర షుమారు ఎనిమిది లక్షల ఆస్తివుంది. నా తండ్రిగారు ఇంచు మించుగా ఇంత మొత్తాన్ని విలాసాలకోసం ఖర్చు చేశారు. నాలుగైదు లక్షలు కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌లో ఖర్చయ్యాయి. ఏది ఎలా వున్నా సరే నాకున్న మొత్తంతో మనం సంఘ ప్రయోజనాల్ని సంరక్షించ వచ్చు".

కన్య వుత్సాహంగా అతన్ని చూసి అంది "మీరు నా మనస్సులోని మాట చెప్పారు. చూడు సజ్జన్, నా మనస్సు విప్పి చెలుతున్నాను. నిజం అని విశ్వసించాలి. మనం ఇద్దరం కలుసు కున్నపుడు మీరు ధనవంతులన్న తంపే అసలు నాకు లేదు. తీరా మీతో నాకు వివాహం అవబోతోందని నేను వూహిం చుకునే సరికి ఇంత పెద్ద యింటికి కోడలు అవుతున్నానని యోచనరాగానే, ఈ ఇంటికే యజమానురాలు కాబోతున్నాను అనిపించింది. అలా ఎవరికైనా అని పించడం సహజమే కదా, ఆ భావం కలగ లేదని ఎలా రూఢిగా చెప్పగలను?.... వివాహం జరిగి ఇంటిలో అడుగు పెట్టిన తర్వాత ఈ వైభవాన్నంతా చూసి నేను మురిసి పోయిన మాట నిజం. ఇందుకు మీ ప్రవర్తనే కొంతవరకు కారణం.... నా మనోభావాన్ని సరిగ్గా మీకు చెప్పలేక పోయాను. మీరు సరిగ్గా అవగాహనచేసుకున్నారు"

"నాకా విషయం బాగా తెలుసు"

"ఇవ్వాళ బాబాగారు అకస్మాత్తుగా తన కోరికను బయట పెట్టగానే నేనేమీ విభ్రాంతి చెందలేదు మొదట్లో. ఈ త్యాగాన్ని నేను స్వభావ సిద్ధంగానే చేయ గలనని అనుకున్నాను కాని ఇంత సేపటి నుంచి ఒంటరిగా కూర్చుని".... అంటూ కన్య ఆగి మూగ పోయింది. తల వంచేసుకుంది

సజ్జన్ పకపకమని నవ్వాడు. కన్య అతని నవ్వు చూసి విస్తు పోయింది. తనేదో అపరాధం చేసిన దానిలా సిగ్గుపడి ముడుచుకు పోయింది. ఆమె మెడ చుట్టూ తన రెండుచేతులూ వేసి ఆమెను దగ్గిరకు లాక్కున్నాడు సజ్జన్. ఆమె

పెదిమల్ని మరింత దగ్గరగా చేర్చి ముద్దాడాడు, "ఎంత అమాయకురాలివి. ఛల అందంగా వున్నావు ఈ అమాయికత్వంలో" అంటూ బుగ్గ గిల్లాడు.

మెడచుట్టిన చేతులు వెనక్కి తీసుకుంటూ సజ్జన్ లేచాడు. ఓసారి ఒళ్ళు విరుచుకుని ధ్యానంగా తను గీస్తోన్న చిత్రం చూసి అన్నాడు- "ముక్కుకు సూటిగా పోదా మనుకున్న వ్యక్తికి ఇటువంటి ప్రశ్నలు చావు బ్రతుకుల్లా తోస్తాయి. ఎవరైనా లౌక్యంవున్న వ్యక్తికి ఈ విషయాలు చెప్పామంటే మనల్ని పిచ్చివాళ్ళ కింద జమ కట్టి ఎగతాళి చేస్తాడు.... అహ్హహా, తప్పకుండా అంటాడు. అటువంటి దానాలూ ధర్మాలూ కృతయుగంలో వుంటే వుండొచ్చు కాని ఈ కలియుగంలో మాత్రం అట్టివాటి గురించి వూహించడం కూడా వెర్రి వాడు తల గోక్కున్నట్టే. రా. వెళదాం"

''డబ్బు వ్యామోహాన్ని ఇవ్వాళ ఒప్పు కుంటున్నాను" అంటూ కుర్చీ లోంచి లేచింది. కన్య.

"నువ్వేమీ ఒప్పుకో లేదు. డబ్బుకు దాసోహం అన్న ఎంతో మంది వ్యక్తుల్ని నేను చూశాను, కూడబెట్టి కూడబెట్టి లక్షలకు లక్షలు పోగుచేసి చచ్చి పోతారు. బ్రతికున్నంత కాలం తినడానికి తాగడాని క్కూడా వాచి పోతారు. రోగం వస్తే మందు కూడా తీసుకోరు. అటువంటి డబ్బు వాళ్ళకు అక్కరకు రాదు. ఇతరులకు అంత కంటే పనికి రాదు"

"అటువంటి వ్యక్తులే చచ్చి పోయిన తర్వాత సర్పాలుగా పుడతా రంటారు." అని నవ్వుతూ అంది కన్య. ఇద్దరూ వాళ్ళ గదిలోకి వచ్చారు. దిండు మీద ఆనుకుంటూ సజ్జన్ మంచం మీద కూర్చుంటూ- "పాముగా పుడతారనే విషయం నేను ఆలకించాను. అయినా విశ్వసించననుకో'' అన్నాడు.

అతనికి దగ్గిరగా కూర్చుని అతని ముఖంలోకి చూడ సాగింది కన్య.

"మన దగ్గిరే ఓ పాము జంట వుండేది'' అంటూ మొదలెట్టాడు సజ్జన్

"ఎక్కడ?''

''ఠాకూర్ ద్వారాలో''

"ఠా.... కూ...."

"అవును. దాని కింద ఓ పాతాళగది వుంది. ఆ ప్రసంగం ఎప్పుడూ రాలేదు మన మాటల్లో, లేకపోతే ఎప్పుడో అది వున్న చోటు నీకు చూపించే వాణ్ణి. తండ్రిగారు చని పోయిన తర్వాత దాన్ని పూడ్పించి సున్నం వేయించాము. నేనూ ఇంత వరకు స్వయంగా వెళ్ళి చూడలేదు. కాని చిన్న తనంలో ఓ పర్యాయం దాన్ని తెరుస్తోంటే మాత్రం చూశాను''

"మరి అందులో పాముల జంట వుందా?''

''అవును వుంది. తండ్రిగారు వాటిని చంపించారు. వాటిని చంపించిన కొద్ది నెలలకే ఆయనగారు కూడా మరణించారు. వారి మరణానికి కారణం ఆ పాముల జంటను చంపిందమే అని చాలా మంది అంటారు. మా ముత్తాత ఈ బంగళాను కట్టించినప్పుడు ఆ జంటను బంగారం పాత్రలో వుంచి వాళ్ళ పాత ఇంటి నుంచి తీసు కొచ్చారని మా అమ్మ నాకు చెబుతుండేది. మా ముత్తాతగారు కొంచెం తిరుగు బాటు మనస్తత్వం కల వ్యక్తి. ఆ రోజుల్లో ఇంగ్లండు వెళ్ళి తిరిగి వచ్చాక ప్రాయశ్చిత్తం కూడా చేసుకోలేదు. అంటు వంటి అభ్యుదయ భావాలు వున్న వ్యక్తి అయినా ఆ పాముల జంటపై ఆయనకు అంత నమ్మకం వుండేదట. ఆ జంట మా వంశమూల పురుషులైన రఘుమల్‌జీ, అతని భార్య అని అంటారు. అందే సాదత్ అలీఖాన్ నవాబుతో ఢిల్లి నుండి లక్నో రాలేదూ, ఆయనన్న మాట".

"తర్వాత ఏమి జరిగింది?"

''వాళ్ళు వస్త్రి వ్యాపారులు. ఆయన వ్యాపారంలో చాల నేర్పు కలవాడు, మంచి ప్రాభవం వున్న వాడు. నవాబును తన గుప్పిట్లో పెట్టుకున్నాడు. ఇక్కడకు వచ్చిన తర్వాత లక్షలు గడించాడు. మరణించిన తర్వాత అతని భార్యకు కలలో కనిపించి తాను లంకె బిందెల పైద కూర్చున్నాననీ తాను కూర్చున్న బిందెకు చుట్టూ వేటినీ ముట్టుకోవద్దనీ హెచ్చరించాడట. కుటుంబం

మీద ఏదైనా ఆపద వచ్చినపుడు అవసరానికి తగ్గట్టుగా ఓ గిన్నెడు బంగారు నాణేల్ని తాను తీసుకో నిస్తాననీ ఒక గిన్నెడు పాలు తన కోసం అక్కడ వుంచమని ఆమెకు కలలో కనపడి చెప్పాడట రఘుమల్ జీ."

"ఆ తర్వాత"

"ఆ తర్వాత ఇంకేముంది, ఆయన చెప్పిన ప్రకారమే అన్నీ చేశారు"

"మరి కలలో కనపడిన పాము నిజంగా"

"నిజంగానే వుంది. కొంత కాలం తర్వాత అతని భార్య కూడా చని పోయింది. ఆమె చని పోయిన తర్వాత అందరికీ ఆ పాముల జంట కనపడింది"

"మరి ఆ డబ్బును ఎవరూ ముట్టుకో లేదూ!"

"ఎవరూ ముట్టుకో లేదు. బహుశా అవసరం కూడా కలిగి వుండక పోవచ్చు. రఘుమల్ తర్వాత ఐదు తరాల వరకు ఐశ్వర్యం పెరుగుతూనే వచ్చింది. మా పూర్వీకులు చాలా నేర్పు కలవారు. లౌక్యం బాగా తెలిసిన వారు. దర్బారులో వాళ్ళంటే ఎంతో గౌరవం. గాలి పాటుగా ప్రవర్తించేవారు, వ్యాపారి నుంచి షావుకారిగా మారారు. షావుకారు నుంచి తాలుకాదారయ్యారు. మా ధనా గారాన్ని అక్కణ్ణుంచి ఇక్కడికి తీసుక వస్తున్నప్పుడు పరీక్ష కోసం అని కొన్ని నాణేలు తీసి వేరుగా వుంచాడంట మా ముత్తాత'' మర్నాటిని తిరిగి ఆ బిందెలో వేయక పోతే నీ వంశక్షయం అవుతుందని కలలో చెప్పారుట. మర్నాడే ఆ నాణాల్ని మా ముత్తాత వాటిలో వేయించాడు. నా తాతగారైతే వాటిని ముట్టు కోనేలేదు. పాపం నిండు యవ్వనంలోనే చని పోయ్యారు. కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌లోకి పోయింది యావత్తు ఆస్తి. చాలా డబ్బు దోచు కున్నారు కోర్టు కింద వున్నంత కాలం. ఆ తర్వాత నాన్నగారు మేజరు అయ్యారు. విదేశాలకు వెళ్లారు, తిరిగి వచ్చే సరికి పూర్తిగా మారి పోయారు. ఆయన చాలా డబ్బు తగలేసాడు. మత్తు నిషాలో వుండి ఆ పాముల జంటను కూడా వారే చంపించారు. కొన్ని నెలలు తర్వాత వారూ మరణించారు. ఆ పాముల జంటను చంపించి నందు వల్లనే నాన్నగారు మరణించారని అమ్మ అంటుండేది."

"మరి ఆ నాణాలు?"

"నాన్నగారు కరిగించారు"

"ఇప్పుడా పాతగదిలో ఏముంది?"

"ఏముందో తెలియదు"

"ఒక నిట్టూర్పు విడుస్తూ కన్య అంది - "పాములు లంకెబిందెలకు కాపలా విషయం నేను ఎన్నో కథలుగా విన్నాను. కాని నమ్మలేక పోయాను"

"నేను కూడా నమ్మకపోయేవాణ్ణి. కాని మా అమ్మగారు స్వయంగా చూచిందట. ఆ జంటతో మావంశచరిత్రముడిపడివుంది. విచిత్రమైన విషయం. ఇలాంటివి నమ్మాలో నమ్మకూడదో కూడా తెలియదు"

"నిజంగా ఈ దేశం విచిత్రాలకూ, వింతలకూ పుట్టిల్లు. మన సంస్కృతీ వాహినిలో విరుద్ధ భావం కనపడుతుంది. జ్ఞానం, మీమాంస, తర్కం, వేదాంతం, గణతంత్రం అంటూ ఒక పక్క ఎంతో శక్తివంతమైన శాఖలూ సంప్రదాయాలుంటే మరో పక్క పాములూ, సిద్ధులూ, పెద్దమ్మలాంటి మంత్రాల బూచీలు, మారి గాళ్ళు మనకు కనబడుతారు. ఇంత పరస్పర వైరుధ్యం వున్నవాటిని విశ్వసించాలన్నా గుడ్డిగానే విశ్వసించాల్సివుంటుంది."

"కాని కన్యా. ఎలా విశ్వసించలేం చెప్పు. మా తాతగారినే చూడరాదా! వారి ఆధ్యాత్మిక శక్తిని ఎలా శంకించ గలవు?"

మోచేతి మీద తల ఆనించి కన్య పడుకుంది. సజ్జన్ వైపు ఆలోచనా దృష్టితో చూస్తూ వుంది.

"మోహం, త్యాగం—"

"పాము, యోగీ— రెండూ-"

"రెండూ విపరీతాలే మరి. రెండింటికి చాలా పురాతనమైన సంప్రదాయాలూ, పరంపరా వున్నాయి. మోహెంజోదారో, హరాప్పా నాగరికతా కాలం నుంచి ధనం సంపాదించడం దాన్ని బాగా అనుభవించడం భారతీయుడికి

బాగా తెలుసు. మరి అదే కాలాన్నుంచే ఈ రకమైన విలాస ప్రవృత్తికి విరుగుడుగా సుఖభోగాల్ని వదిలి వైరాగ్యాన్ని వరించాలనీ యోగ సాధన చెయ్యాలన్న యోచన కూడా పుట్టింది."

''దొరసానిగారూ!"

''రావోయ్‌శీతల్" అంటూ మంచం మీద నుంచి కన్యలేచింది.

"టీ తీసుక రమ్మంటారా?''

"తీసుకరా" అని సజ్జన్ అన్నారు. నౌకరు వెళ్ళి పోయాడు.

గదిలో నిశ్శబ్దం ఆవరించింది. కొద్ది సేపటికే ఫలహారం, టీ వచ్చాయి సజ్జన్ వనకన్యా ఇద్దరూ తమ అంతర్యంలోని పొరల్లో దాక్కున్న నిజాన్నీ, అబద్ధాన్నీ తడుముకొని భయంతో మౌనంగా వుండి పోయారు. సజ్జన్ మెదలకుండా టీ తాగుతున్నారు. కన్య చేతిలో మాత్రం టీ చల్లారి పోతుంది. నిశ్శబ్దాన్ని చీలుస్తూ చివరికి కన్య అంది– ''ఈ క్షణంలో మనం పొరపాటుగా కాలు వేశామంటే అంతకన్న సిగ్గు చేటైన విషయం మరొకటి వుండబోదు. తిను, తాగు అనుభవించు అన్న సిద్ధాంతం నల్లనాగు విషం లాంటిది. మనం దీన్ని దించుకోక పోతే"–

"నువ్వే ఆలోచించుకో కన్యా. బాబారామ్‌జీ మనల్ని ఎటూ తేల్చుకోలేని స్థితిలో వదిలి వెళ్ళారు. దీని నుంచి బయట పడాలంటే ఏదో రకమైన నిర్ణయానికి వచ్చి మనం అడుగు వెయ్యాల్సి వుంటుంది. యోగిగానూ, భోగిగానూ వుండడం కుదరదు. వీటిలో ఏదో నిర్ణయించు కోవాలి''.

''నిర్ణయించుకున్నాను. మనం గృహస్థులం. యోగాన్నీ, భోగాన్నీ రెంటినీ మనం సమ పాళ్ళలో అనుభవించాల్సి వుంటుంది''.

# 39

హో హో! హోలీ!

నలుపూ, ఎరుపూ, నీలం, పసుపూ, మంకెనపువ్వు రంగుల్ని ముఖానికి, చేతులకూ, కాళ్లకు పులుముకుని రంగు వెలిసిపోయి చినిగి పోయిన చింకి

పాత్రను ధరించి దిష్టిముఖాన్ని గాడిదమీద పెళ్ళికొడుకులా కూర్చుండబెట్టి దర్వాలు మోయిస్తు, కుళ్లిన టమేటోలు విసిరేస్తూ గాలిలోకి ఎగురేస్తూ, వచ్చే పోయే వాళ్ల ముఖాలకు నూనె కలిపిన మసి పూస్తూ బురదలో తడిసి నాని కంపు కొడుతోన్న గోనె సంచుల్ని భుజాన వేసుకుని పెండ్లి కొడుకు తరపు వారి ఊరేగింపు మహిపాల్ ఇంటిముందు నుంచి వెడుతోంది. హోళీ సరదాలతో ఆ చిన్న సన్నని వీధి మారు మ్రోగిపోయింది. ఎదురుగా శివాలయం అరుగు వద్ద మలుపు వద్ద సజ్జన్ నౌకరు సైకిలు మీద వస్తున్నాడు. ఊరేగింపు తన వైపే రావటం చూసి అతను సైకిలు దిగి పక్కకు తొలిగి నిలబడ్డాడు. సింహాలకన్ను ఎద్దుమీద పడినట్టయింది. హోళీ హోళీ అంటూ కేకలువేస్తూ అల్లరి చేస్తూ వస్తున్న మూక అతనిమీద విరుచుకుపడ్డారు. చిద్దూ తెలివిగల వాడు బలశాలి కూడాను. సైకిల్‌ని రెండు చేతులలో ఎత్తి డాలు కింద వుపయోగించుతూ వాళ్లను గద్దించాడు — "ఖబడ్దార్, సైకిలుతో సహా మీమీద పడి విజృంభిస్తాను. ఇప్పుడే చెబుతున్నా, మీరంతా కలిసి ఆ తర్వాత చంపి పారేసినా సరే ముందు కనీసం ఇద్దరినైనా నమిలి మింగేస్తాను."

తమకు దొరికిన వేట వృషభంకాదనీ ఇది మరో కొదమసింగమని హోళీ పుత్రులు గ్రహించారు. చిద్దూ కళ్లెర్రచేసి సైకిలును రెండు చేతులతో అలాగా ఎత్తి గోడకు పక్కగా కొంచెం వంకరగా దెబ్బతీయడానికి సిద్ధంగా నిలబడ్డాడు. కుర్రమూకలు ఈలలు వేశారు. ఎగతాళిచేసారు. రకరకాల పక్షుల మాదిరిగా అరిచారు. అన్ని రకాల తిట్లు తిట్టారు. పిచకారీలతో అతన్ని రంగునీళ్లతో ముంచెత్తారు. గోనెపట్టా విసిరివేస్తున్నట్టు నటించారు, చిద్దు తొణకుండా వాళ్ల మీద సైకిలు వేసికొడుతూన్నట్టు నటించాడు. రంగునీళ్లు ధారాప్రవాంగా అతనిమీద పడుతోందే కళ్లకు అడ్డం పెట్టుకుని తన్నుతాను రక్షించుకోవడానికి అతని తలప్రాణం తోకకు వచ్చింది. ఎలాగైతేనేం ఊరేగింపు ముందుకు సాగి పోయింది. బరువును మోస్తూన్న అతని చేతులు రాళ్లలా పటపటమంటూ కిందికిదిగాయి. కొంతవుద్రేకం వల్లనూ కొంత సైకిల్‌ని జాగ్రత్త చేసు కోవాలన్న ఆలోచనవల్లనూ అతని చేతులు కదుమలు కట్టి మొద్దుబారి పోయాయి. ఒక్క క్షణం చిద్దు అక్కడ కూర్చున్నాడు.

మహీపాల్ తన యింట్లోంచి ఇదంతా గమనిస్తూనే వున్నాడు. నాలుగైదు రోజుల నుంచి ప్రత్యేకంగా ఇవ్వాళ పొద్దుటుంచి అతను ఇలాంటి దృశ్యాలు ఎన్నో చూశాడు కూడా. గోలచేస్తోన్న కుర్రాళ్ళని మితిమీరి ప్రవర్తించవద్దని వారించాడు. కాని అతని మాటలు వాళ్ల చెవులకు ఎక్కడం లేదు. రెండోకారణం అతను ప్రౌఢ వయస్సు కలవాడు కావడం చేత వాళ్లతో పాలు పంచుకపోయినా మానసికంగా అతను చాల చిన్నవాడై వాళ్లతో కలిసి ఆనందిస్తాడు. హోలీ పండుగ సందర్భంలో ఈ రంగుల యుద్ధం, ఈ స్వైర విహారం. ఈ బెడు నిషా, తిట్లూ బూతూలూ అన్నీ అతనికి సహజంగా స్వాభావికంగా మంచివిగా కనపడుతాయి. ఈ హోలీ అయిదు రోజులూ సమాజం కట్లు తెంచుకుని అచ్చోసిన ఆంబోతులా విహరిస్తుంది. — చిన్నా పెద్దా అందరూ ఒకే రంగులో కలిసిపోతారు. పెద్ద పెద్ద శ్రీమంతులూ పేరు వున్న వాళ్ళ బిడ్డలు కూడా చినిగిపోయిన గుడ్డలు వేసుకుని ముఖాల నిండా ఏవేవో రంగులు పులుముకుని బజార్లలో విచ్చలవిడిగా తిరుగుతూ కనబడతారు. అన్ని రంగులతో హోలీ ఆదే సమాజం ఒకే రంగులో ఏకమై తాదాత్మ్యాన్ని పొందుతుంది. ప్రతిసందూ, ప్రతిగొందు, ప్రతివీధి, గోడలూ, తలుపులూ, కుక్కలూ, మేకలూ, ఆవులూ, ఎద్దులూ, గాడిదలతో సహా రంగులు అద్దుకున్నట్టుగా కనిపిస్తాయి. సందుల్లో, నేలమీదా, గోడలమీదా, ప్రజలనోళ్లల్లోనూ మన్మథుడూ రతీదేవిల జంట బూతుపదంగా మారి బ్రహ్మానంద సహోదర రూపాన్ని చౌకబారుగా చేసేస్తుంది — ఆదే హోలీ వేడుకల్లో మహీపాల్ గిట్టని ఒక్కపని, పృథివికి అందించే ఈ ఉత్తమ సౌఖ్యానికి బూతుకింద ఎందుకు మారుస్తారు? పురుషుడు ఇలాంటి బూతుపదాల ద్వారా తన్ను తానూ స్త్రీనీ ఎందుకు పరాభవిస్తాడు? దీనితో అతను ఏరసాస్వాదన చేస్తాడో అతనికి అర్థంకాలేదు. హోలీ రసవత్తరమైన శృంగార ప్రధానమైన వేడుకేకాని దుర్భాష దూషణా కాదు.

మహీపాల్ కుటుంబం ముందనుకున్న ప్రకారం ఆరుగంటలకు బదులు నాలుగు గంటలకే వస్తే అందరూ కలిసి పడవ షికారు కెళ్లొచ్చని సజ్జన్ చెప్పి పంపినట్లు వర్తమానం తెచ్చాడు అతని నౌకరు.

మహీపాల్ నవ్వుతూ అన్నాడు — "మేము షానజఫ్ రోడ్‌లో కాదు వుండేది. మా యిళ్లు సందుల్లో వుంటాయని చెప్పు. నీ వేషం కూడ మీ అయ్యగారికి చూపించి అలాగే మేం కూడ రంగులు పూసుకొని రమ్మంటారేమో కనుక్కొని చెప్పు."

ఆ మాటలకు నౌకరు సిగ్గు పడ్డాడు. అతణ్ణి కర్నల్ యింటికి వెళ్ళకుండా ఆపాడు మహీపాల్. శకుంతల్ని పిలిచి అతనికి పిండి వంటకాలు పెట్టమని చెప్పాడు. రంగులో అతని గుడ్డలు బాగా తడిసి పోయాయి కనుక అతనికి తన ఓ పాత కమీజూ ధోవతీ కూడా ఇమ్మని చెప్పాడు. ఇవి కాక ధైర్యంగా హోళీ అకతాయిలను ఎదుర్కొన్నందుకు గాను సినిమా చూడమని రెండు రూపాయలు బహుమానంగా ఇచ్చాడు. ఛిద్దూ ముఖం వికసించింది. మహీపాల్ అతనికి ఏమేమి ఇవ్వాలో పురమాయించి పైకి వెళ్లాడు.

మహీపాల్ ఇంటికళే మారి పోయింది. పూర్తిగా కాక పోయినా అక్కడక్కడ వైభవచిహ్నాలు కనపడు తున్నాయి. మహీపాల్ రాసుకునే గదిలోంచి కలం, బల్లా ఇంక్‌పాట్, కుర్చీ, స్టూలూ పైళ్ళన్నీ అంతర్ధాన మయ్యాయి. వాస్తాటినే ఆర్ట్‌స్కూల్ నుంచి తెప్పించుకున్న సాంచీస్తూపం నమూనాలో సోఫాసెట్, అక్కడే అతికించి కుట్టించిన దుప్పటీ, కర్టెనులూ, ఏష్‌ట్రే, టేబుల్ లేంపూ, బుద్ధుని విగ్రహం అన్నీ కలసి మహీపాల్ సాంస్కృతిక సేవను ఇక్కడ్నుంచి వేరేచోటుకు బదిలీ చేశాయి. ఇప్పుడాయన రాసుకోవడానికి గాను నడవాలోనే కొయ్యతో విభాగించిన ఓ చిన్న గది తయారవుతోంది. గది పని పూర్తి కానందు వల్ల వడ్రంగి సామానూ కొయ్యముక్కలూ, అన్నీ ఓ మూల పెట్టి వున్నాయి. పై భాగంలో పెద్ద మార్పేమీ రాలేదు కానీ స్వరూపం మారినట్లే కనబడుతోంది. హోలీ కోసం ఇంటిల్లిపాదికీ కొన్న ఖరీదైన చెప్పులూ, రకరకాల నమూనాలుగల ఆడవాళ్ళ పర్సులూ ఇంట్లో వారి ముఖాల్లో కనపడుతోన్న తేజా ఇంటి జాతకమే మారిందన్నట్లు స్పష్టంగా తెలుపుతున్నాయి. ఛిద్దూకు ఏమేమి ఇవ్వాలి అన్నది పిల్లలకు పురమాయించి మహీపాల్ కొంచెం సేపు పైన నిలబడి హోళీ గోలతో వున్న రోడ్డు చూసి వంటింట్లోకి వెళ్లాడు.

కళ్యాణికి ఇవ్వాళ క్షణం తీరిక లేకుండా పొద్దున్నుంచి పిండివంటలు చేస్తోంది. రేపు వియ్యాల వారింటికి మిఠాయిలు పంపాలి, కళ్యాణి మహీపాల్ వివాహం చేసుకున్న తర్వాత వాళ్లు అందు కుంటున్న వియ్యం ఇదే. అందులో మేనకోడలి వివాహం. ఈ వివాహం మూలంగా తనజ్ఞాతుల దృష్టిలోనూ, చుట్టు పక్కాల్లోనూ తను కూడా ఓ గొప్ప యింటి కోడల్నేనని నిరూపించుకో వాలని తహతహ పడుతోంది కళ్యాణి. తన భర్త చాలా గొప్ప రచయితనీ, అతనికి ఆదాయం ఒక్క సారిగా ఒకే ఒక చెక్కులో ఇరవై వేలు రూపాయల దాకా గూడా వుండగలదని తన బంధు వర్గానికి చూపించాలను కుంటోంది. కళ్యాణి ముఖం ముత్తైదు తనంతో పచ్చగా మెరిసి పోతోంది. ముక్కు రవ్వల బేసరి, చెవులకు ముత్యాల దుద్దులూ, కంఠంలో బంగారపు గొలుసు, నడుముకు ఒడ్డాణం, చేతులకు సాదా గాజులు పక్క పక్కనే బంగారంతో చేసిన రాళ్ళ గాజులూ, కాళ్ళకు మట్టెలూ అవి కూడా గజ్జెలతో నడుస్తోంటే గల్లుగల్లు మంటున్న మట్టెలుతో ఆమె ముత్తైదుతనం మరింత ధగధగమంటోంది. లక్నోలో వాళ వేయిలతో వియ్యం అందుకుంటున్నారు. శకుంతలకు కాబోయే భర్త సెక్రటేరియట్‌లో వుద్యోగం. నెలకు రెండువందల నలభై రూపాయలు జీతం. పెద్ద అన్నగారు అడవులు కంట్రాక్టు చేస్తాడు. తమ్ముడు ఎం. ఏ., చదువుతున్నాడు. అత్తగారిపోరు, ఆడబిడ్డపోరూ లేదు. ఆరళ్ళు లేని సంసారంలో అడుగు పెట్టబోతోంది శకుంతల: కావలసినంత దాంపత్యం సుఖం. అల్లుడు గారు తమ్ముడి కుటుంబంలో కలిసివుంటూ కూడా సర్వస్వతంత్రుడు. ఒకే ఇంట్లోనే వుంటున్నారు. ఒకే ఇంట్లోనే భోజనం చేస్తున్నారు. కాని పేయింగ్ గెస్టులా పూటకూళ్ళ భోజనం చేస్తున్నాడు. ఇంటి ఖర్చు గురించి ఎలాంటి బాధ్యం లేదు. అన్నదమ్ముల్లో బహుశా అందుకే కాబోలు అభిప్రాయ భేదాలూ, మనస్తాపాలూ లేవు. భగవదనుగ్రహం వల్ల శకుంతల మంచి ఇంట్లోనే పడింది. మేనమామా మేనత్తా ఎంతో ఘనంగా మేనకోడలి పెళ్లి చేశారు అంటూ ప్రపంచం వాళ్ళను పొగిడేస్తుంది. అల్లుడు చాలా యోగ్యుడు. పదివేల రూపాయలతోనే సరిపుచ్చు కున్నారు. అయినా పదివేలు కట్నం ఎవరైనా ఇస్తున్నారంటే వాళ్ళు కొద్దో

గోప్యె స్థిరపరుత్రె వుండాలి. మహీపాల్ పీట మీద జమాయించి పెండి వంట కాల మధ్య రవ్వలతోను బంగారపు నగలతోనూ మిలమిల మెరుస్తోన్న ఇల్లాలి వైపు చూసాడు. అతని చూపుల్లో కర్తా-పిత్ర-హోదాల దర్పా వెలిగిపోతోంది. రాజ్యశ్రీ తల్లికి సాయపడుతోంది. పొయ్యి సెగలో మాడిన ముఖాన్ని కళా యిలో వేయిస్తోన్న గుంజాల నుండి మరల్చి భర్తవైపు చూస్తూ అడిగింది- "ఎవ రొచ్చారు?"

"షా నజఫ్ రోడ్‌లో వుంటోన్న శ్రీమాన్ సజ్జన్ జమీందారుగారి బంగళా నుంచి నౌకరు కబురు తెచ్చాడు" అంటూ మహీపాల్ రాజసంతో సమాధానం చెప్పేసరికి తల్లీ కూతురిలో దాగిన అహానికి కొంచెం తృప్తి కలి గింది. ఆ మాటకు వాళ్ళు కిలకిలా నవ్వారు.

"ఏమని కబురు పంపారు? విందు ఆహ్వానం రద్దు అయిందా "అంటూ అడిగింది కళ్యాణి.

మహీపాల్ నవ్వుతూ సమాధానం ఇచ్చాడు- "లేదు. ఎక్కువ అయింది. నాలుగు గంటలకు మనం బోటు షికారు చేస్తాం. చాట్, ఫలహారాలూ రెండూ వుంటాయి. రాత్రికి భోజనం. భోజనం తర్వాత ఎల్ఫిన్‌లో "సంసార్" సినిమా ప్రోగ్రామ్.

"సంసార్" కూడా ఓ సినిమాయేనా అంటూ మూతిముడిచింది రాజశ్రీ. "మాకంతా విసుగుపుడుతుంది. చవుకబారు అదీనూ. ఇంత పెద్ద ఆర్టిస్టు గారి ధర్మపత్ని, ఇన్ని అభ్యుదయ భావాలు కలిగివుండి కూడా చిన్నమ్మగారు ఇలాంటి చిత్రాన్ని" అంటూ ఆగిపోయింది రాజశ్రీ.

"ఈ ప్రోగ్రాంకి మీ చిన్నమ్మగారు ఏమాత్రం బాధ్యురాలు కాదు. సి అమ్మా, కర్నల్ పిన్నమ్మా వీళ్ళిద్దరి అభిప్రాయం ముందు ఆమె ఊఁ అనక తప్పలేదు" అన్నాడు మహీపాల్.

"దీనికంటే మనం "బహార్" చూస్తే బావుంటుంది."

"అది ఇసుక తక్కెడా ఇది పేడతక్కెడా. నాకు తెలీక అడుగుతాను 'బహార్' లో ఏం అభ్యుదయం కాస్త చెబుతావా?'' అంటూ మృదువుగా మహీపాల్ మందలిస్తూ అన్నాడు" ఇప్పుడు వచ్చే చిత్రాలన్నీ అసహజంగానే వుంటున్నాయి. జుగుప్సాకరమైనవీనూ. ఇటువంటి బహార్లకంటే వెయ్యి రెట్లు మంచిది సంసార్"

తండ్రి మాటకు ఎదురు చెప్పకుండా రాజ్యశ్రీ గుండాలు నూనెలో వేయించుతోంది. ఆమె అజాగ్రత్తవల్ల నూనెలోంచి గుండాలు తీస్తోండగా రెండు మూడు జల్లెగంటెలోంచి కింద పడ్డాయి. వాటిని తీయకుండా జల్లె గరిటెలోని వాటిని పక్కనే పొయ్యి మీద వున్న పాకంలో వెయ్య సాగింది రాజ్యశ్రీ. కళ్యాణి ఆ కిందపడిన గుండాలను చూసి కూతురుని కోప్పడింది- 'నీకెన్ని సార్లు చెప్పలేదు. పని చేతిలో వున్నప్పుడు సినిమాల ముచ్చట్లు పెట్టొద్దని. పనిచేస్తోంటే మనసు ఇంకో చోటుంచితే ఎలా?''

"పొరపాటున పడ్డాయిలేవే'' అంటూ రజ్జో తల్లిని కసురుకుంటూ వాటిని తీసి డబ్బాలో వేసింది.

''ఇలా చూడు. నే చెపుతోంటే ఇలా చూడవే. కిందపడి పోయిన వాటిని ఎందుకెత్తావంట? నీ తెలివి తెల్లవారి నట్టుంది" అని అంది కళ్యాణి.

''అయితే ఏమయిందే అమ్మా. శుభ్రంగా కడిగిన నేలేగా?" అంది రజ్జో.

"నువ్విక్కణ్ణుంచి వెళ్ళిపో! నీ పని నాకు నచ్చదు" అని కళ్యాణి మాట పూర్తి చేయక ముందే పళ్లేన్ని నేం మీద కొట్టి గదిలోంచి తుర్రున వెళ్ళిపోయింది. తల్లి కూతురూ పోట్లాడు కుంటోంటే మహీపాల్ కలుగ జేసుకోలేదు. రజ్జో వెళ్లిన తర్వాత భార్యతో "నీ ధర్మం కృతయుగంలో చెల్లుకుందే. ఈ కాలానికి పనికిరాదు" అని అన్నాడు.

"ఇతరులకు ఇష్టంవుంటే పాటిస్తారు లేకపోతే లేదు. కాని నేను మాత్రం నా ఆచారాల్ని వదల్లేను".

"వదలకే నారీమణీ" అంటూ తమాషాగా అన్నాడు మహీపాల్. "నీ ధర్మం వుంది చూశావూ. నా ధర్మాన్ని కూడా లాక్కునేసింది. నిజంగా నువ్వే నాకు గురువు. ఏం చెప్పమంటావ్ నీ గొప్పతనాన్ని" అంటూ పరాచికా లాడుతోన్న మహీపాల్ అంతలోకే ఆలోచనలో పడ్డాడు. అతనిలో ఆవేదన అతని ముఖంలో కన్పించింది. కళ్ళు మూసుకున్నాడు, ఓక్షణం పాటు చుట్టూ వాతావరణాన్ని ఛేదించుకుని తనలో తాను మునిగి పోయాడు.

"నీ ధర్మాన్నే చెప్పుకోవాలి. నీ అలవాట్లే నీ పిల్లలకూ అబ్బాయి. శకుంతల్ని చూడండి ఎంత చురుకైన పిల్లో. ఎలాంటి మడీ ఆచారాల్ని నేర్పుగా ఆచరిస్తుంది"

ఆమాటకు పకపకా నవ్వాడు మహీపాల్. "నీముందు శకుంతల పక్కా బ్రాహ్మణిలా నటిస్తుంది. ఆమె అత్తగారింట్లో కూడా ఇవే అలవాట్లు. వియ్యంకుల్ని చూడు. పేరుకు వాజపేయీలైనా వాళ్ళు మన మాదిరి పట్టింపు బ్రాహ్మల్లా అనిపించరు".

"పోనీలెండి. మేమేం చేశామని? కలియుగంలో దురాచారాలు అన్నీ పెచ్చు పెరిగి పోతాయి. ఉమాశంకర్ అంతా మీ మాదిరే"

ఆ మాటలకు రోషం వచ్చింది మహీపాల్‌కి. "ఉమాశంకర్ మంచి చరిత్ర కలవాడు. అన్ని విధాలా అతన్ని గురించి మంచి మాటలే విన్నాను, హోటలూ గీటలూ అన్నీ పని కొస్తాయి"

"అయితే శివశంకర్ ఇల్లాలు-''

" నీ మాదిరిగా చాదస్తం కాక పోయినా బ్రాహ్మణితే. బాధ్యతగల ఓ పెళ్ళికూతురు తండ్రిగా నేనూ అన్నీ కూలంకషంగా విచారించాను. నా పిల్లల పెళ్ళి నీలాంటి చాదస్తపు రకాల ఇళ్ళలో మాత్రం ఎప్పటికీ చేయను,"

"చేయక పోతే మానెయ్యి నాకైతే రెండు విషయాల్లోనే పట్టింపు. మనం ఎవరితో వియ్యం అందుకున్నా షట్ కులం వారై వుండాలి. రెండోది

పిల్లవాడు వృత్తముడై వుండాలి. నీకేమని చెప్పను? మన పెద్ద పిల్లా శకుంతలా పెళ్ళిళ్ళు త్వరగా అయి పోవాలనేగా. గుట్టూ ఒక్కడే కాదు. మనం కూడా అతనికి ఏ మాత్రం తీసి పోమని నిరూపించాలి. నిజం చెబుతున్నాను. ఈ అపద సమయంలో యిరవై వేల రూపాయలు పంపించిన భగవంతునికి మనం ఎంతో ఋణపడి వున్నాం. పదివేల రూపాయాలు కట్నం ఇస్తున్నామంటే అది గర్వించ దగిన విషయం కాదా? జై కిషోర్ ఇంట్లో ముల్లర్ వాళ్ళమ్మ కలిసింది-"

హుషారుగా భార్య మాటలు వింటున్నాడు మహీపాల్. కళ్యాణి కంఠంలో ఇవ్వాళ ఎంతో తీవి కనపడుతోంది! మహీపాల్ పెద్ద రచయితే కాని అతని దగ్గర కాసులు మాత్రం లేవని ఓసారి ముల్లర్ తల్లి ఆమెను దెప్పి పొడిచింది. ఆమె మేనకోడల్ని గొప్ప యింటి వాళ్ళు ఎలా వియ్యం అందు కుంటారని వ్యంగ్యంగా అంది. ఆమె నర్మోక్తి విన్న కళ్యాణికీ మహీపాల్‌కీ చాలా బాధ కలిగింది. ఆ ముల్లర్ తల్లి పసక్తే మళ్ళీ ఇవ్వాళ వచ్చింది. ఇవ్వాళ ఆమె గురించి మళ్ళీ వినాలన్న కుతూహలం కలిగింది మహీపాల్‌కి. "ముల్లర్ వాళ్ళమ్మగారు ఇవ్వాళ ఏమని అంది?" అని అడిగాడు మహీపాల్.

"ఏమని అంటుంది. నోటికి తాళం పడినట్టయింది. అందరి ముందే నేను మొహాన అనేశాను. అన్యాయంగా, అక్రమంగా దోపిడీలు చేసి మిగతా వాళ్ళు గొప్పలు కొడుతుంటారేమో కాని మేం మాత్రం నిజాయితీ, ధర్మానికి కట్టుబడి వుంటూనే గొప్పలు చెప్పుకుంటాం అని అనేశాను. బ్యాంకుల్లో మాకు లక్షా రెండు లక్షలూ లేక పోవచ్చు కానీ మాకు ఎప్పుడు ఎంతవరకు అవసరమో అంత మా యింట్లోకి వస్తుందని అన్నాను. శకుంతలకే ఇస్తున్నాంగా పదివేలు కట్నం-" అని కళ్యాణి చెబుతోంటే గర్వం అభిమానాలతో ఆమె కంఠంలో రొప్పు కనిపించింది. ఓ క్షణం ఆమె మౌనం వహించింది. గుండాల్ని వేయిం చడం అయి పోయింది. పని గుడ్డ సహాయంతో ఆమె కళాయిని దించి నేల మీద పెట్టింది. ముఖం తుడుచు కుంటూ కాస్సేపు అలసట తీర్చుకోవ డానికి కని పీటమీద చతికిల బడింది. మహీపాల్‌కి ఇంకా వినాలని కుతూహలంగా వుంది త్వరత్వరగా పరుగెత్తుతోన్న వెలుగునీడల్లా అతని మనస్సు బాగా అలిసి

పోయివుంది. స్వోత్కర్షకు సంబంధించిన మాటలు మరీమరీ వినాలన్న వుత్సాహంతో ఎక్కడలేని ఓపికను తెచ్చిపెట్టుకుంటూ "ముల్లర్ వాళ్ళమ్మ ఇంకా ఏమేమి అంది? ఆమె అంటోంటే అక్కడ ఎవరెవరు వున్నారు? అని అడిగాడు.

"చాలా మంది వున్నారు" అంటూ వేయించిన గుండెల పల్లాన్ని పాకంలో వెయ్యడానికి తనవైపు లాక్కుంటూ కళ్యాణి మళ్ళీ చెప్పిందిـ "జై కిషోర్ అమ్మా వాళ్ళు ఒదినా. అతని భార్యా అంతా వున్నారు. వాళ్ళంటే అణిగి మణిగి వుండడానికి నాకేం? నేను ఎంత పరువూ. మర్యాదగల కుటుంబంలో పుట్టానో వాళ్ళకేమి తెలుసు? వీళ్ల ముఖాలకు అంత భాగ్యం కూడా అబ్బేనా? వాళ్ళంటోంటే ఇన్నాళ్ళ నుంచి దిగమింగి కూర్చున్నాను. ఇప్పుడవకాశం రాగానే అందరినీ ఏకిపారేసాను. మిగతా వాళ్ల భోగాలు కొన్ని సంవత్సరాల పాటు పెరిగి ఆరిపోవచ్చేమో తని మా కుటుంబ మర్యాదా మన్నన మాత్రం కాలం పెరిగిన కొద్దీ అదీ పెరుగుతూనే వుంది కాని ఎప్పుడూ తగ్గడం అనే మాటే లేదు పట్నంలోనూ, వాళ్ళ జ్ఞాతుల్లోనూ ఎంతో మంది ధనవంతులూ, డాక్టర్లూ, వకీళ్ళూ వున్నారు. కాని బయటికి పోతే వాళ్ళను ఎవరు గుర్తిస్తారు? అదే మా యింట్లో వాళ్ళను చూడండి. దేశ విదేశాల్లో కూడా వాళ్ళ పేరు మారు మ్రోగుతుంది. పెద్ద పెద్ద హోదాలు వున్న అధికార్లూ, వ్యక్తులూ మా యింటాయన్ను గౌరవిస్తారు. మా వారు రాసిన పుస్తకాల్ని చదువుతారు మా వారికి సమానంగా తూగగలవాళ్ళు ఎవరున్నారు, అని వాళ్ళను తెగనాడాను" అభిమానంతో వెలుగుతోన్న కళ్యాణి ఓ బల్లి గరిటె నిండా గుండ్లు తీసుకుని పాకంలో వేసింది.

కళ్యాణి అలా శివితో మాట్లాడుతోంటే మహీపాల్ లోలోన పొంగిపొయ్యాడు. వుబ్బి తబ్బిబ్బై పొయాడు. అయినా తన మనోభావాన్ని బయటికి కనబర్చ కుండా "ఇటువంటి మాటలు నువ్వు నీ నోటితో అనకుండ వుండవలసింది. నువ్వొట్టి అమాయకురాలివి" అంటూ వారించబోయాడ.

"ఎందుకు అనకూడదు" అంటూ ఆమె ఒక్కసారి తల విసిరేస్తూ అనగానే ఆమె శరీరం కదిలింది. శరీరం కదలడంతోటే ఆమె ఒంటి మీద నగలు

తళతళ మెరిసాయి. "భగవంతుని అనుగ్రహం వల్ల నీ ఆదాయం ఇలానే వుండాలి కాని పిల్లలికి కట్నాలు ఇవ్వడమే ఏమిటి, చూస్తుండగానే కారూ, బంగాళా అన్నీ కొనుక్కో లేమా" కళ్ళెగరేస్తూ అంది కళ్యాణి.

మహీపాల్‌లో కోరిక చెలరేగింది. అతనామెను ముట్టుకోబోయేడు. "నన్ను ముట్టుకోవద్దు ఎవరో వస్తున్నట్టుంది" అంటూ బిడియపడుతున్నట్టు నటిస్తూ ఒయ్యారంగా కళ్యాణి వారించింది.

అనుకున్నట్లుగానే శకుంతల వచ్చింది. మహీపాల్ అప్పటికే సిద్ధపడి పోయాడు. మేనకోడల్ని చూడగానే ఒళ్ళు విరుస్తున్నట్టు నటిస్తూ ఆమె తలను రెండు చేతులతో మెల్లిగా పట్టుకుని ఆప్యాయంగా అడిగాడు. "అత్తగారింటి కోసం నువ్వు ఎందుకు వంటకాలు చెయ్యడం లేదూ" అని శకుంతల సిగ్గుతో తల వంచుకుంది. బయటికి వెళ్ళబోతూ "సజ్జన్ నౌకరు వెళ్ళిపోయాడా" అని అడిగాడు.

"వెళ్ళి చాలా సేపయింది"

గుమ్మందాక వెళ్ళి వెనక్కి తిరుగుతూ "తొందరగా పని ముగించుకో. అసలే ఇవ్వాళ హోలీ పండుగ" అని చెప్పాడు. అక్కడ నుంచి పైకి వచ్చాడు. శివాలయం అరుగు మీద బావి పడలో రంగులు చల్లుకున్న ఐదారుగురు కుర్రాళ్ళు కూర్చుని బాతాఖానీ కొడుతున్నారు. తలుపు దగ్గరకు వచ్చి వెనక్కి తిరుగుతోన్న మహీపాల్‌కి వాళ్ళ మాటలు వినపడ సాగాయి. వాళ్ళలో ఒకడు ఇద్దరు ముగ్గురి స్నేహితులతో కలసి తాను సందులో ఓ పూలమ్మిని పట్టడించి ఎలా భయపెట్టిందీ, ఆలా ఆమెను వేధిస్తుంటే వాళ్ళకు ఎంతగా సరదా అయిందీ, చివరికి ఆమె భయాన్ని ఎలా పోగొట్టిందీ అన్నీ బిగ్గరగా చెబుతూ మధ్య మధ్య నవ్వుతున్నాడు. వాడు చెప్పుక పోతోంటే మిగతా వాళ్లకు సరదాగా వుంది. కాని మాట్లాడే తీరు చాలా మొరటుగా వుస్నందున అతనికి కొంచెం అయిష్టత కలిగింది. కాని హోలీ మదనోత్సవం ఆయె. ఫాల్గుణ మాస మహాత్మ్యమే కామదహన మహాత్మ్యం. రాసు కోవడానికి కాని పైన తన గదిలో కూర్చొని వున్న మహీపాల్ ఆలోచనలో మునిగితేలు తున్నాడు.

అకస్మాత్తుగా డాక్టర్ షీలా అతని మనసులోకి తొంగి చూసింది. అంతే. అతని మనస్సంతా పన్నీటి జల్లుతో తడిసి సెంటు వాసనతో గుబాళించినట్టయింది. ఒడుదుడుకుల్లేకుండా ప్రశాంతంగా వున్న అతని మానసిక వాతావరణంలో అమాంతంగా భూకంపం వచ్చినట్లయ్యింది. ఇవ్వాళ హోలీ. కాని షీలా తన దగ్గరలేదు, షీలాను తననుంచి ఎవరో బలవంతంగా అపహరించారు. ఆమె ఎంతో జ్ఞాపకం రావడం మొదలెట్టింది. లోకాచారం, నైతిక విలువ– ఇవి రెండూ అతని చుట్టూ ఎత్తుగా నిర్మించిన ప్రహరీదాటి ఆమె లోపలికి అడుగు పెడుతోంది. 'కావాలి' 'వద్దు' ఈ రెండిటి మధ్య ఘర్షణ జరుగుతోంది. 'వద్దు వద్దు' అంటోన్నా షీలా అతనిలో ప్రవేశించి కాళ్ళు చాపు కుంటోంది. షీలా ఇవ్వాళ తను లేని కారణంగా ఎంత బెంగగా కూర్చుందో కదా? క్రిందటి సంవత్సరం హోలీనాడు వాళ్ళిద్దరూ కలిసారు. షీలాతో కలిసి గడిపిన నెలలూ. వారాలూ, రోజులూ, గంటలూ సూక్ష్మ శరీరాల్ని తొడుక్కొని క్షణాల కింద మారి పోయాయి. వాటిని తలచు కుంటోంటే అసంఖ్యాకంగా ఆకాశాన్ని పొడుచుకు వచ్చిన చుక్కల్ని చూసినంత ప్రశాంతంగా అతని మనస్సు ప్రశాంతత చెందింది. షీలా అంటే నగరంలో పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకున్న డాక్టర్ షీలా స్వింగ్ అన్నమాట. దేశంలో నలుమూలలా ప్రతిష్ఠసంపాదించుకున్న మహీపాల్ లాంటి సాహితీ వేత్తకు కూడా ప్రభుత్వం తరపున జరిగే కార్యక్రమాల్లో రమ్మంటూ ఆహ్వానం అందదు కాని డాక్టర్ షీలా అంటే సంఘంలో ప్రతి వర్గం ఆమెను నెత్తిన పెట్టు కుంటుంది. షీలాకు లక్షన్నర రూపాయల దాకా ఆస్తి వుంటుంది. అంత స్వతంత్ర వ్యక్తిత్వం కలదై వుండి కూడా మహీపాల్ ముందు ఆమె ఎంతో నమ్రతగా నడుచుకుంటుంది మహీపాల్ అంటే ఆమెకు ఎనలేని గౌరవం. తన మాటల ద్వారా, చేష్టల ద్వారా ఆమె అతనికి శక్తినీ, ఉత్తేజాన్నీ ఇస్తుంది. సర్వసాధారణంగా విజ్ఞానశాస్త్రాల్ని చదువుకున్న వారు సాహిత్యం అన్నా, కళలన్నా అంత ఆసక్తి చూపరు రస దృష్టివారికి వుండదు కాని షీలా సంగతి వేరు. ఆమె రసజ్ఞురాలు. వాళ్ళిద్దరి మధ్య వైరుధ్యం పొడసూపిన సందర్భాలు కూడా వున్నాయి కాని వాటిని తీక్షణ స్థాయికి చేరకోనివ్వలేదు ఆమె. అటువంటి షీలా అంటే అతను ఈ రోజు ఈసడిస్తున్నాడు. దూషితభావాన్ని ప్రకటిస్తున్నాడు.

అతని మనసులో షీలా ప్రవేశించగానే సుఖసమృద్ధులతో ప్రశాంత జీవనం గడుపుతోన్న మహీపాల్ హృదయకుహరంలోని గృహస్థు కలవరంచెందాడు. ఒక్కసారి ఆమె యింటికి వెళ్ళి హోలీని రసమయం చెయ్యాలన్న కోరిక అతనిలో ప్రగాఢం అవసాగింది. తను తప్పక వెళతాడు. సంఘానికి వెరిచి ఎన్నని మానుకుంటాడు ? అంత అవసరమే వస్తే సంఘం కళ్ళు కప్పి కూడా తన అనుబంధాన్ని నిలుపుకోవచ్చు. ఇంతవరకు అతను అజాగ్రత్తగానూ నిర్ల క్ష్యంగానూ వుంటూ వచ్చాడు గనుకనే సంఘంలో అతని పరువు దెబ్బతింది. అతను మొదట్లోనే జాగ్రత్త పడివుంటే జీవితాంతం ఈ ప్రేమాయణం బయటికి పొక్కేది కూడా కాదు. షీలాను కలుసుకుందామన్న కోరిక బలీయమవుతోంటే తాళలేక మహీపాల్ బయలుదేరుదామని లేచాడు. రెండో అంతస్తులో పిల్లలు ఆడుకుంటూ కనిపించారు. కొంగుతో ముఖాన్ని తుడుచుకుంటూ వంటింట్లోంచి గదివైపుకు వెళుతూ కళ్యాణి కూడా కనిపించింది. ఆమెను చూడగానే అతను వేసిన పథకం యావత్తూ విఫలమయింది. 'వీల్లేదు. శకుంతలకు వివాహం చెయ్యాలి. కోడళ్ళు వస్తారు. ఇప్పుడు నేను ఒంటరిగాణ్ణి కాదుగా – స్వేచ్ఛాజీవిని కాదు, నా కోరికల్ని, ఉత్తేజాన్ని చంపుకోవాలి.

తనపై తనకు తానుగా విధించుకున్న నిషేధం మూలంగా అతని మనస్సు షీలాకోసం తపించసాగింది. నిజంగా అతని మనస్సు ఇప్పుడు శూన్యంగా మారుతోంది. నిజంగా అది భావశూన్యమైపోతోంది. అతని అనుభూతి స్రోతస్సుపై ఎవరో బంధరాయి పెట్టి అతనిలో వున్న కల్పనాశక్తి మహిమ చేతనే అతను ఇన్ని ఆలోచనల భవంతుల్ని నిర్మించకలుగుతున్నాడు. నిజంగా చూస్తే అతనిలోని ఉత్సాహం ఇంకిపోయింది. అతను నిర్జీవంగా అయిపోయాడు.

# 40

డాక్టర్ షీలా బాల్జాక్ జీవిత చరిత్ర చదువుతూ పడుకుంది. చదువుతూ చదువుతూ గుర్తుగా ఓ కాగితం ముక్క ఆ పేజీలో పెట్టేసి కళ్ళు మూసుకుంది, ఏదో ఆలోచిస్తున్నట్టుగా. అప్పటికే ఆమె నౌకరు అబ్దుల్

మంచానికి దగ్గరగా బల్లఅరిపి టీ సెట్టు వుంచి అలాగే నిలుచున్నాడు. షీలా ముఖం విషాదపూరితంగా పాలిపోయినట్టుగా వుంది. టీ తాగటం కూడా కష్టం అనిపించింది. అయినా పక్కకు ఒత్తిగిలి సన్నగా ఒళ్లు విరుచుకుని అవతించి లేచి కూర్చుంది. అబ్దుల్ కెటిల్లోంచి డికాక్షను వంపి టీ కలుపబోతుంటే వారిస్తూ "నేను కలుపుకుంటానులే. నువ్వెళ్లు" అంది.

కలుపుతున్నవాడల్లా చేయి వెనక్కి తీసుకుని చేతులు కట్టుకుని నిలబడి "సాయంత్రానికి ఏమి చేయమంటారు మేడమ్. ఎవరైనా అతిధులు వచ్చే వాళ్ళున్నారా?" అని అడిగాడు అబ్దుల్.

"ఎవరూ లేరు" అంటూ రెండోసారి ఆవలిస్తూ డాక్టర్ షీలా - "నీకు తోచింది చెయ్యి" అని చెప్పింది.

అబ్దుల్ వెళ్ళిపోయాడు. మంచుతగిలి మొద్దుబారిన చేతుల్లా ఆమె రెండు చేతులూ టీని కలుపసాగాయి. ఈ హోలీ రోజున ఆమెకు కూడా మహిపాల్ పదేపదే జ్ఞాపకం వస్తున్నాడు. ముప్పైఎనిమిది సంవత్సరాల వయసువున్న డాక్టర్ షీలాకు మహిపాల్ రాకపోయేసరికి తనకి వృద్ధాప్యం వచ్చినట్లు అనిపించింది. జీవితంలో వెదజల్లిన ఆనంద స్రోతస్సే ఇంకిపోయినట్టయింది. ఇంతడబ్బూ, ఆస్తి, గౌరవం, ప్రతిష్ఠ - యిన్ని ఆర్జించుకుని కూడా ఆమె ఎంతో నిస్సహాయ స్థితిలో పడిపోయినట్టయింది. ఇప్పటిస్థితికి ఆమె వచ్చిందంటే జీవితంలో ఎన్నో కొరతలూ, అసహాయవస్థలూ వైరుధ్యాలతో ఆమెఘర్షణపడి విజయం సాధించింది. కాని ఇప్పుడామె శక్తి అంతా మహిపాల్ లేని కారణంగా పొరలు పొరలుగా వూడిపోతోంది. మహిపాల్ రావడం మానేయడంతో ఆమె షికార్లు, క్లబ్బులూ ఇంకా మనస్సును ఆహ్లాదపరిచే ఎన్నో కార్యకలాపాలకు ఇంచుమించుగా ఆమె స్వస్తి చెప్పింది. ఈమధ్య మరీ విసుగ్గా వుంటే రెండు పర్యాయాలు సినిమాకెళ్ళింది. అంతే, చాలా రోజుల్నుంచి రోగుల్ని తనిఖీ చేసి చికిత్స చేయడం మినహా ఆమె ఎక్కడికీ కదలటం లేదు అడపాదడపా సజ్జన్, కన్యా కలిసి వచ్చి ఆమెను చూసిపోతున్నారు. అది

మినహా పుస్తకాలూ, రేడియో లేకపోతే అందరికీ దూరంగా ఏకాంత సేవలో కాలక్షేపం చెయ్యడం.

షీలా బాల్యం అంతా దారిద్ర్యంలోనే గడచింది. ఉత్తరప్రదేశ్ లోని క్రైస్తవ మతస్థులు చాలమంది బీదవాళ్ళు. ఆమె బాల్యంలో పాదరీలుగా విదేశాల నుంచి వచ్చిన మిషనరీవాళ్ళే వుండేవారు. షీలా తండ్రి పశ్చిమ సంయుక్త రాష్ట్రాల్లో ఓ చిన్న వూళ్లో చిన్న స్కూలుకు హెడ్ మాస్టరుగా వుండే వాడు. తల్లి కూడా టీచరు. ఆరుగురు అన్నలూ, చెల్లెళ్లూ, వున్న తన ఇంట్లో ఆమె మూడోది. కటిక దారిద్ర్యంలో రోజులు గడిచేవి. షీలా దారిద్ర్యం అంటే తిరుగుబాటు చేసేది. మొండిగా దుబారాగా ఖర్చులు పెట్టేది మొదటి నుంచి పరిస్థితులకు లొంగే స్వభావంకాదు ఆమెద. చదువులోనూ వుపన్యాసా లివ్వడంలోనూ చాలా చురుకు కావడం వల్ల ప్రథమస్థానం ఎప్పుడూ ఆమెకే దక్కేది. అందుకనే కాలేలు ఆమెకు ఆత్మాభిమానం ఎక్కువ. పాఠశాలల ప్రాంతీయ ఉపన్యాసాల పోటీలో అలహాబాద్ నుంచి రెండుసార్లు బహు మతులు గెల్చుకుంది. ఇంటిలో ఆమెకు గౌరవం గుర్తింపూ లేకపోయినా బయట మాత్రం గౌరవం, ఆదరణా లభించడంతో ఆమెలో అంతః సంఘర్షణ రేగేద. తన బాల్యంలో జరిగిన జాతీయ ఉద్యమాల ప్రభావం కూడా ఆమె మీద పడింది.

హిందుమతం నుంచి చిన్న కులాల నుంచి వున్నతోన్నత కులాల వారు కూడా క్రైస్తవ మతంలోకి దూరారు. అలాగే ముసల్మానుల్లో కూడా అన్ని వర్గాల నుంచి క్రైస్తవులయిన వారున్నారు. వీళ్లంతా మతాంతీకరణైతే అయ్యారు కాని తమ పురాతన సంస్కారాల్ని వదనాదలేక పొయ్యారు క్రైస్తవులుగా మారిన హిందువులు వియ్యాలు అందుకునేప్పుడు అలాంటి వర్గాన్నే ఎన్నుకునేవారు. క్రైస్తవులుగా మారిన ముసల్మానులు విషయంలో కూడా ఇదే వైఖరి ప్రబలంగా వున్నట్టు కనపడింది. ఇక మూఢాచారాలూ, రీతి రివాజులన్నీ భారతీయుల నుండి పుణికి పుచ్చుకున్న వే పాటించే వాళ్లు ఫలానా రోజు ఫలాన దిశగా ప్రయాణం చెయ్యరాదు, ఆడపిల్ల యింట నీళ్లు ముట్ట

కూడదు అనే భారతీయుల్లో నుండే నమ్మకాలు వీళ్ళలో కూడా వుండేవి. వంటింట్లోకి బయటివ్యక్తి రావడంపై నిషేధం, ఇతరులు చూస్తుండగా భోజనం చెయ్యకపోవడం లాంటిశుద్ధహిందూ పద్ధతిని, ఆచారాలను భారతీయక్రైస్తవులు పాటించేవాళ్ళు. ఆఖరికి పేర్లలో కూడా హిందూ పద్ధతిని పూర్తిగా త్యజించ లేక పోయారు. ఉదాహరణకు సింగ్ స్వింగ్ అయ్యారు. రాంఖలీ రాంబెల్స్ ఆయి పోయాడు; ఇక బెనర్జీ మహాశయుని బోనర్జీ అంటేగాని ఆయన సంతోష పడ లేదు. పేర్లను గురించి ఎన్నో కుటుంబాల్లో అనేకమైన విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. డాక్టర్ షీలా అన్నల్లో ఒకని పేరు విన్సెంట్ రామ్ అయితే ఇంకొకని పేరు శామ్యూల్‌రామ్. తండ్రిగారు మేనేస్వింగ్ అయితే మూడో అన్న మాత్రం పూర్తిగా విదేశీయుల పేరు పెట్టుకుని స్మిత్ బ్రైట్ అయ్యారు.

షీలా చిన్న తనంలో మొదటి ప్రపంచ సంగ్రామం తర్వాత జాతీయ చైతన్యం దేశం అంతా వ్యాపించింది. ఇక్కడి భారత క్రైస్తవసమాజంలో కూడా ప్రథమంగా జాతీయభావం కలిగింది. జాతీయ జాగృతి వెలిసింది. క్రైస్తవ ధర్మనికి భారతీయీకరణ జరిగింది. పియానోల స్థానంలో తబలా, హార్మోనియం వచ్చాయి విదేశీ భజనల స్థానే లలిత శాస్త్రీయ పద్ధతిలో భజనలు కీర్తించడం, మత సంబంధమైన గజలులు పాడడం చోటు చేసుకున్నాయి క్రాస్ ముందు భజన చేసేప్పుడు హారతిపట్టడం, ఆమెన్ ఆమెన్ అని అనడానికి బదులు శాంతి శాంతి అనడం ఆచారమైపోయింది. ఈ భారతీయీకరణను వ్యతిరేకించినవాళ్ళు లేకపోలేదు. ఫలితంగా క్రైస్తవ విద్యార్థి సంఘంలో చీలిక వచ్చి రెండు పార్టీలుగా విడిపోయింది.

ఇటువంటి సాంఘిక ఉద్యమాలంటే ఎంతో చొరవ తీసుకుని వాటి కార్యకలాపాల్లో ఎప్పుడు ముందంజవేసేది. స్వభావసిద్ధంగా మొదటి నుంచి ఆమె ధైర్యస్థురాలు. తిరుగుబాటు ధోరణి కలది. ఈ విప్లవాత్మక స్వభావం వల్లనే ప్రారంభం నుంచి విదేశీయుల కిందమిషనరీ వుద్యోగం చెయ్యడానికి ఆమె మనసు అంగీకరించలేదు. తిరుగుబాటు మనస్తత్వకారణంగా ఆమెకు దొరికే

జీతము అన్నీ అప్పచేశారు. ఇంటి వాతావరణం ఆమెకు చాల చేదుగా తయారైంది
ఆమెకు వ్యతిరేకంగా ఇన్ని శక్తులు విజృంభించినా వాటిని లెక్కచేయక ఎన్నో
కష్టాలకు ఓర్చి ఆమె డాక్టరు అయింది. ఇంటి బందిఖాన నుంచి తొందరగా
విముక్తి పొందడానికిగాను వెంటనే ప్రభుత్వ ఆరోగ్య శాఖలో చేరింది.
అర్థంకులు వచ్చినా ఆమెకు వుద్యోగం దొరికింది. అదృష్టం కూడా కలిసి
వచ్చినది ఆమె చేసిన కృషి పడిన శ్రమా ఫలించాయి. నెమ్మదిగా ప్రమో
షను ఎచ్చి పైకి వెళ్ళింది. 1992 లో లక్నోలోని కింగ్ జార్జి ఆసుపత్రిలో
ఆమెకు వుద్యోగం దొరికింది. ఇక్కడ చేరగానే ఆమె అదృష్టరేఖ వడివడిగా
పెరుగుతూ వచ్చింది. ఈ పధ్నాలుగు పదిహేను సంవత్సరాల కాలంలో ఆమె
పూర్తిగా స్వతంత్రురాలై కావలసినంత ప్రాక్టీసు సంపాదించుకొనడంలో అద్భు
తంగా కృతకృత్యురాలైంది. తన మతంవాళ్ళల్లోనే పాల్ అనే ఓ యువకుడితో
ఆమెకు ప్రేమాయణం నడిచింది. పాల్‌కి కూడా భారతీయ సంస్కృతి అంటే
అభిమానం వుండేది. ఇద్దరు కలిసి భారతీయ ఇతిహాసాలూ, సాహిత్యం
వేదాంతం చదువుతూ వుండేవాళ్లు. భారతీయులం అన్న ఆవేశంలో వయస్సు
కన్న మించిన పుస్తకాలు చదివి వాటిని గూర్చి చర్చిస్తుండే వారు ఇలా
వుంటోండగా కలావచ్చిపాల్ ఆమాంతంగా చనిపోయాడు. షీలా జీవితంలో
ఒక పెద్ద అఘాతం యేర్పడింది. పాల్ తర్వాత కూడా ఇద్దరు వ్యక్తులు ఆమె
జీవితంలోకి ప్రవేశించారు. కాని స్నేహితులుగానే వుండి పోయారు. ఇలాంటి
తరుణంలో ఆమెలో ఏర్పడిన శూన్యాన్ని పూరిస్తూ మహీపాల్ ఆమె జీవితంలో
అడుగుపెట్టాడు. అందచందాలు వున్నవాడూ, బలశాలి, సహృదయుడైన
కళాకారుడు, విద్య అంటే చెవికోసుకొనే స్వభావం, స్వాభిమానం, తిరుగుబాటు
వ్యక్తిత్వంతో పూర్ణమైన మహీపాల్ ఆమె సౌభాగ్యం, కిరీటంలోనిమణి
అయ్యాడు. ఇప్పుడామె మనస్సులోని కొరత తీరిపోయింది. త్రికరణ
శుద్ధిగా ఆమె భారతీయ పద్ధతిలో మహీపాల్‌కి తన హృదయాన్ని అర్పించింది.
తన సంపాదనని మహీపాల్ కోసం ఖర్చుపెడదామని తహతహలాడుతోంది.
దానిలోనే ఆమెకు ఆనందం. కాని ఆ సరిహద్దును ఆమె ఇంతవరకు అతి
క్రమించకపోవడమే ఆమెపై మహీపాల్ విజయానికి కారణం. అతని పౌరుషం

ముందు ఆమె చేతులు జోడించి నమస్కరిస్తుంది. ఒంటరిగా టీ తాగుతోందే ఆమె మనసు మహీపాల్ యింటికి వురకలు వేసింది. కళ్యాణి ఆమె పిల్లలు కళ్ళలో మెదిలారు మహీపాల్ సంతానంపట్ల ఆమె ఎట్టి మానసిక బంధనాల్ని పెంచుకోలేదు పొరపాటున వాళ్ళలో ఎవరైనా తారసిల్లితే మహీపాల్ పిల్లలని వాళ్ళ శ్రేయస్సు కోరుతున్నట్లు పలకరించేది. కళ్యాణి అంటే ఆమె ఔదాసీన్యం వహించేది మొదటి నుంచి. కళ్యాణివంటి సూటి స్వభావం కలదీ, అమాయకురాలూ, ఆమెకు ఎప్పుడూ అడ్డంరాలేదని ఆమెకు నమ్మకం వుంది. కళ్యాణి ఛాందసం అన్నా, ఆమె చీకిపోయిన పాత ఆచారాలన్నా మహీపాల్ ఎప్పుడూ చీదరించుకుంటాడు. షీలా అతనిని ఎప్పుడూ సంతోషపెడుతూ వుండేది. తనతోనూ, అతని కుటుంబముతోనూ అనురాగబంధంలో వుంటూ వుండడమే ఆమెకు కావలసిందల్లా. కళ్యాణి అధికారాన్ని హస్తగతం చేసుకోవాలన్న ఆలోచన ఆమెకెప్పుడూ కలగలేదు. కాని అతని బావమరిది వివాహంలో అతనికి వున్న అనుబంధం పొక్కగానే తనతో సంబంధాన్ని కళ్యాణి తీవ్రంగా వ్యతిరేకించడంతోనూ, అప్పటి నుంచి మహీపాల్ తన యింటికి రావడం పూర్తిగా మానివేసినప్పటి నుంచి కళ్యాణి అన్నా ఆమె పిల్లలన్నా ఆమెకు విసుగు కోపం రావడం ఆరంభమైంది. బాల్జాక్ జీవిత చరిత్ర చదువుతోన్నప్పుడు కూడా మహీపాల్ పట్ల చిన్నచూపు ఆమెను వేధిస్తూవుంది. మేడమీద బర్న్, బల్జాక్‌ల ప్రేమను వర్ణిస్తూ స్టీఫన్‌స్విగ్ రాసిన ఈ పంక్తులు ఎంత ఆర్తితో నిండి వున్నాయి. "ఫిర్యాదులూ పితూరీలూ, గృహకలహాలూ, గ్రామంలోని రహస్య సంకేతాలూ, చర్చి — వీటిలో ఏ ఒక్కటి కూడా ప్రియురాలికి అతను స్వతంత్రంగా ఆవేశంతో చేసిన సమర్పణను ఆపలేక పోయింది. ఈ వాక్యం ఆమె మనస్సును సూదుల్తో గుచ్చసాగింది. ఇవ్వాళ హోలీ షీలా ఒంటరిగా వుంది-ఇక ఎప్పటికి ఆమె ఒంటరిగానే వుంటుంది షీలా మామూలు ఆడ పడుచుకాదు. ఒక పేరుమోసిన డాక్టరు. పేరు ప్రతిష్ట, కారూ, బంగళా బ్యాంకి అకౌంటూ అన్నీ హంగులూ వున్నాయి కాని అడదానిజీవితానికి ఇవన్నీ పరిపూర్తిని ఇవ్వగలవా? లోలోనే కుములుతోంది షీలా. ఆమెలో దాగివున్న మొండితనం లోలోపల కుతకుతలాడింది. ఆమె కొంచెం పట్టుచూపించడంటే

అన్నిబంధాల్నీ తెంచుకుని మహీపాల్ ఆమె దగ్గరవాలిపోతాడు. ఆమె మనస్సు కలా చెయ్యమంటూ పదేపదే చెబుతోంది. కన్నార్పకుండా వున్న ఆమె చూపులో మహీపాల్ స్పష్టంగా కనపడుతున్నాడు. అదే విగ్రహం - చేతులువీపు వైపుకు వెనక్కి కట్టుకుని దేహ దారుఢ్యం వుండి విశాలమైన ఛాతీ కలవాడు. అదే నిర్లక్ష్యభావం, అమాయకత్వం, అన్నిటితో నవ్వుతోన్న అతని ముఖం గతించిన ఓ ఆనందక్షణంలా ఆమె ముందు వచ్చి నిల బడ్డాడు. జ్ఞాపకశక్తి తన పూర్తి బలాన్ని వినియోగించి గతిమానం అయింది.

"ఏమండీ. ఒంటరిగానే టీ తాగుతున్నారు" అంటూ ఆకస్మాత్తుగా ఓ స్త్రీ పలకరించే సరికి ఆలోచనలో మునిగివున్న డాక్టర్ షీలా వులిక్కి పడి గుమ్మంవైపుచూసింది. వనకన్య. సజ్జన్ వర్మ గుమ్మం దగ్గర నిలబడి నవ్వుతూ వున్నారు, గుమ్మానికి అడ్డంగా వేసిన తెరతొలగించి సజ్జన్ ఇంకా చేతిలోనే పట్టుకుని నిలబడ్డాడు. వనకన్య శరీరం అంతా నగలతో నిండి వుంది. చాల ఖరీదుగల చీరే కట్టుకుంది కన్య. కన్య వేషాన్ని ఆపాదమస్తకం పరిశీలించింది షీలా. ఒంటినిండా సింగారించుకున్న కన్య అచ్చంగా పెళ్ళికూతురిలా భారతనారీమణిలో మూర్తీభవించిన ముత్తైదువలా వుంది. ఇందాకటి నుంచి మహీపాల్ ధ్యాసలో వున్న షీలా ఆమెను కన్నార్పకుండా అలానే చూస్తూంది. తాను కూడా వనకన్యమాదిరిగా ముత్తైదువలా ముస్తాబైతే ఎంత బావుంటుందో అనే ఆలోచన ఓ క్షణం షీలా మనస్సులో మెరిసి మాయమైంది. అంతలో ఆమె ఆలోచనల్ని భగ్నం చేస్తూ మాటకలుపుతూ సజ్జన్ - "పెద్దవాళ్ళకు ఒంటరితనం అంటే ఇష్టం కదూ. డాక్టరు గారు కూడా ఒంటరిగానే వుండాలనుకుంటునట్టుంది" అన్నాడు.

అతని మాటలకు లభ్యంతరం చెబుతున్నట్టుగా షీలా అంది - దుర్జన్! నువ్వు చాల తుంటరిగా తయారవుతున్నావ్. కన్య, నువ్వుఇతని మాటలు కొంపతీసి నమ్మేవు సుమా. ఈ మధ్య కేసులు ఎక్కువయ్యాయి. వాటితో అసలు తీరికే -

"డాక్టరు గారే వేషంటుగా మారారని చెప్పండి" అంటూ ఆమె మాట్లాడు తోంటే మధ్యలోనే అందుకున్నాడు సజ్జన్. ఇంటికి నిప్పంటుకోగానే ఇంటిలోని వ్యక్తి బయటపడినట్టు ఆమె మనస్సులో దాచుకున్న రహస్యం బహిర్గతమైంది.

టీ వచ్చింది. అందరూ టీ తాగారు. లోకాభిరామాయణం మాట్లాడు తున్నారు ముగ్గురూ కూర్చుని. వాళ్ళ సంభాషణలో పెద్ద కోడలు మోహిని ప్రసక్తి వచ్చింది. ఆమె ఎలావుంది అంటూ అడిగింది డాక్టర్. 'ఆమె గురించి విశేషాలు ఏమీ తెలియడం లేదిప్పుడు' అంది కన్య.

'కొద్ది రోజులు క్రితం హజరత్ గంజ్‌లో చూశాను. ఆమె వెంట టోర్ మరెవరో లావుపాటిషావుకారు వున్నారు. బాగా మేకప్‌లో వుంది. పాపం మోహిని కేసు చాలా విషాదంగా తయారైంది" అంటూ సజ్జన్ కొన్ని వివరాలు తెలిపాడు.

కాస్సేపు నిశ్శబ్దత ఆవరించింది. డాక్టర్ షీలాయే నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ "మనుష్యుల సమాజం మానవ ప్రాణులసమాజం కాకపోతేఎంతబావుండేది! ఇంత సభ్యతా, నాగరికతా, సంస్కృతి, ఈసైన్సూ విద్య, మానవుడు సాధిస్తోన్న ఈఘనతలన్నీ ఈ బాధ్యతలన్నీ ఎందుకు మెడకుతగిలించుకుంటాడో అర్థంకాదు. ఇవన్నీ లేకపోయినా అతను సుఖజీవనం చెయ్యగలడు. ఆమాటి కొస్తే ఇంకా ఎక్కువ సౌఖ్యంగా వుండగలడు. నగలవ్యామోహంలో పడి మనిషినైసర్గిక సౌందర్యం మరుగున పడిపోతోంది సరికదా ఆ బరువు మోయలేక కూడా అలసిపోతున్నాడు."

సజ్జన్ నోరు విప్పకుండా కూర్చున్నాడు. కన్య కూడా మౌనంగానే వుంది. షీలాలో జరుగుతున్న మానసిక సంఘర్షణకు సజ్జన్‌లో సానుభూతి కలిగింది షీలా ఇలా ప్రేలాపన చేస్తోందంటే దానికి కారణం ఆమె మనసులో గూడు కట్టుకున్న ఆవేదనే. త్యాగం చెయ్యడం చాలా కష్టతరం. బాబారామ్‌జీ కోరిన ప్రకారం తన సర్వస్వాన్నీ పరిత్యజించగలడా? చెయ్యలేడు. అది సాధ్యం కాదు. తన ఐశ్వర్యంలో కొంత భాగదేయాన్ని ఇతరులకు దానం

చెయ్యడం సులభమేమో కాని వున్నదంతా పూడ్చిపెట్టడం అతనివల్ల అయ్యే పనికాదు. మహీపాల్ షీలా మధ్య ఏర్పడుతోన్న అఘాతాన్ని తాను పూడ్చాలి. గభాలున కుర్చీలోంచి లేస్తూ "డాక్టర్ ఒక్కమాట" అంటూ పక్కకు తీసుక పొయ్యాడు ఇవ్వాళ నా ఇంట్లో చిన్న పార్టీ వుంది సాయంత్రం. నిన్ను తప్ప కుండా పిలిచేవాణ్ణి. కాని కర్నల్ భార్యా మహీపాల్ సతీమణిగార్లు పార్టీకి వస్తున్నారు, కన్య ఇంట్లో అడుగు పెట్టిన తర్వాత హోలీ రావడం ఇదే మొదటిది గనక వాళ్ళను పిలవాల్సి వచ్చింది. మహీపాల్‌ని మరికలుసుకోవడం నీకు అంగీకారమేనా? అంటూ అడిగాడు సజ్జన్.

షీలా ఏమీ మాట్లాడకుండా నిలబడింది. సజ్జన్ అదే ప్రశ్న మళ్ళీ రెట్టించాడు.

"వారి ఉద్దేశ్యం ఏమిటి?" అంటూ షీలా పక్కకు చూస్తూ అడిగింది.

"వాడినయితే నేను ప్రత్యేకించి అడగలేదు. అడగాల్సిన అవసరం కూడా లేదనుకుంటాను. నీతో కలవాలన్న ఆరాటం మహీపాల్‌కు ఎందుకువుండదు? నీకు అలాంటి అపనమ్మకం కలుగుతోందా?"

షీలా అలాగే నిలబడింది. ఆమె కళ్లలోంచి అశ్రువులు ధార కడుతున్నాయి.

ఆమె భుజంమీద చెయ్యి వుంచి సజ్జన్ ధైర్యం చెప్పాడు— "నువ్వు ఏడున్నర గంటలకు మా యింట్లో వుండాలి. నువ్వు వున్నట్లు ఎవరికీ తెలియకుండా వుండే ఏర్పాటు నేను చేస్తాను. హోలీ కానుకగా మహీపాల్‌ని నీకు అప్పగించే పూచీనాది. ఇకనైనా నువ్వు బెంగపెట్టుకోకు. నువ్విలా దిగులుగావుంటే నేను చూడలేకపోతున్నాను."

బాగా ఏడ్చిన తర్వాత కావలసిన మిఠాయి పొట్లం దొరికిన కుర్రాడిలా సజ్జన్ చెబుతోంటే షీలా విని మెదలకుండా నిలబడింది. ఎన్నిరోజుల తర్వాత ఆమె మహీపాల్‌ని మళ్ళీ కలియబోతోంది!

# 41

కన్యా, కళ్యాణి, కర్నల్ గారి భార్య ముగ్గురూ కూర్చొని ఏదో ముచ్చట్లు చెప్పుకుంటున్నారు. ఆ మాటా ఆ మాటాలోంచి ప్రసంగం భోజనాల వరకూ వచ్చింది. కళ్యాణి సజ్జన్ వర్మ యింట్లో భోజనం చెయ్యరు. ఫలహారం మాత్రం చెయ్యడానికి అభ్యంతరం వుండదు. ఆ ప్రసక్తినే కొంచెం సాగదీస్తూ కన్య అడిగింది.– "ఈ కాలంలో కూడా అంటూ ఆచారమూ అంటూ కూర్చుంటే ఎలా ఒదినగారూ! ఇవన్నీ మీరు త్వరగా ఒదిలెయ్యాలి".

ఆ మాట కళ్యాణికి నచ్చలేదు. తన కులం అన్ని కులాల కన్న శ్రేష్ఠమైనదాయె. ఆచారాల్ని సమర్థిస్తూ కళ్యాణి అంది – "ఇంతవరకయితే మాకు గడిచింది. ఎంత కాలం మారినా మడీమట్టూ, అంటూ అన్నవి ఎలా పోతాయి?"

"ఇవ్వాళ అయితే మా యింట్లో బ్రాహ్మణుల చేతనే వంట చేయిందాను. మీరు ఆచారస్తురాలని తెలిసి వంటింటిపక్కకే వెళ్ళలేదు. చూడండి. ఈ ఒదిన గారికి కూడా ధర్మాచారాలంటే మోజేమరి. కాని ఇవ్వాళ–"

"నా ఆచారం మడీ సంగతే చెప్పాలి. అన్నీ ఒదిలేసాను ఈ పిల్లలతో వేగలేక. వెనకటి రోజుల్లో అయితే సూర్యాస్తమయానికి ముందే మేం భోజనం చేసేవాళ్ళం. మా జైనమతం ప్రకారం అలాగే భోజనాలు ముగించాలి. కాని ఏమి చేయమంటారు? పిల్లలు సాగనిస్తేగా. వాళ్ళు తిన్నదాక నేను తిననాయె" అంటూ కర్నల్ భార్య అంది.

"[illegible] తన ఆచారాన్ని విడవకుండా పట్టుదలగా వుంటే మగాళ్ళు ఒప్పుకోక ఏం చేస్తారు? మా యింట్లో పిల్లలపోరు తక్కువా? అయినా ఎప్పుడూ అనాచారం అనేది జరగనివ్వను ఇంట్లో. మాకులం బ్రాహ్మణులకెల్ల గొప్పదాయె" అంటూ కళ్యాణి తన కులం గురించి గొప్పలు కొట్టేసరికి కర్నల్ భార్యకు [illegible]కుంది. వెంటనే చురక అంటిస్తూ అంది – "అందరి కులాలు గోత్రాలూ గొప్పవే. మా జైన మతం అయితే అన్నిటికన్న గొప్పది. ఎంతో మంది బ్రాహ్మణ పండితులు హిందూమతాన్ని వదలి మహావీరుని శరణువేడారని

కథలో కూడా వుంది. ఎందుకలా చేశారు ? వాళ్ళ మతం కన్న జైనమతం గొప్పదికావటం వల్లనేకదా !"

జైనులూ, బ్రాహ్మణులూ కలిసి ఇవ్వాళ జరగబోయే వేడుకను రస భంగం చేయబోతున్నట్టు కన్య గ్రహించింది. వెంటనే అందుకుని- "ఏమిటండీ ఒదినగారూ, మీ మతమూ మీరునూ, ఈ ఎక్కువా తక్కువా, ఇదంతా ఒట్టి బూటకం. ఏం రాజ్యశ్రీ, నీ అభిప్రాయం ఏమిటీ చెప్పు. నువ్వు శకుంతలా?" అని వాళ్ళవైపు చూసింది కన్య.

అంతవరకు పెద్దవాళ్ళు ముగ్గురు మాట్లాడుతుంటే కూర్చొని మెదల కుండా వింటోన్న శకుంతల, రాజశ్రీ కన్య పలకరించగానే శకుంతల ఎందుకో వెనక్కి తగ్గింది. కాని రాజ్యశ్రీ మాత్రం అడిగిందే తడవుగా", మా నాన్న గారికి అవన్నీ పట్టవండి మాకు కూడా ఆచారాలంటే పట్టవండి పిన్నమ్మగారూ. ఇవన్నీ పాతచింతకాయ పచ్చడి అనుకోండి" అంటూ గభాలున అనేసింది.

కన్య బిగ్గరగా నవ్వేసింది. "విన్నారా మీ కూతురి మాటలు" అంటూ కళ్యాణి వైపు చూసింది.

"ఆహా ! రోజూ వినేమాటలే ఇవి. వీటిలో ఏమైనా సారముందా ఏం ? ఎక్కువాతక్కువా, జాతీకులం ఇవన్నీ భగవంతుడు ఏర్పరిచినవే. వీటిని కాదని ఎవరైనా నెగ్గగలుగుతున్నారా? చెప్పండి'' అంటూ ముక్కుమీద కోపం తెచ్చుకుని పుల్లవిరుపు సమాధానం ఇచ్చింది కూతురు చెప్పిన అభిప్రాయానికి.

అభ్యుదయ భావాలున్న పిన్నమ్మ తన అభిప్రాయానికి విలువ ఇవ్వ డంతో ఎక్కడలేని వుత్సాహం, ధైర్యంవచ్చాయి రాజశ్రీకి, అమ్మవైపు తిరిగి" అయితే నీవుద్దేశంలో భగవంతుడు ఒక్క హిందూ దేశాన్నే సృష్టించాడంటావ్. మరి మిగతా దేశాల మాటేవిటి ? నువ్వే చెప్పవే అమ్మా" అని వెటకారంగా అంది.

"రజ్జో, ఇకచాలించు నీ వుపన్యాసం. పూరికే వసపోసిన పిట్టలా వాగడం నాకు అలవాటులేదు". కూతురువైపు చూసి అంటూ మళ్ళీ కన్నల్ భార్యవైపు

చూస్తూ "మీరు ఎన్నైనా అనండి. ఎవరి ఆచారం, అలవాట్లు వదలడం వాళ్ళకు బాగు అనిపించుకోదు" అని తేల్చింది.

"మీరు అనేది ఓ విధంగా నిజమే అనుకోండి. కాని మగవాళ్ళ ఇష్టాయిష్టాల ప్రకారం నడుచుకోవడం ఆడవాళ్ళ విద్యుక్త ధర్మం ఇప్పుడు చూడండి. ప్రతి యింట్లోనూ కాల మహిమ ఏమేమి గారడీలు చేయిస్తోందో! మరి అలాంటప్పుడు మనం కూడా కాలధర్మాన్ని ఎలా మరిచి నడవగలం చెప్పండి. తన మగాణ్ణి యేడిపించి ఆచారం నిలబెట్టుకోవాలను కొనడం అవివేకం. ఉన్నమాటా అంతే". అంటూ కర్నల్ భార్య గృహిణి కర్తవ్యాన్ని ప్రబోధించింది.

అంతలో నౌకరు వచ్చి కన్య చేతికి ఓ చీటీ ఇచ్చాడు. "ఇప్పుడే వస్తాను, అంది. కన్య లేచి వెళ్ళిపోతూ

"పోనీ చిన్నమ్మగారు, మా సొంత చిన్నమ్మగారున్నారు వారిని చూడండి" అంది రజ్జో

"ఎందుకు చూడలేదు. నేను వారిని బాగా ఎరుగుదును".

"ఆమె మతమే వేరు. మా ఇంటిలో ఎవరికీ [illegible] అది ఇదీ అన్న ఏ నిషేధం లేదు".

"మనం ఇల్లు కట్టుకున్న తర్వాత కూడా ఇలాగే [illegible] కూడా ఆడిగానండి".

"ఇల్లు కడతారా ?" అంటూ కర్నల్ భార్య ఆశ్చ[illegible]స్తూ అడిగింది.

"పిల్ల తనకు వ్యతిరేకంగా మాట్లాడుతోంటే మనసులో కోపగించుకుంటోన్న కళ్యాణికి ప్రసంగం ఇంటిమీద [illegible]కి కాస్త ఊపిరి కలిగింది. "అప్పుడే ఎక్కడ కట్టాం. శకుంతల వివాహం అయిన తర్వాత ఏదో కాళ్ళు ముడుచుకోవడానికి ఓ చిన్న కుటీరం అయినా వేసుకోవాలని ఆలోచించగలం" స్థాయిని కాస్త తగ్గించి అంది.

''శకుంతల పెళ్ళి ఘనంగానే చేస్తున్నారని విన్నాను"

"ఘనంగా ఏమీలేకపోయినా దర్జాకు సరిపడినంతగా నైనా చెయ్యాలి కదా ! చుట్టపక్కాల్లో మాకున్న పేరుకు అనుగుణంగానే చెయ్యాల్సివుంటుంది. పదిహేను ఇరవై వేలు హీనపక్షంగా అయినా అవుతాయి. మాఇళ్ళల్లో కట్నాలు చాలా ఎక్కువగా వుంటాయండి" అని కళ్యాణి మరీ గొప్పగా కోతలు కోయ కుండా దర్జా తగ్గించకుండానే చెప్పింది.

"మరి చెల్లెమ్మగారూ, ఇంతఖర్చు ఎక్కణ్ణుంచి తెస్తారు, శుక్లాగారైతే-"

ఆమాట అవమానకరంగా తోచింది కళ్యాణికి. చేతిలోని ముత్యాలగాజుల్ని తిప్పుతూ "నారు పోసినవాడు నీరు పోయడా ! మా యింట్లో బ్యాంకు లేనంత మాత్రాన ఏమీ చెయ్యలేవా ? భగవదనుగ్రహం వల్ల మా వారి కలం ఇంకా పదునుగానే వుంది. తలచుకుంటే వేల రూపాయలకి లెక్కలే వస్తాయి" అంది. కళ్యాణికి కర్నల్ సతీమణికి దర్జాల గురించి నగానట్రి గురించీ పోటీపడింది. ఆ మాటలు వింటోంటే రజ్జోకు విసుగుపుట్టింది. శకుంతలకు సైగచేసి ఆమెతో కలసి బయటికి వెళ్ళాలని లేచింది. "ఎక్కడికి వెళ్తున్నావు రజ్జో" అంటూ కళ్యాణి అడిగేసింది.

''ఇక్కడికే. తోట ఓసారి చుట్టివస్తాను''

''బయటికి వెళ్ళుతున్నావుగా. తొందరగా వెళ్ళాలని నాన్నగారికి చెప్పు. అలాకాకపోతే నన్ను ఇంటిదగ్గర దిగబెట్టి వెళ్ళమను"

"అప్పుడే అంత తొందరేమిటి, ఇవ్వాళ సినిమాకు వెళదామే."

"సినిమా గినిమాకు నేను వెళ్లను. రేపు పొద్దున్నే వియ్యాలవారికి మిఠాయీలు పానకాలకావిళ్ళు పంపే యేర్పాట్లు చెయ్యాలి. మనం ఇంక తొన్సేపట్లో వెళ్దాం"

కళ్యాణినీ కర్నల్ భార్యనీ మాట్లాడుకోనిమ్మని సజ్జన్ మేడ చూద్దామని బయలుదేరారు శకుంతలా, రాజ్యశ్రీ; అక్కడ వున్న ప్రతి వస్తూవూ అద్భుతంగా కనపడుతోంది రాజ్యశ్రీకి. రాజ్యశ్రీ పెద్దయింటిబిడ్డ. పెద్దతనం అనే

బుడగ అకస్మాత్తుగా దెబ్బ వచ్చేసరికి గాలినింపుకుని లావుకాసాగింది. కొత్త కొత్త కలలు కనే వయసు. శకుంతలకు నిశ్చితార్థం కాగానే ఆమెకేదో వెలితి యేర్పడినట్టయింది. ఆమెలో ఆమెతో పాటు మేల్కొంటూ నిద్రిస్తోన్న నాయిక ఓనాయకుని కోసం తహ తహలాడ్డం మొదలెట్టింది. కన్య పిన్ని సజ్జన్ చిన్నాయన- వాళ్ళిద్దరి వైభవో పేతమైన సామ్రాజ్యంలో తిరుగుతోంటే ఆమెను కూడా ఏవో బంగారు కలలు కట్టివేసినట్లని పించింది రాజ్యశ్రీకి వాళ్ళిద్దరి వ్యక్తిత్వాల్ని కలబోసుకుని ఆమెలోని కల్పనా శక్తి సంతృప్తిపడుతోంది. మంత్రముగ్ధురాలైనట్టుగా అంది- "పిన్నమ్మ ఎంత అదృష్టవంతురాలు. ఇది ఇల్లుకాదు. రాజావారి మహల్లావుంది" అంది.

"నువ్వు కూడా అలాంటి ఇంటాయన్ను చూసుకోవే" అంది శకుంతల.

"నావల్ల అయితే అలాగేతప్పక వెతుకుతాను. నాతడాఖా నీకు తెలియదు" అంటూ కనుబొమ్మలు ఎగరేస్తూ సగర్వంగా అంది రజ్జో మళ్ళీ శకుంతల్ని వెక్కిరిస్తూ "అమ్మకోసం నీ మాదిరిగా మూగనోము పడతానను కున్నావా ఏం! రాజ్యశ్రీ అంటే ఏమను కున్నావు!" అంటూ దగ్గర వున్న నిలువుటద్దంలో తన రూపాన్ని చూసుకుంది అద్దంలో శకుంతల కనిపించేసరికి కళ్ళు పెద్దవిగా జేసి ఆమెను చూడసాగింది.

పిల్లలు గొప్పలు కొడుతోంటే పెద్దవాళ్ళు నవ్వి నిర్లక్ష్యం చూపే మోస్తరుగా శకుంతల చిరునవ్వు నవ్వి కొట్టేసింది రజ్జో కోతల్ని. శకుంతల ప్రవర్తన చూసి ఆమెకు ఛర్రుమంది. వయసులో శకుంతల మూడేళ్ళపెద్ద అయినా ఇద్దరు సమానంగా పిలుసు కుంటారు. గౌరవించు కుంటారు. తివాచీ పరిచి వున్న మెట్ల మీదికి ఎక్కుతూ ఆమె భుజాన్ని పొడుస్తూ "ఎందుకే నా మాటలు విని నవ్వుతావు!" అంది రాజ్యశ్రీ.

"లక్షాధికారి మొగడు కావాలి" అంటూ ఏదైనా పేపర్లో "కావాలెను"లో ప్రకటించు"

"నాకు ప్రకటించ కుండానే మొగడు దొరుకుతాడు. నీకు కావలనివుంటే నువ్వే ప్రకటించుకో"

"నాకు లక్షాధికారి అక్కర్లేదుగా!" అంది శకుంతల.

మెట్ల కింద ఎడమ చేతివైపున ఓ చిన్నగదిలోంచి వనకన్య బయటికి వస్తూ వాళ్ళిద్దరిని చూసింది. ఆశ్చర్యంగా "ఎక్కడికి వెళ్ళుతున్నారు?" అని అడిగింది.

"అబ్బే ఎక్కడికిలేదు. అలా తోటలోకి- "అంటూ నమ్రతగా అంది రాజ్యశ్రీ. వాళ్లవెంట వనకన్య కూడా వచ్చింది.

కింద డ్రాయింగు రూములో సజ్జన్, మహీపాల్, కర్నల్ ముగ్గురూ మాట్లాడు తున్నారు. మహీపాల్ ఇవ్వాళ అంతా జమీందారీ వేషంలో వున్నాడు- ఖరీదైన చెప్పులు, మేలిరకమైన సన్నని ధోవతి, సిల్కు చొక్కా, సిల్కు నెహూర్రి కోట్, ఫేవర్‌లూబా గడియారం షెఫర్స్ ఫౌంటెన్ పెన్, చేతివేలికి పెద్ద రవ్వల వుంగరం. తన ఆదాయం గురించి కర్నల్‌కీ సజ్జన్‌కీ చెప్పక పోతున్నాడు మహీపాల్.

"అయితే మిత్రమా" నీ అదృష్టం ఒక్కసారి మేల్కొందన్న మాట. కాని ఇంత రాయల్టీ ఒక్కసారిగా ఎలా వచ్చిందీ? ఇంతకు ముందెప్పుడూ సాలుకు మూడువేల రూపాయలు రావడం గగనమయ్యేది నీకు" అంటూ కర్నల్ అడిగాడు.

"నా పుస్తకం ఒకటి పంజాబు యూనివర్సిటీలో పాఠ్యపుస్తకంగా పెట్టారోయ్" అంటూ గొప్పగా కళ్ళు ఎగరేస్తూ ఓ సిగరెట్టు దమ్ము పీల్చాడు మహీపాల్.

"మరైతే ఈ ఆనందంలో నువ్వొక పార్టీ బాకీపడ్డావు" అన్నాడు సజ్జన్.

"ఎప్పుడు కావాలంటే అప్పుడే యిస్తాను. రేపు సాయంత్రం కపూర్‌లో-"

"కపూర్‌లో ఎందుకోయ్. ఇంట్లో ఎందుకు చెయ్యకూడదు?"

"ఇంట్లో అయితే షీలాను ఎలా పిలుస్తాడు?" అంటూ షీలా పేరును ప్రసంగంలోకి తెచ్చాడు సజ్జన్ మెల్లగా.

"అక్కడికి కూడా షీలాను పిలవడంలేదు. అక్కడ ఏస్కీ రాగాలని రమ్మన్నాను" అంటూ మహీపాల్ గంభీరుడయ్యాడు. మళ్ళీ ఆ గాంభీర్యాన్ని ఒక విదలింపుతో తోసెయ్యాలని అభినయం చేస్తున్నాడు.

అతని వైఖరిని గమనిస్తున్నాడు సజ్జన్. షీలా పట్ల అతని వైఖరి చాలా కటువుగానూ అన్యాయంగానూ తప్పుడుగానూ కనిపించింది సజ్జన్‌కి. షీలాను కావాలంటే అతను ఒదిలెయ్యొచ్చు. కాని ఇంత కటువుగా వుండాల్సిన పనిలేదు. షీలాను తన మనసులోంచి తుడిచి వేయలేని కారణంగానే అతనంత కటువుగా వున్నాడు. ఈ మొండి ఎన్నో ఘాతుకాలు కూడా చెయ్యొచ్చు. దీనివల్ల మనిషి పరిస్థితుల ప్రభావంగా ఎలాటి పని చెయ్యడానికైనా వెనుకాడడు. ఈ విషయం సజ్జన్‌కి అనుభవం వల్ల తెలిసిందే. కాని షీలా అంటే మహీపాల్ అంత నిర్దాక్షిణ్యంగా ఎందుకున్నట్టు? వాళ్ళిద్దరి సంబంధం నీటి బాహ్యమైనదే. కాని షీలా కూడా చెడ్డది కాదు. ఆమె చాలా మంచి ఆడపడుచు. పాపం ఆమె ఎంత విచారంగా వుందో! షీలాను గూర్చి ఆలోచిస్తోంటే సజ్జన్‌కి జాలి వేసింది. "ఏం, ఎందుకని షీలాను పిలవక పోవడం?" అంటూ సజ్జన్ రెట్టించాడు.

మహీపాల్ మాట్లాడ లేదు.

కర్నల్ గంభీరంగా అన్నాడు- "చూడు సజ్జన్, దీనిలో ఓ గొప్ప చిక్కొచ్చి పడింది. నీకు తెలియదు. నువ్వప్పుడు మధుర వెళ్ళావులే"

"నాకంతా తెలుసు" అని అన్నాడు.

ఆ మాటకు మహీపాల్, కర్నల్ యిద్దరూ సజ్జన్‌వైపు నిర్ఘాంతపోతూ చూశారు. షీలాను సజ్జన్ కలుసుకున్నాడన్న విషయం నిర్ధారణ అయింది.

"ఇద్దరిలో ఎవరో ఒకరు దుఃఖాన్ని దిగమింగుకోవాలి" అంటూ కర్నల్ తీర్పు చెప్పాడు.

"అది నిజమే. కాని షీలాతో ఓ స్నేహితునిగా, ఓ మానవ ప్రాణిగా సంబంధం పెట్టుకోవచ్చుగా!"

"నేను నా ధర్మపత్నికి ఏవిధంగానూ మనఃక్లేశాన్ని పెట్టతలచు కోలేదు" అన్నాడు మహిపాల్.

సజ్జన్‌కు చెడ్డగా అనిపించింది. "నువ్వు సత్యాలదాటున షీలాను నవ్వుల పాలు చెయ్యాలని అనుకుంటున్నావు కదూ ?" అని ప్రశ్నించాడు సజ్జన్.

మహిపాల్‌కి మండింది, సజ్జన్ కూడ అతని కళ్ళల్లోకి చూస్తూ మళ్ళీ అన్నాడు. "నేను ఏకపత్నీ వ్రతాన్ని బలపరుస్తాను. రాబోయే జీవితంలో తప్పటడుగులు వేయకుండా జాగ్రత్తగా వుంటాను. కాని అంతమాత్రాన నా గతించిన జీవితంతో పెనవేసుకున్న కొన్ని బాధ్యతల్ని నేను స్వీకరించక తప్పదు. వాటిని ఎలా కాదనగలను ?"

"అంటే బాధ్యతలు అని పేరు పెట్టి నీ పాతప్రేయసు లందరితో మళ్ళీ సరసాలు ఆడతా వన్నమాట. అపనులన్నీ చేస్తూ ఏకపత్నీ వ్రతుడ్డి అని జండా ప్రతిష్ఠచేస్తావు. అంతేగా ? వివాహం అయిన తరాత నువ్వెంత ఆదర్శ గృహస్థుగా నడుచుకుంటున్నావో నిన్ను పొగుడుతూ ఎవరో రచయితగారు నీ గురించి ఓ వ్యాసం ప్రచురిస్తాడు, జస్ట్‌లైక్ యూ !" అంటూ మహిపాల్ సజ్జన్ ఆదర్శ వాదాన్ని దుమ్మెత్తాడు..

తలుపు వద్ద నిలబడి వనకన్య ఈ మాటల్ని వింటోంది. షీలా మహిపాల్‌కు వున్న సంబంధాన్ని ఆమె గర్హించు కొనేది లోలోపల. ఆమెలో వున్న అర్ధాంగి ఈ సంబంధాన్ని సుతరామూ అంగీకరించడంలేదు. షీలా వ్యక్తిత్వంతో ప్రభావితం అయిన మహిపాల్ తన భార్య అయిన కళ్యాణితో కల వలేకపోతూ ఆ ఇద్దరి ప్రతికూలదాంపత్యాన్ని చూస్తూ, సజ్జన్ పట్టు పట్టడంతో ఆమె ఈ నైతిక బంధాన్ని మౌనంగా ఒప్పుకుంది. పగలు పిలిచిన ప్రకారం షీలా వచ్చింది. ఆమెరాగానే చీటీ చూసుకుని తాను వాళ్ళ మధ్య నుంచి షీలాను తాతగారు బతికుండే రోజుల్లోవుంటోండే సీక్రెట్ రూమ్"లో కూర్చుండబెట్టి సజ్జన్‌కు చెబుదామని వచ్చింది.

రాజశ్రీ, శకుంతలా వెళ్ళిపోయారు. వనకన్య మాత్రం అలానే నిలబడి వింటోంది. మహీపాల్ మాటల ప్రభావం ఆమె సతీత్వం మీద పడుతోంది. నిజానికి తనకూ సజ్జన్ మధ్య మరో స్త్రీ వుండటాన్ని ఆమె సహించకలదా? సతీత్వాన్నే సవాలు చేస్తోన్న ఆ సన్నివేశాన్ని ఎక్కువగా పట్టించుకోక మహీపాల్ మాటల ధోరణి గమనించిన వనకన్య నిజంగా ఇతను షీలాను కలుసుకోవడానికి సమ్మతిస్తారా అన్న సందేహంలో పడింది, షీలాను గురించి ఆలోచించిన కొద్దీ ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. బయటి వైపు తలుపు తోసుకుంటూ స్వామిదయాళ్ అనే వాళ్ళ నౌకరు అంతలో అక్కడికి వచ్చాడు. తాను దొంగతనంగా అక్కడ నిలబడి వింటోన్న విషయం ఎక్కడ గమనిస్తారో అని ఆమె త్వరత్వరగా లోపలికి వెళ్ళింది. కన్యను చూడగానే త్రిమూర్తులు ఆ సంభాషణను అంతటితో ముగించారు. "బిన్నో నువ్వొచ్చావా?" అంటూ కర్నల్ పరామర్శించాడు కన్యను,

"ఏం కావాలి అన్నగారు?" అని అడిగింది కన్య

"ఏమీలేదు మిఠాయి కొద్దిగా ఇక్కడికి పంపించు. టీపి నోటికి తగలని కారణంగా శుక్లాగారు రెచ్చిపోతున్నారు."

కర్నల్ ఛలోక్తికి కన్య చిరునవ్వు నవ్వి శుక్లాగారి వాదాన్ని సమర్థిస్తు నట్టుగా అంది-" ఇవ్వాళ హోలీ మీరంతా కలిసి జరుపుకుంటున్నారు. ఒక్క శుక్లాగారే ఏం పాపంచేసారని వారిని ఆడిపోసికుంటారు?"

సజ్జన్ మత్తిల్లిన కళ్ళను కన్య వైపు తిప్పి "నీ భయంవల్లనేను తాగనంటే తాగనన్నాను. కాని ఈ మహీపాల్ బలవంతంగా తాగించాడు."

"సరేలెండి. కాస్త బయటికి రాండి. మీతో కొంచెం పనుంది"

షీలా వచ్చిందని కన్య తెలపగానే సజ్జన్ ముఖం గంభీరమైంది. కన్యే చొరవ తీసుకుంటూ సజ్జన్‌ని మందలిస్తూ మధురంగా అంది-" ఇవ్వాళ్టి రోజు మీరు డాక్టర్ని పిలవకుండా వుండాల్సింది. ఒక్కోసారి మీరు అనాలో చితంగా...."

"నేనిప్పుడే మహీపాల్ని తీసుకొస్తాను. షీలాను చూశాడంటే ఆతనిలోని కర్కశత్వం ఒక్కసారి కరిగిపోతుంది" అంటూ సజ్జన్ మళ్ళీ గదిలోకి వెళ్ళాడు. కన్య తిరిగి వచ్చేసింది. సజ్జన్‌తో కలిసి షీలాకూ మహీపాల్‌కూ రాయబారాలు చేయడం ఆమెకు ఇష్టంలేదు.

మహీపాల్‌ని వెంటబెట్టుకుని సజ్జన్ మెట్ల గదిలోకొచ్చాడు. ఆ గదిలోంచి అలమారి ఆకారంలో వున్న ఓ రహస్యద్వారం గుండా తాతగారి రహస్య మందిరానికి తీసుకెళ్ళాడు. మహీపాల్‌ని గుమ్మం దగ్గర వదిలేసి సజ్జన్ తిరుగు ముఖంపట్టాడు.

షీలా కుర్చీలో కూర్చుంది. మహీపాల్‌ని చూడగానే నీరసంగా నవ్వుతూ నిలబడింది. ఆమెను అక్కడ చూసేసరికి మహీపాల్ ముఖం పాలిపోయి నట్టయింది.

"హోలీ శుభాకాంక్షలు" అంది డాక్టర్ షీలా.

మహీపాల్‌లోని బింకం సడలిపోతూంది. ఏమి మాట్లాడాలి అని వెతుక్కో సాగాడు. వెర్రిగా నవ్వుతూ, ''అయితే మనం ఇక్కడ కలుసు కుంటున్నామన్న మాట'' అని వ్యాఖ్యానం చేశాడు.

షీలా చిరునవ్వు నవ్వుతూ కళ్ళను కిందకి దించింది. "మనం కలుసుకో డానికి దీనికింద మరో పాతాళ గృహం వుంటే ఎంత బావుండేది" అంటూ వెటకారంగా ఓ వ్యంగ్యబాణాన్ని వదిలాడు షీలా మీదకు.

షీలాకు అర్థంకాక స్తబ్ధురాలై మహీపాల్‌ని చూస్తోంది. మహీపాల్ మళ్ళీ ప్రారంభించాడు- ''ఇక్కడ కూడా ఎవరైనా మనల్ని చూడొచ్చు. దొంగతనం చెయ్యడానికి ఇంతకన్నా పాతాళగుహలోకి పోతే బాగుంటుంది".

"నీతో ఇన్ని రోజుల్నుంచి వియోగాన్ని- "అంటూ షీలా ఆగిపోయింది.

మహీపాల్ కంఠంలో తీవ్రతను నింపుతూ ''నాకు దొంగతనం అంటే సరిపడదు షీలా. నిన్ను కలుసుకోవాలని వుంటే నీ ఇంట్లోనే మునుపటి

మో స్తరుగా కలుసు కుంటాను కాని ఈ తెరచాటు బాగోతాలు నాకు నచ్చవు" అని అనేసాడు.

"నేనెప్పుడూ నిన్ను వారించలేదే!"

"అది నిజమే, కాని ఇప్పుడు నా పరిస్థితే వేరు. నేనొస్తాను"

"నేనో మాట అడుగుతాను. నిజం చెపుతావా? నీవు నన్ను సంపూర్ణంగా మరచి పోయావా లేక నీఅంతట నువ్వే-"

మహిపాల్ గొంతులో పచ్చివెలక్కాయ అడ్డంపడినట్టయింది. తలదించు కున్నాడు. ఓక్షణం తర్వాత తేరుకుంటూ తీక్షణమైన స్వరంతో "ఇప్పుడా మాటలన్నీ నేను ఆలోచించే స్థితిలోలేను" అని అన్నాడు.

"నువ్వు నను సులభంగా మరచి పోగల చిట్కా నాకు కూడా చెప్పగలవా"?

మహిపాల్ వెళ్ళి పోబోతోంటే అతని భుజాన్ని చేత్తో పట్టుకుంటూ షీలా "నువ్వు సంసార బాధ్యతల వల్ల నన్ను పరిత్యజిస్తున్నావు. దాన్ని నేను అర్థం చేసుకో గలను. కళ్యాణి అంటే నాకెంత గౌరవభావం వుందో నీకు బాగా తెలుసు. నీ కాపురంలో నిప్పులు పోయాలని కానీ నిన్ను నవ్వులపాలు చెయ్యటంలో కానీ నాకు ఆనందం లేదు" అంది.

మహిపాల్ కొంచెం మెత్తపడ్డాడు. అయినా ఆమె వైపు తిరగకుండానే ''అన్నీ తెలిసికూడా మరి నువ్వెందుకు వచ్చినట్టు?" అని అడిగాడు.

''నిన్ను చూడాలన్న ఆశతో. ఓ క్షణం ఇలా కూర్చో"

ఆమె భుజాన్ని ఆనుకుంటూ మహిపాల్ లోపలికి వచ్చాడు. ఇద్దరూ కుర్చీల్లో ఎదురుగా కూర్చున్నారు. గుండ్రని ఆర్చీలూ స్తంభాలూ వున్న ఆ నలచదరం గది చీకటికీ ఒంటరితనానికీ ఆటపట్టు. గోడకు తగిలించిన రెండు దీప స్తంభాలు మినహా బయటి ప్రపంచంతో పూర్తిగా ఆ గది తెగిపోయి నట్టుగా వుంది. గది కొద్దిగా చెమ్మగా కూడా వుంది. గోడకు పూసిన గవ్వరంగు వార్నిష్ పైన అక్కడక్కడ మరకలు కనపడుతున్నాయి. వాళ్ళు కూర్చున్న వైపుకు ఎడంగా లావుపాటి ఇనుప చువ్వలతో కట్టిన ఓ బోనుంది. దాన్లో పాత

కాలం నాటి రెండు కావడిపెట్టెలు, రెండు గా|డేజి బీరువాలూ వున్నాయి. కోసుకు ఏదో విదేశీ కంపెనీ తయారు చేసిన తాళం వేసివుంది. షీలా దృష్టిని తప్పించుకుంటూ మహీపాల్ అటు ఇటూ దొంగచూపులు చూస్తున్నాడు. ఎవరి సాంగత్యంలో వుంటూ అతను యింతకాలం ఆనందదాయకంగా గడిపాడో వాళ్ళతోనే ఇప్పుడు కూర్చున్న కొద్దిసేపటిలోనే అతనేదో వూపిరాడక బాధపడు తున్నట్టుగా కనపడుతున్నాడు. షీలాతో సంబంధం అతని జీవితంలో చేసిన దొంగతనంలాంటిది. తానే ఆపని చేసానని చెప్పుకోవడానికి ఇప్పుడు సిగ్గు పడుతున్నాడు.

"ఇప్పుడు మనం పెద్దవాళ్ళమైపోతున్నాం మహీపాల్. నాకిపుడు ముప్పై ఎనిమిదేళ్ళు. జూన్‌కి ఒకటి తక్కువ నలభై వస్తుంది".

మహీపాల్ ఆమె వైపు చూడలేదు. ఆమె మాటలకు జవాబు చెప్పలేదు. షీలాయే మహీపాల్‌ని కదిలిస్తూ అంది - "మన జీవితం కట్టుకున్న ఇంటిలా తయారైంది. ఆ యింట్లో కాపురం కూడా పెట్టాం. ఇది నువ్వాలోచించాలి. ఇటిక్కి ఇటుక జోడించి రాయి తగిలించి సిమెంటు పూసాం. అవి అతుక్కు పోయాయి. ఇపుడు వాటిని విరగ్గొట్టాలని చూస్తున్నావ్. వర్ధించిన విస్తరిని చెల్లాచెదరు చెయ్యడం నీకు భావ్యం కాదు".

మహీపాల్ తలవంచుకున్నాడు. షీలాయే మళ్ళీ అందుకుంది- "ఇది పాపమే అనుకో. మరి యింతకాలంగా మనం చేస్తున్న ఈ పాపం పుణ్యంగా మారలేదంటావా? నువ్వే చెప్పు. నువ్వు మాట్లాడ్డమే లేదు."

మహీపాల్ బెల్లం కొట్టిన రాయిలా కూర్చున్నాడు. అతని ముఖం ఎలాంటి భావం లేకుండా శూన్యంగా బోసిగా వుంది. ఓ క్షణం మాట్లాడం మానేసి షీలా అతణ్ణి చూస్తూ వుండి పోయింది. మహీపాల్‌ని మాటలదారంలో గుచ్చాలని ఆమె ఆరాటపడుతోన్నా ఆమెకు మాటలే దొరకడంలేదు. ఆమె భావాలన్నీ మూగపోతున్నాయి. మూగపోయిన తనభావాలకు తన ప్రియుడు గళం ఇస్తాడేమో అని ఆమె ఆశించింది. కాని అలా జరుగలేదు. దరిద్రుని

యింట మిలమిలమంటోన్న దీపంలావున్నాయి, ఆమె కళ్ళు. మహీపాల్ అలాగే తొణక్కుండా కూర్చున్నాడు.

లోపలినుంచి వచ్చే ఓ వేడి నిట్టూర్పును మధ్యలోనే అణచుకుంటూ షీలాయే బలవంతంగా చిరునవ్వు తెచ్చుకుని మళ్ళీ ప్రారంభించింది-"ఇటువంటి ప్రణయాలు ప్రతి రచయితతో పాటు అవి కూడా చరిత్రపుటల్లోకి ఎక్కాయి. చరిత్రలో నువ్వొక్కడివే కాదుగా అపఖ్యాతిపాలయ్యేది"

మహీపాల్ ఏమీ మాట్లాడకుండా లేచి వెళ్ళిపోయాడు. షీలా అతణ్ణి చూస్తూ కూర్చుంది.

మహీపాల్ బయటికి రాగానే కళ్యాణి, కర్నల్‌గారి భార్య, వనకన్య ఠాకుర్ ద్వారా వైపుగా వెళ్ళుతున్నట్టు కనిపించారు. రివ్వున తిరిగి వచ్చి "నువ్వు బయటికిరాకు" అని షీలాకు చెప్పాడు.

మనస్సంతా పారవశ్యమైన షీలాకు ఆ మాటలు బోధపడలేదు. మహీపాల్ ఓ కాలు బయటా, ఇంకో కాలు లోపలా పెట్టి గుమ్మంలో నిలబడ్డాడు. అతని గొంతు వినగానే షీలా కుర్చీలోంచి లేచి అతనికి దగ్గరగా వచ్చింది. ఎక్కడ చూస్తారోనన్న భయంతో గుమ్మం వైపుగా వస్తోన్న షీలాతో మహీపాల్ కళ్ళు కపలపకుండా వుండలేక పోయాడు. ఇద్దరి కళ్ళూ కలిసాయి. షీలా కనుపాపలు వద్దువద్దని వారిస్తున్న మహీపాల్ చూపుల్ని మంత్రించికట్టి వేస్తున్నాయి. అతనికి పూర్తిగా దగ్గరగా వచ్చేసింది షీలా కన్నార్పకుండా. మహీపాల్‌ని చూడసాగింది. ఆమె కళ్ళల్లో ఏదో భావం, ఆగది అంతా ఆగదిలోని ప్రతి వస్తువుపై సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించినట్టుగా కనిపించింది. షీలా అంతర్యంలోని భావం ఆమె కళ్ళనే ఎత్తైన కిటికీ మీద కూర్చుని చక్రవర్తిలా ఓ విశాలమైన సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నట్టుగా వుంది. ఆమె ఏకచ్ఛత్రాధిపతి. మహీపాల్ దాసోహం చేసి చేతులు కట్టుకొని బందీలా నిల్చున్నాడు. చూపుల్లో తీరని దాహం, నిండని ఆకలితో ఆమె అతణ్ణి చూస్తోంటే నాటిల్లో మహీపాల్‌కి తన ఆత్మవిశ్వాసం దొరికినట్టయింది. కాని దానినుంచే అతను దూరం కావాలని మొండి చేస్తున్నాడు.

షీలా మరింత దగ్గరకు వచ్చేసింది. మహీపాల్‌లోని మొండి గ్రహం నిస్సహాయుడై చూస్తున్నాడు. షీలాకు తనపై పట్టుతప్పింది. మహీపాల్ నిస్సహాయత పెరిగి పోతోంది.

మహీపాల్లో వున్న సౌందర్యారాధకుడైన రచయిత ఇంతవరకు తన్మయత్వం అనే ఆ పరమసుందర రూపాన్ని సందర్శించలేదు. షీలా కనుపాపల్లో యోగముద్ర వేసుకున్న అతని ప్రేమ అతనిమీద పదేపదే సవాలు విసురుతోంది- పారవశ్యమనే ఈ సముద్రాన్ని నువ్వు దాటగలవా? నువ్వు దీనిలో మునిగి పోవడం తథ్యం అన్నట్టుగా.

షీలా మహీపాల్‌కి ఎదురుగా అతనికి అతుక్కుని నిలబడింది. ఆ వాతావరణంలో నిస్తబ్దత వారిద్దరు వదులుతోన్న వూపిరితోనే అప్పుడప్పుడు భగ్నం అవుతోంది. ఆ వేడి ఉచ్ఛ్వాసనిశ్వాసాల్లో ఏవో యుద్ధవాయిద్యాలు రణగొణధ్వని చేస్తున్నట్టనిపించాయి. షీలా చేతులు స్వయంవరంలోని పూలదండలా అతని మెడను చుట్టుతూ బిగుతు అవుతున్నాయి. గుమ్మం బయట వుంచిన కాలు లోపలికి వచ్చేసింది, స్ప్రింగ్ అమర్చిన తలుపు అమాంతంగా మూసుకు పోయింది.

మహీపాల్ కల చెదిరిపోయింది. మత్తు వీడిపోగానే ఈ ప్రపంచంలోకి వచ్చాడు. ఈ ప్రపంచంలోకి రాగానే కర్నల్ గారి అర్ధాంగీ, కన్యా, ఆమెతో ఠాకుర్ ద్వారా పైపుకు వెళుతున్న తన భార్య కళ్యాణి జ్ఞాపకం వచ్చారు. ఈ సంఘం, శకుంతల పెళ్ళి, చుట్టపక్కాలూ, తనహోదా, పరువూ ప్రతిష్ఠా, తాను చేసిన దొంగతనం, దొంగతనంగా షీలాతో జరుపుతోన్న ప్రేమాయణం అన్నీ జ్ఞాపకం వచ్చాయి. మహీపాల్ మేల్కొన్నాడు. బుద్ధితెచ్చు కున్నాడు. ముఖాన్ని పక్కకు తిప్పి షీలా బాహువుల్లోంచి తన్ను విడిపించు కోవడానికి ప్రయత్నిస్తూ "జరిగిపోయినదాన్ని మరిచిపో షీలా, హృదయాన్ని రాయి చేసుకొని మరిచిపో. మనం ఇంత సన్నిహితులంకాకపోతే కనీసం స్నేహితులంగానైనా వుండగలిగేవాళ్ళం. ఇప్పుడది కూడా కుదరదు" అన్నాడు.

శీలా బాగా అలిసిపోయింది. మహిపాల్ మాటలు ఆమె చెవులకు ఎక్కడం లేదు. మహిపాల్ ఆమె చేతుల్ని తీసి రాజన్నా ఆమె అతన్ని స్పృశించడం మానలేదు. దొంగతనంగా ఆమెను చూడాలని మహిపాలు అటు వైపు తిరిగాడు. శీలా తల అతని వక్షాన్ని ఆనుకుని వుంది. ఆమె పావిటలోని రెండు మెరుస్తోన్న తెల్ల వెంట్రుకలు కనిపించాయి. వాటిమీద తన వాస్కట్ జేబులోని షేఫర్స్ ఫౌంటెన్ పెన్ను క్యాప్ మెరుస్తోంది. శీలా పావిటి మీద తన పెన్ను కేప్ తళతళమంటోంటే మహిపాల్ మనస్సు విచిత్రంగా జుంద రించింది. ఈరెండు తళతళలూ అతనివే అన్న ఆలోచనతో అతను గర్వంతో పొంగిపోయాడు. ప్రేమించిన స్త్రీ కోసం పడిగాపులు కాస్తూ, కలలుకంటూ, ఎంతోమంది రాత్రింబవళ్ళు ఆమె కోసం తహతహలాడుతుంటారు. కాని తను ? తనముందు నగరంలో పేరు ప్రఖ్యాతులూ, ఉద్యోగం సర్వా అన్ని హంగులూ వున్న డాక్టరు తన సర్వస్వాన్ని సమర్పించుకుంటోంది. ఇంతవైభవాన్ని అదృష్టాన్ని కాళ్ళముందు తెచ్చుకోగలిగిన మహిపాల్ ఎంత అదృష్ట జాతకుడో! అతనికి ఇప్పుడు అన్ని హంగులూ అమరుతున్నాయి. బ్యాంకి అకౌంటూ, సిల్కు చొక్కా. సిల్కు జవాహర్ జాకెట్టు, షేఫర్స్ ఫౌంటెన్ పెన్నూ.... ఇంకా....ఇంకా : అతని వైభవం అంతా దొం[illegible] అతని దొంగ తనం బయటపడిందంటే అతని సమస్త ప్రతిష్ఠా [illegible] అన్నీ మంటకలిసి పోతాయి. మహిపాల్ సంఘానికి ముఖాన్ని కూడా చూపించలేడు. శీలాతో అతని బాదరాయణ సంబంధం అందరికీ తెలిసిపోయింది. శీలా ధనవంతురాలు తనవైభవం, తన దర్జా అంతా శీలా నుంచి పొంది తెచ్చుకున్నదే అని ప్రపంచం గనుక అనుమానిస్తే [illegible] పరిస్థితి [illegible] అతనిలో అకస్మాత్తుగా లేచిన ఈ ఆలోచన మహిపాల్ లో కలిగిన పులకరింతను తన ఇనుపాదాలతో అణచివేసింది. మహిపాల్ ఏమీ చెయ్యలేక నిస్సహాయుడైనట్లు భావించాడు. అతనిలో సంచలనం వచ్చింది. ఒక్కసారి కదుపుకట్టి పోయాడు. "ఇక నన్నెప్పుడూ కలుసుకోవడానికి ప్రయత్నించకు" అంటూ ఆమె నుంచి విడిపోయిన మహిపాల్ బయటికి వెళ్ళుతూ" బయట కళ్యాణీ చాఖ్యా వున్నారు. కొంచెం చూసిరా" ఆజ్ఞాపిస్తోన్న ధోరణిలో బయటబడ్డాడు.

కర్నల్, సజ్జన్ ఏదో విషయం గురించి నవ్వుకుంటున్నారు. అకస్మాత్తుగా మహీపాల్ రంగప్రవేశం చేసేసరికి స్తబ్ధులై పోయారు.

ఠాకూర్‌ద్వారా వెనకటి అంతఃపురం మొదలైనవి చూసి ముగ్గురూ తిరిగి వస్తున్న సమయంలో పనిమనిషి జానకి శీలా యిచ్చిన సందేశాన్ని తెచ్చింది కన్య దగ్గరికి. అక్కడుంచే సరాసరి యింటికి వెళ్ళి పోదామనుకుంది కళ్యాణి. కాని కన్య ఒళ్ళో ఆమె బిడ్డ నిద్దరపోతోంది. జానకిని దూరంగా పిలిచి "మేం బయటికి వెళ్ళిపోగానే ఆమెను నా గదిలో తీసుకెళ్ళి కూర్చుండపెట్టు. మిసెస్ శుక్లాగారిని కార్లో కూర్చోబెట్టి ఇప్పుడే వస్తాను" అంది కన్య.

"శకుంతల పెళ్ళి మా ఇంట్లో జరిపితే బావుంటుందని" ప్రస్తావన చేసింది కన్య. ఆ విషయం గురించే కళ్యాణి కర్నల్ భార్యతో సంప్రతిస్తోంది. మనవాళ్ళ ఇళ్ళల్లోనే వీలున్నప్పుడు బయట ఎందుకు వెతుక్కోవాలి? కళ్యాణికి వనకన్య ప్రస్తావనచ్చింది, తన ఇల్లు చిన్నది. ఎలాగైనా పెళ్ళి చేసే ఇంట్లో చెయ్యాల్సిందే కదా; కర్నల్ ఇంట్లో పెళ్ళిచేద్దాం అని మహీపాల్ సలహా యిచ్చారు. ఇంచుమించు నిశ్చయం కూడా అయింది. కాని బంగళాలో పెళ్ళి చెయ్యాలన్న యోచన ఇంకా బాగావున్నట్టు కనిపించింది కళ్యాణికి. బంగళావున్న మరదలి మీద పెత్తనం చలాయిస్తున్నట్టు కన్పడుతుంది. వియ్యాలవారు యిక్కడికి వచ్చి ముగ్ధులైపోతారు. ఇవన్నీ కళ్యాణి వూహించుకొంటోంది. మనస్సులో. "ఎవరో ఒకరు అక్కడ వుండాలి. ఇక్కడే పెళ్ళి చేస్తే ఆ బాధలేవీ వుండవు. ఆయనగారిని సంప్రతించి చూస్తాను" అని అంది, కర్నల్ భార్య.

"తప్పకుండా సంప్రతించండి. మిగతా విషయాలు నేను మావారితో చెపుతాను శకుంతల మీద మీ ఒక్కరికేకాదు అక్కగారూ, మాకు కూడా హక్కువుంది." అని వనకన్య ఆప్యాయంగా అంది.

ఆ మాటలకు కళ్యాణి పులకరించిపోయింది. పరమానంద భరితురాలై "తప్పక చెల్లెమ్మ గారూ, ఆమె మీద హక్కు ముందు మీదే. తర్వాతనే మాది. స్నేహితుల్లో ఆ భేదాలు వుంటాయా? మావారు అప్పుడప్పుడు

అంటూ వుంటారు. స్వయాన అన్నలైతే నాకు ఎవరూ లేరు. కాని కర్నల్, సజ్జన్ నాకు అంతకన్నా మించి అండగా వుంటారు" అని.

కర్తకోసం పోర్టికోలో ఎదురుచూస్తూ నిలబడింది కళ్యాణి.

# 42

డాక్టర్ షీలా, పీద కన్య గదిలోకి పోకుండా కళ్యాణి ఎప్పుడు వెళ్ళుతుందా అని లాబీలోనే పచార్లు చేస్తూవుంది. కర్నల్ భార్యతో తిరిగివస్తూ ఓ మూలనున్న శిల్పాన్ని చూస్తూ నిలబడివున్న షీలాను చూసింది కన్య. ఒకవైపు కళ్యాణితోనూ మరోవైపు షీలాతోనూ ద్విపాత్రాభినయం చేస్తోన్న మహిపాల్‌ని చూసి ఆమె ఎటూ తేల్చుకోలేక ఆందోళన పడింది. ఇదంతా ఒక గొప్పబూటకమని ఆమె అనుకుంది. కళ్యాణి ముందు దబ్బును దాచినట్టుగా షీలాను దాచి వుంచడం ఆమెకు నచ్చలేదు. మనసు ఒప్పలేదు. ఈవిధంగా తెరలాగడం తెరదించడంలోని నీతిబాహ్యతను ఆమె గుర్తించింది. అయినా షీలా మీద వున్న అభిమానం కారణంగా ఆరకంగా సూత్రధారుని పాత్రధరించక తప్పలేదు. తన ఇంట్లో కూడ ఆమె ఇటువంటి అవినీతిని చూచింది. వాటి నీచత్వాన్ని చూసి ఏవగించుకునేది. కాని ఈ సందర్భంలో అలా ఏవగించుకోలేక పోతుంది. కారణం? అదే ఆమెకు స్పష్టంగా కనబడడంలేదు. ఉన్న ఆలోచనలతో పాటు దాన్ని గూడ మెడకు తగిలించుకుని తిరగడం వల్ల ఆమె మనస్సు చీకాకుపడింది.

"హల్లో డాక్టర్!" అంటూ వనకన్య ఏమీ ఎరగనట్లు పలకరించింది.

షీలా ముఖం తిప్పి చూసింది. కర్నల్‌గారి భార్య కూడా అటువైపు చూసి అనుకోని విధంగా షీలా అక్కడ వుడండడం పట్ల ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ "అరె, డాక్టర్‌గారూ, ఎప్పుడిలా దయచేసారు" అంటూ ఆమె కూడా పలకరించింది.

"ఇప్పుడే కొంచెం సేపయింది" అంటూ కళావిహీనమైన ముఖం మీద బలవంతాన చిరునవ్వు తెచ్చుకుంటూ షీలా సమాధానం చెప్పింది.

"మిమ్మల్ని చూడగానే నాకెందుకో మహా సరదాగా వుంటుందండీ" అని అంటూ కన్యవైపు తిరిగి కర్నల్ భార్య- "ఇటువంటి స్వభావం గల వ్యక్తుల్ని బహుకొద్ది మందిని చూసివుంటాను కన్యా" అని అంది. అంతలోకే మళ్ళీ షీలానూ చూస్తూ "మీరు చాల రోజులయింది మా ఇంటికి వచ్చి. మా యింట్లో [1]టికడా మాండియా అంటే వారికి ఎంతఇష్టమో చెప్పలేను" అని అంది.

షీలా ముఖకవళికను పరిశీలించిన కన్య ఏదో అనుకోని దుస్సంఘటన జరిగి వుండొచ్చునని గ్రహించింది. రహస్యాన్ని దాటబెట్టుదామన్న వుత్సాహంతో ఒదినగారి మాటలకు సమాధానం ఇస్తూ "అయితే ఓరోజు మమల్ని విందుకు పిలిచి రుచిచూపిస్తారు కదూ "డాక్టరుగారి పేరుతో హాయిగా విందారగిస్తాను" అని వనకన్య అంది.

ఆ చమత్కారానికి కళ్లను ఆడిస్తూ కర్నల్ భార్య "చూసారా డాక్టర్, ఆడబిడ్డలంటే అలా వుండాలి. ప్రతిదాంట్లోనూ వాటాకావాలని సత్యాగ్రహం చేస్తారు" అని మరో చమత్కారాన్ని విసిరింది.

మర్యాద సూచకంగా డాక్టర్ షీలా ఓ పొడివవ్వు నవ్వి పూరు[illegible]ంది. ఆమె వాలకాన్ని చూస్తోంటే యీ నాటకాన్ని ఇంక ముగిస్తే మంచి[illegible] ంచింది. ఆమెనూ, కర్నల్ భార్యనూ ఉద్దేశిస్తూ "రండి పైకి [illegible]" [illegible] అంది వనకన్య.

అంతలో కర్నల్ భార్య అమాంతంగా ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు [illegible] ఎగరేసి షీలాను అర్థపూరిత దృష్టితో ఓసారి చూసి "నేను వంటింట్లోకి వెళతాను. పావు తక్కువ ఎనిమిది కావస్తోంది. ప్లేట్లు పరిచే యేర్పాటు చేయించి వస్తాను" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

"అవును ఒదినగారూ. అలా చేస్తే బావుంటుంది" అంటూ తన బరువు తగ్గినట్లు భావించింది కన్య. ఒదినగారి సమయస్ఫూర్తికి కన్య లోలోన మెచ్చుకుంది. ఆమె నిష్క్రమించిన తర్వాత- "డ్రాయింగ్ రూమ్‌లోకి రావడానికి మీకేమైనా అభ్యంతరమా?" అంటూ కన్య షీలాను అడిగింది.

---

(1) పిడకలు కానీ బొగ్గుల కుంపటి మీద కానీ వేడికి కాల్చిన పుల్కాలాంటిరొట్టె.

"లేదు, నేను వెళతాను".

"ఉండండి. సజ్జన్‌ని ఇప్పుడే పిలుచుకుని వస్తాను. అప్పటిదాకా ఆఫీస్ రూమ్‌లో కూర్చోండి".

షీలాను కలుసుకొని వచ్చిన తర్వాత మహీపాల్ పూర్తిగా కలవర పడ్డాడు. అతనిలో వున్న సహజత్వం నశించింది. షీలాను కలుసుకోవ డానికి మహీపాల్ వెళ్ళిన అనంతరం వాళ్ళిద్దరి గురించి సజ్జన్‌కి కర్నల్‌కి మధ్య ఓ చిన్న వాగ్యుద్ధం జరిగింది. సిద్ధాంతాపరమైనా షీలా విషయంలో మహీపాల్ కొంచెం ఉదారంగా వ్యవహరించాలని సజ్జన్ వాదన. కర్నల్ తన వాదనలో ఎక్కువ మొండి వైఖరి అవలంబించని కారణంగా ఆ యుద్ధం అంతటితోనే ఆగిపోయింది. కాని షీలాని కలుసుకొని మహీపాల్ తిరిగి వాళ్ళ దగ్గిరకు వచ్చిన తర్వాత సజ్జన్ ఆమె గురించి మహీపాల్‌ని ప్రశ్నించటంతో మహీపాల్ గంగ వెర్రిలెత్తిపోయి "ఆ పడవలో ఓ కాలూ ఈ పడవలో ఓ కాలూ పెట్టి ప్రయాణం చేసే అలవాటు నాకులేదు. అజ్ఞానుజ్ఞయి యిన్నాళ్ళ నుంచి ఈ రెండు పాత్రల్ని పోషిస్తూ వచ్చాను. ఈ అంతః సంఘర్షణను నేనింకా ఎదుర్కోలేను" అంటూ కసిరాడు.

అయితే అన్ని మాటలు మాట్లాడినా షీలా మీద తనకు ప్రేమ లేదని ఒక్క మాటా అనలేదు. నిజమే, కాని తానిప్పుడు ఓ మహత్తర సిద్ధాంతం కోసం పరిత్యజిస్తున్నాడు. కుటుంబం అనేది వ్యక్తిగత ప్రేమ కన్న అతీతమైనది. పెళ్ళి చేసుకుని ఏర్పరుచుకున్న కుటుంబం సంఘాన్ని ఓ క్రమబద్ధంగా వుంచడానికి నడిపించడానికి పనికి వచ్చే ఒక శక్తివంతమైన సాంప్రదాయం. వ్యక్తిగత ప్రేమే రాజ్యం చేయడం మొదలెట్టిననాడు సంఘం బీటలు వారి పోతుంది. కుటుంబం అనే భావనే రూపుమాసి పోతుంది. ఈ తర్కబాణాల్ని ఒకదాని తర్వాత ఒకటి వదులుతూ మహీపాల్ సజ్జన్ నోరు కట్టివేశాడు.

మహీపాల్ వాదనల మహాసముద్రాన్ని దాటలేక సజ్జన్ మౌనం అయితే వహించాడేకాని దానిమూలాన మహీపాల్ పట్ల అతనిలో అసంతృప్తి, క్రోధం

హెచ్చాయి. మహిపాల్‌కి వ్యతిరేకంగా ఏమేమి అనాలా అని ఆలోచిస్తున్నాడు సజ్జన్.

మహిపాల్ సజ్జన్ అహంకారానికి ఎప్పుడూ ఓసవాలుగా నిలుస్తున్నాడు. తనకున్న జ్ఞానసంపత్తి, తర్కాల సహాయంతో సజ్జన్‌ని ఎప్పుడూ తగ్గించాలని చూస్తుంటాడు మహీపాల్. అతని వాగ్ధాటి ముందు తల ఒంచుతాడు కాని అతను చెప్పే చాలా మాటలు గొప్ప గొప్ప విషయాలు అతనిలో వున్నలోట్లను కప్పి పుచ్చుకోవడానికే వుపయోగపడతాయి కాని ఆచరణలో పెట్టడానికి యే మాత్రం వుపకరించవని సజ్జన్ బాగా ఎరుగును.

సజ్జన్ అంటే అదే తలనొప్పి మహిపాల్‌కి. మాటల్లో వేడి వచ్చిన తర్వాత చాలా సేపు భయంకరంగా నిశ్శబ్దత ఆవరించింది. హోలీ సాయంత్రం పూట ముగ్గురు మిత్రుల కుటుంబాల్ని ఆనందదాయకంగా కలపాలన్న పవిత్ర వుద్దేశ్యంతో సజ్జన్ ఇంట యేర్పాటు అయిన ఈ విందు షీలా రాకవల్ల దెబ్బ తింది. ప్రసంగాన్ని మారుద్దామని కర్నల్ ప్రయత్నిస్తుండగానే కన్య అక్కడి కొచ్చింది. "ఏం బిన్నో, భోజనాలు ఎప్పుడు వడ్డిస్తావేమిటి" అని వాతావరణం ణంలోని బరువును తేలిక చేద్దామన్న వుద్దేశ్యంతో కర్నల్ ప్రశ్నించాడు.

"ఇదిగో అన్నయ్యగారూ, అయిపోయింది. ఒకినగారు ప్లేట్లుసర్దిస్తున్నారు. అంటూ సజ్జన్‌వైపు చూసి "ఓ నిమిషం ఇలా వస్తారూ!" అని అంది కన్య.

షీలాను కారుదాకా సాగనంపే నిమిత్తం సజ్జన్. కన్యా బయటికి వచ్చారు. "నిన్ను ఇవ్వాళ పిలిచి పొరపాటు చేశాను, మహిపాల్ ఇలా చేస్తాడని వుహించ లేక పోయాను" అంటూ సజ్జన్ క్షమాపణ చెప్పుకునే ధోరణిలో అన్నాడు.

షీలా ఏమీ మాట్లాడలేదు ఏ వికారమూలేని ఆమె ముఖం రాయిలా మొద్దుబారి వుంది. "నేను గుల్‌మహమ్మద్‌ని పిలుస్తా నుండిండి. ఇంటిదాక దిగ బెట్టి వస్తాడు" అని సజ్జన్‌తో అంది వనకన్య.

"అక్కర్లేదు నేను వెళ్ళిపోతాను. మీకెందుకు శ్రమ'' అని అంటోంటే "అలా కాదు. కన్యా నువ్వు గుల్‌మహమ్మదును పిలువు. డాక్టర్‌గార్ని ఇంటి దగ్గర దిగబెట్టి అలా ఇంటికి వెళ్ళిపోతాడు తిన్నగా" అంటూ సజ్జన్ చెప్పాడు.

కన్య వసారా వైపు వెళ్ళింది. కారు దగ్గర సజ్జన్ షీలా నిలబడ్డారు. పున్నమి వెన్నెల్లో తోటలోని చెట్లు, పొదరిళ్ళు, పచ్చ పచ్చగా వుండే లానులూ తెలవి రంగు వస్త్రాన్ని కట్టుకొని మౌనానికి ప్రతీకలుగా నిలబడి ఆకర్షణీయంగా వున్నాయి. వెన్నెలకు భయపడి రాత్రి అంతా ఈ గుబుర్లలో తల దాచుకుందామని వచ్చి ముడుచుకున్నట్లుగావుంది. కుడిపక్కగా లానుకు అవతలి మూలలో మల్లెతీగ విరబోసిన పూలతో సింగారం చేసుకొంటోంది. మాటలు చేతకాని సజ్జన్ కళ్ళు ఏ మాటలతో ప్రారంభిద్దామా అంటూ తోటంతా వెతికి వెతికి విసిగి వేసారి మనోవేదనా, ఆలోచనల్లో మునిగిపోయి ఈ ప్రపంచాన్నే మరచిపోయి ఏదో పోగొట్టుకున్నట్టుగా దిగాలుపడి వున్న షీలా ముఖం మీదకు వచ్చి ఆగాయి. ఆమె ముఖకవళికను చూడగానే అతని మనస్సు-గతుక్కుమంది. షీలా తలను ఆప్యాయంగా చేతితో నిమురుతూ "బీ బ్రేవ్ మై డెర్ల్" అని ఓదార్చాడు. నిమురుతోన్న చెయ్యి ఆగిపోయింది. అతని కంఠం బొంగురు పోయింది. సజ్జన్ వేదాంత ధోరణిలో "సత్యానికి అప్పుడప్పుడూ రెండు వైపులా పదును వస్తుంది. కళాకారుడు ఆయి వుండి కూడా మహిపాల్ ఎదుటి హృదయంలోని బాధను గుర్తించడు. న్యాయం న్యాయం అంటూ సమర్థించుకుంటాడు. ఏమి చెప్పాలో- అర్థంకావడం లేదు" అన్నాడు

"ఆడదాని హృదయాన్ని పురుషుడు నల్లరాయి అనుకుంటాడు. అజంతా, ఎల్లోరా అంటూ బండరాళ్ళను అందం వచ్చేలా చెక్కి చెక్కి సౌందర్యాన్ని మలుస్తాడు. మళ్ళీ ఇష్టం లేకపోతే పులులకూ కోడేళ్ళకూ విసిరి పారేస్తాడు. ఆడది రాయే కావచ్చును. కాని తాను కోరుకుని మలచుకున్న సౌందర్యాన్నే ఎందుకు కాలతన్ని వెళ్ళిపోతాడో నాకింతవరకు అర్థంకాలేదు. బహుశా అర్థం కాదేమో" అని షీలా అంటోంటే ఆమె ముఖం మీద వ్యాపించిన కారుణ్యం బుద్ధబలంతో సౌమ్యతగా మారింది. ఆలోచనలతో నిండి ఎదురుగా చూస్తోన్న ఆమె కళ్ళలోని జ్యోతి పెరుగుతోన్న చీకటిలో కూడా దివ్వెలా ప్రకాశవంతగా మెరుస్తోంది.

షీలాను సాగనంపి తిరిగి వస్తోన్న సజ్జన్ మనసు వుద్రేక పూరితంగా వుంది కన్య అతని వెంబడే నడుస్తోంది. పోర్టికో దగ్గరకు రాగానే అశాంతిగా

వున్న సజ్జన్ కన్య చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. ఆమె వ్రేళ్ళతో తన వ్రేళ్ళు కలిపి ముందుకు నడిచాడు సజ్జన్.

డ్రాయింగ రూమ్ గుమ్మందాక అలానే వద్చారు ఇద్దరూ. కన్య చేతిని తన హృదయానికి హత్తుకుని మెల్లిగా గుండెకు అదుముకుంటూ "ఇతరుల కోసం అనవసరంగా ఇవ్వాళ సాయంత్రాన్ని పాడుచేసు కున్నాం. అందరినీ పిలవకుంటే బావుండేది" అన్నాడు సజ్జన్.

కన్య ముఖం ఆనందంతో ఎర్రగా అయింది. ఆమె ఏమీ మాట్లాడలేదు. వ్రేళ్ళు గట్టిగా అదమకపోయినా అవి తొలిగిపోవడానికి ఇష్టంలేనట్లుగా వున్నాయి. కళ్ళు కళ్ళూ కలిసి నాలుగవ్వాలనే ఆదుర్దాగా వునాయి కాని రెండు అయి పోవాలని అనుకోలేదు.

"వెళ్తాను" అంటూ కళ్ళు కిందికి దించి కదలబోయింది కన్య. ఆమె వ్రేళ్ళను తన గుప్పిట్లో బిగిస్తూ బరువైన కంఠంతో "నామీద నీకెలాంటి అనుమానం లేదుకద" అని అడిగాడు సజ్జన్.

ఆ ప్రశ్న విని కన్య ఆపాదమస్తకం కంపించిపోయింది. షీలానూ, మహీపాల్‌నీ, కళ్యాణినీ వేధిస్తోన్న చింతను దాటు చేసుకుని ఆమెలో దాగివున్న భయం ఆమె గుండె దడగా మారి కొట్టుకోవడం ప్రారంభించింది.

ఆమెచేతిని అలాగే నొక్కిపట్టి సజ్జన్ అన్నాడు-"చాలావరకు బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తూ కూడా ఎప్పుడో ఓసారి చెడిన కుర్రవానిలా ఎవరికి వశంకాకుండా అయిపోతాను. అప్పుడు నామీదే నాకు నమ్మకం వుండదు. కనుకనే నీశక్తి మీద నాకు నమ్మకం వుంది కన్యా. నీ విశ్వాసంతో నన్ను పూరించు. ఎప్పటికీ మహీపాల్‌లా కాకుండా వుండడానికి గల ఆత్మ ధైర్యాన్ని నువ్వివ్వాలి". సజ్జన్ నిజాయితీ ఆమె హృదయ కవాటాల్ని తెరుచుకొని స్పృశించింది. అమెకు సంతృప్తి కలిగింది. చిరునవ్వు నవ్వుతూ మృదువుగా "మాట వినకుండా ఆకతాయితనం చేస్తే నీ కుర్రాడి రూపాన్ని ఇక్కడా, గోవర్ధన గిరి కొండమీదా రెండు చోట్లా చూశాను. భయపడకు. నేనంత నిద్ర పోతు వుండేదాన్ని కాదులే" అని అంది.

ఇద్దరి కళ్ళు మళ్ళీ కలిసాయి. కన్య చిరునవ్వు నవ్వుతోంది. సజ్జన్ ముఖాన అమాయికత్వం తెల్లని వెన్నెలై ప్రకాశిస్తోంది. మానసిక సంతృప్తి పొందిన కన్య మహా వుప్పొంగిపోతూంది. ఆమె కళ్ళలో పూలు విరిసాయి. వెన్నెల కురిసింది. సజ్జన్ మనస్సు దానిలో స్నానం చేసింది. ఆతని మేను అంతా పరిమళించింది. అతను పవిత్రుడయ్యాడు. తనలో ఓ కొత్త అభయాన్ని పొందాడు.

వెళుతూ వెళుతూ కన్య చెప్పింది—"నేను పళ్ళాలు పెట్టిస్తాను. మీరంతా పైకే భోజనాలకురండి"

# 43

రాత్రి చాలా పొద్దుపోయేవరకు మేల్కొన్న కారణంగా సజ్జన్ వ్యాహాళికి వెళ్లడం కుదరలేదు. ఉదయం ఆలస్యంగా లేచి టీ తాగాడు. ఇవ్వాళ హోలీ శుభాకాంక్షలు అందజేయడానికి చాలామంది మిత్రుల యిళ్లకు వెళ్ళి కలవాల్సి వుంది. భార్యా భర్తలు కలిసి నిర్ణయించుకున్న కార్యక్రమం ప్రకారం పన్నెండు కొట్టేసరికి ఎట్టిపరిస్థితిల్లోనూ తిరిగి వచ్చేస్తానని సజ్జన్ హామీ యిచ్చాడు. ఆ తర్వాత ఇద్దరూ స్వేచ్ఛావిహంగాల్లా కారు డ్రైవు చేసుకుంటూ కాన్పూరు దాకా వెళతారు. భోజనం అక్కడే తినుకుంటారు. నల్లచేవ డైనింగ్ టేబిల్ మీద కూర్చుని బల్లను తబలాగా వాయిస్తూ వనకన్య కోసం నిరీక్షిస్తున్నాడు సజ్జన్. వుదయం ఫలహారాల్ని సర్దుతూ కన్య వంటింట్లో వుంది. షీలా మహీపాల్‌కూ మధ్య వున్న సంబంధాన్ని చర్చిస్తూ తమ యిద్దరి మధ్యవున్న అనుబంధాన్ని మరింత గట్టి చేసుకున్నారు సజ్జన్, వనకన్య.

రెండు మూడు నిముషాలైన తర్వాత తబలా వాయించడం మానేసి దగ్గరే వున్న వార్తాపత్రికను చేతిలోకి తీసుకుని పేజీలు తిరగేయసాగాడు. అలాంటి సమయంలో బాబాగారు వచ్చారన్న కబురు మోసుకుంటూ వచ్చాడు అతని నౌకరు. మంచి రొమాంటిక్ మూడ్‌లో వున్న సజ్జన్ బాబాగారువచ్చారనే సరికి అంతా ఆవిరై పోయింది. అయినా వారిని వెంటనే లోపలికి తీసుకరమ్మని

ఆశ్చాపించాడు. బాబాగారి పారలౌకిక శక్తులు ప్రభావం అతనిపై బాగా పడింది. మనస్సులోని మాట ఇట్టే బాబా ఎలా తెలుసుకోగలడా అన్న విషయంపై అతను బాగా ఆలోచించాడు. తన ఓటమితో ఎంతకుంచించుకపోతే అంతగా బాబా మీద అతనికి భక్తిశ్రద్ధలు ఇనుమడిస్తున్నాయి. బహుజన హితార్థం, బహుజన సుఖం కోసం తమ సర్వస్వాన్ని ధారాదత్తం చేయమని కన్యనీ సజ్జన్‌నీ బాబా కోరిన నిన్నటి మధ్యాహ్నం నుంచి బాబా-అంటే భయపడటం మొదలెట్టాడు సజ్జన్. లోకోద్ధరణ కోసం తనకున్న యావత్తూ ధారపోయడ మనేది ఎంత వుత్తమమైన ఆలోచనైనా అంత గొప్ప త్యాగం చెయ్యడానికి అతని మనస్సులో పెరుగుతున్న కోరికలు అడ్డంతగులుతున్నాయి. అందుకే బాబా వచ్చాడన్న వార్త తెలియగానే అతను కొంచెం జంకాడు.

పైనవున్న అతిధి గృహంలో బాబాగారిని కూచోబెట్టి నమ్రతా పూర్వకంగా సజ్జన్ "మేము టీ తాగబోతున్నాం. మీకోసం పాలు తెప్పించమంటారా" అని అడిగాడు.

"వద్దు రామ్‌జీ. మీరు నిరభ్యంతరంగా టీ తాగిరండి. మీకు అభ్యంతరం లేకపోతే నేనూ అక్కడే కూర్చుంటాను. పదండి. ఇక్కడ వృధాకాలహరణ చెయ్యడం ఎందుకు ?"

"దయచేయండి. ఏమీలేదు—"

"ఏమిటో చెప్పండి నిస్సంకోచంగా"

"ఏమీలేదు.... మేము గుడ్లూ, ఆమ్లెట్ వగైరా...."

బాబాగారు నవ్వుతూ అన్నాడు— మీరు తినండి "మీ మాంసాహారం నా నోట్లోకి పోతేకదా నాకు భయం"

ఇంతలో కన్య వచ్చింది. ఆమె రాగానే బాబాగారు ప్రసంగాన్ని మొదలు పెడుతూ సజ్జన్‌ని వుద్దేశిస్తూ అన్నాడు— "రామ్‌జీ, ఒక అబలకు న్యాయం ఇప్పించడం కోసం మీరంతా అంత పెద్దతరహా ఆందోళన లేవదీసారు. విమానాల నుంచి కరపత్రాల్ని చల్లించారు, అలాంటి స్త్రీలు సంఘంలోని దుష్ట

శక్తుల కాళ్ళకింద ఎంతో మంది నలిగిపో తున్నారు. వాళ్ళకోసం మీరు కంకణం కట్టు కుంటారా?"

"విషయం ఏమిటో శలవివ్వండి" అంటూ కన్య అడిగింది.

"నిన్న మధ్యాహ్నం ఓ విచిత్రమైన పిచ్చి అడపడుచు మా ఆశ్రమంలో చేరింది. అందరి ముందు ఎంతో పిచ్చిదానిలా నటించి ఏకాంతంగా పిలిచి నేను అడిగితే ఆమె అసలు పిచ్చిది కాదని తేలింది".

ఆ తర్వాత?" అంటూ కుతూహలాన్ని చూపిస్తూ సజ్జన్, కన్యా ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"ఆమె సంఘం చేసే అత్యాచారాలకు గురి అయింది. మంత్రి వాళ్ళు చేసే పాపాలకు ఆమె మతి కొంతవరకు భ్రమించిందనుకోండి. కాని ఆమెపైకి కనపడుతోన్నంత వెర్రిదికాదు. మంత్రి వాళ్ళు వచ్చి ఆమెను ఒదిలేసి వెళ్ళారు. ఆమెను కాదు_ ఆమెలో వాళ్ళు సృష్టించిన పాపాన్ని ఒదిలేసి వెళ్ళారు. ఇలాంటి అత్యాచారాలు సహిస్తోన్న స్త్రీలు అక్కడ ఇంకా ఎంతో మంది వున్నారు".

ఆ మాటలు వింటోంటే తెల్లని కన్య ముఖం వుద్రేకంతో ఎర్రబారింది. సజ్జన్ ముఖం మీద ఆవేశం కన్న ఆసక్తి ఎక్కువగా కనపడుతోంది.

బాబాగారు కథయావత్తూ పూసగుచ్చినట్లు వివరించారు. పిచ్చిది అని వ్యవహరింప బడుతోన్న ఆ ఆడపడుచు నిజానికి ఓ వంటామె కూతురట. ఓ ధనవంతుని ఇంట ఆమె పని చేస్తుండేది. తల్లితో కూతురు కూడా ఆ ఇంటికి వెళ్ళుతూవస్తూ వుండేది. చదువులో ఆ అమ్మాయి చురుకు కావడంవల్ల యజమాని కనికరించి ఆమెకు సాయం చేసాడు. అతని కుమారునితో ఈ అమ్మాయికి ప్రేమ కలిగింది. ఈ మధ్యలో ఆ వంటామే మరణించింది. ధనవంతుడైన యజమాని కొడుకు, తల్లిని పోగొట్టుకున్న ఆ అమ్మాయి చీకటి భవిష్యత్తుకు ముత్తైదువ అనే వెలుగు ప్రసాదించాడు. ప్రేమ తక్కువ పాళ్ళలో వుండేమో దాంపత్యం అనే ఆ దీపం మధ్యలోనే ఆరిపోయింది. ఆ పిల్లతో తెగతెంపులు చేసుకోమని అతని తండ్రి బలవంతం చేసాడు. ఆమెతో తెగతెంపులు చేయించి

ఆ అమ్మాయికి భరణం కింద కొంత ఏర్పాటు చేసి మహిళా మండలిలో చేర్పిం చాడా పెద్ద మనిషి. ఆ సేవా మండలి ప్రేమ్‌చందూ, తదితర భారతీయ భాషా సాహితీ వేత్తలూ తమ గ్రంథాల్లో పేర్కొన్న మహిళాశ్రమాల మోస్తరుగానే వ్యభిచారానికి 'స్త్రీలను అపహరించి అక్రమంగా అమ్మడానికి' అవినీతి వ్యాపారానికి ఆటపట్టు. ఇరవై రెండు సంవత్సరాల నుంచి ఒక ప్రబుద్ధుడు దానికి గౌరవ కార్యదర్శిగా సర్వాధికారిగానూ వుంటున్నాడు. కార్యాచరణ సమితిలో నగరంలోని కొంత మంది ప్రముఖ వ్యక్తులు సభ్యులుగా వున్న కారణంచేత ప్రభుత్వం వారు దాన్ని గుర్తించడం జరిగింది. ప్రతి సంవత్సరం సేవామండలి వాళ్ళు వార్షిక వృత్తాంతము ప్రచురించడం, ఏటా పదీ పన్నెండు మంది అనాథ స్త్రీలకు వివాహం చేయించడం గురించి సగర్వంగా చెప్పుకోవడం జరుగుతోంది. అర్ధాంగి కావాలన్న వ్యక్తి ఆ సంస్థకు విరాళంగా ఐదారువందల రూపాయలు చందా ఇస్తాడు. నియమప్రకారం ఆ మొత్తానికి రసీదు అతనికి ముట్టుతుంది. వివాహం చేసుకోదలచుకున్న స్త్రీ పురుషులు మేజిస్ట్రేట్ సమక్షంలో కాగితాల మీద సంతకాలు చేస్తారు. ఇంతగా నీతి నియమాలకు లోబడి జరిపిన తతంగాన్ని చూసిన తర్వాత వాళ్ళ క్రియా కలాపాల్ని శంకించడానికి అధికారం ఎవరికి వుంటుంది? ఇలా నాలుగు పక్కలా పక్కాగోడ కట్టుకున్న తర్వాత ఆ మండలి కార్యదర్శి, సభ్యులు, మిత్రులూ, పోలీసులతో సహా సేవా మండలిని వ్యభిచార గృహంగా స్వేచ్ఛగా వుపయోగించు కుంటారు. రైల్వే స్టేషన్లలోనూ, తిరునాళ్లలోనూ తప్పిపోయిన ఆడవాళ్లను ఆమాటా ఈమాటా చెప్పి అక్కడికి తీసుకొస్తుంటారు, సేవా మండలి ప్రతినిధులు. మత కలహాలు జరిగే రోజుల్లో ముసల్మాను స్త్రీలను కూడా లేపుకొచ్చి వాళ్ళను మతాంతీకరణచేసే ఏర్పాట్లు కూడా చేస్తుంటారు వాళ్లంతా. మొదట్లో ఇక్కడికి ఎక్కువమంది పల్లెటూళ్ళ నుంచి వచ్చిన వారూ, సాంఘికంగా బడుగు వర్గాలకు చెందినవాళ్ళూ వుండేవాళ్ళు. కాని దేశ విభజన జరిగిన తర్వాత అపహరించిన స్త్రీల ఉద్ధరణలో కొంత బాధ్యత సేవా మండలి భుజస్కంధాలపై పడినప్పటి నుంచి మధ్య తరగతి స్త్రీలు కూడా రావడం మొదలెట్టారు. మండలిలో ఓ మూల కుట్టూ, అల్లికా, చేతి పనులు లాంటివి నేర్పడానికి సౌకర్యాలున్నాయి. అందువల్ల బయటి నుంచి

కూడా సంబంధం లేని ఎంతో మంది ఆడవాళ్ళ రాకపోకలు ఎక్కువయ్యాయి. వాళ్ళకు కూలీ ఇస్తారు. విద్యాలయం పేరుతో నానారకాల పాపాలు అక్కడ చేస్తుంటారు"

ఇప్పుడు ఆశ్రమంలో చేరిన ఈ పిచ్చామె సేవామండలిలో చేరిన కొత్తలోనే అక్కడ పనిచేస్తోన్న కొంతమంది మహిళా కార్యకర్తలూ, ఆ వాడలోనే వుండే మరికొంత మంది స్త్రీలూ, సేవామండలి సెక్రటరీ, వాళ్ళంతా ఏవేవో మాటలు చెప్పి ఏవేవో ఆశలు చూపించి ఆమెకు ఏమాత్రం అనుమానం కలగకుండా వుండడానికి ప్రయత్నించారు కొన్ని రోజుల తర్వాత అసలు బండారం బయటపడసాగింది. పిచ్చిదానిగా మండలి వాళ్ళను నమ్మించి ఆ చెరనుంచి బయట పడడానికి రెండు సంవత్సరాలు ఆమె పోరాటం చేయాల్సి వచ్చింది. మగపురుగంటే ఆమె కంపించి పోతుంది. మగవాడంటే చీదరించుకుంటుంది. మండలిలో వున్న రెండు సంవత్సరాల్లో ఆమె మానసికంగా పురుషుల అఘాయిత్యాలు సహించని రోజులేదు. బహుశా అందుకే కాబోలు ఆమె మగవాళ్ళంటే అసహ్యించు కుంటుంది. పురుషుని కపటపువలలో చిక్కిరకరకాల పరాభవాలూ బలాత్కారాలు సహించి ఆమె పవిత్రమైన మనసంతా చెదిరిపోయింది.

ఈ వృత్తాంతం వినగానే కన్య ఆగ్రహావేశాలు కట్టలు తెంచుకుంది. సజ్జన్ కూడా ఆ దీనురాలి కరుణ గాథను విని చలించిపోయాడు.

"ఈ దుర్మార్గాల్ని అరికట్టాలి. ఇప్పుడే పోలీసులకు రిపోర్టుచేసి అటువంటి వ్యభిచార గృహాల్ని కూకటి వేళ్ళతో పీకిపారేయాలి" అని కోపంగా అంటూ సజ్జన్ వైపు తిరిగి- "నువ్విప్పుడే వెళ్ళి ఏవిధంగానైనా సరే ఈ అన్యాయాన్ని అటకట్టించాలి'' అని గద్దించింది.

బాబాగారన్నారు- "అలా చేసే ముందు ప్రమాణాల్ని సేకరించాలి. మానసికంగా ఇప్పుడా అమ్మాయి అస్వస్థురాలు ఆమె చెప్పినది అసత్యం కూడా కావచ్చు".

"ఇటువంటి గృహాలున్నాయని నేను ఇంతకు ముందే విన్నాను" అన్నాడు సజ్జన్.

"నడుస్తోన్న విషయం తెలుసుకోండి. కాని ఏదైనా చర్య తీసుకునే ముందు సాక్ష్యాధారాలు సేకరించాలి. ఇప్పుడా సత్యాన్ని బయట పెట్టాలంటే ఆ అమ్మాయి మనకు నమ్మకమైన సమాధానం ఇచ్చేస్థితిలో లేదు".

బాబాగార్ని చూస్తూ సజ్జన్ అన్నాడు- "మీరు సిద్ధిపొందిన వారు కదా ఎదుటివాళ్ళ మనస్సులోని మాటఇట్టే గ్రహించేస్తారు మీ అభిప్రాయంచెప్పండి".

"రామ్‌జీ, మీ అభిప్రాయంతో నా అభిప్రాయాన్ని పోల్చకండి. మీ దృష్టితో మీరు సత్యాన్ని దర్శించండి. యథార్థాన్ని గ్రహించండి"

"కాని యధార్థాన్ని తెలుసుకోవడానికి మన దగ్గర ఏమి సాధనాలున్నా యని ? ఈ కేసులో యదార్థాన్ని ఎలా గ్రహించేది ?"

"ప్రయత్నం వల్ల, ఆలోచనవల్ల".

"ఇటువంటి వ్యభిచార గృహాలున్నాయని నేను కూడా విన్నాను. చదివాను కూడా. పెద్ద పోలీసు అధికార్లను కలుసుకుని విచారణ చేయిస్తాను. ఇప్పుడే కర్నూల్‌కి ఫోను చేస్తాను"

"అన్నగారికి నేను ఫోను చేసి ఇప్పుడే వస్తాను" అని అంది వనకన్య.

ఆమె లేచి వెళ్ళిపోబోతోంటే వారిస్తూ బాబాగారన్నారు - "వుండమ్మా కాస్త ఆలోచించనియ్. పోలీసు అధికార్ల చేత విచారణ చేయిస్తానని ఇప్పుడే సజ్జన్ గారన్నారు. మంచిదే. చిన్న అధికార్ల మద్దతుతోనే వాళ్ళీ పనులు చేస్తుంటారు. వాళ్ళకు లంచాలు కూడా ముట్టుతూ వుండొచ్చు. వాళ్ళు కూడా విలాసం చేస్తూండొచ్చు. ఏమాత్రం చూచాయగా వాళ్ళకు. తెలిసినా ఈ విషయంపెద్ద అధికార్లు అక్కడికి చేరక మునుపే ఆ పాప దృశ్యాలన్నీ మాయంచేసి వాళ్ళ ప్రయత్నాలన్నీ వమ్ము చేస్తారు. అప్పుడు రామ్‌జీ, మీరేమి చేయగలరు?"

సజ్జన్ స్తబ్ధుడయ్యాడు. పంజరంలోని చిలుకలా గింజుకలాడింది కన్య. చిరాగ్గా అంది- "స్త్రీల మీద ఇటువంటి అత్యాచారాలు జరుగుతున్నాయి. కానివాళ్ళు నిస్సహాయులై అన్నీ సహిస్తున్నారు. ప్రపంచానికంతా తెలుసు........ ఏమైనా

సరే దీనికావలసిన సాక్ష్యాధారాలు సేకరించే పూచి నాది. ఈ అన్యాయాన్ని ఏవిధంగానైనా ఎదుర్కొని తీరుతాను".

బాబాగారు నవ్వుతూ కన్యవైపు చూసి అన్నారు– "ఎలా చేయడం ? అందరినీ వేధిస్తూన్న ప్రశ్న ఇదే".

"ముందు నేనక్కడికి వెళతాను. అక్కడ అడవారితో మాట్లాడుతాను"

''మందిరి మేనేజిమెంటు నిన్ను మాట్లాడనివ్వలేదే అనుకో. అప్పుడు ఏం చేస్తావు ?''

"అది ప్రజాసంస్థ బాబాగారూ. అక్కడికి ఎవరయినా వెళ్ళొచ్చు. రావచ్చు"

బాబా మళ్ళీ నవ్వేరూ అన్నాడు – ''అది కాదమ్మా. ఎక్కడైనా దొంగ అందరికీ తెలిసేలా దొంగతనం చేస్తాడా ? నువ్వారహస్యాన్ని ఎలా ఛేదించగలవు ?"

ఆ మాటకు కన్య నీళ్ళు నమిలింది. మళ్ళీ తేరుకుని సమాధానం చెప్పింది. ''నేనక్కడికి ఓ సాంఘిక కార్యకర్తగా వెళ్తాను. కొన్నిరోజులపాటు ఆ వాతావరణంలో వుండి వాళ్ళ తలలో నాలుకలా మసలుతాను. తర్వాత అక్కడివాళ్ళే నాకన్ని విషయాలు చెప్పేస్తారు".

"ఉపాయం బాగానే వుంది. ఆలోచించ తగ్గదే. విమానాల మీద నుంచి కారపత్రాలు చల్లించిన వనకన్య నగరంలో ఎవరికి తెలిసివుండదూ ? మందిరి నడిపే వాళ్ళు ఒకవైపు వాళ్ళతో కలిసి మెలిసి తిరగడానికి అవకాశం ఇస్తూ మరో వైపు నీకు తెలియకుండానే వాళ్ళ మనుషులకు జాగ్రత్తగా మెలగండని చెప్పారనుకో. అలాగే జరిగిందంటే నెలలు గడిచినా నీకు రహస్యం దొక్కదు".

మధ్యలో సజ్జన్ అందుకున్నాడు – "ఇందులో మరో ఇబ్బంది కూడా వుంది సత్యం తెలుసుకోవడం కోసం అసత్యాన్ని ఆయుధంగా ధరించడం ఎంత వరకు వుచితమా అని ;"

"దీనిలో అనుచితం ఏమి వుందని ?" అంటూ బాబా అడిగారు.

"అనుచితమే అవుతుంది. అసత్య మార్గంలో వెళ్ళి సత్యాన్ని ఎలా కనుక్కుంటారు?"

బాబాగారన్నారు-"మీరన్నది నిజమే అనుకుందాం. కానిఈ అసత్యంలో ఎన్ని పాళ్ళు అబద్ధం వుందో అని మీరు ఆలోచించండి. మీరో రహస్యాన్ని రాబట్టడం కోసం ఒక చోటికి వెళ్ళారు. దానివల్ల పదిమందికి లాభం చేకూరుతుంది. సంఘ శ్రేయస్సును కాపాడిన వారమౌతాము. నీ రహస్యాన్ని కొన్ని రోజులు దాచి వుంచితే అది అబద్ధం ఎలా అవుతుంది ?"

"అబద్ధం ఎలా అవదు బాబాగారూ ?"

"సరే నాకో చిన్న సందేహం. ముందు దాన్ని నివారించండి. ఒక దొంగ సరుకు దొంగలించి పారిపోతున్నాడనుకోండి. మీరు పారిపోతున్న ఆ దొంగనూ అతని వెనకనే తరుముకు వస్తున్న ఓ పోలీసు వాణ్ణి చూచారనుకోండి. మీరు దొంగను పారిపోవడం చూసారా అని పోలీసు మిమ్మల్ని అడిగాడనుకోండి. అపుడు మీరేమని సమాధానం ఇస్తారు "?

"చూశాననే చెప్తాను"

"సరే బావుంది. ఆ దొంగ ఇంట్లో ఓపిల్ల వానికి సుస్తీగా వుంది. మందుకు అతని దగ్గర చిల్లిగవ్వలేదు. పిల్లవాని ప్రాణాలు రక్షించాలని అతనికి ఎంతో పట్టుదల. ఈ అవస్థలో ఆ దొంగ మీ యింట్లోనే దూరాడు. దూరడం మీరు చూశారు 'దొంగను చూశావా?' అనిపోలీసుఅడిగితేమీరేమని జవాబిస్తారు?"

సజ్జన్ రెండు క్షణాలు మౌనం దాల్చి ఏదో గంభీరంగా ఆలోచిస్తున్నట్లుగా వుండి ఇలా అన్నాడు - "దొంగనైతే నేను చూశాను కదా. లేదని ఎలా నిరాకరించగలను ? కాని ఆ దొంగ నిస్సహాయస్థితి కూడా గమనించతగిందే. దొంగకు శిక్ష విధింపచేసి అతని పిల్లాడికి మందు మాకు కోసం ఆర్థిక సహాయం చేయగలను"

"మీరు బీదవాళ్ళనుకోండి. మీరు అతనికి ఆర్థిక సహాయం చేయలేరు. ఇతరుల్నించి సాయం ఇప్పించగల స్తోమత మీలో లేదనుకోండి. మరప్పుడు ఏం చేస్తారు?"

"నేను అబద్ధం ఆడేస్తాను. అటువంటి దొంగను పోలీసు వారినుండి కాపాడటం నా తక్షణ కర్తవ్యం పుణ్యం. పాపం కాదు", మధ్యలో కన్య తపీమని జవాబిచ్చింది.

"ఈ రెండు పరస్పర విరుద్ధమయిన సంఘటనలు. వీటిని వ్యూహద్వారా ఎలా జోడించగలను? దొంగతనం చెడ్డది. ఇది సత్యం. నా కుటుంబంలోగానీ మరో కుటుంబంలోని వ్యక్తి ప్రాణాలు కాపాడ్డం, దానికోసం వుపాయం వెతకడం ఇది కూడా సత్యమే. కాని ఈ రెండు సత్యాలమధ్య హేతుబద్ధమయిన పొంతన లేదు"

సజ్జన్ గంభీరంగా ఆలోచిస్తున్నాడు. ఎల్లా ఆలోచించినా చిక్కు తెగడం లేదు. అతను నిర్ణయం చెయ్యలేక పోతున్నాడు.

ఉద్రిక్త కంఠంతో కన్య అంది - "నువ్వేదో సంబంధంలేని ప్రసంగం ప్రారంభించావు. ఇప్పుడు కార్యాచరణలో చూపించాలి కాని-"

"ఇది ప్రసంగం కాదు కన్యా. బాబాకీ ఎదుటి మనసుల్ని అవలీలగా చదువుతారు. వారు సాక్ష్యం ఎప్పుడు చెపుతారా అని ఎదురుచూస్తున్నా".

బాబాగారు అందుకున్నారు - "నీ ఆలోచనా వైఖరి నీ హృదయాన్ని ఎవరో చికులుతున్నారు. లోలోన సంఘర్షణ రేగుతోంది అవునా? కాని నామ్మీ మరో విషయాన్ని కూడా తరచి చూడండి - ఏ పరిస్థితి ప్రభావంచేత నీ హృదయంలో ఇంత ఆందోళన రేగిందీ?"

"మీరనేది నాకర్థం కావడం లేదు"

"మీ అర్థాంగి అలాంటి పాపకూపంలో ప్రవేశించడం మీకు రుచించదు. అదేగా మీ ఆలోచన? నా మాటను కాదంటే చెప్పండి".

"మీ మాట నిజం''

''మీ అర్ధాంగికి బదులు మరో స్త్రీ అంత సాహసోపేతమైన కార్యాన్ని సాధించిదనుకోండి. మీరామెను పొగడకుండా వుండగలరా ?''

''నేను వీరిని కూడా ప్రశంసిస్తాను. కాని గూండాల మధ్య యిరుక్కొని ఎక్కడ...."

"మరి ఇంతమంది అబలలు గూండాలవల్లలో చిక్కుకుని వున్నారే. మరి వాళ్ళ గతి ఏంకాను ? నాలాంటి ప్రాణం వాళ్ళకు లేదా ! నేను ఎలాగైనా ఆరా తీసి తీరతాను. నా ఇంట్లో ఇలాంటి అత్యాచారాలు జరుగుతోంటే కళ్ళారా చూసాను. అప్పుడు నాకు కలిగిన ఆవేదన ఈ అన్యాయాన్ని పూర్తిగా రూపు మాపాలని సవాలు చేస్తోంది. ఇటువంటి గంభీర వ్యవహారంలో వేదాంతిలా కూర్చుని మీనం మేషాలు లెఖ్ఖపెట్టడం నాకు నచ్చడం లేదు సజ్జన్ నేను నీకు భార్యకాక ముందు నీ సహాయాన్ని అర్థించడానికి వచ్చాను. అప్పుడు ఎంత ధర్మాభినివేశంతో నా పనికి పూనుకున్నావు. ఆదీక్షంతా ఎక్కడికి పోయింది?"

కన్య చాల ఆవేశంలోవుంది. పొద్దున్నే ఫలహారాలు చేయాలన్న యోచనే మానేశారు. బాబాగారు ప్రశాంతంగా అన్నారు -''కేవలం ఆవేశం ప్రదర్శించడం అవివేకం అమ్మా. పనిచేసేప్పుడు కూడా ఆలోచించడానికి బుర్రలో ఓ ఖాళీ చోటు ఎప్పుడూ వుండాలి. అది లేనిదే ఏకార్యం సిద్ధించదు. మీవారి అనుమానం కూడా నిజమే. వారి దృక్పథంలో పొరపాటు వస్తుందేమో అన్న వుద్దేశంతో ఆయనలో ఉద్రేకాన్ని తెప్పించడం కోసమే నేనలా అన్నాను ?'' అంటూ సజ్జన్ వైపు తిరిగి ''రామ్‌జీ ఇప్పుడు మా ప్రశ్నకు సమాధానం చెపుతాను, అబద్ధం అనేది మన సాధ్యం కాదు. గమ్యంచేరు కోవడానికి అదొక మార్గం మాత్రమే. అది ఇంతకన్న ఓ విశాలమైన సత్యంతో సంబంధం కలిగివున్నపుడు మనం దాన్ని గ్రహించవచ్చు. కొంచెం అబద్ధం చెప్పడం ద్వారా పరోపకారం చెయ్యడం సాధ్యం అయితే అది సత్యసంగతమే అవుతుంది. పుణ్యమే అవుతుంది. పరోపకారం పుణ్యం పరపీడన పాపం అని వ్యాసులవారు చెప్పింది అక్షరాలా నిజం''

"అలాంటప్పుడు హింసకూడా పుణ్యమేకదా" అని సజ్జన్ ప్రశ్నించాడు.

"గీతలో చెప్పిన ఈ మాటా నాకు పుచితంగానే కనపడుతోంది. ఉద్దేశ్యం గొప్పది అయితే త్యాగం చేసేటప్పుడు హింస చెయ్యాల్సి వచ్చినా అది పుణ్యం కిందేజమ".

"గాంధీజీ దాన్ని వ్యతిరేకించే వాడు కదా!"

"లేదే. పిరికివాని అహింసకన్న ధైర్యం కలవాని హింసే గొప్పదన్నా రాయన. ఒక జీవిని రక్షించడం అనేది గొప్ప వుద్దేశ్యం. ఎవరైనా నిన్ను చంపాలని పగపట్టినప్పుడు అతనితో పోట్లాడాలి. ఆడవాళ్ళతో వ్యాపారం చేసే ఈ పురానా దొంగల్ని ధైర్యంగా ఎదిరించు రామ్‌జీ"

"ఆ సేవా మండల్ ఎక్కడుంది? నేనివ్వాళే అక్కడికి వెడతాను" అంది కన్య.

"ఇవ్వాళ మీరిద్దరూ కలిసి వెళ్ళండి. నేను చెప్పానని చెప్పండి. మీరు అక్కడికి వెంటనే వెళ్ళండి వాళ్ళకు [illegible] [illegible]. సహాయం [illegible]టూ వంటో రెండు రోజులలో వాళ్ళ [illegible] [illegible]. స్వాతంత్ర్య పరిస్థితిని బట్టి ఎత్తు వేయాలి",

నిన్నటి [illegible] [illegible] [illegible] [illegible]లాయిటా ఎక్కడ కక్కడ పూడి పోతూ, [illegible] వికారమై పోయిన ముఖాలూ, కళ్ళు, పెదవులూ, తల జుట్టూ, చనిపోయిన తన ఒడిసగారి దృశ్యం కన్య కళ్ళ ముందు నిలిచింది. అది జ్ఞాపకం రాగానే ఆమె యంత్రంలా నిల్చి పోయింది. ఆడవాళ్ళంతా కాలి పోయి ఆమె ముందు కుప్పలు కుప్పలుగా [illegible] కనిపించారా కళ్ళలోంచి [illegible] [illegible] [illegible]. కన్య ఆపాదమస్తకం కంపించి పోయింది. మళ్ళీ సంకల్పంతో [illegible] వేసుకుంది మనసును. ఆమె ఇవ్వాళ కొత్త ఉద్యోగాన్ని తన జీవితం [illegible] [illegible] ముడిపెట్టుకుంది.

# 44

మహాశయా,

శ్రీమాన్ బాబా రామ్‌జీ ఆశ్రమానికి వారు చేసే మహత్తర సంఘ సేవా కలాపాల్ని చూడడానికి పిచ్చివారికి వారు చేసే అమూల్య చికిత్సా విధానాన్ని పరిశీలించ డానికి అప్పుడప్పుడు వెళ్ళి చంద్రుడికో నూలు పోగన్నట్టు యథాశక్తి సాయపడు తున్నాము. ఆశ్రమానికి అప్పుడప్పుడు వెళ్ళి వచ్చిన సందర్భంలో తమరు కూడా అనాథల పాలిట కల్పవృక్షంగా ఎంతో మందికి ఆశ్రయమిచ్చి వారికి అనేక రకాల సేవచేయు చున్నారని తెలిసినది. నారీ లోకానికి మీరు చేస్తోన్న సేవ గురించి బాబాగారు చెప్పగా విని పరమానందం కలిగినది. సంఘ సేవాక్రియా కలాపాలంటే నాకు ఎంతో ఆసక్తి. మీరు మండలికి చేయుచున్న సేవను గుర్తించి దీనితో ఓ వందరూపాయల చెక్కు జతపరచి పంపుచున్నాను. దయచేసి స్వీకరించి మమ్మల్ని కృతార్థులు చేయ వలసిందిగా కోరుచున్నాను.

ఇట్లు
వనకన్యా వర్మ

లేఖ, లేఖతోపాటు చెక్కు చూడగానే మండలి గౌరవ కార్యదర్శిగారికి ఆనందం కలిగింది. కృతజ్ఞతలు తెల్పడానికి ఆయనే స్వయంగా విచ్చేసాడు, సజ్జన్ అయిన సతీకుమారి నారీలోకానికి చేస్తున్న సేవను ఉగ్గడిస్తూ చాలా చాలా మాటలు పలికాడు. మాటల సందర్భంలో మండల్‌ని ఓ సారి చూడాలన్న కోరిక బయట పెట్టింది కన్య. అది మా మహద్భాగ్యం అన్నాడు మండలి సెక్రటరీగారు. మర్నాడు సెక్రటరీగారే స్వయంగా వచ్చి కన్యాదేవిగారిని తీసు కెళ్ళి చూపించడానికి నిశ్చయమైంది.

ధాన్యం రాసులతో నిండి జనసమ్మర్దంతో కుసుకుతున్న ఇరుకు బజారు. వీపుల మీద ధాన్యం బస్తాలు వేసుకుని రోడ్డుకు రెండు వైపుల నుంచి నడుస్తోన్న కూలీవండు. తోపుడు బళ్ళమీద బస్తాలు వేసుకుని జీవచ్ఛవాల్లా లాగుతున్న కూలీలు, అక్కడ మూగివున్న జనంలో ప్రతి ఒక్కడూ ఏదో పనిచేస్తున్నాడు

ఖాళీగా ఒక్కడు కనపడలేదు. ఎక్కడ చూసినా హడావుడి. చొక్కా, జాకెట్, ఓణీ, గాంధీటోపీ, భుజం మీద అంగవస్త్రం, ఒంటిని కప్పుతోన్న చేతులు లేకుండా బనీను ఆకారంలో కుట్టించుకున్న చొక్కా. మోకాళ్ళ వరకు దోపుకున్న పంచె. ఎన్నాళ్ళు తొడిగినా అరగని కిర్రు చెప్పులూ— పిలిచి తొడుక్కున్న వాళ్ళే అక్కడ ఎక్కువగా కనపడుతున్నారు. ఏ మూల చూసినా ధాన్యమే. తోపుడు బళ్ళు, లారీలూ, సైకిళ్ళూ, జట్కాలూ, ఆవులూ, ఆంబోతులూ. వ్యాపారంలో మునిగి పోయివున్న వర్తక సమూహాన్ని రోడ్డు మీద వున్న గుంటలూ మిట్టలూ దాటుకుని సర్జన్ కారు ముందుకు పరుగెత్తుతోంది. ఇంతలో సెక్రటరీగారు ఎడమ చేతివైపు ఓ ఇంటికప్పు వైపు సౌంజ్ఞ చేసారు. అక్కడో పెద్ద సైన్‌బోర్డు కనిపించింది. ఇంతలో సెక్రటరీగారు తన దూరదృష్టిని పరోక్షంగా పొగడుకున్నారు- "మూడు పిట్టగోడల మీద ఒక్కొక్క-సైనుబోర్డు పెట్టించానండి, ఎందుకో తెలుసాండీ? దారిన పోయేవాళ్ళ దృష్టి తప్పని సరిగా వాటి మీద పడుతుందని. అదీకాక మాసంస్థ మరీ అంత బహిరంగం కాకుండా ఓ చాటు కూడా లభిస్తోందనుకోండి. నాకు పరదా అంటే చాలా ఇష్టం మా మండలికి శీలమూ, చరిత్రా ఈ రెండే పట్టు కొమ్మలనుకోండి. ఈ మండలిలో కార్యకర్తగా చేరి సుమారు ఇరవై రెండు సంవత్సరాలు కావస్తోంది. చంద్రుని కైనా మచ్చవుంటుందేమో కాని మా సేవా మండలిలో పనిచేసే చంద్రముఖులకు మాత్రం నువ్వుగింజ ప్రమాణంలో కూడా మచ్చలేదంటే నమ్మండి"

అప్పటికి కారు ధాన్యం మండీ దాటి ఎడమచేతి రోడ్డు మీదకు వచ్చేసింది. ఎదురుగా ఓ సినిమా థియేటర్, ఓ చిన్న బజారు వచ్చింది. అది దాటగానే కారు ఎడమవైపు ఓ సందులోకి తిరిగింది. సందుమలుపులోనే "శ్రీమతి సుందర్‌బీబీ దాతవ్య ఔషధాలయం" తాటికాయంత అక్షరాలతో రాసి వున్న ఓ పెద్ద సైను బోర్డు దానికి ఆనుకునే ఫ్రెండ్స్ ట్రేడింగ్ కార్పొరేషన్ అంటూ మరో సైను బోర్డు కనపడింది. మళ్ళీ ఓ టేలర్ దుకాణం. దాని పక్కగానే పసుపు రంగు పూసిన గోడల మీద "మహిళా సేవా మండలి" భవనం. గోడలన్నీ

చిన్నవీ పెద్దవీ సైజువారీగా సైనుబోర్డులతో నిండిపోయ్యాయి. గేటు మీద మండలి పేరూ, కుడివైపుగా పొడుగాటి సైనుబోర్డు మీద శ్రెకటరీ, మండలి పోషకుల పేర్లూ, ఎడమచేతి వైపుగా మరో సైనుబోర్డు మీద మండలి ఆశయాలూ, ఆదర్శాలూ మొదలైన వివరాలు రాసివున్నాయి. సైనుబోర్డులు తగిలించగా మిగిలిన చోటులో "యత్రనార్యస్తు పూజ్యంతే రమంతేతత్ర దేవతా" అంటూ దేవనాగరి లిపిలో పెద్ద పెద్ద అక్షరాలతో రాసివుంది.

గేటు తీసి లోపలికి వెళ్ళగానే ముందు ఆఫీసు రూమూ అక్కడ ఓ ముసలి అకౌంటెంటు పక్కనే కూర్చున్న ఓ స్త్రీ కనిపించారు. వయసు ఉడిగినా షోకుగా నీటుగా ముస్తాబై వుంది ఆ స్త్రీ. ఆమె గోధుమ కత్తుగావుంది. ముఖం, చేతులనిండా స్ఫోటకం పోసిన మచ్చలు. నీలం రంగు చీకిరి కళ్ళకు అడ్డంగా ఓ రంగు అద్దాలజోడు. కనురెప్పల పైభాగం, కిందిభాగం నల్లగా మేహం వచ్చినరోగి కళ్ల తీరులా వుంది. జుట్టు తెలుపు తిరిగితే రంగు పట్టించిందేమో బూడిద రంగుగా వున్నాయి ఆమె తలవెంట్రుకలు. వాళ్ళను చూడగానే ఖాదీ వస్త్రధారిణి అయిన ఆమె పళ్ళు ఇకిలిస్తూ లేచి నిలబడింది. ఆమె ఇకిలిస్తుంటే కాచురంగుగా గారపట్టిన ఆమె చిన్న పలువరస కనిపించింది. ఆమె మాపూ, నవ్వూ చూస్తోంటే సజ్జన్‌కి కడుపు దేవేసినంత పని అయింది. నుదుటి మీద కుంకుమా, పాపిటలో సిందూరం పులుముకొని తాను ముత్తైదువన్నట్టు ముందే పరిచయం చేసింది. ఆమెవైపు చెయ్యి చూపిస్తూ సజ్జన్ వైపు చూస్తూ శ్రెకటరీ ఇలా పరిచయం చేసాడు- "పేరు శ్రీమతి వసుమతీదేవి శాస్త్రిణి. ప్రఖ్యాత రాజవైద్యురాలు. సుందర్‌బిబి రోడ్డులో ఔషధాలయం వుంది చూసారూ దానికి ఈమే అధ్యక్షురాలు మా మండలికి వీరి సలహా సహకారాలతోనే ఇక్కడచేరే మహిళలకు ఆయుర్వేద పరిజ్ఞానాన్ని కూడా కల్పిస్తున్నాంలెండి".

తర్వాత మండలిలో స్థిరంగావుండే ఓ ఎనిమిది మంది స్త్రీలు తెల్లని పరిశుభ్రమైన వస్త్రాల్లో కనిపించారు. పద్దెనిమిది నుంచి ముప్ఫయి మధ్య సంవత్సరాల వయసున్న వాళ్ళు అందులో వున్నారు. అందరు ఇంచు మించుగా [illegible] ఛాయగా వున్నారు. అందంగా లేకపోయినా ఓ మోస్తరుగా వున్నారు. శ్రెకటరీ

గారి కోరిక ప్రకారం ఆకార్యకర్తలంతా సంస్కృతశ్లోకాలూ, కొన్ని భజనలూ గానం చేసారు. తర్వాత కుట్టుపని గది, అల్లికా నేతా వున్న గదీ, సంగీతం, నృత్యం, నేర్పుతోన్న గదులూ, తర్వాత ఆయుర్వేదశాస్త్రం, ధర్మశాస్త్రం బోధించే గదులూ మొత్తానికి అన్ని గదులూ వరుస వరుసగా చూపించాడు శక్రటరీ. చదువుకొనే వాళ్ళూ, వృత్తిపనులు నేర్చుకుంటూ వున్న వాళ్ళు సుమారు ఓ యాభైమంది వున్నారు. నవయువతులూ, యువతులూ, ముప్ఫయి సంవత్సరాలు దాటిన వాళ్ళూ అన్నిరకాల వయసు కలవాళ్ళూ వున్నారు. వీళ్ళంతా పనినేర్చుకోవడానికి ఇక్కడికి వస్తారు. వాళ్ళందరికీ వాళ్ళ వాళ్ల నైపుణ్యాన్నిబట్టి రోజు కూలీ పంచుతారు. సంగీతం, నృత్యం నేర్చుకునే వాళ్ళకు మాత్రం ఈ నియమం వర్తించదు. ఆయుర్వేదం, ధర్మశాస్త్రం అభ్యసించే వాళ్లకు ఇక్కడ చోటులేని కారణంగా పక్కనే వున్న ఔషధాలయంలో శిక్షణ తరగతులు ఏర్పాటు చేస్తున్నారు. ఆమె ఔదార్యాని కొనియాడుతూ శక్రటరీ ఓ ఐదు నిమిషాలు స్తోత్రం చేసాడు.

సంస్థ పనిచేసే తీరు చూసి సజ్జన్, కన్య ముగ్ధులయ్యారు. ఇంత సజావుగా చక్కగా నడిపిస్తోన్న సంస్థలో వాళ్ళు వెతుకుతూ వచ్చిన నరక కూప లక్షణాలు ఎంత గాలించినా ఎక్కడా కనపడలేదు. ఎన్నెన్నో విధాలుగా మండలికిసాయం చేస్తానని కన్య వాగ్దానం చేసింది. తిరిగి వెళ్ళిపోతూ కన్య తనలో తాను అనుకుంది- "ఆమె వచ్చిదైనాఅయివుండలి. లేదాఇదకూపీ తీయ డానికి అంత సులభంగా అందని సంస్థ అయినా అయి వుండాలి. ప్రపంచం ఎంతలోతు కలది! దీని లోతును కనిపెట్టాలంటే నిజంగా చాల ధైర్యం కావాలి"

ఈ సంఘటన జరిగిన తర్వాత మండలి గురించి కన్య ఎప్పుడూ ప్రత్యే కంగా ప్రసక్తి తీసుకు రాలేదు. శక్రటరీ కన్య దగ్గరకు అప్పుడప్పుడు వస్తూ పోతుండేవాడు. కొద్ది రోజులు నుంచి ఆతను సజ్జన్ దగ్గరకు రావడం మొద లెట్టాడు. కొన్ని పర్యాయాలఅయితే ధనపతీదేవి రాజవైద్యను కూడా వెంట బెట్టుకుని సజ్జన్‌ని కలుసుకున్న సందర్భాలు వున్నాయి.

ఓరోజు సజ్జన్ బాబాగారితోమండలి విషయం ప్రస్తావిస్తూ "మీ పిచ్చామె చెప్పిన లక్షణాల్లో ఏ ఒక్కటి కూడా మాకక్కడ కనిపించలేదు" అని చెప్పాడు.

బాబాగారు నెత్తిగోక్కుంటూ "అక్కడ ఏదో విశృంఖలత్వం వున్నట్టు నాకు గట్టిగా నమ్మకం కలుగుతోంది. ఆమె ఎన్నో సంగతులు చెప్పింది. అవన్నీ ఊహా కల్పనలని కొట్టిపారెయ్యడానికి వీల్లేదు" అన్నాడు.

అన్న కూతురినే వుంచుకున్న ఓ పెద్ద టోకు ధాన్యం వర్తకుని పేరు చెప్పాడు బాబా. కుట్టుపని నేర్చుకోవాలని ఆమెను నిర్బంధంగా సేవా మండలికి పంపించడం, అక్కడ తను ఆమెతో అనైతిక వ్యాపారం సాగించడం. పాపం ఆ అమ్మాయిని మండలి వాళ్ళు పెట్టే తిప్పలు అంతా ఇంతా కాదట. ఆశ్రమంలో చేర్పించిన పిచ్చామె గురించి కూడా మరికొంత సమాచారం తెలిసిందట. మండలిలో చేరగానే ముందు ధర్మశాస్త్రం ఆమెకు నూరిపోసి గృహిణీ ధర్మం ఆడజాతికి అన్ని ధర్మాలకన్న మిన్న అని నెమ్మదిగా బోధించే వారట. పురుషునికిమల్లే స్త్రీకి కూడా ఒకటి కన్న ఎక్కువగా వివాహాలు చేసుకోవడానికి భర్తల్ని మార్చడానికి అధికారం వుందనీ, ఆర్య సంప్రదాయం ప్రకారం స్త్రీ తనకు నచ్చిన వరుని ఎంపిక చేసుకోవడానికి పూర్తిగా స్వేచ్ఛా స్వాతంత్ర్యం వుస్తారనీ ఇలాంటి మాటలు ఆమె బుర్రకు క్రమ క్రమంగా పట్టించారట. పిచ్చామె మొదటే అనాథ అవడం వల్ల వాళ్ళ బోధనలకు ప్రభావానికీ సులభంగా లోనయింది. ఓరోజు మండలికి పక్కనే వున్న ఓ గదిలోకి ఆమెను తీసుకెళ్ళి అక్కడ ఓ యువకునితో ఆమెకు పరిచయం చేసారట. ఆ గది పరిశుభ్రంగా వుండడమేగాక గోడకు రాధా కృష్ణుల ప్రణయ సన్నివేశాన్ని తెలిపే ఓ పటం కూడా తగిలించారట ఆ పటం ఎదురుగా వాళ్ళిద్దరినీ నిలబెట్టి తమ యిద్దరి మధ్యవున్న రహస్యాల్ని మూడో వ్యక్తికి తెలీకుండా కాపాడుతామని వాళ్ళతో ప్రమాణం చేయించారట. పిచ్చామె స్వేచ్ఛా పూర్వకంగానే శరీరసౌఖ్యం యిచ్చిందట ఆ యువకునికి. తన గతించిన విషాద గాథంతా ఆమె ఆ నవయువకునికి విన్నవించుకుందట. ఆయువకుడు పది రోజులు

వరుసగా ఆమె దగ్గిరకు వస్తూ ఆకస్మాత్తుగా రావడం మానేసాడట. కొన్నాళ్ళ తర్వాత మరో రోజు ఆమెను ఆగదిలోకి రమ్మని పిలిచారట. ఆమె వెళ్ళిందట. అక్కడ అతనికి ఐదులు మరో వ్యక్తి వున్నాడట. వాళ్ళిద్దరిని రాధా కృష్ణుల జంట ముందు నిలబడి ప్రమాణం చేయమని చెప్పారట. విద్యామె అలా చెయ్యడానికి నిరాకరించిందట. నేను వేశ్యను కావడానికి అంగీకరించనని ఆమె ఖండితంగా చెప్పేసరికి ఆయన ఆమెను బలాత్కారం చెయ్యబోయాడట. ఆమె అడుపులూ పెడబొబ్బలూ మందిర గోడలు దాటి బయటికూడా వినిపించాయట. ఆరోజు నుంచి ఆమెను పాతాళ గృహంలో బంధించి వేశారట. అక్కడే ఎంతో మంది పైశాచిక కామతృష్ణకు ఆమె బలి అయిందట. బలాత్కారం చేసే వ్యక్తుల్లో పోలీసు శాఖ వ్యక్తులు కూడా తరుచుగా వస్తుండే వారట. అక్కడే ఆమెకు సుఖరోగం సంప్రాప్తించిందట. మందిర పాతాళ గృహంలో రెండు పెద్దగదు లున్నాయనీ, మందిర ఆజ్ఞల్ని ధిక్కరించిన ఆడవాళ్ళను అక్కడ బందీలుగా చేసి అక్కడే వాళ్ళను బలాత్కారం, మానభంగం చేయడానికి ప్రోత్సాహం ఇచ్చి వాళ్ళ ఆత్మలకు తగినశాస్తి చేస్తారనీ విద్యామె చెప్పిందట. మందిర ఆజ్ఞల మేరకునడుచుకుంటోన్న ఆడపడుచులు ముత్తైదువలుగాచలామణి అవుతూ ఇతరుల మీద అధికారం చెలాయిస్తారట. అక్కడ వున్న కార్యకర్తల్లో వాళ్ళకూ వాళ్ళకూ పరస్పర విద్వేషం, ఈసూయా, దురాశా వీటి కారణంగా వాళ్ళంతా మందిర అధికారులకు దాసోహం అయిపోయి వాళ్ల కోరిక ప్రకారం ప్రవర్తిస్తూ వుంటారట. మందిర ఆజ్ఞను ధిక్కరించారన్న నమ్మకం కలిగించిన నేరజాణల్ని మేజిస్ట్రేటు సమక్షంలో హాజరుపరిచి వర్ణాంతర వివాహాలు చేసుకున్నట్టుగా దొంగ సాక్ష్యాధారాలతో ప్రభుత్వం కళ్ళలో దుమ్ము కొడతారట. తిరుగుబాటు చేసే స్త్రీలకు తగిన శాస్తిచేయడానికి వాళ్ళకు ఎలాంటి శిక్షవిధించాలి మొదలైన నిర్ణయాలు శ్రీమతి ధనవతీరాజవైద్య కిట్టూ మేనత్త కలిసి చేస్తారట ధనవతి సెక్రటరీ కన్న పాపిష్ఠిదనీ, వీళ్ళిద్దరూ కలిసి మందిర రాజ్యానికి మకుటంలేని రాజూరాణిలా నిరంకుశంగా పరిపాలిస్తున్నారనీ వాళ్ళ దమననీతికి అక్కడ ఆడవాళ్ళంతా ఏమీచేయలేక మౌనంగా సహిస్తున్నారనీ ఎంతో జాలిగా చెప్పిందని బాబాగారు సజ్జన్‌కు తెలిపాడు. ధనవతికి ఓ పనికి మాలిన

ముసలి భర్త వున్నాడనీ ఈమె వేసే ఎంగిలి మెతుకులకు ఆశపడి అతను ఏమీ పట్టించుకోనట్టుగా వుంటాడనీ పిచ్చామె బాబాగారికి చెప్పిందట.

ఆ కన్నీటి కథవినగానే సజ్జన్ చలించిపోయాడు. ఏదోవిధంగా ఈ రహస్యాన్ని ఛేదించాలన్న పట్టుదల అతనిలో గాఢమైంది. కర్నల్‌తో ఈ విషయం గురించి అతను సంప్రతించాడు కూడానూ. మండలి గురించి కర్నల్ కూడా ఇంతకు ముందు కొన్ని పుకార్లు విన్నాడు. సెక్రటరీ పూర్తిగా అవినీతి పరుడనీ అనరక కూపంలో కాలు పెట్టవద్దని కర్నల్ సజ్జన్‌కి హితవు చెప్పాడు.

కాని రహస్యాన్ని రాబట్టుదామన్న పట్టుదలతో సజ్జన్ ఆ మాటలు చెవిని పెట్టలేదు. అతని గుండెలో రగుల్కొన్న చిచ్చు వాళ్ళ బతుకుల్ని బజారుకు ఈడ్చేవరకు ఆరేలా లేదు. అయితే తన పథకం వివరాల్ని అతనెవరి ముందు బయటపెట్ట లేదు. వనకన్య పేరిట రెండు మూడు పర్యాయాలు రెండు యేభై లు పంపించాడు మండలి సెక్రటరీకి చందా రూపంలో. అంతే, ఇదేదో బంగారు పిచ్చుకలా వుందని సెక్రటరీ సజ్జన్ వెంటపడటం ప్రారంభించాడు. తరచూ అతణ్ణి కలుసుకోవడం మొదలెట్టాడు. ఓ పర్యాయం మండలిలో వుపన్యాసం ఇప్పించేందుకు కన్యను కూడా ఆహ్వానించి తీసుకెళ్ళాడు సెక్రటరీ. కన్య పెద్దమ్మ ఇంట్లో నడపుతోన్న స్కూలుకు వెళ్ళే సమయంలో సెక్రటరీని రహస్యంగా కన్య పిలిపించినట్టుగానే ఇంటికి పిలిపించాడు సజ్జన్. సెక్రటరీ రెక్కలు కట్టు కుని సజ్జన్ పాదాలముందు వాలాడు. అతను వాలే వేళకు చుట్టూ బ్రాందీ సీసాలూ అంతా సరంజామా పెట్టుకుని కూర్చున్నాడు సజ్జన్. సెక్రటరీ రాగానే అడిగాడు- ఏమిటి యిలా వచ్చారు ? అన్నట్టుగా.

"ఏమీలేదండీ. దేవిగారు ఎందుకో రమ్మనమని కబురుపెట్టారు. ఈ వేళకు తమ యింటికి రావలసిందిగా వారే వర్తమానం పంపించారు" అంటూ సెక్రటరీ సంజాయిషీ చెప్పుకున్నాడు.

"ఆమెగారు లేరు. బహుశా ఏదైనా అవసరమైన పనిమీద బయటికి వెళ్లి వుంటారనుకుంటాను. రండి ఇలా కూర్చోండి. వస్తూనే వుండొచ్చు. అందాక ఈ అమృతాన్ని కాస్త సేవించండి" అని సజ్జన్ గ్లాసు అందించాడు.

హ్హి హ్హి అంటూ నవ్వుతూ "అబ్బే లేదండి. తాంబూలం, పుగాకు మినహా మరేమత్తు పదార్థాన్ని నేను ముట్టనండి. రామ రామ" అంటూ లెంపలు వేసుకు తున్నాడు సెక్రటరీ.

"అరే. చాల్లేవయ్యా నువ్వా, సిరి శ్రీరంగనీతులా! స్వర్గంలో వుంటూ అటేకాసర్[1] అంటే భయపడతావు. అబేజమ్[2] జమ్ సేవించనని మహా నింగి నాదాలా మాట్లాతున్నావ్" అంటూ కొద్ది సేపటిలో సెక్రటరీని బుట్టలో వేసుకున్నాడు సజ్జన్. సజ్జన్ వాక్చాతుర్యం కన్నా అతని అభిజాత్యం చూసే నిజ స్వరూపాన్ని బయట పెట్టాడు సెక్రటరీ. తన మార్గం, వనకన్య మార్గం వేరు వేరనీ ఎవరి ఇష్ట ప్రకారం వాళ్ళు నడుచుకుంటామనీ మాటల సందర్భంలో సజ్జన్ చెప్పాడు. వనకన్య మూలంగా సంఘసేవ ఇటువంటి నాటకాలు తను ఆడుతుంటాననీ చెప్పాడు. తన జీవితంలో జరిగిన రొమాంటిక్ సంఘటనల్ని వున్నవీ లేనివీ కల్పించి అతనికి చెప్పాడు సజ్జన్. తాను ఇంట్లో స్టూడియో పెట్టి

---

1. ఇస్లాం మతం ప్రకారం స్వర్గంలో వుండే నీటికొలను. ప్రళయం తర్వాత జీవులంతా మహమ్మదు ప్రవక్త దగ్గరకు చేరతారనీ, అప్పుడు వాళ్ళ ఆత్మలూ ఎంతో దాహంకొని వుంటాయనీ ప్రవక్త వాళ్ళకు ఆ కొలను నీరు తాగిస్తాడని అంటారు.

2 కాబా దగ్గర వున్న ఓ బావి. ఇబ్రహీం ప్రవక్త కుమారుడైన ఇస్మాయిల్ అమితంగా దప్పికతో బాధపడుతూ కాళ్ళతో మట్టి తొలగించు తోంటే నేలలోంచి ఓ జల అకస్మాత్తుగా లేచిందనీ అంటారు. ఎక్కడికో వెళ్ళిన అతని తల్లి హాదిరా తిరిగిరాగా కొడుకు నీటిలో ఆడుకుంటూ వున్నాడు. అతని పక్కగా నీరు ప్రవాహంలా పారుతోంది. ఆ వింతను చూడడానికి ఆ చుట్టుపక్కల వూళ్ళ వాళ్లంతా వచ్చారనీ దానికే ఒక బావి ఆకారంగా నిర్మించారని అంటారు. ఈ బావి నీరు చాలా పవిత్రమైనదని మహమ్మదీయుల నమ్మకం. హజ్ యాత్రకు అంటే మక్కా యాత్రకు వెళ్ళిన యాత్రికులు ఆ బావి నీటిని తమ తమ దేశాలకూ నగరాలకూ తీసుకుని వెళ్ళి కాశీ నుండి గంగను తెచ్చినట్టే బంధుకోటికి తీర్థంలా పంచడం ఆచారం.

దాని పేరిట ఎంతో మంది సుందరీ మణులను వశం చేసుకుని అనుభవించానని చెప్పాడు. అటువంటి సౌఖ్యం కోసం అవసరం అయితే పందల రూపాయలు ఖర్చు చేయడానికి కూడా తను వెనుకాడననీ చూచాయగా శక్రటరీకి చెప్పాడు.

శక్రటరీగారు అడుసులో కాలు వేశాడు సజ్జన్ మాటలు శెక్రటరీగారిని బోల్తా కొట్టించాయి. ధనపతి కూడా సజ్జన్‌ని వచ్చి కలుసుకుంది. ఈ సంఘటన జరిగిన రోజు నుంచి వనకన్యను కలుసు కోవటం మానేసాడు. సజ్జన్‌తోనే తిన్నగా రాకపోకలు ఎక్కువ చేసారు.

ఓరోజు మధ్యాహ్నం భోజనానికిసజ్జన్‌ని ఆహ్వానించింది ధనపతీశాస్త్రిణి. ముందు కొంచెం సందేహించినా చివరికి వెళ్లడానికే తీర్మానించు కున్నాడు సజ్జన్. ఆరోజు కాని వాళ్ళ తంత్రం అంతా అతనికి తెలిసిరాలేదు. శ్రీమతి సుందర్ బీబీదౌతవ్య ఔషధాలయానికి, మండలికి మధ్యవున్న ఫ్రెండ్స్ ట్రేడింగ్ కార్పొరేషన్ భవనం మండలిలోకి పురుషులూ, స్త్రీలూ వెళ్ళి రావడానికి రహదారిగా వుపయోగించ బడుతోంది. అసలు యిది షేరు మార్కెటుకు సంబంధించిన సంస్థ అయినా మండలి పోషకురాలిగా వుంటోన్న ఓ పెద్ద షావుకారుతాలూకు కొంత మంది గుమాస్తాలు అక్కడ పని చేస్తుంటారు. షేర్ల అమ్మకం కొనుగోలు అక్కడ నామమాత్రంగా జరుగు తుంటుంది. అదొక వంకగా పెట్టుకుని మండలికి వెళ్ళేవాళ్ళు వచ్చే వాళ్ళు ఆ మార్గాన్ని వుపయోగించుకోవడానికి అది సులువుగా వుంటుంది. ఈదారి గుండానే సజ్జన్ లోపలికి వెళ్ళాడు. లోపలికి వెళ్ళగానే అతనికి ఎదురుగా మూడు గదులున్న ఓ గది కనిపించింది. ఆ గదిలోంచి మూడు చిన్న గదులు ఒక యిటుక మందంతో కట్టి వున్నాయి సుందర్‌దౌతవ్య ఔషధాలయం, ఫ్రెండ్స్ ట్రేడింగ్ కార్పొరేషన్, మహిళా సేవా మండలి లోపలగా ఒకదానిలోంచి ఇంకొక దానికి వెళ్లడానికి వీలుగా తలుపులు యేర్పాటు చేసి ఒకే బిల్డింగు కింద కట్టారు. శ్రీమతి ధనపతి శైష్య, సజ్జన్‌ని ఓ గదిలోకి తీసుకెళ్ళింది. ఆ గదిలోంచి చూస్తే మహిళా సేవా మండలి లోని కుట్టుపని గదీ, అల్లికగదీ మొదలైన గదుల్లో ఎవరెవరు వున్నది వాళ్ళు ఏమేమి చేస్తోందీ స్పష్టంగా కనపడు తుంది. సజ్జన్‌ని అక్కడ కూర్చోబెట్టి లోపలికి

వెళ్ళింది ధనవతి. వెళ్ళిన కొద్దిసేపట్లోనే తిరిగి వచ్చింది. కిటికీకి దగ్గరగా కూర్చొన్న సజ్జన్‌నిలేపి మరో కిటికీ దగ్గరకు తీసుకెళ్ళింది. ఆ కిటికీలోంచి ఓ గది కనపడుతుంది. దాన్లో పది పన్నెండు మంది స్త్రీలు కలిసి టీ తాగుతున్నారు. వీళ్లంతా వేశ్యా వృత్తికి ప్రయోగించబడే వాళ్ళు. ఎవరైనా కొత్త ఖాతా వస్తే అతనికి ఈ కిటికీలోంచి ఆవతలి ఆడవాళ్లను చూపిస్తుంటారు. అతనికి ఎవరు నచ్చితే ఆ స్త్రీని అతని దగ్గరకు పంపించడం జరుగుతుంది. వాళ్ళ మాటలు వింటూ నిలబడ్డాడు సజ్జన్. కాపురాల గురించీ, తమ తమ భర్తల గుణగణాలను గురించీ, బంధువర్గం గురించీ, ఇక్కడకి రావడానికి వాళ్లు యేయే నాటకాలు ఆడేదీ, మిషలు చెప్పేదీ, ఇంకా సరసుల గురించీ విలాసాల గురించీ వాళ్లు ముచ్చటలాడు తున్నారు. సజ్జన్‌కి ఇంచు మించుగా అంటుకుని నిలబడి ఆ స్త్రీల గురించి చెబుతోంది ధనవతీ రాజవైద్య. ఇద్దరి ఆడవాళ్ల గురించి వాళ్ల భర్తలు ముసలి వారని చెప్పింది. మరొకామె గురించి చెపుతూ ఈ పడుపువృత్తి వల్ల వాళ్ళకి మాత్రంగానైనా కడుపు నిండుతుందనీ, తాను వాళ్ళ దేహానికీ, మనస్సుకూ, డబ్బుకూ సంబంధమైన ఆకలి దప్పులు తీరుస్తుంటాననీ ఇదంతా పుణ్యకార్యం అనీ ఏమేమో చెప్పింది.

ధనవతీదేవిని చూస్తోంటే సజ్జన్‌కి గాభరా ఎక్కువైంది. అతని అదృష్టం కొద్ది ఆరోజు యే అప్సరసను పిలవలేదు రాజవైద్యగారు.

రెండు మూడు రోజులు విడవకుండా వెళ్ళాడు సజ్జన్ మహిళా మండలికి. తన మీద పడుతోన్న ధనవతిదేవి హావభావాల్ని, శృంగారపు చేష్టల్నీ ఎలాగో సహించగలిగాడు సజ్జన్. ఆమెకు సంతోష పెట్టడం కోసం రెండు వందలయేభై రూపాయలు కిమ్మతుగల ఓ గడియారాన్ని కూడా బహూకరించాడు.

ఈ రెండు మూడు రోజుల మహిళా మండలి సందర్శన ఫలితంగా అతనికి వ్యక్తిగతంగానూ, సాంఘికంగానూ కొన్ని అనుభవాలు కలిగాయి. తన గురించి కలిగిన అనుభవాన్ని చూసి అతనే ఆశ్చర్యపోయాడు. కొన్ని నెలల క్రితం వరకు ఈ సజ్జన్ అటువంటి పాప కృత్యాల్ని పైకిగర్హిస్తోనే లోలోపల వ్యామోహపడే వాడు. అప్పుడేగనుక అతనిక్కడికి వచ్చివుంటే అతను వాళ్ళ

వంలో చిక్కుకుని పోయ్యేవాడు. కాని ఈనాడు అదృశ్యాలే అతనిలో వెరుపునూ, కోపాన్నీ కలిగిస్తున్నాయి. కన్యతో వివాహానికి ముందు అతని మనస్సు అంతః సంఘర్షణకు ఆటపట్టై వుండేది. అదే మనస్సులో వివాహం అయిన లగాయితూ కొత్త ఆత్మ విశ్వాసాన్ని సంతరించుకుంది. అతని ఆలోచనలు పరిణత దశకు వచ్చాయి. ఇవన్నీ కలిసి అతని మానసిక నిర్మాణాన్ని మరో విధంగా మలిచాయి. మహిళా మండలికి వెళ్ళినప్పుడల్లా సజ్జన్ ఇలాంటి అనుభవాన్నే పొందేవాడు. స్త్రీకి స్వాభిమానం, శీలం, సమర్పణబుద్ధి అంటూ వున్నవనీ వనకన్య అతనిలో స్త్రీపట్ల ఓ కొత్త ప్రమాణాన్ని సృష్టించింది. అతని జీవితాన్నే అత్యున్నత శిఖరాల మీద తీసుకెళ్ళింది. ఒక్క కన్న తల్లి మినహా అతను ఏ ఆడపడచుకూ ఇంతటి ఆదరణా, గౌరవం, ప్రతిష్ఠా యిచ్చినవాడు కాదు. కాని అతని భార్యే ఆచరణలో స్త్రీకుండే ఔన్నత్యాన్ని చూపించి అతని హృదయంలో గొప్ప పీఠాన్ని సునాయాసంగా ఆక్రమించుకుంది అసలు వనకన్యను గౌరవించడంతోనే అతని జీవితం ఓ కొత్తమలుపు తిరిగింది. అతని నారీ దృక్పథంలో పెద్ద విప్లవం వచ్చింది. యవ్వనంలో వున్న ఓ అందమైన స్త్రీని చూడగానే అతనిలో కలుగుతుండే చాపల్యం ఇప్పుడు లేదు. మహిళా మండలికి ఈరెండు మూడు రోజుల నుంచి అతను వస్తూపోతూ ఆడవాళ్ళ విషయంలో తన దృష్టి ఎలా మారిందీ గ్రహించాడు. మండలిలో జరుగుతోన్న పాపకృత్యాలతో తన పూర్వానుభవాల్ని జోడించి ఆడవాళ్లు ఈ దారిని తొక్కడానికి కారణాలు ఏమిటీ అని తెలుసు కున్నాడు. దబ్బుగల ఆడవాళ్ళు తమ లైంగికానందం కోసం ఇక్కడికి వస్తారు. వాళ్ళ భర్తలు వాళ్ళను మోసం చేస్తారు. వాళ్ళూ తమ భర్తల్ని మభ్యపెట్టి వ్యభిచారం చేస్తుంటారు. ఇక నిస్సహాయులైన వితంతువులు ఆకలికు లొంగి ఇటువంటి మార్గాల్ని అవలంబిస్తారు. మన సంఘ నిర్మాణంలోనే వితంతువంటే నిర్లక్ష్యపూరితవైఖరి వుంది. ఆర్థికంగానూ, సాంఘికంగానూ రెంటిలోనూ ఆమె ఆశ్రితగా వుండడమే దీని కారణం. పుణ్యం కోసమనీ, కుట్టు పనికనీ, వృత్తిపనులు నేర్చుకుంటాని కనీ వీళ్ళు ఏవేవో కోరికలు పెట్టుకుని ఇక్కడకు వస్తుంటారు. కొంత మంది మధ్య తరగతి కుటుంబాల్లోని స్త్రీలు కూడా ఇక్కడికి వస్తూండడం కద్దు. అయితే వీళ్ళు గర్భ

దారిద్ర్యాన్ని పోగొట్టుకోవడం కోసం రారు. జీవితం గురించి వీళ్ళు రకరకాల రంగు రంగుల కలలు కంటుంటారు వాటిని పండించుకోవడానికి తగిన ఆర్థిక స్తోమత వారికి వుండదు. ఆరంగు రంగుల కలల్ని పండించుకోవడానికి కావలసిన స్తోమతను పెంచుకోవడానికి ఈ తరగతి వారు ఈ నిదానికి ఒడికడతారు. వివాహానికి ముందు ఏవేవో ఊహాసౌధాలు నిర్మించుకుని తీరా వివాహం కాగానే తమ ఆర్థిక పరిమితుల్ని చూసి హతాశులవుతారు. భర్త గీతలోపలే వుండవలసి వచ్చినందుకు పరితపిస్తారు. రాత్రింబవళ్లు మొగుడితో కొట్లాటలతో సతమతమవుతుంటారు. నేటి సినిమా వ్యామోహంలో పడికొట్టుకుపోయి తమ అందచందాల మీద మోజుపడి ఆకాశంవృయ్యాల మీద వూపగల హీరో- ఓ నాయకుడు ఎవరు దొరుకుతారా అనివేటాడుతుంటారు. సంగీతంనేర్పుతాంఅంటూనృత్యంనేర్పుతాం అంటూ యవ్వనంలో ప్రవేశించి రతి భోగాన్ని చవిచూడాలని తహ తహలాడుతుండే యుక్త వయస్సు వచ్చిన పిల్లలను కూడా ఇటువంటి సంస్థల్లో చేర్పించి వాళ్ళచుట్టూ పారిపోవనిదాకి వీలులేని విషవలయాన్ని అల్లడం సర్జన్ చూసారు. ఇంకో తరగతి అవివాహితలు వున్నారు. వయస్సులో వున్నప్పుడు ఏవేవో లోపాల కారణంగా వివాహంకాక వయసు ముదిరిన తర్వాత వరుడు దొరక్క వుంటారు అడది చెడు మార్గాన్ని ఒకసారి తొక్కిన తర్వాత ఆమె జీవితంలో తిరుగులేని మార్పు రావడం సహజం. నిత్యం కుట్రా, కుత్సితం, అభిప్రాయ భేదాలతో సాంఘిక క్రమ శిక్షణను, కట్టుబాట్లనూ వాళ్ళు మరిచి పోతారు. మనం చేసే ఈ దుర్మార్గంలో ఎంత మంది ఎక్కువగావుంటే అంతంత శ్రేయస్కరం అన్న మనోధృక్పథాన్ని వాళ్ళు [illegible] చేస్తుంటారు. కొంత మంది సరళ [illegible] [illegible] దుర్మార్గ ప్రవృత్తంతో [illegible]

ఈ [illegible] [illegible] ప్రతిమాలా [illegible] మంది సదసత్త, [illegible] కొడుతో [illegible] ఇయుట తగిలించిన

సైను బోర్డులకున్న విలువే ఈ గుర్తింపులకు సాంఘికంగా విలువవుంది. చిత్రా రాజదాస్ మొదలుకుని ధనవతీ వైద్యవరకు— మహిళా మండలికి వచ్చే ఎంతో మంది పరువుగల కాపురాల్లోని ఆడపడుచుల వరకు— ఏ స్త్రీని చూసినా ఆమెలో నారీత్వం కన్నా కులట లక్షణాలే ఎక్కువగా కనిపించ సాగాయి. అలంకరించిన వరాండాలూ కిటికీల్లోనూ ప్రదర్శన వస్తువులా కనిపిస్తోన్న వారకాంతను. యుగాల నుండి నిండు కొలువులో ద్రౌపదిలా బహిరంగంగా మనం నిలబెట్టిన ఈ కోమలాంగులను మనం అంటరాని వారనీ ఏవగించు కుంటాం. కాని ఇంటి పేరు కస్తూరివారమనట్లుగా మతం. ధర్మం, పవిత్రత, సదాచారం అంటూ పై పూతలు పూసుకుని రహస్యంగా వేశ్యావృత్తికే కళంకం తెస్తోన్న ఈ అపర వేశ్యలను మనం ఎందుకు బట్టబయలు చేయరాదు? పాతివ్రత్యానికి విలువకట్టే సంఘమే వాళ్ళ పాతివ్రత్యాన్ని కొల్లగొట్ట డానికి ఇటువంటి ఆటపట్టుల్ని నిర్మి స్తోంది. ఇలాటి దొంగ పతివ్రతల బ్రతుకుల బండారం బైటికి ఎందుకు లాగం? ఆలోచనలతో సజ్జన్ ఉక్కిరిబిక్కిరై పోయాడు. సంఘంలోని కుళ్లును బయటికి లాగితే సంఘానికి మేలు కలుగుతుందా? అలా చేస్తే సర్వత్రా సిగ్గుమాలిన తనం, తెగింపు ఏర్పడవు కదా! ఉన్నతాదర్శాలంటూ కొన్నింటిని సృష్టించు కున్నాం గనకనే వాటికి వెరచి దొంగచాటుగా ఈ ఘోర పాపాలు చేస్తున్నారు. అవి తీసేసిన రోజు అందరూ బరితెగించి సిగ్గుమాలిన వాళ్లై పోతే, అలాంటి సంఘాన్ని వూహించు కుంటేనే భయంతో ఒళ్లు జలదరిస్తోంది.

ఆ నరక కూపంలో మళ్ళీ పొరపాటునైనా అడుగు పెట్టొద్దని హెచ్చరిం చాడు కర్నల్. కాని అతని మాట వినకుండా మండలిలోకి దూరి అతను ఎంతో అనుభవాన్ని గడించాడు. మళ్ళీ బాబాగారి ప్రేరేపణా పోలీసుల సహాయంతో వ్యభిచారాన్ని అనైతిక వ్యాపారాన్ని తుదముట్టించాలని సంకల్పించు కున్న తర్వాత కర్నల్‌కి మహిళా మండలి పరిస్థితులన్నీ వివరించి చెప్పాడు. పరాయి వాళ్ళు కష్టంలో వున్నారని తెలిసినంత మాత్రానే కరిగిపోయే కర్నల్ ఈ విషయంలో సజ్జన్‌కి సహాయం అంద చేయడానికి ముందుకొచ్చాడు. అధికార్లు చాలా మందితో సజ్జన్‌కి పరిచయం అయితే వుందికానీ కర్నల్ మోస్తరుగా

అంత గాఢపరిచయం లేదు, కర్నల్ అంటే అందరికి వ్యవహారాలు, మిఠాయీలు పంపుతాడు. అందరితో కలిసి తిరుగుతుంటాడు. "ఈ వ్యవహారంలో పోలీసు సూపర్నెంటును వెళ్ళి కలుసుకో. నేను కూడా నీకో పాటు వస్తాను" అని అన్నాడు కర్నల్‌తో సజ్జన్.

"నువ్వు తిన్నగా మంత్రిగారిని కలిస్తే బావుంటుందని నా అభిప్రాయం. కొన్ని కొన్ని సందర్భాల్లో పోలీసు సూపర్నెంటులు కూడా షమ్మక్కు అవుతుంటారు. నీకివన్నీ కిటుకులు తెలియదు. నీకో సంఘటన కావాలంటే చెబుతాను. అలీగఢ్‌లో ఆడవాళ్ళను ఎత్తుకుని వచ్చి విక్రయించే ఓ కేంద్రం వుంది. ఆ కేసుతో ఐదుగురు డిప్టీ సూపర్నెంట్లూ ఒక ఎ. ఎస్. పీ. కి సంబంధం వుంది. ఉత్తర ప్రదేశ్ సీ. ఐ. డీ. శాఖ వాళ్ళు ఈ కేసును నిర్ధారించి పట్టుకున్నారు" అంటూ కర్నల్ తన అనుభవాన్ని ఏకరువు పెట్టాడు.

ఆ సమాచారం విని సజ్జన్ బిత్తర పోయాడు. "మరి ప్రభుత్వం కిమ్మనకుండా వూరుకుందా" అని ప్రశ్నించాడు.

"అందరినీ ఉద్యోగాల నుండి తీసేశారు. ఒక్క పోలీసు సూపర్నెంటుని మాత్రం తీయకుండా అతనిచేత ఉద్యోగానికి రాజీనామా ఇప్పించారు. అందుకనే అంటున్నా–"

కర్నల్ మాటను ఖండిస్తూ అన్నాడు సజ్జన్– "మంత్రిగారిని కలుసుకునే బదులు వీళ్ళను పట్టుకుని పని నెరవేర్చాలనే నా అభిప్రాయం. వీళ్ళందరికీ మండలితో సంబంధం వుంటుందనే విషయాన్ని నేను అంగీకరించలేను. పోలీసు శాఖలో బాధ్యతారహితమైన వ్యక్తులు ఎక్కువ పాళ్ళలో వున్నారనడం వాస్తవమే కాని అందరూ అలా వుండరు కదా! ఎంతచెప్పినా వాళ్ళకూ గౌరవం అనేది ఒకటుందిగా!"

"సరే మంచిది మంచి వాళ్ళు కూడా వుంటారు. కాని బహుకొద్ది మంది మాత్రమే. ఈరోజుల్లో తమ లక్ష్యానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తూ మనిషిని రాక్షసిగా తయారు చేస్తున్నది పోలీసు శాఖ."

"పోనీ అలాగనుకుంటే రిన్నగా ఓ పార్లమెంటు సభ్యుడి దగ్గరకే వెళదాం. ప్రతి పనికి పై నుండి ఆశ్రయాన్ని యాచించి దిగడం అనేది అంత మంచి పద్ధతి కాదు. ముఖ్యంగా ఇటువంటి కార్యాల్లో అది పనికిరాదు. ప్రతివ్యక్తి సద్భావం కలవారు అని ఆలోచిస్తూ మనం కార్యరంగంలో దూకాలి".

ఈ సంభాషణా ఈ పథకం గురించి కన్యకు ఇంతవరకు ఏమీ తెలియదు.

అందరికీ సామాన్యంగా అందుబాటు కాని "ఉద్దీపన సామగ్రిని" ఇవ్వాళ తప్పక అంద జేస్తానని ధనవతీదేవి వైద్యశాస్త్రిణి వాగ్దానం చేసింది సజ్జన్‌కి. ఇవ్వాళ స్త్రీ పురుషుల జంటల్ని చూపిస్తానని కూడా ఆమె సజ్జన్‌కి మాట ఇచ్చింది. సజ్జన్ అంటే ఎందుకో ఆమె ఆకర్షింపబడుతోంది. మహిళా మండలికి వచ్చే వాళ్ళలో ఎంతో మంది శ్రీమంతులూ, పేరు మోసిన వకీళ్ళు, వ్యాపారులూ వున్నారు. అయినా కూడా సజ్జన్ మోస్తరు పేరూ ప్రతిష్ఠలు కలిగినవాడూ, బాగా చదువుకున్న వ్యక్తి, అందగాడూ, చిత్రకారుడూ అన్ని ప్రత్యేకతలు ఒక్కచోట మూర్తీభవించిన వ్యక్తి ఆమె ఎరికలోకి ఇంతవరకు రాకపోవడమే అతని ఆకర్షణకు కారణం కావచ్చు. మాటల్లో చెప్పాలా, అతవాళ్ళ అరమూర చూరానవుంచే గిలిగిలింతలు పెట్టడంలో చట్టపై వ నేరస్థురాలై ధనవతి మనసులో మరులు కొలిపి, మధుర స్వప్నాలు. చేసాడు ఒకసారి సెక్రటరీతో కలిసి ఆమె అతని విశాలమైన మహాలు చూడ్డానికి కూడా వచ్చింది. శ్రీమంతుల పెద్ద పెద్ద భవనాల్ని ఆమె ఇంతకు ముందు ఎందరివో చూసింది. సజ్జన్ మహాలుకున్న ప్రత్యేకత ఆమెకు ఎక్కడా కనిపించలేదు. ఎక్కడ చూసినా అందంగా చెక్కిన సుందర శిల్పాలూ అమూల్యమైన తివాసీలూ, ఉత్కృష్టమైన నగిషీపని, గొప్ప గొప్ప చిత్రకళా ఖండాలు, దేశ విదేశాలను-వి వరికోరి సేకరించిన వింత విచిత్రమైన అపూర్వ కళా కృతులూ, వస్తువులూ, రాజకీవి స్వర్గీయులతోన్న రాజమహల్ లాంటి అతని బంగళా ఇవన్నీ ఆమె లోకంలో చూసిన ఏ ఇంటిలోనూ కనపడలేదు. బహుశా ఇన్ని ప్రత్యేకతలు సజ్జన్‌లో పొందడం వల్లనే అనుకుంటా ఆమెకు అంత మోజు ఏర్పడి చివరికామె తాళ్ళను ఆమె గోష్ఠిలోనే సమావేశానికి పరోక్షంగా సజ్జన్‌కి సహాయ పడుతోంది

రోజు కంటే కొంచెం ముందుగానే ఇవ్వాళ మహిళా మండలి చేరు కున్నాడు సజ్జన్. అతను కూర్చోవ డానికి ధనపతీ వైద్య తన స్వంత గదిలో యేర్పాట్లు చేసింది. అతణ్ణి తన గదిలో కూర్చోపెట్టి ఆమె ఎక్కడికో వెళ్ళింది.

గదిలో ఒంటరిగా కూర్చున్న సజ్జన్ మనస్సు మంచీ చెడూ ఆలోచనతో నిండిపోయి దిక్కుతోచక వేదెక్కిపోతోంది. అదీ కాక ఇవ్వాళ్టి పరిస్థితి కూడా వేరు. అడుగడుగున పోలీసు వాళ్ళు మాటువేసి దాక్కొనారు అతను సొంజ్ఞ ఇవ్వడమే ఆలస్యం వాళ్ళంతా మండలి మీద మెరుపు దాడి చేసి ఈరోజు వాళ్ళ ఆటకట్టించ డానికి సిద్ధంగా వున్నారు. సజ్జన్‌ని తమ మిత్రకోటిలో ఓ సభ్యుడిగా భావించి తమ నిజస్వరూపాల్ని బట్టబయలు చేసుకున్న శ్రీకటకి ధనపతి వైద్య ఇవ్వాళ సజ్జన్ నిజస్వరూపాన్ని తెలుసు కుంటారు. అందుకనే సజ్జన్ ఆమె ముఖంలోకి సూటిగా చూసి మాట్లాడలేక పోతున్నారు. ముఖం తప్పించేసి మాటాడు తున్నారు.

ఎదురుగా వున్న గదిలో ధర్మ శాస్త్రం గురుంచి వుపన్యాసం జరుగు తోంది. శ్రీమద్భాగవతాన్ని పఠిస్తున్నారు శ్రీకటకిగారు. భాగవతంలోని గోపికా వస్త్రాపహరణం గురించి చెప్పుక పోతున్నారు- "భగవంతుడైన శ్రీకృష్ణుడు గోపికలు జలకాలు ఆడుతోందే వాళ్ళ వలువలు ఎత్తుకుని పోయి పొన్న చెట్టు మీద ఎక్కి కూర్చున్నాడు. గోపికలు నగ్నంగా నిలబడి స్నానం చేస్తున్నారు..."

సజ్జన్‌కి కాలక్షేపం కోసం రెండు మూడు పుస్తకాలు ఇచ్చి వెళ్ళింది ధనపతి. నాస్నేపు పోతే స్వర్గలోక దృశ్యాల్ని ఇక్కడ చిత్రిస్తాం, ఆనందించాలి అంటూ చెప్పి వెళ్ళింది. ఒక్కొక్క పుస్తకం ఒకో సెక్సుబాంబు. దానిలో అన్నీ రతిక్రీడకు సంబంధించిన దృశ్యాలే. అలాంటి పుస్తకాలు సజ్జన్ ఎన్నో చూశాడు. చదివాడు. కూడాను. అతను దేశాన్నంతా తిరగ డానికి వెళ్ళినప్పుడు ప్రతి టూరిస్ట్ హోటల్లో అతనికి ఇటువంటి సాహిత్యం కావలసినంత దొరికేది. అయితే తనకు దొరికిన సాహిత్యం అంతా ఇంగ్లీషులో వుండేది. కాని ధనపతి ఇచ్చిన రెండు పుస్తకాలు మన్మథ క్రీడలకు సంబంధించినవే అయినా అవి

హిందీలో వుండటం చూసి అతనికి ఎబ్బెట్టుగా తోచింది. రెండు పేజీలు చదవ గానే అతని రక్తం కోపంతో వుడికి పోయింది. వెంటనే మూసేశాడు.

గోపికా వస్త్రాపహరణం గురించి సెక్రటరీగారు చేస్తున్న ధర్మ ప్రవచనం స్పష్టంగా వినబడుతోంది. గోపికల వలువల్ని దొంగలించిన శ్రీకృష్ణుని గురించి ఎంతో తన్మయంగా చెప్పుకు పోతున్నారు సెక్రటరి. వింటోంటే సజ్జన్‌కి నవ్వొ స్తుంది. వస్త్రాపహరణ లీలను వ్యాసమహర్షుల వారు ఒక మహత్తర లక్ష్యంతో చేర్చారేమో. ఈ సెక్రటరీ దానికి తన రంగు పులిమి ఏదేదో చెప్పు తున్నాడు. ఈయన చిత్రిస్తున్నట్టుగా కృష్ణుడే మహా రసికుడైతే వందల శతాబ్దాలు దాటిన తర్వాత కూడా మరి ప్రజానీకం దైవంగా ఎందుకు పూజి స్తున్నట్టు? కృష్ణుడు, రాధ, గోపికలు యావత్తు బృందా వనంతోనూ సజ్జన్‌కి గాఢమైన మానసిక సాన్నిహిత్యం వుంది. మధుర, బృందావనం గోవర్ధనపర్వత యాత్రచేసి వచ్చి నప్పటి నుంచి ఆ పౌరాణిక పాత్రలంటే ఎంతో ఆత్మీయత పెంచుకున్నాడు. కృష్ణుడు ఆయన దృష్టిలో మహిమాన్వితుడు. పూర్ణ పురుషోత్తముడు. ఆత్మకూ పరమాత్మకూ వుండే ఈ అనురాగాన్ని, అవ్యాజ మైన ప్రేమను కామకేళిగా వ్యాసుడూ, జయదేవుడూ ఇంకా ఎంతో మంది కవులు ఏ ఉద్దేశ్యంతో చిత్రించినట్లు? పూరీ జగన్నాథం ఖజురాహోలోని కందరియా మహాదేవుని దేవాలయంలో పూజా స్థలాల్లో కామ సూత్రాల్ని ఆధా రంగా తీసుకుని రకరకాల బంధాలు చిత్రిస్తూ శిల్పాల్ని ఎందుకు చెక్కినట్లు? ఈ పుస్తకాల్ని అశ్లీల సాహిత్యం కింద జమకట్టి చట్ట విరుద్ధమని ప్రకటించిన ప్రభుత్వం పూరి జగన్నాథ్ ఖజురాహో దేవాలయాల మీద చెక్కిన ఈ బూతు బొమ్మల్ని ఎందుకు సహించి వూరు కుంటోంది? వెయ్యి, పన్నెండు వందల సంవత్సరాలు గడిచినా ఆ దృశ్యాల్ని అశ్లీలం అంటూ ఎవరు ఆదేవాలయల్ని పడగొట్ట లేదు. ఆ విగ్రహాల్ని ధ్వంసం చేయలేదు. తాను ఆ క్షేత్రాల్లో బూతు బొమ్మల్ని చూసినప్పుడు అందులో చిత్రించిన విషయాన్ని పరికించగా తనకూ గగుర్పాటు కలిగింది. అయినా వాటిని శిల్పం దృష్ట్యానే పరిశీలించాడు సజ్జన్ ఆ రాతి బొమ్మలు ఎంతో అందంగానూ, ఎంతోశిల్పకళ వుట్టిపడు తున్నట్టుగా

వున్నాయి. వాటి శిల్ప సౌందర్యం చూసి తీరాలి. సజ్జన్ అనుకున్నాడు- "నేను కళాకారుణ్ణి కనక నా దృక్పథం సహజంగా వేరుగా వుంటుంది. కాని సగటు మేధస్సుగల వ్యక్తి దృష్టిని ఆ శిల్పసంపద ఎంత వరకు ఆకర్షిస్తోన్నట్టు? గోపికా వస్త్రాపహరణం, రాధా కృష్ణుల ప్రేమ, గోపికలు కృష్ణుడూ చేసిన విహార లీలల్ని ప్రజానీకం కీర్తనలుగా పాటలుగా, భజనల రూపంలో దేనికని ఇంతగా స్తుతి చేస్తున్నట్టు? ప్రాచీన సంస్కృత వాఙ్మయంలోనూ, వాల్మీకి రామాయణంలోనూ కామ క్రీడలూ, హావభావ ప్రకటన గురించి స్పష్టంగా నిర్ద్వంద్వంగా వేర్కొన్నట్లు మహీపాల్ ఓసారి తనతో అన్నట్టు జ్ఞాపకం. తాను కూడా చదివి నట్టుంది. కామ క్రీడలంటే ఓ వైపు వైరాగ్యాన్ని బోధిస్తూ మరోవైపు మన నైతికత్వం వాటికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వడానికి కారణం? వాస్తవం ఏది? స్త్రీ పురుషుని శారీరిక సంపర్కం వాస్తవమైనదే. ఎంతో ఉత్కృష్టమైనదని ఈ లైంగిక సంపర్కాన్ని సంఘం పొగడు తోందే దాన్ని ఆసరాగా తీసుకొని ప్రతి సామాన్య మేధస్సుకల వ్యక్తి ఎందుకు తొట్రుపాటు పడుతున్నట్టు? నాలుక ఒకటే అయినా ఒక సందర్భంలో వుత్కృష్టమైందనీ మరో సందర్భంలో అది నీచమైనదనీ మనమే అంటాం. ఒక్క భారత దేశంలో కాదు ప్రపంచం మొత్తం శతాబ్దాల తరబడి ఎగతాళి పందాంగాన్ని నిత్యం పతిస్తోనే వుంది. మనకున్న ఆర్థిక రాజకీయ సమస్యలు కన్న ఇది తక్కువ ముఖ్యమైందా? స్త్రీ పురుషుల సంపర్క సమస్య అనేక రాజకీయ ఆర్థిక సమస్యలకు పీఠికలా పని చేయడం లేదా?

బెంగాలు కరువులో సజ్జన్ కలకత్తా వెళ్ళాడు, అక్కడ తన విలాసానికి కావలసిన బొట్లను గురించి దర్యాప్తు చేసాడు. అలా చేస్తోన్న సందర్భంలో కరువు ప్రాంతాల్లోని చాల మంది స్త్రీలను కొనుక్కొని వాళ్ళను కలకత్తా తీసు కొస్తున్నట్లు సమాచారం తెలిసింది. టిక్కు వాళ్ళు బొటన వేలుకు గిల్లు తగిలించు కొని "టుక్‌టుక్ బాబూ" అంటూ టీసంగా అరిచేవాళ్ళు. వెళ్ళాన్న పోయితే ప్రపంచ అంతా వున్నాయి. కాని సంసారాలు చేస్తూ అదనీతి వ్యాపారం సాగించే వాళ్ళు అంతకన్న ఎక్కువ సంఖ్యల్లోనే ఎక్కువ పడిచేస్తుంది

వున్నారు. మరి వీళ్ళు ఆర్థిక సమస్యల్ని ఎదుర్కోవటం లేదా? స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలు రాజ్యాల గతులే మార్చడానికి ఉపయోగింపబడిన సందర్భాలు చరిత్రలో కొల్లలుగా వున్నాయి. రాజకీయ ప్రత్యర్థుల్ని వశపర్చుకోవడానికీ, వాళ్ళను ఉచ్చుల్లో బిగించటానికి చక్కని పిల్లల్ని చిన్నతనంలోనే ఎంపికచేసి క్రమ క్రమమైన మోతాదుల్లో వాళ్ళకు విషాన్ని తినిపిస్తూ వాళ్ళను విషకన్యలుగా తయారు చేసిన సందర్భాలు భారతదేశ చరిత్రలోనే ఎన్నో వున్నాయి. ఈ విషకన్యలకు సంగీతం నృత్యంలోనూ పురుషుల వశీకరణలోనూ ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చేవారు. వాళ్ళను ముద్దుపెట్టుకొన్నంత మాత్రాన, శారీరకంగా స్పర్శ తగిలినంతనే రాజులు ప్రాణాలు కోల్పోయే అలాంటి విష కన్యలను తయారు చేయమని చాణక్యుని సలహా దీని అర్థం స్త్రీ పురుషుల లైంగిక సంబంధాన్ని రాజకీయ ప్రయోజనాలకు వుపయోగించటమేగా! మన రాజతంత్రము. అర్థనీతి యావత్తూ ఈ లైంగిక సంబంధాల్ని చుట్టుకొనేగా వున్నాయి? మరి అలాంటి భయంకర పరిణామాలకు దారితీసే ఈ సమస్య గురించి మనం ఎందుకు వుద్యమాన్ని లేవదీయం?

1943 లో బెంగాలులో ఘోరకలి వచ్చింది. పబ్లిక్ రోడ్లమీద, మైదానాల్లో పరువూ, ప్రతిష్ఠా కోసం ప్రాకులాడే బెంగాలీలు లక్షలాదిగా చస్తున్న ఆకలి దావులకు ప్రతీకగా నిలిచిపోయారు. ఆకలికి ఎండిపోయి నీరసించి, తిండికి వాచివాచి తపిస్తూ, గిలగిలతన్నుకుంటూ భయంకరంగా మృత్యుదేవతకు బలి అయిన ఆ అమరవీరులు, ఉన్నత ఆదర్శాల డప్పు వాయించుకుంటూ పాశ్చాత్య యుద్ధరంగంలో బాంబులతోనూ టాంకులతోనూ పైశాచిక కృత్యాల్ని జరుపుతోన్న మన రాజనీతి ఆర్థిక నీతుల్లోని బండారాన్ని బయటపెడుతున్నట్టుగా కనపడ్డారు.

అలాగా మన అర్థనీతి రేపు స్త్రీ సమాజం పాతివ్రత్యాన్నీ, సతీత్వాన్నీ పరిరక్షిస్తున్నాం అంటూ వాటిని బజారుకీడ్చి, ఎగతాళిపందాంగంగా తయారు చేసి మానవత్వంలోని నాగరికతా, సంస్కృతుల్నే పూడ్చి వేసేస్తే ఆశ్చర్య పడనక్కర్లేదు. నిజంగా ప్రపంచం అలాంటి దుర్దినాన్ని చూచినరోజు దాని రూపురేఖలే మారిపోతాయి.

ఆలోచనల పరిధితో చుట్టుకున్న సజ్జన్ మనసు పాతాళానికి వచ్చిన పుండులా మహాలీవు పెట్టడం ప్రారంభించింది. ఆలోచనల్లో పరిసరాల్ని మరచిపోయిన సజ్జన్ ధనవతి వైద్య తన్ను చూసి వెగటు కలిగించేలా నవ్వు తోందే కాని అతని ప్రపంచంలోకి రాలేదు. నల్లనిచికిలి కళ్ళల్లో కాముకత్వాన్ని దిద్దుకుంటూ ధనవతి "విశ్వామిత్రుల వారు ధ్యాన సమాధిలో వున్నట్టున్నారు మీ మేనక వచ్చింది. ఇకనైనా తపో సమాధి వదలండి" అంటూ వెకిలిగా నవ్వుతూ అంది.

చాలా సేపటి నుంచి కాచుక్కూర్చున్న ప్రియునిలా సజ్జన్ నటించడానికి ప్రయత్నించాడు. కాని గంభీరమైన ఆలోచనల ఊబిలో ఇరుక్కుపోయిన అతని మనస్సు అతని ప్రయత్నాన్ని సఫలం కానీయలేదు.

ఎదురుగా గదిలో గోపీకృష్ణుల ప్రవచనం ఇంకా అతని చెవుల్లో గింగురు మంటోంది. గది బయట తలుపును మూసి లోపలి వైపుకున్న తలుపును మెల్లిగా తట్టింది ధనవతీ రాజవైద్య. "చంద్రకాంతా సంతతి" నవల్లోని విచిత్ర హర్మ్యంలా తోచింది సజ్జన్‌కి. నవ్వాలనుకున్నాడు. కాని చుట్టూ మాటున దాగివున్న పోలీసు బలగం జ్ఞప్తికి వచ్చి నవ్వు ఆపుచేసుకున్నాడు. ధనవతి సమక్షంలో వుండగా పోలీసులు చుట్టుముట్టి వున్నారన్న విషయం జ్ఞాపకం వచ్చేసరికిఅతను కొంచెం ముందూ వెనుకా ఆలోచించడం మొదలెట్టాడు. తనేదో అపరాధం చేస్తునట్టుగా తోచింది.

తలుపు లోపలికి తెరుచుకుంది. సజ్జన్ మీదికి కాముకత్వంతో కూడిన చూపులు విసురుతూ చిరునవ్వుతో సజ్జన్‌ని లోపలికి ఆహ్వానించింది. అపరాధం చేస్తున్నాననే భావన అతని మనస్సులో వృత్తాన్ని పెంచుకుపోతోంది మనస్సు లోనే ఓ మూల ముడుచుకున్న అతని నైతిక ఆదర్శాలు చోటు చాలక వూపి రాడక వుక్కిరిబిక్కిరి అవసాగాయి. అతనిలో ఆక్షణంలో కలిగిన ఆ మనో వికారం సందర్భానుసారంగా కాకపోయినా ఏదో వెర్రితలలు వేయబో తున్నట్టుగా అనుమానించాడు. కామాన్ని కప్పుకున్న ధనవతి కళ్ళ చూపులు

ఆమె చిరునవ్వు అతణ్ణి వెర్రిగా సర్వేట్టు చేయడమేకాక జుగుప్సాకరమైన గగుర్పాటుతోపాటు పులిసిన కల్లు కంపును ఆ ప్రాంతాన్నంతా వెదజల్లుతో న్నట్లుగా కనిపించాయి.

లోపల ఓ చిన్న ఇరుకైన గది వుంది. చీకటి. సజ్జన్ అడుగుపెట్టిన తలుపుకు ఎదురుగా లోపలికి మరో మూసివున్న గుమ్మం కనిపించింది. రోడ్డు వైపున గోడకు ఎత్తుగా ఓ చిన్న కిటికీ వుంది. ఆ కిటికీలోంచి సన్నని వెలు తురు గదిలోకి వస్తోంది. పెట్టెలూ, డబ్బాలూ, డాడీలతో నిండివున్న చెక్క బీరువాల వెనకగా తెల్లని దుప్పటి పరిచి చక్కగా అలంకరించి వున్న ఓ మంచం కనిపించింది సజ్జన్‌కి. మంచానికి పక్కగా ఓ సన్నని నాజూకు యువతి నిలబడివుంది. సంకోచం, బెదురూ, వెర్రి ఈ భావాల్ని కలపోసుకున్న అతని చూపులు కావాలని మొండిగా, కాస్సేపటికిగాని ఆ స్త్రీ ఆకారం మీద వచ్చి నిలవలేదు.

ధనవతి స్విచ్ నొక్కింది. స్తబ్దంగావున్న సజ్జన్ మనస్సు కామకళ, సౌందర్యం అనే వెలుగులతో ప్రకాశించిపోయింది. రెండు దవ్వికళ్ళన్న, కాటుక దిద్దుకున్న, చేపాకారంలో వున్న, సిగ్గుతో మునిగి లేస్తోన్న కళ్ళ రెప్పల్ని సగానికి దించి అతణ్ణి చూస్తున్నాయి. చికన్ చీర-జాకెట్టులో చూసేవాని కళ్ళను అట్టే మంత్రించివేసే తీర్చి దిద్ది పోతపోసినట్టుగా ఆమె విగ్రహం, పొడుగాటి పలుచని ముక్కూ, తాంబూలంతో వసంతపురంగుల్ని పులుము తున్న ఆమె పెదిమలూ, కోనుగానూ కోమలంగానూ వున్న గడ్డం, మధ్యరకం నుదురూ, తెల్లగా మెరుస్తోన్న ఆ యువతి వయసు సుమారు ముప్పై ముప్పై అయిదు సంవత్సరాలుంటుంది. ఆమెముక్కూ, చెవులూ, మెడా అన్నీ ముత్యాల ఆభరణాలతో నాజూగ్గా నిండి మెరుస్తున్నాయి. రెండు చేతుల్ని పమిటలో దాచు కుని తన్ను తాను ఒదిగివున్నట్టుగా నటిస్తూ ఎడమ కాలి బొటనవేలిని నొక్కి పట్టి ఆమె అలానిలబడితే సజ్జన్‌మనస్సు ఆనాలోచితంగా ఆ హొయలు చూసి మురిసిపోయింది. నడుంలోని ఆ పెలుసుతనం కళాకారుడు అయిన సజ్జన్‌ని ఇట్టే ఆకట్టేసింది. నిజంగానే ఆమె అందంగా వుంది. ఆమె వేషంచూస్తోంటే

ఎవరో పెద్దింటి కోడల్లా కనపడుతోంది. ఆమె ముఖం అభిజాత్యంతో ఠీవిని వెళ్ళబోస్తూ వుంది. ఆమె వేశ్యగాకాని మామూలు స్త్రీలాకాని కాక గృహిణిలా అతనికితోచింది.

ఆ అందాల హరిణి ముఖాన్ని కళ్ళార్పకుండా తనివితీరా చూస్తూ అప్రయత్నంగా అతని చేతులు లేచి నమస్కరించాయి. అటువైపు నుంచి కూడా మృదువుగానూ నాజూగ్గానూ గోళ్ళకు పాలిష్ వేసుకుని పమిట కొంగుతో దోబూచులాడుతోన్న ఆమె మునివేళ్ళు మర్యాద సూచకంగా మాదాయగా లేచి ప్రతినమస్కారం చేస్తోంటే ఆమె ఎర్రని పెదిమలు విడి దానిమ్మ పళ్ళవరస బయటికి తొంగి చూసింది. ఆమె అందంలోనే కాక శిష్టతలో కూడా ఎంతో అందంగా ఆకర్షణీయంగా వుంది.

పులిసిన కల్లు కంపుకు ప్రతీకగా నిలిచిన ధనవతి [illegible] మీద కైపుల కటారులతో పొడుస్తున్నట్లుగా చూపులు చూస్తూ "రెండు వైపులా అగ్గి, ప్రేమముందూ ఒగ్గి" అంటూ ఓ చిన్న చణుకు విసిరి "ఛాందీ చిత్రకారుడుగారూ, కొంచెం ఈ చిత్రకళా ఖండాన్ని కూడా పరికించండి" అని అంది వయ్యారంగా.

ధనవతి కొంచెం చొరవ తీసుకుని వెనకాడుతోన్న సజ్జన్ రెండు చేతులు లాగుతూ మంచం మీద కూర్చో పెట్టింది. ఆమె స్పర్శ ఒంట్లో వేడి పుట్టించే పులిసిన కల్లులా వుంది. ఆమె శృంగారం ఒలికిస్తూ అన్న చలోక్తి అతనికి ఎబ్బెట్టుగా తోచింది. పరాగ్గావున్న సజ్జన్ తెలివిలోకి వచ్చాడు. బయట అతని సౌంజ్ఞ కోసం సిద్ధంగా వున్న పోలీసులు జ్ఞాపకం వచ్చారు.

వేలి గడియారాన్ని చూసుకున్నాడు. గడియారంలోని నిమిషాల ముల్లు, ఎక్కుపెట్టిన విల్లులోంచి దూసుక పోతోన్న బాణంలా వడివడిగా పరుగెత్తుతోంది. ఓ పాపాల పుట్టను శాశ్వతంగా తుంచివేసే వుద్దేశ్యంతో దొంగ ప్రియునిలా నటిస్తూ రహస్యంగా లైంగిక వాంఛల్ని తీర్చుకుంటోన్న ఓ పెద్దింటి ఆడపడచుతో సజ్జన్ ఆ సన్నివేశంలోంచి ధనవతి తప్పుకోగానే మానసిక అంతః సంఘర్షణతో సతమతమౌతూ ఏమీ పాలుపోక కూర్చున్నాడు.

"నేను ఎలాంటి పాపాన్ని కొని తెచ్చుకున్నాను. రెప్పపాటులో గొప్పయింటి ఆడపడుచులం అని చెప్పు కుంటోన్న వీళ్ళ గౌరవం మంట కలిసి పోతుంది. వీళ్ళ బతుకు బజారుకు ఎక్కిన తర్వాత తమ భర్తల ముందుకు ఏముఖాల్ని పెట్టుకొని వెళ్ళ గలరు? వీళ్ళ కాపురాల్లో నిప్పులు పోసినట్టవు తుంది. నేనెలాంటి పాపానికి ఒడిగట్టు కుంటున్నాను?" అని తనకు తానే ఆత్మ పరిశీలనచేసు కుంటోన్న సజ్జన్ అంతరాత్మ కర్తవ్య నిర్వహణ అనే కఠోర దీక్ష ముందు కరుడు అయి పోయింది. సంఘాన్ని చెదలు పట్టి కొరికి వేస్తోన్న ఓ దుర్గాన్ని ఆతను బట్ట బయలు చేయటో తున్నారు. అదేమీ తెద్దపని కాదే; కుళ్లను కడక్క పోతే పండంతా కుళ్ళిపోయి తినడానికే పనికి రాకుండా పోతుంది. సంఘంలో కుళ్లు తీసే సేనే కాని దాన్ని మార్చడం కష్టం. తాను నమ్మిన సిద్ధాంతాలు ఆచర ణలో పెట్టడానికి ఇలాంటి మొహమాటలు అడ్డం రాకూడదని సజ్జన్ తీర్మానించు కున్నాడు.

ఎదురుగా కూర్చున్న యువతి అతన్ని మాటల్లో మైమరపించి ఎక్క డెక్కడికో తీసుక పోతోంది. మనసు ఓ ప్రక్క భయంకరమైన ఊహల్ని కల్పిస్తుంటే మరో ప్రక్క సరసురాలిగా తన బాధ్యత నిర్వర్తిస్తూ ఆమె మాటలు వింటూ వుండడం వల్ల మధ్య మధ్య పరాకులో వుంటూ "ఆఁ. ఏమిటన్నారు" అని రెడ్డొచ్చె మొదలాడు అన్నట్టుగా వున్నాడు సజ్జన్. వాళ్ళిద్దరు మాట్లాడు తోంటే మధ్యలో ఓసారి ధనవతి వచ్చి టీ, ఫలహారం వుంచి వెళ్ళింది. ఆమె ఓ కలప కంట్రాక్టరు భార్య అనీ, ఆమె భర్తకు ఆ వూళ్ళోనే ఓ పెద్ద ఇనుము దుకాణం వున్నదనీ చెప్పింది. భర్త పేరూ, ఇల్లెక్కడ వుందీ ఎంత గుచ్చి గుచ్చి అడిగినా ఆమె తెలప డానికి నిరాకరించింది. చాలా నేర్పరి తనంతో ఆ ప్రశ్నల్ని దాటేసింది. "చిలకా గోరింకా కథ విన్నారుగా. ఆది ఓ చోట నుంచి వచ్చింది. ఇది ఎక్కణ్ణుంచో ఎగిరి వచ్చింది. రెండూ ఒక కొమ్మ మీద కూర్చున్నాయి. ఇద్దరి మధ్య స్నేహం కుదిరింది అంతే" అంటూ నవ్వుతూ చెప్పింది.

సంభాషణ సందర్భంలో తనకూ తన భర్తకూ మనస్పర్థలు కలవవని ఒప్పుకుంది. భార్య అంతా శృంగార ప్రియురాలు. రొమాంటిక్ తత్వం ఆమెది.

కవిత్వం అంటే చెవికోసు కుంటుంది. శాస్త్రీయ సాహిత్యం అంటే ఆమె కంతగా తెలియక పోయినా ఆమె సరసురాలు. ఇక ఆమె భర్త శుద్ధ వ్యాపారి. అతనికి వ్యాపారం మినహా మరో విషయం బుర్రలోకి ఎక్కదు. ఆమెకు అతనికి కేవలం దైహిక సంపర్కం ఒకటి తప్ప మరే సంబంధం లేదు. వాళ్లిద్దరి మధ్య. ఆమెకు కేవలం కామం తీర్చుకోవడం అంత రుచించదు. మాటల ద్వారానూ, హావభావ ప్రకటనలతోనూ. సరసునిలా ప్రవర్తించి మనస్సును సంతోష పెట్టే వ్యక్తి కావాలి ఆమెకు.

భర్త పట్ల పరమ అసహ్యం యేర్పడిన కారణంగానే ఆమె పరాయి పురుషులకు తన శరీరాన్ని అప్పగించి భర్తమీద కసితీర్చు కుంటున్నట్టుగా అనుమానించాడు సజ్జన్. వివాహానికి ముందు కూడా నువ్విలానే తిరిగే దానివా అని ఓ వింత ప్రశ్న వేసాడు సజ్జన్. ఆమె అవునంది. ఒక పర్యాయం ఆమెకు చికిత్స చేసే నిమిత్తం ధనవతిని పిలవడం జరిగింది. ఆరోజు నుంచి వాళ్ళిద్దరికీ సఖ్యత యేర్పడిందట. కొద్ది రోజుల్లోనే ధనవతి ఆమెకు పరమ ఆప్తురాలిగా తయారైంది. తాను ఏకాకినన్న భావం ఆమెలోంచి తొలిగి పోయింది. పరాయి పురుషులతో కలుస్తోంటే తనకే మాత్రం సంకోచం కలగదనీ సజ్జన్ అడగ్గా ఆమె చెప్పింది. పురుషులు నిర్భయంగా స్త్రీలను కలుసు కుంటోన్నపుడు స్త్రీలూ అదే విధంగా పురుషుల్ని ఎందుకు కలుసుకో రాదని ఆమె అభిప్రాయం. అయితే సంఘంలో ఆడదాని స్థానం ఇంకా మెరుగు పడని కారణంగా తన ప్రేమ నాటకాల్ని ఆమె ఇంకా రహస్యంగానే వుంచు తోందట అంతేకాని మరే కారణం లేదట.

స్త్రీ ఆకర్షణీయంగా వుంది, దురాచారిణి. తన మాటల్లోంచి మోజు కురి పించగల శక్తివుండి కుటిలమైంది. అయినా ప్రకృతి స్త్రీకి ప్రసాదించిన సహజ స్వభావం చేత ఆమె సరళమైంది కూడా. తానేమి అపకారం చేసినా ఆమెకు తగల కూడదన్న నిశ్చయానికి వచ్చారు సజ్జన్. తను ఇక్కడకు ఎందుకు వచ్చిందీ ఆ యువతికి మెల్లిగా తెలిపాడు సజ్జన్. మొదట బెదిరి పోయినా ఆమెకు తానెలాటి అపకారాన్ని తల పెట్టనని ఆమెకు వాగ్దానం చేసి, తను

చెప్పిన ప్రకారం ఆమె నడుచుకుంటే ఆమెని అపాయం నుండి రక్షిస్తానని చెప్పాడు. ధనవతికి ఈ వృత్తాంతం ఏమీ చెప్పకుండా అక్కణ్ణుంచి మెదల కుండా ఉండమని హెచ్చరిక చేశాడు.

అతను చెప్పిన ప్రకారం ఆ యువతి తప్పించుకు పారి పోయిన పదిహేను నిమిషాల్లో పెద్ద గందర గోళం జరిగింది, మహిళా మండలి చేస్తోన్న ఘోరాలు గురించి. ఏనోట విన్నా అదే. మర్నాడే పేపర్లలో తాటికాయంత అక్షరాల్లో మండలి చేస్తున్న దుర్మార్గాలు వర్ణించ బడ్డాయి. చిత్రకళలో ఇన్ని సంవత్సరాలు కృషి చేసినా సంపాదించలేని పేరు అతను క్షణంలో సంపాదించేశాడు.

మహిళా మండలి బండారం బయట పడగానే కొన్ని యిళ్ళలో కలవరం బయలు దేరింది. వరుసగా అనేక సేవా సంస్థల్ని గురించి ధారావాహికంగా ప్రచురించారు. వార్తా పత్రికల్లో చాలా మంది ఔత్సాహికులు సజ్జన్‌లాగ ఎన్నో సంస్థల ఆట కట్టించారు. సంఘాన్ని ఏదో రకంగా మోసం చేస్తోన్న యిలాటి అనేక సంస్థల వైపు ప్రజల దృష్టి మళ్ళింది, గో సంరక్షణ అంటూ, రామలీల అంటూ, భజన కూటాలంటూ, యింకా అనేక ధర్మ సంస్థల పేరిట ఏవిధంగా మోసం చేస్తున్నారో అందరికీ తెలిసిన విషయమే అయినా యీ బండారమంతా ఒకే సారి బయట పడడంతో మేధావులంతా సామూహికంగా యీ విషయాన్ని ఆలోచించడం మొదలెట్టారు. మసీదులు, శివాలయాలు, కీర్తనలూ, సత్యన్నారాయణ వ్రత కల్పాలూ, మహమ్మద్ ప్రవక్త జన్మకథలూ, భజనలూ పేరు చెప్పుకొని గౌరవాన్నీ ప్రతిష్ఠనీ కప్పుకొని లోలోపల ఎంత మురికిగా, ఎంత నీచంగా యీ వర్గల వారు జీవితాల్ని గడుపు తున్నారో అందరికీ తెలిసి, యిటువంటి పనులంటే ప్రజలకి నమ్మకం పోయింది. తాము ఏర్పరచుకున్న విశ్వాసాలు చూస్తుండగానే వమ్మయిపోతోంటే ఆలోచనా పరులైన వ్యక్తులు విలవిల్లాడి పోయారు.

# 45

రావిచెట్టు కింద అరుగు మీద హనుమాన్ మందిరానికి కొద్దిగా పక్కకు, జరిగి కూరగాయల గంప వాడితో తగాదాపడు తున్నారు లాలాముకుందీమల్. మందిరానికి దగ్గరగా చతికిలబడి సగం నెరిసీ నెరవని మీసాలూ, మంచి వ్యాయామం చేసి శరీరదారుఢ్యం కల ఓ శాస్త్రిలు గారు రామచరిత్ మానస్ పారాయణం చేస్తున్నారు—

నాయి చరణ్ సిరు కహా కర్ జోరో
నాథ్ మోహి కఛు నాహి సఖోరి
అతిసయ్ ప్రబల్ దేవ్ తవ మాయా
ఛూటయి రామ్ కరహు జో దాయా॥

(రామచంద్రుని పాదాల మీద శిరస్సు వంచి చేతులు జోడించి హనుమంతుడు స్తుతించాడు స్వామి ఇందులో నా దోషం ఏమీలేదు. ఓ ప్రభూ నీ మాయ చాల ప్రబలమైంది. నువ్వు కటాక్షించిన భక్తుడే దాని నుంచి విముక్తి పొందగలడు).

"ఏమనుకున్నావ్? సందులో అడుగుపెట్టకుండా చేస్తాను. వెధవ, నాతో పేచీ పెట్టుకొని పైగా వాదిస్తున్నావా!" అంటూ కూరలవాడి మీద విరుచుకు పడ్డాడు ముకుందీమల్

"ఆవెధవకి నేనే కొనలేదే. మీరెలా ఇమ్మంటారు అయ్యగారూ. పెద్ద వాళ్లై వుండీ కూడా అనవసరంగా దెబ్బలాడుతున్నారు"

"చూడు....చూడు... వెధవ: దెబ్బలాడుతున్నానంట. వీడెంత! వీడి బతుకెంత! ఓరేయ్, హరియా, ఇలా వచ్చి వీడి గంపఎత్తి ఆ మురికి కాల్వలో విసిరెయ్యి వీడేం చేస్తాడో"

బిషయ్ బస్య సున్ సరముని స్వామీ
మై హామార్ పను కపి అతికామీ
నాయి నయన్ సర్ జాహి సలాగా

ఘోర్ క్రోధ్ తమ్‌నిసి జో జాగా
లోభ్ పాస్ జెహి గర్ న బంధాయా
సో నర్ తుమ్ సమాన్ రఘు రాయా

(ఓస్వామీ, దేవతలూ, మానవులూ అందరూ కామక్రోధాదుల్లో మునిగి వున్నారు. నేను తిర్యక్ యోనిలో జన్మించిన కోతిని. వాళ్ళముందు ఏపాటివాణ్ణి? అసలే సామాన్యమైన జంతువును. అందులో అన్నిటికన్న నికృష్టమైన జంతు జాతికి చెందిన వాణ్ణి. స్వభావరీత్యా నేను కామవాంఛాలోలుణ్ణి. వనిత చూపుల బాణాలకు గురికానివాడునూ, కామ క్రోధ మనెడి తెమ్మెరలు కమ్ముకున్న రాత్రిలో దాని మోహపాశానికి దూరంగా వుండి జాగరూకతలో వున్న వాడూ, లోభం అనెడి పాశములో బందీ కానివాడూ ఓ శ్రీరామం! అలాంటి వ్యక్తి నీకు సమానుడు. ఈ అర్హతలు లేని మరేవ్యక్తి కూడా నీతో సరితూగడు).

లాలాముకుందీమల్‌కు, కాయగూరల వాడికి మధ్య జరుగుతోన్న లంకా కాండను కొంచెం కూడా లక్ష్యపెట్టకుండా శాస్త్రిలు గారు రామాయణ పారాయణం చేస్తూ తన్మయత్వంలో మహావూగిపోతున్నారు. అంతలో ఇద్దరు భక్తు రాండ్రుఅక్కడికొచ్చారు అంజనేయస్వామి సన్నిధిలో పూలు పెట్టి, శివలింగం మీద నీళ్ళు చల్లి పూలు వుంచి అంతటితో ఆ పని తీరిపోయిందన్నట్టు తెలిసిన విధంగానైనా స్తుతించకుండా ఇంట్లో ముచ్చట్లు చెప్పుకోవడం మొదలెట్టారు. బాబూరాధేశ్యాం వేళ్ళమధ్య సిరెట్టు బిగపెట్టి గట్టిగా దమ్ములాగుతూ రంగంలో ప్రవేశించాడు. ఎడమచేతిలో పేపరు పట్టుకుని, అదేమార్గంలో ఏదో పనిమీద చంకన అవర్దా పుస్తకాన్ని అదుముకుని వెళ్తోన్న లాలాజానకీశరణ్ గుమాస్తా కుంజీలాల్ హుక్కా పీల్చి పోదామని అరుగుదగ్గర అలా నిలబడిపోయాడు. ఇందాకటి నుంచి కూరగాయలవాడితో పెద్దగా అరిచేదేమో ముకుందీమల్‌కి దగ్గుతెర వచ్చింది. దగ్గుతూనే కుంజీలాల్‌తో "బజార్లో సరుకు అమ్ముడుపోక కాళ్ళు అరిగేదాకా నైనా తిరగడానికి యిష్టపడతాడు కానీ అణాకు సేరు యివ్వ మంటే ససేమిరా యివ్వనంటాడీవెధవ. నేనేమైనా తప్పుగా మాట్లాడానా నువ్వే

చెప్పు. పూర్వం మాదిరిగా సందులో కట్టుబాటులేదు కానీ లేకపోతే ఈ అంప శోళ్ళ వెధవను సందులోకేరానుండా చేసేవాణ్ణి. ఏమనుకున్నాడో ఏమో!"

ఆదే సమయంలో ఏదో పనిమీద సజ్జన్ ఆ సందుగుండా వెళ్ళుతుంటే రాధేశ్యాం కంటపడ్డాడు. అంతే. కంఠంలో హుషారు తెచ్చుకుని "రాండి సజ్జన్ గారూ, దయచేయండి" అని పిలిచాడు. కాదంటే ఏమనుకుంటారో అని సంకో చిస్తూ మెల్లిగా అరుగు దగ్గరకొచ్చాడు సజ్జన్.

"ఇలా కూర్చోండి, ఈ మధ్య మీపేరు రూపాయిమందాన నగరంలో మోగిపోతోంది మహిళామండలిని కూకటివేళ్ళతో పీకేశారనుకోండి. మీ ధైర్యంచూసి నాకు మహాసంతోషం అయింది" అంటూ రాధేశ్యామ్ అరుగు వైపు చెయ్యి చూపాడు.

"ఎవర్రా అది? కన్నోమల్ మనవడా!" అంటూ లాలా జానకీశరణ్ గుమాస్తాతో మాట్లాడుతోన్న లాలాముకుందీమల్ కళ్ళద్దాల్ని సవరించు కుంటూ అరుగువైపు చూశాడు.

"అవునండీ. నేనే. నమస్కారమండీ" అంటూ చేతులు జోడించాడు. సజ్జన్.

"క్షేమంగా వున్నావా బాబూ. 'ధైర్యేసాహసే లక్ష్మీ' అన్నారు, పెద్దలు. మొత్తానికి నువ్వు పెద్దమొనగాడివని నిరూపించు కున్నావు.

లాలా ముకుందీమల్ పొగడ్తకు సజ్జన్ సిగ్గుపడ్డాడు.

బల్లెంలాంటి వాడి చూపులతో లాలా జానికీశరణ్ గుమాస్తా ఓ పర్యాయం సజ్జన్ని చూశాడు మళ్ళీ లాలా వైపు తిరిగి "ఆ వ్యవహారంలో మాకు తెలిసిన ఓ అబ్బాయి కూడా ఇరుకున్నాడు. పాపం పరువు కోసం వేలకు వేలు కుమ్మరించినా పోలీసు వాళ్లు మాత్రం–"

"ఎవరబ్బాయి? ఎలా యిరుకున్నా దేవిటీ?" అన్నాడు ముకుందీమల్.

"అతడే నండి మంగతూ కమీషన్ యేజంటులేదూ, వాళ్ళబ్బాయి. పోలీసులు వచ్చినప్పుడు అతనక్కడే వున్నాట్ట" అంటూ కుంజీలాల్ చెప్పాడు.

"చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ" అంటూ వేళ్ళ సందులో సిగరెట్టు పెట్టి దమ్ము పీల్చాడు రాధేశ్యాం.

"మాటలు చెప్పడం చాలా తేలిక బాబుగారూ. గాయపడిన వారికి తెలుస్తుంది బాధ" అని లాలా ముకుందీ మల్ వైపు తిరిగి "ఏం లాలా, నేను చెప్పింది వాస్తవం కదూ!" అంటూ తన్ను సమర్థిస్తాడేమో అని ఆశించాడు.

"అవును నవును. గౌరవం పోతే ప్రతివాడు బాధపడతాడు. పరువు పోయిన తర్వాత ఎంత ఆస్తి వుంటే ఏమి ప్రయోజనం" ఒరేయ్ సుకురువా, కొంచెం తమలం పాకులు తెచ్చిచ్చిపో" అంటూ లాలాముకుందీమల్ అరుగుకి ఎదురుగా అవతల వైపున్న తన ఇంటివైపు చూస్తూ బిగ్గరగా అరిచాడు. మళ్ళీ హుక్కా గుడగుడ అనడం మొదలెట్టింది.

"గౌరవానికి సంబంధించిన దన్నారు లాలాజీ అది ఖచ్చితంగా నిజం. కాని అక్కడ ఏ ఒక్క వ్యక్తి గౌరవం కన్న మొత్తం సమాజగౌరవమే బూడిద పాలై పోతోంది" అంటూ సజ్జన్ తన చర్యను సమర్థించుకున్నాడు.

"మీరు సరిగ్గా చెప్పారు. సంఘ గౌరవంతో చెలగాటం ఆడేవాళ్ళకు తగిన శాస్తి జరగాల్సిందే" అంటూ రాధేశ్యామ్ సజ్జన్‌ని సమర్థించాడు.

"అం టోడి సంఘ గౌరవం ఎవడిక్కావాలి. నువ్వైతే నిన్న కళ్ళు తెరిచావు. మా ఈ కళ్ళ ముందు ఇటువంటివి ఎన్నెన్ని చూశాం అనుకో" అంటూ కుంజీలాల్ రాధేశ్యామ్ వైపు చూస్తూ అన్నాడు— "అలా కావాలంటే నీ ఊరిలో పెద్ద మనుషులుగా చలామణీ అవుతోన్న వాళ్ళ ఒక్కొక్కరి బండారం బయట పెడతాను. మనం మన గౌరవం కోసం ప్రాకులాడుతున్నట్టే మిగతా వాళ్ళు కూడా అలాగే ప్రాకులాడుతారని పూరుకోవాలి. పంచ విప్పితే అందరూ బోసోళ్ళే నాయనా. ఎవరెవరి భాగోతం చెప్పమంటావ్?"

"ఒరే కుంజీలాల్ ఇప్పుడు గౌరవం, పరువూ ఎక్కడేడిసింది. అంతా విప్పుకుని బజార్లో తిరుగుతున్నారు. ఇదే పదిహేను యిరవై సంవత్సరాల క్రితం కటిక దరిద్రంలో వున్నా స్వంతవాళ్ళ ముందు కూడా నోరు విప్పేవారు

కాదు. అంత గట్టు చప్పుడుగా వుండే వాళ్ళు. మరి ఇప్పుడో" నేను చెప్పేది నిజమా కాదా!''

"అక్షరాలా నిజం లాలా"

"మరిప్పుడు చూడు. లక్షాధికారి అయినా సరే భిక్షాధికారైనా సరే పొద్దున లేసిన దగ్గరించి ఆదాయం చాలటం లేదూ, ఖర్చులు విపరీతంగా పెరిగి పోయాయి అని యేడుస్తుంటారు, దాన్ని బట్టే గ్రహించ వచ్చు పరువూ ప్రతిష్ఠా అంటే మనం ఈరోజు ఎంత విలువ ఇస్తున్నామో. మన పరువును మనమే బజారులోకి ఈడ్చుకోవడం ఇప్పుడు ఫ్యాషనై పోయింది. ఎవరేంచేస్తాం?" అంటూ లాలా ముకుందీమల్ మౌనం అయిపోగానే అతని నోట్లోని హుక్కా గొట్టం గుడగుడ మనడం మొదలెట్టింది.

బయాటికి ఎక్కడికో వెళ్ళవలసి వున్న కుంజీమల్ అక్కడే అరుగు మీద కూల బడ్డాడు. తాపీగా కూర్చుంటూ "మా రోజుల్లో ప్రతి వస్తువూ ఎంత చౌకనుకున్నావ్. ఆరోజుల్లో జీవితాన్ని కొంతవరకైనా జనం సహించే వాళ్ళు నోరు విప్పితే గౌరవం ఎక్కడ పోతుందోనన్న భయముండేది, నా చిన్నతనంలో రూపాయికి పదిహేను శేర్ల గోధుమలు [illegible] అయితే పద్దెనిమిది ఇరవై, ఇరవై అయిదు శేర్ల దాకా యిచ్చేవాళ్ళు. నెయ్యి రూపాయికి సేరున్నర. పాలైతే పదహారు సేర్లు జీవితం అంటే స్వర్గసీమ అనుకో. మరిప్పుడు? ఆక్కడ పట్టుబడ్డ అధికార్లంతా జీవితం వల్లనే ఆ పాడుపని చేస్తున్నారని పేపర్లోనే వేసారుగా. ఇప్పుడు చెప్పండి జీవితం ముఖ్యమా? గౌరవం ముఖ్యమా?" అని ఓ చిన్న ఉపన్యాసం దంచాడు కుంజీలాల్.

రాధేశ్యాం అందుకని "అయితే మీరు తేల్చిన సారాంశం ఏమిటి? కాస్సేపు గౌరవాన్ని పొగడుతున్నారు. మరి ఇప్పుడు జీవితాన్ని పొగడుతున్నారు." కుంజీలాల్‌కి ఎదురు ప్రశ్న వేసాడు.

"ఇప్పుడు నేను ఏకరవు పెట్టడం లేదు. గౌరవం గురించి ప్రసక్తి వచ్చింది గనుక అంటున్నాను. పొట్టగడవక ఏదో రహస్యంగా నాలుగు రూకలు సంపాదించుకుంటోండే వాళ్ళ జీవితాల్ని బజారులోకి లాగడం గౌరవ

మైన పనేనా" అంటూ కుంజీలాల్ సజ్జన్ వైపు చూసాడు. కుంజీలాల్ వ్యాఖ్యానం అనే బండరాయి దొర్లి సజ్జన్ మీద వచ్చి పడింది. సజ్జన్ కూడా కళ్ళెత్తి కుంజీలాల్ వైపు చూసాడు.

ఆ మాటలకు అభ్యుదయ భావాలు కల రాధేశ్యామ్‌కి కోపం వచ్చింది. ఆగ్రహావేశంతో "ఇటువంటి దురాచారాల్ని కుంభబద్దలు కొట్టినట్టు బయట పెట్టాల్సిందే ఇవన్నీ డబ్బులున్నవాళ్ళు ఆడిస్తోన్న నాటకాలు. తనకు తెలిసిన ఓ లక్షాధికారి అబ్బాయి దాన్లో ఇరుక్కున్నాడనీ అతని పరువు మంటలో కలిసి పోయిందనీ ఈయన అక్కసంతా. ఈ పెట్టుబడి దారీ వర్గంవారు తమ స్వప్ర యోజనాలకోసం, తమ వైభోగాల కోసం ఎటువంటి నీచపు పనికైనా ఒడికడ తారు, ఒక్క స్త్రీ జాతినికాదు. గో సంరక్షణ అంటూ రామలీల అంటూ అన్నిట్లో సంపాదిస్తారు. శవం మీద గుడ్డల్ని కూడా అమ్ముకొని అక్రమంగా లాభాలు ఆర్జించేరకం. అసలీ సంఘాన్ని దోచుకుంటోంది ఈ పెట్టుబడిదారీ వ్యవస్థకు తామే వారసులం అని చెప్పుకుంటున్న ఈ ప్రబుద్ధులే. అటువంటి వాళ్ళ చెప్పులు నాకుతూ వాళ్ళు వదిలేసిన ఎంగిలి మెతుకులకు కక్కుర్తిపడి యీ కుంజీలాల్ లాంటి వ్యక్తులు వంత పాడుతున్నారు. ఏవేవో పిచ్చి పిచ్చి ప్రేలాపనలు చేస్తుంటారు," అన్నాడు కోపంతో. ఏమాట వచ్చినా పెట్టుబడి దారీ వర్గం రంకు బయట పెట్టగానికి కాచుక్కూచుంటాడు రాధేశ్యామ్. అతని సిగరెట్టుమీద మసి పేరుకుని ఆరిపోతూంటే దాన్ని ఒక్కసారి విదిలించి నోట్లో పెట్టుకుని త్వరత్వరగా నాలుగు దమ్ములు పీల్చి ఆవంపాతేసాడు.

తమ వైపే వస్తోన్న మహీపాల్‌ని సందుమొగల్లో చూశాడు సజ్జన్. రాధేశ్యామ్ విసుర్లకు వుడికెత్తిపోయిన కుంజీలాల్ దస్త్రాన్ని చంకలో పెట్టు కుని బయల్దేరుదామన్న వుద్దేశంతో లేచాడు. వెళ్ళబోతూ అతనేదో చెప్పబో తూంటే అతని జబ్బ పట్టుకుని తన నోటి దగ్గరకు లాక్కుంటూ ముకుందీమల్ అన్నాడు - "ఎవరికి నోరిస్తునావ్ కుంజీలాల్ ? ఇదంతా కమ్యూనిష్టు ప్రపంచం. తాస్సేవు కూర్చొని ఆకులేసుకుని వెళ్ళవుగాని. ఓరేయ్‌సుకురువా, ఇందాకనగా తనుల పాకులు తెమ్మన్నాను. ముండనాయాలా. ఎప్పుడురా

తెచ్చేది. పొగాకు కూడా కాస్త తీసుకురా! అంటూ మళ్లీ ఇంటివైపు చూసి అరిచాడు.

ఆమాట మీద ఆమాట పెరిగి సంభాషణ గతించిన దెబ్బై ఎనభై సంవత్సరాల వైపు మళ్ళింది. పాతరోజులూ, పాతజ్ఞాపకాలు గుర్తుచేసుకొని ఫలానా వ్యక్తి ఫలానా వాడికొడుకని, ఫలానా వాడికి తమ్ముడని చెప్పుకొని ఆరోజుల్లో వయసు మళ్ళినా యువకుల్లా దేహదారుఢ్యం కలిగివుండేవారని– యిలా అనేక విషయాలమీద చర్చిస్తూ సంఘంలో ఇన్నాళ్ళ నుంచి వచ్చిన మార్పులూ కూర్పులూ అన్నీ వెనుకాముందూ, ఓ క్రమంలో కాకుండా వర్ణిస్తూ మహా హుషారుగా మాట్లాడారు అంతా. జరిగిపోయిన సంఘటనలూ, రోజులూ వర్ణించడం ప్రతి వ్యక్తికీ మహాసరదాగా వుంటుంది. అవి చెబుతోంటే వినేవాడికి చెప్పేవాడికీ ఓ రకమైన నిషావస్తుంది. రామచరితమానస్ పారాయణం చేస్తోన్న శాస్త్రిలుగారు పుస్తకాన్ని మూసేసి ఎప్పుడో లేచి వెళ్ళిపోయారు. దారిన వెళుతూ వెళుతూ ఎంతోమంది భక్తగణం అక్కడ ఆగి కాస్సేపు వుండి మళ్ళీ వదలిపోయారు తెలిసినవాళ్లు అటు వెళ్తోంటే జై రామ్‌జీ అనీ, జైహింద్ అనీ, నమస్తే అనీ కుశలంక్షేమాలు అడిగారు కొంతమంది. కొంతమందైతే ఆ సమా వేశంలో వచ్చి కూర్చున్నారు. వేపపుల్ల నుంచి బినాకా పేస్టు వరకు, పొద్దున ఫలహారములో జిలేబీ, కచోరీ నుంచి వెన్న, రొట్టెటోస్టు వరకు కబుర్లు నడిచాయి. పూర్వం ధరించే తలపాగాలూ, చొక్కాలూ, ఓణీలు మొదలు ఇప్పటి పాశ్చాత్య వేషాల వరకు అందరూ తమతమ అభిప్రాయాలు చెప్పారు. సూర్యభగవానుడు అరుగుమీద నుంచి దిగి గోడల మీదకు ఎగబాకుతున్నాడు. దాదాపు మూడున్నర గంటల సేపు ఆ చర్చలు అలా కొనసాగాయి. అరుగు నుంచి దిగాడు మహిపాల్. హనుమాన్ మూర్తిముందు చేతులు జోడించి 'శ్రీగురు చరణ్ సరోజ్ రజ్' అంటూ స్తోత్రం చేసి 'భోలే మృత్యుంజయ్‌హరహర్' అని వుచ్చరించి సజ్జన్ వైపుకు మళ్లాడు. సజ్జన్ ఆలోచనల్లో మునిగి వున్నాడు. అతను కూడా ఏదో పోగొట్టుకొన్నట్టుగా మహిపాల్‌ని చూశాడు. ఆ చూపుకు సమాధానం యివ్వలేక ఓ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు, మహిపాల్.

ఆకస్మాత్తుగా గడియారం వైపు చూస్తూ 'అప్పుడే పన్నెండూ నలభై అయింది. పెద్దమ్మ ఇంటికి వెళదామని బయలుదేరాను ఇక్కడ మాటల్లో పడిపోయి ఆ విషయాన్నే మరచిపోయాను. ఏలాగైతేనేం బాగానే కాలక్షేపం అయింది' అన్నాడు సజ్జన్.

'నిజంగా కాలం గడిచినట్లే అనిపించలేదు. మంచి కాలక్షేపం అయింది.'

మళ్ళీ క్షణంసేపు అంతా మౌనంవహించారు. వాళ్ల ముందు నుంచి ఓ ఆవు వెళుతోంది. దాని ఒంటిమీద హోలీరంగుల్ని ఎవరో పులిమారు. ఇద్దరు దృష్టి దాని మీదకు మళ్లింది.

"ఇలా దయచేసినావు. ఏమిటి విశేషం?" అంటూ సజ్జన్ అడిగాడు.

"ఏమీ లేదు. నిన్ను చూద్దామనే బయలుదేరాను"

"నేను పెద్దమ్మ యింటికి వెడుతున్నాను. తొందరగా వెళ్లాల్సిన పని లేకుండా వుంటే పద. ఇద్దరం కలిసి వెళ్దాం" అని అన్నాడు సజ్జన్.

"నువ్వు వెళ్లు. నేనిటు వెళతాను"

మహీపాల్‌ని కన్నార్పకుండా ఓక్షణం చూసి, "వరే పనిలేకపోతే నాతోరా. పెద్దమ్మ వచ్చి పొమ్మని కబురెట్టింది. ఆమె ఇంటికి వెళ్ళిన తర్వాత నువ్వెక్కడికి వెళ్దాం అంటే అక్కడికే వస్తాను" అన్నాడు బలవంతం చేస్తున్నట్లుగా సజ్జన్.

మహీపాల్ సరే అన్నాడు. ఇద్దరు గోశాల గేటు వైపుగా వెళ్ళారు. పెద్దమ్మ ఇంట్లో తాను గడిపిన రోజులు జ్ఞాపకం రాసాగాయి సజ్జన్‌కి. తన్ను వెళ్లగొట్టడానికి కాందిశీకుల ఎత్తుగడా, పెద్దమ్మ తనకు దిల్లంగి పెట్టడం, దొంగలు పెద్దమ్మ ఇంట్లో చొరబడి ఆమెను మంచానికి కట్టేసి దోచుకోవడం, తన జీవితంలోకి కన్యరావడం, పెద్దకోడలూ- బోర్ మహాకవిగారి ప్రేమాయణం అన్నీ ఒకటి తర్వాత ఒకటి దృశ్యాలుగా అతని మనసులో మెదిలాయి. అమాంతంగా బోర్‌గాడు ఏంచేస్తున్నట్టు? చాలారోజులైంది అతను కనపడి" అని మహీపాల్ అడిగాడు.

"నేను కూడా చూసి చాలా రోజులైంది పరమతాత్పర్యుడు"

"అటువంటి వాళ్లు ఎంత మంది వున్నారో కదా ఈ సంఘంలో. వ్యక్తి బలహీనతను చూసినపుడెలా అతని మీద కోపం రావడానికి బదులు సాంఘిక వ్యవస్థ మీదే నాకిప్పుడు కోపం వస్తుంది సుమా। బలహీనతలనేవి సంఘం అంతటా వ్యాపించి వుంటాయి" అన్నాడు సజ్జన్.

"బలహీనతలే కాదు ధర్మ. శక్తిసామర్థ్యాలు కూడా వ్యక్తికే చెందినవి కాక-" మాట్లాడుతోండగానే పెద్దమ్మ ఇల్లు వచ్చేసింది. తలుపు గొళ్లాన్ని కొట్టి శబ్దంచేశాడు సజ్జన్. మహీపాల్ తన మాటను పూర్తి చెయ్యకుండా ఆగిపోయాడు. "ఎవరాౖ ముండాకొడుకులు అలా గొళ్లెం పట్టుకులాడుతున్నారు" లోపలి నుండి పెద్దమ్మ కంఠం వినిపించింది.

"తిట్టు లేకుండా ఎవరితోనూ మాట్లాడదు కదా, మహాదొడ్డ యిల్లాలు" అంటూ మహీపాల్ వైపు చూస్తూ చిరునవ్వు నవ్వాడు సజ్జన్. తలుపుకు దగ్గరగా నోరు పోనిచ్చి "నేను పెద్దమ్మా, సజ్జన్‌ని" అని బిగ్గరగా సమాధానంచెప్పాడు.

"దుర్జన్ అని ఎందుకు చెప్పవు!"

"ఒక్క షీలాయే అలా పిలుస్తుంది"

షీలా పేరు వినగానే మహీపాల్ గంభీరుడయ్యాడు. అంతలో లోపలి గడియ తీస్తున్న శబ్దం అయి తలుపు తెరుచుకుంది. ఎదురుగా కన్య నిలబడింది. ఆనందోత్సాహంతో భర్తవైపు చూసి మహీపాల్‌కి నమస్కరించింది.

"ఎక్కడున్నారండీ ఇంతసేపట్నుంచి?" అంటూ సజ్జన్‌ని అడిగింది.

"ఇక్కడే అరుగులేదూ, అక్కడే కూర్చున్నాను"

"లేదు. ఒట్టి అబద్ధాలాడుతున్నాడు వీడు. అక్కడ జూదం ఆడుతోంటే పట్టుకుని లాకొచ్చాను" అంటూ మహీపాల్ చాడీ చెప్పాడు.

ఆ మాటలకు నవ్వుతూ కన్య అంది- "అయితే తమరు కూడా అక్కడికి పందెం కడదామని వెళ్లారుకాబోలు".

"ఆఁ ఓడిపోయాడు. అందుకే నా మీద పితూరీలు చెప్తున్నాడు." డ్రాయింగ్ రూమ్‌ని దాటుకొని లోపలికి వెళుతూ అన్నాడు సజ్జన్.

"బాబాగారొచ్చారు" అని కన్య చెప్పింది.

"ఎక్కడున్నారు?"

"మేడమీద" అంటూ మెట్లు ఎక్కుతూ కన్య బదులు పలికింది.

పైన చైత్రమాసం ఎండమిలమిలలాడుతోంది. మొఖానికి ఎండ తగలకుండా వీపు పెట్టుకుని కూర్చుంది పెద్దమ్మ. ఆమెకు ఎదురుగా నల్లనిరాయి గల బలిష్ఠమైన శరీరముతో లంగోటీ కట్టుకుని బాబాగారు కూర్చున్నారు. ఇద్దరినీ చూడగానే చాలా ఆప్యాయంగా ఆహ్వానించారుబాబా. పెద్దమ్మ కాళ్లకు సజ్జన్ నమస్కరిస్తోంటే "ఏరా, ఇన్నిరోజుల్నుంచి ఎక్కడున్నావు?" అని పరామర్శించింది ఆమె.

"పనిలో వున్నాను పెద్దమ్మా"

"నువ్విక్కడకు రావడానికి తీరికే దొరకనంత ఏపని వెలగబెడుతున్నావురా? నీ పెళ్లాం మూలంగా నీ కబుర్లు తెలుస్తున్నాయి. బాబాగారు వుండనే వున్నారు. వీళ్లిద్దరూ వస్తూపోతున్నారు గనుకనే ఆమాత్రం అయినా నీ గురించి తెలుసుకోగలుగుతున్నాను. లేకపోతే-"

"అదేంకాదులే భక్తురాలా. నీ కోడలు ఇక్కడ పనిచేస్తోంటే నీ కొడుకు వేరేచోట అంతకన్న ఘనకార్యం చేస్తూవుండిపోయాడు. నేను సాక్ష్యం చెప్తున్నాగా"

"ఎవర్ని నా కోడలని అంటున్నారు?"

"నీ కొడుకైన తర్వాత అతని భార్య నీకు కోడలు కాదా మరి?"

"నేను వీడి పెళ్లానికి వంద తులాలు బంగారం ఇస్తానన్నాను. మా జ్ఞాతుల్లోనే ఓ బుద్ధిగల పిల్లని కూడా చూశాను"

"నువ్వేమైనా అనుకో భక్తురాలా. అతన్ని నువ్వు కొడుకనుకుంటే మరి ఆమె నీకు కోడలే అవుతుంది. చూడు ఆ అమ్మాయి ఎంత తెల్లగా అందంగా

వుందో. ఎంత దొడ్డస్వభావం అనుకున్నావు ఆమెది? ఇంట్లో భర్తకు సేవ చేస్తుంది. ఇక్కడ నీకు సపర్యలు చేస్తుంది. స్కూలు నడుపుతోంది. ఆమెలో ఏమి చెడ్డతనం వుంది? ఆమె అంటే నీకెందుకో అంత అయిష్టత?''

పెద్దమ్మ కళ్ళెత్తి ఓ పర్యాయం కన్యవైపు చూసింది. అయినా తన అభిప్రాయాన్ని పూర్తిగా మార్చుకోవడానికి ఇష్టం లేనట్టుగా నటిస్తూ "ఆ మంచిదే. కాని నాకు ముందే ఎందుకు చెప్పలేదు. మా బంధువుల అమ్మాయని ఎందుకు అబద్ధం ఆడాలి?" అంటూ దీనికి బాధ్యత వాళ్ళిద్దరి మీదే తోసింది.

"యశోదకు భయపడి కృష్ణుడు అబద్ధాలు చెప్పలేదటే పెద్దమ్మా" అని నవ్వాడు సజ్జన్.

ఆ మాటకు బాబాగారు, వనకన్య పకపకా నవ్వారు. మహిపాల్ కూడా మెల్లిగా నవ్వాడు పెద్దమ్మ కూడా నవ్వుతోంటే గారకట్టిన ఆమె పళ్ళు కనిపించాయి. బాబా అందుకున్నాడు- "రామ భక్తురాలా ఇప్పుడు నువ్వతణ్ణి ఏమీ అనకూడదు. నువ్వు యశోదవయ్యావు అతను కృష్ణుడయ్యాడు. నువ్వింక నీ కోడల్ని కూడా క్షమించాలి''.

"ఎప్పుడో క్షమించేసాను. నేనీ కుంకను మరచి పోవాలని ఎంత ప్రయత్నం చేస్తున్నా మీద రాసుకుంటూ నాకు సేవచేస్తానంటుంది. ఏమని చెప్పను?"

"మరలాగైతే నీ వంద తులాల బంగారం ఆమెకు ఇచ్చెయి"

పెద్దమ్మ అందుకు ఏమీ మాట్లాడకుండా వూరుకుండి పోయింది. అక్కడే నిలబడిన మహిపాల్‌ని చూస్తూ ''వీరు ఎవరు?'' అని సజ్జన్‌ని ప్రశ్నించింది.

"వీరు చాలా పెద్ద రచయితలు పెద్దమ్మా" అంటూ తడుముకోకుండా జవాబిచ్చాడు సజ్జన్.

"చాలా పేరు మోసిన పండితులు, రామ భక్తురాలా'' అన్నాడు బాబా సజ్జన్‌తో శృతి కలుపుతూ

వెంటనే పెద్దమ్మ నేలమీద తల ఆనించి మహిపాల్‌కి దండం పెట్టి అడిగింది- మా ఇల్లు మీరాకతో పావనమైంది. ఇక్కడే వుంటున్నారా లేక బయట నుంచి వచ్చారా?"

"ఇక్కడి వారేనండి పెద్దమ్మగారు, ఈయన కోలెడన్ని పుస్తకాలు రాశారు"

ఉత్సాహంతో మహిపాల్ గురించి చెప్పింది వనకన్య.

"అయితే వీరు పౌరోహిత్యం కూడా చేస్తోండొచ్చు"

అవునే పెద్దమ్మ. ఇంట్లో రోజూ పూజా పునస్కారం చేస్తుంటారు" అని చెపుతూ "పెళ్ళిళ్ళు అవి జరిపించడం మాత్రం వీరికి రాదు" అంటూ సజ్జన్ చెప్పాడు.

"రాధా కృష్ణుల కళ్యాణం బాగా జరిపించగల పురోహితుడు నాకు కావాలి. ఇక్కడ దొరికితే సరేసరి. లేకపోతే కాశీ నుండి పిలిపించండి. రాను పోనూ ఖర్చులు నేనే భరిస్తాను".

"బాగుంది. అలాగే. నేను ఏర్పాటు చేస్తానుగా" అన్నారు బాబా.

"వివాహం మంచి ఘనంగా జరిపించాలి. నా సవతి మనవడి పెళ్ళిఅంత వైభోగంగా జరిగినప్పుడు మనం భగవంతుని కళ్యాణం అంతకన్న శోభాయమానంగా చేయాలి. వీడు గూడా వున్నాడు. కన్నోమల్ మనవడు. చెవుల్లో చెట్లు మొలిచి నట్టుగా పట్టించుకోకుండా ఎలా కూర్చొన్నాడో చూడండి. ఇంక ఎన్ని రోజులు వున్నాయి.... రేపటి నుంచి వైశాఖ మాసం ప్రారంభం. పున్నమికి పెళ్లి. ఖచ్చితంగా నెల వుంది. ఇంత వరకు యేమీ కొనలేదు. ఆ సన్నాహమే లేదు"

"వాటి గురించి నువ్వు కలవర పడకు భక్తురాలా. అవన్నీ మేము చూచుకుంటాం. మాకు కట్నం కింద ఓ ఆశ్రమాన్ని కట్టించి ఇవ్వు అంతే" అన్నాడు బాబా.

"మరి పెళ్ళి కొడుకుని చేసినందుకు గాను పెద్దమ్మ ఏమి ఇనుంది" అంటూ కన్య అడిగింది.

"ఈ రోజుల్లో అయితే రేడియో, సోఫాసెట్టూ, గడియారంలాంటి ఖరీదైన వస్తువులు ఇవ్వడం అదారమై పోయింది'' అని మధ్యలో అందు కున్నాడు మహీపాల్.

"అయితే భక్తురాలా, ఇవన్నీ నువ్వు మాకిస్తావన్న మాట. కృష్ణ పరమాత్ముని పెళ్ళికి మమ్మల్ని కోటూ సూటూ వేసుకో మంటున్నావన్న మాట" అని ఖాళా ఛలోక్తి విసరగానే అందరు విరగబడి నవ్వారు.

"అందు కనేగా ఇవ్వాళ పిలిపించింది. పెళ్ళికొడుకునుచేసిన రోజు పండ్లూ మిఠాయీలూ ఎలాగైనా పంపిస్తాను. మొత్తం పళ్ళాలు పెట్టాలని నిర్ణయించు కున్నాను కూడా" అని అంది పెద్దమ్మ.

"అవన్నీ మేము ఆశ్రమంలో పంచిపెడతాం. మిగతాది మాకు నగదు రూపంలోనే ముట్టాలి. దానితో ఆశ్రమానికి కావలసిన ఖాళీస్థలాన్ని మేం కొనుక్కుంటాం. పెళ్ళి కొడుకును చేసినందుకు ఖాళీస్థలమున్నూ, పెళ్ళికి ఆశ్రమమున్నూ మాకు కట్నంగా సమర్పించుకో"

వివాహం యేర్పాటు ఏలా చెయ్యాలి అని నిర్ణయించారు. మహీపాల్ వెళ్ళిపోదాం అని మహా తొందర చేస్తోంటే సజ్జన్ ఆపాడు. కన్య స్కూలుకు వెళ్ళిపోయింది. ఆమె స్కూలు ఇంకా ముగియలేదు. కుట్టూ, అల్లికా, నేత మొదలైన చేతి పనులు నేర్పడానికి కన్యకు సాయంగా మరిద్దరు స్త్రీలను నియమించారు. కన్య నడుపుతోన్న పాఠశాలలో ఇప్పుడు ఆడవాళ్ళు ఎక్కువగా రావడం మొదలెట్టారు. పెద్దమ్మ ఇంట్లో స్టూడియో కోసం అద్దెకి సజ్జన్ తీసుకున్న గది ఇప్పుడు కేవలం అతని అరిపోయిన కోరికకు ప్రతీకగా మాత్రమే నిలిచి వుంది. ఈ మధ్యన చాలా రోజుల్నుంచి అతను ఒక చిత్రం కూడా గీయలేదు, అధవా అలాంటిది ఏదైనా వుంటే తన బంగాళాలోనే కూర్చుని చేస్తున్నాడు. ఇవ్వాళ సరదాగా కనిపించాడు సజ్జన్. కాని ఆడవాళ్ళ గోల ఎక్కువగా వుంటుందని అతణ్ణి వారించాడు మహీపాల్.

"అయితే రామ్‌జీ. ఆశ్రమానికి వెళ్దాం'' అంటూ కన్య పాతగాలంతా కలియ చూసి తిరిగి వచ్చిన బాబా సజ్జన్ లేవబోతోంటే గమనించి అన్నాడు. మహీపాల్‌కి ఇష్టం లేక పోయినా బాబాగారిది తిరుగులేని నిర్ణయంగా భావించాడు "వెళ్దాం పద సజ్జన్ బాబూ" అని ఇంకో సారి రెట్టించారు బాబా.

"నేనింకా భోజనం చెయ్యలేదు బాబాజీ. మహీపాల్ కూడా లేదనే అనుకుంటాను'' అంటూ మహీపాల్ వైపు చూసాడు సజ్జన్.

"అవునండి. నేను ఫలహారం చేసి ఇంటి నుంచి బయల్దేరాను'' అన్నాడు మహీపాల్.

"అలాగైతే మరి ఇవ్వాళ ఫలహారమే చేయండి. వెళుతూ దారిలో కావలసిన పండ్లూ సామానూ తీసు కుందాం, రెండున్నరా మూడు గంటలకల్లా పండా భార్య బర్రెను తీసుకొచ్చి పాలు పితుకు తుంది. ఆ పాలన్నీ మనమే తీసు కుందాం. ఏమంటారు రామ్‌జీ?'' అంటూ మహీపాల్ వీపు మీద చేతితో తడుతూ'' మీరిద్దరు మహానుభావులూ ఒక్కచోట కలిసారు కదా ఆశ్రమానికి ఇన్ని రూపాయల చందా రాబోతుంది, ఏమి చెయ్యాలమా అన్న విషయంపై మీతో సంప్రతించాలి. ఆ విషయాన్నే ఆలోచించడానికి మిమ్మల్ని రమ్మంటున్నాను'' అని అన్నారు బాబా.

మహీపాల్ మారు మాట్లాడలేక పోయాడు.

# 46

స్నేహితులిద్దరూ బాబా ఆశ్రమం నుంచి త్వరగానే తిరిగి వచ్చేశారు. మహీపాల్ పదపదమని ఒత్తిడిచేసినందువల్ల అక్కడ ఎక్కువసేపు వుండడానికి వీల్లేకపోయింది. కపూర్ హోటల్‌కి వెళ్ళి కాసేపు గుర్రం ఎక్కాలన్నాడు మహీపాల్. సజ్జనయితే మత్తు సేవించడం మానేసి చాలా రోజులైంది. అయినా తోడుకోసం మహీపాల్‌తో వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

"చూస్తూ చూస్తుండగానే యీ మనుషులు సంవత్సరాల తరబడి అంటు కుని వున్న వ్యసనాల్ని ఎలా ఒదిలించుకొంటారో నా కర్థం అవడంలేదు" అన్నాడు మహీపాల్.

"ఆదర్శవాదియైన రచయిత అనేకమైన వస్తువుల్ని విడిచిపెట్టాలనీ, అనేకం అయిన వాటిని అలవాటు చేసుకోసుకోవాలని నీ సాహిత్యం ద్వారా వుపదేశాలు చేశావుగా, ఎందుకు వదిలిపెట్టలేం?"

సజ్జన్ తన మీద విసిరిన వ్యంగోక్తికి అతని గుండెలో తూటుపడింది. కొంచెం సేపటి వరకు మౌనం దాల్చి మహీపాల్ అన్నాడు–"ఆలోచించడం సులభం కాని ఆచరణలో పెట్టడం కష్టం. నీకు ఈ నియమం వర్తించదను కుంటున్నావా?"

సజ్జన్ ఆలోచనలో పడ్డాడు. "నిజమూ అబద్ధమూ రెండునూ" అని కాస్సేపటికి అన్నాడు సజ్జన్.

"అదెలా సార్థకం?"

"నా వుద్దేశంలో నాలో సంకల్పబలం నీకన్న ఎక్కువవుందనుకొంటాను. సాధారణంగా ఓ విషయం గురించి నిర్ణయానికి వచ్చానంటే జీవితంలో దాన్ని ఆచరణలో పెట్టేస్తాను"

"అయితే ఓ మాట అడుగుతాను. నిజం చెప్పు. ఈ వీధిలో ఏవేవో నూతన ప్రక్రియలూ ప్రయోగాలూ చెయ్యాలని ఎంతో ఆర్తితో వచ్చావు కదా. నీ సంకల్ప బలం నిన్నెంత వరకు గమ్యస్థానం దగ్గిరకు తీసుకెళ్ళ గలిగింది?"

ఆ ప్రశ్నకు సజ్జన్ మెదలకుండా ఆలోచిస్తూ కారు డ్రైవ్ చేస్తున్నాడు. మహీపాల్ అతన్ని మళ్ళీ అదే ప్రశ్నతో రెట్టించాడు. సజ్జన్ తన తప్పిదాన్ని ఒప్పుకుంటూ" ప్రేమకోసం మరిచిపోయాను మిత్రమా. లేకపోతే ఈపాటికి బాలావరకు విజయం సాధించే వాణ్ణి" అని అన్నాడు.

"ప్రేమలో పడి నిన్ను నువ్వెందుకు మరిచిపోయినట్టు?"

"అంతకు ముందు నా జీవితంలో వెలితి వుంది కనుక"

"నా జీవితంలో కూడా ఎన్నో వెలితిలు వున్నాయి. వాటి మూలాన్నే నేను ఓడిపోతుంటాను" అంటూ మహీపాల్ దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచాడు.

తరువాత చాలా సేపటి వరకు ఇద్దరి మధ్య సంభాషణ ఆగిపోయింది. తమ తమ ఆలోచనల్లో ఇద్దరూ మునిగి మౌనంగా వుండిపోయారు. కపూర్ హోటల్ యజమానికి చెప్పి పై అంతస్తు మీద ఓ ఖాళీగదిలో కూర్చోవడానికి ఏర్పాటు చేయించుకున్నారు"

"ఇవ్వాళ పుదయాన్నుంచి నా మనస్సుఆదోలా వుంది" అని అన్నాడు మహీపాల్.

"ఎందుకు"

"నా అంత్యకాలం దగ్గిరపడిందని అనుకుంటున్నాను"

"పిచ్చివాడిలా వున్నావు. ఏమైనా చెడ్డకల వచ్చిందా యేమిటి?"

"అవును."

"కలలనేవి మెదడు లోంచి పుడతాయి"

"ఎప్పుడూ కాదు. కల అనేది రాబోయే సంఘటనకు సంకేతంలాంటిది. నాలోపాలు నన్ను ముంచి వేస్తాయని భయంగా వుంది. నేను వాటితో పోట్లాడ లేకపోతున్నా"

"కలలో ఏమి చూసావేమిటి?"

"చినిగి చీకిన పాత గుడ్డలూ, విరిగిన కుండ పెంకులూ, చీముతో తడిసిన దూది పింజాలూ, పట్టించో నిండిన ఓ కంపుకొడుతున్న సందుగుండా వెళ్ళుతున్నట్టు కలవచ్చింది."

"ఇంకా ఎవరైనా కనిపించారా?"

"నేను తప్ప ఎవరూ లేరు"

"తర్వాత"

"నడుస్తూ నడుస్తూ అలసిపోయాను. సందులోంచి బయటపడదామనుకున్నాను. కాని బయట పడలేకపోయ్యాను. కలలో నాకు ఎంతమానసిక ఆందోళన కలిగిందో నీ కెలా వర్ణించి చెప్పను? అది ఓ పెద్ద అనుభవం అనుకో."

"తర్వాత?"

"తర్వాత నేను ఓనది ఒడ్డుకు చేరుకున్నాను. నదిలో ఓ పడవ వెళ్తోంది. దాని నిండా ప్రయాణీకులు వున్నారు. వారంతా నన్ను రమ్మనమని పిలువ సాగారు. పడవను ఒడ్డుకు తెచ్చారు. నేను పడవలో ఎక్కేసాను. దాన్లో తెలిసిన వాళ్ళు చాలా మంది వున్నారు."

"ఎవరెవరున్నారు?"

"షీలా, కళ్యాణి, కర్నల్, మా చిన్నమ్మ కొడుకూ, ఇంకా ఎవరెవరో వున్నారు"

"ఆ తర్వాత"

"నది మధ్యకు వెళ్ళగానే పడవ బోల్తాపడింది. అందరూ ఈదసాగారు. పచ్చని నీళ్ళలోంచి చాలా బురుజులూ, మీనార్లూ పాడుబడ్డ శిథిలాలూ కనపడ సాగాయి. ఆశిథిలాలు నన్ను బలవంతంగా తమవైపు ఆకర్షించడం మొదలెట్టాయి"

"తర్వాత"

"నాతో చాలా మందిని లాక్కోని పోయాను. కాని చూస్తూండగానే వాళ్ళంతా నాచూపుకు అందకుండా వెళ్ళిపోయారు. నది అట్టడుగు భాగంలోని శిథిలాల్లో కూరుకుని చిక్కుపడిపోయా. పైకి రావడానికి వీల్లేకుండా నన్నెవరో పెద్ద గొలుసుతో బంధించివేసినట్లయింది. ఎంతోసేపు గింజుకులాడాను. గిలగిల తన్నుకున్నాను. కాని దాని నుంచి విముక్తి పొందలేకపోయాను"

"ఇదంతా నీకు జీవితంలో కలిగిన ఘోరపజయానికి ప్రతీకలు మాత్రమే. ఆ బురదా, దుర్గంధం, ఆ శిథిలాలూ నీ మనసులో అల్లుకున్న నైరాశ్యాన్నే తెలుపుతున్నా యి. నీటిలో ఒక్కొక్కదాని విశ్లేషించుకుంటూ వెళ్ళు. మృత్యువు ప్రశ్నేరాదు ఈ సందర్భంలో"

మహీపాల్ మెదలకుండా వూరుకున్నాడు. సజ్జన్ కాఫీ తాగి సిగరెట్టు వెలిగించాడు. మహీపాల్ కోసం అతని ముందు సిగరెట్ కేసు తీసి వుంచాడు. మత్తులో కొంతసేపు కళ్ళార్పకుండా ఏదో ధ్యాసలో మునిగిపోయాడు మహీపాల్. మళ్ళీ తేరుకుని "నీతో ఓమాట చెప్పి నా గుండెలోని బరువు తగ్గించుకోవాలి....నిన్ను చూసి నాకు ఈర్ష్య కలుగుతుందోయి. నువ్వేమైనా అనుకున్నా సరే నాగురించి."

ఆ మాటకు సజ్జన్ మౌనంగా ఓ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

"ఇంకో మాట కూడా చెప్పనా? నువ్వంటే నాకు ఇష్టం కూడాను"

"మరి కర్నలంటే!"

"కర్నల్ దేవతామూర్తి. మన ఇద్దరం కలిసి కూడా అతనికి సరి తూగలేం. అతని మానసిక చేతనం మనలా పరిపక్వం కాకపోయినా ఇతరు లంటే ప్రాణాలిస్తాడు. నీకో మాట ముఖ్యంగా చెప్పాలనుకుంటున్నాను. జీవితంలో ఎప్పుడూ ఓడిపోవద్దు."

'జయాపజయాలు మన చేతిలో లేవు కదా! పరిస్థితుల్ని బట్టి అవి ఆధారపడి వుంటాయి."

"ఏమైనా సరే. అలసి సొలసి కూర్చుండిపోవడమే అసలైన ఓటమి. ఓటమి అంటే నా వుద్దేశం అదే. నువ్వు ప్రారంభించిన పని పూర్తయ్యే వరకు విడిచిపెట్టకు"

స్నేహంతో తడిసిన మహీపాల్ ఉపదేశం అతని హృదయాన్ని తాకింది. ఉద్వేగంతో ''నువ్వు నా వెంటవుంటే మనం ప్రపంచాన్నే జయించి పారేస్తాం" అన్నాడు సజ్జన్.

"నేనీ వూబిలోంచి బయటికి రాలేను. నన్ను నేను అర్థం కూడా చేసుకో లేని స్థితిలో వున్నాను. చాలా అలసిపోయాను. పదిహేను సంవత్సరాల క్రితం అనుకుంటూవుండేవాణ్ణి ఎంతో సాధించగలనని. ప్రపంచాన్నంతా తారుమారు చేయగలనని. పరమేశ్వరుడు నాకే అగ్నిపరీక్ష పెట్టాడు. నన్ను నేనే మార్చుకో లేకపోయినాను. సంఘాన్ని ఎలా మార్చగలను?"

"నీ వేదాంతన్నంతా అలా కట్టిపెట్టు" అన్నాడు సజ్జన్ విసుగుదల చూపిస్తూ.

"నువ్వసలు పొద్దున్నే ఎందుకొచ్చినట్లు?" అని అడిగాడు సజ్జన్ మళ్ళీ.

"చెప్పానుగా ఒంటరితనాన్ని భరించలేక తోడుకోసం నీ దగ్గరకు వచ్చాను. కర్నల్ దగ్గరకే వెళ్దామనుకుని అతను ఇటువంటి విషయాల్ని బుర్రకు పట్టించుకోడని" అంటూ మహీపాల్ ఆగిపోయి ఓ దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు.

మహీపాల్ వాలకాన్ని పరికిస్తూ 'నువ్వు నీకూ షీలాకూ చాల అన్యాయం చేస్తున్నావ్ మహీపాల్. షీలాతో ఏరోజు నుంచి సంబంధాన్ని విడగొట్టుకొన్నావో ఆరోజునుంచే నీలో ఈ నైరాశ్యం మొదలయింది" అన్నాడు సజ్జన్.

"అవన్నీ ఇప్పుడెందుకులే... ఆ ప్రసక్తి అంతా ఇప్పుడు లేకు" అంటూ బిగుసుకుపోయి కూర్చున్నాడు మహీపాల్. చేతిలోని గ్లాసులో బంగా రంలా తళతళ మంటోన్న విస్కీని తదేక ధ్యానంతో చూస్తూ వుండిపోయాడు.

'నీ మేనకోడలు వివాహం ఎప్పుడన్నావు?'

"ఆషాఢమాసంలో. అమావాస్య వెళ్ళిన తర్వాత నవమిరోజున"

"వివాహం మా ఇంట్లోనే చేద్దాం. కన్య, వదినగారు కలిసి నిర్ణయించు కున్నారు"

"అలాగా?"

"ఈ వార్త విని నాకు చాల సంతోషం కలిగింది. రాత్రి ఈ విషయం గురించే చాలా సేపు మాట్లాడుకున్నాం. వియ్యాల వారి విడిది కోసం రాజా సాహెబుగారిని అడిగి వారి చిన్న బంగళా ఖాళీ చేయిస్తాను. మీ యిళ్లలో వియ్యాలవారు హిరణ్యాక్షవరాలు కోరతారనీ, గొంతెమ్మ కోరికలు చెల్లించు కుంటారనీ విన్నాను"

"చెల్లించకపోనీయ్ పెద్దపల్లి"

"నేనంత వరకు రానీయనులే. వాళ్లు అనుకున్న దానికంటే ఎక్కువ గానే మర్యాదలు చేసివాళ్ల నోటికి తాళం వేయిస్తాను. పెళ్లికొడుకు చాలా అభ్యుదయ వాది అని విన్నాను. నిజమేనా?"

"అవును"

"అయినా ఈ పల్లెటూరి మూర్ఖత్వం పోలేదన్న మాట"

"ఏమో!"

"సరే మహీపాల్. ఒక విచిత్రం చూడు. ఆవ్రాళ ఉదయం ఎన్నో మాటలు విన్నాం కదా అరుగు మీద కూర్చొని, అవన్నీ వేటిని సూచిస్తున్నాయో చెప్పగలవా? అభ్యుదయ సమాజం ముందడుగు వేసింది. అభివృద్ధి నిరోధక శక్తులు వెనుకంజవేసాయి. ఇంతపరాభవం జరిగిన తర్వాతకూడా ఈ అభివృద్ధి నిరోధకతత్వం- ఈ రియాక్షనరీలు- ఈ మందబుద్ధులే ఇంకా సంఘాన్ని యేలుతున్నారు. వాళ్ళ పలుకుబడి చావలేదు. ఎందుకంటావ్?"

మహీపాల్ కొంచెం సేపు మౌనవ్రతం వహించాడు. మహీపాల్ నుంచి సమాధానాన్ని రాబట్టాలని అతణ్ణి కన్నార్పకుండా చూస్తూ కూర్చున్నాడు సజ్జన్. తీరా అతనేమీ మాట్లాడక పోయేసరికి ధర్మభిక్ష దొరకని బికారిలా అతని మీద నుంచి దృష్టి మరల్చి కిటికీవైపు చూడసాగాడు. సిగరెట్టును ఏష్ట్రేలో వది లేస్తూ మహీపాల్- "నీకు కావలసిన సమాధానం నా దగ్గరవుంది కాని నా అంత రాత్మలోని ఓ మాట చెపుతాను విను. ఆ సమాధానం చెప్పే అర్హత నాకు లేదు" అని అన్నాడు.

"ఎందుకో?"

"కారణం. నేనే దాన్ని ఆచరణలో పెట్టలేదు గనుక"

"అయినా నీ వుద్దేశ్యం ఏమిటి?"

'చెప్పడం శుద్ధ దండుగ. జీవితంలో అంత్యదశను చేరుకున్న నేను అబద్ధం ఆడదలచుకోలేదు. నా అంతరంగంలో దాచుకున్న అబద్ధాన్ని బహిరంగం చేయడానికి నాకు ధైర్యం చాలనంతవరకూ నిజాన్ని గురించి వర్ణించడం ఉత్త దాంబికమే అవుతుంది'.

మహీపాల్ వేదాంత ధోరణి చూసి విసుగ్గా అన్నాడు సజ్జన్- "నీ ఈ పిచ్చి ప్రేలాపన నన్ను విసుగెత్తిస్తోంది ఏదో కలవచ్చినంత మాత్రాన నీలాటి చదువుకున్న వ్యక్తి కూడా ఇంతగా బ్రహ్మపాడు చేసుకుంటోంటే అంతకన్న సిగ్గు చేటైన విషయం మరోటి వుండదు నువ్వో సత్యపాలన చేయలేకపోయావంటున్నావు. నిజమే అనుకో. కాని ఇతరులకు బోధించి వాళ్ళను శక్తిమంతులుగా చేయవచ్చు కదా!"

"నాలోవున్న శక్తి వుడిగి నేను చస్తోంటే మరొకరికి ఏమి ఇవ్వగలను? మహమ్మదూ బెల్లం తింటోన్న అబ్బాయి కథ నీకు తెలిసేవుంటుందనుకుంటాను. మహమ్మదు బెల్లం తిననంతవరకు అది తినకూడదని ఆ పిల్లాడికి ఎలా బోధ చేయగలడు?...పోనీ. దానికీ దీనికీ సాపత్యం లేదనుకుందాం. అలా అనుకున్నా నువ్వే మొదటి నుంచి బెల్లం తినే రకానివి కావే"

"నువ్వు మరీ మార్మికవాది వౌతున్నావు"

"దీనిలో మర్మం ప్రసక్తేలేదు, సమస్య సూటిది. వేల సంవత్సరాలు కష్టించినా హిందూదేశంలో ఈ అనాచారాల్ని ఒకటి వేళ్ళతో పెకలించలేక పోయాం. ఇప్పుడైతే చెదురుమదురుగా కొంత మంది ప్రయోగాలు చేస్తున్నారనుకో. కాని వాటి ప్రభావం సంఘం మీద అంతంతగానే పడింది. సంఘ సంస్కరణ కార్యం నువ్వు కూడా చేశావు కాని కేవలం నువ్వు మాత్రమే ఒంటరిగా చేసావు."

మహీపాల్ ధోరణి చూస్తోంటే సజ్జలోని ఉత్సాహం అంతా మంద గించింది. మహీపాల్ ఇవ్వాళ నిషాలో వున్నాడు. విషాదంతో మాట్లాడు తున్నాడు. తను వేసిన పొడుపు కథను తానే విప్పుతూ- "నా వుద్దేశం కుల భేదాలు. భారత దేశంలో కుల వ్యవస్థ నిర్మూలించినంతవరకూ నువ్వు ఎంత ప్రయత్నాలు చేసినా ఈ సంఘాన్ని 'మానవతా సంఘం'గా సాధించలేవు".

"ఇప్పుడు కుల వ్యవస్థ అంతతీవ్రంగా లేదనుకుంటాను"

"ఎక్కడ? సివిల్ లైన్సులోనే సందుల్లోకి గొందుల్లోకి వెళ్ళి చూడు. వందకు నాలుగు కేసులు ఇటువంటివి వున్నంత మాత్రంచేత సాంఘిక మార్పు వచ్చిందని ఘంటాపథంగా చెప్పలేవు."

"కాని మునుపటి మాదిరిగా దారుణంగా కులాల్ని పాటించడంలేదు జనం కూడా. వర్మ భార్య పురుడు నొప్పులు పడుతుంటే పెద్దమ్మలాంటి కరుడు గట్టిన ఛాందసురాలి గుండె కరిగిందంటే అది మార్పే అవుతుంది. కన్య అంటే ఇప్పుడామెకు వ్యతిరేకత లేదు. తన మంచినీళ్ళకుండను ఈ నాటికి ముట్టుకో నివ్వటంలేదంటే అది వేరే విషయం" అన్నాడు సజ్జన్.

"వర్మ భార్యన్నా నీ భార్యన్నా ఆమె వ్యతిరేకించడానికి, తన జాతి ఔన్నత్యాన్ని కాపాడుకోవాలనే మన సంఘం యొక్క అంతరాత్మ ఇమిడివుంది. ఇదే ఏభైఏళ్ళ క్రితం ఈ పెద్దమ్మా, నువ్వూ, నీ భార్యా, వర్మా పుట్టివున్నా రనుకో. అలాంటి పరిస్థితిలో మీరు నిజంగా చచ్చిపోయినా ఆమె జాలిపడేది కాదు. ఆ రోజుల్లో తన కులాన్ని ఒదిలి అవతలి వాళ్ళను పెళ్ళిచేసుకోవడం అనేది ఊహకు కూడా అందని విషయం. దాని కారణంగానే కులం అంటే అప్పటి వాళ్ళు అంతనిష్ఠ శ్రద్ధచూపేవాళ్ళు. సాంఘిక కట్టుబాటు అంత కఠో రంగా వుండేది. పెద్దమ్మ పిండి బొమ్మలు చేసి నీ గుమ్మం ముందు వుంచిదంటే ఆనాటి కర్కశసాంఘిక వాతావరణమే కారణం. ఇప్పుడంటావా, సంఘ సంస్కర్తలు వుధృతంగా సంస్కరణోద్యమాలు నడుపుతుంటే ఆచారాలూ, సంప్రదాయాలు అంటూ పఠిస్తోన్న వాళ్ళ కోటలు చాలావరకు ధ్వంసమై

పోయాయి. అందుకే కాలం మిమ్మల్ని కాదనే ధైర్యంలేక స్వీకరిస్తోంది కాని మీ సిద్ధాంతాల్ని ఇంత వరకూ మనస్ఫూర్తిగా అంగీకరించలేదు"

"అదే నేను మొత్తుకునేది. కాని కొత్త తరం కొత్త సిద్ధాంతాన్ని ఎలా ఆచరణలో పెడుతుందనేదే ప్రశ్న"

దానికో తీవ్రమైన వుద్యమాన్ని లేవదియ్యాలి. ఈ కులాల్ని దాన్ని పరిపోషిస్తోన్న ఈ దిగజారుడు సాంఘిక వ్యవస్థనూ ఛిన్నాభిన్నం చెయ్యడానికి విశాల ప్రాతిపదిక మీద వుద్యమాన్ని లేపాలి" అని పదాల్ని తూచి వాడుతూ "భారత దేశంలో కుల వ్యవస్థను ఖండిస్తూ ఇప్పటి వరకు ఎన్ని ఉద్యమాలు లేచి ఎలా అణగారి పోయాయో వాటన్నింటినీ ఈ ఉద్యమ సారథులు దృష్టిలో వుంచుకోవాలి. ఈ కులవ్యవస్థే ఒకప్పుడు భారతదేశం దాస్యానికి కారణభూతమై తర్వాత పోను పోను దాని నిరంతర పతనానికి దారితీసింది. నువ్వు నీ కులాన్ని వదిలి పెట్టమని ఎవరినైనా అడిగి చూడు. నువ్వతణ్ణి అతని హిందూ మతానికే తిలోదకాలివ్వమని అంటునట్టుగా వంచలాడి పోతాడు" అన్నారు మహీపాల్.

సజ్జన్ ముఖకవళిక గంభీరత్వాన్ని సంతరించుకుంది. అతను ఆలోచనలో పడ్డాడు. గ్లాసులోని విస్కీ, పళ్ళెంలో మిగిలిన డ్రైఫ్రూట్స్ ఖాళీచేసే పనిలో మునిగి వున్నాడు మహీపాల్. కాస్సేపయిన తర్వాత మాట్లాడాలన్న ఆరాటం ఇద్దరికీ ఒకే పర్యాయం కలిగింది. మహీపాల్ ఏదో మాట్లాడబోయి సజ్జన్ వైపు చూసి ఆగిపోతూ 'ఊఁ' చెప్పు" అని అన్నారు

"ఈ సంఘాన్నే మార్చడానికి నా జీవితాన్నే పందెం వేస్తాను. నేను దీన్ని మార్చిగాని నిద్రపోను" అని అంటోంటే సజ్జన్ ముఖంపై దృఢత్వం తొణికిసలాడడం మహీపాల్ స్పష్టంగా చూసాడు. మహీపాల్ కూడా ఏదో చెప్పాలనుకుంటున్నాడని గమనించాడు సజ్జన్. "నువ్వేదో చెప్ప బోతోన్నట్టుంది కదూ" అని అడిగాడు.

"ఓహో! అదా! అంటూ నవ్వి "రూపీతన్ వాళ్ళ కారు ఇస్తానని వాగ్దానం చేసాడు. కళ్యాణం పెళ్ళి అయిన తర్వాత తీసుకుందామని అనుకుంటు

న్నాను. ముందే తీసుకుంటే కొంపతీసి అదే కట్నంగా ఇమ్మని డిమాండు చేయొ చ్చుంటారేమో!" అని అన్నారు మహిపాల్.

కొద్దిసేపటి తర్వాత మహిపాల్, సజ్జన్ ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు. మహిపాల్‌ని ఇంటి దగ్గర కానీ అతని కెక్కడకి వెళ్ళాలని వుంటే అక్కడే దిగబెట్టి వెళ్దామను కున్నారు. కాని మహిపాల్ తన్నిలా వదిలి వేయమని అనేసరికి తనేమీ చేయలేక పోయాడు. హోటల్ వరండాలో సజ్జన్ ఫోర్డ్ కారు నిలబడి వుంది. తన కారులో వదిలి వెళతానని సజ్జన్ సహజంగానే అన్నాడు మహిపాల్‌తో. కాని మహిపాల్‌కి స్వాభిమానం అడ్డు వచ్చింది. రూప్‌రతన్ ఇస్తానన్న ఫియట్ కారు అతని బుర్రలో వెంటనే మెదిలింది. రూప్‌రతన్ తనతో అన్నది నెమరువేసు కున్నాడు మహిపాల్– "నువ్వు గొప్ప రచయితవు. నీకో కారు వుండడం ఎంతైనా అవసరం". ఆలోచనైతే అతనికి నచ్చింది కాని అంత పెద్ద మొత్తం ఇచ్చి కారు కొనలేడు, దానంగా స్వీకరించ దానికి అతనిలోని ఆత్మాభిమానం ఒప్పుకోదు. తన చిన్న కారును రెండున్నర మూడు వేల రూపాయలకు అమ్ముతానని రూప్‌రతన్ ప్రస్తావన చేసాడు. మహిపాల్ మనస్సు వూగిసలాడ సాగింది. ఇంటికివచ్చి ఆ విషయం కళ్యాణితో చర్చించాడు. కారు పేరు వినగానే పెద్దవాడు, చిన్నవాడూ, తపోధన్, రజ్జో అందరికి నోట్లో నీళ్లూరాయి. రాబోయే పుస్తకాలకు రాయల్టీకింద ముందే అడ్వాన్సుగా రూప్‌రతన్ పైకం ఇస్తానన్నాడని కోతలు కోసాడు మహిపాల్. అంతే; కారు ఇంటికి రావడం అందరికీ అత్యవసరంగా కనిపించ సాగింది. పెద్దబ్బాయి కారు నడపటం నేర్చుకోవడానికి పథకం తయారు చేసాడు. కారుకు రోజూ ఎంతమేరకావాలో అని లెక్క వేస్తోంది కళ్యాణి. రూప్‌రతన్ పత్రికలో పని రోజూ ఓ గంటా రెండు గంటలు చూసినందుకు గాను కారు అలవెన్సు తీసుకొంటానని మహిపాల్ అన్నాడు. ఆటుతర్వాత ఇంకా ఏమీ మాట్లాడ్డానికి మిగల్లేదు. పిల్లలయితే ఇంటికోసం పిచ్చి గంతులు వేయ సాగారు. కాని మహిపాల్ మాత్రం కుటుంబం వివాహం కాకముందే కారుతెచ్చి యింట్లో పెట్టడానికి అనుమానించాడు. పిల్లకి కారుకూడా వుందని వియ్యం

వాళ్ళు ఇంకా యేమేమిరాబట్టుతారో అని భయం పట్టుకుంది. అందుకే అతను
వణ్లారి పోయాడు. సజ్జన్‌కి సొంత కారుంటే తనకుకూడా సొంతది ఆలోచన
పట్టుకుని పీడిస్తోంది. అందుకే సజ్జన్ నాలుగైదు పర్యాయాలు తన కార్లో దిగ
బెడతానని అన్నా అతను రిక్షాలో వెళ్ళడానికే నిర్ణయించుకున్నాడు. రిక్షాలో
వున్నాడేమో గుల్జార్ హౌజ్ రత్‌గంజ్ లోని ఐశ్వర్యమంతా తనదిగా కనిపిం
చింది. ప్లాజా సినిమా నుంచి ప్రిన్స్ సినిమా వరకు ఆరోడ్డంతా ఆడవాళ్ళతోనూ
మగవాళ్ళతోనూ కిటకిటలాడుతోంది. అందంగా అలంకరించిన దుకాణాల పసారం
గానూ, త్వరత్వరగానూ, మందగమనంతోనూ, వుల్లాసంగానడుస్తోన్నారు జనం.
బస్సులు, కార్లూ, రిక్షాలూ, సైకిల్లూ వస్తూ పోతోంటే నాలుగువైపులా కనపడు
తోన్న కళ రిక్షాలోవున్న మహిపాల్ మత్తును కూడా పెంచేస్తోంది. ఓ కిల్లీకొట్టు
దగ్గరాగి బంగాళా బీడా కట్టించుకొని ఓ సిగరెట్ ప్యాకెట్టూ అగ్గిపెట్టె తీసు
కున్నాడు మహిపాల్. మత్తులో వెలిగిపోతోన్న తన ముఖాన్ని ఓసారి చూసు
కున్నాడు దుకాణం నిలువుటద్దంలో. హనుమాన్ దేవాలయం ముందుగా రోడ్డు
మీదనడిచి వెళ్తోండే ఓ ఖాళీ రిక్షా కనిపిస్తే పిలిచాడు. అతని వాలకాన్ని ఓ
సారి చూసి వాడు ఆపకుండా వెళ్ళిపోయాడు, తన కీపివి రిక్షావాడు అవమా
నించినట్లయింది. అప్పటికప్పుడు రిక్షావాణ్ని అక్కడికక్కడే పట్టుకొని హంట
రుతో నాలుగు వడ్డిద్దామన్న కోపంవచ్చింది. నిషాలో నరనరం అతనికి ఎబ్బె
ట్టుగా అనిపించింది. కారుకొనే తాహతు తనకు వుంటే వెధవ ఓ రిక్షావాడు
తనంటే అంత నిర్లక్ష్యంగా వెళ్తాడా అని వుద్రేకం కలిగింది. అప్పుడే వెళ్ళి
రూప్‌రతన్‌తో కారు బేరం ఆడదామన్న కోరిక కలిగింది. పళ్ళకొట్ల దగ్గర
కొచ్చేటప్పటికి మరో ఖాళీ రిక్షా కనిపించింది. వాడు కూడా ఖాళీలేదన్నాడు.
తను ఎలాగైనా ఏదో ఒక వాహనంపై వెళ్ళాలన్న పట్టుదల మహిపాల్‌లో
హెచ్చింది. రిక్షావాణ్ణి లెంపపగల కొడదామన్న తపన హెచ్చింది. కాని ఇంకా
కొంచెం తెలివిలో వున్నాడేమో ఆపని మాత్రం చేయలేదు. రోడ్డుదాటి నరహి
చౌరస్తా చేరిన తర్వాత రిక్షావాళ్ళు అక్కడే ఆడుగుతున్నా వాళ్ళమీద పగతీర్చు
కోవాలన్న తలంపుతో టాంగా బేరం ఆడాడు. కాసేపు ఇలా అలా షికారు

చేద్దామని అతనికి ఇంతకుముందున్న తలపు మార్చుకుని సరాసరి రూప్‌రతన్ దగ్గరకెళ్ళి వెంటనే కారు కొనివేయాలన్న నిశ్చయానికి వచ్చారు.

టాంగామీద దర్జాగా కార్లదాటి వెనక్కు పరుగొని వచ్చేపోయే కార్లను చూస్తోన్న మహీపాల్ ఏమాత్రం కలవరం చెందడంలేదు. కార్లు కలవాళ్ళంతా అతనికి సగోత్రీకుల్లా కనపడసాగారు. ఈ రోడ్డమీదే అతనికారుకూడా వెనుకనో ముందో కనపడేరోజు రాబోతోంది. ఆ కనిపించే చిన్న కారులో ముందు సీటులో కూర్చున్న జంటలా తనూ కళ్యాణితో కూచుంటాడు. జంటసంగతి జ్ఞప్తికి రాగానే మహీపాల్ అనుకున్నాడు- కళ్యాణితో కలిసి షికారు కెళితే అతనికి నిజంగా ఆనందం కలుగుతుందా మరి! ఏమో! కళ్యాణి పాతకాలం మనిషి. షీలాతో అతను చాలాసార్లు కార్లో వెళ్ళాడు. మహీపాల్ స్మృతిపథంలో షీలా కదలాడసాగింది, షీలా నిజంగా అతనికి ఏ అపచారం చేసింది! ఆరోజు సజ్జన్ ఇంట్లో షీలా అతణ్ణి కలిసినప్పుడు ఎంతదీనంగా బ్రతిమాలుకుంది తన్ను మరచిపోవద్దని. షీలాతో తెగతెంపులు చేసుకుని తాను ఆమెకు చాలా అన్యాయం చేసి నట్లనిపించింది. కాని ఆమెతో తాను మళ్ళీ తిరగడం ప్రారంభిస్తే తన ఈ వైభవం అంతా షీలానుంచి ఎరువు తెచ్చుకొన్నదేనని సంఘం తన్ను ఎగతాళి చేస్తుందన్న అనుమానం కలిగింది. షీలాకు దూరంగా వుండడంలో అతని ఆంతర్యం అంతే. అందే రూపరతన్‌తో కలిసితను ధనార్జనచేస్తే ఎవరైనా విమర్శించినా తనకు అభ్యంతరంలేదు. ఆర్థిక కారణాన్ని పురస్కరించుకుని ధనవంతులైన ఆడవాళ్ళతో ఎంతోమంది వావరాయణ సంబంధాలు పెట్టుకుంటారని తనకు తెలుసు. కాని ఆడవాళ్ళ ఆసరాతో ధనార్జన చేయడం మహీపాల్ ఎప్పుడికి మెచ్చుకోలేని విషయం. అందు కనే షీలాతో మళ్ళీ సంధి చేసుకోవడానికి తను సుముఖంగాలేడు.

టాంగా లాంక్ రోడ్డు మీద పరుగెత్తుతోంది. షీలా మనసులో కదిలి అతని మనస్సంతా మళ్ళీ చెల్లాచెదరౌతోంది. మానవ ప్రేమను కాదని తాను ప్రాపంచిక వైభవం కోసం ప్రాకులాడడం అన్యాయంలా తోచింది. కార్లూ, బంగళాలూ, నౌకర్లూ, ఆర్థిక సమృద్ధివల్ల కలిగే అనేక రకాల సౌకర్యాలూ

దర్శా అన్నీ మంచివే కాని మహత్తర ఆదర్శాలూ, ఆలోచనల ముందు వాటి విలువ బహు తక్కువ. నిండు యౌవనంలో సిద్ధాంతాల కోసం తాను ఈ ఐశ్వర్యాన్ని ఎన్ని సార్లు కాలతన్ను కోలేదు. సిద్ధాంతాల కోసమేగా తాను తన అమ్మగారి పుట్టిల్లు వదిలి బయటికి వచ్చింది? ఆ ఆదర్శాల ప్రభావానికి గురి అయిన తాను రూపరతన్‌తో మొదట్లో తెగతెంపులు చేసుకున్నాడు. తమ్ముడి వివాహం కట్నం లేకుండా చేసాడు. తమ్ముడి చదువు కోసం తన భార్య వంటి మీద నగలన్నీ వొలిచి తెగనమ్మడానికి కూడా వెరవలేదు. అలాంటి త్యాగ ధనుడైన మహీపాల్ ఈరోజు ఆర్థిక సమృద్ధి కోసం, ఐశ్వర్యం కోసం అసిద్ధాంతాన్నే తాకట్టు పెడుతున్నాడు తాను ఎంత దిగజారి పోయాడు! కాగితం మీద కలం పెట్టి ఎన్నో నెలలయింది. తన ఇల్లూ, తన ఇల్లాలూ అని చెప్పి నలువైపులా లక్ష్మిని పోగుచేసు కోవడంతోనే జీవితాన్ని వెళ్ళతీస్తున్నాడు. తన రచనల్లో కెల్ల తలమానికంగా రాద్దామని ప్రారంభించిన నవల మూలపడి మూలుగుతోంది. రాయడానికి కూర్చుందామని చాలాసార్లు ప్రయత్నించాడు. కాని కూర్చోగానే అతనిలోని కల్పనా శక్తి గాలికి ఎగిరిపోయే దూదిపింజల్లా దేనికది వూడిపోయి చెదిరి పోతోంది. దీనికి వ్యతిరేకంగా సజ్జన్ రోజు రోజుకు సంఘంలో మెరుస్తున్నాడు. అతని ప్రసిద్ధి, పరువూ క్రమక్రమంగా పెరుగుతోంది. స్వల్పవ్యవధిలో సజ్జన్ ఖ్యాతి ఎంత ఇనుమడించిందంటే తాను కూడా పోటీ చేయలేక పోతున్నాడు. సజ్జన్ యశస్సును చూసి తాను ఈర్ష్యపడుతున్నాడు. కాని ఆ ఈర్ష్య నిష్ప్రయోజనం. వికాసం పొందుతోన్న సంఘం ఈర్ష్య కారణంగా వచ్చే వ్యతిరేకతా భావాన్ని లక్ష్యపెట్టదు, సజ్జన్ మొదలెట్టిన సాంఘిక వుద్యమాన్ని ఖండిస్తూ తాను నిన్న ఓ వ్యాసాన్ని ప్రచురించాడు. వ్యాసం ఎంతో తర్కసమ్మతంగా వున్నా దానిలో అతను ప్రకటించిన సందేహాలు నిరాధారం, అనుచితమైనవి. ఇలాంటి సాంఘిక వుద్యమాలవల్ల సంఘంలోని దుర్గంధమే బయటికి రావడం మినహా మరేమహత్తర ప్రయోజనం సిద్ధించదని తాను వాదించాడు. కాని సంఘంలో కుళ్ళును మాత్రమే బయటికి లాగే వుద్దేశ్యంతో సజ్జన్ ఈ పని చేయడం లేదని అతని అంతరంగానికి తెలుసు. అదే వాస్తవం కూడ. ఇప్పుడతనికి బాబారామ్‌జీ నిర్మాణాత్మక కార్యక్రమాన్ని

ఇస్తున్నారు. అతని కార్య కలాపాలకు తన్య కూడ చేదోడుగా వుంది నిర్మాణాత్మకంగానే పనిచేస్తోంది. ఇవ్వాళ సజ్జన్ అతనితో మాట్లాడుతోంటే సజ్జన్ మాట్లాడుతోన్నట్టు కాక తాను నమ్మినసిద్ధాంతాల్ని ఆచరణలో పెట్టాలన్న అతని దీక్ష, దృఢసంకల్పమే మాట్లాడుతోన్నట్టు అనిపించింది. సిద్ధాంతాల్ని నిష్కల్మషంగా ఆచరణలో పెట్టేచోట ధ్వంసాత్మక బుద్ధి పనిచేయ లేదు. మహీపాల్ అంతరాత్మపై వ్యాపించిన ఒక్కొక్క పొర ఇవ్వాళ విడిపోతోంటే అతని ఆత్మ అంతగా క్షోభించడం మొదలెట్టింది. తానుఎక్కడికి వెళుతున్నాడు? ఏదిశలో వెళదామని బయలుదేరి ఏదిశకు మళ్ళాడు? ఇదంతా ఎందుకు జరుగుతుంది? ఓ భగవంతుడా! మారుతున్న దేశం, కాలం, సమాజానికి మోటారు కారున్న మహీపాల్ అవసరం ఎక్కువగా వుందా లేక కలాన్నే ఆయుధంగా ధరించి సంఘాన్ని చీల్చి చెండాడే మహీపాల్ రచయిత ఎక్కువ అవసరమా? రామచరిత్ మానస్ రాసిన మహాకవి తులసీదాసు భౌతిక ఐశ్వర్యానికి ప్రాధాన్యత ఇచ్చివుంటే ఈనాడు మనం అతణ్ణి స్మరించు కుంటామా? అక్బరు పాదుషా మంసబ్ యిచ్చినా "మూడు మూరలు గోచీ వుంటే చాలూ, కూజావద్దు నారా వద్దు" అని ఘంటా పథంగా చెప్పాడు. తాను కష్టసమయంలో వున్నప్పుడు ఎన్ని పర్యాయాలో తానీ పంక్తిని స్మరించుకొని ఆత్మ బలాన్ని పుంజుకునే వాడు.

దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచి మహీపాల్ తనలో తాను ఏదో సణుక్కున్నాడు. ఉగబారి పోయిన ఉత్సాహానికి గాఢ సంతాపాన్ని తెలియ చేస్తోన్న తీర్మానంలా వుంది తులసీదాస్ పదం. తానెంతో మానసికంగా అలసి పోయినట్టు మహీపాల్‌కి అనిపించింది. ఆ అలసటలో బ్యాంకులో తాను నిల్వచేసుకున్న ముప్పై ఎనిమిదివేల రూపాయలు అతనికి జ్ఞప్తికి వచ్చాయి. తాను కారు కొనడానికి రూప్‌రతన్ ఇంటికి వెళుతున్నాడు.... బోడి సంఘం! బోడి సిద్ధాంతాలు! అప్పుచేసి పప్పుకూడు తినాలి! వేదాంతాల్లో కెల్లా చార్వాకుడు ఈరోజు గురించి ఆలోచించి ఆనందించమని ప్రతిపాదించిన వేదాంతమే సర్వశ్రేష్ఠమైంది.

ఆవిడివాని మనసులా తను కూడా మనసును అందిపెట్టు కోవాలని చూసాడు కాని అతనికి సాధ్యంకాలేదు. తనకిప్పుడు అన్నింటి కన్న ముందుగా

ఓ కారు కావాలి. ఓ చిన్న బంగళా కావాలి. రంగరంగ వైభోగంగా మెరిసే ప్రపంచం కావాలి. మూడు మూరలు గోచి పాతలాంటి అమరత్వం తన కక్కర్లేదు. సిద్ధాంతాల్ని ప్రతిపాదించే మహీపాల్ రచయిత అతనిలో జీవచ్ఛవం అయినట్టు కనిపిస్తున్నాడు. మహీపాల్ శుక్లా చచ్చిపోయాడు అది తలచుకునే తాను అంతగా పరితపిస్తున్నాడు.

పల్లంలో నడుస్తోన్న టాంగా కుడివైపు తిరిగి సేఠ్ యాప్రతన్ బంగళాలో ప్రవేశించింది.

# 47

పెద్దమ్మ ఇంట రాధమ్మ పెళ్ళికి ముమ్మరంగా సన్నాహాలు చేస్తున్నారు. రాధను పెళ్ళి చేసుకోవటానికి బాబారామ్‌జీ ఆశ్రమం నుంచి కృష్ణుడు తరలి వస్తాడు. రాధా కృష్ణుల వివాహం జరుగుతోందన్న వార్త సందు సందుకూ వ్యాపించింది. ప్రజల దైనందిన జీవితంలో ఓ కొత్త స్ఫూర్తి వచ్చింది. పెద్దమ్మ చేయబోతున్న పెళ్ళి గురించి అంతా నవ్వుకుంటూ చెప్పేస్తున్నారు. ఈ వివాహానికి ఏభై వేల రూపాయలు ఖర్చు అవబోతున్నదన్న వదంతి వ్యాపించింది. ఎప్పుడూ మాసిపోయిన గుడ్డలు కట్టుకొని శనిదేవతలా కనిపించే పెద్దమ్మ- ఎప్పుడూ తిట్లూ, శాపనార్థాలూ పిల్లాగుంతతో కాలం వెళ్ళబుచ్చే పెద్దమ్మ- పొద్దున్నుంచి సాయంత్రం వరకు ఆబాల గోపాలానికి కాలక్షేపంలా తయారైన పెద్దమ్మ ఏభై వేల రూపాయలు ఖర్చుపెట్టి ఈ క్రతువాన్ని చేస్తోందన్న వార్త విన్న వారందరికీ నోరూరించుతోంది. ఏదో పని- ఏదో ఏర్పాటులో మనం కూడా తల దూరుస్తే ఓ యాభయ్యో వందో గిల్లుకో వచ్చని పనిలేని వాళ్ళంతా ఆలోచించడం మొదలెట్టారు. డబ్బు వ్యవహారం అంతా సజ్జన్ స్వయంగా చూస్తున్న కారణంగా ఎవరి పప్పులూ అక్కడ ఉడకటంలేదు. కన్య, తార, చిన్న కోడలు ఈ ముగ్గురికి ధర్మ త్రిష్ఠున్న కారణంగా వంటింటిపని యివ్వలేదు పెద్దమ్మ. లోపల పనంతా చూడటానికి తన వయస్సు వున్న ఓ ముగ్గురి ముసలమ్మల్ని నియోగించింది. అయితే జమా ఖర్చులూ తెచ్చిన దినుసుల్ని జాగ్రత్తపరిచే బాధ్యత మాత్రం పెద్దమ్మ ఒక్క కన్యకే అప్పచెప్పింది.

పెళ్ళి ప్రయత్నాలతో పెద్దమ్మ మేడ మారుమోగి పోతోంది. గాడి పొయ్యిల మీద వంటవాళ్ళు హల్వాలు చేస్తున్నారు. వియ్యాలవారిలో ప్రతి ఒక్కనికి ఒక్కొక్క పంచె ఇస్తారు కాబోలు గుట్టలుగా పోస్తున్నారు ధోవతుల్ని వాటన్నిటిని సామానుం గదిలో పెట్టించి పెద్దమ్మకు లెక్కచెప్పి తాళం అప్ప జెప్పే బాధ్యత కిన్నరది. వివాహానికి పెద్దమ్మ తన బంధువర్గాన్నంతా పిలిచింది. సవతి ఇంటికి కూడా ఆహ్వానం వెళ్ళింది. కన్యా దానం చెయ్య వలసిందిగా రాజాసాహెబ్‌ని కోరుతూ సజ్జన్ ద్వారా ఆహ్వానాన్ని పంపింది పెద్దమ్మ. నేను మమతలన్నీ వదులు కున్నాననీ ఉత్సవంలో పాల్గొనలేనని తిరస్కరించారు రాజాసాబ్. రాధను కన్యాదానం చేయాలన్న కోరిక ప్రబలంగా వుంది పెద్దమ్మకు. తన కూతురే బ్రతికివుంటే తాను రాజాసాహెబ్‌తో కలిసికన్యాదానంచేసేది కదా! తన కూతురు లేక పోతేయేం రాధ కూడా తనకు పుత్రికలాంటిదే, భువన మోహిని అయిన రాధను కన్యాదానం చేయడం కన్న మించిన పుణ్యం ఏముంది ఈ జీవితంలో. కాని ఆమె కోరికను తిరస్కరించారు రాజాసాహెబ్. మగడు పీటమీద కూర్చోకుండా భార్య కన్యాదానం ఎలా చెయ్య గలదు! అదే ఆమెను వేధిస్తోంది "రాకపోతే పోనీలే. నాపని అంటే ఎందుకొస్తాడు! నా అదృష్టం వల్ల ఆనాడు కోటికి పడగ ఎత్తాడు. ఇవ్వాళ సవతి మైకంలో పడి నన్ను పూర్తిగా మరచిపోయాడు. నాలాంటి భార్య వుసుర..." అంటూ గబుక్కున ఆగిపోయింది పెద్దమ్మ. ఆమె కళ్ళల్లో కోపానికి బదులు కన్నీరు నిలిచింది. కొంగుతో కళ్ళు ఒత్తుకుంటూ పెద్దమ్మ పెళ్ళి పనిలో మునిగి పోయింది.

రాజాసాహెబ్‌గారు ఈమధ్య చలువరాయితో తన విగ్రహాన్ని తయారు చేయించే పనిలో వున్నారు. చలువరాయి మొదలేకొని వుంటాడు. తోటకు మధ్యలోవున్న "ఫౌంటెన్"ని పూడిపించి దానిస్థానే ఓ పెద్ద అరుగును ఎత్తుగా నిర్మిస్తున్నారు. అరుగు నాలుగు మూలలా ఒక్కొక్క చలువరాతి బురుజు వుంటుంది. తన దహన ఆసన సంస్కారాలన్నీ ఆ అరుగుమీదనే జరగాలని రాజాసాహెబు కోరిక. అతను మరణించిన తర్వాత అరుగుమీద చలువరాయి మంటపాన్ని నిర్మించి అందులో అతని విగ్రహాన్ని ప్రతిష్ఠించాలట. మంటపం ప్లాను అంతా సిద్ధం అయింది. తాను రాసిన వీలునామాలో మంటపానికి అయ్యే

ఖర్చుల్ని కూడా రాజాసాహెబు భరిపారు. తాను చనిపోయిన తర్వాత కూడా తనకీర్తి నిలిచిపోవాలని ఆయన అభిమతం. మరణించిన తర్వాత తన్ను కూడా రుద్రభూమికి తీసుకెళ్లి సామాన్యవ్యక్తిలా ఖననం చేయడం ఆయనకు ఇష్టంలేదు. అందుకనే దహన సంస్కారాలకోసం తనతోటను ఎన్నుకున్నారు రాజా సాహెబ్. ప్రాపంచిక వ్యామోహాన్ని త్యజించి మరణోత్తర కీర్తి ప్రతిష్ఠల్ని కాపాడుకునే ప్రయత్నంలో వున్నారు.

పెళ్ళికొడుకును మహావైభవంగా చేసారు. లాలాముకుందీమల్ ఇంటి దగ్గరవున్న గుట్ట మీద ఉత్సవకార్యక్రమాన్ని ఏర్పాటు చేసారు. తన సవతి మనవణ్ణి పెళ్ళికొడుకు చేసినదానికన్న ఎక్కువ వైభవంగా జరిపించాలని పెద్దమ్మ పట్టుదల పట్టింది. సజ్జన్ పర్యవేక్షణ కింద ఓ అందమైన మండపాన్ని కట్టారు, గుట్టనాలుగు వైపులా రాతి రాపంతో మూశారు. దక్షిణ భారత దేశంలో గోపురాల మోస్తరుగా మూడు ఆర్చీలు నిర్మించారు. లోపం కృష్ణ భగవానుడికోసం కట్టిన మండపాన్ని చూస్తోంటే బృందావనం అంతా ఇక్కడికి తరలించారా అన్నంత శోభాయమానంగావుంది. బృందావనం, సీలాం రేవులా, గుళ్ళ నమూనా ఒకవైపూ, దానికి దగ్గరగానే ప్రాచీన కాలంలో మధుర ఎలా వుండేదో తెలిపే నమూనా రెండోవైపు గోకులం, నందగ్రామం, బర్సానా గ్రామాల నమూనాలు, వాటికి నేపధ్యంలో గోవర్ధనగిరి, దానిమీద మానసీగంగ, రాధాకొలను, కృష్ణకొలను, ఇంకోచోట పుష్పసరోవరం మొదలైనవన్నీ మధ్యలో గోవర్ధనగిరిమీద ఓ చక్కని మనోహరమైన మండపం. అందులో ప్రతిష్ఠించిన కృష్ణభగవానుడు. ఈ వివాహాన్ని జరిపించడంకోసం శ్రీధర మహాపాత్రుం వారు రాధాకృష్ణుల బంగారు విగ్రహాల్ని సజ్జన్‌చేత ఇప్పించారు. కృష్ణుడు ఇక్కడ. రాధమ్మ పెద్దమ్మ ఇంట్లోను. నెమళ్లూ, లేళ్ళూ కోతులూ పరుగెత్తుతున్నట్లుగానూ, పచ్చికమైదానాల్లో ఆలమందలు పరకలు మేస్తున్నట్లు గానూ, మధుర, బృందావనానికి పక్కగానే ప్రవహిస్తున్న యమునానది, కొండలమీద నుంచి ప్రవహిస్తున్న సెలయేర్లూ, వీటన్నింటినీ తెల్పుతున్న దృశ్యాలు ఎంతో హృద్యంగా చిత్రించబడ్డాయి.

పెళ్ళికొడుకైన కృష్ణ పరమాత్ముణ్ణి జనం విరగబడి చూస్తున్నారు. పెళ్లికొడుకుని చేయటం అయిన తర్వాత ఏకాహం ప్రారంభించారు. నగరంలోని ఇంచుమించు అన్ని భజన కూటములు ఈ కార్యక్రమంలో పాల్గొన్నాయి. జన సందోహం మరీ విపరీతంగా పెరిగిపోయేటప్పటికి పోలీసుల్ని పిలవాల్సి వచ్చింది.

వియ్యంకుడు వారుగా బాబా కూర్చున్నాడు. అతని దగ్గర స్నానాల రేవు దగ్గరవుండే పండాలూ, గోమతీ నది ఒడ్డున వుండే ఎంతోమంది గుడ్డి, గూని, బైరాగులూ, ఫకీర్లూ తన్మయత్వంలో తమలపాకులు నములుతూ ఏదో పెద్ద రాజ్యానికి యేలికలైనంత ఆనందంతో కూర్చున్నారు అందరి నుదుట చందనం పూయబడివుంది. మెడలనిండా పూలమాల లున్నాయి. పెళ్ళికొడుకు సామాను ముప్పై పళ్ళాలనిండా మిఠాయి, పది పళ్ళాలు ఎండుపండ్లూ. వరుని కోసం రాళ్ళహారం, వుంగరం వస్త్రాలూ, వెయ్యొవదకొండు రూపాయల నగదూ అన్నీ పెద్దమ్మ పంపింది. పెళ్ళికొడుకుని చేశారు కృష్ణభగవానుని.

ఇక పెళ్ళి తతంగం ప్రారంభమైంది. పిల్ల తరఫున నుంచి లగ్నపత్రిక వచ్చింది. దానితో బాటు తమలపాకులూ, పళ్లూ, నగదూ వచ్చాయి. దాని తర్వాత పెళ్ళి కూతురికి పెళ్ళి కొడుక్కి[1] హల్దాత్ జరిగింది. పెళ్ళికి తరలి వూరేగింపుతో వస్తోంటే జనం చూద్దామని వీధుల నిండా కిక్కిరిసి పోయారు. పెద్దమ్మ ఇంటినిండా ఇసుకవేస్తే రాలకుండా వున్నారు. వూరేగింపులో సన్నాయీ పోలీసు బ్యాండూ మిలిటరీ బ్యాండూ ఇంకా అనేక రకాల బేండ్లతో వాయిద్యకారులు పాల్గొన్నారు. వాళ్ళ వెనక అనేక వేషాలు బయల్దేరాయి గంగాదేవి, యశోద, పరమశివుడు, వెన్న దొంగ వగైరాలెన్నో వున్నాయి. అన్ని వేషాల్నీ చాలా అందంగా అలంకరించారు. అలంకారాల కోసం మధుర నుంచి ఓ మనిషిని ప్రత్యేకంగా పిలిపించారు. హంస వాహనం విద్యుద్దీపాలతో

(1) పసుపూ, నూనె కలిపి వున్న ప్రమిదలోంచి దూర్వాంకురాలు తీసుకుని పెళ్ళి కుమారునికి పంచాంగ స్పర్శ చేయించుట- పాదాలూ, మోకాళ్ళూ, నడుమూ, భుజాలూ, శిరస్సుకు నూనె అంటించు ఆచారం.

ధగధగ మెరిసి పోతోంది. దాని మీద కృష్ణపరమాత్మ కూర్చున్నారు. చాలా చోట్ల హంస వాహనాన్ని ఆపి హారతి ఇచ్చారు. పెద్దమ్మ గొప్పతనాన్ని వేనోళ్ళ పొగిడారు. ఇరుకైన సందుల్లోంచి ఊరేగింపు వెళ్ళాల్సి వచ్చేప్పుడు కృష్ణపరమాత్మ మోటారు దిగి గంగా- యమునా మీద ఆసీనులయ్యారు. చాలా ఇండ్ల మీద నుంచి హంస వాహనంపై పుష్పవర్షం కురిపించారు. కొన్ని సంవత్స రాల నుంచి ఇటువంటి వియ్యాలవారి ఊరేగింపు రాలేదంటే రాలేదన్నారు చూసిన వాళ్ళంతా.

పెద్దమ్మ యింట్లో హడావుడీ గందర గోళం ఎక్కువగా వుంది. ఒకరిమాట ఇంకొకరికి వినపడనంత గోలగా వుంది. సామాన్ల కోసం అరవాళ్ళు ఇటునుంచి అటూ అటునుంచి ఇటూ పరుగెత్తు తున్నారు. అరవాళ్ళలో గోకుం ద్వారాలోని పూజారి దారి తప్పి తిరుగు తున్నట్టుగా కాసేపు యిక్కడ కాసేపు అక్కడ కనపడు తున్నారు కన్య, తార, చిన్న కోడలికి కూడా తీరికలేదు. పెద్దమ్మ అయితే కరెంటు తీగె అయి పోయింది ముసిగి కుష్ఠించిన ఆమె శరీ రంలో ఎక్కడనుంచి సత్తువ వచ్చిందో కాని పెద్ద పెద్ద పళ్ళాలు కూడా అవలీలగా మోస్తూ పరుగెత్తుతోంది. పూజా మందిరంలోని దీపుణా మీదవున్న రెండు చెక్క పాత్రలు దించాలని పోయింది పెద్దమ్మ. అమాంతంగా పిల్లి పైనుంచి దూకింది పిల్లి పిల్ల. పెద్దమ్మ ఉలిక్కి పడింది. మళ్ళీ వెంటే తేరు కుంటూ "నువ్విక్కడ ఎప్పట్నుంచి చచ్చావే:" అంది పెద్దమ్మ.

కిసున్ అయితే పూజా మందిరంలో ఎప్పట్నుంచో బంది అయి వున్నాడు. పెద్దమ్మ కాళ్ళ మీద తలను వేసి రుద్దుతూ మ్యావు మ్యావు అంటూ ఆమె కాళ్ళకు చుట్టుకుని ఆమెను పని చెయ్యనివ్వకుండా అడ్డు తగులు తున్నాడు. ఆమెను అడుగు ముందుకు వేయనివ్వడం లేదు. ఎటు వెళ్ళినా కాళ్ళకు చుట్టు కుంటున్నాడు. దీపుణా మీద నుంచి పాత్రలు తీసి పెద్దమ్మ బయటికి వచ్చింది. ఆమె వెంట కిసున్ కూడా బయటి కొచ్చాడు. పూజారిని పిలిచి "శాస్త్రి ఎవరి చేతైనా పాలు తెప్పించండి, వీడు నన్ను వదలనంటాడు. మంచి హడావుడిగా వున్న సమయంలో ఈ సన్యాసి నన్ను చుట్టుకుని పోతుంటాడు. పోవే, వెంటనే వెళ్ళి పాలుతే" అంటూ చిరాగ్గా అంది పెద్దమ్మ.

అంతలో కీర్తనలు పాడే ఆచార్యులు అక్కడికి వచ్చారు. పెద్దమ్మ మహా మౌనంగా ఇచ్చిన తెల్లటి ధోవతి కండువా శరీరంపై తెల్లగా తళతళ మంటున్నాయి. ఒయ్యారంగా కళ్ళు తిప్పుతూ పెద్దమ్మనూ ఆమె పెంపుడు పిల్లి కూనల్ని చూస్తూ "పెద్దమ్మా నీ కిసున్ నిజంగా కృష్ణుడే. యశోదను కృష్ణ పరమాత్మని ఒకే సారి దర్శనం చేసుకున్న నా భాగ్యమే భాగ్యము" అని అంటూ ఆమె ముందు సాష్టాంగదండ ప్రమాణం చేసాడు. పెద్దమ్మ తన పనిలో మునిగివుంది. అమాంతంగా ఆచార్యులు కాళ్ళ మీద పడేసరికి "ఎవర్రా ముండా కొడుకు" అని చటుక్కున అనేసి "హరి నువటయ్యా, ఆ భజనచేసే ఆచార్యులు గారా! నీకిప్పుడే కుదిరిందటయ్యా భక్తి చూపించ డానికి? పిల్ల పెళ్ళి చెయ్యడానికి తీరికలేక నేనుచస్తోంటే! ఇక్కడ్నుంచి కదులు! ఇదిగో, దీన్ని దీసుకొని దగ్గర వుంచుకో. పూజారి పాలు తీసుకుని వస్తాడు. వాడికి కాస్త తాగించు" అంటూ అతనికి పిల్లికూనని అంటగట్టి వెళ్ళి పోయింది పెద్దమ్మ.

వివాహ మంటపంలో వీధిలోని పెద్ద మనుషులు కూర్చున్నారు. విశ్వనాథ శాస్త్రి పండితులు, లాలా ముకుందీమల్, గులాబ్‌చంద్, లాలేదలాయ్, ఠకూరీ సునార్, వర్మ, రాధేశ్యామ్, లాలా జానకీశరణ్, మహిపాల్, కర్నల్, సేఠ్ రూప్‌రతన్ సవతి తల్లి పెద్ద కొడుకు గిరిధర్‌దాస్ ఇంకా ఇంకా ఎందరో వున్నారు. గిరిధర్‌దాస్ బాబాగార్ని మాటి మాటికి చూస్తున్నాడు. వరకట్నం కింద పెద్దమ్మను ఇరవై వేలు ఆ సాధువు అడిగాడని విన్నాడు. సాధువు మీద అతనికి ద్వేషం కలుగుతోంది. దగ్గరే వున్న జానకీశరణ్ "ఈ బాబా ఎవరు" అని ప్రశ్నించాడు.

"పిచ్చి వాళ్ళకు మందూమాకు ఇచ్చి నయంచేస్తాడట"

"మరి ఈ ఇరవై వేల రూపాయలు తీసుకుని ఏమిచేస్తాడు?"

లాలా జానకీశరణ్ సన్నగా నవ్వి "ముసలి తనంలో బాబా అదృష్టం పండింది. లంగోటీ విడిచిపెట్టి సిల్కు కాషాయాంబరాలు వేసు కుంటాడు, మఠాలు కట్టిస్తాడు. హుషారుగా మాల్‌పువాలు నాకుతాడు"— ఏ, అంతే కదూ? నీకు బాగా అనిపించడం లేదా?" ఎగదోస్తూ అడిగాడు.

గిరిధర్‌దాసు సిగ్గుపడి కొంచెం సేపు తాలిన తర్వాత "పెద్దమ్మ ఖర్చు తగ్గించండని ఎన్నో సార్లు నాన్నగారితో మొత్తుకున్నాను ముప్పయి రూపాయలం కన్న దమ్మిడీ అదనంగా ఇవ్వనక్కర్లేదు అని అన్నాను" అంటూ తన బాధను వెళ్ళగక్కాడు.

"అంత తక్కువైతే ఆమెకు అద్దెలే వస్తాయి" అన్నారు లాలాజానకీశరణ్.

నాన్నగారు నామాట వినకపోతే ఏం చెయ్యను? ఇప్పుడు చూస్తున్నారుగా మాసంపాదన నీళ్లలా ఎలా ఖర్చు పెడుతున్నారో? పాచిపళ్లోళ్ళు సంపాదిస్తే బంగారు పళ్ళోళ్ళు ఖర్చు పెట్టినట్లుంది. సొమ్ము ఒకడిది. సోకు ఒకడిది. ఇదంతా సజ్జన్ ప్రయోజకత్వమే. పెద్దమ్మకు ఏ మేమి మంత్రమో వేసి వశపరుచుకున్నాడు అంటూ ఓ నిట్టూర్పు విడిచి సందడిగా వున్న జనాన్ని చూడసాగాడు.

"సజ్జన్ స్తుతియో మీద జనం దండయాత్ర చేసినప్పుడు పెద్దమ్మ రూపం చూడాలి. కాలుతోన్న కట్టె తీసుకొని జనం మీద చండికలా విరగబడింది. ఎలా మంత్రాలు చదివిందనుకున్నావ్. వీడు నీ బంగళాను ఏవో మాయమాటలు చెప్పి పెద్దమ్మ చేత రాయించేసుకునేట్టుగా వుంది". అని లాలా జానకీశరణ్ అన్నాడు.

"వీడి గొప్ప ఏముంది? వీడి దగ్గర మిగిలిందెంత? మహా అయితే ఆరేడు లక్షలు వుంటాయేమో. జమీందారీ రద్దయిందాయె. వ్యాపారం చేయలేదు. అసలే కళా కారుడు. ఇప్పుడు ఓ మూడున్నర లక్షల నగదు వుందొచ్చు. అవీ అద్దెం కింద వస్తోన్న ఆదాయం ఖర్చుపెట్టి తింటున్నారు. ఇకపోతే ఆభరణాలు, వజ్రాలూ, కొన్ని కళా ఖండాలూ వున్నాయి. చూస్తూ వుండండి. పది సంవత్స రాల్లో ఆ పాతసామానంత అమ్ముకుంటూ పరువుల బజారులో కనపడకపోతే. పెద్దమ్మ మేనమీద కన్ను వేసాడంటే ఆరవై ఆరు కేసుల్లో ఇరికిస్తాను" అని గిరిధర్‌దాస్ అంటోంటే అతని కళ్ళదగ్గర కండరాలు బిగుసుకుపోయాయి.

'లేదులే. అంతవరకు రాదు. వీడు మహా అయితే ఈ మధ్యన

నాయకుడౌతున్నాడుగా. చూస్తూ చూస్తూనే ఎంత పలుకుబడి సంపాదిస్తాడో. నీ మేరకు కక్కుర్తిపడడు" అని రాజా జానకీశరణ్ అన్నారు.

"ఏమని కక్కుర్తిపడతాడు? అతని భార్య స్కూలే పెట్టేసింది. మీ అందరి గౌరవాన్ని మంట కలిపి అక్కడ ఎగ్జిబిషన్ పెట్టారు. ఇది రాజాగారు వేసిన పాచిక, తియ్యగా మాట్లాడుతూ అక్కడే పీఠం వేసి ఎవరి పరువు పీకి పందిరి వెయ్యాలనుకుంటే వారిది పీకివేస్తాడు" అంటూ గిరిధర్‌దాస్ ఎంతో పనికట్టేసిన వానిలా అన్నాడు.

మహీపాల్, కర్నల్ కొంచెం దూరంగా కూర్చుని మాటల్లో మునిగి వున్నారు. రూప్‌రతన్ దగ్గర కారు కొన్న తర్వాత మొదటిసారిగా తన స్వంత కారులో యివ్వాళ పెద్దమ్మ ఇంటికి వచ్చాడు మహీపాల్. మహీపాలూ కర్నలూ కారు గురించే ప్రస్తుతం మాట్లాడుతున్నారు. సజ్జన్‌కు పొద్దున్నుంచి వూపిరి పీల్చుకోడానిక్కూడా తీరికలేక అటూ ఇటూ పరుగెత్తుతున్నారు.

వివాహం అయింది. అంపకాలు జరుగబోతున్నాయి. ఆడపడుచును అత్తగారింటికి పంపడం ఎటువంటి వానికైనా కరగించే సన్నివేశం. ఆ సన్నివేశానికి సంబంధించే పాటపాడుతున్నారు ముత్తైదువులు. వైభవంగా జరిగిన పెళ్ళిలో హడావుడిగా వున్న ప్రతిక్షణం ఇప్పుడు పెద్దమ్మ గుండెను బరువుతో నింపుతోంది. రాధమ్మను చేతిలోకి తీసుకుంది పెద్దమ్మ. కూతురిని- తన చిన్నారి కూతుర్ని సాగనంపుతోంది. అవును ఆమె పెద్దమ్మ చిన్న కూతురు- చచ్చిపోయిన తన ముద్దుబిడ్డ- ఆమె స్మృతిపథంలో మెరిసింది- ఆమె కూతురు చిన్నప్పుడే చచ్చిపోయింది ఇప్పుడు రాధ పెద్దమ్మ కూతురు-అంపకాలు చేయబోతున్నారు. అత్తగారింటికి పంపుతున్నారు... పెద్దమ్మ కూతుర్ని కౌగలించుకుంది పెద్దమ్మ మూర్ఛపడి పోయింది. జనం ఆమె ముఖం మీద నీళ్ళు చల్లారు. విసన కర్రలతో విసిరారు. పెద్దమ్మ తెలివిలోకి వచ్చింది. నాలుగు వైపులా చూసింది. ఎముకల గూడులా ఎండిన శరీరాన్ని లేపుతూ పెద్దమ్మ లేచి కూచుంది. మళ్ళీ మొదలైంది కార్యక్రమం. అంపకాల కోసం ప్రత్యేకంగా ఓ రథాన్ని తయారు చేయించి దాన్లో రాధా కృష్ణుల జంట విగ్రహాన్ని వుంచారు.

శంఖాలు పూరించారు. గంటలు మోయించారు బాకాలు ఊదారు. రాధాకృష్ణకీ జయ్ అంటూ హర్షధ్వానాల మధ్య ఆ సందు అంతా మోతమోగి పోయింది. అత్తగారింటికి వెళుతున్న అడపడుచులా అన్నింటకు బొట్లు పెట్టించింది పెద్దమ్మ. అందరి కన్నా ముందు సజ్జన్‌కీ ఆ తర్వాత తన బంధువర్గం వారికీ తిలకం దిద్దమంది పండితుల వారితో. రథం సాగింది. పేరంటాళ్ళు పాటలు పాడుతున్నారు. ముందుకు జరుగుతోన్న రథాన్ని ఓ క్షణం కన్నార్పకుండా చూసింది పెద్దమ్మ. ఆమె కళ్ళల్లోంచి నీళ్ళు జలజల రాలాయి. పెద్దమ్మ ఏడుస్తోంది. ఆమెకు మళ్ళీ మూర్ఛ వచ్చింది.

తెల్లని గుర్రం రథాన్ని సందుల్లో లాగుతోంటే రాధాకృష్ణుల్ని చూడటం కోసం ఆదరిదాపులోని వీధులన్నీ కిక్కిరిసి పోయాయి.

— —

పెద్దమ్మ జరిపించిన రాధా కృష్ణుల పెళ్ళి పాత సంగతై పోయింది. వివాహం సందర్భంగా సుమారు యాభై వేల రూపాయల కిమ్మత్తుగల సామానులు బాబాకు ముట్టాయి. అవన్నీ కర్నల్ దగ్గర భద్రం చేశారు. ఓ రోజు పెద్దమ్మ వేదలో కూర్చుని ఆ పైకాన్ని ఎలా వినియోగించాలా అన్న సమస్యపై కన్య, కర్నల్, సజ్జన్, బాబారామ్‌జీ- నలుగురూ కలిసి చర్చిస్తున్నారు. పెద్దమ్మ ఇచ్చే కట్నం డబ్బుతో బాబాగారి ఆశ్రమానికి పక్కా భవనాలు కట్టించి ఇవ్వాలనీ అలా చేస్తే వేశ్యావృత్తి నుంచి ఉద్ధరింపబడిన అనాధలకు ఆశ్రమం ఇవ్వడానికి వీలు ఏర్పడుతుందనీ మొదట నిర్ణయించుకున్నారు. కాని బాబాగారిప్పుడు తన వుద్దేశాన్ని మార్చుకున్నారు. "మేము ఈ నగరంలో వుండకుండా ఏదైనా పల్లెటూరు వెళ్ళి అక్కడే ఆర్తులకు సేవచేస్తాం. అక్కడే రోగులకూ, పిచ్చివాళ్ళకు చికిత్స చేస్తామని వుంది. పల్లెటూరి పిల్లలకు చదువు నేర్పేందుకు ఓ స్కూలు ఏర్పాటు చేస్తాం" అంటూ బాబాగారు తన అభిప్రాయం తెలిపారు.

"అందే మేం వేసిన పథకాన్నంతా తారుమారు చేస్తారన్న మాట" అని అన్నాడు సజ్జన్.

"తారు చేయటం లేదూ మాకు చేయటం లేదు రామ్‌జీ. ఇక్కడ డబ్బుకు కొదువలేదు. అలా కావాలంటే మీ డబ్బుతో ఇక్కడ ఆ కార్యాలన్నీ సాధించ గలరు"

డిక్షనర సజ్జన్ తీవ్రంగా ఆలోచనలోపడి మళ్ళీ ఏదో నిశ్చయానికి వచ్చి నట్టుగా "మీరనేది నిజమే అనుకోండి. డబ్బు వ్యామోహం నుండి నేను బయట పడ్డా ననుకోండి. అయినా సర్వసంగ పరిత్యాగం చేసే పరిస్థితిలోకి నేనింకా రాలేదు" అని అన్నారు సజ్జన్.

"మీరెంత డబ్బు మనస్ఫూర్తిగా ఇవ్వగలరో చెప్పండి" అని అడిగారు బాబా.

"మూడు లక్షలు"

కర్నల్, కన్యా సజ్జన్ ముఖంకేసి చూడసాగారు.

"చాలా పెద్దమొత్తమే దానితో మీరు యేర్పాటు చేయగలిగితే గొప్ప కార్యాలెన్నో సాధించవచ్చు" అన్నారు బాబా.

''అయితే ఏం చేయాలంటారు? బీదవాళ్ళకు అనాధలకు తిండి పెడుతూ కూర్చుంటే మూడు లక్షలు చూస్తూచూస్తూండగానే హారతి కర్పూరంలా హరించి పోతుంది కదా!"

"కూర్చోపెట్టి తిండి పెట్టడం మన సిద్ధాంతానికే విరుద్ధం. పని చేయాలి, పొట్టనింపుకోవాలి. దానికోసం ఏవైనా చిన్నతరహా పరిశ్రమలు స్థాపించాలి"

"అలాంటి పని చాల కష్టంబాబాగారూ. మాట్టాడుతున్నందుకు క్షమించండి" అని కర్నల్ మధ్యలో అందుకున్నారు.

అది నిజమే అనుకోండి బాబాగారూ, కాని కాలం ఎలావుందో కూడా కొంచెం గమనించండి. ఆశ్రమాలంటే ఇప్పుడు నమ్మకాలు పోయాయి. ప్రతి వ్యక్తి, ఎలాగైనా ఎక్కువ డబ్బు ఆర్జించి స్వర్గ సౌఖ్యాలు అనుభవించాలని చూస్తున్నారు" అంటూ కర్నల్ సమాధానం ఇచ్చారు.

"పనికి మాలిన సోమరి పోతులకు సంఘంలో చోటువుండరాదు రామ్మతి, కష్టపడిన వానికే డబ్బు దొరకాలి. మీరూ ఇలాంటి ఆశ్రమాన్నో ఒకదాన్ని స్థాపించండి. ఆశ్రమం అంటే మీకు గిట్టక పోతే సహకారం సంఘం అనో ఏదో ఒక పేరుతో సంస్థను స్థాపించండి. మనకు పని కావాలి కాని పేరుతో పని లేదు. ఈ అమ్మాయినే చూడండి. ఈ వీధిలో ఓ పాఠశాలనే స్థాపించేసి ఎంత చక్కగా నిర్వహిస్తోందో. ఎన్ని పాఠశాలలు స్థాపించ గలిగితే అన్ని స్థాపించండి. ఆడవాళ్ళకూ, అమ్మాయిలకు వృత్తిపనుల్లో శిక్షణ ఇవ్వండి. వాళ్ళు తయారుచేసిన వస్తువుల్ని బజార్లో అమ్మండి. మేం పల్లెటూళ్ళల్లో వుండి ఇదే కార్యక్రమాన్ని చేపడతాం. బీద ప్రజానీకానికి ధనం కావాలి. ఆర్థికంగా పట్టణాలూ, పల్లెలూ, రెండు వెనుకపడినవే. ఈ రెంటికీ ఓ సమానమైన ఆర్థిక ప్రాతిపదికను ఇవ్వండి"

"కాని అప్పుడే ఈ పని సాధించడం అంత తేలిక కాదు" అని కన్య అంటూ "పట్టణాల మోజు ఎక్కువ. అవసరాలూ ఎక్కువే, డబ్బు కూడా ఎక్కువ కావాల్సి వుంటుంది" అని చివరకు తేల్చింది.

పట్టణాల్లో ఆకర్షణలు వున్నంత అధికంగా అవసరాలు లేవు తల్లీ. అయినా ఈ విషయంలో నేను వివాదానికి దిగను. ఎలాగైతేనేం. పల్లెల కోసం ఇరవై ఇరవై అయిదు వేలూ పట్టణానికి మూడు లక్షల రూపాయలూ ఇస్తున్నారు. ఈ మూడు లక్షల రూపాయలతో కుటీర పరిశ్రమలు స్థాపించి నగరంలోని అల్పాదాయ వర్గాలూ బీదలు ఆదాయాన్ని పెంపొందించి వాళ్ళను వడ్డీ వ్యాపారస్థుల సంకెళ్ళనుంచి కాపాడ గలిగారంటే అదే ఘనత. అనాథ స్త్రీలను ఉద్ధరించి వాళ్ళ ఆర్థిక అవసరాల్ని తీర్చడానికి ఆశ్రమాల్లాంటి సంస్థలు పెట్టి వాళ్ళ నైతిక ప్రమాణాల్ని సంరక్షించ గలిగాం అంటే అది ఘనకార్యమే అవుతుంది. ఒక గొర్రె ఎటుపోతే మిగతా గొర్రెలన్నీ అటే పోయినట్టు మీరంతా కలిసి కట్టుగా వుండి సంఘంలో పని చేసిన రోజు సంఘమే మీది అవుతుంది. మీ వైపు మళ్ళుతుంది.

"మీకు ఒక చిన్న విజ్ఞప్తి చేయదలచు కున్నాను" అంటూ బాబా సజ్జన్‌ని పక్కకు పిలిచాడు.

"మీరు నాకు గురుదేవుల్లాంటి వారు. ఆజ్ఞాపించండి"

"దక్షిణ అడగ మంటావా!"

సజ్జన్ ఇరకాటంలో పడ్డాడు. ఆప్యాయంగా సజ్జన్ తలనిమురుతూ చిరునవ్వు నవ్వాడు బాబా. "అందుకే విజ్ఞప్తి అన్నాను... బ్రహ్మచర్య వ్రతాన్ని పూర్తిగా పాటించలేక పోతే కొంచెం నిగ్రహంతో వ్యవహరించండి. మనిషి బుర్ర ఒక కొలిమిలాంటిది. దానికి వీర్యం అనేది ఇంధనం అని మరవకండి. ఏదైనా ఓ పనికి నడుం బిగించారంటే ముందు దానికావలసిన శక్తుల్ని కూడా సమీకరించు కోవాలి" అంటూ బాబా ముగించాడు.

"ప్రయత్నిస్తాను" అని సజ్జన్ తలవంచుకుని అన్నాడు.

"రామ్‌జీ, ఇతరుల కోసం జీవించే వాడు ఇతరులను జీవించనిచ్చే వాడే అసలైన సమాజవాది"

"కాల ప్రవాహంతో పాటు నేను కూడా మారుతాను. అభ్యుదయం కోసం ముందడుగు వేయడంలో మీరు నాకు మార్గ దర్శకులు" అంటూ సజ్జన్ భక్తి పురస్సరంగా బాబా పాదాలు స్పృశించాడు.

## 48

సజ్జన్ బాబా యిచ్చిన పథకాన్ని అమలు చేయటానికి పూను కున్నాడు. తాను ఇస్తానన్న మూడు లక్షల రూపాయలతో ఓ ధర్మ విచార సంస్థ స్థాపించాడు. దాన్ని రిజిష్టర్ కూడా చేయించాడు. కర్నల్, వనకన్య, చీఫ్ కోర్టులో రిటైరైన జడ్జీ, ఓ పెద్ద అధికారి, తానూ ఆ ట్రస్టు సభ్యులు. తన పథకానికి తొలి మెట్టుగా సజ్జన్ ఓ సహకార బ్యాంకును స్థాపించాడు. నగరంలోని ప్రతి వార్డుకు అటువంటి బ్యాంకుల్ని తెరవాలని దానికి కావలసిన మూల ధనాన్ని వాళ్ళే సమకూర్చాలనీ ఆ డబ్బుతో అక్కడే అందరి సంక్షేమం కోసం ఏదైనా చిన్న

తరహా పరిశ్రమలు నెల కొల్పాలన్నది ఆయన అభిమతం. ఈ కార్యక్రమాన్ని అమలు చేయడం కోసం సజ్జన్ దగ్గర పనిచేసే ఓ అంకౌంటంటూ, రిటైరైన ఓ బ్యాంకి మేనేజరూ నియమింప బడ్డారు.

బ్యాంకిని స్థాపించే నిమిత్తం సజ్జన్ వార్డులోని ధనవంతుల్నీ, పెద్దపెద్ద డాక్టర్లనూ, న్యాయావాదుల్నీ, సాంఘిక కార్యకర్తల్నీ పిలిచి మీటింగు పెట్టిన రోజు నుంచే లాలా జానకీ శరణ్ అతనికి బహిరంగ విరోధిగా మారిపోయాడు. మిగతా వడ్డీ వ్యాపారస్థులు కూడ సజ్జన్ని వ్యతిరేకించడం మొదలెట్టారు. మధ్య తరగతి కుటుంబాల్ని ఋణభారం నుంచి తప్పించాలన్న ఆదర్శంతో ప్రవర్ధ మానం కావాలని ఈ బ్యాంకి స్థాపించడంలోని ముఖ్యోద్దేశ్యం. నేడు పట్టణాల్లో మధ్యతరగతి కుటుంబాల్లో నూటికి ఎనభై అయిదు మంది ఋణభారంతో క్రుంగి వున్నారు. పెళ్ళి పెటాకులూ, ఉపనయనం, పుట్టు వెంట్రుకలూ, చెవులు కుట్టడం, రోగాలూ, నొప్పులతో సతమతమయ్యే వాళ్ళకు డబ్బు చాలా అవసరం. దానిగ్గాను వాళ్ళ జుత్తు షావుకార్లచేతుల్లోవుంది. తక్కువ ఆదాయం గల వ్యక్తి ప్రతి అవసరానికీ షావుకారుదగ్గరకు వెళ్తాడు మరి షావుకారికి హాయిగా బంగారం కావాలి ఇలా చాలా మంది మధ్యతరగతి కుటుంబాం ఆడపడుచుల కంఠసీమల్ని అలంకరించిన ఆభరణాలన్నీ షావుకార్ల ఇనప్పెట్టెల్లోకి పోయి అక్కణ్ణుంచి రానని శపథం చేస్తుంటాయి. అప్పు అనే వూబిలో మెడవరకు మునిగివున్న ఈ తరగతి వాళ్ళు జీవితాంతం తీర్చలేని ఋణాలూ, ఎప్పటికీ పూర్తికాని తమ అవసరాలూ దైనందిన జీవితంలో ఎప్పటికప్పుడు పెరుగు తోన్న క్రియా కలాపాలతో విసిగిపోయి సిగ్గులేనివారుగా పనికిమాలినవారుగా, చీటికి మాటికి చిరుబురలాడుతూ ఎప్పుడూ ఫిర్యాదులు చేసే స్వభావాన్ని అల వాటు చేసుకుని దిక్కుతోచని వాళ్ళలా తయారౌతున్నారు. అలాంటివాళ్ళకు ఋణం అనే చెరనుండి విడుదల పసాదించడమే సజ్జన్ ముఖ్యలక్ష్యం. అందుకే షావుకార్లకు సజ్జన్ అంటే మంటగా వుంది. మీటింగులో వాళ్ళంతా వ్యతిరేకించే సరికి వనకన్య క్రోధావేశంతో పక్కా కమ్యూనిస్టులా ఉపన్యాసం యిచ్చింది.

ఆమె ప్రకటించిన భావాలకు నిరసన తెలియ చేస్తూ లాలాజానకీశరణ్, అతనితో పాటు మరికొంతమంది వణిక్ప్రముఖులూ సభలోంచి వెళ్ళిపోయారు.

అయితే సభవల్ల వాళ్ళ పథకానికి కావలసిన పలుకుబడి లభించింది. ఈ పథకం ప్రారంభించిన సజ్జన్ స్వయంగా ధనికవర్గంవాడు. పైగా తన స్వంత డబ్బు మూడు లక్షల రూపాయలు దానంగా ఇచ్చివేయడంవల్ల వార్డులోని షావుకార్లు అతణ్ణి వ్యతిరేకించినా ప్రజానీకంలో మాత్రం అతను మంచి పలుకు బడిని సంపాదించుకున్నాడు. సహకార ప్రాతిపదికపై స్వల్ప పెట్టుబడి బ్యాంకులు పెట్టాలన్న ఆలోచనను మేధావి వర్గంవారు కూడా హర్షించారు. ఏ పేటకాపేటలో ఇటువంటిబ్యాంకుల్ని స్థాపించి అక్కడివాళ్ళడబ్బుతో అక్కడే రకరకాల పరిశ్రమలు చేపట్టితే అభివృద్ధి పొందడం చాలా తేలికపని అని అన్నాడు సజ్జన్. ఇలాంటి బ్యాంకుల్ని ఒకదానితో ఒకటి సహకారం అనే దారంలో కూడా గుచ్చవచ్చు. ఈ వీధిలో సజ్జన్ పెట్టుబడిలో ప్రారంభించిన బ్యాంకు మోస్తరుగా ప్రభుత్వం వారు పెట్టినట్లయితే ప్రయివేటు వడ్డీవ్యాపార స్తుల ఆటల్ని ఓ చట్టం పాసు చెయ్యడం ద్వారా కట్టించి కుటీర పరిశ్రమల స్థాపనకు ప్రోత్సహిస్తే నిత్యం అవమానం, ఆర్థిక బాధలతో జీవితాన్ని గడుపు తున్న మధ్య తరగతి కుటుంబాలు తమ ఆడంబరత్వాన్ని వదిలి నిజమైన మనుషులు కాకపోతారా అని సజ్జన్ ఆశ.

చౌక్ వార్డు సహకార బ్యాంకి ఒక ఉద్యమ స్వరూపాన్ని సంతరించుకో సాగింది. అవసరం వున్న ప్రతి వ్యక్తికీ బ్యాంకి ఋణం ఇస్తుంది. ఋణానికి బదులుగా అతనితో అతనికి వచ్చిన ఏదైనా వృత్తిపని చేయించడం, ఆ వ్యక్తికి చిత్తశుద్ధితో అప్పు తీర్చడానికి అవకాశం కలిగించడం ఈ బ్యాంకి ముఖ్య సిద్ధాంతం. ఈ పాలసీ చాలా మందికి నచ్చింది. ఈ బ్యాంకి డబ్బుతోనే ఓ హాండ్లూమ్ కార్ఖానా రబ్బరు బొమ్మలూ, బుడగలు చేసే కార్ఖానా, కొత్తకొత్త డిజైన్లతో గుడ్డల అద్దకం చికన్ అల్లిక మొదలైన వృత్తిపనుల్ని ప్రారంభిం చాడు సజ్జన్. ఈ పనుల్లో ఆవార్డులోని వ్యక్తుల్నే నియమించాడు. స్త్రీల కోసం

ఇంటిలో కూర్చునో లేదా, పెద్దమ్మ ఇంటికి పిలిపించో వాళ్ళచేత కూడా చేతి పనులు చేయించే కార్యక్రమాన్ని చేపట్టాడు సజ్జన్.

ప్రతి గురువారం బజారుకు శలవు రోజు. ఆరోజు భారతీయ సంస్కృతి చరిత్ర మొదలైన విషయాలపై ఉపన్యాసాలుయివ్వడం ప్రారంభం అయింది. సాంఘిక వినోదం, వినోదంతోపాటు విజ్ఞానాన్ని కూడా అందించాలన్న దృష్టితో నాటక ప్రదర్శనాల్ని ఏర్పరిచారు. రెండు నెలల ఎడతెరిపిలేని కార్యక్రమాల్లో సజ్జన్‌కూ వనకన్యకూ వూపిరికూడా పీల్చుకోవడానికి వ్యవధి దొరక్కుండా పోయింది. ప్రజారంగంలో దూకిన సజ్జన్, అతని భార్య వనకన్య ఓ విచిత్రమైన సంఘర్షణను ఎదుర్కోవాల్సివచ్చింది. పొయ్యిమీద ఎక్కించి సగం వుడికిన పప్పులా వాళ్ళ పరిస్థితి తయారయింది. వాళ్ళక్రియా కలాపాల గురించి సంఘంలో ఐక్యభావం కలగలేదు. దారినపోతుంటే వాళ్ళను కొందరు విమర్శిస్తున్నారు. మరికొంతమంది వాళ్ళను గౌరవభావంతో చూస్తు న్నారు. అందరినీ కూడగట్టుకుని రావాలనీ, అన్నివర్గాలవారు తనను ఆదరించా లన్న భావం సజ్జన్‌లో పొంగింది. రోజూ చాలా మంది అతని దగ్గరకు రావడం తమ కష్ట సుఖాలు చెప్పుకోవడం పరిపాటైంది. ప్రారంభంలో వాళ్ళ కష్ట సుఖాల్ని ఆలకించి వాటిని నివారించడంలో అతను ఆనందం, ఉత్సాహం చూపించేవాడు. వాళ్ళంతా అతని మీద గౌరవం, శ్రద్ధాభక్తులు వుంచి తన దగ్గిర కొస్తున్నారని భావించేవాడు. శ్రద్ధాభక్తుల్ని కొనివేయడం కోసం తాను చాలా పరోపకారి అని నిరూపించుకోవాలని ప్రయత్నించేవాడు. ప్రజల కష్టాలంటే అతని హృదంలో జాలిలేదని కాదు. కాని జాలికూడా ప్రతిఫలాన్ని ఆపేక్షించేది. రోజురోజుకూ కార్యభారం పెరిగిపోవడంతో అతనిలో ఆరంభశూరత్వం సన్న గిల్లి పోసాగింది. అతని మనస్సుకు తీరిక అంటూ లేకపోయింది. అతని సమయం అంతా చాలావరకు ఆలోచనా, పని ఈ రెంటిలోనే ఖర్చయిపోసాగింది.

అటు పెద్దమ్మ కూడా బాగా అలిసిపోయి నీరసించింది. శకుంతల వివాహం రోజున వేళ్ళమీద లెక్కపెట్టే సంఖ్యలో మాత్రమే ప్రముఖులు వచ్చారు.

సజ్జన కాని కన్య కాని ఇద్దరిలో ఎవరో ఒకరు ఆమె దగ్గర వుండాల్సిన పరిస్థితి యేర్పడింది. సజ్జన్ ఈ కార్యభారాన్నంతా నెత్తిమీద వేసుకున్నప్పటినుంచి మహిపాల్ అతనంటే అదోలా వుండటం ఆరంభించాడు. ఇప్పుడైతే ముఖం దాచేయడానికి పెద్దవంకే దొరికింది. కర్నల్ మారిదిగా ఓ మిత్రునిలా తన సన్నాహాల్లో చేయూత ఇచ్చి మిత్రధర్మాన్ని నిర్వహించలేని సజ్జన్ సంఘ సంక్షేమ కార్యక్రమాల్ని ఎంత వరకు అమలు చేయగలడని మహిపాల్ ఫిర్యాదు. కళ్యాణి కన్యా నిర్ణయించిన ప్రకారం శకుంతల పెళ్ళి సజ్జన్ బంగాళాలోకాక సేఠ్ రూప్ రతన్ బంగళాలో చేయడానికి మహిపాల్ నిశ్చయించాడు.

సేఠ్ రూప్ రతన్, లాలాజానకీ శరణ్ వాళ్ళిద్దరి ప్రోద్బలంతో మహిపాల్ సజ్జన్ ప్రారంభించిన నూతన సాంఘిక సంక్షేమ పథకాన్ని విమర్శిస్తూ ఓ చిన్న పుస్తకం ప్రచురించాడు. పుస్తకంలో సజ్జన్ మీద విషం గక్కుతూ "సజ్జన్ వర్మ నా ఆప్తమిత్రుడు. అయినా స్నేహానికి ప్రజాసంక్షేమానికి ఘర్షణ వస్తే స్నేహాన్ని కాదని ప్రజాక్షేమం దేనిలో ఇమిడి వుందో అది వాళ్ళకు తెలియ చెప్పడం నా విధి. మానవత్వం అపేక్షించేది కూడా అదే" అంటూ సజ్జన్ సహకార బ్యాంకిని స్థాపించడంలో వుద్దేశ్యం మామూలు షావుకార్లను ధ్వంసంచేసి ప్రజల్ని గులాములుగా చేయడానికి, తన గుప్పిట్లో పెట్టుకోడానికి అతను వేసిన సరికొత్త ఎత్తని వాదించాడు. పారంపర్యంగా వస్తోన్న వడ్డీ వ్యాపారస్తుడు సంఘంలోని ఏకొద్దిమంది వ్యక్తులకో నష్టం కలిగిస్తోంటే ఈ బ్యాంకును సాకుగా తీసుకుని యావత్తు సంఘాన్నే దోచుక తినాలని పన్నిన పన్నాగం అన్నాడు. భారతీయ సాంస్కృతి అంటే సజ్జన్‌కి ఏమి తెలుసు? అతను నేర్చుకున్న మిడిమిడి జ్ఞానం కూడా మహిపాల్ సాంగత్యంలో నేర్చుకున్నాడు. ఇలాంటి అల్పజ్ఞానం వున్నవ్యక్తికి సాంస్కృతిక సంస్కరణలంటూ ఉత్తమమైన భారతీయ సాంప్రదాయాలనే మట్టుపెట్టగలడు. సాంస్కృతిక కార్యక్రమాలంటూ ఈ నాటక ప్రదర్శనల ద్వారా ప్రజల్ని మభ్యపెట్టి కుటీర పరిశ్రమల పేరిట అందరినీ దివాలా తీయించే ఈ ప్రవృత్తిని మొదట్లోనే

తుంచివేయని పక్షంలో ఇది చాలా ప్రమాదకర పరిస్థితులకు దారితీస్తుందని మహిపాల్ తన పుస్తకంలో హెచ్చరించాడు సజ్జన్ పథకం స్తన్యములందు విషం పూసుకుని పాలు ఇస్తానని అంటూ శ్రీకృష్ణపరమాత్మునే తునమడానికి వచ్చిన పూతన రక్కసిలాంటిదని వర్ణించాడు.

ఈ పుస్తకం ప్రతులు ఊరంతా పంచిపెట్టారు. తన యింటిదగ్గర ఇంతకు ముందు రాధాకృష్ణుల వివాహ సందర్భంలో కృష్ణభగవానుని ప్రతిష్ఠించిన గుట్టమీద లాలాజానకీశరణ్ ఓ సమావేశం యేర్పాటు చేసి మహిపాల్‌తో సహా చాలా మంది వ్యక్తులచేత పథకానికి వ్యతిరేకంగా ఉపన్యాసాలు ఇప్పించాడు.

మహిపాల్ పనికట్టుకుని తనకు వ్యతిరేకంగా చేస్తోన్న ఈ ప్రచారం చూసి సజ్జన్‌కి ఏ మాత్రం ఆశ్చర్యం కలుగలేదు కాని విచారం మాత్రం వేసింది. ఆత్మ పరీక్ష చేసుకోవాలన్న ప్రవృత్తి అతనిలో తీవ్రమైంది. హేతుబద్ధంగా మహిపాల్ తన పథకం గురించి తప్పుడు ప్రచారం చేస్తున్నా అతను ఆరోపించినట్లు నిజంగా దాని వెనుక తన వ్యక్తిగత మహత్వాకాంక్ష దాగిలేదు కదా అని అనుకున్నాడు సజ్జన్. అదే నిజం అయితే తాను ప్రారంభించిన పని ఎంతో ముందుకు పోజాలదు. ఏ ప్రజాకార్యం అయినా దానిలో ఎక్కువమంది కీర్తికాంక్షలు సమానంగా ఇమిడి వున్నప్పుడు కాని దానికి ప్రజల ఆదరదండలు లభించవు. కార్యక్రమం శక్తిమంతం కాజాలదు. దైనందిన కార్యకలాపాల్లో మునిగివుంటూ ఒక పక్క సజ్జన్ ఆత్మ పరీక్ష చేసుకోసాగాడు. తనలో స్వార్థి మాసం కావలసినంతవుంది తాను ఆరంభించిన యజ్ఞం తన అసమర్థత వల్ల కాని తన అవివేకం వల్లకాని మధ్యలో ఆగిపోవడం అతను ఎన్నటికీ సహించలేడు. మహిపాల్ విమర్శవల్ల అతనికి అరికాలు మంట నెత్తికి ఎక్కింది. మహిపాల్ ఆరోపణలు బూటకాలని ఋజువుచేయడానికి వ్యక్తిగత యిష్టాలకు యిష్టాంకు అతీతమైన కార్యశక్తిని చూపించాలన్న పట్టుదల అతనిలో హెచ్చింది.

సజ్జన్‌కి సహాయంగా శంకర్‌లాల్, వర్మ మొదలైన యువకులున్నారు. కార్యక్రమాల్ని చవిచూసిన వాళ్ళు చాలాసార్లు ఆయన దగ్గరకు వస్తూ పోతూ

వున్నారు. అతను సాధించిన మన కార్యాలకు ప్రజానీకం అధికార ముద్ర వేస్తున్న కారణంగా వాళ్ళ సానుభూతి కూడా పెరగ సాగింది. లాలాజానకీ శరణ్, మహిపాల్ శుక్లా సజ్జన్‌ను ఘాటుగా విమర్శించడంతో సజ్జన్ అభిమానుల్లో చాలా మంది మనసుకు బాధ కలిగింది. చాలా చోట్ల ఈ విషయం గురించే చర్చలు జరుగు తున్నాయి. తమ తమ బుద్ధికి తోచినట్లు ప్రజలు మహిపాల్ పక్షానా, సజ్జన్ పక్షానా విడిపోయారు. సజ్జన్ అభిమానులు వెంటనే ఓ సమావేశం యేర్పాటు చేసి విమర్శకులకు తుక్కుకాటుకు చెప్పు దెబ్బ కొట్టమని సజ్జన్‌ని బలవంత చేస్తూ వాతావరణంలో ఉద్రిక్తత తెచ్చారు,

ఆ విషయాన్ని గురించి సజ్జన్ ఆలోచిస్తూ వున్నాడు. ఆరోజే తను ఓ ఇల్లు చూడడానికి వెళ్ళవలసి వుంది. వీధిలోనే ఒక హాస్పిటల్ పెట్టాలని పథకం తయారు చేస్తున్నాడు. కాశీలో ఒక ధర్మాసుపత్రిని గురించి ఇంతకు ముందే అతని కెవరో చెప్పారు. అక్కడ హోమియోపతి, ఆయుర్వేదం, అల్లోపతి మూడు శాఖలూ వున్నాయట ప్రసూతి సౌకర్యాలు కూడా వున్నవట. ఆ చుట్టు పక్కలవాళ్ళు దాని వల్ల ఎంతో లాభంపొందు తున్నారట. ఆసుపత్రి పెట్టాలన సంకల్పం సజ్జన్‌లో బాగా నాటుకు పోయింది. అయితే చోటులేని కారణంగా అతను ఇంతవరకు అమల్లో పెట్టలేక పోయాడు ఎవరిదో పెద్ద మేడ అమ్మకానికి వచ్చిందన్న వార్త వినగానే దానిని బేరం ఆడడానికి వెళ్ళాలని ఉవ్విళ్లూరాడు సజ్జన్.

ఇల్లు మంచి పక్కా కట్టుబడి. ఇంటి యజమాని ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో లక్షలు గడించాడు, తన గొప్పచాటుకుంటూ, సంపాదించినదంతా ఆర్పేసాడు. వార్డులోని ధనికులతో జీవన ప్రమాణంలోనూ ఖర్చు పెట్టడంలో పోటీపడసాగాడు. పెద్దమనుషుల జాబితాలో పేరు నమోదు చేయించుకున్నాడు. ప్రాపకం, పలుకుబడీసంపాదించాడు, ధనార్జన దిగజారినా చేసుకున్న అలవాట్లు విడిచిపెట్టలేదు. అప్పుల మీద అప్పులు చేయసాగాడు. ఉండి ఉండి అమాతంగా ఓ రోజు అతని బండారం బయటపడింది. చట్ట ప్రకారం దివాలా

తీసినట్టు ప్రకటించుకోవడంలాంటి పనులు చేయటం యిష్టంలేక తనకున్న యావ దాస్తినీతెగనమ్మసాగాడు, నగలూ, వెండిబంగారుపాత్రలూ, కారూ, గుర్రపుబండీ అన్నీ ఆడంబరాలను తొలగించి నగదు కింద మార్చుకోవడం మొదలెట్టాడు.

సజ్జన్ దగ్గర పనిచేస్తోన్న అకౌంటెంటు ఇల్లు చూసి వచ్చాడు. దాని కిమ్మతుకూడా ఉజ్జాయింపుగా మదింపువేసాడు. ఏమాత్రం ఆలస్యం చేసినా అంత మంచి ఆస్తి చెయ్యిదాటిపోయేలా కనపడింది. మహీపాల్ విమర్శలకు సమాధానం చెప్ప డానికి సమావేశం యేర్పాటు చేయడంలో కాలహరణం చెయ్యక ఆసుపత్రి భవనాన్ని కొనడానికి అతను ఎక్కువ ఉత్సాహంగా వున్నాడు. మహీపాల్ కక్కిన విషానికి ఈ పని అమృతవాక్కులా మౌనంగా పనిచేస్తుందని అతని అభిప్రాయం.

తన అభిమానులకే యిచ్చిన యీ జవాబులో తనకు నిజంగా ఎంత విశ్వాసం వుందని సజ్జన్ ఆలోచించాడు. మనం మనల్ని కాపాడుకొవడానికి ఎంతో అందమైన యోచన చేస్తాం. మళ్ళీ ఆసాకూ ఈసాకూ చెప్పి పాతదానికే అంటిపెట్టుకుని వుండడం మామూలు. మన మనోభావాన్ని సరిగా గుర్తించక దానివల్ల అనవసరమైన గుంజాటనల్లో ఇరుక్కుంటాం. నిజంగా ప్రజాసంక్షేమం కోసమే సజ్జన్ ఇదంతా చేస్తున్నాడా? తన శ్రమకు ప్రతిఫలంగా కీర్తి కండూతిని కోరడంలేదూ? చిత్రకళ సాధన కన్న సాంఘిక కార్యకర్తగా వుండి తర్వగా కీర్తిని సంపాదించవచ్చు నన్న భావం తనలో లేదా?

మేఘాల్లా ప్రశ్నలు అతని మానసిక ఆకాశంమీద ముసురుకోసాగాయి. ప్రతి ఒక్క విషయాన్ని తాను ఇదమిత్థంగా తేల్చలేక పోతున్నాడు. ప్రజల సంక్షేమమా కాదు తనకి కీర్తికావాలి. యశస్సుకోసం చిత్ర కళను ఒదిలి పూర్వీకులు సంపాదించిన లక్ష్మిబలం మీద తాను నాయకుడు కాలేదన్నది నిజం. ఇది అంతా తన జీవితంలో అనుకోకుండా ప్రయత్నించకుండా జరిగింది. ఏ సమస్యలకు సమాధానాలు వెతకాలని తానీ సందుల్లోకి వచ్చాడో, ఏ భారతీయ సమాజం ఉచ్చైశ్వర్యాల చిహ్నాల్ని పరికిద్దామని అతనిక్కడికి వచ్చాడో అది

అర్థంకాదు. తన హృదయంలోని జిజ్ఞాస, పరవళ్ళు తొక్కుతున్న ఉత్సాహం తనను అక్కడికి రావడానికి ప్రేరేపించాయి. కులీనుల మధ్యవుంటూ ఆ ప్రశ్నకు సమాధానం వెతకలేదు. వాళ్ళను వదిలి మామూలు జనసామాన్యం మధ్యకు వచ్చాడు. తన కార్య దీక్ష పర్యటనాప్రవృత్తి తననిక్కడికి లాక్కొచ్చింది. నిజం చెప్పాలంటే తాను ఇంతవరకు పూర్తిగా ప్రజా సామాన్యంతో, దరిద్రనారాయణునితో తాదాత్మ్యంపొందలేదు. అయినా వాళ్ళంటే అతనికి జాలిలేస్తోంది. అందువల్లనే తన సాంఘిక కార్యకలాపాలు కేవలం ప్రజా సంక్షేమం అనే భావనతో ఉద్దిష్టం కాకపోయినా యశస్సుతో కూడా పూర్తిగా భావసమైక్యత పొందలేదు. కీర్తికంటే చిత్తశుద్ధితో ప్రజలకు మేలు చేయాలన్న భావన ఎన్నోపాళ్ళు ఎక్కువగా వుంది. పనల్లో మునిగి తేలు తోంటే కీర్తి కందూరి అనే భావమే తనలో లేవట్ల కనపడుతూంది, మరైతే తనంటే మహిపాల్‌కి ఉక్రోషం ఎందుకు? లాలా జానకీశరణ్ మీద పగ తీర్చుకోవడానికి తానూ ఓ సమావేశం పెట్టాలన్న యోచన అతనికి ఇప్పటికీ ఋష్టమే అన్న విషయం సత్యంకాదా? తను ఇల్లు చూడ్డానికి వెళ్ళడం అవసరం కాకపోయిన పక్షంలో ఏకార్ధి వ్యవధిలోకినా ఈ విషయం గురించి శ్రద్ధగా ఆలోచించేవాడే నన్న వాస్తవికతను తోసి రాజనలేకపోయాడు సజ్జన్.

# 49

ఇరవై వేల రూపాయలకు సజ్జన్ యిల్లు కొనేశాడు. ఆసుపత్రికి కావల సిన సాధన సామగ్రి ఇంకారాలేదు. అయినా అంతవరకువేచి వుండడం ఎందు కని ఓ డాక్టర్ని, లేడీ డాక్టర్ని, ఆయుర్వేద వైద్యుణ్ణి, హకీమునూ, హోమియో పతి డాక్టర్ని నియమించాడు సజ్జన్. వీళ్ళుకాక నగరంలోని మరో పెద్ద డాక్టర్ని, డాక్టర్ షీలాసింగుని వారానికి రెండుసార్లు సలహా యిచ్చే నిమిత్తం రావలసిందిగా కోరాడు. తన ప్రాక్టీసులో ఇంచు మించుగా సగంభాగం వదులు కుని ప్రతిరోజూ సాయంత్రం హాస్పటల్‌కి వస్తానని వాగ్దానం చేసింది డాక్టరు షీలా. ఆమె సంసిద్ధతను చూసి సజ్జన్, కన్యా ఇద్దరూ వుప్పొంగిపోయారు.

ఔషధాలయం, ప్రసూతి గృహానికి కావలసిన సామాన్లూ, మందులూ వాటి కొనుగోలంతా కర్నల్ ద్వారా జరుగు తోంది.

డాక్టరు షీలా సగం ప్రాక్టీసును మానుకుని హాస్పటల్లో ఉచితంగా సేవచేయడానికి ముందుకొచ్చిందన్న వార్తను సజ్జన్ చాలా పెద్ద తరహాలో ప్రచారం చేసాడు. నగరంలోని దినపత్రికలన్నీ ఆ వార్తను ప్రచురించాయి. షీలా గురించి ప్రచారం చేస్తూ ఆమె ప్రఖ్యాతిని వ్యాపింపజేయడంలో సజ్జన్‌కు వ్యక్తిగత స్వార్థం ఏమీలేకపోయినా ఈ సాకుతో మహీపాల్ మీద ఎదురు దెబ్బతీయాలన్న భావం మాత్రం సజ్జన్‌లో లేకపోలేదు. ఆ విధంగా సజ్జన్, మహీపాల్‌ని దెబ్బ కొట్టాలనుకున్నారు.

మహీపాల్ నిజంగానే రెచ్చి పోయాడు. తన విరోధుల క్యాంపులోకి షీలాను లాగి సంఘంలో ఆమెకూ తనకూ వున్న అనుచిత సంబంధాన్ని ప్రజలకు మళ్ళీజ్ఞాపకం చేసి తన ప్రతిష్ఠను మరింతగా దిగజార్చాలని సజ్జన్ చూస్తోన్నట్టుగా మహీపాల్‌కు తోచింది. సజ్జన్ అంటే అతనిలో మరింత ద్వేష భావం కలిగింది. చాణక్యుని సిగలా అతని మనసు మాటిమాటికి విడిపోనారంభించింది, పుట్టిల్లు రాచరిక సంస్కారం మహీపాల్ నరాల్లో అలలు అలలుగా పొంగి ప్రవహింపసాగింది. సజ్జన్‌ని అణగద్రొక్కాలి, అతని మీద వేటకుక్కల్ని వదలాలి, వుప్పుపాతరేసి రాళ్ళువిసరాలి, చెట్టుకు వేలాడ దీసి కింద మంట పెట్టాలి, లక్షం విలువచేసే అతని ఐశ్వర్యానికి నిప్పంటించాలి అన్నంత కోపంతో అట్టుడికిపోయాడు మహీపాల్. సజ్జన్ మీద వుండే ద్వేషం వుండివుండి అతడి ఆవేశంతో కదుపడం మొదలెట్టింది. సజ్జన్‌ని నిలుచున్న పళాన చీల్చి పారెయ్యాలనిపించింది. షీలా మీద కూడ అతనికి ఆగ్రహం వచ్చింది. తనకు విరోధి అయిన సజ్జన్ పంచచేరుతుందా? ఇదేనా నిజమైన ప్రేమ?

ఇంట్లో పెళ్ళి సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయి. శకుంతల తండ్రి తరపు వాళ్ళూ, మహీపాల్ రెండో చెల్లెలూ, ఆమె పిల్లలూ అందరూ ముందే వచ్చారు. తన బంగళాలో ఓ భాగాన్ని పెళ్ళి నిమిత్తం ఖాళీచేయించి యిచ్చారు, సేఠ్ రూప్‌రతన్. పెళ్ళిసామానంతా అక్కడికిమోసుకెళ్ళుతున్నారు.

ఇల్లంతా పెళ్ళిసందడి, హడావుడితో ఆర్భాటంగా వుంది. ఒక్క మహిపాల్ మాత్రం మనస్సులో పెరుగుతోన్న దుగ్ధతో సతమతమౌతూ మనశ్శాంతి లేకుండా తిరుగు తున్నాడు. ఎలాగైనా సజ్జన్‌కి పెద్ద నష్టాన్ని కలిగించాలని అనుక్షణం ఆలోచించసాగాడు. ఏ ఉపాయం అతనికి తోచడంలేదు. ఎప్పుడు చూసినా చిరచిరమంటూ కనిపిస్తాడు. పొద్దుపొడిస్తే చాలు కారు తీసుకుని రూప్‌రతన్ దగ్గరకో, రాజాసాహెబ్‌వద్దకో. ఏ మంత్రిగారిదగ్గరకో ఉపమంత్రి గారి దగ్గరకో చివరికి ఏ కొద్దిపాటి పరిచయం వున్న వ్యక్తి అయినా సరే అతని మీద వాలడం, బాతాఖానీ కొడ్తూ కొడ్తూ మధ్యలో సజ్జన్ ప్రసక్తి తెచ్చి అతణ్ణి ఆడిపోసుకోవడం మినహా అతనికి వేరేపని కనబడ్డం లేదు. కమ్యూనిస్టు భార్య మాటలు విని ప్రజా సంక్షేమం పేరిట సంఘాన్నంతా కమ్యూనిస్టుగా మార్చాలని ఎత్తువేస్తున్నారనో, రాత్రిళ్ళు అతని ఇంట్లో కమ్యూనిస్టు పార్టీ సమావేశాలు జరుగుతుంటాయనో, లేకపోతే భార్యా భర్తలు ఇద్దరూ చరిత్ర హీనులనీ భర్తగారి ఆకలి తీర్చడం కోసం మంచి మంచి అమ్మాయిలను సరఫరా చెయ్యడమే కన్య ముఖ్య లక్ష్యం అనో రకరకాలుగా లేనిపోని పుకార్లు లేవదీసీ, ఎవరైనా ప్రమాణం యేదని అడిగితే నేనే ఇవన్నీ స్వయంగా చూసానసీ, సజ్జనే నాతో స్వయంగా ఈ సంగతులన్నీ చెప్పారనీ, మహిపాల్ రోజుకో రకంగా ప్రచారం చెయ్యడం మొదలెట్టాడు. సజ్జన్ పన్నుతున్న ఓ పెద్ద కుట్రలో బాబా రామ్‌జీని పావుగా ప్రయోగిస్తున్నారు, అతనంటే సంఘం అప్రమత్తతతో వ్యవహరించాలనీ హెచ్చరిక చేసేవాడు, ఇల్లూ ఇల్లాలు, ఆకలి దప్పులూ అన్నీ మరిచి సంక్షేమం అని చెప్పి వుదయం నుంచి సాయత్రం వరకు సజ్జన్‌కి వ్యతిరేకంగా విషప్రచారం చెయ్యడమే పనిగా పెట్టుకున్నాడు మహిపాల్. రాజాసాహెబ్‌గారి జీవిత చరిత్ర రాస్తానని ఆయనకు కూడా ఆశ పెట్టాడు, వేదవేదాంతాలు అన్నీ నాకు తెలుసు అంటూ తన పాండిత్య ప్రదర్శన ద్వారా ఆయన మెప్పు సంపాదించడానికి ప్రయత్నించాడు. పెద్దమ్మ ఇంట్లో కన్య నిర్వహిస్తోన్న పాఠశాలను ఎత్తివేసి దానిస్థానే ఓ వేద పాఠశాల పెట్టమని సలహా ఇస్తూ అందువల్ల మన భారతీయుల్లో మతం, ధర్మం అంటే శ్రద్ధాసక్తులు పెరుగుతాయనీ అప్పుడు విదేశాల్లాంటి క్రామేడ్ సజ్జన్

ప్రభావం నుంచి సంఘాన్ని కాపాడవచ్చని చెప్పారు. లాలా జానకీశరణ్ దగ్గర కెళ్ళి రాజాసాహెబ్ గారి చేత ఏదైనా పటిష్టమైన సంస్థను స్థాపించి సజ్జన్ పథకాన్నంతా ధ్వంసం చేయాల్సిందిగా బాగా ఎక్కించేవారు. వార్డులోని ముఖ్యుల ఇళ్ళల్లోను ప్రత్యేకించి లాలా జానకీశరణ్ ఇంట్లోనూ గూఢచారుల్ని సజ్జన్ నియోగిస్తున్నారని చెప్పి వాళ్ళందరినీ భీతావహులుగా చేయడానికి ప్రయత్నించారు. సజ్జన్ ఇక్కడ వుంటే ఏ సజ్జనుని ప్రతిష్ఠ నిలబడజాలదని ఖచ్చితంగా ఢంకామీద దెబ్బకొట్టి చెప్పారు.

కాలికి బలపం కట్టుకుని నిద్రాహారాలు మాని మహీపాల్ చేసిన కృషి ఫలితాల్ని ఇచ్చింది. శకుంతల పెళ్ళి మూలంగా మహీపాల్ ఈ మధ్య రూప్ రతన్ బంగళాలోనే వుంటున్నాడేమో సమయం దొరికినప్పుడెల్లా రూప్‌రతన్‌ని ఎగదోయడానికి అవకాశం లభిస్తోంది. నూరిపోయగా పోయగా సేఠ్ రూప్ రతన్‌లో నిద్రిస్తోన్న ఒక మహత్ కాంక్షను లేపడంలో మహీపాల్ కృత కృత్యుడు కాగలిగాడు. ఓ మహోద్యమాన్ని లేవదీస్తే రూప్‌రతన్ ప్రభుత్వం మంత్రివర్గంలోకి తీసుకోబడతాడని మహీపాల్ వేసిన మంత్రం బాగా పారింది. తథాస్తు అన్నాడు. రూప్‌రతన్. కావలసిన వ్యూహం పన్నమని ఆజ్ఞాపించాడు మహీపాల్‌ని పది మంది వర్తకవ్యాపారస్తులు కలిసి ఓ సహకార సంస్థను యేర్పాటు చేస్తారు, వాళ్ళ సహకార బ్యాంకుల ఆర్థిక సహాయంతో కుటీర పరిశ్రమలు స్థాపిస్తారు, ధార్మిక వాతావరణాన్ని కల్పించి కీర్తనల ద్వారా పురాణ కాలక్షేపం ద్వారా ధర్మ ప్రవచనాల ద్వారా భారతీయత అంటే ఏమిటో నాలుగువైపులా ముమ్మరంగా ప్రచారం చేస్తారు ఈ పథకాన్ని ప్రారంభించే ముందు విశ్వశాంతికోసం ఓ మహా యజ్ఞాన్ని చేసి ప్రజల్లో భక్తి శ్రద్ధలు పెరిగేలా చేయడం జరుగుతుంది. రాజాసాహెబ్, సేఠ్ రూప్‌రతన్ ముఖస్తంగా చెప్పిన ముక్కల్ని జోడిస్తూ రాత్రికిరాత్రే ఒక ప్రణాళికను తయారు చేశాడు మహీపాల్.

రెండు రోజుల తర్వాత విక్టోరియా పార్కులోనూ, చౌకులోను పెద్ద బహిరంగ సభకు రాజాసాహెబ్ స్వయంగ అధ్యక్షత వహిస్తారనీ పురప్రముఖు

లంతా దానిలో పాల్గొని పీళ్ళ ప్రారంభించబోయే పథకం గురించి తమతమ అభిప్రాయాల్ని వివరిస్తారనీ ఆ ప్రకటనలో వుంది.

పెద్దమ్మకి అప్పుడు చాలా సుస్తీచేసి ప్రమాదస్థితిలో వుంది. ఆమె బతుకుతుందన్న ఆశ లేదు. తను మరణించిన తర్వాత రాజాసాహెబ్ కానీ అతని సవతి కొడుకులు కానీ క్రియకర్మ సరిగ్గా జరిపిస్తారో లేదో అన్న అనుమానంతో బ్రతికివుండగనే అన్నీ జరిపించుకుంటోంది, పెద్దమ్మ ఆమెకు సంబంధించిన బాధ్యత యావత్తూ సజ్జన్ కన్యం మీద వచ్చిపడింది. వాళ్ళిద్దరూ ఆమెకు కొడుకూ కోడలి మాదిరిగా అవుతయారు.

సజ్జన్, వనకన్య అంటే పెద్దమ్మ ఎంత అనురాగం పెంచుకుందంటే ఓ రోజు కన్నోమల్ మనవడి భార్యను పిలిచి తను ఇస్తానన్న వంద తులాల నగలు ఆమెకు ఇస్తూ "నువ్వు వేరే కులందానివైనా నాకు కోడలయ్యావు గనుక నీకు ఇచ్చేస్తున్నాను. నాకు నువ్వే సేవలు చేస్తున్నావు. చివరికి నువ్వే అక్కర కొచ్చావు" అని అంది. కన్యకు వంద తులాల బంగారం అయితే తవీమని ఇచ్చింది కాని ఆమె చేతి నీళ్ళ మాత్రం తాగడానికి అభ్యంతరం చెప్పింది పెద్దమ్మ, ఇంగ్లీషు మందులు తీసుకోవడానికి స్పష్టంగా నిరాకరించింది పెద్దమ్మ దగ్గర యిరవై నాలుగు గంటలూ కాచుకూర్చునే నిమిత్తం సజ్జన్ తన దగ్గరున్న యిద్దరి నౌకర్లను నియమించాడు రాత్రివేళలో సజ్జన్ కానీ కన్య కానీ ఎవరో ఒకరు తప్పనిసరిగా ఆమె దగ్గర వుండేవారు. పెద్దమ్మ యిష్ట ప్రకారం యేయే దానాలూ, ధర్మాలూ, చెయ్యాలో అవి అన్నీ జరిపిస్తున్నాడు.

చౌకులో రాజా సాహెబు అధ్యక్షతన మీటింగు జరిగినరోజే పెద్దమ్మ యింట్లో పదమూడోరోజు క్రియాకర్మ సంతర్పణా జరిగాయి. అసలే తీరిక లేని సజ్జన్ వనకన్యకు ఈ క్రియా కర్మలు కూడా జరిపించాల్సి వచ్చేసరికి బొత్తిగా తీరిక లేకుండా పోయింది. వాళ్ళకు సాయపడేందుకు కర్నల్ కూడా తయారయ్యాడు. సజ్జన్‌కీ మహిపాల్‌కీ మధ్య బాగా చెడినందుకు కర్నల్ ఎంతగానో బాధపడ్డాడు. ఈ విషయంలో అతను మౌనవ్రతం పాటిస్తూ ఇద్దరికీ

పనులు మాత్రం చేసిపెట్టేవాడు. కళ్యాణి యింటికి వస్తూపోతూ వాళ్ళకేమి కావాలో కనుక్కొంటూ సుధ్యేమార్గాన్ని అవలంబించాడు కర్నల్ మహిపాల్‌ని అతను కలుసు కునేవాడు. పని పొరపాటున కూడా సజ్జన్ విషయం అతని ముందు ఎత్తేవాడు కాదు. కర్నల్ కలిసినప్పుడెల్లా మహిపాలే సజ్జన్ ప్రసక్తి బలవంతంగాతెచ్చేవాడు. "చూడుమహిపాల్, అది మీయిద్దరి స్వవిషయం. ఇద్దరు విజ్ఞులమధ్యపోటీ మధ్యలో నాకెందుకు? ఈ విషయం గురించి మళ్ళీ నా దగ్గర చర్చించకు" అంటూ కర్నల్ వాళ్ళ గొడవలో తనకు సంబంధం లేదని స్పష్టం చేసాడు. సజ్జన్ అయితే మహిపాల్ ప్రసక్తే తెచ్చేవాడు కాదు కర్నల్‌తో. మహిపాల్ కర్నల్‌కు చాలా పాత మిత్రుడు. అసలు కర్నల్‌తో సజ్జన్‌కి పరిచయం మహిపాల్ ద్వారానే కలిగింది.

ఆరోజు సాయంత్రం విక్టోరియా పార్కులో గొప్ప బహిరంగ సభ జరిగింది. సభలో ప్రసంగిస్తూ మహిపాల్ మర్యాదను కూడా అతిక్రమించాడు సజ్జన్ తనకెంతో సన్నిహితుడని వుపన్యసిస్తూ "అతను చాలా స్వార్థపరుడని నిరూపించడానికి ప్రయత్నించాడు. సజ్జన్ మొదటి నుంచి ఎంతో స్వార్థపరాయణుడు. ఆత్మాశలు కల వ్యక్తి. డబ్బు బలంతో తన విమర్శకులందరికీ పెద్ద పెద్ద విందులు ఇచ్చి వాళ్ళచేత పొగడ్తలు అందుకుని కీర్తి గడించాడు. అతనిలో కళా పరిజ్ఞానం తక్కువ. గారడీలు ఎక్కువ. అడ్డదారిలో పేరు ప్రసిద్ధులు పొందాలని చూస్తున్నాడు." అంటూ ఏమోమే అవాకులు చవాకులూ పలికాడు. బహిరంగంగా అతను చేసిన ఆరోపణలకు అతని మీద చట్టరీత్యా చర్య తీసుకోవచ్చు. మొహంజోదారో, శివుడూ, వేదాలూ, చరిత్ర, సాంఘిక శాస్త్రం అలా ఎన్నో విషయాల మీద మాట్లాడుతూ అవన్నీ సజ్జన్‌ని విమర్శించ డానికే ఉపయోగించాడు. తన గంటసేపు వుపన్యాసంతో సభికుల్ని మంత్ర ముగ్ధుల్ని చేసాడు. మధ్య మధ్య అవకాశాన్ని కలుగజేసు కుంటూ విషం కక్కాడు. ఈనాటి సాయం కాలం జరిగిన బహిరంగ సభ నిజంగా మహిపాల్‌కి ఎంతో చరిత్రాత్మకమైంది. లక్షలకు అధిపతి అయిన సజ్జన్‌ని అతను సహాలు చేశాడు. లక్షికటాక్షం చేత సజ్జన్ మహా పురుషుడిగా చలామణికా గలిగితే,

ఎరువు తెచ్చుకున్న ఐశ్వర్యబలంతో మహిపాల్ కూడా మహా పురుషుడూ అని పించుకో గలడు. మహా పురుషత్వాన్ని బహిరంగంగా చాటుకునే ఆక్షణంలో తన్ను తాను మరిచి, పరిసరాల్ని మరచి మహిపాల్ సజ్జన్‌కి వ్యతిరేకంగా బహిరంగంగా చట్టవిరుద్ధమైన ఆరోపణలు చేసాడు.

ఆ ఉపన్యాసం వినగానే సజ్జన్ అభిమానులకు రోషం ఆగ్రహం కలి గాయి. ఒక పెద్ద పెట్టుబడిదారీ వర్గం సంఘటితమై నేలలో వేళ్ళు కూడా పూర్తిగా పాతుకొనని మొక్కను మెదట్లోనే తుంచేయాలని చూస్తున్నారు. మహిపాల్ దురుసు తనానికి సజ్జన్, వనకన్యా ఎంతగానో బాధపడ్డారు. డాక్టర్ షీలాస్వింగ్ అయితే ఆ వార్త విని ఏడ్చింది. వ్యవహారాన్ని వకీలుకు అప్పగించాలని నిశ్చ యించు కున్నారు సజ్జన్ మూడో రోజు సజ్జన్ వకీలు పంపిన రిజిస్టరు నోటీసు మహిపాల్‌కి అందింది. ఆ తరుణంలో కర్నల్ పెళ్ళి వనుల సందర్భంగా సేఠ్ రూప్‌రతన్ బంగళాలోనే వుండడం తటస్థించింది. మహిపాల్ ఉక్రోషంతో "నేను కూడా చూస్తాను" అంటూ చిందులు తొక్కాడు.

"చూడు మహిపాల్, నీ వుపన్యాసం విని నీవ్వు చెప్పినట్లు తలవూప డానికి నేను జనసామాన్యమంత మూర్ఖుణ్ణి కాను. పాపం శకుంతల పెళ్ళని చెప్పి ఇంత వరకు నోటికి తాళం వేసుకొని కూర్చున్నాను. కాని ఇప్పుడు నోరు విప్పక తప్పనిసరైంది గనుక నోరు విప్పి తున్నాను. ఇట్టి పరిస్థితుల్లో సజ్జన్ నీకు వ్యతిరేకంగా చట్టరీత్యా చర్య తీసుకోవడం న్యాయబద్ధమైందే. నువ్వు ఓడి పోతావు కూడాను. జైలు కెళ్ళడం ఖాయం. నీకు సహాయం చేస్తామంటూ ఈ పెద్ద మనుషులు వస్తున్నారే వాళ్ళ వల్లయేమీ కాదు, కేసులో నువ్వెలాగైనా ఓడ తావు" అంటూ కర్నల్ చీవాట్లు పెట్టాడు. కళ్యాణికి కూడా జరిగినదంతా వివరించిచెప్పాడు కర్నల్. తన భార్య కర్నల్‌ల ముందు తాను చేసిందే న్యాయం అంటూ పెద్ద పెద్దగా అరుపులు అరిచాడు మహిపాల్ సజ్జన్ చరిత్రహీనుడని వర్ణించాడు. అలా మహిపాల్ పేలుతోంటే కర్నల్‌కి కోపం వచ్చింది. "నువ్వు కూడా కడగిన ముత్యానివి కాదుగా. ఇతరుల మీద బురద చల్లి నువ్వేసిన ఎత్తుకు నువ్వేమురిసి పోతున్నావు. సాక్షుల కింద ఒకవేళ సజ్జన్ నన్ను పిలిచిన

పక్షంలో తప్పక పెడతాను. నాకు తెలిసినంత వరకు డాక్టరు షీలా కూడా ఈ పరిస్థితిలో నీకు విరుద్ధంగానే సాక్ష్యం ఇస్తుందనుకుంటాను. న్యాయానికి ఆమె అలా ఇవ్వాలి కూడా" అంటూ దులిపి పారేసాడు మహీపాల్‌ని.

"పోండి, పోండి మీరంతా కట్ట కట్టుకుని పోండి" అంటూ గద్దించాడు మహీపాల్. ఉద్రేకంలో ఒళ్ళు మరిచి తాను కూర్చున్న కుర్చీని ఎత్తి నేలకేసి కొట్టాడు. ఒకచేయి విరిగింది. విక్టోరియా కాలం నాటి నుంచి నగిషీ పనితనం వున్న కుర్చీ విరగగానే అది సేఠ్ రూప్‌రతన్ సామాను అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అంతే వెంటనే తగ్గిపోయి గొణుగుడు మొదలెట్టాడు.

"ఈయనకు మతి పోయింది. మీరైనా సజ్జన్ అన్నగారికి మా పిల్లల ముఖాల్ని చూసైనా వూరుకొమ్మని సముదాయించి చెప్పండి" కళ్యాణి కర్నల్‌ని వేడుకుంది.

కర్నల్. కన్యా, సజ్జన్‌ల మధ్య మాటలు జరిగాయి. చట్టరీత్యా మహీపాల్ మీద చర్యతీసుకుంటానన్న తన నిర్ణయానికి తిరుగు లేదంటూ "చూడు కర్నల్, ఇది నా స్వంత విషయం కాదు. నా ట్రస్టుకు సంబంధించి అతను ఏవేవో అన్నాడు. నేను కిమ్మనకుండా వూరుకుంటే అవన్నీ నిజమని ప్రజలు నమ్ముతారు. నా ట్రస్టుకే దెబ్బ. నా సంస్థకోసమైనా మహీపాల్‌ని శిక్షించి తీరాలి. నువ్వు కూడా నా వైపు సాక్ష్యం చెప్పాల్సి వుంటుంది. మా ఇరువురిలో నువ్వేమి బలహీనతాలు చూసావో అవి అన్నీ చెప్పాలి. నువ్వు నా మీద అభిమానం చూపమని నిన్ను కోరడం లేదు, నాకు న్యాయం కావాలని మాత్రమే కోరుతున్నాను" అన్నాడు సజ్జన్. హఠాత్తుగా [illegible] అక్కణ్ణుంచిలేచి వెళ్ళిపోయాడు, సజ్జన్.

బహిరంగ సభలో జరిగిన దంతా రిపోర్టు రూపంలో పెద్దమ్మకు ఎవరో చెప్పారు రాధా కృష్ణుల పెళ్ళి, ఆతర్వాత తాను బ్రతికి వుండగానే తన శ్రాద్ధ కర్మను జరిపించుతూ దానాలూ, ధర్మాలూ [illegible] పెద్దమ్మ మంచం దగ్గరే అందరూ సమావేశం కావడం జరుగుతోంది. గోపుర ద్వారాలోని పూజారి, కీర్త

నలు పాడే ఆమె, సరస్వతి 'దాయీ', తీన్నా, నందో, నందో తల్లి, తార, చిన్న కోడలూ, ఇంకా ఆ వీధిలోని మరికొంత మంది ముసలీ ముతకా పెద్దమ్మ మంచం దగ్గరకు రోజంతా వస్తూ పోతున్నారు. పెద్దమ్మకు జ్వర ప్రకోపం ఎక్కువగా వుంది. మధ్య మధ్య తెలివి కూడా తప్పుతోంది. తెలివిలోకి రాగానే చుట్టుపక్కల చేరిన వాళ్ళను చూస్తుంది మళ్ళీ కళ్ళు మూసు కుంటుంది, వాళ్లెవరైనా అడిగితే ఆఁ అనో ఊహూఁ అనో జవాబు కూడా చెప్పుతుంది. కంపెనీ బాగ్‌లో మీటింగు పెట్టించి రాజాసాహెబ్ సజ్జన్‌ని నానా మాటలు అన్నారనీ, ఆయనా లాలా జానకీశరణ్ ఇద్దరూ కలిసి పెద్దమ్మ మేడలోంచి సజ్జన్‌ని బయటికి గెంటించి అక్కడ వేరే పాఠశాల పెట్టాలని అను కుంటున్నారని ఆమె చెవుల్లో పడింది. అంత తీవ్ర జ్వరంతో బలహీనంగా వున్నా. ఆవిషయం వినగానే పెద్దమ్మ 'అలాగా' అని పళ్ళుకొరికింది. జీవితాంతంవిషాన్ని దాచివుంచిన ఆమె నాలుక విషాన్ని కక్కడం మొదలెట్టింది. రెండు పిడికెళ్ళు బిగించింది. మెడ నరాలు పొంగాయి. క్రోధంతో ముఖం వికారంగా తయారైంది. మనసులో మొగుడ్డి కట్టిపోసింది ఉద్రేకం ఆమె ఆరోగ్యాన్ని కొంత పాడు చేసింది. ఆమె తెలివితప్పింది.

ఆరోజు సాయంత్రం నందోను ఇంటికి వెళ్ళకుండా ఆపింది పెద్దమ్మ. మూడు గంటల పాటు పెద్దమ్మను చూసే బాధ్యత తారకు అప్పగించి డాక్టర్ షీలాస్వాంగుతో కలసి ఆసందులో నివసించే ఇళ్ళల్లో పిల్లల్నీ తల్లుల్నీ వాళ్ళ ఆరోగ్యాన్ని పరీక్షించే నిమిత్తం ఇంటింటికి వెళ్ళింది. కన్యతారను కొంచెం దూరంగా వుండమని నందోను దగ్గరగా పిలిచి ఆమెతో మెల్లిగా ఏదో అన్నది పెద్దమ్మ నందో ముఖం మీద ఏదో మర్మం తొణికిస లాడింది. దీపాలు పెట్టగానే పిల్ల వాడ్ని తీసుకుని ఇంటికి వెళ్ళమంది పెద్దమ్మ తారను పిలిచి. పెద్దమ్మకు సేవ చేయడానికై వచ్చిన తార అందుకు అంగీకరించక పోయినా ఆమె ఆగ్రహానికి భయపడింది. "ఆమె చెప్పేది విను. నేనున్నానుగా ఆమె దగ్గర" అంటూ నందో తారకు నచ్చ చెప్పింది. సరే. తార పిల్లవాడ్ని ఎత్తుకుని మారుమాట్లాడ కుండా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది ఇంటికి పిల్లవాడు వెళుతోంటే నీరసంగా

చెయి ఎత్తి పెద్దమ్మ దగ్గరకు రమ్మమని సైగచేసింది. ఆమె మొఖం అంతా వాత్సల్యంతో నిండి ప్రశాంతంగా వుంది, వాణ్ణి తీసుకొని తార పెద్దమ్మ మీదకు వంగింది. ఆటలాడుతోన్న పిల్లాడు తన చేతిని సాచి వేడిగా వున్న పెద్దమ్మ అరచేతి మీద వుంచాడు. అతని చేతుల్నీ, చెంపల్నీ, తలనూ ఆప్యాయంగా నిమిరింది పెద్దమ్మ. రుగ్మత తెలుపుతోన్న ఆమె ముఖంలో చిరునవ్వు విరిసింది, పిల్లవాణ్ణి తీసుకుని వెళ్ళిపొమ్మని సైగచేసింది పెద్దమ్మ, ఆమె వెళ్ళగానే అటువైపు వున్న తలుపుకు గొళ్ళెం వేసి వచ్చింది నందో. తలగడ కింద వున్న ఓ పొట్లాన్ని తీయమని నందోకు చెప్పింది పెద్దమ్మ. పొట్లంవిప్పి దాన్లో వున్న రెండు వందరూపాయల నోట్లను చూపించి తన కొంగున ముడివేసుకుంది నందో. మెట్లు ఎక్కుతూ "మధ్యాహ్నం కప్పుకుని ఇప్పుడే వస్తాను. చిన్న కోడలిని ఇక్కడ కూర్చోబెట్టి వెడతాను. నీ కోడలు ఈలోపు వచ్చే పక్షంలో ఆమెను వెనక్కి పంపించేస్తాను. చిన్నామె- ఇకనైతే వుండనే వుండనీ" అంది నందో.

సుమారు ఎనిమిది గంటలకు వనకన్య వచ్చింది. చిన్నామె అక్కడ కూర్చునివుంది. పెద్దమ్మకు అప్పుడే కునుకు పట్టింది. నవల చదువుతోన్న చిన్నావిడ పుస్తకం మూసేసి పెద్దమ్మ పరిస్థితి చెప్పింది కన్యకు. నందో కన్యను వెళ్ళిపొమ్మనమని తనకు ఇచ్చిన ఆజ్ఞ గురించి కూడా ఆమె చెప్పింది

"ఎందుకని? ఏమిటీ సంగతి" అని అడిగింది కన్య.

"నందో, పెద్దమ్మా ఎవరిమీదనో మంత్ర ప్రయోగం చేసేలా వున్నారు. అందుకనే వెళ్ళిపొమన్నారు" అంటూ మూతి అదోలా పెట్టి చిన్నామె చెప్పింది.

"ఇదంతా తమాషాగ వుందే" ఇటువంటి పరిస్థితిలో ఏదో వంకపెట్టి ఆమె ఆయాసపడడానికి సుతారామూ నేను ఒప్పుకోను. నేను వెళ్ళను" అంటూ భీష్మించింది కన్య.

కొద్దిసేపు ఇద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. అంతలో పెద్దమ్మకు మెలకువ వచ్చింది. వెంటనే ఆమె నలపై చేయి వుంచి ఆరోగ్యం ఎలావుందని

వెలిగించి కన్య. ఆమె ముఖాన్ని చేతితో ఆప్యాయంగా రాకుతూ "బాగున్నాను. నువ్వెళ్ళమ్మా" అని అంది పెద్దమ్మ.

"నేను మిమ్మల్ని విడిచెళ్ళలేను. ఆయన నన్ను కోప్పడతారు" అని సమాధానం చెప్పింది వనకన్య.

"నా మీద ఒట్టు. నువ్వు వెళ్ళిపో" అంటూ ఆమె నౌకర్లను కూడా తీసుకవెళ్ళమని ఆజ్ఞాపించింది పెద్దమ్మ.

తాను ఎంతకాదని బతిమాలినా పెద్దమ్మ ఒప్పుకోవడంలేదు. అలాంటి పరిస్థితిలో వెళ్ళడం తప్ప వేరే గత్యంతరం కనపడలేదు. అసలే పెద్దమ్మతో ఎవరూ వాదించలేరు. ఇప్పుడు ఎక్కువగా మాట్లాడకూడదాయె చిన్నావిడకు ఏమేమి చెయ్యాలో అన్నీ వివరంగా చెప్పి నౌకర్లను తీసుకుని అయిష్టంగానే కన్య వెళ్ళిపోయింది.

రాత్రి సుమారు పదకొండున్నరా— పన్నెండు గంటల ప్రాంతంలో ముంగిట్లో సామానంతా సర్దింది నందో— ఒక సీసా సారాయి, నాలుగు పంది పిల్లలూ, మట్టికుండ, పిండిబొమ్మ, పిండితో నాలుగు పలకలుగా చేసిన ప్రమిద, పొగాకు, గంజాయి ఇంకా ఇంకా, ఇవ్వాళ తన భర్త మీద మంత్రప్రయోగం చెయ్యాలని సన్నాహం చేస్తోంది పెద్దమ్మ. మామూలు తతంగం అంతా పూర్తి కాగానే కుండను మంత్రంతో బంధించమని పెద్దమ్మతో అంది నందో.

జ్వర తీవ్రతలో ఒళ్ళు తెలివితప్పింది పెద్దమ్మ. తన మాటకు బదులు పలకక పోయేసరికి నందో పెద్దమ్మ దగ్గరకు వచ్చింది. లాంతరు ఆమె ముఖానికి దగ్గిరగా పోనిచ్చి చెవి దగ్గర నోరు పెడుతూ "పెద్దమ్మా, ఓ పెద్దమ్మా," అంటూ పిలిచింది నందో.

పెద్దమ్మ కళ్ళు తెరిచింది. గతిని తప్పిన గుడ్లతో నందోను చూసి అపస్మారకంలోనే "ఏమిటి" అని అడిగింది.

"అన్నీ సిద్ధం చేసి వుంచాను. నీదే ఆలస్యం"

"సద్దావా!" అంటోంటే ఆమె పూర్తిగా తెలివిలోకి వచ్చింది. ఉడిగిన ఆమె శరీరంలో కదలిక వచ్చింది. లేవడానికి తంటాలు పడుతూ" అక్కడి దాకా నన్ను పట్టుకుని తీసుకపో" అంది పెద్దమ్మ.

"నువ్వేలా వెళ్ళగలవే పెద్దమ్మా. నాకే చెప్పేయి ఆ మంత్రం నాలుగు ముక్కలు" అంటూ నందో మొండికెత్తింది.

జ్వరంతో చిక్కి శల్యమై ఎర్రబారిన ముడతలు వ్యాపించిన పెద్దమ్మ ముఖంపై నందో మాటకు చిన్న నవ్వు కనిపించింది. దుంపల్లాంటి నల్లగా గార గట్టిన ఆమె పళ్ళు మెరిసాయి. "మంత్రం ఇలాగేనా చెప్పేది!" అని పెద్దమ్మ ఎక్కడో నూతిలో వున్నట్టుగా పలికి మళ్ళీ రొప్పురాగానే ఆగి "శ్మశానంలో మంత్రం చెప్తారు గదటే. సరే. నన్ను తీసుకపో" అని అంది పెద్దమ్మ.

ఆమెను పట్టుకుని నందో ముంగిట్లోకి వచ్చింది. కాళ్ళూ చేతులూ కదు క్కుంది పెద్దమ్మ, కుండలో సామాను పెడుతూ మంత్రాలు చదవడం మొద లెట్టింది. భర్తను చంపాలంటే అతని పేరు వుచ్చరించడం అవసరం ఓ క్షణం సందేహించి మళ్ళీ రాజాసాహెబు పేరు పలికి పిండిబొమ్మ మీద నాలుగు పల కల ప్రమిదను వుంచుతూ అతణ్ణి చంపమని ఆజ్ఞాపించింది. పెద్దమ్మ కళ్ళలో జీవితం ఒక్క రెప్పపాటు ఆ ప్రమిదలా మెరిసింది. భయంతో నందో లేచి నిల బడింది. ముంగిట్లో స్తంభానికి కట్టిన పంది పిల్లలు అరుస్తున్నాయి. మంత్రాన్ని ఎవరైనా తిప్పికొడితే అది మంత్రం వేసిన వాణ్ణి చంపకుండా దానికి ఆ పంది పిల్లలు చావడానికి గాను వాటిని ఉపయోగిస్తారు కాబోలు."

నందో కళ్ళు ఆ వాతావరణాన్ని చమత్కారంగా చూస్తున్నాయి. అక స్మాత్తుగా "ఒద్దూ ఒద్దూ" అంటూ పెద్దమ్మ బిగ్గరగా అరిచింది.

"ఏమైందే పెద్దమ్మా" అంటూ నందో పెద్దమ్మను పట్టుకుంది.

"దూరంగా పో. దాకు తీసుకురా!" అంటూ పెద్దమ్మ నందోను విదిలించి త్వరత్వరగా మంత్రాలు చదువసాగింది నెలా పదిహేను రోజుల జ్వరం ఆమెను పీల్చి వేసిన శరీరంలో సంకల్పబలం ఆమె రోగంపై విజయాన్ని సాధించింది.

దాంత త్వరగా రౌద్రంగా మంత్రాలు చదువుతూ, "తిరిగిరా, నా మీదకు తిరిగిరా' అంది. నందో చాకు తెచ్చింది. ఆవేశంతో పెద్దమ్మ ఆ చాకుతో తన ఎడమ అరచేతిలో పొడుచుకుంది. పెద్దమ్మ చేతి నుంచి రక్తం ఆ కుండ మీద కార సాగింది.

పెద్దమ్మ ఉద్రేకంగా వణుకుతూంటోంది. ఆమె కంఠంలోని ఉగ్రత తగ్గింది. గొణుక్కుంటున్న పెద్దమ్మ అపస్మారకం వచ్చి కూలి పడిపోయింది నేలమీద ఆమె కుండమీద పడగానే అది బోరగిలపడింది. దానిలోని సామా నంతా చిందరగా చెల్లాచెదరైంది. నందో భయంతో ఆమెను అలాగే వదిలివేసి పారిపోయింది.

రెండో రోజు నుంచి పెద్దమ్మ జ్వరం సన్నిపాతంలోకి దిగింది. సన్ని పాతంలో ఆమె ఏవేవో మాట్లాడుతోంది. "ఇంత కాలంలో నేను ఎవ్వరికీ చెడు కోరను" అనే భావం వచ్చేలా ఆమె ఏదేదో అంది ఆరోజు పెద్దమ్మ పరిస్థితి బాగా దిగజారింది. అదే రోజు హృదయానంద బాబాగారిని కలుసుకుందామని సజ్జన్ వూరికి వెళ్ళారు. సంధిలో పిచ్చిపిచ్చిగా మాట్లాడిన పెద్దమ్మ సజ్జన్ పేరు కూడా వుచ్చరించింది.

# 50

బాబాగారిని కలుసుకుందామని సజ్జన్ ఆరోజున గ్రామానికి బయలుదేరాడు. అతను వెళుతున్నాడే కాని దారిపొడవునా అతని మనస్సు ఆలోచనలతో నిండిపోయింది. మహీపాల్ మీద కేసు పెట్టవద్దని కర్నల్ తనను కోరాడు. అతని కోరికను తాను తిరస్కరించాడు. ఒక్క వ్యక్తి ఆత్మగౌరవానికి సంబంధించిన ప్రశ్న కాదనీ దీనితో ఎంతో మంది వ్యక్తుల ఆర్థిక నైతిక విలువలు ముడిపడి వున్నాయనీ సజ్జన్ వాదించాడు. సజ్జన్ ఇప్పుడు కేవలం ఓ వ్యక్తిగాక ఓ సంస్థగా మారాడు. అతణ్ణి అవమానించటం వల్ల పదిమందికి మేలు చేయాలనే సంకల్పంతో పెట్టిన సంస్థకే గొడ్డలి పెట్టు అవుతుంది. కన్యను కూడా ఈ విషయంలో ఒప్పించాడు కర్నల్ కాని సజ్జన్ మాత్రం సనేమిరా అన్నాడు

"ఇది నా స్వంత సమస్య కాదు. నేను ఓ సిద్ధాంతం కోసం పోట్లాడుతున్నాను. నేను ఏ పరిస్థితి కారణంచేత ఇట్టి చర్య తీసుకోవ దానికి పూనుకున్నానో దానికే ప్రాధాన్యం ఇస్తున్నాను. నాకు నేను ఇవ్వాతం లేదని చెప్పాడు.

"పరిస్థితులే ప్రధాన కారణం కాక మహీపాల్ అంటే మీకు వ్యక్తిగతంగా క్రోధం కూడా వుంది గదా! సంఘపరంగా మీ వ్యక్తిత్వాన్ని చూసుకుంటూ మీ స్వంత మిత్రుడైన మహీపాల్ పట్ల మీ మనసు [illegible] అభిప్రాయం వున్న కారణంచేత...." అంటూ ఆగి పోయింది కన్య.

"ఆమాట నన్నడుగు, నే చెబుతా. ఈ వ్యవహారం అఫీషియల్ వ్యవహారంలే. ఇద్దరి మధ్య స్నేహం అయినప్పటి నుంచి ఇద్దరి మనసుల్లో వైర భావం గూడా రాజుతూ వుంది. నాకు తెలుసుగా" చేయి ఎత్తి [illegible] కత్తితో చెక్కుతున్నట్లుగా, కళ్ళల్లో కోపాన్ని తెప్పించుకుని కర్నల్ సజ్జన్ [illegible] అనే సాబ్. సజ్జన్ ఎక్కడ బాధ పడతాడేమోనని మళ్ళీ వెంటనే నవ్వు తెప్పించుకుని "నేను చెప్పింది పెద్దగా అనుకోకు. పెద్దగా తీస్తే ఇంకో [illegible] అర గించేయ్. అసలు న్యాయం అయితే అలాగే చెయ్యాలి" అంటూ కన్యవైపు తిరిగి "అసలు నువ్వు బారిస్టర్ అయి వుండాల్సింది. [illegible] కూడా వుంది వుంది ఎంత మంచి పాయింట్ తీసావ్ [illegible] 'ఒకందికి' న్యాయం అంటే అలా వుండాలి" అని అన్నాడు కర్నల్.

సజ్జన్ తల వంచుకుని మొదట నుంచా వింటున్నాడు. అతని ముఖం మీద ఏ భావమూ కనిపించ లేదు. గంభీరంగా ప్రశాంతంగా వింటున్నాడు, కర్నల్ మాటను పూర్తిచేసిన తర్వాత అతను తల ఎత్తి ఆత్మీయతను రంగరించుకున్న చూపులతో చూశాడు. మళ్ళీ కర్నల్ వైపు తిరిగి "నీ మాటల ప్రభావానికి అతీతుణ్ణి కర్నల్. వాటి ప్రభావం నా మీద కొంచెం కూడ పడలేదు. కన్య అన్న దానికి నాది ఒక్కటే సమాధానం. మహీపాల్ అంటే నాకు కొద్దిగా గిట్టక పోవడంనిజమే కర్నల్ విషయంలో నేను ఎంత సాఫీగా వ్యవహరిస్తానో మహీపాల్ విషయంలో అంత సాఫీగా చేయలేను. నేనతణ్ణి గౌరవిస్తాను. మీ ఇద్దరిని ముట్టుకుని ఈ మాట చెబుతాను. అతను మేధావి కాదు. భావనాశీలి.

బాగానే చదువుతాడు, బాగానే ఆలోచిస్తాడు. ఇన్ని యోగ్యతలు అతనిలో వుండి కూడా అతనిలో మిడి మిడి జ్ఞానం చాలా వుంది. జ్ఞానం కన్న మహీపాల్‌లో దాంభికం, మిథ్యాభిమానం ఎక్కువ" అని అన్నాడు.

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం. మానవత్వానికి సంబంధించినంత వరకు, మంచి తనానికి సంబంధించినంత వరకు అతను నీకూ పోటీయే కాదు, మహీపాల్ మనసు కుక్కరకుంక లాంటిది. నీచమైంది. కాని నా సిద్ధాంతం ఏమిటంటే ఆపదలో చిక్కుకున్న వ్యక్తి శత్రువైనా సరే అతనికోసం ప్రాణాలు ఒడ్డాలని. మహీపాల్ ఎంత మారినా మన పాతవేస్తమే కదా! మూర్ఖ బ్రహ్మాడు. మనం ఏమి చేస్తాం!" అంటూ కన్య వైపు తిరిగి "వాడిలో ఆ కుర్ర తనం చేష్టలు లేక పోతే వాడెంతో గొప్ప వాడయ్యేవాడు. ఇప్పటికైనా ఈ కుర్రాలె దరు మేల్కొంటారని ఎలా రూఢిగా చెప్పగలం" అంటూ కర్నల్ సజ్జన్, కన్య వైపు చూసాడు.

"ప్రస్తుతం ఆర్థికంగా చూస్తే మహీపాల్ సుఖంగానే వున్నట్లు కనపడు తున్నాడు. నలభై సిభై వేల రూపాయలు రాయల్టీగా దొరికిందట. ఇంత పెద్ద రచయిత అయివుండి కూడ ఇలాటి సన్యాసి మాటలు మాట్లాడం బాగోలేదు" అంటూ కన్య అందు కుంది.

"మామూలు సన్యాసి కాదు. సన్యాసుల్లో కెల్ల సన్యాసి అను: అది సరే ఈ నలభై వేల రూపాయలు రాయల్టీగా దొరికిందని నీతో ఎవరన్నారు? అంటూ కలిపి యిరవై వేలు ముట్టి వుండొచ్చు. అందులో తిరిగి పదివేలు కట్నం కింద పోతాయి. వరుడివైపు వాళ్ళు స్థానికులే గా! విడిదిలో రెండు రోజులైనా మకాం వేయక మానరు' అవన్నీ కలిపి పెళ్ళి ఖర్చు మూడు నాలుగు వేల దాకా వుంటుంది, పద్నాలుగు వేలు పెళ్ళి నిమిత్తం ఖర్చు అయ్యాయని అనుకుందాం. ఇంటిల్లి పాదికీ ఈ నగలూ, గుడ్డలూ, మేజోళ్ళకూ రెండున్నర మూడు వేలనుకో. కళ్యాణి పెట్టు కుంటున్న నగలు చూడ్డానికి ఎంతో కిమ్మత్తుగలవిగా కనపడు తున్నాయి. ఇక కారు కొన్నాదే సేఠ్ రూప్‌రతన్ దగ్గిర అప్పుగా తీసు కొని వుండొచ్చు ఇంత డబ్బు వచ్చినట్టే వచ్చి వెళ్లింది. త్వరలోనే మోటారు

అమ్మకానికి పెట్టదేమో చూడు. అందుకనే అంటోంది మహిపాల్ ఒట్టి బుద్ధి హీనుడని" అంటూ వంత పాడాడు కర్నల్.

ఈ విషయంలోనే నీకు నాకు భేదాభిప్రాయం వచ్చేది. అతణ్ణి అతనిలో వున్న ఈ కుట్రబుద్ధి ఆడిస్తోంది. ఈపని అతను బాగా ఆలోచించి, ప్రయోజనాత్మకంగానూ స్పిరిట్‌తోను చేసాడు. అతను తన లేమితో బాధపడుతూ నా కలిమిని చూసి మండిపడుతున్నాడు. వడ్డీ వ్యాపారస్తులంతా నన్ను వ్యతిరేకించేప్పటికి అతనికి మంచి అవకాశం దొరికింది. ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొంటున్నాడు. నేను ఓ వాస్తవాన్ని చెబుతాను, మహిపాల్ ముందు కంటే ఎక్కువగా దగజారి పోయాడు. షీలాతో తెగతెంపులు చేసుకుని భార్య వెనుక ఏమని పడ్డాడో కాని అతను చేసే ఈ పనికి ఆలోచించే ధోరణిదే ఎక్కువ బాధ్యత"

"అదేం కాదులే సజ్జన్. నేనే స్వయంగా కళ్ళారా చూశాను. తన బావమరిది పెళ్ళిలో ఇతనికీ షీలాకు మధ్య సంబంధం వున్నట్లూ పొక్కిపోయింది. షీలా దబ్బుతో కులుకుతున్నాడన్న అపవాదు లేవదీసారు. అంతే; ఇంట్లో మహిపాల్‌కి అతని భార్యకి పోట్లాట జరిగింది. ఇతను భార్య మీద అలిగి షీలా యింటికి వెళ్ళి కుర్చున్నాడు. తర్వాత ఏడుస్తూ మొత్తుకుంటూ కళ్యాణి నా దగ్గిరకు రావడం నేను షీలా యింటికి వెళ్ళి అతన్ని నా కారులో కూర్చోబెట్టుకుని అతనింటి దగ్గర దిగబెట్టడం అన్నీ నాకళ్ళ ముందే జరిగాయి. దాని తర్వాత అతని గ్రహాలు ఒక్కసారిగా ఉచ్ఛదశలోకి వచ్చాయి. ఇరవై వేల రూపాయలు ఒకే ఒక చెక్కులో అతనికి ముట్టాయి. నేర్ రూప్‌రతన్ ప్రచురణ విభాగంలో సాహితీ సలహా దారుడిగా చేరాడు. ప్రస్తుతం నాయకుల్ని భట్రాజు పొగడ్తలతో ఎత్తి ముంచేస్తున్నాడు. ఉత్తరోత్తరా నాయకుడైనా ఆశ్చర్యం లేదు"

''అందుకే నేననేది ఏమిదంటే-''

"మహిపాల్‌కు కారు అమ్మే పరిస్థితి రాదనేగా! వుండి వుండి ఏదో ఓ

రోజు ఇంత కన్న ఓ పెద్ద కారో లేదా కొత్త కారో కొంటాడు. నైనీతాల్‌లో కొత్త బంగళా కూడా కట్టేస్తాడనేగా నువ్వన వోయేది?"

"నువ్వు చాలా అపురూపంగా ఆలోచిస్తున్నావ్ రామ్‌జీ, అది అంత మంచిది కాదు" సజ్జన్ తన మాట చెప్పబోతుంటే బాబా అతని అంతరాత్మ రూపంలో చెప్పినట్టనిపించింది. అంతరాత్మని వినగానే సజ్జన్‌కు ఆశ్చర్యం వేసింది. బాబా అయితే ఆ గదిలో కాదు ఆ వూళ్ళోనే లేడు. కానీ అతని కంఠం ఎంతో దూరం నుంచి మాట్లాడుతూన్నట్టూ లేదు. సజ్జన్ గాబరాపడ్డాడు. కన్నైతే కన్యతో మాట్లాడుతుంటే మధ్యలోనే జోక్యం చేసుకుంటూ "మీతో ఎవరైనా ఇక్కడ ఎవరి గొంతైనా విన్నారా" అని అమాంతంగా అడిగాడు.

"ఎవరిగొంతూ?" అంటూ కన్య అడిగింది.

"నాకే ఏదో భ్రమ కలిగినట్లుంది" అంటూ మాట దాటేసాడు సజ్జన్.

ఆ రోజే గ్రామానికి వెళ్ళి బాబాను కలుసుకోవాలనుకున్నాడు సజ్జన్. మహీపాల్ మీద పరువునష్టం దావా వెయ్యాలా వద్దా అన్నది ఆయనతో సంప్రదించిన తర్వాతనే నిర్ణయించుకుందామని అనుకున్నాడు సజ్జన్.

రెండోరోజు ఉదయమే స్నేహితుని జీపు తీసుకుని బాబా దగ్గరకు బయలుదేరాడు. అతను వెళ్ళిన కొద్దిసేపటికే పెద్దమ్మ పరిస్థితి విషమించిందని వర్మ ఫోను చేసాడు. సజ్జన్ వెనకనే డ్రైవర్ని పరుగెత్తించి వైద్యుణ్ణి వెంట బెట్టుకుని పెద్దమ్మ ఇంటికి వచ్చింది వసుంధర. రాగానే ముందుగదిలో పండవిల్లల్ని చూసి నిర్ఘాంతపోయింది. పెద్దమ్మ మంచం మీద మూసిన కన్ను తెరవకుండా స్పృహలో లేకుండా పడివుంది. గుండెపట్టుకొచ్చి పిచ్చిపిచ్చిగా ఏదేదో మాట్లాడుతోంది. తార, వర్మ, నందో తల్లి పెద్దమ్మ దగ్గర వున్నారు. వుండి వుండి అకస్మాత్తుగా మంచం మీద నుంచి లేవటం, ఊగుతూ ఊగుతూ పరుగెత్తడం దగ్గర ఎవరైనా వుంటే వాళ్ళను కొట్టడం చేస్తోంది. ఆ ముగ్గురూ పెద్దమ్మను సంబాళించలేకున్నారు. పెద్దమ్మ నాడీ పరీక్ష చేసిన వైద్యుడు ఇక రెండు మూడు గంటల కన్న ఎక్కువ బతకదన్నాడు. ఓ మకరధ్వజం మాత్ర ఇచ్చి అర

వాళ్ళకు జాజికాయ అరగదీసి రాయమని చెప్పాడు. ఏమి చేయాలో ఏమి చేయకూడదో కన్యకు అంతా అగమ్యగోచరంగా వుంది. ఇవ్వాళే మహీపాల్ యింటికి వియ్యాలవాళ్ళు వస్తారు. కర్నల్ ఆ హడావుడిలో అక్కడే ఇరుక్కుని వున్నాడు. అలాంటి పరిస్థితిలో అతణ్ణి పిలిపిస్తే బావుండదని ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది. వర్మను పంపి తన బంగళాకు టెలిఫోను చేయించి దివాన్ గార్ని పిలిపించింది. అంతలో శంకరూ అతని భార్యా ఇద్దరూ అక్కడికి వచ్చారు. తన స్వార్థంకోసం నందోయే పెద్దమ్మచేత ఏదో మంత్రప్రయోగం చేయించిందనీ, అసలే సీరసంగా వున్న పెద్దమ్మ పరిస్థితి దానితో మరింతగా దిగజారిపోయిందనీ నందో అమ్మే ఫిర్యాదు చేసింది కన్యతో. తన అక్క చేసిన నీచపు పనికి తానెంతో సిగ్గుపడుతున్నానని శంకర్ క్షమాపణ చెప్పుకున్నాడు. ఇలాటి అంత్యదశలో రాజాసాహేబుగారికి తెలియజేయడం ఎంతైనా అవసరం అని భావించింది కన్య.

మంత్రాల బూచి పెద్దమ్మ పదమపడించిందన్న వార్త విద్యుత్తులా ప్రతి సందులోకీ గొందిలోకీ వ్యాపించిపోయింది. పెద్దమ్మ మరణ వార్త వినగానే వీధిలో వాళ్ళు పరామర్శిద్దామనీ, శవాన్ని చూద్దామనీ ఆమె యింటికి రావడం మొదలెట్టారు. ఆడవాళ్ళ గుంపు ఇంట్లో క్రమక్రమంగా పెరగసాగింది. మంత్ర ప్రయోగానికి సంబంధించిన సామానంతా ముందే తీయించి శుభ్రపరిచేసింది కన్య. సజ్జన్ లేని కారణంగా కన్యకు కాలూ చెయ్యీ ఆడడం లేదు. పెద్దమ్మను బాగా అలంకరించి అన్ని అలంకారాలతో రాచతులు విరజిమ్ముతూ రాజోచిత లాంఛనాలతో ఆమెను దహనం చెయ్యాలంటూ అక్కడ చేరినవారన్నారు. కావలసిన ఖర్చు పెట్టవలసిందిగా దివానలకు అనుమతి ఇచ్చింది కన్య. లాలా జానకీ శరణ్ ఓ పర్యాయం గుమ్మం దాకా వచ్చి కర్నల్, సజ్జన్ గురించి అడిగాడు. వాళ్ళిద్దరూ లేరని చెప్పగానే తానూ వుడాయించాడు

ఎవరినోట విన్నా పెద్దమ్మ మా దొడ్డమ్మ అని అనేవాళ్ళే. ఇటీవల ఆమె చేసిన పనుల్ని ప్రజలు ఎంతో మెచ్చుకున్నారు. పదిరెకాల పాపాలు కడిగివేసే విజయదశమిరోజు పెద్దమ్మ వైకుంఠయాత్ర చేసింది కాన తిన్నగా వైకుంఠానికి పోతుందని అందరన్నారు.

సజ్జన్ వచ్చేసరికి పెద్దమ్మ చనిపోయిందన్న వార్త అతణ్ణి దుఃఖ సాగరంలో ముంచింది. అతని జీవితానికి చాలా దగ్గరగా వచ్చింది పెద్దమ్మ ముంగిట్లో పెద్దమ్మకు స్నానం చేయించి చీరె కట్టారు. సజ్జన్ చూడ్డానికి వీలుగా ఆమె ముఖం మీద వస్త్రం కప్పలేదు. పెద్దమ్మ ముత్తైదువచావు చచ్చింది కనుక ఆమె తలను చక్కగా దువ్వి పాపిటలోని సిందూరం పూసారు, నుదుట రూపాయి బిళ్ల మందాన కుంకుమ, ముక్కుకు పుడకా, చెవులకు కమ్మలూ అన్నీ అలంకరించారు. ఈ ముత్తైదువ రూపంలో పెద్దమ్మను అంతకుముందెప్పుడూ చూడలేదు సజ్జన్. ఆమె ముఖం మీద ప్రశాంతత రాజ్యం చేస్తోంది. జీవితం అంతా ఆమె నడిన సంఘర్షణ శాంతించి ఆమె హాయిగా మృత్యుదేవత ఒడిలో నిద్రపోతోంది ఆమెనుదురుపై చేయి వుంచి విలపించాడు సజ్జన్. కన్య, తార, వర్మగార్ల కళ్ళ నుంచి ఎడతెరపిలేకుండా కన్నీళ్ళు కారుతున్నాయి.

మధ్యాహ్నం కూడా గడిచింది. ఫోనుమీద ఫోను చేయగా చిట్టచివరికి రాజాసాహెబు పెద్దకుమారుడు వచ్చాడు. అప్పటికే పెద్దమ్మ ఇంటి గుమ్మం గేటూ అంతటా జనంకిక్కిరిసిపోయారు. గంటలూ, జేగంటలూ, శంఖాలతో మారుమోగిపోయింది. పెద్దమ్మ ఇల్లు, బ్యాండు మేళం వాయిస్తోంటే పెద్దమ్మ విమానం లేచింది శ్మశానానికి. ఆ వీధిలోనే వుంటోన్న ఇద్దరు నవయువకులు పెద్దమ్మ విమానం మీద నెమలి పింఛాలతో కట్టిన పెద్దపెద్ద విసన కర్రలు వూపుతూ ముందుకు నడిచారు. సజ్జన్ దివాన్ చేతులెత్తి నాణాలు ఎగరేస్తుంటే బీదా బిక్కీ అడుక్కుతినే వాళ్లు వాటిని అందుకోవడానికి జోలెలు తెరుస్తూ, నేలమీద తిరుగుతూ వున్నారు. అందరు తలలకు గులాల్ పూసుకున్నారు. పెద్దమ్మ శవాన్ని పూలబండి మాదిరిగా తీసుకెళ్ళుతున్నారు ప్రజానీకం. ఇటికి నంతకాలం ఆమెను రెచ్చగొట్టి ఆమె దగ్గర తిట్లుతిన్న చిన్నా పెద్దా అంతా ఇవ్వాళ ఏకమై పెద్దమ్మను సాగనంపుతున్నారు. ఇవ్వాళ పెద్దమ్మ కర్రతో వాళ్ళను కొడుతుందేమో అన్న భయం లేదు. పెద్దమ్మే స్వయంగా వాళ్ళ భుజాల మీద వుంది. వాళ్ళ హృదయాల్లో వుంది, వాళ్ల పెదిమల మీద వుంది. సందులు దాటి పెడల్పాటి రోడ్డు మీదకు రాగానే దివాన్ గారు వెండినీ బంగారం పూల

వినిరారు. రాజాగారి పెద్దకొడుకుకూడా పరువు ఎక్కడపోతుందోన్న సిగ్గుతో ఓ పది రూపాయల పైసల పొట్లం తెప్పించి మొత్తానికి వెదజల్లాడు

సాయంత్రం పెద్దమ్మ మరణించిందన్న వార్త ఎవరి ద్వారానో విన్నాడు కర్నల్. శవాన్ని కాన్పూరు తీసుకెళ్ళారని కూడా అతనికి తెలిసింది. విని చాలా విచారించాడు. కాని మహిపాల్‌కి ఒక్క ముక్క గూడా చెప్పలేదు. సాయంకాలం ద్వారపూజ కార్యక్రమాన్ని గొప్పగా [1]జరపడానికి యేర్పాట్లు చేశాడు మహిపాల్. పెద్దపెద్ద ఆహ్వాన పత్రికలు అందరికీ పంపించాడు. సజ్జన్ కన్యలను మాత్రం ఆహ్వానించలేదు. కర్నల్ మీద తన పెత్తనమే చెల్లుతుందని నిరూపించడానికి వుదయాన్నే కర్నల్‌ని ఇంటికి పిలిపించాడు మహిపాల్. కర్నల్‌కి ప్రత్యేకంగా అక్కడయేమీ పనిలేని కారణంగా వాళ్ళంతా పెళ్ళికో నానా తతంగాలు చేస్తోంటే అవన్నీ చూస్తూ కూర్చున్నాడు. కార్ల్టన్ హోటల్లో విడిది కోసం ఐదు గదులు కేటాయించారు. వియ్యాలవారు వచ్చారన్న వార్త తెలియగానే ఆచారం ప్రకారం మిర్చ్వాన్ [2] పంపించారు. ఆ తర్వాత పగలంతా ఫలహారాలూ, పళ్ళూ తినుబండారాలూ వెళుతూనే వున్నాయి. సాయంత్రం యేడుగంటలకు వియ్యాల వారికి విందు చేశారు వియ్యాలవారిని భోజనానికి రమ్మనమని పిలవడానికి మంగలి వెళ్ళాడు. ఆహ్వానితులంతా మహిపాల్ ఇంటికి రావడం మొదలెట్టారు. నేశ్‌రూప్‌రతన్ విశాలమైన లానులో విందు యేర్పాటు జరిగింది. విందుకు వచ్చిన పురప్రముఖుల్లో ఇద్దరు మంత్రి వర్యులు కూడా వున్నారు. మహిపాల్ ఆనందం అవధులు దాటింది. నైనీతాల్ వెళ్ళేకాలం కాక పోయినట్టయితే స్వయంగా పంత్‌గారూ, గవర్నరు మోడీగారు కూడా దయచేసే వారని అందరికీ సగర్వంగా చెప్పుకుంటూ తిరుగుతున్నాడు మహిపాల్.

---

1. వివాహానికి ముందు రోజు కన్యాదాత బంధుసమేతంగా యింటికొచ్చిన పెళ్ళి కొడుక్కి గుమ్మం దగ్గర పూజ చేసే ఓ ఆచారం.
2. పొడిగా నూరిన మిరియాలు కలిపిన షర్బతు. పెళ్ళికొడుకు తరపువారు విడిదిలో దిగగానే ఆంధ్రప్రదేశంలో వాళ్ళకు పానకం కావిళ్ళు పంపించినట్లే ఉత్తర ప్రదేశ్‌లో ఈ రకం షర్బతు వియ్యాలవారికి పంపడం రివాజు.

పెళ్ళి కొడుకు వాళ్ల పెళ్ళి కూతురింటి సమీపంలోకి వచ్చారన వార్త అందింది. ఆహ్వానించడానికి జనం అంతా రోడ్డు మీదకి వచ్చి నిలబడ్డారు. లక్ష్మో వాజపేయీలూ బాలాశుక్లాలు తమ తమ ఆచారం ప్రకారం ఎక్కడి వాళ్ళక్కడ చేతులెత్తి నిలబడి పోయారు, పెళ్ళికొడుకు తరఫు వాళ్లు ఓ అడుగు ముందుకు వేసి ఆగారు. ఆడపిల్ల వాళ్లు కూడా ఆగారు. పెళ్ళికొడుకు తరుఫున జనం బాగానే వున్నారు వాళ్ళలో పేరు మోసిన వాళ్లు కూడా కొంత మంది వున్నారు. కాని పెళ్లికూతురు తరఫున వచ్చిన వాళ్ళలో పెద్ద పెద్ద డాక్టర్లూ, ఆఫీసర్లూ, శ్రీమంతులూ, సాహితీ వేత్తలూ పత్రికా సంపాదకులూ, మంత్రులు కూడా వున్నారు. అయినా పెళ్లికొడుకు తరఫు వాళ్లు తమదే పై చెయ్యి అన్న ధోరణిలో అలాగే నిలబడిపోయారు. ఇలా కాసేపు అయిన తర్వాత మహిపాలూ, అతని తమ్ముడు డాక్టర్ జయపాలూ ముందుకు వెళ్ళారు. ఆ తర్వాత ఎదు ర్కోలు జరిగింది. అందరూ కలుసుకున్నారు.

విందులో తన ఆధ్వర్యం చాతుర్యాన్ని ప్రదర్శించాడు కర్నల్. అతిథు లంతా భోజనాలు ముగించుకొని వెళ్ళిన తర్వాత మహిపాల్ దగ్గర శలవు తీసు కున్నాడు మహిపాల్ ఎంత బలవంతం చేసినా ఒక్క బచ్చిముక్క నోటిలో వేసుకోవడం మినహా అతను భోజనం చేయలేకపోయాడు. మహిపాల్. సజ్జన్‌ల మధ్య వైరం రావడం అతనికి మనఃక్లేశాన్ని కలిగించింది. మహిపాల్ దురుసు తనం చూసి కర్నల్‌కి విచారం కలిగింది ఇంటికి వెడుతూ విశేషాలు తెలుసు కుందామని సజ్జన్ బంగళాకు వెళ్ళాడు. కన్య కనపడింది. తాను పగలెందుకు రాలేకపోయిందీ వివరించి చెప్పాడు కర్నల్. పెద్దమ్మకు కుండ తానే పట్టుకోవా లంటూ రాజాసాహెబ్‌గారి పెద్దకొడుకు సజ్జన్‌ని ఎలా పక్కకు తప్పుకోమని బెదిరించిందీ అన్నీ వనకన్య చెప్పింది. సజ్జన్‌కి అలాంటి ఆలోచన లేకపోయినా రాజాసాహెబ్ పెద్దకొడుకు తనతో ప్రవర్తించిన తీరుచూసి బాధపడ్డాడు సజ్జన్. తర్వాత శవంతో కాన్పూరుకు వెళ్ళకూడదనుకుని కూడా వనకన్య బలవంతాన అతనికి తప్పింది కాదు.

"కుండ తానే పట్టుకోవాలని మనవాడు వేసిన ఎత్తు చాలా దూర

దృష్టితో వేసిందివే బిన్నో. ఆస్తికి సజ్జన్ ఎక్కడ వారసుడౌతున్నాడేమోనని ముందే ఆయన జాగ్రత్త పడ్డాడు" అంటూ నవ్వుతూ కర్నల్ సర్దిచెప్పారు.

"ఎప్పుడు డబ్బే ప్రధానంగా భావించే ఈ వ్యక్తులు ఎంత నీచులు!" అంటూ కన్య ఓ దీర్ఘనిశ్వాసం విడిచింది.

# 51

పెద్దమ్మ మరణించిన మరుసటిరోజే రాజాసాహెబుగారి వకీలు దగ్గర్నుంచి సజ్జన్‌కు నోటీసు అందింది. పెద్దమ్మ మేడను తక్షణమే ఖాళీ చెయ్యవలసిందిగా ఆ నోటీసులో హెచ్చరిక చేశాడు రాజాసాహెబ్. ఇలా జరుగుతుందని సజ్జన్‌కి ముందే తెలుసు. కాని కన్య బాగా నడుస్తోన్న ఈ పాఠశాలను అర్థాంతరంగా ఎక్కడికి మార్చాలన్న ఆలోచన పట్టుకుంది. ఆసుపత్రికోసం తాను కొన్న ఇంట్లోకి పాఠశాలను మార్చవచ్చు. అలా చేసిన పక్షంలో ప్రసూతి గృహానికి చోటు తగ్గుతుంది. అదీకాక పాఠశాల గోల ప్రసూతి గృహానికి అంత మంచిది కూడా కాదు. ఈ విషయాన్ని ఎలా పరిష్కరించాలా అన్నచింతలో పడ్డారు కార్యకర్తలు. ఓ పర్యాయం రాజాసాహెబ్ దగ్గరికెళ్ళి పెద్దమ్మ ఇంటిని బాడుక్కి తీసుకుంటానని చెప్పిచూస్తానన్నాడు సజ్జన్. దానికాయన ఎన్నటికీ సమ్మతించరని కన్య అభిప్రాయం. అలాగే జరిగింది. సజ్జన్ పట్ల ఆత్మీయతా భావాన్ని చూపిస్తూ కుశల క్షేమాలు అడిగాడు రాజాసాహెబ్. "నేనైతే ప్రాపంచిక వ్యామోహాలను దేన్నీ పట్టించుకోవడంలేదు. పెద్దబ్బాయిని అడిగి చూడు. వాడే ఇప్పుడు అన్ని వ్యవహారాలూ చూస్తున్నాడు" అని చల్లగా చెప్పాడు రాజాసాహెబ్.

పెద్దబ్బాయిని కలుసుకున్నాడు సజ్జన్. ఇది మా పూర్వీకుల సంపత్తి. హిందూ మతానికి సమాధి కట్టేపనికి ఆ భవనం ఉపయోగించడం నా కెంత మాత్రం అంగీకారం కాదు. పెద్దమ్మ బతికి వుంటే ఆమెదే అధికారం అనుకోండి. మా నాయనమ్మ గారి పేరిట దాన్లో వేద పాఠశాల నడపాలని చూస్తున్నాం" అని కటువుగా మాట్లాడాడు పెద్దబ్బాయి.

సజ్జన్ మెదలకుండా వుండిపోయాడు. ఆ ప్రసక్తిని అంతటిలో అపుచేసి కాళీచేయడానికి ఓ నెల గడువు యివ్వవలసిందిగా కోరాడు. "నేను మాట్లాడే దాన్ని తప్పుగా అర్థం చేసుకోకండి. మా తరఫున అయితే నెలా రెండు నెలలూ వ్యవధి ఇవ్వడం ఏమంత గొప్ప కార్యం కాదు. ఎన్నో తరాల నుంచి మాకూ మీకూ రాకపోకలు వున్నాయి. కాని వాస్తవం ఏమిటంటే అక్కడి వీధి వీధికి నువ్వన్నా ప్రత్యేకంగా నీకాయస్థ జాతి భార్యగారన్నా చాలా కోపంగా వున్నారు. ఆ మేరలోనే కాపురం వుంటోన్న ఆ కిరాయిదారుని కూడా కాయస్థ రాలేనటగా?" అంటూ తియ్యగా మాట్లాడాడు పెద్దబ్బాయి.

సజ్జన్‌కి ఇలా మాట్లాడం ఏం నచ్చలేదు. అయినా నిగ్రహాన్ని చూపుతూ "ప్రజానీకం మా పట్ల వ్యతిరేకంగా వుండేమాట అలా వుండనీయండి. మీరు వేరేవిధంగా భావించకపోతే ఇకముందు ఇలాంటి కులాంతర వివాహాలు ఇంకా ఇంకా జరుగుతాయి. మీ ఒక్క వేదపాఠశాలకాదు. పదికోట్ల వేదపాఠశాలలు పెట్టినా మారిపోతున్న సంఘాన్ని అవి ఆపలేవు, మీరే చూస్తోండండి" అని అన్నాడు.

సజ్జన్ మాటలకు కోపం వచ్చింది పెద్దబ్బాయికి. మతావేశంతో ఊగ్పో గరేస్తూ "మహామహా అలెగ్జాండర్లూ, బాబర్లూ, తెల్లవాళ్లూ లక్షలకోట్ల సంవత్సరాలం ప్రాచీనమైన మన హిందూ మతాన్ని మార్చలేక చతికిలబడ్డారు ఇంక నువ్వు"- అంటూ ఆగిపోయాడు.

"మేం కాదండి మార్చేది కాలమే దాన్ని మారుస్తుంది. కొత్త కొత్త మార్పులు తెస్తుంది. మేమేం హిందూ మతంపై దెబ్బ తీయటం లేదే. కాని దాని సాకుతో నడుస్తోన్న దంభాచారాల్ని దెబ్బతీయడమేమి ఒక్క ఒక్కసారి ధ్వంసం చేసి పారేస్తాం కావాలంటే చూడండి."

"నువ్వు మాతో సవాలు చేస్తున్నావా? సరే. అలా అయితే నీ సవాలు మాకు సమ్మతమే. ఆకలిగొన్న వాళ్ళ ముందు ఎన్నని ముక్కలు వేస్తావ్ సజ్జన్? అలాంటి వాళ్లు లక్షల సంఖ్యలో వున్నారు మనదేశంలో".

"ఆ వాస్తవమే మిమ్మల్ని తినేస్తుంది".

ఆ మాటకు పెద్దబ్బాయి "మంత్రసాని ముందు కడుపు దాచుకోడం సాధ్యమా? ఆకలి కొన్నవాళ్ళని చెప్పి వాళ్ళ పేరిట నువ్వు వ్యాపారం చెయ్యాలను కుంటున్నావని మాకు బాగా తెలుసు. కాని ఓ స్నేహితునిలా మా సలహా కూడా నువ్వు కాస్త విను. నువ్వు వేసిన ఈ ఎత్తు జమీందారీ దర్జాకు తగినట్టుగావుంది. వ్యాపార సరళితో లేదు. నువ్వాలోచించిన రాజతంత్రాన్ని మేం నలుగురం కలిసి ఒక్క సంవత్సరంలో ధ్వంసం చేసేస్తాం. మా ఎత్తుముందు నీ దగ్గరవున్న ఎదో ఎనిమిదో మహా అయితే పదిలక్షలు హారతి కర్పూరంలా కరగించేస్తాం, దానివల్ల మాకేం నష్టం లేదనుకో. దానధర్మాలకని కర్చు పెంచేసి ఇన్‌కంటాక్సు సూపర్ టాక్సుల్నుంచైనా కాస్త విముక్తి పొందుతాం" అని అంటూ బిగ్గరగా నవ్వాడు.

దానికి సజ్జన్ ప్రశాంతంగా నవ్వి "కనీసం ఈ రూపేణా అయినా ప్రజల కోసం మీరు ఇనప్పెట్టెలు తెరుస్తారన్నమాట. ఇకపోతే నా పదిలక్షల గురించేగా మీకు చింత. అది ఎలాగైనా మీరన్నట్టుగా కరిగిపోతుంది. కాని ఒక్క విషయం మాత్రం జ్ఞాపకం వుంచుకోండి. అది కరగడమే కాక మీకోట్ల రూపాయాలకు కూడా దాని వేడి అంటుకొని మీదకూడా పూర్తిగా కరిగి పోతుంది. ఇలాటి విషయాల్లో వాదించి ప్రయోజనం లేదు. మీరే స్వయంగా కళ్లతో చూస్తారుగా" అంటూ లేచాడు. వెళ్తూ వెళ్తూ ఓ పర్యాయం వెనక్కి తిరిగి "మీరు పంపిన నోటీసుకు మా లాయరు సమాధానం పంపిస్తాడు. అయినా మీకు చెబుతున్నా. నాకు వేరోచోటు దొరకనంతవరకు పెద్దమ్మ మేడ ఖాళీచేయను. సాధ్యమైనంత త్వరలో ఖాళీ చెయ్యడానికి ప్రయత్నిస్తాను". అని సజ్జన్ చరచరా ముందుకు కదిలాడు.

"మేడ పదిహేను రోజుల్లో ఖాళీ చెయ్యాలి" అంటూ పెద్దబ్బాయి గద్దించాడు.

"ఆఁ ప్రయత్నిస్తాను" అంటూ సజ్జన్ మెల్లిగా అన్నాడు.

పెద్దబ్బాయి కుర్చీలోంచి లేచి "ప్రయత్నిస్తావా? అలా అయితే మూడు రోజుల్లో ఖాళీ చెయ్యాల్సి వుంటుంది సజ్జన్‌మల్'' అని బెదిరిస్తూ అన్నాడు.

''ప్రయత్నిస్తాను'' అంటూ అదే నిర్లిప్తభావంగా అన్నాడు సజ్జన్.

కోపంతో పెద్దబ్బాయి రెండడుగులు ముందుకువేసి "వంశపారం పర్యంగా వస్తోన్న బంధుత్వాన్ని ఎందుకు చెడగొడుతున్నావ్. నువ్వే సర్వ నాశనం చేశావని ఆ తర్వాత అంటే లాభంలేదు'' అని హెచ్చరించాడు.

వెళ్ళిపోతున్నవాడల్లా తిరిగి వచ్చాడు సజ్జన్. "నీకు అభయం ఇస్తు న్నాను. నా కెలాంటి రాజకీయ దురుద్దేశ్యం లేదు. నే నో కొత్త సాంఘిక ప్రయోగాన్ని చేస్తున్నాను. అంతే" అంటూ సజ్జన్ చెప్పాడు.

"అందులోనే వుంది నీ విదురనీతి అంతా. అయితే బ్యాంకి పెట్టాలన్న ఆలోచన నువ్వు విరమించుకో. తర్వాత నీ యిష్టం వచ్చినట్లు ప్రయోగాలు చేసుకో. కాస్త కొత్త కొత్త పరిస్థితుల్ని తేవాలనుకుంటున్నావు. అంతేగా? తెచ్చుకో. క్రైస్తవులు; ముసల్మానులూ వీళ్ళతో అప్పుడే మతాంతర వివాహం జోలికి పోవద్దు. మిగతా కులాంతర వివాహాలు జరిపించుకో. నాన్నగారున్నంతకాలం నేను ప్రత్యక్షంగా పాల్గొనకపోయినా రహస్యంగా నీకు సాయం చేస్తుంటాను. కావాలంటే ఇంకా పదిమంది పెద్దమనుషుల దగ్గర నుంచి కూడా సహాయం ఇప్పిస్తాను...." అంటూ చాలాసేపు నెమ్మదిగా వుపన్యాసం ఇచ్చాడు రాజాసాహేబ్‌గారి పెద్దబ్బాయి.

అతను ఎంత తియ్యగా మాట్లాడితే అంత శాంతంగా విన్నాడు సజ్జన్. బ్యాంకిని మూసివేస్తే 'నా సాంఘిక ప్రయోగం చేయడం ఎలా సాధ్యం?' అని ప్రశ్నించాడు.

"చిన్న తరహాలో ప్రయోగం చేయి. నేను కూడా కొంత డబ్బు చందాగా యిస్తాను, సజ్జన్‌మల్."

"చందామీద ప్రజానీకానికి ఎలా నమ్మకం కలుగుతుంది. నువ్వే చెప్పు అలా అయితే ఓ పని చెయ్యండి మీరు "అంటూ''లాలాజానకీ శరణ్‌కు దీనివల్ల

ప్రత్యక్షంగా నష్టం కల్గుతుందనేగా మీ తాపత్రయం అంతా, అయినా యింకా ఆ పీఠిలోవున్న వడ్డీ వ్యాపారస్తులూ మా సహకార బ్యాంకిలో సభ్యులుగా చేరండి మీ వాటాధనం మీరు ఇవ్వండి. మీకు రావలసిన లాభాన్ని మీరు తీసుకోండి". అని ప్రత్యామ్నాయంగా మరో మార్గాన్ని సూచిందాడు సజ్జన్.

"మీ బ్యాంకిలో చేరడానికి మేము సిద్ధమే. కాని ఒక్క షరతు. ఒక్కొక్క పేరు ఒక్క రూపాయి కానీయండి. ఎంతైనా కానీయండి. డైరెక్టర్ల బోర్డుకు మాత్రం జరిగే ఎన్నికల్లో కనీసం ఐదువందల పేర్లు వున్నవ్యక్తే అర్హతకలిగి వుండాలి''.

"అంటే ప్రజానీకంతో సహకరిస్తాం అంటూ మీ ప్రయివేటు వ్యాపార రంగంగా బ్యాంకిని మార్చాలనుకుంటున్నారన్నమాట. వ్యాపారం కావాలంటే అభివృద్ధి చేసుకోండి. కాని డైరెక్టర్లబోర్డుకు ఒక్కరూపాయి పేరుకొన్న వ్యక్తి కూడా ఎన్నిక అవడానికి అధికారం కలిగివుండాలి. మాకు కావలసిన డైరెక్టర్లు కేవలం వ్యాపారం చేసేవాళ్ళే కాదు. ప్రజాబాహుళ్యానికి లాభం కలిగేవిధంగా వ్యాపారం నడిపేవాళ్ళు కావాలి. అంటూ సజ్జన్ జవాబు చెప్పాడు.

సజ్జన్ మాటలకు నవ్వుతూ తల ఆడించారు చిన్న రాజాగారు. "వినాశకాలే విపరీత బుద్ధి. సరేలెండి. సజ్జన్‌పటేల్‌గారూ, మేడ మాత్రం మూడు రోజుల్లో ఖాళీ చేయించండి" అని అంటూ ముఖం తిప్పాడు వెళ్ళుతున్నట్టుగా.

చిన్న రాజాసాహెబ్ తన రాజదర్పాన్ని మాటిమాటికి వెళ్ళబోసుకోవడం, ప్రతి మాటకూ తనని "మల్'' అంటూ సంబోధించడం చాలా చెడ్డగా తోచింది సజ్జన్‌కి. కంఠంలో తీక్షణతను తెస్తూ "మీ కింతకు ముందే చెప్పాను ప్రయత్నిస్తానని, వాగ్దానం చెయ్యలేను. వేరే యేర్పాటు జరగనంతవరకు ఈ భూమి మీద ఏశక్తి కూడా నన్ను గెంటలేదు'' అని అనేసాడు సజ్జన్.

రాజాసాహెబ్ ఇంటి నుంచి తిరిగివచ్చిన సజ్జన్ చాలా విచారంగా వున్నాడు. పెద్దమ్మ మేడలోంచి పాఠశాల ఎత్తివేయడం అతనికంత పరివ్య

రించలేని సమస్యగా తోచలేదు. కాని తన విరోధులు తాను చేయాలనుకుంటున్న నూతన సాంఘిక ప్రయోగాన్ని ఎలాగైనా విఫలం చెయ్యాలన్న పట్టుదలతో వున్నారనీ, దాన్ని ఎలా ఎదుర్కోవడం అనేది అతనికి ముఖ్య సమస్యగా తయారైంది. రాబోయే పరిస్థితులు అతని కళ్లకు కడుతున్నాయి. అతనికి వ్యతిరేకంగా అతనికంటే ఎక్కువ బలవంతులూ, శ్రీమంతులూ ఏకం అవుతున్నారు. ఆ పెట్టుబడిదారి వర్గం వారి స్వార్థం సంఘం నిజంగా అభ్యుదయాన్ని సాధించకుండా నిరోధించాలని కుట్ర పన్నుతోంది. ప్రజాశక్తి అతనివైపే వుంది కాని వాళ్ళ హృదయస్థైర్యం మీద అతని కింకా గట్టినమ్మకం కుదరలేదు. ఇప్పుడు తనకు సహాయం చేస్తున్నవాళ్ళలో ఎక్కువమంది ఒకవేళ అవతలి పక్షాన్నుంచి లంచం తీసుకుని మోసం చేస్తే తానేం చేయగలడు? సజ్జన్ తన ప్రయోగాన్ని అంతకుముందే మొదలెట్టివుంటే ఈ పాటికి దాని ప్రయోజకత్వం గురించి ప్రజల్లో ఏ అపోహవుండేదికాదు. వాళ్ళు తనకు మద్దతు పూర్తిగా ఇచ్చేవాళ్ళు. వాళ్ల మనోస్థైర్యాన్ని తాను కల్పించవలసిన పనిలేకుండా పోయేది. తన ప్రతిపక్షంవాళ్లు వేసే ప్రతి ఎత్తూ మిత్రభేదంతో కూడుకున్నదై వుండొచ్చు. అదీకాక ఈ వర్తక వ్యాపారస్తులు రాజకీయ పార్టీలను కూడా కూడగట్టుకుని తమ సంస్థలో భాగస్వాములుగా చేసుకోవచ్చు. అలాంటి గడ్డు పరిస్థితి నుంచి ఎలా తప్పించుకొని తన పథకాన్ని నడపాలన్నదే ఇప్పుడు సజ్జన్ ప్రయాస అంతా. ప్రజల్లోనే జాగరణం రావాలి. తమ సంక్షేమం ఏది తమ హక్కులు ఏవి ప్రజలే గుర్తించాలన్నదే సజ్జన్ కోరిక. కాని ప్రజల విశ్వాసాన్ని చూరగొనడానికి తాను ఏపని చెయ్యాలి? వాళ్ళ నమ్మకాన్ని సంపాదించడానికి తాను ఎలాంటి త్యాగం చెయ్యాలి?"

"ఉపాయం అనేది వుండాలి కాని రామ్‌జీ సాధనాలు వాటంతట అవే సమకూరుతాయి. మేం గోమతీ ఒడ్డున వున్నాం. వచ్చి కలుసుకోరాదా!" తన బంగళా ఏకాంతంలో ఆలోచనల ముసుగు తగిలించుకున్న సజ్జన్‌కు బాబా కంఠం వినిపించింది. రెండురోజుల కితం ఈ మాదిరిగానే బాబా కంఠం వినిపించింది సజ్జన్‌కి. సజ్జన్ ఆశ్చర్యంతో నిర్విణ్ణుడయ్యాడు, అతనిలో

అంతఃసంఘర్షణ జరిగింది. ఇది నా భ్రాంతియేనా అని. నా మనస్సే నాకు సంతృప్తి నివ్వడానికి ఈ రూపాన్ని తొడుక్కుని నా ముందు రావడం లేదు కదా! గోమతి ఒడ్డుకు పోతే తనది భ్రాంతో కాదో తెలిపోతుంది. డ్రైవర్ని వెంటనే గ్యారేజి నుంచి కారు బయటికి తీయమని ఆజ్ఞాపించాడు సజ్జన్.

అనుకున్నట్టుగానే జరిగింది శివాలయం పంచలో పండుకుని వున్నారు బాబా. సజ్జన్ని చూడగానే చిరునవ్వు నవ్వుతో "రామ్‌జీ రావయ్యా, చాలా సేపటినుంచి నీరాకకోసం ఎదురుచూస్తున్నాను" అంటూ ఆహ్వానించాడు.

"మొన్న మీ దగ్గరకు వస్తోంటే—"

"పాపం రామభక్తురాలు చచ్చిపోయిందికదూ! మాకు చాలా ఉపకారం చేసింది రామ్‌జీ. గ్రామంలో ఎంతబాగా ఏర్పాట్లు చేసాం అనుకున్నావు. పాఠశాల, వ్యాయామశాల అన్నీ సజావుగానడుస్తున్నాయి. మాకేదైనా ట్రాక్టరు నిస్తారేమో అని మీ దగ్గరకు వచ్చాం...."

"మీరు కోరింది నెరవేరుస్తాను, కాని నాకో సందేహం. దయచేసి నివారించండి".

"సందేహం ఎందుకు రామ్‌జీ. మీ దగ్గర ఓ టెలిఫోను వుంది. రెండోది నా దగ్గిర వుండనే వుంది" అంటూ బాబా నవ్వారు.

"అది ఎలా సాధ్యం?"

"సాధనా, నిరంతర కృషివల్ల"

"ఆ సాధన ఏమిటో చెప్పగలరా?"

"మనో నిగ్రహం, ధ్యానం"

"మనస్సును కేంద్రీకృతం ఎలా చేయడం?"

"నిరంతర చింతనం, మననం చేత"

"నానా రూపాలు నింపుకున్న జీవితంలో ఏ ఒక్కదాన్ని గురించో మననం చేసేది ఎలా?"

"అయితే ఆ భిన్నత్వాన్ని గురించే ఆలోచించు, ఏకత్వానికి ప్రతీక అయిన నీ కోరిక ఆకారాన్ని పెంచుకుని భిన్నత్వానికి సరిసమానంగా చేసుకో. అసలైన ఆనందం దేనిలో ఇమిడివుందో తెలుస్తుంది. ప్రారంభంలో నీ సంపదను పెంచడానికి నువ్వు వెనకాడవు కదా. తర్వాత ధనంతో ప్రజల మనస్సు మారగొనాలన్న ఆర్తి నీలో బయలుదేరింది. ఇప్పుడు ప్రజలూ నువ్వూ వేరయ్యారు. దేనిమీద నీకు మక్కువ ఎక్కువగా వుంటుందో దానిమీదే నా ధ్యాస కూడ అధికంగా వుంటుంది. చిత్తం కూడా దానిలోనే ఏకాగ్రత పొందుతుంది".

"ప్రజా జీవితంలో ఐక్యాన్ని పొందాలనుకుంటున్నాను"

"నిస్సందేహంగా పొందగలవు"

"మీ ఆశీర్వాదం కావాలి. కాని మీ మార్మికసాధనా మహిమ గురించి నా జిజ్ఞాస అలాగేవుంది".

పద్మాసనం వేసుకున్న బాబా "రామ్‌జీ, సత్యాన్ని అంగీకరించు, నువ్వు అనుకునే మర్మం నాదికాదు. ఆ మూల విరాట్టుది. నేను అనుక్షణం సహజ మార్గాన్నే సాధిస్తుంటాను. అందరికన్న మిన్న అవాలనే భావన నీలో వుంది. ద్వైతంగా వుంటూ అద్వైతాన్ని ఎలా పొందగలవు రామ్‌జీ?" అంటూ సహజ ధోరణిలోనే అన్నారు.

సజ్జన్ ఆలోచనలో పడిపోయారు.

"నా గురువు నాకు 'సేవ' అనే మంత్రాన్ని ఉపదేశించారు. అందరినీ నా రూపంగానే భావించి సేవించు అని అన్నారు. రామ్‌జీ, చదువు-సంధెలు లేనివాణ్ణి. సేవ అనే పదాన్నే నిష్ఠతో జపిస్తూ బయలుదేరాను, సేవించాలనే కోరికే మనస్సుకు ఏకాగ్రత ప్రసాదించి తన సూక్ష్మాతిసూక్ష్మమైన అపురూప మైన శక్తుల్ని చూపింది. ఇద్శాక్తి బలంతో సందేహం అనేది గాలి రూపాన్ని సంతరించుకొని ఎక్కడికైనా ప్రయాణం చేస్తుందంటారు. మేమింకా ఆ శక్తిని సిద్ధింప చేసుకోలేదనుకోండి. ఆ ప్రభువు కోరుకుంటే సిద్ధికలుగుతుంది.

లేకపోయినా చింతలేదు. కేవలం నిష్కామ సేవచేస్తూ పరమపదార్థాన్ని వెతుకుతూ బయల్దేరాను. ప్రయాణంలో కలిగే ప్రతి అనుభవాన్ని అర్థించుకుంటూ ముందుకు సాగిపోతాం. మా కింకేమీ కోరికల్లేవు"

ఆ మాటలు విని సజ్జన్ నిట్టూర్పు విడుస్తూ "మీ మాటలు వింటోంటే మర్మం తేలిగ్గానే తెలిసినట్టుంది. అయినా అది ఇంకా మర్మమేనండి" అని అన్నాడు.

"ఇంకా అభ్యాసం లేదు కదా రామ్‌జీ. దైనందిన జీవితంలో క్రమబద్ధంగా అభ్యసిస్తోంటే అది మర్మంగా కనపడదు. దారి కొత్తది కదూ. వెతుతుంటే సంకోచం వెనుకా ముందు కాళ్ళు పీకుతుంటాయి. ముందు నీ అంతరాత్మను అడగండి మీ కోరిక ఏమిటో అని తర్వాత నీ అంతరాత్మ ఏమి జవాబిస్తుందో వినండి, మీ కోరికలో ఏమేమి విశేషాలు మీకు బాగా రుచిస్తాయి; ఏమేమి మీకు అసలే రుచింపవో మననం చేసుకోండి. మీకు రుచించేవి ఏవైతే వున్నాయో వాటి తెరవెనుక దాగివున్న సాంసారిక, సాంఘిక, భౌతిక, ఆధిభౌతికమైన విషయాలు ఏమేమి వున్నాయో, మూలతత్వం ఏమిటో అన్వయించి చూడండి. అప్పుడు మీ కోరిక మూల స్వరూపాన్ని గుర్తించి దాన్ని వికసింప చేయడానికి ఆలోచనలనీ వస్తువుల్నీ పడుగూ పేకగా చేసి వాతావరణం అనే వస్త్రాన్ని నేయండి. అంతే కోరిక గురించి నీ దృష్టి చిక్కులో పడదు. అనుక్షణం నువ్వు నువ్వు చేసే ప్రతి పనీ నీవు అనుకున్న మాదిరిగానే వుంటుంది. ఆ కోరిక మీకు రుచించిన దానిలా వుంటుంది. దానిలోవున్న శక్తిని గుర్తిస్తూ మీకు మర్మంగా కనబడుతోన్న అనేకమైన అసాధారణమైన పవిత్రానుభూతులు మీరు పొందగలుగుతారు, అనుభూతిని చేరడానికి మార్గం చాలా సులువైనది రామ్‌జీ. కాని అభ్యాసం అవసరం."

బాబా తేలిగ్గా అర్థం అయ్యేలా చెప్తోన్న మాటల్ని వింటూ సజ్జన్ వాటి ప్రభావానికి లోనై మౌనంగా వున్నాడు. అతను ఆలోచిస్తున్నాడు-లోతుగా ఆలోచిస్తున్నాడు. కాని అతను ఆలోచించే తీరు నిద్రపోతూ కలకన్న

మాదిరిగానూ, ఒక పక్క స్పృహాలేమి ఈ రెంటిలోనూ అంతర్ధానమయి నట్టుగా అగమ్యగోచరంగా వుంది.

ఒకపక్క మహిపాల్ మీద పరువు నష్టం వెయ్యాలనే పట్టుదలా, మరోపక్క చిన్న రాజాసాహెబ్, లాలాజానకీశరణ్, సేఠ్ రూప్‌రతన్ మొదలైన బలిసిన ఆసామీలంతా అతనికి వ్యతిరేకంగా ఒక్క తాటిమీద నిలబడ్డం. ఈరెండూ అతని సంకల్ప బలానికి అగ్నిపరీక్షల్లా తయారయ్యాయి. రెండు రోజుల క్రితం కన్య అతని మొండి వైఖరి గురించి విశ్లేషిస్తూ అన్న మాటలు ఇప్పుడు జ్ఞాపకం వస్తున్నాయి. మొండిని విడనాడిన అతని మనస్సు ఈర్ష్యాభావం తనలో వున్నట్టుగా వుందనీ, ఎప్పుడూ వుందనీ, తాను అందరికన్న మిన్నగా వుండాలనుకుంటున్నాడని స్పష్టంగా పలుకుతోంది. అయితే అలా కోరడం ఎంతవరకు ఉచితం? అతని కోరిక కేవలం స్వార్థప్రేరేపితం. మూర్ఖత్వంతో కూడుకుంది. ఇన్ని రూపాలూ, ఇన్ని రంగరింపులూ నిండిన ఈనాటి సంఘంలో ఇంత వైవిధ్యంలో దినదినానికి పెరిగిపోతోన్న ఈనాటి జీవితంలో అసలు ఎవరైనా సాటిలేని తనాన్ని సంతరించుకోవడం సాధ్యమా? ప్రతిదానిలో జీవి వున్నాడు. ఈ దృష్ట్యా చూస్తే అతను అద్వితీయుడే మరి ఈ సత్యాన్ని గుర్తించిన నాడు తనలో ఈర్ష్య, పగ, ద్వేషం అంటూ ఏమీ మిగలవు....ఈ ఘట్టంలోనే అతనికి భయం వేస్తుంటుంది. అదే ఈర్ష్య, పగతో నిండిన వ్యక్తులు అతణ్ణి చుట్టుముట్టిన రోజు, ఇతరుల అబద్ధం అనే వురితాడు అతని మెడకు పడిన రోజు తాను కూడా అలాంటి మనోవికారాల్ని ప్రకటించక పోతే తట్టుకోగలడా అన్నదే ప్రశ్న. మనిషిలో సామాన్యంగా కనిపించే గుణదోషాల చెరనుండి తను ఎలా బయటపడగలడు? బాబాను కలుసుకుని తిరిగి వస్తోంటే ఈ ఆలోచనల్నే అతని మనస్సు దారి పొడవునా చిలకడం ప్రారంభించాయి. సేఠ్ రూప్‌రతన్ బంగాళా దారిలోవుంది. అలంకారాలతోనూ జెండాలతోనూ, స్వాగతం అన్నబోర్డు మీద అతని చూపు ఆగింది. మళ్ళీ మహిపాల్ జ్ఞప్తికి వచ్చాడు. పరుగెత్తుతోన్న అతని మనస్సు కాస్సేపు విశ్రమించింది. మహిపాల్‌ని చూసి అతని మేనకోడలు వివాహం సందర్భంగా శుభాకాంక్షలు అందచేద్దామన్న కోరికను అణచుకోలేకపోయాడు. తనని

ఆహ్వానించాడా? ఆహ్వానించలేదని అతను కినుకచేంది ఎందుకు ఆలోచించాలి? మహీపాల్‌తో అతని స్నేహం ఈనాటిది కాదు. ఈ విషయాన్ని అతను ఎందుకు త్రోసివేయ్యాలి? డ్రైవర్ని కారు ఆపు చేయమన్నాడు సజ్జన్. కారు ఆగుతోంటే పెళ్ళికూతురికి ఏదైనా కానుక తీసుకుంటే బావుండు అనిపించింది. హజరత్‌గంజ్ పోనిమ్మని మళ్ళీ డ్రైవర్‌తో అన్నాడు. అటువైపు కారు వెళ్తాంటే కానుక తీసుకెళ్ళితే తన గొప్పతనాన్ని దాటుకుంటాననికి సజ్జన్ తెచ్చాడని మహీపాల్ అనుమానించవచ్చన్న యోచన కలిగింది. కారు తిప్పమని మళ్ళీ డ్రైవర్‌కు ఆర్డరు ఇచ్చాడు. కాని కారును రూప్‌రతన్ బంగళావైపు పోనివ్వాలా లేదా తన బంగళాకే పోనివ్వాలా అని డ్రైవరు ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు. అతను సజ్జన్‌ని అడిగాడు. విని విననట్టు వూరుకున్నాడు సజ్జన్. ఇలాంటి స్థితిలో మహీపాల్ యింటికి వెళ్ళడమా లేదా అని తేల్చుకో లేకపోతున్నాడు. స్వయంగా సజ్జన్ వెళ్ళకపోతే తన దృష్టిలోనే తనకు ఈర్ష్య వున్నట్టు కనపడుతోంది. వెళ్ళడానికి సంకోచంగావుంది. అవమానం - పాలు అవుతానేమో అన్న భయం కూడా వుంది.

కారు సజ్జన్ బంగళా దగ్గరకు వచ్చేసింది. గేటువైపు తిప్పాడు డ్రైవర్. రూప్‌రతన్ బంగాళాకు వెళ్లు అన్నాడు సజ్జన్.

సజ్జన్ అక్కడికి వెళ్ళేప్పటికి చిన్న బంతి జరుగుతోంది. రొమ్ము మీద పెరుగూ, తేనె కలిపిన ఆకుల్ని వేసుకొని పరస్పరం కలుస్తున్నారు మహీపాల్, అతని తమ్ముడూ జయపాలున్నూ. పెళ్ళికొడుకు మేనమామలతో ఎదుర్కోలు సందర్భంలో జయపాల్ గుండె భగ భగ మండసాగింది. మేనమామల కారణంగా వివాహం అంత సరదాగా కనిపించలేదు. విడిదిలో వియ్యాలవారు దిగడంతోటే పెళ్ళికొడుకు మేనమామలు అనలే బైస్‌వాడ సరుకేమో ఆడపిల్ల తరపువాళ్ళను ఏడ్పించడం మొదలెట్టారు. వాళ్ళ కళ్ళల్లోంచి నీళ్ళకు బదులు రక్తపుబొట్లు రాల్పించినంత పని చేసారు. నిన్నటి నుంచి ఈ రోజు వరకు అడుగడుగునా మహీపాల్‌ని అవమానించారు. వేళకాని వేళలో దొరకని వస్తువులు తెమ్మనీ తమ గొంతెమ్మ కోరికలతో పిల్ల తరపువాళ్ళ

గొంతులో తడి లేకుండా చేసేసారు. పెళ్ళికొడుకు మేనమామ మహిపాల్ అమ్మగారి పుట్టింటితో దూరపు చుట్టరికం అఘోరించాడు. తాత, మేనమామల ఎంగిలి తిన్నావని మాటి మాటికి మహిపాల్‌ని గేలిచెయ్యడం, మీ అమ్మగారు పుట్టింటి కొంచి చాలా సొమ్ము చేరవేసింది అదంతా ఇప్పుడు బయటపెట్టు అని వేళాకోళం చెయ్యడం, శ్రీమంతులతోనూ మంత్రులతోనూ పోటీపడుతున్నావు కదా వలానా కోరికలు చెల్లించమని అడగడం ఇవన్నీ చేసాడు. నిన్నటి నుంచి నోరు మూసుకొని ఎన్ని అవమానాలు సహించాడో ఆ భగవంతునికే ఎరుక. డాక్టర్ జయపాల్ వాళ్ళకు ఎదురుపడేవాడు కాదు. అథవా ఎప్పుడైనా అలాంటి వేళాకోళం ఎవరైనా చేస్తే వాళ్ళమీద తిరగబడేవాడు. మహిపాల్ తమ్ముణ్ణి శాంతపరచేవాడు. వాళ్ళతో వాదించడం మొదలెట్టితే వాళ్ళు మరింత రెచ్చిపోయి మరింతగా ఏడ్పించేవాళ్ళు. మహిపాల్ చచ్చిపోయిన తల్లి గురించి ఏవేవో ఎత్తి పొడుపులు పొడిచేవాళ్ళు.

ఎదుర్కోలు జరుగుతోన్న సమయంలో సజ్జన్ వచ్చారన్న కబురు వెళ్ళింది మహిపాల్‌కి. అతనికి ఆశ్చర్యం కలిగింది సజ్జన్, కన్య ఇద్దరినీ అతను కావాలని పిలవలేదు. సజ్జన్ రూప్‌రతన్ రూమ్‌లో వున్నారనీ కర్నల్ కూడా అక్కడే వున్నారనీ మహిపాల్‌కి కబురు పంపారు.

రూప్‌రతన్ సజ్జన్‌కి చాల మర్యాద చేశాడు. మళ్ళీ అతను ప్రారంభించిన ట్రస్టూ, ఉద్యమం గురించి ప్రసక్తి తెచ్చాడు. మాటల సందర్భంలో "హిందూ దేశంలో అసంఖ్యాకంగా కులాలూ జాతులూ వున్నంతకాలం ఈ దేశంలో అన్ని వర్గాల శక్తుల్ని సమీకరించి ఏదైనా ఘనకార్యం చేయడం దుస్సాధ్యం. కులాల్ని తీసివేయడం అసలే సాధ్యంకాదు. ఎవరితరమూ కాదు. ఎన్ని ఉద్యమాల తుఫానులు వచ్చాయి పోయాయి. కాని ఈ లెఖ్ఖలేనన్ని కులాలూ, తెగలూ, వర్గాలూ భారతదేశానికి కీడే కలిగిస్తున్నాయి. కాని దాని బాధను ఇంతవరకు తగ్గించలేదు....నేనయితే లోతుగా ఆలోచిస్తూ ఓ నిర్ణయానికి వచ్చాను సజ్జన్. సంఘ సంస్కరణ అంటూ, సోషలిజమ్ అంటూ ఫ్యాషన్‌గా ఎన్నైనా అంటాం పాపం ఏమీలేనివాళ్ళను పూరడించడానికి ఇలాటి

సానుభూతి వాక్కులు అవసరం కూడాను. కాని ఏ నిజమైన భారతీయుడు పరాయి దేశాల సిద్ధాంతాల్లో విశ్వాసం వుంచరాదు. యౌవనంలో నేను కూడా పశ్చా సోషలిస్టుగా వున్నవాణ్ణే. ఇప్పటికీ నావి అవే ఉద్దేశాలు. కాని భారతీయులకు ఇవన్నీ పనికిరావని అనుకుంటున్నాను. కనీసం ఇంకో యేభై సంవత్సరాలం వరకు ఇక్కడ ఎలాంటి మార్పురాదు. తర్వాత సంగతి ఎవరు చూశారు?" అని మాటల సందర్భంలో సేఠ్ రూప్‌రతన్ అన్నాడు.

ఆ మాటలు సజ్జన్‌కి నచ్చలేదు. అతనికి ఎందుకు నచ్చలేదా అని అనుకున్నాడు, ఎందుకు చెడుగా భావించాలి? రూప్‌రతన్‌కి అలాంటి సంఘం లోనే వుండాలని కోరిక. తనకేమో మనిషి మనిషికీ మధ్య అన్యాయపూరితమైన అసమానత్వం లేని సంఘంలో వుండాలని కోరిక. తన కోరికే నిజమైతే తప్పక తీరుతుంది. చిన్న రాజాసాహెబ్, రూప్‌రతన్, మహీపాల్ వాళ్ల మాటలు చెడ్డవన్న దృష్టిలో పరిశీలించడం తప్పు. వాళ్ళ మాటలు విన్నతర్వాత అతనిలోని సంకల్పబలం ఇతోధికం కావాలి. ఇలాంటి వ్యతిరేకత అతని సంకల్ప బలానికి అగ్నిపరీక్ష.

"మీ మాటల్ని నేను చెడ్డగా తీసుకోను. మీ మాటల్లో సత్యం వుందని అసలే ఒప్పుకోను. మీ వ్యతిరేక భావాలతో సవినయంగా ఘర్షణపడడానికి సిద్ధంగా వున్నాను." అంటూ రూప్‌రతన్‌తో అన్నాడు సజ్జన్.

"ఏమోయి, గాంధిస్టు అయినట్టుందే?" నవ్వుతూ ఓ చెణుకు విసిరాడు రూప్‌రతన్. సజ్జన్ సమాధానంగా చిరునవ్వు నవ్వాడు. "గాంధీజీ భారతీయుడేగా. నేను కూడా భారతీయుణ్ణి కావడానికి ప్రయత్నిస్తున్నాను."

"అంటే ఇప్పటివరకు విదేశీ సరుకు అన్నమాట".

"విదేశీ సరుకునూ, గాలిలో తేలే సరుకునూ. నాది అంటూ లేదూ. పరాయిదంటూ లేదు. ఇప్పుడు నాదంటూ వుంది".

ఇంతలో రూప్‌రతన్ రూమ్‌లో అడుగు పెట్టాడు మహీపాల్. అతని ముఖం బాగా చిన్నపోయి వుంది. గదిలోకి వచ్చి సజ్జన్‌వైపు చూడకుండా సోఫామీద కూర్చున్నాడు.

"నేను శుభాకాంక్షలు తెలపడానికి వచ్చాను" అంటూ సజ్జన్ మహీపాల్‌ని పలకరించాడు.

"థేంక్స్! నీకు బదులు నీ రిజిస్టరు నోటీసు ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తున్నా. నామీద పరువు నష్టం దావా వెయ్యాలనుకుంటున్నావటగా!"

సజ్జన్ ఏమీ తొణక్కుండా "ముందు అదే సంకల్పం వుంది. నాలో ఇంకా అనూయభావం వుందని తెలుసుకున్నాను. అందుకనే నా పరువు నేనే తీసుకుంటున్నాను. ముందు మనస్సునే కోర్టులో గెలిస్తే, తర్వాత ఇంకేమైనా చెయ్యడానికి అర్హత యేర్పడుతుంది" అని ప్రశాంతంగా అన్నాడు.

ఆ మాటలకు కర్నల్ ముఖం మీద ఆనందం వెల్లివిరిసింది. కుర్రాడిలా సంతోషంతో ఎగిరి గంతేసి "సజ్జన్, నువ్వు నిజంగా గొప్పవాడివోయి నీలాంటి హుందాతనం మహీపాల్‌కు కూడా లేదని అతని ముఖం మీదే చెప్తున్నాను" అన్నాడు.

మహీపాల్ న్యూనతాభావంతో బాధపడసాగాడు. అది అతనికి చిరాకు కలిగిస్తోంది. వియ్యాలవారి ముందు చూపలేని తన పౌరుషాన్ని సజ్జన్ ముందు ప్రకటించాలనుకున్నాడు. ఒక్కసారిగా సజ్జన్‌మీద విరుచుకు పడ్డాడు- "చాలా మంది గొప్పతనాన్ని చవిచూసింది ఈ ఒక్కపిండం ఇతని [illegible] ఎంత? ఇతనెంత? పెద్ద పెద్ద కోటీశ్వరులనే చూశాడీ మహీపాల్. నా తడాఖాముందు నోరె త్తడానికి ఎవరికి గుండెలు? ఆదర్శం అనే ఒక్కమాటముందు అందరిని చీరేస్తాను. ఎవరి ఐశ్వర్యాన్ని చూసి మహీపాల్ భయపడే రకం కాదు. ఐశ్వర్యం అంటే నాకు లెఖ్ఖలేదు. నిన్నటి నుంచి ఇవాళ వరకు మంచినీళ్ళలా ఖర్చుపెట్టాను డబ్బు".

"అవును లేవోయ్! ఎక్కణ్ణుంచైనా అప్పనంగా వస్తే అందరూ నీళ్ళు లాగే ఖర్చుపెడతారు" అంటూ తగుల్కొన్నాడు వెంటనే రూప్‌రతన్.

వియ్యాలవారి నుంచి అవమానాలూ, పరాభవం సహిస్తూ దిగమింగిన మహీపాల్ ఆ అక్కసంతా సజ్జన్‌మీద వెళ్ళబోసుకుందామన్న తొందరలో

మర్యాద, హద్దులు దాటి ప్రవర్తించాడు, అందుకు సేఠ్ రూప్‌రతన్‌కి కోపం వచ్చింది. మహిపాల్ శ్రీమంతులతో పోటీ పడుతున్నాడు. మహిపాల్‌ని ఎక్కడుండాలో అక్కడే వుంచమనీ అతని మదాన్ని అణగదొక్కాలన్న వుద్దేశంతో తన మాటల్ని మరింత విపులీకరించాడు. సేఠ్ రూప్‌రతన్ అతనికి ఎంతో సాయం చేసాడు. నగలు అమ్మిస్తానని తానేస్వయంగా వాటిని కొని మహిపాల్‌కి మొత్తం నలభై వేల రూపాయల నగదు ముట్టజెప్పాడు. మేనకోడలి పెళ్ళి చేసుకుంటానంటే తన అంగళా యిచ్చాడు. అయినా కూడా ఈ వ్యక్తి గర్వలోత్తై పొగరుమోతు తనంతో తన ఐశ్వర్యాన్నే నిందిస్తూ అతని గొప్పలు కోస్తున్నాడు. వెంటనే మరో చురుకు అంటించాలన్న వుద్దేశ్యంతో మహిపాల్ గొప్పతనం మీద దావుదెబ్బ కొట్టాడు - "మేనమామ యింట్లో బందిపోటు జరిగింది. దానితో మహిపాల్‌గారి జాతకమే మారింది. ఏదో మేలు చేస్తున్నానని దొంగ ప్రాణాలు తీసాడు. దొంగతనాన్నంతా బందిపోట్ల మీద రుద్ది తాను పెద్ద సేఠ్ అయిపోయాడు".

కర్నల్, సజ్జన్ ఒకరి ముఖాలు ఒకరు చూచుకో సాగారు! మహిపాల్‌కు గంగవెర్రులెత్తింది. "నన్ను అవమానించకు నీరక్తం తాగుతాను" అంటూ గద్దించాడు.

"అవునయ్యా, తీవి, తాకూ వున్న ఆగర్భ శ్రీమంతుడివి కదూ! నా రక్తం ఎందుకు తాగవూ! కొంచెం తగ్గు. మీ చిన్నమ్మ కొడుకుని ఇప్పుడే ఇక్కడికి పిలిచి అడుగుతాను. నీ అమ్మగారిది అని అంటోన్న ఆ హారాన్ని అతని కిప్పుడే చూపించి నీ స్నేహితుల ముందే ఎవరిదని అడుగుతాను". చిరునవ్వు నవ్వుతూ వ్యంగ్యంగా అన్నాడు రూప్‌రతన్. టీపాయ్ మీద అమర్చిన బటన్ నొక్కాడు రూప్‌రతన్.

"అతని పరువు తియ్యకండి. మా పరువు తియ్యకండి. మహిపాల్ నా పాత స్నేహితుడు" అంటూ సజ్జన్ అతని రెండు చేతులూ పట్టుకున్నాడు. కర్నల్ వేడుకుంటోన్నట్టుగా రూప్‌రతన్ వైపు చూడసాగాడు. ప్రాణంలేని శిలా ప్రతిమలా తల వంచుకొని కూర్చుండి పోయాడు మహిపాల్. "ఎక్కడకు

పోయింది నీ ఠీవి అంతా! ప్రపంచాని కంతా ఆదర్శ పాఠాలు వల్లించి ఇంట్లో ఇటువంటి ఘోరాలు చేస్తారు" అని మహిపాల్ వైపు ఓ చూపు విసురుతూ అన్నాడు రూప్‌రతన్.

"పోనిలే రూప్‌రతన్" అంటూ సజ్జన్ సర్దబోయాడు.

"ఎప్పుడో పోనిచ్చానులే. ఈయనగారు తెగ నీలుగుతోంటే నాకూ రోషం పుట్టుకొచ్చింది. ఈయనగారు చేసిన ఘరానా దొంగతనం కూడా విచిత్రంగా బయట పడింది. ఈయనగారి చిన్నమ్మ కొడుకు నాతో చదువు కున్నాడు. ఆయన ద్వారానే ఈయనతో నాకు పరిచయం. పెళ్ళికి ఇక్కడకు వచ్చాడు. ఏదో శోకాభిరామాయణం మాట్లాడుతోంటే వాళ్ళ తాతలూ ముత్తాతలూ సంపాదించిన నగల గురించీ ఈ మధ్య వాళ్ళింట్లో జరిగిన దొంగతనం గురించీ మాటల సందర్భంలో ప్రసక్తి వచ్చింది. మహిపాల్ తల్లి హారంకూడా పెళ్ళింటిదే అయివుంటుంది కదా అని ఆ మిషతో మా యింట్లోని నగలన్నీ చూపించాను. చూడగానే అతనికి మతిపోయినంత పని అయింది. ఈ వస్తువు నీ కెక్కడదని అడిగాడు. ఈ వస్తువు అయితే మా ఇంట్లో జరిగిన దొంగతనంలో పోయింది అని చెప్పాడు. దొంగతనం హడా వుడిలో ఈ హారాన్ని మహిపాల్ మెల్లగా తస్కరించాడని తెలుసు కున్నాను. ఈయన ముందు ఇంతవరకీ రహస్యాన్ని కప్పి వుంచాను, ఇవ్వాళ ఈయన పొగరుమోతుగా నీలుగుతోంటే వుండబట్టలేక అనేసాను. పరమ దొంగ. కృతఘ్నుడు. ఈయన దర్జా మండిపోను. పెద్ద బ్రాహ్మణుడట, ఆదర్శవాదట, పండితుడట, రచయితట. సజ్జన్ ఇతని కన్న లక్షరెట్లు పెద్దవాడు కావచ్చు. తన స్వంత ఆస్తి లక్షల రూపాయలు ఇతరుల కోసం నీళ్ళలా ఖర్చు పెడుతున్నాడు. ఈయనగారు దొంగిలించిన సొత్తు మీద విర్రవీగుతూ నీళ్ళ మాదిరిగా డబ్బు ఖర్చు పెడు తున్నానని కోతలు కోస్తున్నాడు. మాలాంటి అగర్భ శ్రీమంతులతో పోటీపడు తున్నాడు. వూడి పడ్డాడు పెద్ద సేఠ్‌గారు!"

వంచిన తల ఎత్తలేదు మహిపాల్, పరిస్థితిని గ్రహించి మహిపాల్‌ని ఏమీ పలకరించ కుండా రూప్‌రతన్ దగ్గర శలవు తీసుకుని వెళ్ళి పోయాడు సజ్జన్. కర్నల్ కూడా అతనితో పాటు లేచి వెళ్ళాడు.

ప్రపంచమే భారంగా కనిపించ సాగింది మహీపాల్‌కి. ప్రతివ్యక్తి అతని వైపు వేలు చూపుతూ "వీడు దొంగ" అంటున్నట్టుగా కనిపించాడు. రూప్ రతన్ గదిలోంచి బయటపడ్డ మహీపాల్ ఏదిదివైపు వెళ్ళి ముఖం చూపలేక పోయాడు, గేటు తీసి బయటికి వచ్చాడు. అతని చదువూ, సంస్కారం, మననం రచనలూ, ఆదర్శాలూ, సిద్ధాంతాలు, అన్నీ వ్యర్థమై పోయ్యాయి. డబ్బు మీద వ్యామోహం మహీపాల్‌ని దొంగ చేసింది. ఏ రహస్యాన్ని ప్రపంచంలో ఎవరికీ తేలిదను కున్నాడో ఆ రహస్యం– మహీపాల్ చేసిన ఆ పా– ఇవ్వాళ ఎంతో తేలిగ్గా సునాయాసంగా బ్రద్దలైంది. తాతాగారింట్లో బందిపోట్లు పడిన ఆరాత్రి అతని కళ్ళ ముందు చలన చిత్రంలోని దృశ్యాల్లా కనపడ సాగాయి। ఎంతో సాహసంతోనూ, నిర్భయంగానూ, తాను దొంగల్ని ఎదుర్కొన్నాడు. తన తుపాకీ గుండు తగిలి చచ్చిన దొంగను దగ్గిరగా చూడాలన్న కోరిక కలిగింది. వెంటనే దగ్గరకు వెళ్ళి చూశాడు దొంగపడినచోట పక్కగా అతని సంచీ, దాన్లో నగల పెట్టె కనిపించాయి. ఆభరణాల్ని చూడగానే మహీపాల్ బుద్ధి వక్రించింది తక్షణం పెట్టెను దాచేసాడు ఇద్దరు దొంగలు చిక్కకుండా పారిపోయిన కారణంగా రహస్యం రహస్యంగానే వుండి పోయింది. మహీపాల్‌ని సందేహించడానికి అస్కారం లేకుండా పోయింది. ఒక దొంగను అక్కడి కక్కడే చంపినందుకు మహీపాల్ సాహసాన్ని అందరూ మెచ్చుకున్నారు. ఒకనాటి వీరుడు ఇవ్వాళ తన స్నేహితుం ముందర దొంగగా ఋజువు అయ్యాడు. ఇప్పుడు సజ్జన్‌కి వ్యతిరేకంగా తాను తిరగబడి రొమ్ము విరుచుకుని వాదించలేడు రూప్ రతన్‌తో సమానంగా ఇచ్చి పుచ్చుకునే ధోరణిలో మాట్లాడ లేడు. కర్నల్ లాంటి వ్యక్తులూ, తన ఇంట్లో వాళ్ళూ– కళ్యాణీ, పిల్లలూ తను దొంగని తెలిసిన తర్వాత ఆ యింట్లో వుండే అర్హతే కోల్పోతాడు.

తల వంచుకుని అడుగులు ముందుకు వేస్తున్నాడు మహీపాల్. మహీపాల్ హృదయం అసంఖ్యాకమైన యాతనకు గురి అవుతోంది– "నేనేం పని చేస్తాను" అంటూ మహీపాల్ డబ్బుగా చూడలేదన్నది నిజమే. ఎప్పుడు లేమితోనూ, లోపాలతోనూ పుట్టించాడు. డబ్బు ఆర్జించాలనే కోర్కెవుండేది కాని గా

డబ్బుకు ముందు ఎప్పుడూ ఆత్మను అమ్ముకొని సలాము చేయలేదు. ధనాభావం చేత అలిసి పోయిన అతని శరీరం, మనస్సూ డబ్బు ముందు దాసోహం అయింది. అప్పుడే అతను దొంగతనం చేయడానికి పాల్పడ్డాడు. డబ్బు అతని లోని శక్తి సామర్థ్యాల్ని ఉడిగించేసింది, పెళ్ళి, వరుసగా పుట్టు వెంట్రుకలూ, పిల్లల చదువూ, దర్జాకు మించిన ఖర్చూ. కళ్యాణి మొండి పట్టుదలా అన్నీ కలిసి అతణ్ణి ఆదర్శ భ్రష్టుడిగా చేసి పారేసాయి. ఎంతో ఉత్సాహంగా తాను భారత దేశం సాంస్కృతిక సాంఘిక చరిత్రను రాయాలనీ సామగ్రిని సేకరిస్తు నాడు! ఒక్క క్షణంలో పుట్టిన కక్కుర్తి సంవత్సరాల తరబడి అతను సాధించిన నిష్ఠను మట్టిలో కలిపేసింది. "భోళాశంకర్, నీ పేరు తలవడానికి కూడా ఒళ్ళూ, మనస్సూ మండు తున్నాయి! ఎంత పాడుపని చేసాను! ధాల నీదానికి ఒడిగట్టాను".

వూరికి వారలకూ దూరంగా వెళుతున్నాడు మహిపాల్. సికందర్‌బాగ్ దాటి పోయాడు, కట్టివంతెన్ని దాటాడు. నిషాత్‌గంజ్ లోంచి పోతుండా వుండే నిమిత్తం గోమతీ నది ఒడ్డు ఎక్కాడు- అలాగే ముందుకు నడుస్తూ వెళ్ళాడు

పగలు గడిచింది, రాత్రి గడిచింది: మొత్తం ఒక రోజు గడిచింది. రెండో రోజు ఇంటిల్లిపాదీ విచారంలో మునిగి పోయారు. ప్రతిక్షణం భర్త వస్తున్నట్లే అతని అలికిడి అవుతున్నట్లే గడిపింది కళ్యాణి. ఆమె మనస్సు మాత్రం భర్త వస్తున్నట్లుగా పసిగట్టేది. కాని భర్త జాడ ఎక్కడా దొరకలేదు. అకస్మాత్తుగా మహిపాల్ ఎవరికి తెలీకుండా ఎక్కడికి పోయాడా అని ఆశ్చర్య పోయారు. పెళ్ళి రివాజులూ, సందడి అంతా మామూలుగానే వుంది. వుదయం [1] తీన్‌రా కలేవా జరిగింది. బంతి వేసారు. వియ్యాల వారికి వీడ్కోలు ఇచ్చే సందర్భంలో దక్షిణ పంచుతోంటే మహిపాల్ ఎక్కడా అని అడిగారు. అత్తగారింటికి పోతోన్న శకుంతల అందరి దగ్గర వెక్కి వెక్కి యేడ్చింది, ఆడపిల్ల అత్తగారింటికి వెళ్తోంటే ఇంటిల్లిపాదీ యేడ్వడం మామూలే. కాని కళ్యాణి మాత్రం ఏడ్వటం లేదు. ఆమె కళ్ళు పొడిగట్టి నాలుగు దిక్కులూ వెతుకు తున్నాయి.

(1) పెళ్ళి రెండో రోజు వియ్యాలవారికి చేసేవిందు.

భర్త రాకకోసం మనస్సు ఎంత పరితపిస్తున్నా చేతులూ కాళ్ళూ యంత్రాల్లా పనిచేస్తూనే వున్నాయి. ఇప్పుడు పెళ్ళి పనులు కూడా లేవు చేయడానికి. కళ్యాణి ముఖం చిన్న పోయింది. నెత్తురు చుక్కలేకుండా అంతా శూన్యమై పోయింది. భర్త పాదాల చప్పుడు కూడా వినబడటం లేదు ఆమెకు. పెళ్ళికొడుకు తరపు వాళ్ళూ మహిపాల్ జాడలేకుండా వెళ్ళిపోవడం గురించి రకరకాలుగా వూహించుకున్నారు, చర్చించుకున్నారు.

శకుంతల్ని అత్తగారింటికి పంపే సమయానికి వనకన్య ఆకస్మాత్తుగా అక్కడికి వచ్చింది. నిర్జీవంగా వున్న ముఖ కవళికను కన్నార్పకుండా చూసింది కళ్యాణి. తర్వాత ఆమె దగ్గరకు వెళ్ళి జబ్బ పట్టుకుని అవతలికి తీసుకెళ్ళి "ఏమైన కబురు తెలిసిందా" అని మనస్సును బిగపట్టుకుంటూ అడిగింది.

"కూతురి కోసం పెళ్ళి కానుకతెచ్చాను" అంటూ కళ్యాణి చూపుల్ని తప్పించుకొంటూ శకుంతల దగ్గరకెళ్ళింది కన్య. కన్యను చూసి శకుంతల ఏడ్చింది. కర్నల్, సజ్జన్, కర్నల్ భార్యా, తన తరఫున ఏవేవో కానుకలు తెచ్చింది వనకన్య. కానుకలు ఇవ్వడానికి సమయం మించిపోయినా మామలిద్దరూ ఈ రాజరికపు మర్యాదలు తీర్చలేకనేకదా మహిపాల్ నీచానికి ఒడిగట్టి నలుగురిలో నగుబాటై చివరికి మరణాన్ని కొనితెచ్చుకున్నాడన్న ఉద్దేశ్యంతో ఘనంగా కానుకలు తెచ్చారు. శకుంతలకు ఇవ్వడం కోసం. విలువైన ఫర్నిచరు, తాన్లకు తాన్లు సిల్కు వస్త్రాలు, రాళ్ళనగలూ, కొత్త కారూ, ఇంకా ఇంకా తమ మిత్రుడు లేని లోటులో తాము కొనగల్గినదంతా కొన్నారు. సామానులంతా నాలుగు ట్రక్కులు నిండాయి. మొత్తం నలభై ఏభై వేల రూపాయల సామాను ఖరీదు చేశారు, మహిపాల్ ఇద్దరు మిత్రులు. క్రొత్త కారును కర్నల్ డ్రైవరే నడుపుతూ తీసుకొచ్చాడు. కారంతా పూలతో అలంకరించారు. పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ తమ స్వంతకారులో ఇంటికి వెళ్ళారు. మహిపాల్ మిత్రులిచ్చిన అమూల్యమైన కానుకలు బరువు క్రింద మహిపాల్ ప్రసక్తి నలిగి పోయింది.

వియ్యాలవారు వెళ్ళిన తరువాత పెళ్ళికూతురు తరఫువాళ్ళ యింట్లో సందడైతే వుందికానీ ఎవ్వరి ముఖంలో ఉత్సాహంలేదు. తలుపు వేసి కన్య కల్యాణితో ఏదోమాట్లాడుతోంది. ఏమిటి చెప్మా అంటూ పిల్లలంతా ఖంగారుపడుతున్నారు. నిన్న మధ్యాహ్నం నుంచి కనబడకుండా పోయిన తండ్రి జాడ తెలియని పిల్లల మానసిక పరిస్థితి ఎలావుంటుందో సులువుగా వూహించుకోవచ్చు. అంతలో డాక్టర్ జయపాల్ ఎక్కణ్ణుంచో వచ్చి భార్యను దూరంగా తీసుకెళ్ళి రహస్యంగా మాట్లాడారు. రాబట్టలేని రహస్యం అనే విసురు రాయి మధ్య నలిగిపోతున్న పిల్లలమొహాలు ఎంతో జాలిని కొలుపుతున్నాయి. భార్యతో మాట్లాడిం తర్వాత జయపాల్ తపోధన్ దగ్గరకొచ్చి "మీ అమ్మ ఎక్కడ" అని వాళ్ళను అడిగారు. మూసివున్న తలుపు వైపు వాళ్ళు సైగచేసారు తపోధన్. డాక్టర్ తలువు తట్టాడు. కన్య తలుపు తీసింది. జయపాల్ని చూసి పక్కకు తప్పుకుంది. గదికి మధ్యగా కూర్చున్న కల్యాణి కుడి చేతిని ఎడమ చేతిమీద బలంగా కొడుతూ చేతులకున్న గాజుల్ని పగులకొడుతోంది. ఆమె కళ్ళు ఇవ్వుడూ పొడిగానే వున్నాయి. "ఒదినా అన్నయ్య ఎంత పని చేసాడు" అంటూ వలవల ఏడ్చాడు డాక్టర్ జయపాల్. కన్య కళ్ళు చెమ్మగిల్లాయి. ఏమిటా అని పెద్దబ్బాయి, పెద్దమ్మాయి గదిలో జొరబడ్డారు. వనకన్య రాజ్యశ్రీని ఒళ్లోకి తీసుకుంది. "నాన్నగారికి ఏమైంది?" అంటూ పెద్దబ్బాయి పినతండ్రిని అడిగాడు. సమాధానంగా పినతండ్రి మరింత విలపించారు పిల్లలు గుచ్చి గుచ్చి అడుగుతున్నారు, నాన్నగారికి ఏమైందని. మహీపాల్ మరణించాడన్న వార్త ఇల్లంతా పాక్కింది.

రోజుకు మల్లేకాక ఇవ్వాళ వుదయం కర్నల్ సజ్జన్ ఇంటికే తిన్నగా వెళ్ళాడు. ఇద్దరు మిత్రులూ ఒంటరిగా కూర్చొని మాట్లాడారు. మహీపాల్ చేసిన పనికి వాళ్ల పశ్చాత్తాపం చెందారు. సిగ్గుతో ఏదైనా అఘాయిత్యం చేసుకుంటాడేమో అన్న భయాన్ని సజ్జన్ ప్రకటించారు. కాని పెళ్ళిలో జరగాల్సిన తతంగాలు పూర్తయే వరకు అలాంటి దానికి ఒడిగట్టడని కర్నల్ నమ్మాడు. తన ముఖం చూసి మహీపాల్ ఇంకా ఎంత సిగ్గుపడతాడో అని కర్నల్

ఇవ్వాళ ఉదయం అక్కడికి వెళ్ళలేదు. పెళ్ళి తతంగాలన్నీ పూర్తికావడంతోటే మహీపాల్ ఆత్మహత్యా ప్రయత్నానికి పూనుకో వచ్చని కర్నల్ అనుమానించాడు. శకుంతల్ని అత్తగారింటికి పంపినప్పటి నుంచి మహీపాల్‌ని కనిపెట్టి వుండాలని అతను ఆలోచించు కున్నాడు కూడాను.

కర్నల్ వచ్చిన కొంచెం సేపటికి కన్య మామూలుగా పాఠాలకు వెళ్ళి పోయింది. సుమారు పదకొండూ పదకొండున్నర గంటలకు ఓ దిన పత్రిక కార్యాలయం నుంచి సజ్జన్‌కి టెలిఫోను వచ్చింది. మీరు వెంటనే కార్యాలయానికి రండి అంటూ ఫోనులో సంపాదకుడు చెప్పాడు.

వెంటనే బయలుదేరి పత్రికా కార్యాలయానికి వెళ్ళాడు సజ్జన్. సంపాదక మహాశయుడు డ్రాయరులోంచి ఓ కాగితాన్ని తీసి సజ్జన్ చేతికి అందించాడు. మహీపాల్ రాసిన వుత్తరం అది. ఎవరో స్కూలు కుర్రాడి లెక్కల రఫ్ నోటు బుక్కులోంచి ఓ కాగితం మీద పెన్సిల్‌తో పత్రికా సంపాదకుని పేరిట మహీపాల్ ఓ లేఖ రాసాడు.

సంపాదక మహాశయులకు,

నా అంతిమ వ్యాసాన్ని లేఖ రూపంలో రాస్తున్నాను. ఇది ప్రచురించే సరికి బహుశా నేనీలోకాన్నే విడిచి పెడతాను. దయచేసి ఈ లేఖను సాధ్యమైనంత తొందరగా మీ దినపత్రికలో ప్రచురించి నా అంతిమ కోర్కెను తీర్చ గలరని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నేనో అపరాధం చేశానని బహిరంగంగా ఒప్పుకుంటున్నాను. పేరాశలో నిండిన ఓ క్షణం నన్ను దొంగగా మార్చి వేసింది. నేను నా చిన్నమ్మ కొడుకు యింట- అంటే నా లాలన పాలనా జరిగిన యింట- దొంగలు పడిన సమయంలో వున్నాను. దొంగల్లో ఒకతణ్ణి చంపి అతను దోచుకున్న సొమ్మును నేను అపహరించాను. ఆ నగలు మా అమ్మగారి పుట్టింటికి చెందినట్టివి. ఆ నగల సంచిని దగ్గిరేవున్న ఓ సున్నపు బట్టీలో దాచాను. అప్పుడు దొంగలు కొన్ని నగలూ, కొంత రొఖ్ఖాన్నీ తీసుకుని పారి పోయారు. చచ్చిపోయిన దొంగ దగ్గర్నుంచి గుంజుకున్న నగలు కూడా దొంగలు ఎత్తుకు పోయిన నగల్లోనే వున్నట్టుగా నాటకం ఆడాను. ఈ దొంగ

తనం చేస్తోంటే నా ఆత్మ కంపించి పోయింది, కాని గడ్డు ఆర్థిక పరిస్థితులు కలవిస్తోన్న నా ఆత్మను గొలుసులతో బంధించి దాని నోరు నొక్కేసాయి. ఆ రోజుల్లో నా మేనకోడలు శకుంతలకు వివాహం ఎలా చెయ్యడమా అని సతమతమౌతున్నాను. మన కులాచారాల ప్రకారం మేనకోడలు పెళ్ళి చెయ్యాలని నా భార్య పట్టు పట్టింది. ఆమె మొండి వైఖరిలో మన సాంఘిక వ్యవస్థే అలా మాట్లాడుతున్నట్టుగా నాకు తోచింది. తల్లినీ తండ్రినీ పోగొట్టుకున్న నా మేనకోడలి వివాహం నేనెంతో ఘనంగా చెయ్యాలనుకున్నాను. తాలూకాదారీ వాతావరణంలో పెరిగిన నాకు నా సంస్కారాలు కూడా రాచరికాన్ని రంగరించుకున్నట్టుగానే కనిపించాయి. కొన్నాళ్ళుగా నా ఆర్థిక పరిస్థితులు దుర్భరంగా తయారవడం ప్రారంభం అయిననాటి నుంచి నాలో ఓ రకమైన అసంతృప్తి చెలరేగుతూ వచ్చింది. నాలో పెరుగుతున్న న్యూనతాభావం నాలో వున్న చిత్తశుద్ధిని గొంతు నులిమి చంపేసింది. నగలు నాకు భగవంతుడు ఆపదలో ప్రసాదించారనుకున్నాను. ఇన్ని నగలు పోగొట్టుకొన్న తర్వాత కూడా దర్జాగా బ్రతకగలిగినంత ఐశ్వర్యం వాళ్ళకు వుంది. కాని ఈ కొద్దిపాటి నగంతో నా మేనకోడలి పెళ్ళికి డబ్బు ఎలా సమకూర్చాలన్న సమస్య సులభంగా తీరిపోతుంది.

''నా నీచపు కృత్యాన్ని సమర్థించుకోవడానికి నేను చేసిన తర్కం ఎంత శుష్కమైందో ఈరోజు గుర్తించాను. దొంగతనం చేయగానే నేను పిరికిపందనైపోయాను. పిరికివాడి తర్కం ఎంత మార్పు తెచ్చేదిగా వున్నా ఎప్పుడూ సారం లేనిదిగా వుంటుంది. అబద్ధపు తర్కాలు చేసి మనస్సును పూరడించాను.

నాలాంటి జాగృతి కలిగివున్న వ్యక్తినే లేమిలో పడతోసి బ్రతికివుండగానే చంపేసేస్తోమత గల ఈ సాంఘిక వ్యవస్థ సంస్కారాలే లోపించిన వాళ్ళను సామాజిక చైతన్యం అంటే లోతుగా తెలియని అమాయకపు బ్రతుకుల్ని, మీరు ప్రతిరోజు మీ పత్రికలో ప్రచురించు నట్లుగా పతనానికి దిగజార్చి వాళ్ళ అంతాల్ని విషాదకరంగా చేస్తున్నదంటే అందులో ఆశ్చర్యంలేదు.

''పిరికితనం అణువు అణువునా వ్యాపించిన నా ఈ శరీరాన్ని స్వచ్ఛం చేసుకోవడానికి నేను ఆత్మహత్య చేసుకుంటున్నాను.

"నేను రెండో అపరాధం చేశాను. నా పరమ మిత్రుడూ, సుప్రసిద్ధ చిత్రకారుడూ అయిన శ్రీయుతులు సజ్జన్ వర్మగారు తన స్వంత ఆస్తిని ప్రజా హిత కార్యక్రమాలకు దానం చేస్తోంటే అసూయపడి వారి కార్యక్రమాల్ని-సంవత్సరాల తరబడి నేను ఆదర్శాలుగా పూజించు కుంటున్న కలలు కంటూన్న ఆ సాంఘిక కార్యక్రమాల్ని వ్యతిరేకించాను. నా వ్యక్తిత్వంలో పాకిపోయిన నా ఈ సంకుచితత్వం చెరగని మచ్చగా నా జీవితంలో నిలిచి పోవాలని కోరు కుంటున్నాను. నేను చేసిన దొంగతనం కంటే ఇది ఎక్కువ క్రూరమైనదని భావిస్తున్నాను.

ఇట్లు,
మహీపాల్ శుక్లా.

ఉత్తరం కింద దానికి సంబంధించని కొన్ని పంక్తులు రాసి వున్నాయి-"వ్యక్తి వ్యక్తిలానే వుండాలి. కాని అతను వ్యక్తిపరంగా చేసే ఆలోచనకు సాంఘిక దృక్పథం వుండటం ఎంతైనా అవసరం. నేను ఏకాకిని. అయినా బహుజనం కోసం వున్నాను, సుఖ దుఃఖాలూ శాంతి- అశాంతి ఇవన్నీ వ్యక్తిగత అనుభూతులు, కాని సంఘంలోని ప్రతి వ్యక్తికీ ఇవి కలుగుతాయి కనుక సంఘం అంటే ఒక్కటే అసి వ్యక్తులు చాలా మంది అని నా వుద్దేశ్యం. సూర్యుడు, చంద్రుడూ, ఈభూమి అనేక పదార్థాలతో వాటి నిర్మాణం జరిగినా అవన్నీ ఒక్కటే"

సజ్జన్, వుత్తరం చదివి స్తంభించి పోయాడు, మళ్ళీ చదవడం ప్రారం భించాడో లేదో వుత్తరం దానంతటదే అతని చేతిలోంచి జారిపోయింది. వెక్కి వెక్కి యేడ్వసాగాడు సజ్జన్.

కర్నల్‌కి కబురు వెళ్ళింది. డాక్టర్ జయపాల్‌ని పిలిపించి చెప్పారు, పోలీసుకు రిపోర్టు చేసారు. మహీపాల్ కట్టుకున్న గుడ్డలైనా కనీసం ఎక్కడైనా దొరుకుతా యేమోనన్న ఆశతో కురియా రేవు నుంచి బంధే వరకు గాలించారు. కాని వారి కృషి ఫలించలేదు. కాగితమూ, పెన్సిలూ మహీపాల్ ఎక్కడ్నుంచి

సంపాదించిండీ, ఏ సమయంలో పత్రికా కార్యాలయానికి ఎదురుగా వున్న టపాలాపెట్టె దగ్గరకొచ్చి దానిలో ఆ వుత్తరాన్ని వేసి వెళ్ళిందీ. ప్రాణాలు అతను ఎప్పుడు విడిచిందీ ఆ రహస్యాన్ని తనతో పాటే తీసుకెళ్ళి పోయాడు మహీపాల్.

# 52

మహీపాల్ మరణం కర్నల్, సజ్జన్, కళ్యాణి, డాక్టరు షీలా వీటిల్లో ఎంతో వెలితిని ఏర్పరిచింది. అతని చావుతో వాళ్ళందరికి దిగ్భ్రాంతి కలిగింది. వాళ్ళందరి స్నేహాన్ని పంచుకున్న కారణంగా కన్య కూడా మహీపాల్ ఆత్మ హత్యకు చాలా విచారించింది. కొన్ని రోజుల వరకు మహీపాల్ మరణించినట్లే లేదు. ఇక్కడే ఎక్కడో వున్నాడు ఎప్పుడో వస్తాడన్నట్టుగా వాళ్ళకు అని పించేది. అప్పుడే మహీపాల్ వచ్చి వెళ్ళినట్టూ అతని కంఠం పలికినట్టూ, ఇక్కడిక్కడే తారట్లాడుతున్నట్టుగా అనుకుంటుండే వాళ్ళు. పెద్ద పెద్ద వెక్కిళ్ళు పెట్టినట్టుగా, వూపిరి పీలుస్తూ అందరి హృదయాలూ నిస్సహాయంగా వుంటే కళ్ళు శూన్యంలోకి చూస్తూ కన్నీటి ధారలు వరదలయేవి. అందరూ తమ తమ అంతరాత్మల్ని లక్ష ప్రశ్నలు వేసి వేధించారు. మహీపాల్ వాళ్ళ జీవితం లోంచి ఏమంటూ తొలగి పోయాడో కాని వాళ్ళ దైనిక జీవిత క్రమమే దెబ్బ తింది. హృదయాల్ని తాకిన ఓ స్పర్శ, చెవులకు వినిపించిన ఓ ఆప్యాయత మైన ఓ కంఠం, కళ్ళకు నిండుగా కనిపిస్తుండే ఓ విశిష్టరూపం సుఖదుఃఖాల్ని పంచుకున్న ఓ ప్రియ ఆత్మబంధువు, ఆత్మీయుడు క్రితం రోజుదాక తమ ముందు తిరిగిన వ్యక్తి ఈనాడు గతించిన చరిత్రలో కలిసి పోయాడు.

చావు పుట్టుకలు ప్రకృతి నియమం. పుట్టగానే ఆనందించడం. చావగానే ఏడ్వడం ప్రతివ్యక్తి చేసే అనంత క్రియా కలాపం. అయితే కాలం సాగిన కొద్దీ శోకంలోని తీవ్రత తగ్గుతుంది ఏదో దీర్ఘవ్యాధితో చాలా రోజులు తీసుకునో బాగా చికిత్స చేయించుకున్న తర్వాతనో లేదా వృద్ధాప్యం దాకా తిని తిరిగి పూర్ణ ఆయుర్దాయం కలిగి సుఖించిన తర్వాతనో చనిపోయి వుంటే కేవలం పోయాడన్న విచారమే వుండేది. మాటి మాటికి ఈవిధంగా మనస్సుకు దెబ్బలు

తగిలేవికావు. మహిపాల్ లాంటి గొప్ప ఆలోచనా పరుడు తప్పుడు వ్యామోహంలో పడి దాని పర్యవసానంగా ఆత్మహత్య చేసుకోవడం మనస్సును కుదిపేసే నగ్నసత్యం. సజ్జన్ కూడా ఒప్పుకోక తప్పలేదు. మహిపాల్ జీవితంలో వచ్చిన విషమ పరిస్థితులు సజ్జన్ జీవితంలో కూడా వచ్చివుండే అతని జీవితానికి కూడా ఇలాగే నిష్కృతి కలిగేదేమో! ఆత్మధైర్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని పోగొట్టుకున్న ప్రాణిని తన ప్రాణాలు తీసుకోకుండా కాపాడగం మార్గాంతరం ఏమిటా అని సజ్జన్ ఆలోచించసాగాడు.

పాత ప్రశ్నే సజ్జన్ ముందు మళ్ళీ మళ్ళీ నిలబడింది. మనదేశం కర్మయోగానికి కాణాచి. వేదాలూ, ఉపనిషత్తులూ, శాస్త్రాలూ ఎన్నో ఇక్కడ పుట్టాయి. వ్యాసుడూ, వాల్మీకి లాంటి యుగప్రవర్తక మహర్షులు ఈ గడ్డ మీద పుట్టారు. సాహిత్యానికి రసాలకు మనదేశం గని. అజంతా, ఎల్లోరా, కోణార్క్, దక్షిణ భారత దేశం— యావత్తూ భారత దేశం శిల్ప సౌందర్యానికి, సుభాషితాలకూ పుట్టినిల్లు. ఈ దేశ చరిత్ర ఇంత మహిమాన్వితమైంది. అంత ఔన్నత్యం, అంత ఉచ్ఛస్థితను పుణికి పుచ్చుకున్న దేశం జడత్వంలోనూ, మురికి కూపంలోనూ, పుంతకానికి కష్టపడి అభ్యుదయాన్ని చేరలేక ఎందుకు ఆత్మహత్య చేసుకుంటోంది? జ్ఞానం అజ్ఞానం రెండిటి కలిసి వున్న మేరకు భారతదేశం, మహిపాల్ ఇద్దరిలోనూ సామ్యం వుంది.

మహిపాల్‌ని మరచిపోవడానికి గాను సజ్జన్ ఎక్కువగా కష్టపడసాగాడు. అతనూ, తన్యా ఇంటింటికి వెళ్ళి వాళ్ళ సమస్యలేమిటో ప్రత్యక్షంగా తెలుసుకోవడం మొదలెట్టారు. పేదరికం, దారిద్ర్యం ప్లేగులా దేశం అంతా మొదటి నుంచీ అల్లుకుని వుంది. దానికి తోడు కాలంతోపాటు పురోగమించడానికి కావలసిన సంస్కారాలు ఏమిటో మన సంఘం ఇంతవరకు తెలుసుకునే అప్రమత్తత చూపించదాయె

--మరైతే దీనిక్కారణం?

ఆలోచనలూ రీతులూ రివాజులూ నిండివున్న మ్యూజియంలాంటిది మన దేశం. భౌతిక విజ్ఞానం అద్భుతాల్ని సాధించిన ఈ కాలంలో కూడా వంచల.

శతాబ్దాల నుంచి వస్తోన్న ఆచారాల్నీ, కట్టుబాట్లనీ, ఐయకు విధానాల్నీ, నడతల్నీ, గుర్తింపుల్నీ మన సంఘం ఇంకా అంధ విశ్వాసంతో అంటిపెట్టుకునే వుంది. సంస్కారణలంటూ ప్రతి యుగంలో ఏవో వచ్చాయి, ఎన్నో చారిత్రిక ప్రభావాలూ మనమీద వడ్డాయి. వాటిలో చాలా వరకు మనం ఇంకా ఆచరిస్తూనే వున్నాం. సాధువులూ, బైరాగులూ, ఫకీర్లూ, చండీస్తోత్రం చేస్తే పండితులూ పెళ్ళినాటి నుంచి శ్రాద్ధం వరకు జరిపించే పురోహితులూ, హరి కథలు చెప్పే భాగవతార్లూ పురాణకాలక్షేపం చేసే శాస్త్రుల్లూ, తర్కం మీమాంసం చేసే విద్వాంసులూ, భూత ప్రేత పిశాచాల్ని పారదోలే ఓఝూలూ, శనిదానం తీసుకునే భద్దరీలూ, దిగదుడుపూ చాతబడి వరకట్నం, చిన్నా పెద్దా అంటూ ముప్పయి మూడుకోట్ల దేవతలు- బుర్రను పాడుచేసే అర్థం లేని పాతకాలపు వాసనలు ఎన్నో మన బుర్రలో నిండి వున్నాయి. అవంటే మనం గుడ్డిగా నమ్మతాం కనకనే మనకు ఆత్మవిశ్వాసం కరువైంది. భౌతిక విజ్ఞానం ప్రపంచాన్ని ముందుకు తీసుకుపోతోన్న సందర్భంలో ఈ పాతచట్టం పనికి రానిదై పోయింది. ఈ దేవతల్ని అంటిపెట్టుకున్న మనిషి తన చైతన్యానికి వీటి నుంచి ముక్తి ప్రసాదించాలి. శ్రద్ధా భక్తులకు ప్రతీకలంటూ వుంటాయ్ కాని మూఢనమ్మకాలకు కాదు, ఈ దేశానికి దొడ్డదేవత ఎప్పటికీ ధరణీమాతే అయివుంది. పరమేశ్వరుడనేవాడు శూన్యమైన ఆకాశంలో వుండడన్న సత్యాన్ని ఈ దేశం ఎప్పుడో గ్రహించింది, ప్రతి జీవిలో అతణ్ణి చూసింది. ప్రతిమనిషిలో ఆ పరమ తత్వాన్ని కనుక్కొంది జ్ఞానం, కర్మయోగం ఈ రెండినీ మన వేదాంతానికి మూలస్తంభాలుగా మన దేశం ఎప్పుడో స్వీకరించింది. అందువల్లనే దాని దృక్పథం నిర్మాణాత్మకంగా వుండగలిగింది. ఇవన్నీ మనిషిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించడానికి సహాయపడతాయి. నేటి పరిస్థితుల్లో ప్రసంగం మన సంప్రదాయాల నుంచి ఆ తత్వాన్నే గ్రహించి పురోగమించాలి. మృత్యువు అనే నాగపాశంలో భయపడుతూ ఎప్పుడు పరలోకధ్యానం కలిగి వుండే వేదాంతం జడత్వంతో కూడుకున్నది, ఆత్మహత్యాసదృశమూనూ. పారలౌకిక చింతనం కలిగివున్న ఈ వేదాంతాన్నీ, ఈ మతాన్నీ ప్రజా జీవితం నుంచి తీసి మూట కట్టి మ్యూజియంలో భద్రపరచడం ఎంతైనా మనకు శ్రేయస్కరం ఆత్మ

విశ్వాసాన్ని పోగొట్టుకుని మనం అంగీకరిస్తోన్న ముప్పయిమూడు కోట్ల దేవతలంటే నమ్మకం కలిగివుండటం పొరపాటని స్వామీ వివేకానందుడు ఎక్కడో చెప్పారు. ఆత్మవిశ్వాసమే ఈ నూతన యుగధర్మం.

నేటి మన ప్రజా జీవితం నిండా అవిశ్వాసం అల్లుకుని పోవడానికి మరో కారణం మన దేశంలోని రాజకీయ పక్షాలు. వీటికి సారథ్యం వహించే వాళ్ళు కూడా పండాలూ, పండితులూ, ఓఝాల్లాంటి వాళ్ళే. నేడు మనం చూస్తోన్న రాజకీయాలు కొంచెం కూడా అభ్యుదయదృక్పథం లేనట్టివి. రాజకీయాలు కేవలం ఎత్తుకుపై ఎత్తు వేసుకొనే తాలింఖానాల్లా తయారైనాయి. మానవ మాత్రునికి మేలు చేద్దామన్న ఆదర్శం లేక వ్యక్తిగత అహంకారం పెరిగిపోయి రాజకీయ వేత్తల బుద్ధికుశలత, చాతుర్యం అన్నీ తప్పాయి. మనం చూస్తోన్న ప్రస్తుత రాజకీయాల పుట్టుక సామ్రాజ్యవాదం నుంచి కదా! ఈ సామ్రాజ్యవాద నీతి నుంచి పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థకు శక్తిబలం లభించింది. అలాంటి శక్తికి ప్రజా శ్రేయస్సుకూ ఘర్షణ అనివార్యం స్వాభావికం కూడా. సామ్రాజ్యవాదుల గుత్తాధికారం, పెట్టుబడిదారీ వర్గానిదైనా జాతి గాములదైనా, కులాలూ, మతాలూ, అంటూ డోలు తగిలించుకొని వాదించేవాళ్ళదైనా సరియైనది కాదన్న సత్యాన్ని మనదేశ గత చరిత్రగాని వర్తమాన చరిత్రగాని ఉదాహరణలతో సహా ఋజువు చేస్తాయి.

ఇవ్వాళ మనదేశంలోని రాజకీయ పార్టీలు - కాంగ్రెస్, సోషలిస్టు, కమ్యూనిస్టు, జనసంఘ్, హిందూ మహా సభ ఇత్యాదులు - అన్ని పార్టీలు చాలావరకు ఒకదానికన్న ఒకటి చిత్తశుద్ధిలేనివీనూ. స్వార్థంతో కుట్రలు పన్ని, ఎత్తుగడలు వేయడమే వీరిపని. దాంభికం, గర్వపోతుల అజమాయిషీలో పెరుగుతున్నాయి యివి. తమకు కావలసిన లక్ష్య సిద్ధికోసం ఆదర్శం, సిద్ధాంతాలని అర్థంగా వుపయోగించుకుంటాయి. ఇవి పరస్పరం ఘర్షించుకొంటాయి; కాని వాటి కారణం ఎక్కువగా వ్యక్తిగతకక్షలే. ఈదేశంలోని లిబిజలిస్టు రాజకీయ శక్తుల దృష్టిలో భారతీయ సంప్రదాయాలు కేవలం మూఢనమ్మకాలుగా గుడ్డి విశ్వాసాలుగా ఆధారాలుగా కనబడతాయి. అభ్యుదయ శక్తులమని చెప్పుకునే

వర్గాలక్కూడా మన దేశం ఆచారాలూ రివాజులతో లుకలుక లాడుతున్నట్లు గానే కనబడుతుంది. ఆ సంప్రదాయాల్లోంచి పుట్టిన అభ్యుదయ వైఖరుల గురించి వాళ్లకు అంతగా పరిచయంలేదు. మనదేశంలో కనబడే ప్రతి అభ్యుదయ సంప్రదాయాన్నీ విదేశాలనుంచి దిగుమతి చేసుకున్నట్లుగానే భావిస్తాం. విదేశీ సంప్రదాయాల్ని ఇక్కడి పరిస్థితుల స్వభావం తెలుసుకోలేక యిక్కడ బలవంతంగా రుద్దడానికి ప్రయత్నిస్తాం.

ఇక ప్రజాజీవితం గుడ్డి నమ్మకాలతోను భ్రాంతులతోనూ బందీయైవుంది. అలాంటి పరిస్థితిలో మేధావి వర్గం నోరుమూసుకొని ఎలా ఉండగలదు? మరి ఈ వర్గం కూడా పెట్టుబడిదారీ, వ్యక్తిగత అధికార వాదుల వాతావరణం వల్ల ప్రభావితులై ప్రజల్ని పెడదారిన పట్టించడంలో సహకరిస్తూ వుంటారా? మనలో ఎవరికీ దేశం అంటే ప్రేమలేదా? మనదేశ సంప్రదాయాల్లోని నిర్మాణాత్మక శక్తులంటే అభిమానం లేదా?

బెంగాల్ క్షామంలో మానవుడు ఘోరమైన విపత్తులో ఇరుక్కున్నాడనీ కష్టాల్ని ఓర్చుకుంటూ అతనిలోని చైతన్యమే ఇంకిపోయిందనీ మహీపాల్ అంటుండేవాడు. అతను తన వూరూ పేరూ చివరికి తాను ఎవరనేది కూడా మరచిపోయాడుట మన భారతీయుల పరిస్థితి కూడా ప్రస్తుతం అదే మోస్తరుగా వుంది. తాను భారతీయుడనన్న విషయం పతి భారతీయుడూ మరిచి పోయాడు. తాను కాంగ్రెసనో, సోషలిస్టనో, జనసంఘీననో కమ్యూనిస్టుననో, అకాలీదళ్ వ్యక్తిననో అంటాడు. తాను పఖ్యాత కవిననీ, కళాకారుడననీ, నాయకుడననీ, డాక్టరో, ల్యారిస్టరో, అధికారో లేదా సంఘంలో తనకు "ఒకటి" అంటూ ఏదో వున్నదనీ ప్రతి భారతీయుడు అంటాడు కానీ మేం భారతీయులం, మానవులం అని చాలామంది అనరు. అనుకోరు. పొద్దుపొడిచినప్పట్నుంచి దేశం అనీ, మానవత్వం అనీ అరుస్తాడు కాని వాళ్ళదేశం అంటే ఏమిటో వాళ్ళకే తెలియదు. వాళ్ళదేశం మానవతా రహస్యాన్ని ఎంతబాగా గుర్తించిందీ వాళ్ళకు అర్థం కాదు. ఈదేశంలో - ఈ వృథివి మీద వ్యక్తే వుంటున్నాడు, సంఘం కాదా అని ప్రస్తుతం అనిపిస్తుంటుంది. వ్యక్తి అనేవాడుతన చుట్టూ ఓ

వృత్తాన్ని గీసుకొని దానికి లోబడి ఆలోచిస్తారు. కార్యాన్ని సాధిస్తారు. ప్రతి ఒక వ్యక్తి ఒక్కొక్క ద్వీపం నిర్మించుకుని వుంటున్నారా అనిపిస్తుంది.

ఇదేనా మనిషి మాత్రునికి వుండే స్థితి? కాదు.

తాను తప్పటడుగు వేస్తున్నానని ప్రతి మనిషి ఈరోజుల్లో మానసికంగా అనుకుంటున్నారు. అందుకే తాను దాటుచేసుకొని తనమీద మూకుడు వుంచి అవతలివానివైపు వేలు చూపిస్తారు. అకారణంగానే వాద ప్రతివాదాలు పెరుగుతున్నాయి. భయానకవాతావరణం సృష్టించబడుతుంది. ఇది మనిషికి సహజమైన స్థితికాదు.

మనిషిలో అతని ఆత్మ విశ్వాసం మళ్ళీ మేల్కొవాలి, అతని జీవితంలో నమ్మకం అనేది మళ్ళీ మేల్కొవాలి. ఎదుటి వాని కష్టసుఖాల్ని తన కష్ట సుఖాలుగా భావించాలి. ఆలోచనల్లో తేడా వుండొచ్చు. తేడా వున్నందువల్ల ఆరోగ్యమైన పోటీ వుంటుంది. పోటీ వున్నందువల్ల ఉత్తరోత్తరాసమన్వయాన్ని సాధించి వికాసం చెందడానికి సులభమార్గం ఏర్పడుతుంది. కాని షరతు ఏమిటంటే కష్టసుఖాల విషయంలో వ్యక్తికీ వ్యక్తికీ మధ్య విడదీయరాని సంబంధం కొనసాగాలి. బిందువుతో బిందువు కరచుకొనివున్నట్లు - అలలతో అలలు కలుసుకుని వున్నట్లు. అలలు కలిస్తే కాని సముద్రం కాదు. - అందుకనే ఒక్క నీటి బిందువులో సముద్రం వుందంటారు.

సజ్జన్, కన్య ఏకైకనిష్ఠతో తమ చిన్నతరహా కర్మరంగంలోకి దూకి మానవత్వాన్ని దర్శించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. గుడ్డి ఆచారం నరక బడబోయే ముందు చాలాచాలా దెబ్బలు తీస్తుంది. రాబోయే కాలంలో కూడా తీయవచ్చు. కాని ప్రజాశ్రేయస్సునే తమ నమ్మకంగా పెట్టుకుని ఆరాధిస్తున్న ఆ దంపతులు ధైర్య స్థైర్యాలతో నిలబడతారు. వ్య_లో నిద్రిస్తోన్న సాంఘిక చైతన్యం మేల్కొని తీరుతుంది.